# జగజ్జ్యోతి

ప్రథమ సంపుటము

గ్రంధకర్త

హరికథాపితామహ

శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసు గారు




ప్రకాశకులు

శ్రీమతి కర్రా శ్యామలాదేవి

2వ లైను శ్యామలానగర్

గుంటూరు-6

జ్ఞానభారతి ప్రచురణలు - 21

ద్వితీయముద్రణము

1000 ప్రతులు

మూల్యము రు 100/-

ముద్రణ

పి. రామకృష్ణమూర్తి

మేనేజింగ్ డైరెక్టర్

వెల్‌కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్ గుంటూరు-2 Phone 25081



This book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanam under their scheme "Aid to publish religious books"

# విషయానుక్రమణిక

## మొదటి ప్రకాశము



## రెండవ ప్రకాశము

## మూఁడవ ప్రకాశము

## నాలుగవ ప్రకాశము

# కృతజ్ఞత

బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు ఆట, పాట, మాటల మేటియని హరికథా పితామహుఁడని జగద్విదితమే వారికి సంగీతములో నెట్టి ప్రావీణ్యము కలదో, సాహిత్యములోఁ గూడ, అట్టి ప్రావీణ్యమే కలదని చాలమందికి తెలియదు కవి హృదయము కవియే యెఱుఁగునన్నట్లు, తిరుపతి వేంకటేశ్వరకవులు నారాయణ దాసుగారిని గురించి యీ తీరుగా వర్ణించినారు

మ అల నారాయణుఁ డప్పు కృష్ణుఁ డయి గే, యమ్మందు సంతోషముం
గొలిపెంగాని కవిత్వమందుఁ గొలుపన్ • గొంతేనియు న్నోఁచుఁ గోఁ
డల లోపమ్మును దీర్చఁగోఁ దలఁచి కా • దా యిట్టిరూపమ్ముతో
నిల నారాయణదాస నామమున ని • ట్లేపారె నాఁ జెల్లదే

నారాయణదాసుగారికి సంగీత సాహిత్యములలో గొప్ప ప్రావీణ్యము ఉండుట వలననే వారు స్వయముగా యక్షగానములు రచించి, ఏ యే రసమును వ్యక్తమొనర్చుటకే యే కృతు లుండవలెనో ఏయే రసానుభూతి కే యే రాగతాళము లనుకూలముగ నుండునో, ఆరీతిని హరి కథలను చెప్పుటవలననే–నారాయణదాసుగారికి సరియగు వ్యక్తి 'నభూతో నభవిష్యతి' అని శతావధానులు చెప్పినారు వారు రచించినయక్షగానములలో ననన్యభక్తి అంతర్లీనమై యున్నది వారు సహజపాండిత్య విలాసులు

"నాలవయేట నేనరసినకొలది నన్గోరి చదువులెల్ల దారసిల్లె" అని వారే చెప్పుకొనిరి దానికి తార్కాణమే ఈ జగజ్జ్యోతి గ్రంథము

అవధాన శిరోమణి, మహామహోపాధ్యాయ, మధ్వ శ్రీ కాశీకృష్ణాచార్యగారు నారాయణదాసుగారిని గురించి యిట్లు చెప్పినారు

ఉ. హాయనిపించు నాట, యహహాయనిపించును పాట, తేనె పో
నాయనిపించు మాట, వహవాయనిపించును దేటకైత వ
హ్వాయనిపించు, నోహొ కథామృతసారము యాదిభట్ట నా
రాయణదాస! నీకడ సమస్తము నన్వయమయ్యె నద్దిరా

నారాయణదాసుగారు రచించిన యక్షగానములు ఇతర గ్రంథములు కేవల సంగీతము కొఱకును, మనోరంజనముగనుండుట కును వ్రాయఁబడినవే కావు. నారాయణదాసుగారు బాహ్యముగా భోగిగను, సుఖలాలసుఁడుగను కాన్పించినను మానసికముగా జనకుఁడు త్యాగరాజువలెనే జీవన్ముక్తుఁడనుటకు సందేహము లేదు. త్యాగరాజు కృతులలో భక్తిజ్ఞాన వైరాగ్యములు లీనమై యుండునట్లు నారాయణదాసుగారి రచనలన్నియు గంభీరమైన వేదాంతభావము లతో నిండియున్నవి. విజయనగర సంస్థానాస్థానకవీశ్వరులు శ్రీ భోగ రాజు నారాయణమూర్తిగారు నారాయణదాసుగారి నీరీతిగా స్తుతించి నారు

గీ. నీవు సూతమహర్షివై • నిఖిల హరిక
థా విశేషంబులను జెప్పి • తనరు కతన
నైమిశారణ్యమయ్యె నం • ధ్ర ప్రదేశ
మాంధ్ర దేశీయులను • శౌనకాదులైరి
దాస కవిచంద్ర! కడు ధన్యుఁ • డవు నీవు

నారాయణదాసుగారికి చిన్ననాఁటనుండియు వేదాంతములో నెట్టి యభిరుచి కలదో, వారు రచించిన 'బాటసారి' వలన గ్రహింప

వచ్చును వారు 'చాటసారి' యను నీ గ్రంథమును యిరువదినాలు గేండ్ల వయసున రచించినారు తరువాత వారికి హరి కథలయందు అభిరుచి కలిగి, అందు కనుకూలమయిన యక్షగానములు రచించుట యందే చాలకాలము నిమగ్నులై యుండిరి కాని, వారికి చతుష్షష్టికళల యందును పరిపూర్ణత్వమును సంపాదింపవలెనని దీక్షయుండుటవలన సకలవేదములు, సకల పురాణములు పఠించి సర్వపురాణ సారమను ఒక మహాగ్రంథమును రచించుటకు ప్రారంభించిరి ఆయుర్వేదములోఁ గూడ అసమానమగు ప్రజ్ఞను సంపాదించి ఒక గ్రంథము రచించిరి ఏటితోఁ దనివి తీరక, వారికి వేదాంతములోఁ గల అసమాన ప్రజ్ఞను వ్యక్తమొనర్చుటకు "జగజ్జ్యోతి" అను పేరుతో నొక ప్రకరణ గ్రంథము వ్రాయుటకు 1922 సంవత్సరమున ప్రారంభించిరి అప్పటప్పట, ఒక్కొక్క ప్రకరణము వ్రాయుచు ఎనిమిది ప్రకరణములు పూర్తి చేసిరి మరియు నెన్ని ప్రకరణములు వ్రాయఁదలఁచిరో యూహింపఁజాలము

ఈ బృహద్గ్రంథమును అచ్చొత్తించుటకు శ్రీ తిరుమలతిరుపతి దేవస్థానమువారు తమ భూరి విరాళము నొసగి మాకు ఈ కార్యము పూర్తిచేయుటకు చేయూత నొసగి నందుకు, దేవస్థానమువారికి, కార్యనిర్వాహకులకు నా కృతజ్ఞతాభివందనములు ఈ విధముగానే రెండవభాగము వెలుగుచూచుటకుగూడ దేవస్థానమువారు సహాకరించెదరని ఆశించుచున్నాను

శ్యామలానగర్,
గుంటూరు-6.
1-1-1983

కర్రా ఈశ్వరరావు

శ్రీః

# దాసహృదయము

"వ్యాకరణాలంకారచక్రవర్తి" "సాహిత్యవిశారద"

వ్యాకరణవిద్యాప్రవీణ, సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ

**అప్పల్ల సోమేశ్వరశర్మ,** M A P O L

(Reader in Sanskrit Retd A U Waltair)

విశాఖపట్టణము



ఈ సందర్భంలో "దాస" శబ్దం "హరి దాస" అనే అర్థాన్ని సూచిస్తుంది "హరిదాసు" అని అనగానే శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారే ఆంధ్రదేశ లో ఆబాలగోపాలానికి స్ఫురణకు వస్తారు హరిదాస శబ్దం ఆయన విషయంలో అంతగా రూఢమై పోయింది ఏమంచి మహాత్ములు ఆయనకు ఆ నామకరణం చేశారో గాని అది అక్షరాలా అన్వర్థమై కూచుంది "మహాకవి" బిరుదం ఒక్క వాల్మీకికే చెల్లినట్లు "హరిదాస" బిరుదం ఒక్క నారాయణ దాసుగారికే చెల్లింది ఇతరులు ఆ బిరుదాన్ని వాడుకోవడం ఔపచారికం - అభ్యాసపాటవం అని చెప్పక తప్పదు

"అథ పురుషో హవై నారాయణః పృథివీచ నారాయణః — అంతరిక్షంచ నారాయణః
సర్వంచ నారాయణః" ఇత్యాదిగా నారాయణోపనిషత్తు చెబుతుంది" "సృష్టి అంతా నారాయణుడే" అని దాని తాత్పర్యం ఆ విధంగానే - "సంగీతంచ నారాయణః, సాహిత్యంచ నారాయణః,

శ్రుతిశ్చ నారాయణః, లయశ్చ నారాయణః, నాట్యంచనారాయణః, రసశ్చ నారాయణః, హరికథాచ నారాయణః సర్వంచ నారాయణః" అని అర్థ శబ్దాపాటు ఆంధ్రదేశంలోనే కాక యావద్భారతదేశం లోను శ్రీ నారాయణదాసుగారు జాజ్వల్యమానంగా వ్యవహరించేరు అవిచ్ఛిన్నమైన తమ విద్యావంశాన్ని విస్తరింపజేసే హరిదాస ప్రజాపతులయినారు అది వారి సుకృతం-ప్రతిభాఫలం

ప్రతిభ అంటే అనిర్వచనీయమైన మేధావైభవం దాని కందని విషయమంటూ ఉండదు అది ఒక్కొక్కచోట ఒక్కొక్క విధంగా విజృంభిస్తుంది జేజేలు పలికిస్తుంది ప్రపంచాన్నే పాదాల ముందు పడేస్తుంది అటువంటి ప్రతిభ నారాయణదాసు గారిని స్వయంగా వరించి తరించింది వ్రాయించి, ఆడించి, పాడించి, సెబాసనిపించి వారిని కీర్తిధవళాచల శిఖరం మీద కూర్చోబెట్టింది ఎన్నో పాటలు, పద్యాలు, హరికథలు, కథలు, కావ్యాలు, అనువాదాలు, విమర్శలు శ్రీ దాసుగారి మనసజలధినుండి ఆవిర్భవించిన ఆణిముత్యాలుగా మిలమిల మెరుస్తున్నాయి

అయితే నాటినుండి నేటివరకు శ్రీ దాసుగారిని "హరికథా పితామహుడు" గానే సహృదయలోకం సంభావిస్తున్నది అది సరికాదు - సమగ్రం కాదు ఆయన కేవలం హరికథాపితామహుడే కాదు "దర్శన పితామహుడు" కూడా దర్శన సుధానిధిని మథించి కౌస్తుభమణిని వెలికి దీసి సానపెట్టి సకలజగజ్జ్యోతిగ ప్రసాదించిన మహాదార్శనికుడు శ్రీ నారాయణదాసు ఆయన దర్శన సారసర్వస్వమే "జగజ్జ్యోతి"

నాలుగువేదాలు, బ్రాహ్మణాలు ఆరణ్యకాలు, ఉపనిషత్తులు ఆరు వేదాంగాలు ఆరు దర్శనాలు, పురాణాలు, ధర్మశాస్త్రాలు,

కళలు, కావ్యాలు, ఇతిహాసాలు, కథలు, గాథలు, — మొత్తం ఆర్ష వాఙ్మయమంతా - ఆర్యసాహిత్యమంతా - జగజ్జ్యోతిలో సందర్భానుసారంగా పరిపరి విధాల విమర్శింపబడింది స్వీయ న్యాయాలతో, యుక్తులతో, సమన్వయాలతో, సామెతలతో, ఉదాహరణాలతోను వ్యాఖ్యానింపబడింది ఈతీరు కేవల ఛాందసులకు కోపం తెప్పించవచ్చు నాస్తికులకు ఏవగింపు కలిగించవచ్చు సాంప్రదాయికులకు రక్తపుపోటును అధికం చేయవచ్చు అల్పజ్ఞులకు ఆగ్రహకారణం కావచ్చు కర్మఠులకు కళ్ళు ఎర్రబడే సాధనం కావచ్చు పండితుల పెదిమలను అదరింపచేయవచ్చు అయినా శ్రీ దాసుగారు జంకలేదు - గొంకలేదు అణుమాత్రం చలించలేదు మేరు గంభీరంగా నిలబడి తమ వాదాన్ని వేయి గొంతుకలతో లోకానికి వినిపించేరు ఓంకారనాదం బ్రహ్మ కంఠాన్ని చీల్చుకుని వచ్చిందని అంటారు వాల్మీకి శ్లోకం ఉద్వేగంగా లేచి శ్లోకంగా మారిందని చెపుతారు ఆవిధంగానే దాసుగారి హృదయావేదన - హృదయస్పందన అవధులు దాటి త్రివిక్రమావతారమెత్తి, మూడు లోకాలను ముంచెత్తింది సజ్జనులకు, సహృదయులకు, సామరస్యవాదులకున్నూ సదా శిరోధార్యమయింది తమ వాదానికి ప్రతిచర్య అఘాతం - ఎక్కువ తీవ్రంగా ఎదురవుతుందని దాసుగారికి తెలుసు అందువల్లనే వారు "నన్ను నాస్తికుడు, పాషండుడు, మ్లేచ్ఛుడు అని లోకులు తిట్టిన దిట్టనీ - నేను సత్యమని, తత్త్వమని నమ్మిన దానిని ఎలుగెత్తి చాటక మానను" - అని జగజ్జ్యోతిలో పలుసార్లు ఉటంకించేరు

ఇంతకూ ఏమిటా తీరు? ఎటువంటిది ఆవాదం? అది వేదాల పూర్వభాగంపై దాడి వాస్తవంగా పూర్వభాగపు స్వరూపం మీద కోపం కాదు దాన్ని కర్మపరంగా - యజ్ఞపరంగా - తత్రాపి పశుహింసకు నిదానంగా వ్యాఖ్యానించిన పూర్వమీ

మీమాంసాదర్శనం మీద కోపం యజ్ఞ యాగాలమీద కసి ముఖ్యాతిముఖ్యంగా పశుహింసపై ఏవగింపు - దాన్ని జరిపించే శ్రౌతులమీద ప్రయోగించిన వజ్రాయుధం

ఇక్కడ కర్మకాండను గురించి కొంచెం చెప్పాలి — "యజ్ఞం సృష్టికి ప్రతీకం భగవంతునికి సంకేతం యజ్ఞంవల్ల దేవతలు సంతోషిస్తారు యజ్ఞంలో పశుహింస తప్పదు - తప్పు కాదు కర్మ అంటే యజ్ఞమే దానివల్ల స్వర్గం లభిస్తుంది అదే పరమార్థం వేరుగా ఈశ్వరుడు లేడు "యజ్ఞో వై విష్ణుః" అని వేదం చెపుతోంది "యజ్ఞేవధోఽవధః" (యాగంలో చేసిన పశు వధ హింసగా పరిగణింపబడదు) అని మన్వాది స్మృతికర్తలందరు ఘోషించేరు" ఈ మూల స్తంభాలపై పూర్వమీమాంసాసౌధం నిర్మితమయింది ఆ మహాసౌధాన్ని దాసుగారు సమూలంగా కూల దోసేరు

బాగా పరిశీలిస్తే యజ్ఞానికి, పశుహింసకు బోలెడంత చరిత్ర ఉంది "వేదాలు పుట్టేయుని" అనుకుంటే - అవి ఎప్పుడు పుట్టెయో అప్పటినుంచీ యజ్ఞాలు జరుగుతూనే ఉన్నాయి - పశుహింసా జరుగు తూనే ఉంది సోమయాజిత్వం సమాజంలో ప్రముఖ గౌరవ చిహ్నంగా ఉంటూ వచ్చింది తదనుగుణంగా ఎన్నో వ్యాఖ్యలు, ఉపవ్యాఖ్యలు, విమర్శలు బయలుదేరి పూర్వమీమాంసకొండంతగా పెరిగింది దర్శనాలలో ఒకటిగా సిద్ధమయింది

ఈ ప్రవాహానికి చారిత్రికంగా మొట్టమొదట అడ్డుకట్ట వేసిన వాడు బుద్ధుడు వేదాలను వెనకకు త్రోసి, అహింసనే ప్రధానంగా ఆయన ఉపదేశించేడు అతనికి తదనుయాయులకు వేదాలు ప్రమాణం కానేకావు ఆయుగం - దాని ప్రభావం కొంతకాలం సాగింది తరువాత మరల కుమారిలభట్టు చలవవల్ల కర్మకాండ విజృంభించింది

వైదికమార్గం పీరవిహారం చేసింది. మరికొంత కాలానికి వైదికులే పశుహింసను ఖండించేరు. రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మొదలయిన మహానుభావులు వేదప్రామాణ్యాన్ని పూర్తిగా అంగీకరిస్తూనే కర్మకాండకు పశుహింసకు ఉపాసనచెప్పి, రూపాంతరాలను ఏర్పాటు చేసేరు. యజ్ఞంచేస్తే చేయవచ్చునీ, పశువుస్థానంలో మాత్రం ఎప్పటపశువునే (పిండిబొమ్మ) ఉపయోగించవలెననిన్నీ వ్యాఖ్యానించేరు. నేటికీ వైష్ణవులు, మధ్వులు ఈ పద్ధతినే అనుసరిస్తారు. రానురాను నవ్యయుగంలో దయానందసరస్వతి, శ్రీపద దామోదరసాత్వాలేకర్, అరవిందఘోష్ వంటి మహాపురుషులు కూడా ఈ మార్గాన్నే ప్రోత్సహించేరు. ఇది జనప్రియమై సర్వాదరణయోగ్యమై సాగుతుందనడంలో సందేహంలేదు.

"మహాజనో యేన గతః సపంథాః" గదా!

ఇంగో - ఈ త్రోవనే శ్రీ నారాయణదాసుగారు వరించేరు. యజ్ఞాలను - ముఖ్యంగా పశుహింసతోకూడిన యజ్ఞాలను - పూర్తిగా ఖండించేరు. ఏరూపంలోనైనా పశుహింసకూడదని ఈ గ్రంథంలో వందలసార్లు కాదు— కొన్నివేలసార్లు—తమ సహజమైన తారస్థాయిలో ఘోషించేరు. ఆ సందర్భంలోనే కర్మకాండకు, యజ్ఞాలకు - ప్రత్యేకంగా శ్రౌతులకు—ఎన్నో దూషణ తిరస్కారాల నిచ్చి సంభావించేరు. అవి చదువుతూ ఉంటే ఒళ్ళు జలదరిస్తుంది. కాని అవి కేవలం భావావేశ ఫలితాలు. సమకాలిక సమాజంలో వైదిక మతం పేరుతో, సంప్రదాయం పేరుతో, ఆచారం పేరుతో, కర్మకాండ పేరుతో పేరుకుపోయి, కుళ్ళికంపుకొడుతున్న దంభవ్యవస్థను చూచి కడుపుచెరువై కట్టలు తెంచుకుని ప్రవహించిన ఆక్రందన ధ్వనులు.

పశుహింస వేదసమ్మతం కాదని నిరూపించాలంటే వేదవచనాలకు వ్యాఖ్యానం కూడా తప్పక మార్చాలి వేద వాక్యాలకు వేలసంవత్సరాలనుండి అనూచానంగా వస్తున్న వ్యాఖ్యానరీతి ఒకటి ఉంది అది సాయణాచార్యులు అవలంబించింది దాని ప్రకారం "పశుమాలభేత" "అజామాలభేత" "గామాలభేత" మొదలయిన వాక్యాలలో "పశు' మొదలయిన శబ్దాలకు మేక, ఆవు వగైరా జంతువులనే అర్థం విసిష్టాద్వైతులు, ద్వైతులుచెప్పిన వ్యాఖ్యానం ప్రకారం ఆయా శబ్దాలకు ఆయా జంతువుల పోలికతో చేయబడ్డ "పిండిబొమ్మలు" అని తాత్పర్యం దయానందసరస్వతి ప్రభృతులు చూపినది వేరొకతీరు దాని ప్రకారం పశు, అజ ఇత్యాదిశబ్దాలు కొన్ని ధాన్యాలను ఓషధులను బోధిస్తాయి కాని సాక్షాత్తు జంతువులను బోధించవు అరవిందయోగి చేసిన వేదసమన్వయం మరోవిధంగా ఉంటుంది దాన్ని "రహస్యవాదం" అంటారు తదనుసారం "అగ్ని" అంటే జఠరాగ్ని-లేక-విశ్వశక్తి, "పశు" అంటే అహంకారం, లేక క్రోధం-అనిభావం వస్తుంది మొత్తంమీద "యజ్ఞంలో పశుహింస వేదసమ్మతంకాదు" అని నవీన వ్యాఖ్యాతలందరు వ్యాఖ్యానించేరు

శ్రీ నారాయణదాసుగారున్నూ ఇదే ధోరణిని చేబట్టేరు ఇంచుమించు దయానందసరస్వతి, అరవిందయోగుల వాదం వీరికి నచ్చింది. పశువు అంటే అహంకారమనీ, అగ్ని అంటే జఠరాగ్ని అనీ, "ఆలభేత" అంటే అణచుకోవాలనీ ఇత్యాదిగా ఎన్నో అర్థాలను మార్చి చూపించేరు "యజ్ఞం" అంటే ముఖ్యంగా "సుఖజీవనం" అనీ, అందుకుపయోగించే మంచిపనులన్నీ యజ్ఞసాధనాలే అనీ అని ఒకచోట అంటారు "ఇషేత్వోర్జేత్వా" అన్నవాక్యానికి, "పరులను సుఖపెట్టి నీవు సుఖపడు" అన్నభావం ఇంకొకచోట ప్రకటిస్తారు. "వాయవ్యం శ్వేతమాలభేత" అంటే "చలివేసినపుడు ఒక్కటి తెల్లని దుప్పటి కప్పుకోవాలి" అనే తాత్పర్యం అని మరో

చోట చూపిస్తారు "శరీరం యజ్ఞవేది - స్మృతిశక్తి - జీవాత్మ యజమానుడు - నాభిహృదయ శీర్షములందు త్రేతాగ్నులు - వానిని సమ్యగ్దీపములు కావించుటే జ్యోతిష్టోమము - మిగిలినదంతయు కల్పనమే" అని ఒక సమన్వయాన్ని చూపిస్తారు "చోదనాలక్షణం ధర్మః" అన్నచోట చోదన అంటే "సర్వభూతదయ" అని వివరిస్తారు "పలాశశాఖాంఛినత్తి" అంటే "అన్నకబళము నిచ్చుట" అనే భావాన్ని విశదీకరిస్తారు "చక్కగా కృషిచేసి పంటలు పండించుకొని, తాము తిని సుఖముగానుండి ఒరులకింతపెట్టి వారిని సుఖపెట్టుటయే యజ్ఞము-పరోపకారమే మహాయజ్ఞము - సహజీవనమే యజ్ఞసర్వస్వము" అని సిద్ధాంతం చేస్తారు ఇవంతా పశుహింస కూడదనీ, అవసరమైతే పిండి పశువును వాడుకోవచ్చనీ, దాంభిక కర్మలు వద్దనీ, కర్మను పాడుచేయడంకన్న మానివేయడమే మంచిదనీ - ఇలాగ ఎన్నో మంచిభావాలు ప్రోత్సహించి పరుగెత్తించిన పరుగు - ఉడుకెత్తించిన ఉరుకు నేటి సమాజంలో వైదికకర్మలు చేసేవారు, చేయించేవారు, ప్రేరించేవారు—అందరున్నూ పరమ వంచకులుగా, సమాజచోరులుగా, దంభాచారులుగా, పరమపీడనాయత్తచిత్తులుగా, మారిపోయేరు గనుక, కలికాలంలో కర్మకాండకు సజీవసమాధి చెయ్యడమే ఉత్తమోత్తమమని హృదయం అనునిత్యం పెట్టిన ఘోష

ఈ విధంగా వేదశబ్దాలకు అర్థాలు మార్చే అవసరంరాగానే నాదం, శబ్దం, భాష వీటి స్వరూప స్వభావాలు, వేదాలు, వేదాంగాలు, వాటి వివరణాలు, శబ్దార్థాల పరిణామాలు మొదలయిన విషయాలన్నీ పుంఖాను పుంఖంగా దాసుగారి ప్రతిభాసముద్ర నిక్షేపాలుగా, ఉత్తుంగతరంగాలుగా బయలుదేరి పల్ల్వదాయులను, సామ్రదాయికులను ముంచెత్తి ఊపిరి సలుపకుండా చేసి విడిచిపెట్టేయి ఆయా సందర్భాలలో పీరి భావాలు ఈ తీరుగా ఉన్నాయి —

1 వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు వగైరా గ్రంథాలు కేవలం మునులకు - లేదా మునితుల్య - జీవనం గలవారికి మాత్రమే నేటి సమాజానికి ఎందుకూ పనికి రావు నేటి యువకులకు స్వయం కృషి, పరోపకారం, సహజీవనం అన్నవే పరమార్థాలు

2 వేదాలకు, శాస్త్రాలకు సరియైన అర్థం ఎవరూ చెప్ప లేరు అయిదువేల సంవత్సరాలు ఒక యుగం యుగయుగానికి శబ్దార్థాలు మారుతూ ఉంటాయి వాటికి శాశ్వతత్వం లేదు అలాగే ఆచారాలు మారుతాయి అన్నీ మారుతాయి దేశకాలాను గుణంగా సమాజానికి అభ్యుదయం కలిగించే విధంలో శబ్దార్థాలను మార్చి చెప్పుకోవడమే సమంజసం

3. శ్రుతి శ్రుతిగా ఉన్నంతవరకే సత్యం - అది వ్రాత రూపంలో రాగానే ఎన్నో మార్పులు సహజంగా వస్తాయి కాగా అది వేదాల స్వరూపం ఇప్పుడు లేదు మారిపోయింది మార్పు తోనే దంభం కూడా ఆరంభం అయింది

4 జనరంజకమైన పలుకే వేదం జనానురాగసంపాదకమైనదే శిష్టాచారం "సర్వేజనాః సుఖినోభవంతు" అని ఘోషిస్తూ తదను గుణంగా ఆచరించువాడే పురుషోత్తముడు

5 వేద వేదాంగాలు, కర్మలు, ఆచారాలు, వర్ణాశ్రమాది వ్యవస్థలు, నియమాలు, నిష్ఠలు ఇవన్నీ మానవులు పరస్పరం ప్రేమతో జీవించడంకోసం కల్పించినవే అన్యోన్యానురాగం కలి గించలేపోతే అవన్నీ వ్యర్థమే

6 వేదశాస్త్రాలు, స్వర్గ నరకాదులు, పాపపుణ్యాలు - పరలోకం - శ్రోతలకోపాసనపరలె సర్వజనసౌఖ్యంకోసం మునులు

కల్పించినవే. వైషమ్యం కోసం కాదు ప్రజలకు సామరస్యాన్ని సౌఖ్యాన్ని కలిగించనిది వేదము కాదు - శాస్త్రము కాదు

7 అన్ని దేశములవారి మత గ్రంథములు కూడా వేదాలే సుఖజీవనాన్ని ఉద్దేశించే అవన్నీ ఆవిర్భవించేయి

8 ప్రత్యేకంగా మునులకు, సన్యాసులకు మాత్రమే వేద వేదాంగాల ఉపయోగం పామరులకు సంసారులకున్ను వాటితో పనిలేదు స్వయం కృషి, పరోపకారం, భూతదయ, అన్యోన్యాను రాగం, ఆనందమయజీవనం ఇవే జన సామాన్యానికి ముఖ్యాతి ముఖ్యములు అవే వారికి సకల శాస్త్రసారములు

9 జనరంజనమే భాషయొక్క పరమ ప్రయోజనం పరస్పర రంజకంగా మాటాడుటయే ముఖ్య కర్తవ్యం వైదిక భాషకేగాని వ్యావహారిక భాషకు వ్యాకరణంగాని నియమ నిబంధనలుగాని ఆవశ్య కంకావు ప్రపంచంలోని అన్ని భాషలూ ఆదరణీయాలే

10 జగదుపకారములయిన శబ్దములన్నీ సాధు శబ్దములే జనహితము కాని శబ్దములన్నీ అసాధుశబ్దములే

11 ప్రపంచంలోని సకల వేదశాస్త్ర సారమును, సకల సాధు జనోపదేశమును, సకలమతరహస్యమును, మానవ జీవితసర్వస్వమును "తాసుఖపడి పరుల సుఖపెట్టుము" అనియే

ఇటువంటి భావాలు జగజ్జ్యోతిలో పదింబదిదా ప్రతిపుట లోను కనిపిస్తాయి

ప్రసక్తానుప్రసక్తంగా శ్రీదాసుగారు సమకాల సమాజానికి సంబంధించిన ఎన్నో విషయాలను క్షుణ్ణంగా చర్చించి తమ సిద్ధాంతా లను ప్రకటించేరు వానిలో ముఖ్యమయినది వర్ణాశ్రమ వ్యవస్థ

పెద్ద ఎత్తున దాడి సనాతనమైన ఆవ్యవస్థ రానురాను భిన్నాభిన్న మైపోయి, స్వరూపస్వభావాలను పోగొట్టుకుని, సమాజానికి అనర్థ దాయకంగా పరిణమించింది కావున దాన్ని పూర్తిగా తుడిచిపెట్టి "సహజీవనం" "సమరసజీవనం" ప్రధానంగాగల నవసమాజం వికసించాలని వీరి అభిసంధి "ఆడ-మగ-రెండేజాతులు, మంచి-చెడు-రెండే జాతులు, నీతి-అవినీతి-రెండే జాతులు, వివేకం - అవివేకం, రెండే జాతులు, జాతిభేదం వర్ణభేదం నేటిసమాజానికి పనికిరావు మానవులంతా ఒకటే సర్వమానవ సోదర్యంకోసం అందరూ పాటుపడాలి" అని ఆయా ప్రకరణాలలో వీరు విశదం చేసేరు. "బ్రాహ్మణ ప్రాణము, బ్రాహ్మణనిద్ర, బ్రాహ్మణుని యాకలి దప్పికలని నిద్రాహారసౌఖ్యములకు వర్ణాశ్రమధర్మ వ్యవస్థ లేదుగదా! సుఖమయజీవితానికి ఈ భేదాలెందుకు?" అని ఎన్నో యుక్తులను చూపించేరు మూఢాచారాలు, అంధవిశ్వాసాలు దంభవేషాలు, వంచకవృత్తులు కపటవచనాలు - ఇటువంటివన్నీ తొలించిననాడే సమాజం బాగుపడుతుందని, పదేపదే హెచ్చరించేరు.

"ఏవిషయం తీసుకున్నా సరియైనతత్త్వం ఎవరికిన్నీ తెలియదనీ, శాస్త్రాలన్నీ కృత్రిమాలనీ వాటిని ఆసరాగా తీసుకుని విర్రవీగడం శుద్ధాఽవివేకమనీ, - తంత్రాఽపి - వృత్తిగాపెట్టుకుంటే ఏశాస్త్రమూ ఫలించదనీ, మునులకు తత్తుల్యులకు మాత్రమే శాస్త్రాల ఉపయోగమనీ, ప్రాకృతులందరు పరస్పరప్రేమతో పరస్పరసాహాయ్యంతో జీవనాన్ని గడపడమే ఉత్తమోత్తమమనిన్నీ" - దాసుగారు అనేక సందర్భాలలో నొక్కిచెప్పేరు తర్కం వ్యాకరణం, జ్యోతిషం, నిరుక్తం, మొదలయిన శాస్త్రాల చర్చల్లో ఈయుక్తి ముఖ్యంగా కనిపిస్తుంది.

ఇక శ్రీ దాసుగారు మనసార ప్రేమించిన అంశాలు కొన్ని లేకపోలేదు వాటిని స్థూలంగా పరిశీలిద్దాము —

1 సంస్కృతభాష చాలా గొప్పది దానినుండే ప్రపంచం లోని అన్ని భాషలూ ఆవిర్భవించేయి నాదం, శబ్దబ్రహ్మం, తెలియాలంటే సంస్కృతమే ప్రధాన సాధనం

2 వేదాలు మేఘగర్జనంవలె సముద్రఘోషవలె సహజ మైన నాదబ్రహ్మస్వరూపాలు వాటిలోని కర్మకాండమంతా మాన వాళికి శని-జ్ఞాన కాండం మాత్రమె గురుదు

3 సృష్టి అంతా దైవపౌరుషమయం దైవం పౌరుషం రెండూ ఒకటే పౌరుషాన్నే మానవులు అవలంబించాలి దైవం దానంతట అది అనుసరిస్తుంది - సిద్ధిస్తుంది

4 నాదబ్రహ్మోపాసన, భ_ భగవచ్చింతన - ఇవి సదా స్వీకార్యాలు స్వార్థత్యాగి, లోకోపకారి, సర్వభూతదయాపరుడు అయినవాడే పరమ భాగవతుడు - పరమభాగవతులే వాస్తవమై సత్పురుషులు - వారే లోకానికి సర్వదా సర్వథా శరణ్యం

5 దర్శనాలలో శిరోమణి - శిరోధార్యం అద్వైత దర్శన మొక్కటే శ్రీశంకర భగవత్పాదులె అసలయిన సిసలైన తత్త్వ వేత్త ఇతర దర్శనాలన్నీ సాధనాలు మాత్రమే - అద్వైతమే సాధ్యం - చరమలక్ష్యం - పరమార్థం

6 ఆధునికమైన విజ్ఞానాన్ని (సైన్సు) ఈసడించకూడదు సకలజనోపయుక్తంగా, బహుళప్రయోజనకారిగా దాన్ని మలచు కొని వాడుకోవడమే మానవులు చేయవలసిన పని ఇటువంటి ఉదారభావాలు, ఉత్తమ లక్ష్యాలున్నూ గ్రంథమంతటా తరచు కని పిస్తాయి.

కాగా యజ్ఞం - పశుహింస ఉపాదానకారణంగా, వైదికం మన్య-యిన వంచకులు నిమిత్తకారణంగా సమాజపు ఈతిబాధలు సహకారి కారణంగా ఉవ్వెత్తునలేచిన స్వయంజ్యోతియే "జగజ్జ్యోతి" అని సూత్రప్రాయంగా చెప్పవచ్చు

ప్రాసంగికంగా గ్రంథశైలిని గురించి రెండు మాటలు చెప్పాలి సంఘటన అంతా వీరగ్రాంథికభాషలో సాగింది పెద్ద వాక్యాలు, చిన్న వాక్యాలు, వాక్యాలలో అవాంతరవాక్యాలు - ఈవిధంగా ఒక్కొక్క చోట ఒకపుటకు సరిపడిన మహావాక్యజాలము ఉంది ముచ్చటైన మూడు ముక్కలూ ఉన్నాయి జాతీయాలు, భాషీయాలు, సామెతలు, లోకోక్తులున్న కొల్లలుగా ఉన్నాయి తర్కం, యుక్తి, వాదం, జల్పం, ఛలం - ఒక్కొక్కచోట వితండం కూడా - విషయ ప్రతిపాదనలో చోటు చేసుకున్నాయి ఇంచు మించు సంస్కృతంలో కాదంబరిలాగ రచన సాగిందని అన వచ్చు కాదంబరి సరసమైన కథ కాగా ఇది గంభీరమైన చర్చ అయింది అదే భేదం కొన్నిచోట్ల విరామ చిహ్నాలుకూడా సరిగా పెట్టడానికి వీలు లేనంతగా పంక్తులు పరుగులు తీస్తాయి ఇటువంటి గద్యరచన శ్రీదాసుగారికే సాధ్యమవుతుంది ఆంధ్ర గద్యానికి జగజ్జ్యోతిని ఒక ప్రత్యేకోదాహరణంగా పేర్కొనవచ్చు అయితే- ఒక్కలోపం మాత్రం కొట్టవచ్చినట్లు కనబడుతుంది అదే "పునరుక్తి" - చెప్పిన దానినే పదే పదే చెప్పడం "పశుహింస కూడదు తాసుఖపడి పరులను సుఖపెట్టుటయే బ్రతుకు పరమార్థము" అనే అంశం, గ్రంథం అంతటా కొన్ని వేలసార్లు ఆవృత్తమయింది ఇంచుమించు ప్రతిపుటలోను కనబడుతుంది మరి కొన్నిచోట్ల పూర్వోత్తరవిరోధంగల వచనాలుకూడా గోచరిస్తాయి సమన్వయం చేయడం చాలా కష్టమనిపిస్తుంది ప్రకరణ విభాగం కూడా అనుస్యూతంగాను, సముచితంగాను, సంబద్ధంగాను జరిగినట్లు

కనబడదు ఇవన్నీ పరిశీలిస్తే "గ్రంథం అంతా క్రమబద్ధంగా ఒకే సారి వ్రాసింది కాదేమో'" అన్న సంశయం కలుగుతుంది అయినా ప్రకృతం ఎవరూ ఏమీ చేయలేరు శ్రీ వథావాభి నివేశం గల రచనలు ఇలా సాగడం కూడా అక్కడక్కడ కనిపిస్తుంది" స్థితస్య గతిః చింతనీయా" అన్నట్లు ఉన్నదానిని అన్వయించుకోవడమే భావుకుల కర్తవ్యం

అవనినే నేను కొద్దిగా చేసేను శ్రీ కర్రా ఈశ్వరరావుగారు నారాయణదాస సాహిత్యాన్ని ఆ లటినీ సర్వాంకమంగా పునరుద్ధ రించిన వారిలో ప్రముఖులు వారి కోరికతోనే నేను ఈ గ్రంథాన్ని యథాశక్తిగాను యథావకాశంగాను సంస్కరించేను ఇటువంటి అవకాశం నాకు కల్పించినందుకు శ్రీ ఈశ్వరరావు గారికి అభినంద నములను ఆశీస్సులను అందిస్తున్నాను

ఇంతకూ "జగజ్జ్యోతి"ని అనుసరించి నారాయణదాసుగారి తత్త్వానికి వ్యక్తిత్వానికిన్ని సహృదయలోకం సమర్పించవలసిన మూల్యం ఎటువంటిది? ఈ ప్రశ్నకు సమాధానం ఈ విధంగా చెప్పుకోవడం సమంజసం — సత్యం, అహింస, సర్వాత్మనా సకల భూతదయ, పరోపకారం అన్నవి దాసుగారి ప్రధాన ప్రతిపాదనలు అద్వైతమే పరమదర్శనమనీ, దర్శనాంతరాలు దానిసోపానాలనీన్నీ వీరి సిద్ధాంతం ప్రకృతసమాజంలో "వాసుదేవః సర్వమితి" అని భావిస్తూ, భక్తినిచేబట్టి భగవన్నామ సంకీర్తనం చేస్తూ అందరిని తరింపజేసే భాగవతులే పరమపురుషులని వీరి సమన్వయం "దంభా నికి అహంకారానికి దారితీసే కర్మకాండం అంతా దండుగ దాన్ని సమూలంఘాతంగా ఖండింపజేయడం అత్యావశ్యకమని" వీరి ఉద్ఘోష ణము కాగా దయానందసరస్వతి, వివేకానందుడు, అరవిందయోగి మొదలయిన నవీనదార్శనికుల కోవకు చెందినది వీరి తత్త్వమీ

మూలస ఆచరణయోగ్యమైన దేశకాలానుగుణమైన అద్వైతమే వీరి దర్శనం ఆవిధంగానే "మానవతావాదం, సమాజవాదం సమ సమాజ నిర్మాణం, వర్ణరహితమైన వర్గరహితమైన లోకవ్యవస్థ, సర్వమానవ సౌభ్రాత్రం, సహకారం, సహజీవనం ప్రగతి, సర్వ జనాభ్యుదయం-" ఇత్యాదిగా నేడు ప్రపంచం నలుమూలలా ప్రతి ధ్వనిస్తున్న ఆదర్శాలను దాసుగారు త్రికరణశుద్ధిగా ఆమోదించేరు కాగా రాజా రామమోహనరాయ్, కేశవచంద్రసేన్, మహాత్మగాంధి కందుకూరి వీరేశలింగం ప్రభృతుల సంఘసంస్కారణైక మన స్తత్వమే వీరి వ్యక్తిత్వం అందువల్లనే హరిదాసుగానేకాక సాహిత్యస్రష్ట గానేకాక, గొప్ప తాత్త్వికునిగాను, మంచి సంఘసంస్కర్తగాను, మానవతావాదిగానుకూడా వీరిని భావించి సంభావించి జేజేలు పలక డం, వీరి భావాలను ప్రచారం చెయ్యడం, ఆదర్శాలను పూర్తిగా ఆచరించడమున్నూ అందరకు అవశ్యకర్తవ్యం అదే వీరికి పరమో పాయనం!

ఇక దాసుగారి సహజప్రవృత్తి "కరుణావృత్తి" కనుకనే వారువెల్లప్పుడు "ఆర్తాక్రాంతరాత్మ" జీవహింసను కన్నా-విన్నా-వారు బొటబొట కన్నీరు కార్చేవారట చేపలు పట్టేవారికి, పందులను కొట్టేవారికి కావలసినంత డబ్బుయిచ్చి ఆరోజు ఆపని మానిపించే వారట తోలు చెప్పులు తొడుగుకునే వారు కారట "అహింస" ఆయన నిరంతరజపం "పరోపకారః పుణ్యాయ పాపాయ పర పీడనమ్" "ఆత్మవత్ సర్వభూతాని యఃపశ్యతి స పశ్యతి" అన్నవి ఆయన యావజ్జీవ వేదనాదాలు అంతటి జాలిగుండె ఆయనది అదే "జగజ్జ్యోతి" దర్పణంలో నిర్మలంగా ప్రతిబింబించింది

తత్ఫలితమే జగజ్జ్యోతి విషయంలో వారన్న మాటలు —
“నాకును నాచూచు మర్త్యుడు లోకమునకును గతిని తలంచి
మన మతానుసారముగా                    మార్చి జగద్ధితమునకై
యమూల్య సారమున్నందుకు నాశక్తి కొలంది నీగ్రంథము నిర్వేరిచె
దనై వ్రాయవలసి వచ్చెను (మొదటి భాగం చివర)

పెద్దలు చెప్పినట్లు శ్రీ నారాయణదాసుగారు “ధన్యాః, మహాత్మానః, పుణ్య యశస్వినః” నమో మహద్భ్యః'

ఓమ్ తత్ సత్

— అప్పల్ల సోమేశ్వరశర్మ, యం ఏ, బి ఓ యల్



ADIBHATLA NARAYANA DAS

*PRINCIPAL*

Sri Vijayarama Gana Pathasala

VIJAYANAGARAM

# వంశావళి



కం. మునులం దెల్లవిధంబుల
మొనగాఁడు గడింపరాని మూఁకలతో వ
చ్చిన శ్రీరామున్విందునఁ
దనుపు భరద్వాజఋషికి దండంబిడెదన్

సీ. మూఁడువేలేండ్లకు మున్ను సౌరాష్ట్రవి
ప్రవులు మ్లేచ్ఛసంపర్కమునకు రోసి
సాగిరి చోళదేశమున కవ్వారిలోఁ
బదుమూఁడుగోత్రము ల్బయలుదేఱి
వేయివత్సరముల వెన్క గోదావరీ
తీరముఁ జేరి నత్రెగలయందు
పెయూరునుండి పిల్పించె నెన్నికఁ జేసి
జయపురేశుండు కృష్ణప్రభుండు

రెండువందల యేఁబదియే డ్లక్రింద
బహు తపఃప్రభావున్ భరద్వాజగోత్రు
సత్కుటుంబి నఖిలవేదశాస్త్రవిభుని
నాదిభట్టనాము మదన్వయాద్యపురుషు

గీ. అఘము తెగఁగొట్టుఁ దపమున కాలుపట్టు
నీతిఁ గనిపెట్టుఁ బులికైన మూతిఁగట్టు
ప్రేమ మిన్ముట్టు నీవికి వేల్పుఁ జెట్టు
వైదికుల తుదిమెట్టు మా యాదిభట్టు

మ. గురుఁడున్ శుక్రుఁడు దాఁకగేహములలోఁ గొల్వుండ నుద్దీప్తుఁడై
హరిణాంకాత్మజుఁ డాడుచు న్శశికి స్వాయత్తస్థితిన్ పొందగా

నరవిందాప్తుఁడు హర్షమున శశిని భాగ్యంబేలుచున్ సౌమ్యునిన్
శరణొందన్ జనియించె మంత్రివిరాజద్గోపిలగ్నంబునన్

కం. దేవతల శంకరుండున్
క్ష్మావల్లభులందు రామచంద్రుఁడు పేరూన్
ద్రావిడుల నాదిభట్టు ప్ర
భావంబున నెదురులేనివారలు జగతిన్

శా. మారాకారుఁడు వేదశాస్త్రనిధి బ్రహ్మజ్ఞాని మాయాదిభ
ట్టారాజేంద్రుఁడు సత్కరింపఁగ మహాయజ్ఞంబులన్ జేయుచున్
దారావత్య సమన్వితుండయి జగత్సన్మానితాచార్యుఁడై
పేరెక్కె న్గడుభక్తిమై నతనితోఁ బృథ్వీశ్వరుం డిట్లనెన్

శా. దేవా నీవు సమస్తమంత్రము సిద్ధింబొందినావంచు నీ
సేవన్ జేయ నభీష్టమబ్బుననుచు న్జెప్పెన్ మహాత్ముం డొకం
డే వేఁటాడు వనాంతరంబున భవత్సత్కాంత మెర్గించి ని
న్నేవిల్పించితిఁ గోరి కావున దయన్వీక్షించి రక్షించుమా

కం. పెంపలరు మఱి నీ కిఁక సం
తతి గలెకి వెరవుఁ జూపు దయతో భూదే
వతల కనాథ్యం బెయ్యది
వెతఁ దొలఁగించుము మహాత్మ వేఁడెద నిన్నున్

ఉ. కాలము మల్లిచుండె ననఘా కులదీపకుఁడౌ తనూభవున్
మాలిమితోడ ముద్దిడుటమాత్రము నాకిఁక నున్నకోర్కె యీ
లాలస మీరు తీర్చునెడ రాజ్యములో సగపాలొసంగి భూ
పాలు నొనర్తు నీ సుతుని దావకగోత్రమె నే వహించెదన్

గీ. అనఁగఁ జెలువొప్ప నంబళ్ళె నాదిభట్టు
ధృతి యొసఁగ రఘునాథ కృష్ణదేవుతోడఁ
దపముగావించి యొక్కవత్సరములోనఁ
బుత్రు పీశలరింతు గాయత్రిసాక్షి

చ అని తన యెన్మిదేండ్ల సుతు నా ధరణీశున కప్పగించి భా
ర్యను దన వెంటదీసికొని యగ్రేదపంబున కాదిభట్టు సం
దన దశకార్థముం గడు ముదంబునఁ గాంచి చిరంబు రాజ్యమున్
బొనరిచి తాన కేగె సఖుఁడయి రాజును లోకులౌనన్

తరువోజ

ఆదిభట్టాత్మజుఁడా హయగ్రీవుఁ డర్ధరాజ్యంబున కధిపతియగుచు
వైదిక లౌకిక వైభవంబలరఁ బ్రబలసందాపురిం బాలించు చఖిల
వేదవేత్తలను రప్పించి గ్రామముల వెలయించి శ్రోత్రవశీకరుండగుచు
భూదేవతలె మానవులమిన్నలంచు భువనంబులెన్నియుం బొగడ రాజిల్లె

సీ వెడఁద ఫాలంబునఁ బడియారెడు విభూతి
నెలవంకలోన గంపిలరుచికి
కంఠమం దొంటి మొగంబు రుద్రాక్షము
హరు గళమున హాలాహలము మాడ్కి
ధనువూని రణరంగమున శత్రులం బాఱఁ
దోలుచు నభినవ ద్రోణు రీవి
వేదవేదాంగము ల్వివరించు తటి సర
స్వతి మగరూపునం బరఁగు చెల్వు

భూసుర క్షత్ర తేజము ల్మూర్తిఁగొన్న
పొలువు వెలయించి జనము లబ్బురము వడఁగ
క్షితిని బాలించి రఘునాధ కృష్ణదేవు
దొడ్డకొడుకగు రామచంద్రుని కని నిటు

ఉ ఏలుము నీవె రాజ్యమిది యెల్ల మహాత్ముఁడ రామచంద్ర! యా
యేలిక మాటఁ బట్టి యిటు లీకొనినాఁడను, బ్రహ్మగాఁడ నా
కేల నృపాల ధర్మ మిఁక నేగెద నందపురాగ్రహార వి
ప్రాళిగతిం బిక్షాణ మెడయన్నముకట్టి గృహస్థ నయ్యెదన్.

చ. అన విని రామచంద్రుఁ డనఘా! పితృతుల్యుఁడ విశ్వవిఖ్యాత కీ
ర్త్యొనరుచు మీరు నీరుణ యుంచుము నాపయి రాజచిహ్నము
ల్దగ యథేచ్ఛనుండు మనఁ దబ్బున నందపురాగ్రహారకం
క్తిని వసియించె నేగి హయగ్రీవుఁడు బ్రాహ్మణచక్రవర్తియై

సీ. బంగరుచాయ మాణిక్యాలకీ స్ఫూర్చుండి
తూర్యధ్వనులు మీఱఁ దూర్పుదెసకు
నందపురమునుండి నలుదట్లఁ గొండదా
రల్ బ్రాహ్మణులు గొల్వ రయముతోడ
వెడలి పొట్టంగిలో విడిసి యావయిఁ దాడి
వేసను మక్కువన్నడచి సీత
నగరమున్నాటి స్వర్ణముఖీనదీతటి
నజ్ఝాడ యనునూర నధివసించి

ద్రావిడాష్టసహస్రాగ్రహార ప్రభువయి
యజ్ఞముల్ గృహమేధియై యాచరించె
నబ్బయను పుత్రుఁగని నాకమరిగెఁ బిన్న
ప్రేమ ననుగమింపఁగ హయగ్రీవవరుని

ఉ. అబ్బయసోమయాజి సుతు లారసు లిద్దఱు వేంకటేశ పే
రబ్బలు, వేంకటేశ్వరుఁడు యజ్వయు లోకహితుం డన్నదాత, పే
రబ్బఁడు పండితాగ్రణి యుదారుఁడు సత్త్వగుణప్రధానుఁడున్
బెబ్బులినైనఁ బట్టుకొను విక్రమశాలి మహస్వయాద్యుఁడున్.

సీ. అన్నదాతలని దిగంతవిఖ్యాతులై
పరఁగి రజ్ఝాడాదిభట్లవారు
బ్రాహ్మణప్రభువులై బహుయజ్ఞశాలలం
బన్ని రజ్ఝాడాదిభట్లవారు

కలవృనవచ్చిన ఘనకుటుంబములఁ గా
పాడి రజ్జాడాదిభట్లవారు
విజయనగరమగరేంద్రు విందొనర్చిరి తమ
పట్ల నజ్జాడాదిభట్లవారు

శ్రీగలిపి యింటిపేర్ ఖరారించి చేతి
వ్రాలు పచరించి లక్ష్మీర్ స్వతులకుఁ
బొందుగావించి యేలిన ప్రోడలెదిరి
పల్కునోళ్ల రజ్జాడాదిభట్లవారు

సీ. తొంబదియేండ్లముందు విజయనగర నా
రాయణగజపతి సాయమంది
ఆజ్జాడఁ గాపాడె యజ్ఞేశచయని వే
సారి మరాఠీఎతూరినుండి
పదురేయి సన్న్యాస్య పదియాఁది యిదువన్న
ఫలమున రక్కసి స్వదలఁగొట్టె
గుండ్రాయి చేఁబట్టి క్రోల్పులి నెదిరించి
శక్తిమై వేంకటభుక్త కూల్చె

త్యాగులున్ భోగులు న్దపోధనులు పూర్వు
లందఱు స్మృత్కులంబున నలరినారు
సుతుఁడు వేంకటభోక్తకు సోమభోక్త
మామకీన పితామహుఁ డామహర్షి

కం. నాజనకుఁ డాదితప్పని
యాజానుభుజుండు భాస్కరారాధకుఁడున్
తేజోనిధి వేంకటకవి
రాజిల్లెడు జగతి నతనిన్వాఁతయుఁ జదువున్

సీ. బహుదేశభాషఁ బ్రభు మెప్పించిన
  మరువాడ వెంకన్న మనుమరాలు
పార్వతీశివులని ప్రఖ్యాతిఁగొన్న జ
  గ్గయ్య-సీతమల నాల్గవకుమార్తె
గున్నకేన్గులవలె నున్నతిగన్న యై
  దుగురన్నదమ్ముఁ దోడఁబుట్టి
పసితనంబున భాగవతపురాణము నాకుఁ
  గఱపి పన్పించు నాకన్నతల్లి

కడుపు చల్లఁగ నేవురు కొడుకుల మఱి
కూఁతుల న్నల్వుర న్గాంచి కుం[illegible]ము పౌసల
నైదువతనంబు మోయు నిల్లాలు చదువు
లవ్వ యను బిరుదందు నాయమ్మ సరస

క. ఘనశంఖమువలె గంత
ధ్వని యలర సమస్త కావ్యతతి విన్పించున్
జనులకుఁ బ్రత్యహము నా
జనకుఁడు గీర్వాణవాగ్విశారదుఁ డగుచున్

క. అభినవ మదనాకారుం
డిభవైరి పరాక్రముఁడు మహాప్రవిభవుఁడున్
సభలఁ జిరంజీవి మహా
ప్రభువనఁ దగి త్యాగభోగరాయఁడయ్యెన్

సీ. అస్మజ్జనక శిష్యులై కావ్యపఠనము
  చేసి లోకమునఁ బ్రసిద్ధిగాంచి
రల గంటి సీతారామావధానియు నా స
  హాధ్యాయుఁడున్ జ్ఞాతి న్యాయతీర్థ

బిరుదము గొన్న కోవిదశిరోమణి యనే
　　కలఁ దర్కవేదాంతముల విబుధుల
నలిపిన యాచార్య సార్వభౌముఁ డఖండ
　　కీర్తినొందిన రామమూర్తి శాస్త్రి

అగ్రజులు నాకు నల్వురు మగ్రుతోడఁ
బుట్టు మాకెల్ల సంతానము విలసిల్లు
వంశపావనచరిత్ర స్వర్ణగాత్ర
నా పెదప్ప పాపమ సుగుణముల కుప్ప

సీ. అస్మదీయ భ్రాతలం దేను గడసార
　　మగ్రజోత్తముఁడు జగ్గావధాని
స్వాధ్యాయపరుఁ డనుపమ బలాఢ్యుండు మై
　　బంగారు మదవు టేనుంగు గున్న
విజయనగరమున విభవము నమకూర్చి
　　మమ్మింటకుం దెచ్చి మాకుటుంబ
ముద్ధరించిన మహాబుద్ధిమంతుఁడు సీ
　　తారాముఁ డిహపరతంత్రవేత్త

గోత్రపావనుఁడౌ నగ్నిహోత్రశాస్త్రి
చలువ పన్నీరు చల్లిన చ దమునుచు
రాజు లందఱు మెచ్చ నల్లోజవలెను
జోడుగూడి పేరన్న నాతోడఁబాడు

గీ. కావ్యరచనకు వాల్మీకి కావలయును
తగును వ్యాసుఁ డొకండె శాస్త్రంబుఁ దెలుపఁ
శక్తిలేమి నెఱిఁగియు లజ్జ న్దొఱంగి
వేత్తవలె నటియించెద విధివశమున

గీ॥ తెలుఁగువారలకు న్నేఁటి తెల్లముగను
తెనుఁగుతో నల్ల విద్దెలఁ దెలుపనెంతు
అన్ని విధముల ననుఁ గాచు నాంధ్రదేశ
మునకు నాయచ్చియున్న యుప్పనము దీర్తు

కం॥ నీ మూలము నా గోత్రము
నా మంచియుఁ జెడ్డ నీదె నడిపించుము న
న్నీమది కొలఁది న్మాన్యశ
పామరజనకల్పభూజ భారద్వాజా!

—o—

# ప్రార్థనము

సకలాంతర్యామీ! సర్వేశ్వరా! నారయణా! దీనబంధూ! కృష్ణా! గోవిందా! శంభూ! శంకరా! సదాశివా రామచంద్రా! జననీదుర్గా! వీరాంజనేయా! గణపతీ! ద్వాదశాత్మా! జగజ్జ్యోతీ! ప్రభాకరా! సకలజగత్సృష్టిసంహారలీలావైభవులారా! తలిదండ్రులారా! పార్వతీపరమేశ్వరులారా! నాసాటివారలలో నాకు మంచి పేరు రానిందు కన్నతల్లీ! యాదిశక్తీ! బాలాత్రిపురసుందరీ! నీకన్న నాకు వేఱేదిక్కు కలదా? అభీష్టము లిచ్చి రక్షించుము రక్షించుము తెలిసీ తెలియని నరపశువను నేను సర్వజగదుపకారముగా హాయిగా మా తెండ్లు మన్నఁ బెంచుము ధర్మమార్గము నుండి నను జాఱిపోనీకుమో జగన్మాతా! నిన్నుఁ దెలిసి వర్ణించనేరను

# జగజ్జ్యోతి

## మొదటి ప్రకాశము

### పౌరుషదైవ విచారము

భరద్వాజ, తపస్విరాజ, రవినిభతేజా !

అవధరింపుము—కోర్కెలు తీర్చుకొనుటకై చేయు ప్రయత్నము పౌరుషము మఱియుఁ గోర్కెలు సిద్ధింపఁజేయు కారణము దైవము పౌరుష మైహలౌకికము - దైవము పారలౌకికము, పౌరుష కర్మము కృత్రిమము-దైవకర్మము సహజము పురుషప్రయత్నమున కంతకును దైవమే కారణము దైవానుగ్రహమునఁ దప్పఁ బౌరుషము చెల్లనేరదు దైవకృతమునకుఁ దాఁ గర్త యని యహంకారవిమూఢాత్ముఁడు తలంచును అష్టాదశవిద్యలును ధర్మార్థకామమోక్షములను సాధించు నుపాయములను జెప్పిచెప్పి తుదకున్నదే దైవము మఱి పౌరుషము లేనేలేదు పురుషప్రయత్నమంతకు నవివేకమే కారణమని సిద్ధాంత మొనర్చుచున్నవి అష్టాదశ విద్యారహస్యముల నారితేఱినవారికిఁ దప్ప సర్వమును దైవమేయను వివేకము కలుగనేరదు జన్మమెత్తిన ఫలము సత్యాసత్య వస్తువివేకమును సంపాదించుకొనుట గదా! విద్వాంసులకుఁ దప్ప నితరులకు నిత్యానిత్య వస్తువివేకము కలుగనేరదు వివేకమున్న ఫలము నిత్యసంతుష్టి పొందుటయే శాశ్వత సంతృప్తినందుటయే కైవల్యపదవి ననుభవించుట సంతుష్టి లేకుండుటయే నరకము సంతుష్టియే స్వర్గము నిత్యానిత్యవస్తు వివేకమునఁగాని నిత్యసంతుష్టి కలుగనేరదు విద్యలన్నియును వివేకమున్న

బుటించుటకే ప్రవర్తిల్లుచున్నవి మనులందఱును లోకానుగ్రహ పరులై వివేకము కలిగించు వివిధవిద్యల నుపదేశించిరి "ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా-హారిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి లలాటలిఖితారేఖా పరిమార్ష్టుం నశక్యతే, వినాదిత్యం గ్రహాః సర్వేదివసం కర్తుమక్షమాః, నఫలంతి మహార్తాని తథేశానుగ్రహం వినా" దైవానుగ్రహము చేతనే యథార్థజ్ఞానము కలుగును విధివ్రాలుతప్పింప బ్రహ్మకుఁగూడఁ దరముకాదు సూర్యుఁడు లేకెట్లు సకలగ్రహములు పగటిం జేయఁజాలవో యట్లే దైవానుగ్రహములేక యట్టి మహార్థములను ఫలింపనేరవు అను వచనముల ప్రకారము మర్త్యులయూహల కందని దైవ మెద్దియో పురుషప్రయత్నముల కెల్ల హేతువై మఱి యాప్రయత్నములను ఫలింపఁజేయుచున్నది. లోకోపకారములగు పురుషప్రయత్నము లోకపుదు దైవము ప్రతికూలించినప్పటికి మేలుచేయకున్నను విపరీతమువలెఁ గీడును మాత్రము చేయనేరవు లోకోపకారము చేయఁగల యుపాయ మష్టదశ విద్యారూపముగా ననాదికాలము నుండియు లోకోపకార పరాయణులగు మహాత్ము లుపదేశింపుచువచ్చిరి

"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతమ్, తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమదేవతా" సర్వజగము దైవాధీనము మఱి యా దైవము లోకోపకారకమగుబుద్ధివశము మఱి యా బుద్ధి లోకోపకారకులవశము కాఁబట్టి యా వేదవేత్తయే నా వేలుపు వేదవేత్త యనఁగా సకలవిద్యల నెఱిఁగిన మనుష్యుఁడు కాఁబట్టి యట్టి వేదవేత్తయగు పండితుఁడు ప్రత్యుపకార మాసింపక లోకోపకారకములగు సత్కర్మముల నాచరించుటచేత మాత్రమే సంతృప్తుఁడగుచుండును స్వలాభ మాసింపక లోకోపకారమునకు మాత్రమే బ్రతుకు మనుష్యుల మనోవాక్కాయకర్మములన్నియును విద్యలే లోకోప

కారకమగు వర్తనము వలనిఫల మెప్పటికిని చెడని మనస్సంతుష్టి నిత్యానంతోఁవమే పరమపురుషార్థము బ్రతుకుయొక్క ప్రయోజనము పరమపురుషార్థ సంపాదనమే స్వసుఖ మాసింపక లోకోపకారము నకై పాటుపడు మంచివారలకుఁ దప్పక దైవము తోడుపడి యట్టి సజ్జనుల కభీష్టసిద్ధి కావింపక మానఁడు పథ్యాశన మాఁకలి తీర్చకుం డునా? దైవమే పౌరుషము అగ్నియే వేఁడి, వేఁడియే యగ్ని "హరిరేవ జగజ్జగదేవహరిర్హరితో జగతోనహిభిన్నతను:" "దేవుఁడే యీజగము మఱి యీజగమే దేవుఁడు దేవునకును జగత్తునకును భేదమేమియును లేదు" అనువచనాను సారముగా దైవపౌరుషములకు భేదమెయ్యది యును లేదు

## కృతాదియుగ లక్షణ నిరూపణము

అహంకార మమకారములఁ దొఱఁగి లోకోపకారమునకు మాత్రమే వ్యవహరించు నిత్యసంతుష్టమనస్కులకు సచ్చిదానంద లక్షణ పరమాత్మస్వరూపము తప్ప నితరవస్తువెయ్యదియు న్దోపకుం డును. అట్టి సజ్జనులకు సమస్తకాలమును కృతయుగమే యగును "తపఃఫలం కృతయుగే, త్రేతాయాం జ్ఞానముత్తమమ్, ద్వాపరే యజ్ఞ మేవాహు:, కలౌ కేశవకీర్తనమ్" అనఁగా తలంపేదియునైనఁ బుట్టని విధముగా నేకాగ్రతగాఁ జిత్తవృత్తి నిరోధము కావించినవేళ కృతయు గము సకలపదార్థముల తత్త్వ మెఱిఁగి యుక్తాయుక్త జ్ఞానముతో సకలలోకహితముగాఁ బ్రవర్తించిన సమయము త్రేత-తనసర్వస్వము భగవదర్పణ మొనర్చి మనోవాక్కాయకర్మముల భగవదర్చనము ధూప దీప నైవేద్యములతోఁ గావించినతఱి ద్వాపరము భగవంతునిఁ బ్రతిక్షణము జ్ఞప్తిఁగొని కొనియాడినయపుడు కలియుగము కాల మీవిధముగాఁ గృత త్రేత ద్వాపర కలి నామభేదంబులఁ గన్పట్టు చున్నది.

## కాలకర్మములు

కాలమే దైవము కాలముకన్న భగవంతుడు వేఱే లేఁడు మఱి యును గర్మముచేతఁ గాలము గణనకెక్కుచున్నది కాఁబట్టి పురుషుఁడు కాలము ప్రకృతి కర్మమునై సకలజగత్స్వరూపముగాఁ గాల కర్మములున్నవి కాలకర్మములు, పాంచభౌతికమున నిత్యము భవంతి ప్రకృతికము ను చిత్తచాంచల్యజన్యమును, చిత్తవృత్తి నిరోధ రూపకమగు సమాధియందు ప్రకృతిపురుషు లొక్కటియై నిర్గుణ కేవలాద్వైత పరబ్రహ్మ మనిపించుకొనుచున్నారు కాలకర్మము లనాదిగా స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థం మాఱుచుండును కాలకర్మ ముల కాధారమై మఱి యా రెంటి కతీతమైన సమాధ్యాత్మకమగు పరబ్రహ్మము నిత్య నిర్గుణతత్త్వము కాలకర్మస్వరూపుఁడై సగుణుఁడై భగవంతుఁడు నానాజీవుల రుచులఁ బోలు ధూపదీపనైవేద్యముల నాచరించు నానావిధ యజ్ఞవిధానములను వేదమునందలి కర్మకాండ స్వరూపమును బోధించుచున్నాఁడు జనులు తమతమ రుచులంబట్టి యాయా యుగానుసారముగా వేదశబ్దార్థము గావించుకొని మానసికముగాను వాగ్రూపముగాను శరీరస్వరూపముగాను స్మరించుచు సంకీర్తించుచు భగవంతు నారాధించుచున్నారు యోగులు భగవంతునకు చిత్తమును, జ్ఞానులు భగవంతునకు వాక్కును, మూఢులు భగవంతునకు శరీరావయవములను సమర్పించుచున్నారు

మ్రొక్కుకొని సంపదలుగోరి కామ్యకర్మముల గ్రామదేవతలకై కోళ్లు గొఱ్ఱెలు నెనుము లెద్దు మఱియుఁ గ్రతువులం దింద్రాదిదేవతలకు మేఁకలు మొదలగు జంతువులు సమర్పించు మనుష్యులం దధములు పాలు నేయి పూలు కాయలు పండ్లు భగవంతునకు సమర్పించువారు మధ్యములు మఱి యేజీవమునకైన హింసచేయక సకల భూత దయాపరులై యే కోరికలు లేక తమ మనోవాక్కాయకర్మములను

భగవదధీనము చేయువార లుత్తములు లెక్కింపఁదరముకాని దేవతాప్రీతికై లెక్కింపఁదరముగాని యజ్ఞవిధానములు, మంత్ర తంత్రములు, లెక్కింపఁదరము గాని కామ్యకర్మములు వివిధాగమములు వివిధార్థ బోధనములవలన వివిధమయము లనాదిగఁ గడచుచున్నవి జగమునం దెందఱు ప్రాణులో యెన్నిజంతువులో యెంతకాలము బ్రతికెదరో యేయే మనోవాక్కాయకర్మము లాచరించుచుందురో యా కర్మము లన్నియును భగవదర్పితములే అనంతకోట్ల జీవరాసు లనంతకోట్ల కర్మముల కనంతవిధఫలము లనంతకోట్ల దేవతల కనంత విధ పూజావిధానములు నిష్ఠలు నియమములు ధూపదీపనైవేద్య ములు,బలులు,హోమద్రవ్యములు, మఱియు వెట్టికివేవిధములు కామ్య కర్మములు స్వర్గాది భోగవాంఛచే నింద్రియసుఖ మభిలషించి చేయు నియమములు నిష్ఠలు వ్రతములు యజ్ఞములు మొదలగు సకలవిధ కామ్యకర్మములు సంసార దుఃఖహేతువులుగాని యెంతమాత్రమును శాశ్వతానంద కారణములు కానేరవు ప్రతిక్షణమును దేశకాలము లందే సకల భూతోత్పత్తి స్థితి నాశములు జరుగుచుంటచే నేపదార్థ మునకైన నాదిమధ్యాంతములు కనిపెట్టుటకు వీలుకాదు పర మాణువులకుఁ బరిమాణము గణింపరాదుకదా ? ద్రవ్యగుణకర్మ సామాన్య విశేష సమవాయాభావములను పదార్థము లేదని ముని వక్కాణించెను ద్రవ్య మను పదార్థ మున్నపుడుకదా యద్దాని గూర్చిన గుణము కర్మము సామాన్యము విశేషము సమవాయమును భావము వివరింపఁబడవలసి వచ్చును పృథివ్యప్తేజోవాయ్వాకాశ కాలాదిగాత్మ మనసులను తొమ్మిది ద్రవ్యములలో మనస్సునుబట్టికదా భూమి-నీరు అగ్ని గాలి ఆకాశము కాలము దిక్కు-ఆత్మలు వివరింపఁ బడవలసి యుండును "ప్రమితివిషయాః పదార్థాః" ప్రమితియనఁగా యథార్థజ్ఞానము యథార్థజ్ఞానగోచరములగు వస్తువులు పదార్థము లనఁబడును యథార్థాయథార్థజ్ఞానములు మనఃప్రవృత్తి మూలములు

# జాగ్రదాద్యవస్థల నిరూపణము

గాఢసుషుప్తియందును మూర్ఛయందును మనస్సు వృత్తి శూన్య మగుటచేత నెట్టిజ్ఞానమైన లేకుంట స్వప్న జాగ్రద్దశలు మనః ప్రవృత్తి మూలములు. గనుక జాగ్రద్దశయందు ప్రమయనఁగా యథార్థ జ్ఞానమును స్వప్నమందు భ్రమ యనఁగా నయథార్థ జ్ఞానము కల్గియుంటయు-సుషుప్తియందు గాఢమూర్ఛయందు జ్ఞప్తి యెద్దియును లేకుంటయు నెల్లరి కనుభవము లేకదా? కాఁబట్టి మనఃప్రవృత్తి మూఁలములు ప్రమాభ్రమములు మఱియును జ్ఞప్తి లేమికిఁ బ్రవృత్తి లేని మనస్సు కారణము కాఁబట్టి స్వప్నజాగర సుషుప్తిదశలు సర్వజనానుభూతము లేకదా? 'గగనం శూన్యం" ఆకాశ మనఁగా సున్న యనఁగా నెద్దియుఁగానిది యనఁగా నిట్టిదని నిర్ణయింప శక్యము కాని స్థితి కాఁబట్టి సుషుప్తియే శూన్యరూపమగు నాకాశ మనఁ దగినది వృత్తిశూన్యమగు మనోదశయే సుషుప్తి సుషుప్తియే శూన్యమగు నాకసము

## సృష్టిక్రమము

"ఆత్మన ఆకాశ స్సంభూతః" ఆత్మనుండి యాకాశము పుట్టుచున్నది "ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నమ్ అన్నాత్పురుషః" ఆత్మనుండి యాకాశ మాకాశమునుండి వాయువు వాయువునుండి యగ్ని యగ్నినుండి నీరు నీటినుండి భూమి భూమినుండి యోషధులు నోషధులనుండి యన్నము నన్నమునుండి పురుషుడును బుట్టుచున్నారను వచనానుసారముగా శూన్యాకాశాత్మకమగు సుషుప్తినుండి స్వప్న జాగరములు మఱి యీ సమస్తజగమును పుట్టి పొదలి లయ మగుచుంట యంతయు స్థిరిపెట్టగలుగుట యెంతయునిశ్చయము అతిం

ప్రియ వస్తు వొకటి యుట్టిదని పోల్చి చెప్పుటకు వీలులేక సుషుప్త్యా కాశముల కాధారమై యాత్మయనుస్వతఃసిద్ధపదార్థ మొకటి నిత్యమై నిర్గుణమై శాశ్వతమై కేవలమై యున్నదని సుషుప్తిస్థితి నెఱిఁగిన వారికందఱికి ననుభవమేకదా? సుషుప్తియే ప్రకృతి సత్త్వరజస్త మోగుణములు సమభాగములుగానున్నస్థితి ప్రకృతి మఱియు నా మూఁడు గుణములు హెచ్చు తగ్గు పాళ్ళుగా నొండొంటితోఁ గూడిన స్థితి వికృతి ఈసమస్తజగత్తును వికృతిస్వరూపమే సుషుప్తి మనః ప్రకృతి స్వప్నజాగరములు మనోవికృతి ప్రకృతి వికృతులప్రవృత్తి కాధార మాత్మ ఆత్మ నిర్గుణము సత్వరజస్తమోగుణములు సమభాగ ములుగానున్నస్థితియే నిర్విషయమైన మనస్సనఁబడును మహాసము ద్రమునందు నీటిబుగ్గవలెఁ బ్రకృతియం దీ బ్రహ్మాండ ముత్పత్తిస్థితి నాశము లందుచున్నది "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" ఆకాశమునం దొక భాగ మీా సర్వజగమై యున్నది తక్కిన మూఁడుభాగములు నిత్యనిర్వికారామృత స్వరూపమైయున్నది ప్రకృ తిలో నొకలేశము మాత్రము వికారముచెంది యీజగ మగుచున్నది తక్కినవంతయు త్రిగుణసామ్యమై వికారముచెందక నిత్యమై గాలి కూడ లాగఁబడిన యుత్తగాజుకుప్పెలోని యాకాశమువలెనున్నది వేదమందలి కర్మకాండము శబ్దమువంటిది జ్ఞానకాండ మర్థమువంటిది ఈశబ్దమున కిద్దియే యర్థమని నిర్ణయింపరాదు ప్రసంగావసరవశము చేత శబ్దసంజ్ఞల కర్థ ముండును

## ప్రకృతి - ఆత్మ

ప్రకృతి శబ్దసంజ్ఞవంటిది మఱి యాత్మ యర్థమువంటిది ప్రకృతి యనిత్యము మఱి ప్రకృతి కాధారమును గారణమునునగు నాత్మ నిత్యము ఉదయము తొమ్మిదిగంటలవు డాదివారమునాఁ డొకషేడ్లలో

నొకమిత్రునితో హాయిగా మాటలాడుచుంట జ్ఞప్తియున్నది మఱునాటి సూర్యోదయ సమయమున మహాసముద్రమధ్యమందున్న యొకపర్వతగుహలో నిదురించిమేలుకొన్నట్టు కన్దెఱచి యత్యాశ్చర్యమున వింతవింత ఫలవృక్షములతోడను నడుగడుగునకు మెట్లుకట్టినట్లున్న నున్నటిసుందరపుఁ జెఱువులతో నొప్పారు దీయని సెలయేళ్ళతోడను మిక్కిలిహాయిగావీచు చల్లగాలితోడను గంతయుం జెవరక మచ్చికపడినట్లు మధురధ్వనులొనర్చుచు సమీపమున సంచరించు వింతవింతరగుఁ పక్షులతోడను రవంతయు నీర్భకరములు గాక మైత్రి పుట్టించు నానావిధా పూర్వ రూపంబులఁ జరలాడు చతుష్పాదజంతువులతోడను నొప్పారు కొండశిఖరమునుండి యా పర్వతనితంబమునకు నలువైపుల నెఱసిన్ను నురుగులతోడి యలల పయ్యాటలాడు పాలసముద్రమును భయవిస్మయామోదంబులఁ గనుఁగొనుచు నెద్దియు నెఱుఁచ కిది నిక్కమా లేక స్వప్నమా యెద్దియును నిశ్చయింపరాదని తలపోయుచుండు నంతలో జ్ఞప్తిదోఁచెఁగి సోమవారము రాత్రి తొమ్మిదిగంటలకామిత్రుఁడయ్యా! తను కొకవిధమగు మూర్ఛ గనుమ్రటనిదివఱకీవైద్యశాలలోఁ దమకుఁ జికిత్సచేయింపఁగా నిప్పటికి దైవకృపచే లభించిన మృతసంజీవినీ ప్రభావంబుచేఁ దమరు పునర్జీవితులై హాయిగానున్నారు మన మాదివారమునయము తొమ్మిదిగంటఁ పుడు మాటలాడుచుండిన సౌధమిచటికి నూఱామడల నున్నది ఆకాశయానమున నూఱువరాలిచ్చి మిమ్మిచటికిఁ దోడ్కొనివచ్చి చికిత్సచేయించినాఁడను దయచేయుఁడు నేఁడు సోమవారము కనయూరికిఁ బోవుద మని నా నివాసమునకు నన్నుఁ దోడితెచ్చినపిమ్మట నాకు స్వప్నజాగరసుషుప్తుల యనుభవము కలిగి నప్పటికి సుషుప్తియనఁ దెలివిలేకుంట స్వప్నజాగరములన నహంకారమమకారముల ననంతవికారములైన నచేతనాచేతన పదార్థములఁ

గని పెట్టుచుంటయని నిశ్చయింపక తీఱదు నా మనస్సు మునిఁగి యున్నపుడు నా కేద్ఞప్తియును లేదు నా మనస్సు పనిగొన్నపుడు నా కహంకార మమకారములు నా దేహము నాకు వేఱగు నానావిధ పాంచభౌతికవికారములను బరికింపఁగల్గితిని కాఁబట్టి జ్ఞప్తియే యొకప్పు డొకవిధమైన తన శక్తిచే ననంతవిధ వస్తుమయమగు జగ మును గనుఁగొనుచున్నది సరే, యాస్మృతియే విస్మృతియగు జగత్తు మఱి విస్మృతియే ప్రకృతియగు త్రిగుణసామ్యము ఈప్రకృతివికృ తుల కాకాశ మితర భూతములకువలె నాత్మ యాధార మని పరమ సిద్ధాంతము.

## ఆత్మశక్తి

"శివశక్త్యాత్మకం జగత్-నాసదాసీన్నోసదాసీత్తమ ఆసీదితి శ్రుతిః-అజామేకాం లోహితకృష్ణ శుక్లాంబహ్వీః ప్రజాః సృజమా నామ్-తయోరేకః స్వాదుపిప్పలమత్తి అనశ్నన్యోఽభిచాకసీతి- ఆనందోహ్యయంపురుషః- నాద్వైతవతః కర్మాణివిధీయన్తే- నేహనా నాస్తికించన- సర్వంఖల్విదంబ్రహ్మ-తజ్జలానితి శాంతఉపాసీత-సదేవేద మగ్రఆసీత్ - తదైక్షత - బహుస్యాం ప్రజాయేయేతి- బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి-యదయంసర్వమాత్మైవఖలుకం కేనపశ్యేత్ -ప్రజ్ఞానం బ్రహ్మ అయమాత్మాబ్రహ్మ-అహంబ్రహ్మాస్మి" నమస్తజగము శివుని యొక్కయును శక్తియొక్కయును స్వరూపమే ఇచట విస్మృతిదశ శివుఁడు స్మృతిదశ శక్తి నామరూపాత్మకమైనది లేదు నామరూప శూన్యమైనదియును లేదు తమస్సన మోహము భ్రాంతియజ్ఞానము శూన్యము మాత్రమే కలదు పుట్టుక లేనిది యెఱుపు నలుపు తెలుపు రంగులుకలది యనేకజనుల సృజించు ప్రకృతి కలదు రెండు పక్షులున్న వానిరెంటిలో నొకటి తినుచున్నది మఱొకటి తినకయే విలసిల్లు చున్నది

ఈపురుషుఁ డెద్దియు నంటఁడు బ్రహ్మజ్ఞానము కలవానికిఁ జేయఁదగిన
కర్మ మెద్దియును లేదు ఇట నేవస్తువును లే దిదంతయు నుత్తత్రి-
ఇదంతయును బ్రహ్మమే యది తనంతఁ బుట్టుచుఁ బెరుఁగుచు లయ
మగుచున్నదని తెలిసియే వికారము ను బొందకుండునది- నామరూప
భేదములేని సత్యపదార్థమై యీజగమంతయును దోల్లి యున్నది.
నామరూపాత్మకమై యీజగముగాఁ దాఁగుట కాపరమవస్తువు నంక
ల్పించెను బ్రహ్మము నెఱిఁగినవాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడు
ఈకనఁబడునదంతయు నాత్మయే కనుక చూచువాఁడెవఁడు? చూడఁ
బడునదెద్ది? చూచునది చూడఁబడునది యీరెండు నొక్కటియే
గొప్ప యొకబ్రహ్మము - ఈయాత్మయేబ్రహ్మము - నేనేబ్రహ్మను
అను వచనములనుబట్టి అద్వైతమతములును ద్వైతమతములు కలిగి
నవి "ద్వైతాద్వైతసమంబ్రహ్మ" ద్వైతమతమునకు నద్వైతమత
మునకుఁగూడ బ్రహ్మము సరిపడినదనుటచే దైవపౌరుషములను సమ
బలములుగా నొప్పుకొనక తీఱదు స్వప్నమునుగూర్చి దైవమును
స్వర్గనరకముల గూర్చి యతీంద్రియ పదార్థముల గూర్చి
యాకాశ పంచాంగములుచెప్పుట, నిద్రాహార విహారసౌఖ్యములను
దనతోడిపాటివారికిఁ గలిగించుటకొఱకును మఱియుఁ దా ననుభవిం
చుటకొఱకును ఎరిగాఁ బాటుపడలేక సోమరులై కాలక్షేపము
చేయు తెలిసీతెలియనివారి వ్యర్థ వాద మనవచ్చును నాస్తికుఁడు
చార్వాకుఁడు బౌద్ధుఁడు చండాలుఁడని తిట్టినఁ దిట్టనీ గాని అప్ర
త్యక్షమగు స్వర్గ నరక చింతచే వ్యర్థ కాలక్షేపము చేయుటకన్న
తనతోడిపాటివారిని సుఖపెట్టి తా సుఖపడుటకొఱకు శక్తికొలఁది
ప్రయత్నముచేయువారే నిక్కపుమనుష్యుఁని సిద్ధాంతపర్చక తీఱదు

పుట్టిన వారందఱుసుఖముగాఁ గోరుచున్నారు బ్రతుకుచుంటకై
స్వభావముగాఁ బ్రయత్నించుచున్నారు స్వలాభము గోరి పాటు

రుల మోసపుచ్చుచు నిద్రాహారవిహారములు యథేష్టముగా నొన
ర్చుచు, పరులకొఱకై పాటుపడుట కొప్పక సోమరితనమున స్వర్గ
నరకములని తిన్నతిండి యరుగుటకై వ్యర్థప్రలాపములఁ గాలక్షేపము
చేయువారు పిశాచములుగాని మనుష్యు లెంతమాత్రమును గారు

తనతోడి జీవులకు న్దపకును సుఖకరములగు నిద్రాహారవిహార
ములకుఁ దగిన సాధన మాలోచింపక హిమాలయ మెప్పుడుపుట్టెనో
చెట్టుముందో విత్తుముందో స్త్రీ పురుషు లొక్కసారి పుట్టిరో లే
కెవరుముందో మఱెవరు వెనుకనో చుక్కలెన్నో యాకాశమున కెంత
పరిమాణమో స్వర్గములో రంభ పుట్టెనో లేక పోదువో పాతా
ళము నందలి భూమినిమోయుచున్న యనంతసర్ప మెన్నిచుట్టలఁ
జుట్టుకొన్నదో భూతభవిష్యజ్జన్మము లెట్టివో నూహింపఁ బ్రాహ్మణుని
సామెతగా నీసోమరితలంపు లెందుకు? భూమి సరిగా దున్నుకొని నీటి
వాగు చూచుకొని సరిగాఁ బండించుకొని సౌఖ్యకరముగా నిండ్లుకట్టు
కొని గాలియెండ వానల బాధను తప్పించుకొను నుపాయములు కన్ను
కొని శరీరసౌఖ్యకరములగు నన్నపానములును దొడవులును సంపా
దించుకొని యొరులఁ సుఖపెట్టి తా సుఖముగా బ్రతుకు తెఱవున పడుచు
టయే జీవితకాలమున ముఖ్యము కారణము లేక కార్యము కలుగ
నేరదు గనుక నీజగము నకారణమయ్యును జగత్కర్తయగు విధి
నెఱుఁగు సామర్థ్యము మర్త్యుల కెంతమాత్రమును లేదు అతీంద్రియ
ద్రష్టలగు మునులు లోకోపకారకముగా రచించిన శాస్త్రములు
“విజ్ఞాతారమరేకో విజానీయాత్” కొరా యున్నటిని దెలిసికొను
పరమాత్మ నెవఁడు తెలియఁబరము? అనునట్లు తెలియఁదరము కాదు
నక్షత్రము లగపడుచున్నవి మునికృతములగు శాస్త్రము లున్నవి కాని
ప్రాకృతులు కాచుక్కలును శాస్త్రములును యథార్థతత్త్వముఁ

దెలియఁబడు టెట్లు? పెద్దల మాటలు విశ్వసించి బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసాశ్రమములు యథావిధిగా ననుసరించిన ధర్మాత్ములకు పరమార్థము తనంత నెఱుఁగఁబడుట 'స్వందేహము నేల విడిచిన సాము కలదా?

## వర్ణాశ్రమధర్మములు

వర్ణాశ్రమధర్మముల నవంద్రోసి మెట్టవేదాంతములు పల్కువారు నిక్కముగఁ జెడుగొట్టులు వర్ణాశ్రమధర్మములు లోకోపకారము కొఱకే మునులచే నియమింపఁబడినవి "భక్తిజ్ఞానాయకల్పతే" భక్తిజ్ఞానమునకు సాధనమను నట్లు లోకోపకారపరులగు పెద్దల వాక్యలను నమ్మినధర్మాత్ములకాత్మజ్ఞానము కలుగును ఆత్మజ్ఞానమునకు ఫలము శాశ్వతానందస్వరూపమగు కైవల్యము జాతులు నీతులు కొద్ది గొప్పలు మొదలగు తక్కినస్థితు లెవ్వి యెట్లున్నను ముఖ్యముగా నొరుల కెవ్విధమైన బాధయు దనవలన రానీక జీవించిన వాఁడే మనుష్యుఁడను మఱియు జగమున కాభరణమును ఏమిమనచేత నైన నొరులను బాధించువాఁడు రక్కసుఁడును మఱియు లోకమునకు రోగమును భూతదయ కల్గియుంటయు సత్యముపల్కుటకన్న స్వర్గాపవర్గ సాధనములు మఱేకర్మములును గావు కులధర్మములును - సత్యదయలలోనే యిమిడియున్నవి

"నాద్వైతవతఃకర్మాణి విధీయన్తే" అహంకారమమకారములు లేనివానికిఁ గర్మములు విధింపఁబడవనెడి శ్రుతిప్రకారము సర్వజగమును విష్ణుస్వరూపముగాఁ జూచుయతులకుఁ దప్పఁ దక్కిన మనుష్యులంకఱకిని బౌరుషము తప్పఁదైవము లేనేలేదు యతులకు దైవము తప్పఁ బౌరుషము లేనేలేదు ఇంద్రియాకృష్టమగు సచరాచరజగమంతయును బౌరుషమే కాఁబట్టి యహంకారమమకారములున్నంతవఱకు లోకోపకారకమగు పురుషప్రయత్నమునఁ బాటు

వద కాకాశవంచాంగములఁ జెప్పుకొను మతాధికారుల మని యును మతాధిపతులమనియును సన్న్యాసులమనియును యోగుల మనియును దైవభక్తులమనియును మతగురువులమనియును శ్రోత్రియుల మనియును యాజ్ఞికులమనియును మంత్రవేత్తలమనియును ద్విజుల మనియును గుడిపూజార్ల మనియును దీర్ఘంకరులమనియును, నిద్రాహార విహారసౌఖ్యముల నొరుల సుఖపెట్టి తాము సుఖపడుతీరుఁ బాటుపడక కృషి వాణిజ్య శిల్పకృత్యముల నారితేటి లోకోపకారమున జీవనముఁ గడపుకొనక స్వార్థపరులై వంచకులై సోమరులై దేవానాంప్రియులై, శశవిషాణవంధ్యాపుత్రప్రాయములగు స్వర్గనరకముల గూర్చి లోకోప కారకముగా సుఖయకారకముగా ధర్మార్థ కామమోక్షములఁ దెల్పు శ్రుతిస్మృతిపురాణముల కపార్థముచేయుచు లోకోపకారకము లగు సత్యదయల నవలఁద్రోసి యాస్తికులమని శంభవేషములతోఁ బామరజనులను బెదరించుచు తమ సుఖముకొఱకై యితరులకు వృథా వ్యయాప్రయాసములఁ గలిగించు నైష్ఠికుల దౌర్జన్యము దా నవశమిల్లినప్పుడుగదా మనుష్యులు మనుష్యులనిపించుకొందురు

లోకులు మిక్కిలి సౌఖ్యముగా బ్రతుకుటకొఱకై మనో వాక్కాయ కర్మములఁ బాటుపడక దైవమును గూర్చియు స్వర్గనరక ములఁ గూర్చి సోదెలు పల్కుచుఁ దేరగా నుబ్బరసొమ్ము తినవెంచు సోమరిపోతు రక్కసిదో దయ్యమో యగునుగాని నిక్కముగ మనుష్యుఁ డెంతమాత్రమును గాఁడు అహంకార మమకారము లున్నంతవఱకును దైవమును గుఱించి సొరకాయలు నఱుకువారు లోక ద్రోహులు మనోవాక్కాయకర్మములకుఁ బౌరుషముతప్ప దైవ మెంతమాత్రమును జిక్కదు కాఁబట్టి యీలోకములోఁ బౌరుషము మాత్రమే యున్నది దైవ మెంతమాత్రమును లేదు దైవశబ్దము వాస్తవముగాఁ గుంటేటికొమ్మతంటిది "లోకమే వేదము, వేదమే

లోకము" అను శ్రుతిచొప్పున శ్రుతిస్మృతి పురాణేతిహాసములు మొదలగు ప్రాచీనవాక్యములన్నియును బురుషప్రయత్నము లోకోపకారకమగు నడువడిం బోధించుచున్నవి గాని పౌరుషమునకు వేఱగు దైవ మనుపదార్థము నెంతమాత్రమును బోధింపలేదు వంచకులు తమజీవనసౌఖ్యముకై శ్రుతి స్మృత్యాదు- కపార్థములు పన్ని లేని దైవమును గల్పించి వృథా వ్యయప్రయాసములకు లోనగునట్లు లోకులం బీడించుచున్నారు స్వర్గనరకములు దేవుఁడు కైవల్యమును వంచకులచే కల్పితములు గాని వాస్తవములు కావు నిత్యసంతుష్ట మనఃస్థితి నొందుటకన్న మర్త్యులు పొందఁదగిన పదవి మఱి లేదు. అట్టి నిత్యసంతుష్టియను కైవల్యపదవి లోకోపకారపరాయణులై భూతదయయును నిష్కపటహృదయమునుగల ధర్మాత్ములకు మాత్రమే లభించును

ఆత్మకు జాగ్రత్స్వప్న సుషుప్తులు క్రీడావిశేషములుగాని నిత్యములును వాస్తవములు నెంతమాత్రమును గానేరవు "సాక్షీచేతాః కేవలో నిర్గుణశ్చ" తామరాకు నంటని జలబిందువువలెఁ దటస్థుఁడును సచ్చిదానందమయుఁడును సత్త్వరజస్తమోగుణము లెవ్వియును లేని వాఁడును నిత్యశుద్ధ బుద్ధముక్త స్వరూపుఁడు నయిన యసంగుఁడు పురుషుఁ డనియుఁ బరమాత్ముఁడనాఁ బరఁగును కలలో ననుభవించిన సుఖదుఃఖములు జాగ్రద్దశలో నబద్ధము లనుకొని యాస్వప్నవికారములను బ్రయత్నపూర్వకముగా మరపుతెచ్చుకొని సుఖించునట్లు లోకోపకారకమగు నడువడియును జాగ్రద్దశలో నహంకారమమకారములను స్వప్నవికారములుగా నిశ్చయించి తన కష్టసుఖములను బ్రయత్నపూర్వకముగా మఱపుచెంది సుఖించు మనుష్యులు నిష్కలి కృతార్థులు లోకోపకారపరాయణులు మాత్రమే స్వప్నవికారములగు నహంకార మమకారములను మఱచి సుఖించువారు.

స్వలాభ మాసింపక పరులకొఱకై పాటుపడెడు భూతదయాపరులు నిత్యానంతసుఖస్వరూపమగు వైకుంఠపదవిం జూఱకొనెదరు

## విద్యలు - కర్మలు

పరులను సుఖపెట్టి తా సుఖపడుటయే నిజముగ విద్యయొక్క లక్షణము అష్టాదశవిద్య లన్నియును బరులను దరింపఁజేసి తాఁ దరించు మార్గమునే బోధించుచున్నవి లోకోపకారముగాఁ బాటుపడు సజ్జనులకు మాత్రమే దేవుఁ డనంతావతారములెత్తి కాపాడుచుండును మఱి యట్టి లోకోపకారపరాయణులగు మహాత్ములు మాత్రమే యష్టాదశ మహావిద్యలకును సప్తకోటి మహామంత్రములకును స్వర్గాది పుణ్యలోకములకును దగిన యధికారులు - యజ్ఞాది పుణ్యకర్మములు - గర్భధానాది షోడశకర్మములు - జపతపములు - తీర్థస్నానోపవాసాదివ్రతములు - వర్ణాశ్రమధర్మములును - బరలోకమును - ధర్మార్థ కామ మోక్ష సాధనములును-సకలప్రాయశ్చిత్తములును గేవలమును స్వార్థత్యాగపరులయి లోకోపకారముగా జీవించు పుణ్యాత్ములకొఱకే ప్రాచీన మహర్షులచే విధింపఁబడెను జనవంచకులై భూతద్రోహ మాచరించు కుక్షింభరుల నిమిత్త మెంతమాత్రమును గాదు బ్రాహ్మణధర్మము జ్ఞానము- క్షత్రియధర్మము ప్రజారక్షణము - వైశ్యధర్మము కృషి వాణిజ్యాదివ్యాపారము - శూద్రధర్మము సకల సజ్జనపరిచర్య- ఈనాలుగు ధర్మములు కలిగి లోకోపకార మొనర్చు వారే కులముఁ గలవారు భూతద్రోహులై వంచకులై కుక్షింభరులైన దుర్జనులెల్ల జాతిభ్రష్టులే-ప్రత్యేకము వీరు బ్రాహ్మణులు-వీరు క్షత్రియులు-వీరు వైశ్యులు-వీరు శూద్రులు నని జనులకు జాతులు లేవు లోకోపకారపరాయణుఁడగు నొక్క సజ్జనుఁడే నిత్యానిత్య వస్తు వివేకదశలో బ్రాహ్మణుఁడై-ధర్మాచరణదశయందు క్షత్రియుఁడై -

కృష్యాదిక్రియా విశ్వాసపరత్వము వైశ్యుండై - బాలవృద్ధ దీనార్త సాధుసేవాపరత్వమందు శూద్రుండై సార్థకజీవనమున చాతుర్వర్ణ్య ధర్మములం గడపుచుండును

స్త్రీజాతి పురుషజాతి యని దేహధారులకు రెండేజాతులు కలవు గర్భముధరించి పిల్లలం గను స్త్రీ యటును కేవలము స్త్రీజాతిలోని వారే సంతానవతులైన స్త్రీ లెట్టివారైనను సర్వలోక వందితలే మఱియును జగదాభరణములే పిల్లలంగాంచుటయే స్త్రీజాతి లక్షణము వంచకులై భూతద్రోహులై కేవల కుక్షింభరులైన మగవారును వంధ్యలు నుభయజాతి భ్రష్టులు.

క ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదం బు పొసరించున స
జ్జనులయినవారి కడంకువ
యును గీర్తియు నవియొ తెచ్చు నుర్వీనాథా!

అనునట్లు పేదవారుకానీ భాగ్యవంతులుకానీ సేవకులుకానీ ప్రభువులుకానీ పిన్నలుకానీ పెద్దలుకానీ యేదేశమందు పుట్టినీ యే జాతివారుకానీ వంచకులై భూతద్రోహులైన కేవల కుక్షింభరులు జగమున కంటుతెవుళ్ళవంటివారు "మీరు బ్రాహ్మణులు మిక్కిలి పవిత్రులు మిమ్ము మే మంటరాదు దయయునోర్పు సత్య శౌచములు మీకుం బెట్టినిసగలు మీపాద సేవకులము మేము మీ కేమిపరిచర్యలు మావలనం గావలెను మీదాసులము మమ్మనుగ్రహించుడు మీశరీర పోషణమునకుం గావలసిన పదార్థములన్నియును మేమే సమకూర్చెదము మీవంటి సజ్జనులు దేహపోషణముకై శ్రమపడుట చూడనొల్ల"మని తమ్ము నితరులు ప్రార్థించునట్లు సంచరించు సుజనులే నిక్కపు బ్రాహ్మణులుగాని జన్నిదములు పిలకజుట్టు విభూతి పెండికట్లు ముష్టిముంత మొదలగు దంభవేషములతో స్వార్థపరులై

వంచకులై భూతద్రోహ మాచరించుకుక్షింభరులు బ్రాహ్మణు లెంత మాత్రమును గారు జ్ఞాన శౌర్య కృషి సేవా ధర్మములతో లోకోపకారపరాయణులై సజ్జనులు శాస్త్రభేదమున జ్ఞాన మధికముగాఁ గలవారు బ్రాహ్మణులు - శౌర్య మధిక భాగము కలవారు క్షత్రియులు - రైతుకృష వాణిజ్యపునేర్పు కలవారు వైశ్యులు - మిక్కిలి పరిచర్యయందు నైపుణ్యము గలవారు శూద్రులు లోకోపకారపరాయణులగు నీ బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు సమాన గౌరవమర్యాదలు గలవారే కాని యొకరికంటె నొకరు శ్రేష్ఠులుకారు తక్కువను గారు నిశ్చయముగా బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర జాతులు - గౌరవ మర్యాదలకు సమానములే - ఒక్క మనుష్యునియందే జ్ఞాన శౌర్య కృషి సేవాధర్మములఁబట్టి ప్రతిక్షణమం దతఁడే బ్రాహ్మణుఁడై క్షత్రియుఁడై వైశ్యుఁడై శూద్రుఁడై యొప్పుచుండును "సూచయంతి ఫలం మనీషిణః । కోవక్తా తారతమ్యస్య తమేకం వేధసంవినా"। విద్వాంసులైన వారే కాలమెట్లుండునో మొత్తము ఫలమును భావించెదరు కాని యీసంగతి యీక్షణమున జరుగును మఱి యీవస్తుతత్త్వ మిద్ది యని నిశ్చయించి చెప్పుటకు బ్రహ్మకుఁ దప్ప నితరుల తరముకాదనునట్లు వేదశాస్త్రప్రవర్తకులు నతీంద్రియద్రష్టలు నగుమునులమాత్రము నిశ్చయముగా దెలిసికొనుటకుఁ బ్రాకృతజనులకు శక్య మెంతమాత్రమును గాదు.

"గతాను గతికో లోకః" లోకు లొకరినిఁ జూచి యొకరు నడుచుచున్నారన్నట్లు సత్యమును స్వతంత్రముగాఁ దెలిసికొనుట మునులకుఁ జెల్లునుగాని పామరులు పావనము చేవస్తుతత్త్వము నెఱిఁగి నడువ లేరు అతీంద్రియద్రష్టలగు మునులకుఁ దప్పఁ దక్కవారికి దెల్వితేటలు సహజసిద్ధములు కావు సూర్యబింబమునకు ప్రకాశము సహజముగాని తక్కిన పదార్థములయందలి ప్రకాశ

మెరుపుగొన్నదే కదా? పాంచభౌతికమగు నిజ్జగమున ఖగోళతత్త్వమును
భూగర్భాంతరతత్త్వమును నివాక్కులంబట్టి యూహింపవలయును గాని
నిశ్చయించి ప్రత్యక్షముగాఁ సమగ్రముగాఁ దెలియరాదుగదా? వేద
శాస్త్రాధ్యయనముచేతను గురుబోధచేతను స్వానుభవముచేతను
పదార్థతత్త్వమును గ్రహించి నమ్మక మూఁతచేసికొని నేఁటివఱకు
సూర్యుఁడు పన్నెండు గంటలకాలములో నుదయించి యస్తమించు
చున్నవని జ్ఞానవంతుఁడు పల్కుచున్నాఁడు కాని యిద్ది యిట్లు
జరుగును నే నీపని చేసి చూపించెదను వాయిద్దానపారమార్థికకా
ర్యము జరిపెద నని వివేకియైనవాఁ డెవ్వఁడును ధైర్యముగా నిశ్చ
యించి చెప్ప సాహసింపనేరఁడు స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థలకు
లోనైన ప్రాకృతజనులకు సంపూర్ణజ్ఞానము స్వభావము కాదు వేద
శాస్త్రప్రవక్తలు నతీంద్రియద్రష్టలగు గౌతమవ్యాసాదిమునులు విజ్ఞాన
మూర్తులు ప్రాకృతజనులవలెఁ జర్మచక్షువులం బాంచభౌతికశరీర
ములతో మాత్రము గానేరరు "అశరీరమాత్మ" పాంచభౌతికశరీరము
కాని పదార్థము మాత్మయనుటచే యథార్థజ్ఞానము పాంచభౌతికశరీర
మున నెంతమాత్రమును బొడమదు పాంచభౌతికశరీరములతో నున్న
ప్రాకృతుల తెలివి ప్రతిబింబమువలె సత్యాసత్యము మఱియును నిజ
మునుగా దబద్ధము గాదు చీఁకటినీడలవలె నగపడీ యగపడదు తోఁచీ
తోఁచ దుండీ లేదు కలవలె భ్రాంతిమాడ్కి దిగంతరేఖకరణి మోస
మునకు మూలము తెలివికి లక్షణము చెదని సంతుష్టి మఱి యట్టి
సంతుష్టి సంపూర్ణవిశ్వాసముచేఁ గలుగును సంపూర్ణవిశ్వాసము
మంచిసహవాసమునఁ గొనసాగును భూతదయగలవానికి మంచిసహ
వాస మబ్బును పరోపకారమునకై ప్రవర్తించువానికి భూతదయ
కల్గును స్వార్థత్యాగపరులు మాత్రము లోకోపకారపరాయణు
లయ్యెదరు జ్ఞానవంతులు స్వార్థత్యాగపరు లగుదురు. జ్ఞానము గుహ

కటాక్షముచేతను మఱి యీశ్వరకృపచేతను గలుగును గురు వనఁగా మఱియు నీశ్వరు డనఁగా లోకోపకారపరాయణులై ధర్మాత్ములై పరమపవిత్రచరిత్రులయిన తలిదండ్రులు

“నమాతుః పరదైవతమ్” తల్లికన్న వేఱే వేల్పు లేదు “నగురుః పితరం వినా” తండ్రికన్న గురువు మఱెవఁడు లేఁడు “జననీ పరమో గురుః” తల్లియే శ్రేష్ఠగురువు “మాతృదేవోభవ పితృదేవో భవ, ఆచార్యదేవో భవ” అనుటచేఁ గని పెంచిన తల్లిదండ్రులు, విద్యచెప్పిన గురువును ప్రత్యక్ష దేవతలు “ఆగమాః ఖలు దుర్లభాః” శాస్త్రములు సంపూర్ణముగాఁ దెలిసికొన నెవ్వరికిని శక్యముకాదనుటట్లు శ్రుతిస్మృత్యాదులు తెలియ శక్యముకాదు కాఁబట్టి ఆప్తులు గురువులు ప్రాణబంధువులు మిత్రులు పెద్దలుతనకుఁ జేసిన యుపదేశమును దృఢముగా విశ్వసించి ప్రాణిహింస నేమివచ్చినను సలుపక లోకోపకారపరాయణుడై స్వలాభ మాసింపక నడుచు మానవుని వర్తనము నిశ్చయముగా మనుష్య ధర్మమునకు నిదర్శనము జగమునందు నిష్ప్రయోజనముగా మనోవాక్కాయ కర్మము లెవ్వియును జరుగవు సకలజగత్సృష్టిలయములు సర్వజ్ఞుఁడగు భగవంతునిచేఁ గనింతయు నిష్ప్రయోజనముగా నడిపింపఁ బడవనియే నియూఢిగా విద్వాంసులు సిద్ధాంతీకరింపక తీఱదు “ప్రయోజన మనుద్దిశ్య నమందోఽపి ప్రవర్తతే” ప్రయోజనములేక వెఱ్ఱివాఁడును ప్రవర్తింపఁ డనఁగా సర్వశక్తియు సర్వజ్ఞుఁడు సకల భూతదయాస్వరూపుఁడు సకల జగత్సృష్టిస్థితిలయకారణమగు దేవుఁడు ప్రవర్తించునా? మర్త్యులూహింపనేరరు కాని భగవంతునిచేఁ బ్రతి కార్యము నెద్దియో ప్రయోజనాపేక్షచేతనే నిర్వర్తింపబడుచున్నది ఈపని పొరపాటుచేఁ గావింపఁబడుచున్నదని కాని యిది నిష్ప్రయోజన మనికాని యిద్ది కొఱంతయనికాని యద్ది యనవసరమనికాని దైవ

సృష్టిలో నెట్టి విద్వాంసులైనను తప్పుపట్టుట కవకాశ మొకింతయు లేదు నిశ్చయముగా జరుగవలసినట్లే సమస్తమును జరుగుచునే యున్నది మంచిచెడ్డలు హెచ్చుతగ్గులు వశ్యావశ్యములు భగవత్సృష్టిలో లోపములెంచు మనుష్యులు నిశ్చయముగా బుద్ధిహీనులు "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలా నితిశాంత ఉపాసీత" ఈజగమంతయును బ్రహ్మమే ఆబ్రహ్మమే పుట్టుచున్నది లయమగుచున్నది బ్రతుకుచున్నది "హరిమయముకాని వస్తువు పరమాణువు లేదు వంశపావన వింటే" ఓ కులపవిత్రుఁడా వింటివా? బ్రహ్మముకాని పదార్థ మెద్దియును లేదనునట్లు సమస్తమును దైవకృతమేకాని నిశ్చయముగాఁ బౌరుషమే లేదని సిద్ధాంతీకరింపకతీఱదు "జానామి ధర్మం నచమే ప్రవృత్తిర్జానామ్యధర్మం నచమే నివృత్తిః । కేనాపి దేవేనహృదిస్థితేనయథా నియుక్తోఽస్మి తథాకరోమి" ధర్మము నే నెఱుఁగుదునుగాని ధర్మమార్గమున నడువఁజాలను అధర్మమని యెఱిఁగియును మానలేను. నాహృదయమం దున్న దేవుఁ డెట్లు నన్ను నియమించుచున్నాఁడో యటులు చేయుచున్నానన్నట్లు సకలజంతువులవశములై దైవనియుక్తములై సకలక్రియ లాచరించుచున్నవి పౌరుషము కుందేటికొమ్మువలె నసంభవము. సమస్తమును దైవమే. పురుషప్రయత్న మనునదికూడ దైవకృతమే "యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా" ఏపదార్థమును తనకన్న నితరములు జూడఁడో వినఁడో యెఱుఁగఁడో యద్దియే వాస్తవమగు బ్రహ్మమన్నట్లు దైవముకన్న మఱి వేఱు వేఱేది? తత్త్వమిట్లుండనీ- "నాద్వైతవతః కర్మాణి విధీయన్తే" అద్వైతికిఁ జేయఁదగు కార్య మెద్దియు లేదు ఏకోర్క్కాయుతేక నిత్యసంతృప్తుఁడై నిర్లిప్తుఁడైన బ్రహ్మజ్ఞానికిఁ గల మనోవాక్కాయకర్మములు పురిటిపిల్ల చేష్టవలె బంధకములును పాపకృత్యములు ఎంతమాత్రమును

గావు- మనోవాక్కాయకర్మములచేఁ దెలుప నశక్యమై యాత్మైక
వేద్యమై సత్యజ్ఞానానంతలక్షణమగు పరమహంసస్థితి యటుండనీ
ప్రస్తుతము సకలానుభవసిద్ధమై వ్యావహారికసత్యమగు ద్వైతప్రపంచ
మును గూర్చి చర్చించి చెప్పుట కర్తవ్యముగనుక దైవపౌరుషములు
భయముల సమానముగా వ్యవహారప్రవర్తకము లనకతీఱదు

పౌరుషము గుఱ్ఱము దైవమురౌతు - పౌరుషము శరీరము
దైవము తెలివి - దైవపౌరుషము లు రెండును జేర కే కార్యమును జరు
గదు- తాన తన కితరమను ద్వైతబుద్ధి యున్నంతవఱకు దైవపౌరు
షములు రెండును కావలసినవే- కేవలాద్వైతజ్ఞానికి దైవపౌరుషములు
రెండును లేవు - దైవపౌరుషములు రెండును వ్యావహారికసత్యములు
గాని పారమార్థికసత్యము లెంతమాత్రమును గావు "బ్రహ్మ సత్యం
జగన్మిథ్యా" బ్రహ్మము వాస్తవము జగత్తు కలవలె భ్రాంతికృతము
గాని సత్యము కాదనునట్లు దైవపౌరుషముల నడుచువ్యవహారము
ప్రాణధారణ మదకారణముగాని వాస్తవ మేమాత్రమును గాదు
ఇంతకును "గజమ్మిథ్యా పలాయనమ్మిథ్యా" ఏనుగు వాస్తవము
కాదు మఱది పరిగెడుటయును వాస్తవముకాదనుటచే నిద్ది సత్యము,
మఱిద్ది మిథ్య యనుటకూడ భ్రాంతికృత మనకతీఱునా? ఈపిచ్చితలం
పులకేమి తనయనుభవమునకు విరుద్ధముగాఁ బలుకుట లోకద్రోహ
మాచరించుటకదా ? కావున లోకోపకారకమగు ధర్మ మాచరింపక
మెట్టవేదాంతములు పల్కుట వ్యర్థమగుటయే గాక లోకమునకుఁ గీడు
చేయుటకూడ తప్ప కగును "పురిశేరతఇతిపురుషః" పురియందు
శయనించువాఁడు గనుక పురుషుఁడు గనుకఁ బంచభూతాత్మకమగు
శరీరము నడుపు జీవుఁడు పురుషుఁ డనిపించుకొనుచున్నాఁడు మఱి
యట్టిపురుషుఁడు చేయునది పౌరుషము - పంచభూతములను నడిపించు
వాఁడు దేవుఁడు మఱి యట్టిదేవుఁ డొనర్చునది దైవము శరీరబద్ధుఁడు

జీవుఁడు మఱి "అశరీరమాత్మా" ఆత్మకు శరీరము లేదనుకట్లు దేవుఁడు పాంచభౌతికశరీరరహితుఁడై నిత్యముక్తుఁడై యున్నాఁడు. కాఁబట్టి వ్యవహారమున జీవేశ్వరులు భిన్నులు - ఇదిట్లని నిర్దేశింప నశక్యమగు పరమార్థదశనుగూర్చి వృథాచర్చ మాని జీవేశ్వరభేద మొప్పుకొని ప్రపంచమున లోకోపకారముగ బ్రతుకుచు సకలలోకోప కారకములగు కార్యము లొనర్చుచు జీవించువలెను. కష్టముల మాన్పి రక్షించుమని దేవుని భజించుమనుటయే జనులకవశ్యకర్తవ్యము గనుక లోకోపకారముగ నుపయోగించు పౌరుషమునకు నూటికిఁ దొంబది తొమ్మిదిపాళ్ళు దైవము తోడుపడునని సిద్ధాంతీకరింపవలయును బ్రతుకున మనస్సంతుష్టియే ఫలముగనుక లోకోపకారముగా నడుచుజనులకు దైవము తోడై నిత్యమనస్సంతోష మను కైవల్యముగాఁ బరిణమించును ఇతరులయెడ పౌరుషహానిమగుఁ దా మంచిగా నడిచినపుడు దైవస్వరూపులగు నితరులు తనకుఁ దోడుకాక మానరు ఒకవేళ నితరులు తనమేలునకు బదులు కీడొనర్చినను కేవల పరోపకారోద్దేశముతో మాత్రమే బ్రతికెడు తనకుఁ బ్రతికూలదైవముకూడ ననుకూలముగానే క్రమముగాఁదోఁచి నిత్యసంతుష్టికలుగఁజేయక మానదు

లోకోపకారపరాయణబుద్ధి మహిమము చీకటిని స్వస్వరూపముగా మార్చుకొను సూర్యప్రకాశమువలె భూతప్రదోషాలనుగూడ మంచిగాఁజేసి నిత్యసంతుష్టమై తాఁ దరించి లోకమును దరింపఁజేయక మానదు ఎవరు లోకోపకారము చేయఁజాలుదు రనఁగా "అనభిలషితాశకంతపః" కోరకయే లభించినపదార్థమును భుజించుట తప స్సనఁబడును గనుకయథాలాభసంతుష్టిఁగలిగి వ్యసనములులేక దేహధారణమాత్రోపయోగములగు నన్నవస్త్రములు కాయక్లేశముతో న్యాయముగాఁ బరులఁ బీడింపక సంపాదించుకొని యుక్తట

మాలిన పెద్దభోగము లొల్లక తమ కులమర్యాద నతిక్రమింప యేజంతుహింసయుం జేయక పరుల కెల్లవిధములఁ దోడ్పడుచు సోమరులుగాక త్రికరణశుద్ధిగాఁ దమతోడిపాటివారికి మే లెల్లపుడును గోరువారు లోకోపకారు లనఁబడుదురు - అట్టి లోకోపకారపరాయణు జీవనముమాత్రమే సార్థకము లోకోపకారులగుజనులకు దైవము తోడగును దైవానుగ్రహముపొందిన గుఱుతు మనస్సంతుష్టి - సంతుష్టుఁ డీమూఁడుజగములఁ బూజ్యుండు లోకోపకారపరాయణుల మహత్వమంతయును దిక్కాలి యొప్పె. "శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః। పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" కోటిగ్రంథములచేఁ జెప్పఁబడినదంతయు సగముపద్యములోఁ బల్కుచున్నాను. పరుల కుపకారముచేయుట పుణ్యము - పరులను బీడించుట పాపమనినట్లు పరోపకారముగ బ్రతికినబ్రతుకే స్వర్గము మఱియు లోకులబాధించిన జీవనమే నరకము "గీ॥ ఉత్తముఁడు హితము చేయుచు నూరకుండు। మధ్యముఁడు హితముచేయుచు మాఱువేడకు। అధముఁ డొరు చేయు హితమైన నడఁచి పుచ్చు। హితమునకు నగ్గుచేయువాఁ డెవ్వఁ డగును। అనునట్లు తాము కష్టపడియైనఁ బరులకు మేలుచేయు లోకోపకారపరాయణుల యెడఁ మాత్రమే దేవుడు సంతతము ప్రత్యక్షముగును పరులను బీడించక తాముసుఖపడఁగోరువారికి దేవుఁడు దృశ్యాదృశ్యముగ నుం-డును ఏమియుచేసి నను తమతోటిపాటిజనులను బీడించువారి కెప్పటికిని దేవుఁడు తోడ్పడఁడు

కేవల పరోపకారమునకుమాత్రమే బ్రతికిన జగద్గురు శంకరా-చార్యాది మహాత్ములు నిత్యసంతుష్టపదవియగు కైవల్య మందెదరు లోకద్రోహ మాచరింపక రాజ్యభోగ మనుభవించిన విక్రమార్కాది మహాపురుషులు ప్రతిక్షణము క్రొత్తక్రొత్తసుఖములిను నిత్యస్వర్గ

భోగము లనుభవించెదరు లోకులఁ బీడించుచు ఘాతహింస గావిం
చుచు సుఖపడ నెంచు పామరులు దోమలు నల్లులవలెఁ బుట్టుచు
గిట్టుచు తాపత్రయములఁ జిక్కి యపారసంసారసముద్రమున మునిఁ
గేలుచు క్షణికసుఖము ననుభవించుచుందురు అద్వైతజ్ఞానవంతులగు
మహాత్ములకు దైవపౌరుషములు (చంటిపిల్లలకుఁ బుణ్యపాపములవలె)
రెండును లేవు. లోకోపకారపరాయణులగు పుణ్యాత్ములు తమపౌరు
షము ఫలించుటకై దైవసాహాయ్యమును గోరుచుందురు లోక
ద్రోహులగు పాపాత్ములు తమదుష్ప్రయత్నములు నెఱవేఱనపుడు
దైవమును దూఱుచుందురు మఱియును తమపౌరుషము చెల్లనప్పుడు
దైవము నొకింతయును స్మరింపక తమప్రజ్ఞ చాటుకొనుచుందురు
అహంకారమమకారమగ్నులగు స్వార్థపరులు లోకులను వంచించు
టకై దైవముయొక్కయునికిని వర్ణించుచుఁ గొంగజక్కలవలె
జపావముగా సంచరించుచు రుద్రాక్షపిల్లులవలె నాటకములు వేయుచుఁ
దొంగజపములు చేయుచుఁ గైకిఁ బుణ్యాత్ములవలె నగపడుచుఁ లోక
ద్రోహ మాచరించుచుఁ దాము చెడి యొరులఁ జెఱచుచుందురు
జ్ఞానమున్నగుఱుతు వైరాగ్యము తనతోటిపాటివారిని బీడించి తా
సుఖపడఁగోరుట పరమపాతకలక్షణము.

పౌరుష మనఁగా బురుషునితో సంబంధించిన గుణము. పురుషుఁ
డనఁ బురిలోనుండువాఁడు. పురము శబ్దస్పర్శరూపరసగంధబుద్ధి
మనోఽహంకారములు నెన్మిది విధములుగా నున్నది. ఈ యెన్మిది
పురములకుఁ బరమైనది దైవము. దైవవశమున నీయెన్మిదిపురములకుఁ
ప్రవృత్తినివృత్తులు కలుగుచున్నవి. దైవపౌరుషములకుఁ బురుషుఁడు
సాక్షిమాత్రుఁడు మఱి యారెంటిటితో నంతమాత్రమును సంబంధ
ములేనివాఁడు దైవమన ననాది ప్రాంచభౌతికకర్మము. పౌరుషమన
ననాది జీవకర్మము పురుషుఁడు పద్మపత్రాంబువ న్నిర్లిప్తుఁడు. సకల

కర్మములను సమస్తజగమును సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతి
స్వరూపము అనంతసంఖ్యాకిరణములప్రోవగు సూర్యబింబ మొక్క
టియై తోఁచునట్లు ఒక్కముగా ననంతవిధ పరమాణుధర్మము
లన్నియును గలసి యొక్క తెలివియై గన్పట్టుచున్నది ఒకసూర్య
కిరణమే నానావిధవర్ణములు నున్నట్లు తెలివియు ననంతవిధములై పొడ
గట్టుచున్నది తెలివికిఁ బ్రకృతియును బ్రకృతికి జీవుఁడును జీవునికిఁ
బురుషుఁడును ప్రవృత్తినివృత్తిహేతువులై యున్నారు

పురుషుఁడు పరమాత్మ-జీవుఁ డాత్మ-ప్రకృతి చైతన్యజడముల
కెడింటియొక్క కలగల్పు ప్రకృతికిని జీవాత్మపరమాత్మ కును నీడ
వంటిదై కలవలె మఱి యాకసపునల్పువలె భ్రాంతిగాని వాస్తవ
మెంతమాత్రమును గాకున్నను శూన్యమగు నాకాశము జగముల
కాధారమైనట్లు ప్రకృతిని మఱియును జీవాత్మపరమాత్మలను నిరూ
పించుటకును మూలమగుచున్నది భూతద్దమువలె గారడిదివ్వెవలె
కలగనుమనస్సువలె మదోన్మత్తస్థితివలె నిక్కముగాఁ దెలివి భ్రాంతి
సంశయములను గలిగించనేరదు తత్త్వము లనంతవిధములగా నిశ్చ
యించి మతము లనంతవిధములుగా లోకోపకారమునకై మతము
లేర్పఱిచిరి వాస్తవముగా నొకజీవునిలో నన్నివిధముల కర్మములు
ధర్మములు మతములును గలవు నిక్కముగా స్వప్నమువలెఁ దెలివి
కొక ముక్క మొకయును లేకుగాని సర్వావస్థలను గనిపెట్టు సాక్షి
యొక్కఁడే కేవలుఁడు నిర్గుణుఁడు చేత స్వరూపుఁ డగునాత్మ
యొక్కఁడే యని సర్వవేదాంతసిద్ధాంతమనఁబడు మొత్తముపై
ననంతమతములసారము పదేనుగా విభజింపఁబడినది

## చార్వాకమతము

చార్వాకమతము ‘యావజ్జీవం సుఖం జీవేన్నాస్తి మృత్యో
ర్గోచరః, భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః” “బ్రతికినంత

వలెనను హాయిగా బ్రతుకవలెయును. మృత్యువునకు లోఁబడని దెద్ది
యును లేదు. బుగ్గియైన దేహము తిరిగి రానేరదు" అని పలుకుచున్నది
సుఖముగా బ్రతుకుటకైకదా జీవులందఱును బ్రయత్నపడుచున్నారు?
కోరినట్లు జరుగుటయే ప్రతిజీవునకు సుఖము. నిద్రాహారములు కోరి
నట్లు లభించినప్పుడు జనుఁడు సుఖించుచుట యనుభవసిద్ధమేకదా?
ఎందఱు జీవులో యన్నిరకముల కోర్కెలు మఱి యన్ని విధముల నిద్రా
హారవిహారసౌఖ్యములును లోకమునఁ గనఁబట్టుచున్నవి. ఒకరిసుఖ
మింకొకరి సుఖము కాదు. మఱి యొకరికోర్కె యింకొకరికోర్కె
కాదు. అనంతవిధజీవులకనంతవిధసౌఖ్యములు అనంతవిధదేశస్థితు
లనుబట్టి సుఖాభిలాషలనంతవిధములు. దేహధారులందఱును నానా
దేశములలో నానావిధ సంఘములనుండుటచేత నాయాజనులాయా
సంఘములకు సమ్మతములయినట్టి తమకోర్కెలను మాత్రమే తీర్చు
కొని సుఖింపవీలగును గాని తనతోటిపాటిజనులకు వ్యతిరేకముగా
నడచి తనకోరికఁ జొప్పున సుఖించుట కెంతమాత్రమును సాధ్య
పడదు. ప్రతికూలించిన స్త్రీతో సంభోగసౌఖ్యము చేకూరదుగదా
తనయభీష్టమునకుఁ దనతోటిపాటిజనులు సమ్మతించునట్లు సమయము
దరిగూర్చువస్తువు దేవుఁడో దయ్యమో యెద్దియో లోకాతీతపదార్థ
ము లేనిచో సుఖాభిలాషముతోఁ బ్రయత్నపడుజనులు మొత్తముపైఁ
దమ్ము బతుకున నూటికిఁ దొంబది తొమ్మిదిపాళ్ళు దుఃఖమే యనుభ
వించుచుంట ప్రత్యక్షసిద్ధమేకదా? కాబట్టి పురుషప్రయత్నమును
కష్టతగులు సమయమునుండుట యంత తెలిఁగినసంగతియే. మఱియును
చార్వాకులు చావుపుట్టువు సమయములు యథార్థములని యొప్పుకొను
చున్నారుకదా 'మరణం ప్రకృతిశ్శరీరిణాం వికృతిర్జీవనముచ్యతే
బుధైః" మరణపర్యంతమే వాస్తవము మఱి బ్రతుకు నీడవలెఁ గల్ల
యనుచు జ్ఞానాచార్యులు సత్యముగా దేహములు నశించెడి దేనను

యము యథార్థ మని యొప్పుకొనుచున్నారో యాసమయమునే దైవ
మనియును మఱి యట్టికాలస్వరూపమగు దైవము పౌరుషరూపమగు
జీవితకాలమునకు భిన్నమై సత్యమై యున్నదని చెప్పఁగలేఁడు కాఁబట్టి
చార్వాకులుగూడఁ బౌరుషమునేగాక దైవము నొప్పుకొనుచుంట
కూడ. ఇత్తలమందు నత్తలమందును మోయఁగలనుగాని పుట్టెడు
మోయలేనను మూఢునిచందమున మృత్యువునొప్పుకొనుచు దైవ
మును జార్వాకుఁ డొప్పకున్నాడు మఱియును గాలి యగ్ని నీరు
మన్నుల కలయిక యొడయికలచేఁ గలిగిన దేహములందుఁ జైత
న్యము మదవికారమువలెఁ బుట్టి గిట్టుచున్నదిగాని సత్యము కాదను
చార్వాకుని కానాల్గుభూతములపరమాణువు లొకదానికొకటి వేరగు
టకుఁగాని యొకదానితోనొకటి చేరుకొని యొడఁబడుటకుఁగాని యవ
కాశము, గాలి యగ్ని నీరు మన్నులకు వేఱయి యంతరాళ
ముగా నాకాశ మున్నదని యొప్పుకొనకుంట తాను లేనని
నోటను జాటు వచ్చివాని పల్కు కాదా? అంతరాళము లేనపుడు
భిన్నవస్తువులకు సంయోగము సాధ్యములుకదా? గాలి యగ్ని
నీరు మన్నుల నిద్ది కేవలము గాలి యిద్ది కేవలము అగ్గి యిద్ది కేవలము
నీరు మఱి యిది కేవలము మన్ను విభజించి యా కుతార్కిక శిరో
మణియగు చార్వాకుఁడు నిశ్చయింపఁగలఁడా? లేక ఇతరుల దేహ
ములు భస్మమగుట తాఁ జూడఁబట్టి యనుమానప్రమాణముచేతఁ
గదా తన దేహముకూడ నట్లే యగునని నిశ్చయపర్చుచున్నాఁడు.
తనకుఁ బ్రత్యక్షముకాని తన మృత్యువు ననుమానప్రమాణముచేత
యథార్థమని నమ్మికొని స్థిరపర్చిన ట్లామృత్యుస్వరూపమునే దైవ
మనియును సకలలోకసంహారకము యును నాశరహిత మనియును,
సకల పౌరుషశాసక మనియును మఱి యచింత్య మహిమాన్విత
మనియు నొప్పుకొనకుంటచేఁ దన కప్రత్యక్ష మగుటచే దా నవలెఁ

బుట్టెనో తలిదండ్రు లెవరో తన్నెవ్వరు పెంచిరో తనకు లోకజ్ఞాన మెవరు గఱపిరో తనకు నితరులకును సంబంధ మెట్టిదో యితరుల యెడఁ దా నెట్లు నడిచినయెడల దన నిద్రాహారవిహారసౌఖ్యము లభించునో తెలియక సకలజనసంఘమునకు వేఱువిత్తయి దుఃఖము నకును గష్టము కును పాలయి మృతిఁ లోనగుచున్నాఁడు గనుక స్వసుఖాభిలాషియగు చార్వాకునిమతము సకలలోక విరుద్ధమగుటయే గాక, దుర్బుద్ధిమూలక మని నిరసించిపలికితిమి. సంఘములోఁ దా నున్నంతవఱకు సంఘమును తన సుఖదుఃఖము లేర్పడును. సంఘము నకు విషము తనకు విషము సంఘమునకు నమృతము తన కమృతము తన మంచిచెడ్డలు తన సుఖదుఃఖములు తనకు లోకము మప్పిన యవిగాని తనంతటఁ దా నెఱిఁగినవి కావుగనుక జనసంఘమునకు విరుద్ధము గా సుఖింపఁదలఁచిన చార్వాకుఁడు మదమత్తునివలె నహం కారవిమూఢాత్ముఁడై కోరి సంసారాంధకారమున సకలజనసంఘా చారవిగర్హితుఁడై చిక్కి దరిఁగానని దుఃఖమునకుఁ బాలై యాభాస సుఖమునకుఁ బిల్లికాయవలె నుబ్బుచు గ్రుళ్ళుచు ట మిక్కిలి శోచ నీయము

లోకాయతికులను వేఱొకపేరు చార్వాకులకుఁ గలదు చార్వాకు లనఁగా హితవుగా మాట్లాడువారు లోకాయతికు లనఁగా ధర్మమోక్షముల విడిచి యర్థకామములమాత్రము సంపాదించు కొనువారు "విజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యే వాను వినశ్యతి" గాలి నీరు నిప్పు మన్నులనుండి తెలివియే మూర్తి గాఁగల జీవుఁడు పొడమి మఱి యాభూతములకూడిక చెడినతోడనే నశించుచున్నాఁడు మృతుఁడైన జీవునకు మఱి జ్ఞప్తి కలుగనేరదు" అను వచనానుసారముగా చైతన్యముతోఁ గూడిన దేహమే యాత్మ దేహమునకు మించి యాత్మయనునది వేఱుగా లేదు పంచేంద్రియ

గోచరమే వాస్తవముగాని యనుమానోపమాన శబ్దములను తక్కిన ప్రమాణములచే సాధింపఁబడిన వస్తువు సత్యముకాదు ఈసంసారములో సుఖములు దుఃఖమిశ్రితములు గనుక ననుభవింపరాదనువారు, దంచి యూఁక తొలఁగించ దుఃఖమున్నదిగనుక బియ్య మనుభవించు సుఖ మక్కరలేదనువారివలెను, పెచ్చు బెంక కుబుసములు తొలఁగించు శ్రమకోర్వక పనసపండుతొనలు తిననొల్లని వారివలెను మూర్ఖులు అగ్నిహోత్రము- మూఁడు వేదములఁ బఠించుట- సన్యసించుట బూడిద బూసికొనుటయును పౌరుషమును బుద్ధియును లేనివారి జీవనవృత్తులు కాఁబట్టి ముండ్లు గ్రుచ్చుకొనుట మొదలగు వేదనములవలనఁ గలిగిన దుఃఖమే నరకము ప్రజలనేలు రాజే జగమున నీశ్వరుఁడు చావే మోక్షము ఆత్మకు శరీరమునకును భేదమెద్దియును లేదు నేను నాశరీరమనుకొనుట రాహువునకు రాహుశిరస్సునకు సూర్యునకు సూర్యబింబమునకు బంగరు కుంగరుకడెము నకువలెఁ గల్పింపఁబడిన భేదము వాస్తవముకాదు గాలి యగ్ని నీరు మన్ను లీనాలుగే భూతము లాకాశ మనున దింకొక భూతమైదవది లేనేలే దీనాల్గుభూతములనుండి చైతన్యము మద్యపానమునఁ గల్గు వికారమువలెఁ బొడముచున్నది "అగ్ని రుష్ణో జలం శీతం శీతస్పర్శ స్తథానిలః, కేనేదంచిత్రితం తస్మాత్ స్వభావా త్త ద్వ్యవస్థితిః" అగ్నికి వేఁడి, నీటికి చల్లదనము, గాలితాఁకునకు చల్లదనము స్వభావజన్యములు గాని యెవనిచేతను గల్పింపఁబడ లేదు"

మఱి యీచార్వాకమంతయును బృహస్పతియను పండితుని మతము మఱి యీమతములోని సారము స్వర్గము లేదు, మోక్షమును లేదు వర్ణాశ్రమాదుల క్రియలన్నియును సఫలములు కావు జ్యోతిష్టోమమందు చంపఁబడినపశువు స్వర్గ కేఁగినచో యజమానుని తండ్రి యట్లు చంపఁబడి స్వర్గమున కేలఁ బోరాదు? శ్రాద్ధముచేత

మృతులకు, తృప్తియైనయెడల వంటింట భోజనపదార్థములు సిద్ధమై
యున్నవని వినినమాత్రమున నాకలిదప్పులు తీఱునా? మృతుండు
పరలోకమందున్నచో ప్రాణబంధువులను జూచుట కాసతోఁ దిరిగి
తేల రాఁడో? బ్రాహ్మణులు తమజీవనోపాయముగా శ్రాద్ధకర్మము
లను బన్నిరింతియేకాని వేఱుకారణ మెద్దియు న్లేదు- సిగ్గులేని
మొండిబండలు మోసకాండ్రును దయాదాక్షిణ్యములులేని రాకాసు
లును 'జర్ఫరీతుర్ఫరీ' యను నర్థములేనివాక్యములతోను మఱి యశ్వ
మేధమందలి బూడబూతులతోను బరుహింసచేసి యామాంసముఁ
దినుటచేతను బ్రవర్తించుచుంట కనిపెట్టి దయానిధియగు బృహస్పతి
సర్వభూతానుగ్రహముగా నొరుల సుఖపెట్టి జనులు తాము సుఖపడు
టకై యీచార్వాకమతమును బోధించెను సర్వజనులకు దమ బ్రతు
కున సుఖము సహజముగాఁ గోరుచుండుటచేతను మఱి యాసుఖముతన
తోడిపాటివారికి సుఖమగునట్లు తాము నడిచినప్పుడే చేకూరుచుండుట
చేతను, మోసగాండ్రై స్వార్థపరులై కాయకష్టమున కోర్వక తనతోడి
పాటివారు హాయిగానుంట కోర్వక పురాణవచనములకుఁ బండి
తమ్మన్యులై బూకరితనమున నపార్థములు చెప్పి నిర్దయులై వేద
చోదితమనియును విధ్యుక్తమనియును చెప్పేది యొకటి తాము చేసేది
మఱొకటిగా నటించు దుర్మార్గులు చార్వాకమతము నాస్తికమత
మనియును నిక్కలి హేయమనియును జాటుచుంట మిగుల శోచ
నీయము- స్వర్గనరకములు గగనారవిందముల మాటలు వీనికేల?
వీనితోడి ప్రాణులను సుఖపెట్టి వీరు సుఖపడుఁ డను చార్వాకమత
మెంతయును శ్లాఘనీయము లోకములోని జనులందఱును తమతమ
బ్రతుకున సుఖము స్వభావముగాఁ గోరుచుంటచేత చార్వాకమతావలం
బులే- అంతఃకరణమునఁ జార్వాకమతమే యనుసరించి తమతమ సుఖ
ములఁ జేకూర్చుకొనుచుఁ బైకిమాత్రము పూటకై కోటికముల

యాస్తికవేషములతో స్వర్గనరకములఁ వర్ణించుచు దంభాచారముల
నున్నజనులలో నిశ్చయముగా మూఁడువాళ్లు వెఱ్ఱివారు మఱొకవంతు
వంచకులును - బృహస్పతి మునికదా యన్యాయమున బోధించునా?
శ్రుతిస్మృత్యుక్తములని దంభవేషములతో జీవించు తమజీవనవృత్తిని
దూషించినమాత్రమున సకల జనసంఘసుఖమార్గమును బోధించు
సహజసిద్ధమగు చార్వాకమతము హేయమనువంచకుల నేమన
వచ్చును? "సర్వత్రాత్మాస్తి" అంతట నాత్మ నిండియున్నదను
వేదాంత ముపేక్షించి తాను బరులను భేదమెంచి యజ్ఞానులను వం
చించి తామాస్తికుల మనియు నార్యుల మనియు నితరులు పాషండు
లనియు మ్లేచ్ఛులనియును నిందించు భూతద్రోహులమతి మంతసార
వంతమా? చార్వాకులపై లేనిపోని జారత్వాదిదోషములు పన్ని
దుర్మార్గులు నిందించుచున్నారు ఈర్ష్యాసూయలచేత యథార్థమగు
చార్వాకమతమును దార్మికులు కావించి దూషించు దుష్టు నేమనవల
యును? చార్వాకమతము న్దాలనాఁడు జనులప్రవర్తనమంతయును
స్వసుఖ మాసించియే కదా జరుగుచున్నది? లోపల నాస్తికమతము
వెలుపల మిక్కిలి యాస్తికమత మోహో! దంభమతముల దుశ్చేష్ట?

చార్వాకమతము పుట్టిన కారణము - వైదికమత మని
ధూర్తులు ఋషిప్రోక్తములను శ్రుతిస్మృతులందలి యాథార్థ
మును మఱుగుపఱచి పామరులను మోసపుచ్చి సోమరిమాటలతో
సులభజీవనమ్మశ్రమముగా సంపాదింపఁగోరి మునులయభిప్రాయమునకు
వ్యతిరేకముగా వ్యాఖ్యానము లొనర్చి సత్యమును సకలభూతదయను
సకలజనసాధారణసౌఖ్యమును బుద్ధిపూర్వకముగా నుపేక్షించి యజన
యాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహణ షట్కర్మములు బ్రాహ్మ
ణులకనియు నాకర్మములందుఁ గొన్ని తగ్గించి క్షత్రియవైశ్యుల
కనియుఁ దక్కిన ప్రజలందఱును గర్మబాహ్యులనియును [illegible]

సాధారణధర్మములగు సత్యదయలవలఁబెట్టి నామములు జన్నిద
ములు మడిమైలలు తడిపొడి బట్టలు మొదలగు డాంబికాచారము
లతోఁ దమవలె సంచరించువార లార్యులనియును మఱి యాస్తిక
ులనియు స్త్రీలు శూద్రులను గర్మముల కనర్హులనియును దక్షిణ
లోకులందఱు నాస్తికు నియు మ్లేచ్ఛులనియును హిమవద్వింధ్యల
మధ్యదేశమాత్రము కర్మభూమియును దక్షిణదేశముల వారంద
ఱును గర్మబాహ్యులు నధము లనియును దెలిసీ తెలియక చాటుచు
నోటిబూకరితనమున జనులను వంచించి యభేష్టదుష్టభోగంబు లన్యాయ
ముగా నుబ్బరగుడువుల విఱ్ఱవీగుచు భూతద్రోహులౌట కోర్వక
బృహస్పతియును మునిశేఖరుఁడు కాలోచితముగను సకల లోకోప
కారముగను జార్వాకమతము గల్పించెను చార్వాకశబ్దమునకుఁ
బ్రియమైన వాక్కని యర్థము ఏజంతువునకైన హింస యొనర్ప
కొరుల సుఖపెట్టి తా సుఖముగ బ్రతుకుట చార్వాకమతము యొక్క
ముఖ్యతాత్పర్యము ఈచార్వాకమతమే యన్ని మతములలో
శ్రేష్ఠము సహజలోకప్రసిద్ధమును భూతదయ నవలఁద్రోసిన వర్ణాశ్రమ
ధర్మముల నిరసించి తనవాదమును బలపెట్టుకొనుటకై సకల భూత
దయాపరుఁడును "హరిరేవజగజ్జగదేవ హరిర్హరితో జగతో నహి
భిన్నతనుః" అని తెలిసిన సర్వజ్ఞుఁడును దేవగురువు నగు బృహస్పతి
ముని వైదికమర్యాద లతిక్రమించి కుక్షింభరులైన దంభాచార
పరాయణులగు లోకవంచకుల నడంచుట కీచార్వాకమత ముప
దేశించెను బృహస్పతి క్రొత్తగాఁ జార్వాకమత ముపదేశింప
నక్కఱలేదు సహజముగాఁ దనతోటిపాటివారలకు హితముగా
సంచరించుటచేఁ దనసౌఖ్యము జరుగుచుంట ప్రతిజంతువునకు సహ
జానుభవసిద్ధమేగాన సకలజంతువులం దనాదిగా స్వభావముగాఁ
జార్వాకమతమే ప్రవర్తిల్లుచున్నది. నిద్రాహారవిహారముల కును

యుక్తములై తనతోడిపాటివారి యనుమతమునఁ దనకు లభించు భోగము లనుభవించుచు సుఖముగ బ్రతుకు పొడిగించుకొన నాసించుట ప్రతిజనునకు సహజాభిప్రాయము తక్కినజంతువుల కన్న మనుష్యులు చేయవలసినవింతవని తనసుఖముకై పరులను హింసింపకుండుట, తనసుఖముకై పరుల హింసించువాఁ డన్నిజంతువులలో నధముఁడు. బృహస్పతి యొనర్చిన చార్వాకమతమునకుఁ దప్పువ్యాఖ్యానములొనర్చి మహాత్ముని యుపదేశము చొప్పున నక్కఱమాలిన యతివ్యయభోగములు తగ్గించుకొని మితాహారవిహారములతో లోకుల కేవిధము బాధకావింపక బ్రదుకుటకుబదులుగాఁ బరిపాలనాధికారులపైఁ దిరుగుబాటుచేసి ముప్పు దెచ్చుకొన్న యవివేకులవలెఁ జార్వాకమతావలంబులు దేవుఁడు లేఁడనియు స్వర్గనరకములు కల్ల లనియును వర్ణాశ్రమధర్మము లనవసరము లనియును వైదికకర్మములు ధూర్తకల్పితము లనియును బ్రచురింపఁదగదు

వైదికమతమునకును చార్వాకమతమునకు రవ్వంతయును భేదము లేనేలేదు అహంకారమమకారములతో భూతదయలేని ప్రాకృతులు దేవునివలె నెల్లెంచినవారి కటులఁ దోఁచు మునిప్రోక్తవేదభావము దమకును దమబంధుజాతులకును దమతపుజన్మదేశముల వారికిని రుచించునట్లు సమయోచితముగా నర్థములు చెప్పి స్వార్థపరులై యితరజనవిరుద్ధముగా నభిమానముతో ప్రాణిహింసకుఁ బ్రతువింప నన్ని చతుర్వర్ణేతరజనుల కెల్లవిధముల లోఁబడియు నవ్వారల నధమజాతులని గర్హించుచుంట మిక్కిలి శోచనీయము తనవీఁపు తాఁ జూడఁజాలనివాఁ డాకాశపంచాంగములు చెప్పుట యెంతధూర్తలక్షణమో? మునులమతములన్నియును మిక్కిలినరియైనవే కాని యామతములను వివరించు ప్రాకృతజనుల యభిప్రాయములన్నియును సరికావు మునిమతములను మునిదృష్టప్రోక్త శ్రుతిస్మృతులను యథార్థముగా

తెలిసికొనటకుఁ బ్రాకృతులు శక్యముగా సమర్థులు కారు మునిమతము మనికే యెఱుక "జ్ఞాని యెఱుఁగు సుజ్ఞానుల మఱుఁగు అజ్ఞాని యేమెఱుఁగు హరిదాసు తెఱఁగు" అన్నట్లు స్వార్థపరులు కుక్షింభరులహంకార మమకారాభిమానాంధకార నిర్మలగ్నులగు సంసారులు శ్రుతిస్మృతుల యభిప్రాయము సరిగాఁ గనిపెట్టలేరు. మఱొక మునుల మతమును దమకుఁ దెలిసినట్లు స్వయమాచరించి యొరులకు బోధింపనేరరు కాఁబట్టి సకల మునిమతసారమగు సూనృత దయాతత్త్వ మెఱిఁగి సర్వజన సమ్మతముగా నేమియు చేతనైన ప్రాణి హింసచేయక జీవించుట కలవడిన మనుష్యుని బోధ చొప్పున నడుచుట మిక్కిలి శ్రేయము ఊఁ ఎరితీసికొనుటవలె నిద్రాహారములు సకలజంతు సామాన్యస్వభావములు విహారము సహవాసమునుబట్టి జరుగును గాని సహజము కాకున్నను నిద్రాహారముల సాహాయ్య కరము కావున దేహపరిశ్రమమాత్ర రూపకమై లోకసమ్మతమై యేజంతువులనైన బాధింపని విహారము చిరసుజీవనోపయోగకర మగుట మిక్కిలి నిశ్చయము - వావివరుసలు వర్ణాశ్రమధర్మములు జాతినీతులు స్వర్గనరక విశేషములు మొదలగు నిద్రాహారేతర కర్మములన్నియును విహారాంతర్భూతములే - సకలజంతుజీవనోపకారముగ నడుచు నానావిధవిహారోపాయములు నానాదేశజనుల నానాభీష్ట సుఖములం బట్టి మునులు నానావిధముల నుపదేశించి యున్నారు

నిద్రాహారములకు మిగిలినకాలము గడుపు విధము విహార మనఁబడును నానావిధ విహారములలోఁ దపస్సు శ్రేష్ఠము - నానావిధ తపస్సులలో సకలలోకోపకారము గావించు తపము మిక్కిలి శ్రేష్ఠము పురుష ప్రయత్నమున జరుగు క్రియలలో నొకప్పుడును దైవమునకు లొంగని దొక్క సత్యమే ఆసత్య మనుష్యైకవేద్యము గాని వివరింప నశక్యము - నేను జ్ఞానము నాకు సత్యమెప్పటికి

నన్ను వివరింప నాతరమా ? నా యవయవములుగాని నా మనస్సు
గాని నా తెలివిగాని నాతో సంబంధించిన దేవస్తువైనఁగాని నే నవు
దునా ? నే నను తత్త్వము నాకే యెఱుఁగ నితరులకు నన్ను నే యథా
ర్థముగ నగపర్చు టెట్లు ? నా దేహసంబంధములగు కష్టసుఖము
లిట్టివని యథార్థముగా నేఁ దెలుపఁజాలనపుడు పైవారలకు నన్ను
నేఁ దెలుపఁ గలనా ? నే నను జ్ఞప్తియే యాత్మపదార్థము
ను అద్దియే సత్యమును దేవుఁడును మఱి యీ సర్వజగమును నే నన
నేమో నాకుఁ దెలియుదుగాని నాకు మూఁడవస్థలు కలవని నా కెఱుక
మఱి యా యవస్థలు జాగ్రత్స్వప్న సుషుప్తు లని ముప్విధములు-
సుషుప్తి యన మఱపు-జాగ్రత్స్వప్నములు స్మృతి - స్మృతికాలమున
నాతోఁ గలిపియీలోకమంతయును నాకుఁ దోఁచుచున్నది సుషుప్తి
యను విస్మృతివేళ నాతోఁగలిపి జగము నాకుఁ దోఁపకున్నది మఱి
పురుషకారమగు సత్యము నే దైవమును మాన్పఁజాలకుంట నిస్సందే
హము- కాఁబట్టి నా జ్ఞప్తి మించిన యెఱుఁక దప్ప మఱెద్దియు
వాస్తవముకాదు విస్మృతి సమయమున సుఖదుఃఖములు రెండును
లేవుగనుక విస్మృతి ముక్తి - మఱి స్మృతిబంధము సత్త్వరజస్తమో
గుణాత్మకములగు జాగ్రత్స్వప్నసుషుప్తులకు సాక్షియై నిర్వికారుఁడై
మేలుకొనియు నిదురించునట్లు సర్వజ్ఞుఁడయ్యు ఖేదమోదము లంటక
త్రిగుణాత్మకమగు జగమంతయును దన శక్తిస్వరూపమనియును
సూర్యబింబమునకు సూర్యకాంతికిని భేద మెద్దియును లేనిచందమునఁ
దనకును దన శక్తిస్వరూపమగు జగమునకు భేద మెంచక గుణమయుఁ
డయ్యు గుణములంటక సర్వజగద్రూపుఁ డయ్యు జగమునకు వేత్తై
యచింత్య వైభవుఁడై సహజలీలచేఁ దనకుఁదా సృష్టిస్థితి లయము
లందుచు నిత్యానందమున సేవ్యసేవక భావముల సుఖదుఃఖానుభవ
ములఁ గ్రీడించువస్తువు పరమపురుషుఁడని సర్వమతప్రవర్తకులగు

మునుల ముఖ్యాభిప్రాయ మెఱిఁగి యెఱుఁగక మునుల మతము
కూలంకషముగాఁ దమకుఁ దెలిసినట్లు మునివాక్యముల కర్థము
గావించి జీవహింసను, భూతద్రోహమును స్వార్థపరులై బోధించుచు,
వేదబాహ్యులు నాస్తికులు మ్లేచ్ఛులు పంచము లంటరానివారు
నిషిద్ధాచారపరు లని దౌర్జన్యమున మిక్కిలి భూతదయాపరులు సకల
జన మిత్రులు సర్వస్వములు సకలలోకోపకారపరాయణులగు సజ్జను
లను దూషించు వైదికమ్మన్యుల ధూర్తప్రలాపము గణుతికెక్కుచుం
టకుఁ గారణము కాలవైపరీత్యముగాని వేఱొకండు కాదు

లోకములో నెపుడు జనులందఱు స్వివేకవంతులై సమాన
స్వాతంత్ర్యము సమానభోగభాగ్యానుభవము కలిగి జంతుహింస
కొప్పకుందురో యట్టికాలము కృతయుగము- మనుష్యుల ప్రాణిహింస
నొనర్చుచు గొప్ప కొద్దు లెంచుకొనుచుఁ బరస్పర వైమనస్యమున
మిక్కిలి యన్యోన్యము నిరోధించి దేశ కుల మతాభిమానముచే
నొండొరులకు హాని గావించుకొను చుందురో యట్టికాలము కలియు
గము ద్వైతబుద్ధిచే స్వపరభేద మెంచి జీవుఁడు సుఖదుఃఖాత్మక
సంసారబద్ధుఁడగుచున్నాఁడు మఱియు నద్వైతబుద్ధిచేత సర్వభూత
సముఁడై సుఖదుఃఖము లంటక ముక్తుఁ డగుచున్నాఁడు

హింసద్వైతమునకు మఱి యహింస యద్వైతమునకును లక్షణ
ములు- ద్వైతు లెల్లరు శ్రౌతస్మార్త విధులచే లోకులం బీడించుచు
భూతహింస గావించుచు స్వార్థపరులై లోనొకటి పైనొకటి యుద్దే
శము గలిగి నటించు ధూర్తజనులే యథాలాభ సంతుష్టులై సర్వజన
సములై సకల లోకోపకారపరాయణులై స్వార్థత్యాగులై సర్వభూత
దయాపరులై యేమిన చేసైనఁ బ్రాణిహింస గావింపక సర్వము
విష్ణుమయ మని యెవ్వరికైన నెట్టిబాధయు నిడక చీమనగు నొంగం
బుల బ్రతుకు మనుభావులే యద్వైతులు - సహజముగాఁ బ్రతి

క్షణము కనుఱెప్పలు మూసికొనుట తెఱచుట లను నున్మేష నిమేష
ములు లేనివల్లు దుఃఖసుఖములు నిద్దురమేల్కొనుటలు మోహావివేక
ములు మొదలగు ప్రకృతి పురుషస్థితులను వెల్లడించు చుండును
ద్వైతమతముచేతఁ బదార్థ నానాత్వమును మఱి యద్వైతముచేత
కేవల మొక్కవస్తువు మాత్రమే తోఁచుచుండును ఉన్మేషములు
ప్రతిక్షణము జరుగు చున్నప్పటికి బంతి నెగిర్చి యెగిరిన బంతి క్రిందఁ
బడనీ కెగుర్చుచున్న చందాన నడలేక చక్రాకారముగాఁ గొఱవి
త్రిప్పునట్టు లా యద్వైతి తన వివేక ప్రభావముచేత జాగ్రత్స్వప్న
సుషుప్తులను మూఁడవస్థలయందు నొక్కవస్తువునేఁ గనుచు నిత్య
తృప్తుఁడై నిర్వికారుఁడై సకలజన సముఁడై సర్వభూత దయాపరుఁడై
సకల లోకోపకార పరాయణుఁడై సకల జనసమ్మతుఁడై మునియై
ముక్తుఁడగును

అవివేకియగు ద్వైతి యున్మేష నిమేషములఁ గట్టువడి జ్ఞానా
జ్ఞానములఁ జిక్కి తెలిసీ తెలియని వాఁడై యహంకార మమకార
ములతో స్వపరభేదమెంచి భూతహింస కావించుచు నరిషడ్వర్గము లకు
లోనై సుఖదుఃఖానుభవములఁ బొంగుచుఁ గ్రుంగుచు సంసారియై
బద్ధుఁడగును వేయేల నిత్యానంద మనుభవించుటకు సాధనము
సకలభూతదయ కలిగియుంటకన్న మఱెద్దియును లేదు వివిధసుఖ
దుఃఖములకుఁ బాలగుచు పుట్టుచు గిట్టుచుంటకుఁ గారణము మిక్కిలి
ద్వైతబుద్ధితో పదార్థ నానాత్వ మెంచుకొనుచు నహంకార మమ
కారములచే తన మతానుసారము సంచరించని జనుల నసహ్యించు
కొనుచు నెద్దిరో మిడివెట్టి లోకులకు బాధ కావించుటయే
ద్వైతబుద్ధి యజ్ఞానముచేతను మఱి యద్వైతము మిక్కిలి వివేక
ముచేఁ బొడమును జనులకు సుఖదుఃఖముల కావించుచుంటచే ద్వైతి
సుఖ దుఃఖములు రెండు ననుభవించుచున్నాఁడు సర్వభూత దయా

వరుఁడై కేవలమును లోకోపకారమునకై మాత్రమే ప్రవర్తిల్లు నద్వైతి నిత్యసంతుష్టుఁడై సుఖదుఃఖములు రెండును లేని శాశ్వత కైవల్య మనుభవించును

చార్వాకమతమువలన గ్రహింపఁదగిన సారము ప్రత్యక్షమైన లోకమునుండి కేవల పురుషప్రయత్నమును మాత్రమునే నమ్మి తనతోడిపాటి జీవులయెడ మైత్రితో సంచరించి తా సుఖముగా బ్రతుకఁదలంచుట గాలి యగ్గి నీరు మన్ను లను నాల్గుభూతముల యుపద్రవములనుండి తప్పించుకొను నుపాయము లరయుచు యుక్తాహారవిహారనిద్రల కేర్పడి రోగములకుఁ దగిన చికిత్సల నాచరించుకొనుచు నప్రత్యక్షములగు స్వర్గనరక దైవచింతలచే వృథాకాలక్షేపము చేయక మిట్టవేదాంతములు నాకాశపంచాంగములతో కాలము రిత్తపుచ్చక మనోవాక్కాయ కర్మములతోఁ దనతోడిపాటివారి సౌఖ్యమును దన బ్రతుకు సుఖమును బొడిగించుకొనుచు, అక్కఱమాలిన యప్రత్యక్షదేవతల వర్ణించు స్వార్థపరులగు ధూర్తదేవానాంప్రియుల దాంభికాచారముల ననుసరింపఁగోరి దేవాలయములు క్షేత్రములు వైదికస్మార్తకర్మములు మొదలగు భ్రాంతవంచక జనకల్పితవిధులు నడుపు వృథాప్రయవ్యయాసము లందక, చిన్న పెద్ద శక్తికొలంది తెలిసికొని యేయెడ కాగోడుగుఁ బట్టుచు చతుర్విధోపాయములచే దుర్జనుల బారిఁ బడక తప్పించుకొను నేర్పున నడఁకువతో లోకోపకారముగా నడిచి హాయిగ బ్రతుకుచార్వాకులమతము మిక్కిలి గణనీయమును సకలజనులకు న్నవాదమని చెప్పకతీఱదు చార్వాకమతమే సకలమనుష్యులకును సహజమును సామాన్యమును-కాలఋతువిశేషములచే శీతోష్ణతులు మాఱుచున్నట్లు "ఆత్మనః కామాయ సర్వం ప్రియం భవతి" యనుఁడు తన సౌఖ్యమ్ముకొఱకు మాత్రమే యితరజనులను ప్రేమించుచున్నాఁడను వచనానుసార

ముగా సహజసిద్ధముగాఁ దన సౌఖ్యముకోరినవాఁ డితరులను స్వాధీన పఱచుకొనుటకై యుపయోగించు సామదానభేదదండములను చతుర్విధోపాయముల నుపయోగించుననియును, కాగా సకలాస్తిక మతములను చార్వాక మతాంతర్భూతములై చార్వాకమతమునకుఁ బిడవఁ బొదచూపెనని తలంపక తీఱదు

ఆకాశమనఁగా నవకాశమనఁగా భిన్నవస్తువులన్యోన్యముకలిసి యెడయు వీలగుటకుఁ దగిన ప్రదేశము ఆప్రదేశ మాభిన్నవస్తువుల యొక్క మొత్తపు పరిమాణముకన్న మిక్కిలి యధికపరిమాణము కలదై యుండవలసియుండును నేనున్నగది నాకన్నఁ బరిమాణమున కెక్కువగా నుండకతీఱదు గదికన్న గృహముకన్న గృహమునకుఁ జుట్టునుగల చోటును మిక్కిలి విస్తారముగ నుండవలయును భిన్న వస్తువుల కన్యోన్య సంయోగ వియోగములకుఁదగిన యవకాశమిచ్చు చోటు కావలెనుగదా ? "సున్నము పసుపుకలిసినవు డెఱుపురంగు వలెనే గాలి యగ్గి నీరు మన్ను నునాలుగు భిన్నపదార్థముల యొక విధమయిన సంయోగవిశేషముచేతఁ జైతన్యము కలుగుచున్నది మఱి యాపదార్థముల యడయికచే నాచైతన్యము నశించుచున్న దను" చార్వాకుల యుక్తి సరియైనదికాదు కారణమేమనఁగా భిన్న వస్తువుల యన్యోన్య సంయోగవియోగములకై యుండకతీఱని యాకాశమను పదార్థమే నిత్యశుద్ధ చైతన్యస్వరూపముగాని నిక్కముగాఁ జార్వాకు లెంచుకొన్న దేహావయవసంచలన విశేషము చైతన్యముకాదు మఱియు గాలి యగ్ని నీరు మన్నులనునాల్గు భూతములయొక్క సంయోగవియోగవిశేషములు బ్రతుకు చావు లనుగుణములను గల్పించుచున్నవి ఆకాశాత్మకమగు శుద్ధ చైతన్యము నిర్గుణము గాలికి స్పర్శము-అగ్గికి రూపము- నీటికిం ద్రవి…

మంటికి వాసనయును గుణము లుపాధివిశేషసంయోగవియోగభేదము లాకాశావకాశ సంపర్కమునఁ గలుగుచున్నవి మఱియును జీవచ్ఛరీర మిద్ది మఱిద్ది మృతకళేబర మిది తెలివికలది మఱిది తెలివి లేని విద్ది సచేతన మిది యచేతనమని త్రిగుణ బద్ధుఁడై జాగ్రత్స్వప్న సుషుప్తులకు లోఁబడి భూతవశుఁడై తన యభీష్టములు నెఱవేర్చుకొనుట కశక్తుఁడై కించిజ్ఞుఁడై పరిమితాయువై లోకులచేత హితాహిత వస్తుజ్ఞానముఁ దా మప్పఁబడుట ప్రత్యక్షముగాఁ దెలిసికొన్న చార్వాకుఁడు పంచేంద్రియస్పష్టాత్మకమగు ప్రత్యక్షమును దప్ప నితరప్రమాణ మంగీకరింపరాదనుట మిక్కిలి మూర్ఖము బృహస్పతి దైవమును నిరసించి ప్రత్యక్షము మాత్రము ప్రమాణమని పౌరుషమును స్థిరపర్చి నిత్యాత్మక స్వరూపకమగు నాకాశ భూతము లేదన్న యభిప్రాయము, సర్వభూతహితము సంచరించి పరస్పరద్వేషమును మానుకొని యన్యోన్యమైత్రితో నేకీభవించినం దప్ప మనుష్యులకు సకల జనాభీష్టమగు సుఖజీవనము కలుగనేరదని కాని యితరము కాదు

## బృహస్పతి మతమునకు తప్పు వ్యాఖ్యానములు :

బృహస్పతి మతావలంబులమని తెలిసీ తెలియని ప్రాకృత జనులు బృహస్పతి యేర్పర్చిన నిర్దుష్ట చార్వాక మతాభిప్రాయము నకు వ్యతిరేకముగా తప్పు వ్యాఖ్యానము లొనర్చి యింద్రియములకు గోచరముకాని యతీంద్రియ పదార్థము లేదనియును ప్రత్యక్షము తప్పఁ దక్కినవి ప్రమాణములు కావనియు నహంకార విమూఢాత్ములై వేదశాస్త్రాత్మక శబ్దబ్రహ్మమును సర్వజగత్కారణమగు నాకాశాత్మక దైవమును భూత భవిష్య జన్మములను స్వర్గనరకములను మఱి తద్దేతుక శ్రౌత స్మార్త కర్మములను నిందించుట మిక్కిలి యసంభావ్యము, ప్రత్యక్షేతర ప్రమాణము లన్నియును

ప్రత్యక్షాంతర్భూతము లయినప్పటికిని చార్వాకుఁడు తన తెలివి [illegible] ప్రవృత్తి నివృత్తులకుఁ దనకు మిక్కిలి పరోక్షముగా నొక శక్తి యున్నటు లొప్పుకొనకుంట మిక్కిలి దౌర్జన్యము తన సుషుప్తి దశయందుఁ దనకుఁ జైతన్యమున్నదా లేదా? తనదేహ మప్పుడు సజీవమా? నిర్జీవమా? మఱి యా సుషుప్తినుండి తా నెట్లు మేలుకొన్నాఁడో యట్లు మేలుకొనుటకు తన పౌరుషము కారణమా ఈ పురుషప్రయత్నమునకు భిన్నమగు దైవమను నొక యతీంద్రియ శక్తి కారణమా? సుషుప్తినుండి తన్ను మేలుకొలిపిన శక్తి యెద్దియో యొకటి యుండకతీఱదు మఱి యాశక్తికిఁ బ్రవృత్తి నివృత్తులు సహజములు నిక్కముగాఁ దనయూహ కందని యెద్దియో శక్తి వశమున దన జాగ్రత్స్వప్న సుషుప్తులు గనుపట్టుచున్నవని చార్వాకుఁ డొప్పుకొనకతీఱగు ఆశక్తియే దైవ మద్ది యతీంద్రియము మఱి యచింత్యవైభవమని యున్నదున్నట్లు తన యనుభవము సత్యముగాఁ జెప్పక మొండిగొని కాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్లని దైవమును నిందించు చార్వాకమ్మన్యుఁడు, లోకులమైత్రి సంపాదించు కొని సుఖముగా బ్రతుకవలయునని యుపదేశించిన బృహస్పతి మతమునకు విపరీతముగా సకలజన విరోధియై చెడుచున్నాఁడు కాఁబట్టి పృథివ్యప్తేజోవాయువులను భూతముల నాల్గింటిని మాత్రము తత్త్వములుగా వెల్లడించి యాకాశము లేదను చార్వాక మతము పిల్లకాయమతమువలెఁ గ్రమక్రమముగాఁ దిన్నఁబడినకొలఁది కొక్కుసా క్లోడపోసిన నీటివలె నుత్తమోపనిషన్మత మగుచున్నది

చార్వాకమతము మొదటిమెట్టు ఈ దేహయాత్రకు వేదాంతము తుదిమెట్టు. చార్వాక మతమునకు వేదాంతసారమగు జగద్గురు శంకరాచార్యమతమునకు నడుమ ననంతసంఖ్యాకములగు మతములు [illegible]మెట్లు. చార్వాకమునుండి శ్రీ జగద్గురు శంకరాచార్యస్వామివా

ద్వైతసిద్ధాంతమున కెక్కుటకు నడుమనున్న మెట్లు మొత్తముపైఁ బదుమూఁడు చార్వాకము భూమింతంటిది. తక్కినవి నీరు నిప్పు గాలి మిన్నుల నొక్కొక్కటొదపోఁతచే నొక్కొక్క గుణకలుమము తగ్గుచుఁ దుదకు సచ్చిదానందలక్షణమగు నిర్గుణబ్రహ్మాంతక జగద్గురూప దిష్టాద్వైతమతమై నిత్యశుద్ధము క్తస్వరూపకమై చిట్టచివరమెట్టుగాఁ గైవల్యమున కాటకట్టయి "నహింస్యాత్సర్వభూతాని, నాద్వైతవతః కర్మాణి విధీయన్తే" అనియును బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" బ్రహ్మ మెఱిఁగినవాఁడు బ్రహ్మయగుచున్నాఁడని బోధించుచున్నది

"విద్" అను ధాతువునుండి విద్య- వేదము- వైద్యము- విదురుఁడు- వేద్యము- విత్తము మొదలగు శబ్దములు పుట్టినవి. ఈశబ్దములన్నిటిని దెలివియుభ్యాధారము విద్వాంసుఁడనఁగాఁ దెలివి కలవాఁడు-సంపూర్ణమగు తెలివి సకలవిద్యల నభ్యసించుటవలనఁ గలుగును ఈ జగమంతయును విద్యాస్వరూపమే "వేదవేదాంగ వేత్తాపి లోకాచారం నలంఘయేత్" వేదములను వేదాంగములను దెలిసినవాఁడైనప్పటికిని లోకాచారమును మీఱఁదగదనునట్లు సమస్త విద్యలలో శ్రేష్ఠమగు బ్రహ్మవిద్య నెఱిఁగియును జగద్గురువగు నాది శంకరాచార్యుఁడు మన్మతస్థాపకుఁడై ధర్మముగా నడిచి జనహిత ధర్మముల నుపదేశించెను బ్రహ్మర్షు లంతయును దత్తద్దేశవర్ణాచార విహారవిధుల నుపదేశించిరి వాచికాంగికాహార్య సాత్త్వికాభినయ రూపముల సకలవిద్యలు వెలువడుచున్నవి సరిగాఁ బ్రతియామమును గోడికూత తెలుపునట్లే మనవ్యాకృతములగు గడియారములు వెంట లగు యంత్రము లెవ్వియును గాలమును దెల్పఁజాలకున్నవి అంత రాళమున బ్రేలాడు నుట్టిలోనున్న బెల్లముకుండలోఁ జీమలు గుమి గూడినవి గోడచాటున నేపదార్థమున్నదో మనుష్యు లెల్లరుఁ దెలియఁగల్గిరి సహజముగాఁ గొన్ని జంతువులకుఁ గొన్ని విద్యలు స్వయ

అనుభవమంతయుఁ బాపములభించెదును గాని మనుష్యుఁడెంత తెలివిలేని మొద్దు
జంతువో గాని సహవాసమును మత్పైబడియుఁ బరిచయమును లేకే వస్తు
తత్త్వమెట్టిదో సహజముగాఁ దెలియనేరఁడు మనుష్యులకంటె నితర
జంతువులకుఁ బదార్థజ్ఞానము స్వభావసిద్ధము మనుష్యునకుఁ బ్రత్య
క్షాది ప్రమాణముల సాయము లేనిది పదార్థవిజ్ఞానము కలుగనేరదు
ఒకనీటిబిందువున కింకొకనీటిబిందువు చేరి కాలక్రమమున నెంతకాలము
నకో మహాసముద్రముగాఁ బరిణమించినట్లు లనాదిగా ననేకవిద్వాంసు
లచే మొత్తముగాఁ గూర్పఁబడిన పదార్థవిజ్ఞానము నందుటకుఁ దగిన
పర్యాప్తబుద్ధివైభవము సహజముగాఁగల యతీంద్రియద్రష్టలు లోకో
త్తరదివ్యోపాధిమంతులై గౌతమవ్యాసాదిమునిరూపముల విలసిల్లి
మోక్షశాస్త్రప్రవక్తలైరి ఆయను లెట్టిదేహధారులో నిర్ణయింపఁ
బ్రాకృతజనుల తరము కాదు సముద్రఘోషవలె నున్న వేదసమూహ
మునకుఁ బ్రకృతిప్రత్యయము లింద్రుఁ డేర్పరచెను వేదాంగములగు
శిక్షావ్యాకరణఛందోనిరుక్తజ్యోతిషకల్పములను స్మృతిపురాణేతిహాస
విశేషములను లోకోపకారమునకై యతీంద్రియద్రష్టలగు మును
లేర్పరిరి వేదములను వేదాంగములను స్మృతిపురాణేతిహాసవిశేష
ములను శంకర రామానుజ పూర్ణప్రజ్ఞ విద్యారణ్యాదిమునితుల్యు
లగు నాచార్యులు జనులకు సులభమగు భాష్యలతో వివరించిరి అన్ని
యభినయములలో వాచికాభినయ మెక్కువగా విద్యలను బోధింపఁ
గలుగును వాక్కునుబట్టి యభిప్రాయమును గ్రహింపఁగల్గినట్లు
మాటలు వినికివలన నర్థము బోధపడునట్లు మఱే యవయవము
వల్లనైన నంతగా బోధపడనేరదు కారణ మేమనఁగా నన్నిభూత
ములకాధారమగు నాకాశభూతము గుణము శబ్దము గనుక నాదము బ్రహ్మా
త్మకమును నాదవివృతస్వరూపమే యఖిలజగమనియుం బతంజలిముని
వ్యాకరణమహాభాష్యమునఁ బ్రతిపాదించెను మఱియును వేదములు

శబ్దమయములు కావుట్టి శబ్దము సకలవిద్యలను బోధించునట్లు రూప
స్పర్శరసగంధములు బోధింపనేరవు పుస్తకమందలి యక్షరరూపములను
గాంచి సకలవిద్యల నెఱుంగరాదాయనిసరియొడల నిర్జీవదేహములతి
యవయవములం బరికించి సజీవశరీరముల యథార్థతత్త్వ మెఱిగి
చికిత్సచేయనెంచు శస్త్రవైద్యులవలెం బొరపడకతీఱదు సరస్వతీదేవి
వాగ్రూపిణిగాం భావింపంబడెను "యన్మనసా ధ్యాయతి తద్వాచా వ
దతి" మనసులో నెద్దితలంచునో యది నోటం బలుకునన్నట్లు మనము
లోనితలంపు దెల్పంగలసాధనములన్నిటిలో మాట శ్రేష్ఠసాధనము
కావుననే పూర్వకాలమందు సకలవిద్యలు గంఠస్వరమునను పదేశింపం
బడెనుగాని వ్రాతమూలముగా నుపదేశింపంబడలేదు కంఠపాఠము
గానున్న విద్య వ్రాతమూలముగా గ్రహించినవిద్యకన్న వేయిరెట్లు
దృఢముగా నుండును మఱి యవసరమునకుం జప్పున స్ఫురించును
అర్థస్ఫూర్తిగా రసానుకూలస్వరమున నోట బయలువెడలినవాక్య
ములు తనయభిప్రాయమును బైకిం దెల్పంగలిగినట్లు వ్రాతమొనంగు
మూగసంజ్ఞలు తెలుపంజాలవు అన్నివిద్యలు ప్రయోజనము సర్వలోక
హితమగువిధమున నడచుట సకలపదార్థతత్త్వము దెలుపంగలిగినబుద్ధి
ప్రకారముగా నొనర్చు మనోవాక్కాయకర్మముల కన్నింటికిని విద్య
లని పేరు వస్తుతత్త్వము నెలిసికొనుట బుద్ధిలక్షణము బుద్ధికొలంది
నడచుట విద్యాలక్షణము.

విద్యాబుద్ధులు రెండును మతమనిపించుకొనును మతములు
నాస్తికమత మనియును మఱి యాస్తికమత మనియు నిరు
తెఱంగులు సంపూర్ణనాస్తికమతము చార్వాకము సంపూర్ణాస్తిక
మత మద్వైతము నాస్తికమతమనునది వాస్తవముగా లేనేలేదు
చార్వాకుండు కూడ పృథివ్యప్తేజోవాయువులనుమాత్ర మొప్పు
కొనుచున్నాండుగదా? జాగ్రత్స్వప్నదశల [illegible]

యున్కియును మఱియును దనకంటె వేఱువస్తువు యున్కియును గోచ
రములు కాకమానవు అహంకార మున్నంతవరకు జగము
తోఁచకతప్పదు అహంకారములేని సుషుప్తిదశయందే వస్తుజ్ఞప్తి
యును లేకుండును సచ్చిదానందలక్షణముగు నాత్మపదార్థము
నిత్యము జగమంతయును స్వప్నప్రపంచమువలె ననిత్యమును వికార
మును అను నద్వైతమతము మాత్రమే యుక్తియుక్తముగాఁ దోఁచు
చున్నది ఇంత కేమతమునకైనను నమ్మకమే ముఖ్యకారణము
సకలమతములును విశ్వాసమూలములే జనులందఱును ప్రత్యేకము
వారివారినమ్మకములఁబట్టియు వారివారిరుచులఁబట్టి పదార్థతత్త్వము
వారివారిశక్తికొలంది యుక్తులంబన్ని స్థిరపఱచుచుందురు ఎవరిమతము
వారికి సత్యము మఱి యెవరిపిచ్చి వారి కానందము సర్వలోకోప
కారకమై సర్వభూతదయాభివర్ధకముగు మతముగలవారు పరులసుఖ
పెట్టి తాము సుఖపడి యుభయతారకు గుచున్నారు నిజముగా నట్టి
లోకోపకారపరాయణులగు మంచివారు బాల్యమునుండియును స్వపర
కష్టదాయకములగు తెన్నున నడుగిడ స్వపరసుఖకరములగు త్రోవఁదప్పక
యావజ్జీవము దేహయాత్ర నడిపెదరు "ప్రమాదో ధీమతామపి"
లోకోపకారపరాయణులగు బుద్ధిమంతులకుఁగూడ తప్పందునఁగా
లోకద్రోహుల బ్రతుకంతయును దప్పేయని వేఱే చెప్పనేల? బుద్ధి
మంతులమంచి పురుషప్రయత్నమున కొకవేళ మంచికిబదులు కీడు
గల్గుటకుఁ గారణమంతకతీఱ దట్టికారణమే దైవమనియును
పూర్వజన్మకృతకర్మమనియును విధియనియును జెప్పఁబడుచున్నది
ఆకారణముచేఁ దనయున్కిని దా నొప్పుకొనుచున్నాఁడో మఱి యా
కారణమే తనపౌరుషమునకు మూలమగు దైవము పౌరుషము దైవము
కాదు కానేరదుగాని దైవమే పౌరుషముగాఁ బొడచూపుచున్నది

# దైవపౌరుషనిర్ణయము

వృక్షము బీజముకానేరదుగాని బీజము వృక్షముగాఁ బరిణమించుచుంట యందఱెఱిఁగినసంగతియే. ఎద్దియో నిరూపించి చెప్పఁదరముకాని లోకాతీతపదార్థమో పురాకృతకర్మమో దైవమో నిశ్చయముగా నొకటి పురుషప్రయత్నమున కొకప్పు డడ్డై యనిష్టజనకమగుచుంట ప్రత్యక్షానుభవసిద్ధము. పురుషుఁడు జాగ్రద్దశలోఁ జేయు ప్రయత్నము పౌరుషము. పౌరుషమునకు దైవమనుకూలించినప్పుడు పౌరుషమే గాని దైవముయొక్క యునికి దృష్టికి రానేరదు. దైవము ప్రతికూలించినప్పుడు సంపూర్ణపురుషప్రయత్న మాకాశమునకుఁ గన్నము లుపాతవనుకించినట్లు వృథాప్రయాసకరమగును. భవిష్యత్తునుగూర్చియును చేయఁగామిగిలినపనిగూర్చియును నిశ్చయము నిదిట్టిట్టిసమయమునఁ జరిపెదనని తనపౌరుషము సఫలముకావించుకొనువారు లోకమంతలో కాలమున కొకరిద్దఱుంట మిక్కిలి యరుదనక తీఱదు. ఇంతకాలము బ్రతికెద నీయాపను లిట్టిట్టిక్షణములందు నిశ్చయముగాఁ జేయఁగలనని చాటిచెప్పి తనపలుకు యథార్థము కావించుకొను పౌరుషవంతుఁడు జగమున మిక్కిలి యరుదు.

కాలమునుగాని పంచభూతములనుగాని తనపురుషప్రయత్నానుసారముగా నడుపుట యసాధ్యమని వివేకవంతుఁ డెఱుఁగఁడా? "దైవాధీనం జగత్సర్వమ్" అను వచనానుసారముగా సకలజంగమస్థావరాత్మకమగు జగమంతయును జగముకన్న వేఱై దైవ మను నొక యతీంద్రియపదార్థముచే నడుపఁబడుచుంట రూఢి. ఆపదార్థము కర్మ మని కొందఱు "ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిః" యన్నట్టు లీశ్వరసంకల్ప మని కొందఱు గ్రహచారవిధి యని కొందఱును బహువిధములనేకములఁ నిర్దేశించుచున్నారు. ఎవరెవరివిశ్వాసముఁ

బట్టియు రుచిఁబట్టియు నాయావిధముగా నాదెవమును భావించు
చున్నారు. అతీంద్రియద్రష్టలగు మునులనాదికాలము నుండియు ను
సకలజగత్సృష్టిసంహారములఁ గూర్చియు లోకాతీతమగుదైవమును
గూర్చియు నానాదేశజనుల నానావిధరుచుల కనుకూలముగా నానా
విధముగా నిర్దేశించియున్నారు. జగమందలి నిఖిలమగు వేఁడికిమూలము
సూర్యుఁడువలెను మఱిశైత్యమూలము చంద్రునివలె సకలవస్తుయదార్థ
తత్త్వబోధ కంతకు మూలము మునివాక్యము. ఆయాయిదేశజనుల
కాయామునులవాక్యములను సూర్యచంద్రులు వివిధదేశములకు వివిధకాల
ములవివిధశీతోష్ణస్థితులకువలె వివిధబోధల కాటపట్టగుచున్నవి. సకల
ప్రమాణములలో శ్రేష్ఠమగు నాప్తవాక్యముఁబట్టి శ్రేయస్కాముఁడు
నడుచుకొని యిహపరసౌఖ్యములఁ జూఱకొనుచున్నాఁడు.

"గురువులేని విద్య కూడదు కూడదు" అన్నట్లు సంపూర్ణ
లోకానుభవముగల పెద్దలమాట విననివారెల్లరును చెడుగొట్లు కాక
తీఱరు. పెద్దలుబోధించిన వర్ణాశ్రమాచారనిర్ణయములతోఁ దనశక్తి
కొలఁది పురుషప్రయత్నము లోపము రవ్వంతరానీక తనమంచిప్రయ
త్నము కొనసాగించుటకై దైవమును సంతతము ప్రార్థించువాఁడు
నిక్కము సజ్జనుఁడు. పౌరుషమొకింతయును జూపక గాలిలో దివ్వెపెట్టి
దేవుఁడా నీదే భార మనువాఁడు బుద్ధిహీనుఁడు, స్వప్నదశయందు కలుగు
తలంపులు ననుభవింపఁబడుక్రియలు నిక్కముగ నెట్లువశములు దైవ
వశములో- మఱియును స్వప్నావస్థయందలి యహంకారమమకారము
లను జాగ్రదవస్థయందలి యహంకారమమకారములకు నిసుమంతయును
పొసఁగలేక యహంకారమమకారమూలమగు పురుషప్రయత్నమునకుఁ
గూడ నొక్కింతయు మార్పులేకున్నప్పటికిని జాగ్రదావస్థయం దెట్లు-
స్వాతంత్ర్యము కేవలదైవాయత్తమని నిశ్చయింపఁబడుచున్నదో యట్లే
జాగ్రదవస్థయందలి పురుషప్రయత్నమునకుఁగూడ దైవమే మూలా

మనుట నిక్కముగ యథార్థమనఁదగదు కాఁబట్టి అంతయును
దైవమే దైవమునకు వాస్తవముగాఁ బౌరుషము వేఱుకాదు గాని
పౌరుషమాత్రము దైవము కానేరదు ఈశ్వరాంశము జీవుఁడు గాని
జీవునియంశ మీశ్వరుఁ డెంతమాత్రము గానేరదు. ఆకాశము
తక్కినభూతములకెల్ల నాధారమై యాభూతములకు లోపల
వెలుపల నున్నట్లు దైవము పౌరుషమున కాధారమై పౌరుషము
నంతటను వ్యాపించియే యున్నదనుట నిస్సందేహము పంచభూతము
లను తత్క్రియలన్నియు దైవికములే పంచభూతములయొక్క
యొకవిధమగు సమ్మేళన విశేషోపాధియందుఁ బొడచూపునహంకార
మమకారాత్మకమగు పురుషప్రయత్నము గూడ దైవమూలమే గాని
దైవస్వరూపమగు పాంచభౌతికవికారమున కన్య మెట్లగును? బీజము
నకును వృక్షమునకును వస్తుభేద మెట్లు లేదో మట్టికి గ్గడవ కెల్ల
వస్తుభేదము లేదో దైవస్వరూపములగు పంచభూతములకును మఱియును
పాంచభౌతికోపాధి వికృతివిశేషమగు నహంకార మమకారా
త్మకమగు పౌరుషమునకును వస్తుభేద మొకింతయును లేదు
"వికారో నామధేయ మితి శ్రుతిః" నామరూపములం గుండ
మూఁకుడులవలె వికారములం బౌరుషకృతములగు ఘనకార్యములు
నన్ని నిక్కముగ నవ్యాకృతదైవకార్యము. పురుషకార
ముత్పత్తిస్థితినాశములందును గాని దైవ మాకసమువలె నుత్పత్తిస్థితి
నాశవిరహితము. అహంకారమమకారప్రవర్తక పౌరుషాత్మకస్ఫూర్తియే
స్వప్నజాగ్రద్వ్యవహారమునకు మూలము మఱి యాస్ఫూర్తియే
పౌరుషము మఱి యట్టి పౌరుషమునకు నిమిత్తకారణమగు సుషుప్త్యా
త్మకవిస్ఫూర్తియే యాటుపట్టు తక్కినభూతముల ప్రవృత్తి నివృత్తులకు
నాకాశము మూలమగునట్లు పౌరుషాత్మక జాగ్రత్స్వప్నదశల నావిస్ఫూర్తి
ప్రవృత్తి నివృత్తులకు సుషుప్త్యాత్మక విస్ఫూర్తియే యాటుపట్టు విస్ఫూర్తి

సంసారము- విస్మృతి మోక్షము- స్మృతి వికృతి- విస్మృతి ప్రకృతి- స్మృతి జీవనము- విస్మృతి మరణము- స్మృతి పౌరుషము- విస్మృతి దైవము- పౌరుషము మిథ్య- దైవము సత్యము- ద్వైతము పౌరుషము- అద్వైతము దైవము- దృశ్యము పౌరుషము- దృక్కు- దైవము- జ్ఞేయము పౌరుషము- జ్ఞాత దైవము- పౌరుషము భ్రమ- దైవము యథార్థజ్ఞానము- ఇంద్రియగ్రాహ్యము పౌరుషము- దైవ మతీంద్రియము- పౌరుషము రథము- దైవము సారథి- నామరూపములు పౌరుషము- నామరూపమూలము దైవము- అనిత్యము పౌరుషము- నిత్యము దైవము- కార్యము పౌరుషము- కారణము దైవము- పూది పౌరుషము- సూదంటురాయి దైవము- ప్రకృతి పౌరుషము- పురుషుఁడు దైవము- పౌరుషము మాయ- దైవ మీశ్వరుఁడు-నరక దుఃఖకారణము పౌరుషము- స్వర్గసౌఖ్యకారణము దైవము- చెడ్డకెల్ల పౌరుషమే కారణము- మంచికెల్ల దైవమే కారణము- బంధకారణము పౌరుషము- మోక్షకారణము దైవము వికృతి పౌరుషము- ప్రకృతి దైవము- సంసారము పౌరుషము- సమాధి దైవము- దోషము పౌరుషము- గుణము దైవము-కోపము పౌరుషము- శాంతి దైవము- పౌరుషము పరాధీనము- దైవము స్వతంత్రము- జన్యము పౌరుషము- జనకము దైవము

దైవలబ్ధములగు గాలి వాన మొదలగు భూతప్రకోపములచేతఁ [illegible]ప్రయత్నము లడ్డఁబడును కాని రవంతయును పౌరుషమున దైవము శాసింపఁబడనేరదు అహంకార మమకారము లుడిగి [illegible] సహించి సకలలోకోపకారమునకై మాత్రమే పౌరుషము చూపు సజ్జనులకుమాత్రమే దైవము తోడుపడి కైవల్యానంద [illegible] స్వార్థపరులై భూతద్రోహమాచరించుదుర్జనులు తమ

పౌరుషమునఁ దామే వంచింపఁబడి యపారసంసారఘోరదుఃఖములఁ బొలగుచుందురు సకలభూతదయాపరులగు సజ్జనులుమాత్రమే దైవతత్త్వ మెఱుంగఁజాలుదురు పతి యట్టిలోకోపకారపరాయణులు మాత్రమే దైవభక్తులనఁదగి తాము తరించి యొరులఁ దరింపించుచుందురు స్వార్థపరులై భూతద్రోహమాచరించు దుర్జనులు తాము చెడి యొరు- చెఱచుచున్నారు స్వలాభమాసింపక పరోపకారము నకు మాత్రమే జీవించు సజ్జనులపౌరుషమే ప్రత్యక్షస్వర్గము లోక ద్రోహమాచరించు దుర్జనులపౌరుషమే ప్రత్యక్షనరకము దైవాధీనము పౌరుషముగాని పౌరుషాధీనము దైవము కాదు పౌరుషము జడము దైవము- జ్ఞానము- దేహము తెలివినిబట్టి నడుచునుగాని దేహమునబట్టి తెలివి ప్రవర్తిల్లదు

"పిట్ట దొరకినప్పుడు పిల్లికి శీమా" అనునట్లు ప్రతిజీవునకు నిద్రాహారవిహారసుఖాభిలాష స్వభావముకదా ? నిద్రాహారవిహార సౌఖ్యము నిచ్చుపదార్థము లభించునపు డాపదార్థము సంపాదించుకొనుటలో నితరులకు బాధయయినప్పటికి నట్టిపదార్థమును విడుచుకొని తననిద్రాహారవిహారసౌఖ్యమును వదలుకొని పరులసుఖము కొఱకై తాను గష్టపడుట దేహధారికి స్వభావ మెంతమాత్రమును గానేరదు పౌరుష మనఁగా నిజనిద్రాహారవిహారసౌఖ్యములకొఱకై దేహధారిచేయుప్రయత్నము దైవమనఁగా నహంకారమమకారములు లేని యతీంద్రియపదార్థము ఇండ్లుకట్టుకొనుట మొదలగుపనులు పౌరుషశక్తిప్రయుక్తపాంచభౌతికకృత్యములు- యెండ వాన ఋతువులమార్పు మొదలగు కార్యములు పరోక్షదైవముయొక్క కృత్యములు పురుషేచ్ఛాను సారముగా భౌతికకృత్యములు

తటుచుగా సిద్ధించునుగాని దైవకృత్యములు మాత్రము పురుషుల యభీష్టము చొప్పున నెంతమాత్రమును జరుగఁబోవు పౌరుషము పురుషాధీనముగాని దైవమేమాత్రమును గాఁబోదు నక్షత్రముల నంటుకొనుటకై చేయు పురుషప్రయత్నము వ్యర్థము - దైవమున కసాధ్యములేదు - విధి చేయరానికార్యమే లేదు - మర్త్యుల శక్తికొలఁది పౌరుషము చెల్లును - పురుషులశక్తి మిక్కిలికొంచెము- దైవశక్తి యపరిమితము- దైవముతోడుపడినఁగాని పౌరుషము వృథాయగును- పౌరుషము దైవాయత్తము-దైవమున కిసుమంతయుం బౌరుషసాహాయ్య మక్కరలేదు దైవము మిక్కిలి స్వతంత్రము- పౌరుషమెంతయున్ దైవాయత్తమే- కావున పౌరుషమునకు దైవమెల్లవిధముల బీజమని చెప్పఁదగును- పౌరుషమును దైవమే ప్రేరేపించును- అహంకారమమకార ప్రయుక్తకార్యము పౌరుషము- అతీంద్రియపదార్థశక్తిజనితకార్యమంతయును దైవకృత్యము- లోకోపకారపరాయణులగు సజ్జనుల బ్రతుకంతయును స్వర్గహేతువగు దైవసంకల్పమే- జీవహింసకుల బ్రతుకంతయును నరకహేతువగు పౌరుషకృత్యమే కాఁబట్టి దైవానుగ్రహమునకుఁ బాత్రులయినసజ్జనులు జననమరణప్రవాహరూప సంసారకష్టములకు లక్ష్యపెట్టక స్వార్థత్యాగులై విరాగులై లోకోపకారపరాయణులై సర్వభూతసములై దైవముతో నేకీభవించి శాశ్వతానందపదవిని జూఱకొనుచున్నారు- సకలజగత్సృష్టిస్థితిసంహారకారణమగుదైవము నిజభక్తసంరక్షకమై సచ్చిదానందస్వరూపము కలదని దృఢముగ విశ్వసించి లోకోపకారముకై తాఁజేయు పురుషప్రయత్నమును సఫలముకావించుటకై యాదైవమును సర్వకాలము వేఁడుకొనుచు "సర్వేజనాః సుఖినో భవన్తు" అని జపించుచుంటకన్న మనుష్యు లాచరింపఁదగినకార్య

పౌరుషమునఁ దామే వంచింపఁబడి యపారసంసారఘోరదుఃఖములఁ బాలగుచుందురు సకలభూతదయాపరులగు సజ్జనులున్మాత్రమే దైవ తత్త్వ మెఱుంగఁజాలుదురు. మఱి యట్టిలోకోపకారపరాయణులు మాత్రమే దైవభక్తులనఁదగి తాము తరించి యొరులఁ దరింపించు చుందురు స్వార్థపరులై భూతద్రోహమాచరించు దుర్జనులు తాము చెడి యొరుల చెఱచుచున్నారు స్వలాభమాసింపక పరోపకారము నకు మాత్రమే జీవించు సజ్జనుల పౌరుషమే ప్రత్యక్షస్వర్గము లోక ద్రోహమాచరించు దుర్జనుల పౌరుషమే ప్రత్యక్షనరకము దైవా ధీనము పౌరుషము గాని పౌరుషాధీనము దైవము కాదు పౌరుషము జడము దైవము - జ్ఞానము- దేహము తెలివినిబట్టి నడుచును గాని దేహమునబట్టి తెలివి ప్రవర్తిల్లదు

“పిట్ట దొరకినపుడు పిల్లికి శీఁమా” అనునట్లు ప్రతిజీవునకు నిద్రాహారవిహారసుఖాభిలాష స్వభావముకదా? నిద్రాహారవిహార సౌఖ్యము నిచ్చుపదార్థము లభించునపు డాపదార్థము సంపాదించు కొనుటలో నితరులకు బాధయయినప్పటికి నట్టిపదార్థమును విడుచు కొని తననిద్రాహారవిహారసౌఖ్యమును వదలుకొని పరులసుఖము కొఱకై తాను గష్టపడుట దేహధారికి స్వభావ మెంతమాత్రమును గానేరదు పౌరుష మనఁగా నిజనిద్రాహారవిహారసౌఖ్యములకొఱకై దేహధారిచేయుప్రయత్నము దైవమనఁగా నహంకారమమకారములు లేని యతీంద్రియపదార్థము ఇండ్లుకట్టుకొనుట మొదలగుపనులు పౌరుషశక్తిప్రయుక్తపాంచభౌతికకృత్యములు- యెండ వాన ఋతు వులమార్పు మొదలగు కార్యములు పరోక్షదైవముయొక్క- కృత్యములు పురుషేచ్ఛను సారముగా భౌతికకృత్యములు

కలుచుగా సిద్ధించునుగాని దైవకృత్యములు మాత్రము పురుషుల యభీష్టము చొప్పున నెంతమాత్రమును జరుగఁబోవు పౌరుషము పురుషాధీనముగాని దైవమేమాత్రమును గాఁబోదు నక్షత్రముల నంటుకొనుటకై చేయు పురుషప్రయత్నము వ్యర్థము - దైవమున కసాధ్యములేదు - విధి చేయరానికార్యమే లేదు - మర్త్యుల శక్తికొలఁది పౌరుషము చెల్లును - పురుషులశక్తి మిక్కిలికొంచెము- దైవశక్తి యపరిమితము- దైవముతోడుపడినఁగాని పౌరుషము వృథాయగును- పౌరుషము దైవాయత్తము-దైవమున కిసుమంతయుం బౌరుషసాహాయ్య మక్కరలేదు-దైవము మిక్కిలి స్వతంత్రము- పౌరుషమంతయున్ దైవాయత్తమే- కావున పౌరుషమునకు దైవ మెల్లవిధముల బీజమని చెప్పకతీఱదు- పౌరుషమును దైవమే ప్రేరేపించును- అహంకారమమకార ప్రయుక్తకార్యము పౌరుషము- అతీంద్రియపదార్థశక్తిజనితకార్యమంతయును దైవకృత్యము- లోకోపకారపరాయణులగు సజ్జనుల బ్రతుకంతయును స్వర్గహేతువగు దైవసంకల్పమే- జీవహింసకుల బ్రతుకంతయును నరకహేతువగు పౌరుషకృత్యమే కాఁబట్టి దైవానుగ్రహమునకుఁ బాత్రులయినసజ్జనులు జననమరణప్రవాహరూప సంసారకష్టములకు లక్ష్యపెట్టక స్వార్థత్యాగులై విరాగులై లోకోపకారపరాయణులై సర్వభూతసములై దైవముతో నేకీభవించి శాశ్వతానందపదవిని జూఱకొనుచున్నారు- సకలజగత్సృష్టిస్థితిసంహారకారణమగుదైవము నిజభక్తసంరక్షకమై సచ్చిదానందస్వరూపము కలదని దృఢముగ విశ్వసించి లోకోపకారముకై తాఁజేయు పురుషప్రయత్నమును సఫలముకావించుటకై యాదైవమును సర్వకాలము వేడుకొనుచు "సర్వేజనాః సుఖినో భవన్తు" అని జపించుచుంటకన్న మనుష్యు లాచరింపఁదగినకార్య

మెద్దియును గాదని ప్రాజ్ఞులు సదాచారసంపన్నులై తాము తరించి తమతోడిపాటివారిం దరింపఁజేయుటయే యవశ్యకర్తవ్యము ధర్మము నుఁడి తా జాతి దుష్కార్య మాచరించి పరుల కపకారమొనర్చి నపుడు తనబుద్ధి తక్కువయనియును తనపౌరుషలోపమనియును బాహాటముగా నొప్పుకొనుచు తనప్రవర్తన మితరులకు మిక్కిలి నేమముచేసినవుడందరకు దైవసంకల్పము కారణముగాని నిక్కముగఁ దనపౌరుషశక్తి కాదనియును సజ్జనులు వెల్లడించుచుందురు. మాయా మాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః" "పౌరుషస్వరూపక పంచేంద్రియదృష్టమైన జగమంతయును మాయామాత్ర మనఁగా యథార్థముకాదు ఇంద్రియాతీతమగు దైవ మొక్కటియే వాస్తవము" అను నాప్తవాక్యమునుబట్టి దైవమే పౌరుషము పురుషప్రయత్నమునకు మూలము. దైవమే దైవముకాని పౌరుషమే లేదు మఱియును పురుషప్రయత్నమునకుమూలముమాయాస్వరూపకమగుమనోవిభ్రాంతి సర్వమును దైవమే యనునిశ్చయజ్ఞానముఁగలవా రొక్కింతయును ఫలాపేక్షతోఁ బురుషప్రయత్నము చేయఁబోరు మఱియునదమకులభించినకష్టసుఖముల నొక్కతీరుగా నుపేక్షించి యేకాగ్రచిత్తముతో సమస్త జగత్కార్యములు కల్లలనిగాని కేవలదైవకృతములనిగాని నిరూఢముగా భావించుచు మంటి నంటియునంటని కుమ్మరిపురుగు చందమున నిర్లిప్తులై నిత్యానందమున నుందురు అహంకారమమకారములఁ ద్యజించుటచే "యోగరతోవా భోగరతోవా సంగరతోవా సంగవిహీనః, యస్య బ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ" అనునట్లు పాపకార్యములందును పుణ్యకార్యములందును కష్టములందును సుఖములందునుగూడ నొక్కపోల్కిగా నాకాశమువలె నంటీయంటక భూతభావికాలముల స్పృహ యొకింతయు లే

కేవలవర్తమానకార్యజ్ఞానమాత్రానుభవరూపకమగు శాశ్వతస్వర్గా
నందసౌఖ్యము ననోలలాడుచుందురు అట్టి శాశ్వతస్వర్గానందపదవి
స్వార్థత్యాగియై సర్వభూతదయాపరుఁడై లోకోపకారపరాయణుఁడైన
వానికిఁ గ్రమక్రమముగా నహంకారమమకారములు దొలంగుటచేత
మాత్రము లభించును దైవముపై భారమువేసి స్వకులవిహితా
చారము ననుసరించి సర్వలోకోపకారముగాఁ బ్రవర్తించు పురుష
ప్రయత్నము మనుష్యులకందఱికవశ్యకర్తవ్యము పురుషప్రయత్న
మంతయు సర్వలోకోపకారములగు విద్యలను తెన్నగ నేర్చి యొనర్ప
వలయును చతుర్విధాభినయాత్మకములయి సర్వజగదుపకారములగు
సకలవిద్యలు పదునెన్మిదిమహావిద్యలు మఱి యఱువదినాల్గు కళల
యందు సంతర్భూతములై యున్నవి

ఇది శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాస విరచితమగు
జగజ్జ్యోతియందు దైవపౌరుష నిర్వచనము



# జగజ్జ్యోతి

## రెండవ ప్రకాశము

### దైవ పౌరుషనిర్ణయము

గీ॥ సకలబుధులఁ దీర్చిన సంయమీంద్ర
జగతిఁ బుంభావవాణివై తగు యతీంద్ర
ఎవ్వఁడైనను నీ కీడ యీడనాడ
వర నభోధామ యోగ భరద్వాజనామ॥

అహంకారమమకారాత్మక పౌరుషముచేత మనుష్యులు పంచేంద్రియసాహాయ్యముచే సహజముగు ద్వైతజ్ఞానముచేత నతీంద్రియదైవమును సకల జగత్కార్యప్రవర్తక మూలకారణముగా భావించుచున్నారు. చతుర్విధాభినయములకును జగత్సృష్టిస్థితిలయతత్త్వము నిర్దేశించుటకు మఱియు నతీంద్రియమగు దైవముయొక్కయునికిని స్థిరపర్చుటకును బురుషప్రయత్నరూపకమగు పౌరుషమే కారణము పంచేంద్రియ వ్యాపారమును మఱి యట్టివ్యాపారముచే సాధింపఁబడిన సమస్తవిద్యలును పౌరుషస్వరూపములే. అతీంద్రియపదార్థమగు దైవముకూడఁ బౌరుషముచేతనే యెఱుంగఁబడుటచేతను "పురుష ఏవేదగ్ం సర్వమ్ యద్భూతం యచ్చభవ్యమ్ అసంగోహ్యయం పురుషః" భూతభవిష్యద్వర్తమానకాలములయందలి వస్తువులన్నియును పురుషుఁడే. పురుషుఁడు తప్ప జగమునం దితరపదార్థమే లేదు. పురుషుఁడు కేవలుఁ డెద్దానినంటకుండును అనుటచేత పంచేంద్రియజన్యమగు పౌరుషమునకు మఱియు నాపౌరుషముచేత నిర్దేశింపఁబడిన యతీంద్రియదైవమునకును భేద మొక్కింతయును లేదు పౌరు

వమే దైవము మఱియును దైవమే పౌరుషము పౌరుషము శరీరము వంటిది దైవ మాత్మవంటిది పౌరుషము దైవము లొకదానివిడిచి యొకటి ప్రకృతిపురుషులవలె నుండనేరవు స్మృతిచే దైవ మెఱుఁగఁ బడును దైవముచే స్మృతికిఁ బ్రవృత్తికలుగును కాఁబట్టి స్మృతిరూపక మగు తెలివియే పౌరుషమును దైవమును మఱియుఁ బ్రకృతిపురుషు లను కనిపెట్టుటచేత నిక్కముగా జ్ఞానముకన్న వేఱే మఱి యేవస్తు వైనను లేదు సుషుప్తిరూపకమగు విస్మృతియందు శూన్యముతప్ప మఱెద్దియు ననుభూతముకాకుంటచేతను మనఃప్రవృత్తిరూపకమగు స్మృతిచే జాగ్రత్స్వప్నదశాభేదముచే జగత్కార్యములన్నియు నెఱుం గఁబడుటచేతను వస్తువులయునికి లేములు స్మృతిచేమాత్రమే తెలియఁ బడుటచేతను స్మృతిరూపకజ్ఞానముతప్ప మఱియేపదార్థమును లేదని యును-"ప్రజ్ఞానంబ్రహ్మ" జ్ఞానముమాత్రమే సత్యపదార్థము తక్కిన వస్తువులన్నియు నున్నట్లు తోఁచుచున్నవి కాని వాస్తవముగా లేవు "బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా" ప్రజ్ఞానమే వాస్తవము మఱి జగ మంతయును స్వప్నమువలె మనోభ్రాంతికృతము గాని వాస్తవము కాదను నాప్తవాక్యానుసారముగా నిశ్చయముగాఁ జిత్తవికారముచే జాగ్రత్స్వప్నములును ప్రశాంతచిత్తముచే సుషుప్తియును స్మృతిచే నెఱుంగఁబడుచున్నవి సుషుప్తియందలి విస్మృతి ప్రకృతి - మఱి స్వప్నజాగరములయందలి స్మృతి వికృతి- లౌకికసుఖదుఃఖములు రెండును లేకున్న సుషుప్తరూపక విస్మృతి ప్రకృతియును ముక్తి యును బరమార్థమును, మఱియు సుఖదుఃఖోభయాత్మకజాగ్రత్స్వప్న రూపకస్మృతివికృతియును బంధమును మిథ్యయునగును ఎడతెగని యాత్మధ్యానముచేత సకలజగత్కార్యములయెడఁ గలుగుసుఖదుఃఖ ములు రెండింటిని బొత్తుగా మఱచి పంచేంద్రియవ్యాపారజ్ఞప్తి

యొక్కంతయు లేక విస్మృతిచెందినజనుఁడు మనోవాక్కాయకర్మము
లాచరించుచున్నట్లు పైవారికి మాత్రమే తోఁచునుగాని వాస్తవ
ముగా సుఖదుఃఖముల నంతయు నంటక జీవన్ముక్తుఁడై బ్రహ్మీ
భూతుఁడగుచున్నాఁడు భూతభవిష్యద్వర్తమానకాలము నతిచి
పోవుటయేనిశ్చయముగాఁబరమపురుషార్థము గాఢవిస్మృతిరూపకమగు
సమాధిని గొనుటకై చేయుపౌరుషమునకును దైవమునకును నంత
యును భేదము లేదు అట్టి కైవల్యానందకరమగు గాఢవిస్మృతిరూపక
బ్రహ్మసమాధియనుతుది మెట్టెక్కించుటకు సర్వలోకోపకారకప్రవర్త
నముకన్న నితర సాధనము లేదు లోకోపకారకప్రవర్తనసాధనము
నిక్కముగా సకలవిద్యలను దెలిసికొనకతప్ప నితరము కానేరదు
కాఁబట్టి స్మృతిరూపకపౌరుషము విస్మృతిరూపకకైవల్యానందపదవి
చేకూరును సకలజగమును సమస్తవస్తువివేకమును సర్వవిద్యలును పౌరు
షాత్మకస్మృతిమూలకములే- అగ్ని కట్టెలచేఁ బ్రజ్వలించి యాకట్టెలతో
పాటు బుగ్గియై నశించినతీరుగా నిపౌరుషాత్మకస్మృతి సకలజగత్కార్య
జ్ఞానముచే విస్తరించి జగముతోపాటు విస్మృతిరూపముగా రూపు
మాయును సకలలోకోపకారక చతుర్విధాభినయాత్మకవిద్య లెవ్వి
యనఁగా ఋగ్యజుస్సామాధర్వములను నాల్గువేదములు- ఆయుర్వేద
ధనుర్వేద- గాంధర్వవేదశిల్ప వేదము ను నాల్గుపవేదములు- శిక్షా
వ్యాకరణచ్ఛందోజ్యోతిషనిరుక్తకల్పములాఱు వేదాంగములు-పురాణ
న్యాయమీమాంసాధర్మశాస్త్రములుకలిసి యష్టాదశ విద్యలు,
ఇందు వేదములుమాత్రము పౌరుషేయములు కావు అనఁగా
మనుష్యకల్పితములు కావు వేదములు స్వయంవ్యక్తము లనఁగా
వానికొక కర్త యెవ్వఁడును ఘటమునకుఁ గుమ్మరివలె లేఁడు-
వేదములు వ్యక్తసముద్రఘోషమువలె ననాదిగా నున్నవనియర్థము

మఱి యట్టిశబ్దబ్రహ్మమునకుఁ బ్రకృతిప్రత్యయము లేర్పఱిచి పదఘటిత వాక్యరూపముఁ గావించి యింద్రుఁడువివిధార్థబోధకము లుగానొనర్చె నని వేదభాష్యము చెప్పుచున్నది శబ్దము వర్ణాత్మకముగాను మఱి యుచ్చనీచాత్మక కేవలస్వరరూపకముగాను గన్పట్టుచున్నది. కృతకత్వ హేతువుచేత శబ్ద మనిత్యముగాన వేదములు నిత్యములును స్వతస్సిద్ధములు నపౌరుషేయములును గావని తార్కికు లనుచున్నారు కృతక మనఁగా ఘటమువలె నింద్రియదృష్టమును బౌరుషేయమును ఇంద్రియ గోచరమైనదెల్ల కృతకము పౌరుషేయ మన నిత్యమున నుత్పత్తిస్థితినాశముగలకార్యమే యనుశబ్దముఁ గూడఁ గరణవ్యాపార విషయత్వముచేత ననిత్యమని యనుమానించు తార్కికులు ద్రవ్య గుణకర్మ సామాన్యవిశేషసమవాయాభావాత్మక సప్తపదార్థములుఁ గూడ నింద్రియవిషయము లగుటచేఁ గృతకము లని యేల చెప్ప కున్నారు? ఇంద్రియాతీతములగు పరమాణ్వాకాశాత్మలయొక్క యునికి నెట్టింద్రియవ్యాపారముచే నంగీకరించుచున్నారో చెప్పఁ గలరా? వేయేల "అహమస్మి" నే నున్నాను - అని తమ కరణ వ్యాపారముచేఁగదా తెలిసికొనుచున్నారు కనుక నింద్రియగ్రాహ్య ములగు తమయాత్మలుకూడఁ గృతకములని యొప్పుకొనెదరా? ప్రత్యక్షప్రమాణాంతర్భూతములే లెక్కిన యనుమానాదిప్రమాణము లన్నియును గనుకను గరణవ్యాపారవిషయము కాని తమయాత్మస్థితి తమ కప్రత్యక్షముగనుక తమయునికి నిజమా లేక బద్ధమా? ద్రవ్య మింద్రియదృష్టమగుటచేతఁ గుమ్మరిచే నిర్మింపఁబడినకుండవలెఁ బృథి వ్యప్తేజోవాయ్వాకాశకాలదిగాత్మమనస్సులనునవద్రవ్యములు కృత కములేయని చెప్పెదరా? ప్రత్యక్షానుమానోపమానశబ్దప్రమాణము లలో వేదములా ప్తవాక్యాత్మక శబ్దప్రమాణ మొక్కటియే యుక్తి కగోచరమై నిల్చును అన్నిటికిని నమ్మకమే ముఖ్యము స్వప్నము

వలెను బిచ్చివలెను మదవికారమువలెన తర్కమున కొక ముఖ్య-
మైన గాని యాధారము గాని యాతము గాని నిర్ణయింప శక్యము
కాదు తార్కికుననును బిచ్చివానికి నొకింతయును భేదము లేదు
ఎన్నటికిని తార్కికుఁడు సంతుష్టుఁడు కానేరఁడు తనయుక్తిచేత
నిదమిద్ధమని నిర్ణయించిన తార్కికుననుఁగూడఁదుద కాప్తవాక్యా
త్మకవిశ్వాసమే శరణము పుణ్యవశమున మొదటనుండియు నాప్త
వాక్యాత్మక వేదనిత్యత్వమును విశ్వసించి సంతుష్టుఁడగు శ్రద్ధాళు
డాస్తికవైదికుఁడు ద్రావిడప్రాణాయామమువలె డొంకతిరుగుడువ్యర్థ
తర్కశ్రమచేఁ బదార్థతత్త్వజ్ఞాని ననుకొన్న పామండతార్కికునివలె
నుభయభ్రష్టుఁ డాఁబోఁడు. నమ్మకముచేఁగాని సంతుష్టికలుగనేరదు
తర్కము నమ్మకమును బాడుచేయును. కాఁబట్టి ఆప్తవాక్యప్రమా-
ణైకశరణ్యులుగాక ప్రత్యక్షానుమానోపమానములచేతమాత్రమే
పదార్థనిరూపణముచేయు పామండులమత మెంతమాత్రమును సమం
జసముకాదు శబ్దాత్మకమగు వేదము నిశ్చయముగా సత్యము
నిత్యము నని శ్రద్ధావంతుఁడయి యాప్తవాక్యైకప్రమాణముచే
నిశ్కమగు విద్వాంసుఁడు తెలిసికొని తా సుఖించి పరోపకారము
చేయఁగలిగి యుభయలోకములం దరించుచున్నాఁడు. ఎన్నితుట్టులో
యన్ని మట్టులన్న ట్లీతర్కవాదముల కంతమున్నదా? తర్కము
చిత్తక్షోభహేతువుగాని సంతుష్టికారణ మొక్కింతయు నగానేరదు
యుక్తి కేయుక్తి లేదుగనుక యుక్తియనునది శశవిషాణమువలె
కృత్రిమము కాఁబట్టి యాప్తులగుపెద్దలమాట నమ్ముకొని తమ
యుక్తికిఁగిట్టనిదంతయు సరికాదని యేవగించక సకలలోకోపకారక
మును సకలజనసమ్మతమగు శ్రద్ధనువహించి వైదికమతమును విశ్వ
సించి నమ్మకముచేతమాత్రమే తరించవలెను కృతక మనఁగాఁ గరణ
వ్యాపారవిషయత్వముకదా? అనఁగా నింద్రియగోచరము నింద్రియ

కల్పితము నింద్రియవ్యాపారసాధ్యము నగుకార్యము కృతక మని తార్కికు లర్థము చెప్పుచు శబ్దము కృతకమగుటచే నిత్యముకాదను చున్నారు వేదములు శబ్దాత్మకములు గనుక వేదము లనిత్యము లనియుం బౌరుషేయములనియుం దలంచుచున్నారు కంఠతాల్వాది జనితములగు నాద్యచ్చులును కాదిహల్లులును మఱి యావర్ణసందర్భ ములగు పదములు వాక్యములును నిత్యములుకావు ముఖనాసికాదీం ద్రియవ్యాపారవిషయములగు వర్ణములును పదములును మాత్రమే శబ్ద మనుకొని యట్టి శబ్దమయములు వేదములని భ్రమపడి శబ్ద మనిత్యమనియును గృతకమనియును వేదములు పౌరుషేయములు ననిత్యము లనియు నవివేకముగఁ దలంచుచున్నారు శ్రవణేంద్రియ మాత్రగ్రాహ్యము శబ్దమనియును శబ్దగుణక మాకాశమనియును సర్వసమ్మతమే కదా? శబ్ద మనఁగా చెవిచేతమాత్రమే గ్రహింపఁ దగినపదార్థము. ఆశబ్దము మంద్రమధ్యతారస్థాయిభేదములచేఁ ద్రి విధము లయి మఱి యవాంతరస్థాయిభేదములచే ననంతవిధములయి వినఁబడుచున్నది శబ్దము ధ్వని మ్రోఁత చప్పుడు ఇవన్నియును సమా నార్థకములు శ్రవణేంద్రియ మాత్రగ్రాహ్యమగు నాకాశగుణము శబ్దము సముద్రజలమునకు మఱి యాసముద్రతరంగజలమునకు వస్తు భేదములేనట్లు శుద్ధబంగారమునకు కడియముచేయఁబడిన బంగారున కును వస్తుభేదము రవంతయునులేనివిధమున శబ్దవిశేషములన్నియును గేవల శ్రవణేంద్రియమాత్రగ్రాహ్యములగుట యందు వస్తుభేదము బొందనేరవు కాలమునకు క్షణము గడియ జాము పగలు రాత్రి దినము వారము పక్షము నెల యేఁడు మొదలగువిభాగములు మన స్సుచే గల్పించుకొన్నట్లు శబ్దమున కచ్చులు హల్లులు పదములు వాక్యము లుదాత్తానుదాత్తములు మనఃకల్పితములు కాని వాస్త వములు కావు ఆకాశమునకు ఘటాకాశపటాకాశభేదములు మనః కల్పితములయినట్లు శబ్దమునకు వర్ణములుకూడ మనఃకల్పితములే

కరణవ్యాపారవిషయము కృతక మనిత్యము పౌరుషము నైనయెడలఁ
గరణములుఁగూడ ననిత్యములగుటచేఁ గృతకములు నశించునుకదా?
"ప్రమితివిషయాః పదార్థాః" అనుటచే బుద్ధిచే గ్రహింపఁబడిన
వన్నియుఁ బదార్థములన్నియు నవి ద్రవ్యాదిసప్తపదార్థములనియుఁ
బ్రమాణాదిషోడశపదార్థములనియును విభజించుచున్నారు బుద్ధికి
సాధనము లింద్రియములు మఱి యింద్రియవ్యాపారవిషయములు
శబ్దస్పర్శరూపరసగంధములు పృథివ్యప్తేజోవాయ్వాకాశగుణములు
కరణవ్యాపారవిషయత్వమున ముఖనాసికాది కరణవ్యాపారవిషయ
ములగు వర్ణములు కృతకము లనిత్యములుం బౌరుషేయము లయిన
తీరున ఘటాకాశ పటాకాశాక్షర విశేష నీలపీతాదివర్ణవిశేషమధు
రామ్లాదిరసవిశేషగంధవిశేషములన్నియును గరణవ్యాపారవిషయత్వ
హేతువుచేతఁ గృతకములు ననిత్యములుం బౌరుషేయములును
గాకతీరవుకదా? ఫలితార్థము బుద్ధి యింద్రియముల ద్వారమునఁ
గని పెట్టినపదార్థములన్నియును గృతకములు ననిత్యములుం బౌరుషే
యములని చెప్పకతీఱదు ఈశ్వరబుద్ధి నిత్యమనియును మర్త్యబుద్ధి
యనిత్యమనియును నిర్ణయించిన యుక్తవాదులు నిత్యానిత్యపదార్థ
ములు రెండింటికిని నిత్యానిత్యత్వము-యాదుమాత్రము తేజస్తిమిర
ములవలెఁ బరస్పరభేద మొప్పుకొనుచున్నారుగదా? తేజస్తిమిరము
లన్యోన్యగ్రాహకములు కానట్లు నిత్యానిత్యవస్తువు లన్యోన్యగ్రాహ
కము కానేరవుగదా? అనిత్యమర్త్యబుద్ధి నిత్యేశ్వరబుద్ధి నెట్లు
గ్రహింపఁగలదో తార్కికులు చెప్పఁగలరా? కంటిచే వినరానిపోల్కి
మఱి చెవిచేఁ గనరానివిధమున సజీవునిచే మృతస్థితియును మృతునిచే
జీవితమును దెలియఁబడనితీరున నింద్రియములచే నతీంద్రియము
గ్రహింపఁబడునా? పదార్థము లేడింటిలో గుణ మొక పదార్థమని
యును మఱి యాత్మయొక్క గుణము బుద్ధియనియు జీవాత్మపర

మాత్మభేదముచే నాత్మ రెండు తెఱఁగులనియు జీవాత్మపరమా
త్మలు రెండునునిత్యము లేగాని తద్గుణమగుబుద్ధిజీవాత్మయెడలననిత్యము
పరమాత్మయెడల నిత్యముగా నున్నదనియును జీవాత్మలగు తార్కి
కులు నిశ్చయించి కాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనుచున్నారు
మనుష్యప్రాణము పశుప్రాణము శిశుప్రాణము పక్షిప్రాణము కీట
ప్రాణము ఆర్యప్రాణము మ్లేచ్ఛప్రాణ మని ప్రాణభేదము గణించు
బుద్ధిహీనులవలె నాత్మభేదమును మరి యాత్మగుణవిభేదమును నిర్దే
శించు తార్కిక ఒక వాదమునకు నున్మత్తప్రలాపమునకును భేదము
కాన్పించదు మొట్టమొదట బాలదశయం దీతార్కికునకు హితా
హితవస్తుయథార్థజ్ఞానము కేవలము తలిదండ్రులు మొదలగు నాప్తు
లచేఁ గదా కలిగెను? కాఁబట్టి యాప్తవాక్యమే తక్కిన ప్రమాణము
లన్నిటికి నాటపట్టు అట్టి యాప్తవాక్యరూపకమగు వేద మిదమిత్థ
మ్మని తనయూహకు వచ్చినట్లు తార్కికుఁడు నిశ్చయింపఁబూనినచో
గ్రుడ్డు పిల్లను వెక్కిరించుటే కదా? పురుషునిచేఁ దెలియఁబడినదెల్ల
పౌరుషమే అపౌరుషేయమగు పదార్థమే లేదు పురుషుఁ డనఁగా
స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థలను గనిపెట్టి యుండు సాక్షితత్త్వము ఆత్మ
కుంబురుషునకుఁ భేద మొక్కింతయును లేదు పురుషాత్మశబ్దములు
గగనాకాశశబ్దములవలెఁ బర్యాయపదములు ఆత్మకు స్వప్నజాగ్ర
త్సుషుప్త్యవస్థలనుగనిపెట్టుట సహజగుణము సత్త్వరజస్తమోగుణత్రి
తయాత్మకజాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను గనిపెట్టు తెలివియే పురుషుఁ
డనియు నాత్మయనియును గణింపఁబడును "సాక్షీచేతాః కేవలో
నిర్గుణశ్చ" అను నాప్తవాక్యప్రమాణము నవలఁద్రోసి యొండెము
కను గొఱుకుచుఁ దననోట గారెడునెత్తు రాయెముక దని పీల్చు
కుక్కవలెఁ భ్రాంతుఁడై తన సహజగుణకల్పితమగు స్వప్నజాగ్ర
త్సుషుప్త్యవస్థాత్మకమాయాప్రపంచమును నొడమూవు లను జల

భ్రాంతిచే వ్యవహరించుమృగమువలె నవురా తార్కికుఁ డెంత వృథాశ్రమమునకుఁ బాలై సంతుష్టిఁగనని పిచ్చివాఁడు. ప్రమితి-ప్రమాణము- ప్రమేయము నను మూఁడు నన్యోన్యాశ్రమములును బరస్పరజనకములును గాక తీఱవు

ప్రమాణముచేఁగాని యథార్థజ్ఞానరూపకమగు ప్రమితి కలుగనేరదు ప్రమేయమున్నఁగాని ప్రమాణమునకుఁ బ్రవృత్తి కలుగనేరదు తార్కికయుక్తులన్నియుం బరికాయ పీచువలె నొకదాని కొకటి పొందక తలవులిమినట్లు తనకే తానరిపడక "పాత్రాధీనం ఘృతంవా ఘృతాధీనం పాత్రంవా" యని తర్కించి నేయి పోఁగొట్టుకొన్నయవివేకి చందమున దార్కికుఁడు తనతర్కపరంపర కంతము గానక యెప్పటికైన సమాధానపడనేరక మిక్కిలియసంతుష్టుఁడై వెలితిచూపున దేవులాడుచు డును సంశయాత్మా వినశ్యతి" యనునట్లు గ్రాహకమును గ్రహించుటకు జ్ఞాత నెఱుఁగుటకు తనతలమీఁదఁ దాఁగూర్చుండుటకు ఆకాశమును బ్రద్దరచేయుటకుఁ బూనుకొని యాప్తవాక్యైకప్రమాణశరణుఁడై యాస్తికుఁడై శ్రద్ధాభక్తులన్గొనదు జగదుపకారమగు వైరాగ్యమవలంబించని కుక్షింభరులకుమాత్రము తర్కములు మెండు భక్తిజ్ఞానవైరాగ్యములచే సర్వలోకహితముగా వైదికులుమాత్రమే సంచరింపఁగలరు వైదికులన వేదము ననుసరించువారు వేదమాప్తవాక్యము ఆప్తులు సర్వలోకోపకారపరాయణులు సర్వలోకోపకారకమగు నభినయవిశేషము వేదము ఆప్తవాక్యమే వేదము వేదమే యాప్తవాక్యము చతుర్విధాభినయవిశేషములచే సర్వలోకోపకారముగాఁ జేసినయుపదేశమే యాప్తవాక్యము శబ్దప్రమాణ మనఁగాఁ జతుర్విధాభినయవిశేషములచేఁ జేయఁబడిన హితోపదేశము కాఁబట్టి శబ్దప్రమాణాత్మకాప్తవాక్యము సకలేంద్రియవ్యాపార విషయముగాని కేవలశ్రవణేంద్రియగ్రాహ్యమే కాదు

శబ్దప్రమాణము కగాద్యక్షరాత్మకమనియును ముఖనాసికాద్యవయవ సంజనితాక్షరస్వరూపమనియును దార్కికులు విపరీతముగా భావించుచు శబ్దము కృతకముగనుకఁ బౌరుషేయమనియు ననిత్యమనియును తప్పనాడుచు వేదశబ్దార్థమెఱుంగక వేదములు పౌరుషేయములనియుఁ గృతకములగుటచే ననిత్యమనియును బల్కుచున్నారు నీటిలోఁ జిన్నగానున్నకఱ్ఱ వంకగానగపడునట్లు ప్రతిక్షిప్తధ్వని సహజశబ్దముకన్న విపరీతస్థాయితో వెలువడుతీరున దూరపుకొండ నున్నగానున్నతీరునఁ బంచేంద్రియస్థితివిశేషములచేతను మానావస్థావిశేషముచేతను సహజములగు శబ్దాదిపంచగుణవిశేషములు సత్త్వరజస్తమోగుణస్థితివిశేషములంబట్టి విపరీతముగాఁ దెలియఁబడునుగాన యున్నదున్నట్లు యథార్థస్థితులన్దోపనేరవు జీవులయింద్రియములకుఁ బాంచభౌతికగుణము లెంతమాత్రమును యదార్థసహజస్థితి నొప్పదగట్టవు నిత్యములగు భౌతికగుణము లనిత్యములను విభ్రాంతిహితములనగుదేహధారుల యింద్రియములచే నెట్లు యదార్థస్థితి గ్రహించును ?

పరాపశ్యంతీమధ్యమా వైఖరీరూపములతోఁ బరమాత్మ జీవాత్మలన్నిందుకొనియున్నట్లు నాదబ్రహ్మము చతుర్విధాభిన్నయ విశేషస్వరూపమై సకలజగన్నిదానమై నిత్యమైయున్నది నాదముయొక్క వివర్తరూపమే యీసమస్తజగము "అతో నాదాత్మకం జగత్" అని శాబ్దికులు వక్కాణించుచున్నారు శబ్దతత్త్వము శాబ్దికులెఱుంగుదురుగాని తార్కికుల కేమెఱుక ? "నాగస్వరముపాట నాగుపా మెఱుంగుఁగాని తుంగదుబ్బలోఁ దిరుగుతుట్టె మెఱుంగు-జ్ఞాని యెఱుంగు సుజ్ఞాని మఱుంగు అజ్ఞాని యేమెఱుంగు హరిదాసులెఱుంగు" "నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్" అన్నట్లు లేనిపోనితర్కములతోఁ దంటాలుపడుచు మనస్సునఁ జాలు

ప్రాగునవయవహీనంబగు తార్కికులకు ఇంద్రియవ్యాపారావిషయ
బ్రహ్మానందకరమగు శబ్దతత్త్వ మెట్లెఱుంగంబడును ? "నాదబ్రహ్మ
ముపాస్మహే" అనునట్లు నాదోపాసనపరులగు వైయాకరణులు
శాబ్దికులుమాత్రమే శబ్దబ్రహ్మస్వరూపమగు వేదముల నిత్యా
నిత్యములు నిరూపించుటకర్హులు కావున తార్కికులకు శబ్దబ్రహ్మ
స్వరూపములగు వేదములు చెవిటివానిచెంగటి శంఖధ్వని. తన
యుక్తిచే నింకొకని యుక్తిని ఖండింపవచ్చునుగాని తన నమ్మకముచే
నింకొకనినమ్మకమును జెఱుపలేకుండుట యెల్లరికి విశదమేకదా! ప్రత్య
క్షానుమానోపమాన ప్రమాణములు బాల్యదశయం దెవ్వరికైన
నక్కఱకావు ఆప్తవాక్యమన్నిదశలందును బనికివచ్చును

ఉభయతారకముగా సకలలోకోపకారమగు తెన్నునం దన
కాప్తులగు తల్లిదండ్రులు మొదలగు పెద్దలు తనకొసర్చునుపదేశ
మాప్తవాక్యము. శ్రుతిస్మృతి పురాణేతిహాసముల ననుసరించి లోకా
పచారమున కనుకూలముగాం దనహితముం గోరి లోకోపకారపరా
యణులగు సజ్జనులు తనకుపదేశించినవిధ మాప్తవాక్యము. ప్రత్య
క్షానుమానోపమానప్రమాణము లొకప్పుడుపనికిరాకపోవచ్చునుగాని
యాప్తవాక్యమును నమ్ముకొన్నవారి కెన్నండును గీడు వాటిల్లదు
"నమ్మి చెడినవారు లేరు నమ్మక చెడిపోతే పోయేరు" అన్నట్లు
ఆప్తవాక్యముపై భక్తివిశ్వాసములుకలవారు సకలలోకోపకార
పరాయణులై యుభయలోకములం బరించి నిత్యసంతుష్టిస్వరూపమగు
కైవల్యానంద మందెదరు గౌతమవ్యాసులు పరమాప్తులు "పదార్థ
తత్త్వజ్ఞానాన్నిశ్శ్రేయసావాప్తిః" యని యాదినైయాయికుండు సర్వ
లోకమునకుం బరమాప్తుండును గౌతమమహర్షి మతమగు తర్క
మతము, "జ్ఞానేనైవమోక్షావాప్తిః" యను రెండవ యాప్తుండైన
వ్యాసమతము, "భక్తిర్జ్ఞానాయకల్పతే" యను భగవద్వాక్యము

"త్యాగేనై కేనామృతత్వమేతి" యను వచనమును నిక్కముగా
సమానార్థకములేయని తెలిసికొని యాప్తవాక్య స్వరూపములగు
శ్రుతిస్మృతిపురాణేతిహాసయథార్థతత్త్వమును సకలభూతదయాపరులు
సర్వభూతనములు సర్వలోకోపకారపరాయణులు సకలశాస్త్రవేత్త
లగు సత్పురుషులయుపదేశమున గ్రహించి యెల్లరునుదరింపవలయును

మంత్రబ్రాహ్మణాత్మకములగు వేదము లనాదులు అపౌరు
షేయ మనఁగా నాకాశవాణి యని యర్థము. మేఘగర్జిత మపౌరు
షేయము అవ్యక్తానాదిశబ్దమున కింద్రుఁడను నాదిపురుషుఁడు
ప్రకృతిప్రత్యయము లేర్పరచి లోకోపకారముగా నాదాభివ్యక్తి
గావించెనని చెప్పుటచే వర్ణములు పదములు వాక్యములు తదర్థములు
మాత్రము పౌరుషేయము లనకతీఱదు నానావిధములుగా నవ్యక్త
శబ్దబ్రహ్మమును వెల్లడించిరి కాఁబట్టి శబ్దబ్రహ్మముమాత్ర మపౌరు
షేయము నిత్యమును గాని యక్షరసమామ్నాయ మనిత్యము పౌరు
షేయ మని గౌతమమహర్షి యభిప్రాయమని తెలియవలయును
పురుషులచే నుచ్చరింపఁబడుశబ్దము పౌరుషేయము ననిత్యమును
కాఁబట్టియే వేదములు వ్యావహారికసత్యములుగాని పారమార్థిక
సత్యములుకావని లోకులకు మంచినమ్మిక నభివృద్ధిచేయుటకై వేద
ములు అనాదివ్యాకరణసూత్రములు దేవాలయములు తీర్థములును
బ్రహ్మాదిదైవనిర్మితములుగాని పౌరుషేయములు కావని మునులు
మొదలగు పెద్దలు లోకోపకారార్థమై యర్థవాదమొనర్చిరి పురుష
కృతము పురుషసృష్టమునగు పురుషేంద్రియగ్రాహ్యమగునదెల్ల పౌరు
షేయమే శబ్దాదిగుణముల పౌరుషేయములు నిత్యములును గాని
యాశబ్దాదిగుణముల వివిధ విశేషకథనముమాత్రము పౌరుషేయము
ననిత్యము. శ్రవణేంద్రియమున కవ్యక్తముగా వినఁబడు నాకాశగుణ
మగుశబ్దము పౌరుషేయము నిత్యముగాని యాధ్వనియొక్క యుదా

త్తానుదాత్తవర్ణపదవాక్యార్థములు కృతకములు పౌరుషేయము లనిత్యము లనక తీరదు కాఁబట్టి "అగ్నిమీళే" యను మొదలు వేదాక్షరసమామ్నాయము నంగవేదాంగములును మానవులు వెల్లడించు నఖిల విద్యలును గర్మములును బోధలునుపదేశములును సకలేంద్రియ దృష్టములై సకలవిధముల వెల్లడింపఁబడిన మనోవాక్కాయ కర్మములన్నియును వ్యావహారిక సత్యములుగాని పరమార్థసత్యము లెంతమాత్రమును గావు సత్య మపౌరుషేయ మవ్యక్త మాత్మైక వేద్యము గాని యింద్రియములచే నెఱుఁగఁబడ నసాధ్యము మఱియు వెల్లడింపఁబడ నసాధ్యము "యత్ర నాన్య త్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా" యనుటచే నింద్రియదృష్టము నింద్రియ కృతము నగు జగమంతయు నవిషయకమగుటన కల్పితముగాని నిత్యము వ్యాపకము నెంతమాత్రము గాదను జగద్గురుబోధను విశ్వసించిన వారు కైవల్యానందమును జూఱకొనుచున్నారు వ్యావహారికసత్యము ననుసరించి ప్రవర్తించినఁగాని పరమార్థము గ్గనరాదు గనుక వ్యావహారికసత్యములగు దేహేంద్రియదృష్టి వేదవిద్యల నెఱుంగవలయును

ధర్మమును బ్రహ్మమును గూర్చి వెల్లడించు నపౌరుషేయ ప్రమాణవాక్యము వేద మనఁబడును మంత్రరూపముగాను బ్రాహ్మణ రూపముగాను వేదము ద్వివిధము- మంత్రబ్రాహ్మణములకు రెండింటి కిని వేద మని పేరు అనుష్ఠానమును జేయించు భూతద్రవ్యదేవతల న్వెల్లడించునవి మంత్రములు- ఋగ్యజుఃస్సామము లని మంత్రములు మూఁడువిధములు "అగ్నిమీళే" ఇత్యాది గణపాదచ్ఛందోబద్ధ ములు ఋక్కులు అవియే సప్తస్వరాత్మకముగాఁ బాడఁబడునవి సామములు- ఋక్సామవిలక్షణములగునవి యజుస్సులు "అగ్నే వగ్నే స్వాహా" యను సంబోధనరూపములగు మంత్రములు నిగదములన

ఐడి యజుస్సులలోఁ జేరినవి బ్రాహ్మణముచూడ విధిరూప మర్థవాద రూపమును విధ్యర్థవాదరూప వీక్షణరూప మనియును మూఁడు విధములు అందు శబ్దభావన విధియని భాట్టులు- నియోగము విధియని ప్రాభాకరులు- ఇష్టసాధనత విధియని తార్కికులును దలంచుచున్నారు విధులన్నియు నుత్పత్త్యధికారవినియోగప్రయోగభేదముల నాల్గువిధములు అందు "అగ్నయేష్టాకపాలోభవతి" అనునది దేవతా కర్మస్వరూపమాత్రబోధకము నది యుత్పత్తివిధి "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామోయజేత" యని యిట్లు చేయవలసిన యజ్ఞఫలమును బోధించిన దధికారవిధి "వ్రీహిభిర్యజేత"అని మొద లంగసంబంధమునుజెప్పునది వినియోగవిధి సాంగప్రధానాదికర్మప్రయోగైక్యమును బోధించుచు మొదటిమూఁడువిధులు కలిసియున్నది ప్రయోగవిధి- ఆప్రయోగవిధి శ్రౌత మని కొందఱు కల్ప మని మఱి కొందఱును బల్కుచున్నారు కర్మస్వరూపము గుణకర్మ మర్థకర్మమని ద్వివిధము అందు క్రతుకారకముల నాశ్రయించి చెప్పఁబడినది గుణకర్మము- ఈగుణకర్మ ముత్పత్త్యాప్తి వికృతిసంస్కృతిభేదముల నాల్గువిధములు- అందు "వసన్తే బ్రాహ్మణోఽగ్నీనాదధీత యూపం తక్షతి" ఈరీతిగా నాదానతక్షణాదులచే సంస్కారవిశిష్టాగ్నియూపాదులచే నగునది యుత్పత్తి- "స్వాధ్యాయోఽధ్యేతవ్యః-గాః పయోదోగ్ధి" అని యధ్యయనదోహనములఁ జెప్పుచున్నది ప్రాప్తి- "సోమమభి షుణోతి-వ్రీహీనవహన్తి-ఆజ్యంవిలాపయతి" అని సోమవ్రీహ్యాజ్య ములయభిషవాభిఘాత విలాపములఁ జెప్పునదివికారము- "వ్రీహీన్ప్రోక్షతి ప్రత్యవేక్షతే" అని వ్రీహ్యాదిద్రవ్యప్రోక్షణాక్షణము లెఱింగించునదిసంస్కారము- ఈనాల్గు నంగమే- క్రతువును గ్రతుకారకములనాశ్రయించిచేయఁబడునర్థకర్మముఁగూడనంగ మనియు బ్రధాన మనియును రెండువిధములు- అన్యార్థమైన దంగముగ అనన్యార్థము-

ప్రధానము- సన్నిపత్యోపకారకమ్మారాదుపకారకమనియు నంగములు కూడ రెండువిధములు అవహననప్రోక్షణ ఫలోపకారియగుచు ప్రధానస్వరూపనిర్వాహకము మొదటిది- ప్రయాజాదికము రెండవది- ఇట్లు సంపూర్ణాంగసంయుక్తవిధి ప్రకృతి యనంబడును. వికలాంగ ప్రయుక్తవిధి, వికృతి యనంబడును ఈప్రకృతివికృతులకు విలక్షణమైనది దర్వీహోమము తక్కినదికూడ నిట్లే యూహింపవలయును

విధిశేషభూతమై ప్రాశస్త్యనిందలం జెప్పువాక్య మర్థవాదము- ఈ యర్థవాదము మూండువిధములు- గుణవాద మనువాదము భూతార్థవాదమునై, ఈమూండింటిలో "ఆదిత్యోయూపః" అను మొదలుగ ప్రమాణాంతరవిరుద్ధార్థబోధకము గుణవాదము "అగ్నిర్హిమస్య భేషజమ్" అను మొదలుగాం ప్రమాణాంతరప్రాప్తార్థబోధకము అనువాదము- "ఇంద్రోవృత్రాయవజ్రముదయచ్ఛత్" అను మొదలుగాం ప్రమాణాంతరవిరోధితప్రాప్తరహితార్థబోధకము భూతార్థవాదము- విరోధముండు గుణవాదము-అవధారితముం దనువాదము- ఆరెంటి లేనియందు భూతార్థవాదము ఇట్లర్థవాదములు మూండువిధములని వార్త్తికకారుండు నిర్దేశించెను అందు విధిస్తుతులవిషయమై మూండర్థవాదములు సరిగాం జెల్లినప్పటికిని భూతార్థవాదములకు స్వార్థమునందుం బ్రామాణ్యము కలదు దేవతాధికరణన్యాయమునుండి యబాధితాజ్ఞాతార్థజ్ఞాపకత్వము ప్రామాణ్య మనంబడును గుణవాదానువాదముల కట్టిప్రామాణ్యము లేదు భూతార్థవాదమునకు మాత్రము విశేషముగాం బ్రామాణ్య మున్నది విధ్యర్థవాదోభయవిలక్షణమగునది వేదాంతవాక్యము, అజ్ఞాతజ్ఞాపకత్వమున్నప్పటికను ష్ఠానమును కోరకుంటచే నద్ది విధి కాదు- స్వతఃపురుషార్థ పరమానందజ్ఞానాత్మకబ్రహ్మమందు స్వార్థమున నుపక్రమోపసంహారాది షడ్విధతాత్పర్యలింగము కలిగియుండుటచేస్వతఃప్రమాణభూతములైన

సర్వవిధుల నంతఃకరణశుద్ధిద్వారా స్వశేషత నాపాదించుచు శేష
త్వాభావముచేత నర్థవాదమును కాకున్నది కాఁబట్టి విధ్యర్థవాదము
లను రెంటికిని వేదాంతవాక్యము విలక్షణమైనదే కాని యద్ది
యజ్ఞాతజ్ఞాపకత్వమాత్రము నొక్కఁడ విధియని చెప్పఁబడుచున్నది
మఱియును విధిపదరహితప్రమాణ వాక్యత్వముచేత నొక్కఁడ
భూతార్థవాదమనియుం బల్కఁబడుచున్నది కాఁబట్టి వేదాంత
వాక్యము విధియన్నను లే కర్థవాదమన్నను దోషములేదు ఈరీతిగా
బ్రాహ్మణము మూఁడువిధములుగా నిరూపింపఁబడెను కాఁబట్టి కర్మ
కాండబ్రహ్మకాండాత్మవేదము ధర్మార్థకామమోక్షహేతువై వెల
యుచున్నది.

యజ్ఞనిర్వాహార్థమై ప్రయోగత్రయము చేత నీవేదము ఋగ్య
జుఃసామభేదములచే వేఱువేఱుగ నున్నయది ఋగ్వేదముచే హౌత్ర
ప్రయోగము యజుర్వేదముచే నాధ్వర్యవప్రయోగము సామవేదముచే
నౌద్గాత్రప్రయోగము నగుచున్నవి ఈమూఁడు ప్రయోగములందే
బ్రాహ్మయాజమానప్రయోగము లంతర్భూతములు. యజ్ఞానప
యుక్తశాన్తికపౌష్టికాభిచారికాదికర్మప్రతిపాదకత్వముచేత నథర్వ
వేదము ఋగ్యజుస్సామవేదములకంటెఁ దవిలక్షణమైనదే ఇట్లు ప్రవచన
భేదముచేఁ బ్రతివేదమును దేనికదివేఱే వేదశాఖలు పెక్కులు మఱియుం
గర్మకాండమునందు వ్యాపారభేదమున్నప్పటికిని వేదశాఖలయన్నిం
టికిని బ్రహ్మకాండమం దొక్కటియే రూపము తత్ప్రయత్నము
కొనసాగనప్పుడు సమస్తకార్యములను నడుపు దేవుఁడో దయ్యమో
యొక్కవస్తువుకలదనుకొనుటయు నాదయ్యమో దేవుఁడో యీయీ
విధములనుండుననియు మఱియాదయ్యమునో దేవునినో యీయీ
విధములవశపఱచుకొనవచ్చుననియును మఱి యట్టి యతీంద్రియపదార్థ
ములదేవతయొక్క యనుగ్రహముచే తమకసాధ్యములగు కదవులు

నుండఁగలమనియును మనుష్యులూహించి మనోవాక్కాయకర్మములఁ బ్రవర్తిల్లుట యనాదికాలమునుండి పశ్వులకెగురుటవలెఁ జేఁపలు జలమందు సంచరించుటవలె స్వభావముకనుక మనుష్యసృష్టికలిగిననాఁటనుండియు నతీంద్రియపదార్థము లభావించి సంస్కృతభాష మొదలగు నానావిధభాషలతో నానావిధదేశములందు దేవతల గల్పించుకొని నానావిధకర్మములు దేవతాప్రీతికై యొనర్చుచు మనుష్యులందఱు నసాధ్యకార్యము లు సాధింపనుద్యమించుచున్నారు తమ కలవికాని యీతిబాధలను యజ్ఞయాగాదిక్రియలచేఁ దప్పించుకొనుటకును వేయేల తమకోరినయెల్ల సౌఖ్యములును వివిధమంత్రతంత్రయంత్ర యోగములచే నతీంద్రియదైవమును భావించియావేశమెత్తినట్లాడలు మఱచి పిచ్చిపచ్చిచేష్టలొకరింజూచి యొకరు దైవము ప్రత్యక్షముగాఁ దనకుఁ జెప్పెనాఁతనియును మునిమతమనియు ననాదివేదచోదితమనియును యజ్ఞములను యాగములను బలిప్రదానములను నానావిధపూజలను నానాభాషాప్రకల్పితమంత్రజపములను నానాతీర్థక్షేత్రవ్రతవిధానములను నానాదేవాలయనిరాకారసాకార దైవవిగ్రహభావనా సేవనస్తోత్రపరిచర్యలనుసకలసౌఖ్యము నాసించి బ్రతుకునందువలె నాత్మమరణముపిదపఁ గూడనుండునని దృఢముగ నమ్మికొని లోకమర్యాద నతిక్రమింపనేరక మూఢవిశ్వాసముతోఁ గొందఱుఁ వివేకులమని కొందఱు యోగులమని కొందఱు శిష్టాచారపరులమని కొందఱు చెంగటి మంచినీళ్ళకుండను బోఁగొట్టుకున్న నూపుగింజ బ్రాహ్మణుని సామెతగా లేనిపోనియూహలతోఁదమతోడిపాటి జంతువుల యాహారాదిసౌఖ్యములకుఁ దోడై సకలభూతదయతో సర్వలోకోపకారముగఁ బాటుపడుటమాని యాకసమునకుఁ గన్నము చేయఁబూనిన యవివేకులవలె భ్రాంతులై మనోవాక్కాయకర్మములం దమబ్రతుకున లోకోపకారమొనర్చుచు నొరుల సుఖపెట్టి

కాము సుఖపడక దేవానాంప్రియులయిగణించుట మనుష్యుల సహజ
గుణము తనరాదుట "అన్నమో వస్త్రమో దాహమో రోగమో
దుష్టులు బాధించుచున్నారు రక్షించుఁడో కనికరించుఁడో కాపా
డుఁడో" యను తమతోడిపాటిజీవు) మొఱ్ఱనురవంతయు న్లక్ష్యపెట్టక
ప్రాగినవారివలె నున్మత్తులవలె భ్రాంతులవలె నవివేకులు నీటిలోను
నిప్పులోను బుగ్గిలోను వ్యర్థముగా నాహారపదార్థములఁ బాడు
చేయుచు రాతిబొమ్మపైఁ బాలు దిమ్మరించుచు కాళ్ళువిఱుచుకొని
కొందఱు చెట్లకుఁ దలక్రిందుగ వ్రేలాడుచు నుపవాసములనొందుచుఁ
గొందఱు నీళ్ళలో మునిఁగి కొందఱు నగ్గిలోమాడి కొందఱు దేశదేశ
ములం బిశాచములమాడ్కి దిమ్మదిరుగుచుం గొందఱయ్యో మాన
వుల వెఱ్ఱి మతభ్రాంతచేష్ట లేమనవచ్చును? "పరోపకారః పుణ్యాయ
పాపాయ పరపీడనమ్. అహో సా పరమోధర్మః అవశ్య మను
భోక్తవ్యం కృతంకర్మ శుభాశుభ"మను అనుభవవాక్యము లనుస
రింపక లోకోపకారకవ్రతమును దృఢముగ మనస్సున ధారణము
చేయక పిచ్చిపిచ్చిచేష్టలతోఁ గర్మపరులమని పశులం జంపి
యగ్గిలో మంచి తినఁబడిపదార్థములను వ్యర్థపుచ్చుచున్నా రను
బౌద్ధ చార్వాకమతములును ప్రౌఢమనుష్యస్వభావము కొంతయును
గలిసి మూఢప్రౌఢమతస్వభావములతో మనుష్యు లనాదిగాఁ గర్మ
జ్ఞాన కాండలనొప్పు వేదము ననుసరించియున్నారు పుట్టినతోనే
యేడ్చుపిల్లలుఁ బాల్గుడిచినంత సుఖముండుట పొడగాంచి నిద్రాహార
ములకు వలయు నదుపాయములు తల్లులు చేయుచుండుట సకలజంతువుల
కును స్వభావము దేహధారణమునకుఁ గావలసిన యన్నపానములు
సుఖనిద్రకై తగిననదుపాయములు గాలి యెండ వానల బారినుండి
తప్పుకొనుటకై యిండ్లు వాకిళ్లు కావలసినయాహారపదార్థములు సమ
కూర్చుకొనటకై పొలములు పాఁడికై పసులు వ్యవసాయమునకై
తగినపనిముట్లు సంభోగసౌఖ్యమునకై తమ తమ యెన్నుకొనిన స్త్రీ

పురుషావయవవిశేషములు- ఆరోగ్యముతో శాశ్వతముగా తాము దనకిష్టమైనవారిగా బ్రతుకునుపాయములు విదేశీయులకన్నను మము ప్రతికక్షులకన్నను దమయిరుగుపొరుగులకన్నను సకలవిధముల తాము దనవారు నధికభోగభాగ్యములందు దూఁగు కోరికలును- మనుష్య జాతికి స్వభావముగనుండ జగమునందలి సమస్త పదార్థతత్త్వజ్ఞానము సంపాదించుకొనుటకును సకలభూతములను వశపఱచుకొనుటకు యథేష్టము సంచరించుటకును ముల్లోకముల నడ్డులేక కామగమనము సల్పుటకును పంచభూతములను మఱి సమస్తజగమును యథేష్టముగా సృష్టిస్థితిలయములు చేయుటకు నణిమాద్యష్టైశ్వర్యములతో విఱ్ఱవీగుటకును సహజముగా నయసుముదిరినకొలంది లోకానుభవముకలిగినకొలంది పంచభూతవిశేషస్థితులుకనిపెట్టినకొలంది మనుష్యులతలంపులు కొనసాగుచుండ సహజము కనుకను, అనాదిగాఁ బారంపర్యముగా వచ్చుచున్న శ్రుతిస్మృతిపురాణేతిహాసాదిసకలవిద్యలతీంద్రియములగు స్వర్గనరకములను భూతభవిష్యజ్జన్మములను సుఖదుఃఖహేతుకర్మములను బోధించుచు మనుష్యులందు చతుర్విధాభినయ రూపముల వెలయుచుంటచేతను నిద్రాహారసంభోగములం గడుపఁగా మిగిలిన కాలమును నిద్రాహారసంభోగసౌఖ్యమును సమకూర్చుకొనుటకై ప్రయత్నముచేయఁగా ఆమూఁడింటియందు తృప్తిపడి మఱి యా మూఁడింట ననుభవించుటకు శక్తిలేనికాలమున మనుష్యులుశాశ్వతాభీష్టసంపదలుఁ బొందునాశతో యజ్ఞయాగజపతపోధ్యానాద్యాస్తిక కర్మపరాయణులు గతానుగతికులై శ్రౌతస్మార్తకర్మము లాచరించుట నవ్వు- సకలపదార్థములం దెలిసికొనుకోర్కెవలనే కాల్పనము గడచినమానవులకు సహజోపలభ్యమగు గుణము, వారికి దేవతా ఇన్నట్లు నానావిధకార్యములు నడిపించుటకు నానావిధ దేవతలును నానావిధ దేవతలను వశపఱచుకొని సుఖించుటకై నానాశ్రౌతస్మార్త

కర్మములను తినుటకును నిద్రించుటకు భోగించుటకు శక్తి చాలక కాలమంతయును విధివిహితములనియును శాశ్వతజీవనసౌఖ్యదాయకములనియును స్వార్థపరులగు వంచకు లొనర్చినయుపార్థములను నమ్మికొని యేమో యెందుకైనను మంచిదే యుత్తరజన్మము లొకవేళ నున్నయెడల స్వర్గనరకములు నిక్కములగునెడల నతీంద్రియులగు దేవతలయునికి నిజమగునెడల వేత్తుమని కర్మబ్రహ్మల నారాధించుచుఁ దమకెంతమాత్రము ధనభోగేచ్ఛలేదని రుద్రాక్షపిల్లుల వలె దంభాచారముతోఁ దా మందు నిద్రాహారవిహారభోగములు మాత్రమే శాస్త్రవిహితములని కొంగజపములు చేయుచు, నక్కవినయములతో దొంగసష్ఠలతో మెట్టవేదాంతములతో శిష్టాచారపరులమని యోగులమని సన్న్యాసులమని యాహితాగ్నులమని బ్రాహ్మణులమని దైవభక్తులమనియుఁ జాటుకొనుచు వేషమాత్రముచే మూఢులను వంచించుచు, నిగూఢముగా సకలభోగము లనుభవించుచుండియుం బైకిమాత్రము మడికట్టుకొన్నట్టు లగపడుచు నెంతవృద్ధులయినప్పటికి నిద్రాహారసంభోగసౌఖ్యము లితరులకన్న నధికముగాఁ దాము మాత్రమే పొందుకోరిక మఱుఁగుపఱచి పరులకు మాత్రము వైరాగ్యమును నీతులను ధర్మములును వేదాంతమును బోధించుచు, కాయకష్టమునకు సోమరులై మఠములు సత్రములు దేవాలయములు క్రతువులమిషచేతఁ గొందఱు, ఉపనయనములు వివాహములు బ్రహ్మప్రతిష్ఠలు వైదికములు మతాభివృద్ధిసంఘసంరక్షణములని కొందఱును మొత్తము నందఱును స్వార్థపరులే యందఱును కుక్షింభరులే యందఱును మోసగాండ్రే కూటికొఱకుఁ గోటివేషములతో వైదికులమని యాస్తికులమని యాచకులై పరువుమాలి పిశాచములవలె పట్టణముల న్బాధించుచు, శ్రుతిస్మృతిపురాణేతిహాససమ్మతాస్తికశిరోమణులమని చెప్పుకొనుచుఁ బుచ్చినగొఱ్ఱె మ్మందనంతయుం జెడుపు

నట్లు తాము చెడి యొరులం జెఱుచుచున్నారు శాస్త్రము లబద్ధ
ములు కావుగాని యాశాస్త్రములు సరిగాఁ దెలిసికొని తాము
శాస్త్రానుసారముగా నడిచి యొరులను నడిపించఁగల మనుష్యులో క
రిద్దఱె నఁగలరో లేరో. అన్నిరోగముల నుపశాంతిచేయుమందులను
శాస్త్ర మెఱిఁగి సంపాదించుకొని తన బతుకుక యథేష్టముగాఁ
భోగించుకొని యిదిగో యిదే శాస్త్రానుసారమైనమందు చూడుఁ
డీరోగమింతలోఁగుదిర్చెద నని తనరోగముఁగాని తనవారిరోగములం
గాని కుదుర్చుకొని యిదీరోగము దీని కీమందు శాస్త్రమునఁ జెప్పిన
దౌషధియిదేయీరోగియిన్నాళ్ళుజీవించునీరోగ మిన్నాళ్ళకుకుదురు
నని వెల్లడిగాఁజాటిజెప్పి తనయిచ్చవచ్చినన్నాళ్ళుతాఁబతికి యితరుల
బ్రతికించినవైద్యులులోకము లోనెక్కడనుగనున్నారా? వైద్యముజ్యోతి
షము. పౌరోహిత్య మాధ్వర్యవమాభిచారికకర్మ మాస్తిక్యమతధర్మ
బోధలు మంత్రోపదేశములు వేయేల సకలజ్ఞాతవసుజ్ఞానకకర్మగురు
పాదతీర్థసేవావిధు లివన్నియును స్వార్థపరులగు కుక్షింభరులు వంచ
కులు నగుసంసారుల కెంతమాత్రముం బనికిరావు అహంకారమమ
కారదూషితులగువారికి శాస్త్రములర్థముకావు మఱియు మునుల
మాహాత్మ్యాభిప్రాయము బొత్తిగాఁ దెలియదు స్వార్థత్యాగులై సకల
భూతదయావరులై సర్వలోకోపకారపరాయణులై సజ్జనులకెల్ల శ్రుతి
స్మృతులుయథార్థముగాబోధపడునుగానియట్టివిద్వాంసులబోధనతీవర్త
నము కులటకు రుచించనట్టులహంకారమమకారాభిమానదూషితులగు
సంసారులకురవంతయునంటగు సకలజగత్కార్యముల నడిపించునధిదేవ
తలు సకలదేవతల యనుగ్రహమును సంపాదించుకొనఁగల మంత్రకర్మ
ములు నతీంద్రియస్వర్గనరకములు నానావిధదేవతలు వివిధౌషధములు
శ్రుతిస్మృతిపురాణేతిహాసకథితములైనయిహపరసంతరణోపాయములు
వాస్తవములుగానున్నవట్టింగేవలలోకోపకారపరాయణులుసంసారు

ంలో మెలఁగుట మిక్కిలి యరుదుగాన సకలశాస్త్రము లపార్థముగా స్వార్థపరులగువంచకులచేఁ బ్రకటింపఁబడుటచే సద్గము లోని ధనము మాటవలెనే శ్రుతిస్మృతిప్రయోజనము వృథాప్రయాసకరమును నిష్ఫలమునై కేవలముదరపోషణార్థమై సంసారరోగాభివర్ధకమై యనర్థమగుట మనుష్యులకు సహజమగు దురదృష్టము తనతోడిపాటి జీవులుపాయిగానుండుటకై తనకష్టములు మఱచియైన సంతోషించుచు "సర్వేజనాః సుఖినోభవన్తు" లోకులందఱు హాయిగానుండుటకై కోరుటయే మనుష్యుఁ డాచరింపవలసినవిధి యని సర్వశ్రుతిస్మృతి పురాణేతిహాసముల తాత్పర్యమని స్వార్థత్యాగియైనలోకోపకారపరాయణుఁడగుసజ్జనునకుబోధపడకమానదు అట్టిసర్వభూతదయాపరుఁడై లోకోపకారపరాయణుఁడైన సజ్జనుఁడుమాత్రమే యజమానుఁ డాస్తికుఁడు వైదికుఁ డనూచానుఁడును ఆరమార్థికుఁ డనఁదగును

"యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ" చతుర్వేదాభినయవిశేషము లు మనస్సుతోఁగూడ నేతత్త్వము నెఱుఁగఁజాలక యాపత్యపదార్థము నెప్పటికైనఁ దెలిసికొనఁజాలమని బోత్రిగా నాన వదలుకొని మళ్ళుచున్నవో యను శ్రుత్యనుసారముగా రెక్కపట్టుకొని ఇలిమింబట్టినఁ బగలురానిదానికిఁ దనవెంటరమ్మని తారుమఱుప్రగమ్మిన యామానసడిరేయి నగనన్న చేసినచందమునఁ బ్రత్యక్షముగా గురువు లాప్తులు బోధించినను దెలియనితత్త్వము, మూఁగసంజ్ఞలగు నక్షరముచేతను మఱి యనాదిగాఁ బరంపరాగతము లగుటచే సామర్థ్యము జీర్ణించి యుచ్చారణసౌష్ఠవము బోత్రిగా నశించి సంసారపాపపంకిలహృదయులగు పొట్టమూఁతిపండితమ్మన్యులచే నవస్వరముగా కూటియాసతో మొఱఁగావింపఁబడిన శాస్త్రాఱుధ్వనులచేతను మెండియు నహంకారవిమూఢులగు కుక్షింభరులచేతఁ బక్షపాతముగా నపార్థముగా వ్యాఖ్యాన మొనర్పఁబడుటచేతనువ్యవస్థ

లేని నానార్థములతోఁ బ్రతిశబ్దమును సంస్కృతభాష నానావర్ణములఁ దోఁచు స్ఫటికమువలె విభ్రాంతిజనకమగుటచేతను వేదశాస్త్రముల యందలి మన్విప్రోక్తభాష యెంతో మఱి యీ వేదశాస్త్రములయందు స్వమతాభిమానులగు వంచకులు మార్చి దూర్చినమాటలెన్నో యల్పజీవులగు మర్త్యులు కనిపెట్టఁ దరముకాదు

"ముద్గోల్పచలః" ముద్గశబ్దమునకు న ల్పచలశబ్దమునకు వైద్యశాస్త్రమున నర్థమేమి? ముద్గ మనఁ బెస లనియు నల్పచల మనఁగా విశేషవాతమునుబుట్టించక త్వరగా జీర్ణమగుననియు నర్థములు చెప్పుచున్నారు ముద్గ యనుశబ్ద మనాదియగు సంస్కృత భాషకదా? ముద్గ మనుశబ్దమున కనాదిగ నాంధ్రుల కర్థముచెప్పుటకుఁ బెస లనుశబ్దముఁగూడ సంస్కృతముతోఁ పాటున్నదనవిలా? ఒడలుగాఁ బరిణమించినబీజమం దొడ లెదుగుచున్నకొలఁది బయలగు రోమరాజివలె ననాదిగా మాతృభాష ప్రవర్తించినకొలఁది నానాథము మొదలగ దేశభాషలుకూడఁ బ్రవర్తిలుచుంటకేన దియుము? మాతృభాషయన నొడలికి బీజము చెట్టునకు విత్తువలె సకల భాషలకు మూలమగుధ్వని విశేషము సంస్కృతప్రాకృతాద్యఖిలభాషలకు,నానావర్ణములు పెక్కురకముల కొలతలు పలువిధముల యందములు గల శరీరస్థితుల కాదికారణము మనుష్యులకు జరాశయమగు విధమున నవ్యాకృతాకాశ గుణమగు నిత్యావ్యక్తశబ్దమే మూలమనకతలదు ముద్గమనఁగాఁ బెస లనియుఁ బెసరగింజ- పెసర మొక్క- పెసరాకు- పెసరపిందె- పెసరకాయ- ముదిరిపండిన పెసరచేను- పెసలలో నెన్నిరకములున్నవో- పచ్చపెసర- నల్లపెసర- పిల్లిపెసర మొదలుగా పెసరచే లెన్నివిధములో- యేపెస లేగుణమునిచ్చునో- యేరోగము శాంతించుట కేపెస లెట్లు వాడవలయునో- పచ్చిదా లే కుడికించినదా? పప్పు లేక పిండియా? యేపయసువారి కెట్టి

రోగమున కెంతమాత్ర మేవేళలం దెట్లు సేవించవలయునో ప్రాజ్ఞులగు
గురువులు బుద్ధిమంతులగు శిష్యులకుఁ బ్రత్యక్షముగా బోధించి
నప్పటికిఁ బ్రమాదముచేసినప్పుడప్పు డప్రయోగమూలమున నౌషధ
సేవ నిష్ఫలమగుచుండఁగా నేనాఁడో పుట్టిన సర్షకయును సంస్కృత
మునకు మొన్న మొన్నఁ బుట్టిన కొండభాషవంటి తెలుఁగులోనా వా
లన్ని యర్థ మెవరో యెన్నఁడో చింకితాటాకులలోఁ బక్కరినారని
డబ్బునతోఁ జిన్నావాలో పెద్దవాలో వర్ణావాలో సరసావాలో
వేదేశవావాలో యెట్టియావాలో నిజమైనయావాలో శేకావాలవంటి
యింకొకగింజలో యెవ్వియో నూతి కంటికిఁ బెట్టి నది తుంటి
కంటించి రొక్కమును భేషజమున లంకించుకొనుచు దుంటరులు
తామే శాస్త్రపండితులమనియును సమవైద్యమే శాస్త్రీయమని
యును సుదిరినప్పుడు తమ ప్రయోజకత్వమనియు లేనిచో దైవ
మనియును స్వలాభముకై తోఁచినట్లెల్ల సందులు చేయుచు తనది
కానిచో గోదావరివఱకు దేఁకరమన్నట్లు పై వారికి మాత్రా ప్రయో
గము కావించి ముందుగా సుందుకొనకని డబ్బులంకించుకొని తమ
యప్రయోగముచేఁ గొత్తరోగములంబుట్టించు నపమృత్యువులకుఁ
గారణమౌ లోకద్రోహమాచరించువిధమునఁ యాజకులమనియు
ననూచానులమనియును శ్రోత్రియులమనియును దంభవేషములతో
మూఢులను వంచించి యకార్యకరణములు నశ్లీలములు జుగుప్సిత
ములు బీభత్సములునగు మంత్రతంత్రప్రయోగముచేయుట వ్యర్థము
మంచి మంచి యాహారపదార్థములగ్గిపాలుగావి చియునాథ జంతులగు
మేఁకలం బెక్కుస్మిక్కలి కూళతనమున మెడలంబిసికించి వేదార్థములు
తాము స్వయముగాఁ జూచివచ్చిన ట్లభినయించుచు యజ్ఞదేవతలు
తమ కొకసడుచున్నట్లు కన్నులు మిటకరించుచు బొంతకాకులవలె శ్రుతి
జాతియును లేక యపస్వరముగ నార్చుచు నుద్గాతలు హోత లాగ్నీ

ధుమని పొట్టలుబ్బ తేగతిని క్రొవ్వి క్రతుశాలలం బర్విడుచుఁ పౌండరీకము బహిరంగపుపందిలికూటము ? సోమాసితలవిప్పించు నెగ తాళినవ్వులు దక్షిణలు కాక కట్నము లు కానుక లందుటకై చేయు టక్కులు తామే ద్విజులమనియు బ్రాహ్మణులనియు శ్రోత్రియుల మనియుం దమకు స్వర్గము బెత్తెడెడముగాఁ జేతులకందివచ్చుచున్న దనియు, పావనులమనియు నితరులందఱును గర్మబాహ్యులు మ్లేచ్ఛులు నస్పృశ్యులనియును స్వార్థపరాయణులై పండితమ్మన్యులై యహం కారమున మతిమాలి యున్మత్తులవలె దొంగలవలె దుర్మార్గులు సెక్కండ్రుకుట్రగా గుమిగూడి ప్రాణిహింసకావించుచులోకద్రోహ మాచరించు చున్నారని కరుణాసముద్రుఁ డగు గౌతమబుద్ధుఁడు చేసినబోధ యెంతయు నహేతుకమనకతీఱదు

ఏదీ జపహోమమంత్రములచే దేవతల స్వాధీనముచేసి కొన్నట్టు దంభముజూపు నిక్కటికయాజకులు తమరోగముల మాన్పు కొనఁగలిగిరా ? యథేష్టముగా బ్రతుకగలిగిరా ? తమచావుం బాగు పర్చగలిగిరా ? వేదము లేవియో పురాణమునులు శ్రుతులెట్లు పలికిరో యా వేదవాక్యములకు మునులొసర్చిన వ్యాఖ్యానముల తాత్పర్యమేమో కల్పమెట్లుండవలయునో- కూటికై వృత్తికల్పించు కొని సోమరులై కర్మచెడిపోవునని శతవృద్ధులయ్యుఁ బెక్కుసారులు కనికరములేక ఎలజవ్వనులకేవగాఁ బొడ్లాడుచు బ్రహ్మలోకమునుండి తాముమాత్రమే యూడిపడ్డట్లు పిచ్చిపిచ్చివేషములతో నగ్గిమైల బగ్గి మైల నీరు మైలు నింగి మైల యని యసందర్భప్రలాపము లొన ర్చుచు లోకోపకారముగా మనోవాక్కాయకర్మములఁ గష్ట పడి నిష్కాపట్యముగా సత్యముగా న్యాయముగా సర్వప్రాణుల కుపకారముగా సర్వభూతసములై దయతో సంచరింపక “పశు మాలభేత” యను వాక్యమునకు చేతికిఁ జిక్కిన పేకత్తి

మేకలం బట్టించి యాపవనగ్గిలో వేల్చవలయునిది వేదవ్యాఖ్యాతల తాత్పర్యమని గతానుగతికముగా శిష్టసంప్రదాయమని మసలమ్మ దయ్యాపుముచ్చటలనమ్మమూఢులచందమున భూతద్రోహులు, లోక వంచకులు, కేవలస్వార్థపరు , దయావిహీనులు, ప్రాణిహింసకులు అయినవారు వైదికులై పాడుజన్నగట్టులకు తెలివా-తేటా ? శబ్ద జ్ఞానమా ? స్వరజ్ఞానమా ? సాలజగ్రంజక సహజపాండిత్యమా ? పర్వతంత్ర స్వతంత్ర శక్తియా? దయయా? దాక్షిణ్యమా? సిగ్గా? లజ్జా? ధైర్యమా? పౌరుషమా? పరశ్రేయస్సహనమా? పోకిరీకూటికై యెన్ని పోకిళ్ళుపోనీ మరెన్ని వేషములు వేయనీ వీరి కేమి చేటుగాల మన్యాయముగా వ్యర్థముగా ప్రాణిహింస క్రతువిధ స్థాపించు చున్నారే? ఈ శబ్దమున కీయర్థమనియు నీధ్వని కిద్దిమూ-మనియును నిర్దేశింప నెవ్వరికిశక్యము ?

వివిధదేశములందు వివిధజాతులలో వివిధసంఘముల యందలి వివిధకుటుంబములలో వివిధవయస్సులు సహవాసములంబట్టి వివిధసమ యంబుల వివిధప్రసంగములకతమున నొక్క-శబ్దమే యొక్క- ధ్వనియే వివిధతాత్పర్యంబులుగఁ బరిగణింపఁబడునని తెలియక "పశుమాల భేత"యనువిధికి దేవతాప్రీతికై కొన్నిరకములజంతువులఁ జంపవలయు నని మాంసాశనులై క్రూరులై హింసాపరులై తమప్రాణంబులు తమ కెంతతీపియో యితరుల కట్లుండునని యెంచక తమయాస్తి భద్రముగాఁ దాఁచుకొని యితరులద్రవ్యము వెచ్చపెట్టించు ధూర్తుల వలె తా ముప్పొద్దుల మెక్కి- యితరుల కేకాదశిం జాటు తుంటరి వలె తనయాలికి ముసుఁగిడి యొరునాలి నెగాదిగఁజూచుపోకిరివలె వ్యవహరించువైదికమ్మన్యుల నేమనవలయు? జీవత్పశువునకుఁ బ్రతిని ధిగాఁ బిష్టపశువును వేయు వైష్ణవమతమును జగద్గురు వంగీకరించిన తాత్పర్య మెఱిఁగియు నెఱుఁగ కింకను జీవత్పశుహింసనొనర్చు మూర్ఖులనేమనవచ్చును? "నహింస్యాత్సర్వభూతాని" అను శ్రుత్యర్థ

మెఱుంగఁజాలని మూర్ఖులు ఎంతకాయలేఁగుంజ వున్నట్లు వైదికమ్ము న్నీలు క్రతువుం బలివుఁ జూపుచున్నారు

సంస్కృతము ఛందస్సనియు భాషయనియును రెండువిధములు. ఛందస్సనగా నపౌరుషేయవాక్యగుంభమగు వేదము. భాషయనఁగాఁ బ్రాకృతులగు లోకులన్యోన్యము తమతమ యభిప్రాయములు తెల్పుకొనుటకై యుపయోగించుకొను సాంకేతికశబ్దధ్వని. నిత్యాపౌరుషేయావ్యాకృతశాశ్వతపరిచ్ఛేదాఖండశబ్దము వేదము. అది సముద్రఘోషవలె ననాదిగా సహజమై యనిర్వచనీయమై నిత్యమై యమానవపేక్షమైన యాకాశగుణము. ఆశబ్దమును లోకోపకార పరాయణులతీంద్రియద్రష్టలగు మునులు బాలబోధకై దేవతలకుఁ గనుముక్కులతో శిలాదారుమయములుగా విగ్రహములఁగల్పించినట్లు దైవధ్యానము కల్గి జనులు తరించుటకొఱకును సకలపదార్థజ్ఞానము కలుగుటకొఱకును బ్రకృతిప్రత్యయములు తీర్పరి దైవస్తుతికై ఋగ్వేదము గాను దైవధ్యానమునందాసక్తి యాయాసము తెలియనీకుండుటకై ధాన్యపుమళ్లం బనిచేయువారలకుఁ బడవలన్నాగువారికిన్ రంజనము పుట్టించుటకుఁ బాటవంటి సామవేదము నాటికై యజుర్వేద కల్పవిధానము సృజించిరి. శిలాదారువిగ్రహమున నవయవములకు మ్రొక్కుట యావిగ్రహములం బూజించుట సాలగ్రామములఁ గడుగుట దేవతార్చనమొనర్చుట యను సకలయజ్ఞములు దేవతాప్రీతికై ధ్వనిగ్రాహియంత్రములవలె నొకరినొకరనాదికాలమునుండి జగదనుగ్రహబుద్ధిచే పురుషోత్తముఁడు మొదలు వేదవ్యాఖ్యాతలుయుగాను సారముగా ననేకవిధములుగ వివిధలోకాభిరుచికిఁదగునట్లు మొత్తము పైని చిత్తము ధ్యానాయత్తము కావించి జనులను దరింపఁజేయుట కనేక మార్గములుగా "అథశబ్దానుశాసనమ్" అని పతంజలిమున్నాది మహాభాష్యకారులు శబ్దార్థముల నుపన్యసించి, "ద్వేశీర్షే" అను

మంత్రమునకు శబ్దపరముగా వైయాకరణులు నగ్నిపరముగాఁ బూర్వమీమాంసకులు నర్థముచేయుటచే "పశుమాలభేత" పశు వనఁగాఁ జిత్తము- ఆలభేత యనఁగా దైవాయత్తముచేయుట యనఁగా మొత్తముపై "పశుమాలభేత" యను వాక్యమునకు మనుష్యులు తమచిత్తమును దైవాయత్తము గావింపవలయునని మంత్రార్థము అనవచ్చును మఱియుం దుఁ గల్పము సర్వలోకోపకార మగునదువడి యానదువడి తీరు న్యాయముగాఁ గష్టపడి వ్యవసాయము చేయుట పండించుట తనతోడిపాటిజంతువుల కావాఁడిపంటలు కుడిపి సుఖపెట్టి తాఁ గుడిచి సుఖించుట- సర్వభూతదయాపరుఁడగుటచే జనుఁడు చిత్తైకాగ్రతనుబొంది సంతోషముతో హాయిగా బ్రతికి యేకొఱ్ఱయులేక దేవాయాత్రనడుపుట- ఇది సర్వవేదముల ఫలితార్థము "ప్రజాపతిరాత్మనోవపాముదఖ్ఖిదత్" బ్రహ్మయగ్నిలో హోమముచేయుటకై తనకడుపులోని వప యనెడి ప్రేఁగు పెఱికివైచె ననఁగాఁ బ్రజాపతియొక్క శరీరము రక్తాస్థిచర్మమయ మనియు నొక్కముగాఁ దన ప్రేఁగు తనకడుపుచించుకొన్ని హోమమునకై పెఱుకు కొన్నాఁడని చెప్పవచ్చునా? ప్రజాపతి దేహముఁగూడ మనుష్య దేహమువలెఁ బాంచభౌతికమని చెప్పవచ్చునా? యజ్ఞమహిమనుగొని యాడుటకై యర్థవాదముగా నాశ్రుతి ప్రవర్తించుచున్నదిగాకనా శ్రుతులకుశబ్దార్థము మార్చిచెప్పవలసియున్నది కాన"పశుమాలభేత" యను వాక్యమునకు మేఁకలంజంపి బలియిచ్చుటయని యర్థము చెప్పరాదు మాంసాశనులగు క్రూరమనుష్యులు యజ్ఞమునిమిత్త వెట్టి వేదచోదితమని యనేకార్థములిచ్చుశబ్దమునకుఁదమయిష్టానుసారముగా నర్థముచెప్పి వేదాంగమని శ్రౌతవిధులను దమయిష్టానుసారముగా శిష్టసంప్రదాయమని ప్రకటించుచు గ్రామదేవతజాతరకు మ్రొక్కు కొన్న మాంసభక్షకులవలె (వైదికులనియు బ్రాహ్మణులమనియు)

సంధపరంపరానుశ్రుతముగానున్న శబ్దవిశేషములను వేత్తలమనుకొని విఱ్ఱవీగి యుద్ఘోషించుచు పామరరంజకముగా బొమ్మలాటలు నాటక ప్రదర్శనములవిధమున వివిధక్రతుక్రియాకలాపములను విధిచోదితము లని మూఢులం బెదరించుచు దంభవేషములు దొంగనిష్ఠలు కొంటె చేష్టలతోఁ బాపమెఱుఁగని సాధుజంతువుల నుదరపోషణవృత్తిగా యాజకులనియు షట్కర్మనిరతులమనియు దంభముగాఁ జాటు కొనుచుఁ గేవలపరమార్థమునకుమాత్రమే యత్నించుచున్నట్లుగ నడచుచుఁ గడువృద్ధులయ్యుఁ గర్మచెడిపోవునని మినువెటి నానాఁగు ప్రాయపుచేడియల కేవగాఁ బలువురఁ బెండ్లాడి యైహికభోగంబుల సంతుష్టిఁగొనక సోమరులైన ముష్టిబాపండ్రు "పశుమాలభేత" యను శబ్దమునకు దేవతలపేరుచెప్పి మేఁకలంజంపి తినవచ్చుననుచున్నారు "నహింస్యాత్సర్వభూతాని" యజ్ఞార్థముతప్ప భూతహింసచేయఁ గూడదని శ్రుత్యర్థము చెప్పినారు ఏజంతువునైనను జంపఁగూడదని విధించుచున్న శ్రుతికి "వైధేయహింసాంవినా" క్రతువునందు తప్ప నని శ్రుత్యర్థ మేలచెప్పవలెను? జగద్గురువు లీమాత్రమైనఁ బూర్వా చారకల్పములకనుజ్ఞయిచ్చినఁగాని యజ్ఞవిధానములు నిస్సారములై పామరులకు రుచియింపక మొదటే దేవతాచింతనముమానుకొని యథేష్ట ముగా జంతుల స్మృతివిహీతకుంపెదరని యర్థాంగీకారముగాఁ దలలోని పేలు మంచమందలినల్లులును జంపఁబడుట కొప్పుకొన్నట్లు "యజ్ఞదీక్ష నెందఱువహింపఁగలరు? మనుష్యులలో లక్ష కొక్కఁడుగదా యట్లు కేవల శ్రోత్రియుఁడైనవాఁడు తిండికైకాక కేవలహోమార్థమై మిక్కిలిదుర్లభమగు లక్షణములుగలపశువును హింసింపవచ్చునని" శ్రౌతమతస్థాపనమున కొడఁబడిరి శాస్త్రముకంటె నాచారము బలీయము పారంపర్యముగావచ్చునాచారము మంచిదైనను చెడ్డ దైనను మానుకొననేరరు మఱియును మానుకొనుటకుఁ జేసినయత్నమువలన

ముచే మంచిచెడులు కీడగును పూర్వాచార మెందుకుఁ బట్టెనో
యాయాచార మెంతవరకవలంబింపవలయునో యెంతవఱకుఁ బ్రకృత
కాలానుసారముగా మార్చుకొనవలెనో యెవ్వ డెట్టి నడత ప్రజోప
కారమగునో బాగుగ నాలోచింపక "శతాంధాః కూపం ప్రవిశన్తి"
యనన ట్లొకపుస్తకమునకుఁ బ్రతి వ్రాయుచు నాపుస్తకప్రతియందుఁ
బచ్చినయీఁగయుంటఁ జూచి తా వ్రాయుప్రతిలో నీఁగను జంపి తెచ్చి
యంటించిన మూర్ఖునివలెఁ గాలవశముచేత శిష్టాచారముల ధూర్తుల
గాని యవివేకులు గాని యొనర్చినమార్పులుగూడ నాశిష్టాచారము
లోనివేయని గతానుగతికులై యుక్తాయుక్తవివేకహీనులై వేదవేత్త
లయ్యును మిగులఁ బండితులయ్యును స్వార్థపరులై కొందఱును
మంచికేఁ బోయినఁ జెడ్డవచ్చునేమోయని కొందఱును సర్వము విష్ణు
మాయయనియు వైరాగ్యమున నుపేక్షించి కొందఱును శిష్టాచార
ముగా నవలంబింపఁబడినదురాచారము లడంపనేరకున్నారు అన్ని
దురాచారములలోను మఱి యన్నిపాపములలోను మిక్కిలిఘోర
మైనది చంపుటకన్న మఱెద్దియునుగాదని స్వభావముగఁ దమబ్రతుకు
నందలి తీఁగలజనుల కంతఱికిం బ్రత్యక్షానుభవమే కదా? మనుష్య
బలియిచ్చునాచార మేలమాన్పిరో యాహేతువుననే బాగుగఁ
దలపోసి మనుష్యేతరపశుబలికూడ మాన్పింపరేల? మనుష్యులకు
దమబ్రతుకువలె జంతువులకుఁ దమబ్రతుకుఁ దీపియని తలపని కూళల
తగవుదీర్ప యముఁడు లేఁడా? అకాలమృత్యువు న్యాయస్థానము
కాదా?

"ఎందు కట్లు ఘోషించెదు ప్రాణహింసచేయఁగూడదు కూడ
దని భూతహింసవలనఁగాని భూతములు బ్రతుకనేరవు అహమన్న
మహమన్న మహమన్న మహమన్నాదో౽హమన్నాదో౽హమన్నాదః" యన్న
మను నేనే యన్నమును భక్షించువాఁడును నేనే యని శ్రుతి

యుద్ఘోషించుట కనిపెట్టవా ? అనేకకోట్ల కీటకములతో జీవాణువుంతో నిండినగాలి నిశ్వాసవాయువుతో దిగవిడ్చక జీవింపగలవా? లెక్కలేక మిలమిలలాడుచు బ్రతుకుచున్న పురుగులతో నిండినజలమును ద్రాగక జీవింపగలవా ? వేయేల నీ బ్రతుకంతయు నితరజీవహింసవల్లనేగదా కొనసాగుచున్నది ? జీవికి జీవియే యాధారము - మాంసభక్షణమే తప్పనెదవు వేదనిందయును వైదికనిందయును గావించి బ్రతుకుం బరమాంస నెంకూడదనెదవని" యడిగిన నిదిగో సమాధానము - ధర్మార్థకామమోక్షములను నాల్గు పురుషార్థములను సంపాదించుకొనుట మనుష్యజీవితమునకుఁ బ్రయోజనకరముకదా? "పరోపకారార్థమిదం శరీరమ్" కనుక బ్రతికినసార్థక్యము లోకోపకారముగా నడుచుట - లోక మనఁగా నహంకారమమకారములతో స్వదేహాభిమానమున జీవితేచ్ఛతో సుఖింపఁగోరి కరచరణాద్యవయవములతో మనోవాక్కాయకర్మములచే ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయాభావాత్మకసప్తపదార్థతత్త్వముం బ్రకటించుచునీరు మనుష్యులని పశువులని జడములు - మహామహాద్వివేకములతోఁ గష్టము నొప్పించుకొనుటకును సుఖమును బొందుటకును యత్నించు నేదంశువులు తనకుఁ గాన్పించునో యట్టిజంతుసమూహము జంగమజీవలోకము - తక్కినది స్థావరజీవలోకము - తనకుఁ దెలియఁబడిన దెల్లలోకమే - లోకముకాని దెద్దియును లేదు మఱియుం జైతన్యముకాని పదార్థమెద్దియును లేదంతయుం బ్రాణమయమే జీవమయమే "హరిమయముకానివస్తువు పరమాణువు లేదు" అన్నట్లు జీవికాని లోకమే లేదు అయినను దనవలె ఖేదమోదములఁగప్పు జంతువులు తనజాతివారు తనబంధువులు తనహితులం దాఁ బ్రేమించుచున్నట్లు ప్రేమించువాఁడు భూతదయాపరుఁడై లోకోపకారియనఁబడి బ్రతుకు సార్థకముగా నొరులసుఖపెట్టుచేఁ దా సుఖముగ బ్రతుకఁగలఁడని

యెల్ల రేకేఁగినసంగతియే. చావునకుఁ దెగి పక లంకణముచేయరా
దన్నట్లు సచ్చిదానందలక్షణుఁడగు పరమాత్మలో లయమంది కైవల్య
మందుటయే పరమ పురుషార్థముగను కైవల్య మనఁగా శాశ్వ
తముగా సకల భూత దయతోనొప్పుట కనుకను బాహ్య
శుచియందినందప్ప నంతశ్శుచి కలుగదుగనుకను మనోవాక్కాయ
కర్మములతో సకలప్రాణులం బ్రేమించుటచే సంపూర్ణతృప్తిరూపక
మగు కైవల్యమబ్బునుగనుకను ద్వేషముచేత మనస్సంతుష్టిబొత్తిగా
చెడిపోవును గనుక, తిండికైనను జంతువుం జంపుట కలవడనొల్లని
మనుష్యుఁడు తనతోడిపాటిమనుష్యులనుజంపజాల కుంటచేతను జంతు
హింసకుం దగిన పరిశ పతన హేతుక కార్యముగాని క్రూరసాధన
ములుగాని బొత్తిగా విసర్జించుట కలవాటుపడిననాఁడు పొరపాటున
నైన తనసంఘములోని వారికెవ్వరికైన నెన్నఁడును ప్రాణహింసచేయఁ
గలశక్తి బొత్తుగా నుండదుగను జంతువు న్గొట్టుటకుఁగాని చంపు
టకుఁగాని బొత్తుగా నలవాటుపడనివారు తమతోడిపాటిమనుష్యుల
ప్రమాదముననైన హింసించుసాధనములు దాల్చకుంటచేతను సకల
భూతదయఁగలమనుష్యులు మాంసాశనముమాని యొరుప్రాణములు
గాచి సుఖముగా తాము బ్రతికెదరుగనుకనే "అహింసా పరమో
ధర్మః" అనువచనము "నహింస్యా త్సర్వభూతాని" యను శ్రుతి
శిరోవిధివాక్యము నసాదిగా నప్రతిహతములుగానఖిలలోకసమ్మతము
లుగా యుక్తియుక్తములై తనరారుచుంటచే నహింసావ్రత మిట్లు
తోడిపాటిజనులకు మాటిమాటికి స్వభావముగాబోధింపవలసివచ్చెన
భావనావశమున మనస్సు రాగద్వేషములంది కృత్రిమముగానాటకము
నందువలె వికారపడునుగాని శరీరమున కితరులచేఁ గలిగిననొప్పివంటి
నిక్కముగా క్షోభించును దూషణభూషణతిరస్కారములు పిల్లకాయ
తిట్టినతిట్టు మనస్సును నొగిలింపలేదు ఎల్లకాయ పతికినకొట్టు శరీర

మును గాయపఱ్చి బాధింపకమానదు శరీరవేదనము నిక్కము
మనోవేదనము కృత్రిమమును సంకల్పవశమునుగలవలె మృషయును
తిట్టుట వెక్కిరించుట- యెగతాళిచేయుట తెలిసీతెలియనివారి
నొకప్పుడు దుఃఖపెట్టునెమోగాని కొట్టుట దేహాఘాతులవంటివి తప్పక
దుఃఖపెట్టకమానవు తిట్లకుం గొట్లకైన నొప్పికొననుగాని చంపఁ
బడుట కొప్పుకొనుట ప్రాణిస్వభావము కాదు- కాఁబట్టి చంపఁబూనుట
కన్న గౌర్యమును జంపుటకన్నఁ బాపము మఱి యితర మెద్దియు
న్నాదు- తమకుఁగాని యితరజంతువులకుఁగాని నిద్రాహారవిహార
సౌఖ్యముల భంగము కలుగఁజేయఁబోని నెఱుగలమనుష్యులు
నాస్తికులుగానీ యాస్తికులుగాని యేజాతివారుగానీ స్త్రీలుగానీ
పురుషులుగానీ మఱి యేనడువడినుండనీ సజ్జనులే యగుదురు- కాని
దుర్జనులెంతమాత్రమున్నానేరరు- భార్యలుభర్తలు ఆర్యులనార్యులు
నాస్తికులాస్తికులు సగోత్రులసమానగోత్రులు పాత్రు పాత్రులనకొని
మిథ్యాచారములను దాంభికులు వంచకులు స్వార్థపరాయణులు
కల్పించినకన్నికలు వైపరీత్యములు లేవిపోనివన్నెలు వేషములు
రచనావిశేషములు వ్యావహారికములుగాని యదార్థముగా బ్రతుకున
కవశ్యకర్తవ్యములుం బారమార్థికము లెంతమాత్రము న్గావు

“మరణం ప్రకృతి శ్శరీరిణాం వికృతి ర్జీవితముచ్యతే బుధైః
క్షణమప్యవతిష్ఠతే శ్వసన్యదిజంతు ర్నను లాభవానసౌ” మరణము
ప్రకృతి-జీవనము వికృతి- శరీరము బోడగాఁబుట్టుట ప్రకృతి- వస్త్రా
ద్యలంకారములతోఁ బిదపఁగప్పుట వికృతి- ప్రకృతియగు మరణా
వస్థయందు జీవనలాభనష్టములు రెండును లేవు వికృతియగు దేహ
ధారణావస్థయెడ జీవనలాభము కలదు కాఁబట్టి యొక్కక్షణమాత్ర
మూఁపిరితీయుచున్నప్పటికి జంతువు జీవన లాభము కలదే యగును
కాఁబట్టి ప్రతిజంతువును ప్రాణలాభకరముగు బ్రదుకునే కోరఁదగినది.

"బ్రతికియుండిన సుఖములు పడయవచ్చు" అనునట్లు స్వభావముగా నెన్ని కష్టములు సహించియైనను సకలజంతువులు బ్రతుకుటకై కోరుచుంట యెల్లర కనుభవమయినసంగతియే కదా! కాఁబట్టి యిటియును చూడ్కి జంతువులు నేమిచేసినైనఁ జంపుటకై దయయే మూర్తిగాఁగల సర్వేశ్వరుడు వేదశాస్త్రముఖములఁ నెప్పటికిని శాసింపఁడని భగవతుని దయాతత్త్వ మెఱిఁగినవేత్తలు "పశుమాలభేత" యను శ్రుతికి జంతువులను దేవతాప్రీతికై చంపవలసినదను నర్థము రవంతయైనను జెప్పనొల్లరు

ప్రత్యేకమనేకార్థములతో వ్యవహరింపఁబడు సంజ్ఞారూపములగు నకారాదివర్ణము లుదాత్తాదిస్వరములు మొదలగునానారూపకచతుర్విధాభినయవిశేషము లన్నియును సర్వలోకోపకారముగా వినియోగింపవలెనదనియే యీ వేదశాస్త్రముల ముఖ్యాభిప్రాయమని నిఖిలాదిమునులు నెల్లడించుచు నానావిధజనాభిరుచుల ననుసరించి నానావిధసంజ్ఞార్థబోధకశబ్దజాలముల సమస్తవేదశాస్త్రములు నిర్వంచిచుట తెలియక మాంసాశనవ్యసనాధీనులగు క్రూరమనుష్యులు వేదశాస్త్రముల కపార్థములుచేసి శ్రౌతస్మార్తతంత్రములు నడిపించుట మిక్కిలి హేయమును శోచనీయమును "అగ్నిమీళే పురోహితమ్" శరీరమును బోషించుజఠరాగ్నినిఁ గోరుచున్నాను అనినేను హాయిగా దినుయన్నమును జీర్ణముచేయఁగల జఠరాగ్నిశక్తి నాసించుచున్నననునర్థమునఁ దనయాఁకలిఁదా నెఱిఁగినతోడనే ప్రప్రథమమునఁ గోరుట యన్నివేదములకు మొదటిదగు ఋగ్వేదముయొక్క మొట్టమొదటిమంత్రము తెలుపుచున్నది పద్యరూపకమైనఋగ్వేదమే సప్తస్వరాత్మకముగాను లయవిశేషముగా శ్రావ్యముగాఁ బాడఁబడి కేవలవాచికాభినయస్వరూపమై సామవేదమనబడుచున్నది "ఇషేత్వోర్జేత్వా"యని మొదలిడిన యజుర్వేదమునకు "ఇమమేవోర్జం

యజమానాయసధాతి" అన్నమే బ్రతుకఁ గోరినజంతువునకుఁ బుట్టి
నిచ్చుచున్నదని బ్రాహ్మణ మర్థమునుద్దేశించు కేవలవాచికాభినయ
విశేషమైయున్నది "ఇషేత్వోర్జేత్వేతి పలాశశాఖాంఛినత్తి" అని
యజమానుఁడు మోదుగుచెట్టుకొమ్మను నఱుకుచున్నాఁడని చతు
ర్విధాభినయవిశేషము చేఁ దన దేహముతో సంబంధింపక వేఱుగా
నున్న జంగమస్థావరపదార్థములనుపయోగించుకొనువిధమును శిక్షా
వ్యాకరణచ్ఛందోజ్యోతిషకల్పము లెఱిఁగించుచున్నవి మొత్తముపై
సమస్తవేదశాస్త్రములవలన మనుజుఁడు పొందఁగలఫలము నిత్యసంతుష్ట
జీవనము వేదాంగముల ప్రయోజనము వేదమునుసరించి శాశ్వత
సుఖజీవనమును సంపాదించికొనఁగ నడువడి ఉసురులకు శరీరము
నకుఁ గలసంబంధమువంటిది వేదమునకును వేదాంగములకును- మానసిక
ములు వేదములు. వేదాంగములు దైహికములు అతీంద్రియంబులు
దివ్యస్వరూపవిశేషములు వేదములు బుద్ధిప్రవర్తకేంద్రియాభినయ
విశేషబోధకములు వేదాంగములు వాస్తవముగా వేదములనంత
విధములు- వేదములను వెల్లడించు వేదాంగములుకూడ ననంతవిధ
ములు "పలాశ శాఖాం ఛినత్తి" అనుకల్పవాక్యమునందలి పలాశ
యనుపదమునకును శాఖాయనుపదమునకును ఛినత్తి యనుపదమునకు
నర్థము లనంతవిధములు- ఎందఱుజీవులో అన్నిరకముల బుద్ధులన్ని
రకముల చతుర్విధాభినయవిశేషాత్మకేంద్రియవ్యాపారములును ఏ
జాతిజంతువులకాజాతిగుణములచేష్టలు మిక్కిలియింపుగావా? "విద్య
తేనేన విత్తమితి వేదః" విత్తమనఁ గోరినవస్తువు- తాఁ గోరిన
కోర్కెలేసాధనముచే లభ్యమగునో యుపాయమును వేదమే
ధర్మార్థకామమోక్షసాధకోపాయమంతయును వేదమే. హరిహరీ యే
మీఘోరము- శిష్టాచారమని యుభయలోకభ్రష్టులు గతానుగతిక
లయి సిగ్గులేనిమొండిబండలై వినుటకుం జూచుటకుమిక్కిలియసహ్య

కరముగు పలుకులతో బీభత్సములగు పనులు చేయుచు నెనరుమాలి నోరులేనిసాధుజంతువులను ఘోరముగా ముక్కు చెవు లోసరు మూసి చంపి కడుపుజీల్చి ప్రేవులులాగి యోహహా సోమాసుల సొంపు లధ్వర్యులు కూటివేసము లక్కటా పిల్లికిఁ జెలగాట మెలుకకుఁ బ్రాణము పోవుట "పశుమాలభేత" అనుమంత్రమునకుఁ దగ వారు పశువులు కారాదా? యామంత్ర మట్లు విధించదని చచ్చిన యాఁగపంటెము వీ పూర్వాచారమే కారాణమా? పూర్వుల యాచారానుసారముగా నొక్క పశుహింసఁదప్ప మతెద్దియైన సద్విధానముఁ దాఁ జేయఁగలిగెనా? "పశుమాలభేత" యని కామ్యకర్మము నుద్దేశించిన విధి శ్రుతికిఁ బిష్టపశువును దేవతాప్రీతి వేయు బ్రాహ్మణులు కర్మబాహ్యులు పాషండు లని యనఁదగునా? పామరబోధకై-వివాహామునఁ బుస్తెముడి- గోత్రస్మరణమునఁ బిండవిధి-నీతిబోధయే నాట్యము బొమ్మలాట- పూర్వవృత్తాంతసూత్రమునఁ గావ్యములు పదములుం బాటలును వీరవిఖ్యాతికి గుర్తుగా దేవాలయము మతము సత్రము దివ్యక్షేత్రము- జాతరసంబరము సందడి చూపుఁ హాంసావ్రతదీక్షకై శయనైకాదశీనిష్ఠ మొదలుగా జగదుపకారము గు పడత లాచారములు వ్రతములు నీతులు నిష్ఠలు ముద్దులు ముచ్చటలు విలాసములు వేడుకలు విహారములు గోటులు నీటు లొయ్యారములు డాబుదర్పములు సమయోచితములుగా సాధుజనోపకారములుగా సకలభూతదయాపరములుగాఁగానిచో కేవల పూర్వాచారములైన హేతువుచే సజ్జనాదరణీయము లెంతమాత్రము గానేరవు

ప్రస్తుతకాలానుసారముగా సర్వజనులకును బ్రతుకును బొడసించి సుఖమునుగలిగింపఁదగినపోడువడి ననుసరించుట మేలు- పూర్వాచారము ననుసరింపవలసినదే-శిష్టులయినపూర్వుల యాచారమున

కర్థమేమి? శిష్టాచారమనఁగా సర్వలోకోపకారకమైన యహింసా
వ్రతము నన్నిటి మెద్దియు న్నాకని నెప్పుడైన వానికెల్లఁ దెలియక
తీఱదు భూతదయలేనివాఁడు రాక్షసుఁడు. గాని యీ సృష్టి యంతయు చూ
చుకొనినచో ఏనుఁగుపాదములో తక్కిన జంతుపాదములన్నియు నిముడు
నట్లు ధర్మములన్నియు నహింసావ్రతములో నిమిడియున్నవి మిగిలిన
బుద్ధిహీనులగుచుఁ బోటివింత దీపాలవైచి చెఱువులోని చేఁపలు
చెల్లఁగఁ బ్రాకిపోయినవన్నట్లు మనుష్యులకుఁ దప్ప నితరజంతువులు
కాఁ గ్రమలేనివియు నీ సృష్టిలోకమును మనుష్యజీవనోపయోగమునకై
యుద్దిష్టమై దేవునిచే సృజింపఁబడె ననువాదముల మూఢవిశ్వాస
మేమనవలయును? పోనిండింతయును దైవవశమే సృష్టియందలి
యూర్పు లెట్లు బురుషప్రయత్నము లేని దేహమునందలి ధాతువులు
నానావిధములుగా స్వభావముగా నుత్పత్తిస్థితిలయవిధానము లొందు
చున్నట్లు దేహమునకు వెలుపల పంచభూతసంయోగవియోగవిశేషము
లచే నానావిధ జగదుత్పత్తిస్థితిలయక్రియలు జరుగునట్లు కేవల
దైవవశముచేతమాత్రమే మనస్సంకల్పవిక్రమాలము లగు ప్రాణి
సంరక్షణమును ప్రాణిహింసయును గామక్రోధలోభమోహ మద
మత్సరములతోఁ గూడి సహజముగ నన్యోన్యహింస గావించుకొను
టయు నహంకారమమకారములతో వ్యవహరించుటయును గలుగునే,
కాని సుఖముగా బ్రతుకఁగోరుటయును యథేష్టముగాఁ దిరుగ నెంచుట
యును సర్వజంతువులకు నెన్నటికిని మానిసహజప్రయత్నముకదా!
స్థావరప్రాణు సుఖదుఃఖవిధానములు మనుష్యులు రవంతయును గని
పెట్టలేరుగనుక స్థావరప్రాణులను భక్షించి తమయాఁకలి తీర్చుకొన
తీఱదు కాని కొంతవఱకైనఁ దమవలెఁ గష్టసుఖములను వెల్లడించు
జంతువులను దమశరీరారోగ్యముచెడుచుండఁగ వ్యాధావ్యసనపరులై
దేవతలకర్పించుమిషమీఁదఁ గొందఱు జిహ్వాచాపల్యమునఁ గొందఱు

నూతులు పలురకములపానకము లాసవములు మద్యములు దప్పి తీర్చుకొనుటకై కొండగుహాపొదరిండ్లు చెట్లుతోట్లు నానావిధగృహములు మిద్దెలు మేడలు కావలసినన్ని కష్టపడి నిర్మించుకొన్నచో చెట్లులపట్టలు నారచీరలు ప్రత్తిపట్టు రోమములతో నేసికొన్న ముతక సన్న బట్ట కప్పుకొనుట సకలయంత్రములు యానములు బండ్లు వివిధ జంతువాహనము లోడలు భూమియందు జలమందును నెంచరించి యభీష్టదేశంబుల సంచరించుటకై యంతకుండగినట్టు లొంతిలై తనివి దీఱ గాపోవ భోగంబుల నోలలాడించు నీడుజోడుకుదిరిన దినదినము క్రొత్తక్రొత్తచవులెత్తించు కామినీకాముకులు- ఈతిబాధలనుండి తప్పించుకొని బ్రతుకంగల నానావిధజీవనోపాయములు సకలసామర్థ్యములుకలిగించు పలురకముల మందులు క్రమాంకులు కావలసిన సుఖజీవనసాధనములతో నెవరిమట్టుకువారికే యేదేశమున కాదేశమందే మొత్తముపై "కోఽతి భారః సమర్థానాం కిం దూరంవ్యవసాయినామ్ కోవిదేశః సవిద్యానాం కశ్శత్రుః ప్రియవాదినామ్" అన్నట్లు తెలివి తేటలతో సంచరించినచో ననంతసంఖ్యాకముల జీవనోపాయములతో నిండి యనంతయనందగు పృథివిపై నన్యోన్యస్నేహబాంధవప్రేమలతోం బరస్పరసాహాయ్యమొనరించుకొనుచు మనుష్యులందఱు నిద్దఱు జీవితమును సుఖముగాం గడపుకొనక- వేదములంట- శాస్త్రములంట పురాణేతిహాసములంట- పూర్వాచారములంట-శిష్టులంట భ్రష్టులంట- యార్యులంట- మ్లేచ్ఛులంట- వైదికులంట పాషండులంట- నాస్తికులంట- యాస్తికులంట- శ్రీమంతులంట- పేదలంట- బ్రాహ్మణులంట- యంటరానివారంటమడివారంట మైలవారంట-పెండ్లంట-పేరంటమంట- సంసారులంట- సానులంట- పాపులంట వరుసలంట- పుణ్యమంట- పాపమంట- స్వర్గమంట- నరకమంట- క్రిందిజన్మమంట- మీందిజన్మమంట- శ్రౌతకర్మలంట- స్మార్తకర్మలంట- వైదికమంట- లౌకిక

మంట భార్యలంట- భర్తలంట- తల్లిదండ్రులంట- ఎల్లలంట-
చెల్లెలు తమ్ముడు దన్న యవ్వ యమ్మ పిన్నమ్మ పెద్దమ్మ
కొడుకు కూతురు వదినె మరదలు తోటికోడలు ప్రభువు సేవ
కుడు గురువు శిష్యుడు దేవుడు దయ్యము న్యాయ మన్యా
యము సదాచారము దురాచారము తనుగట్టు ప్రాల్లు తా దెచ్చు
కొన్న చందమున మనుష్యులకు బందితమ్మన్యత చదువు వ్రాతలు
స్వర్గనరకములు పూర్వోత్తరజన్మములు లేకపోనియక్కరమాలిన
కట్టుబాట్లుజరగనిమాట యరగనితిండివలె దక్కనజంతువులన్నియును
జ్ఞానహీనములనియు తామొక్కరే యాకసమునుజించి సూర్యునిలో
నున్న తేజమునుగూడ లెక్కింపగల తెల్విగలవారమనియు నోటికి
వచ్చినట్లు ప్రేలుచు చేతికివచ్చినట్లెల్ల వ్రాయుచు దమచెడ్డ రాణి
వాసముగా దనముంచి వెలయాలిన్ గావించుచు నహంకారమమ
కారముల విజృంభించుచు మాదేశము మామతము మాజాతి మాబంధు
వులు మావారు మాయిల్లు మాగాకలి మాపరువు మాయాస్తి
మాప్రయోజకత్వము మాపిల్ల మాపాప మకును మీకును
తేజస్తిమిరములకున్నంత భేదము మాకును మీకును సరిపడదు క్షణ
మైనను గిట్టదు మాదేశమున మీ రడుగిడరాదు మమ్ములను మీరు
ముట్టుకొనరాదు మీగాలి మాకు సోకరాదు మీయున్కి మాకు
గిట్టదు మాకారోగ్యము మాకుధనము మీకుఋణము "అస్తిభాతి
ప్రియమ్" ఉన్నది ప్రకాశించుచున్నది ప్రేమించుచున్నది యని
సచ్చిదానందమూర్తియగు దేవుని ప్రతినిధుల మని చాటుకొనుచు
నొకరితో నొకరికి సరిపడక రాజధర్మమంట ధర్మయుద్ధమంట వీరస్వర్గ
మంట ఈతిబాధలతో విధిలేకచచ్చుటయేగాక కోరి తమంత యొదిరి
నానావత్రోపాయములు కల్పించుకొని నానావిధాయుధములు తేర్పర్చు
కొని కాచకీచంగు -తోడు లేక పోవ దనుసామితోగా దమతోడు

నూతులు పలురకములపానకము లాసవములు మద్యములు దప్పి
తీర్చుకొనుటకై కొండగుహాపాదరిండ్లు చెట్లుతోట్టులు నానావిధగృహ
ములు మిద్దెలు మేడలు కావలసినన్ని కష్టపడి నిర్మించుకొన్నచో
జెట్టులపట్టలు నారచీరలు ప్రత్తిపట్టు రోమములతో నేసికొన్న ముతక
సన్న బట్ట కప్పుకొనుట సకలయంత్రములు యానములు బండ్లు వివిధ
జంతువాహనము లోడలు భూమియందు జలమందును సంచరించి
యభీష్టదేశంబుల సంచరించుటకై యంతకుండగినబొంతిలై తనివి దీరం
గామోప భోగంబుల నోలలాడించు నీడుజోడుకుదిరిన దివదినము
క్రొత్తక్రొత్తచవులెతేంగించు కామినీకాముకులు- ఈతిబాధలమండి
తప్పించుకొని బ్రతుకంగల నానావిధజీవనోపాయములు సకలసౌకర్య
ములంకలిగించు పలురకముల మందులు మ్రాంకులు కావలసిన సుఖ
జీవనసాధనములతో నెవరిమట్టుకువారికే యేదేశమున కాదేశమందే
మొత్తముపై "కోంతి భారః సమర్థానాం కిం దూరం వ్యవసాయినామ్
కోవిదేశః సవిద్యానాం కః పరః ప్రియవాదినామ్" అన్నట్లు తెలివి
తేటలతో సంచరించినచో ననంతసంఖ్యాకములు జీవనోపాయములతో
నిండి యనంతయనందగు పృథివిపై సన్యోన్యసన్నిహితబాంధవ్యప్రేమ
లతోం బరస్పరసాహాయ్యమొనరించుకొనుచు మనుష్యులెల్లను స్వీయ
జీవితమును సుఖముగాం గడపుకొనక- వేదములంట- శాస్త్రములంట
పురాణేతిహాసములంట- పూర్వాచారములంట-శిష్టులంట భ్రష్టులంట-
యార్యులంట- మ్లేచ్ఛులంట- వైదికులంట పామరులంట- నాస్తికు
లంట- యాస్తికులంట- శ్రీమంతులంట- పేదలంట- బ్రాహ్మణులంట-
యంటరానివారంటమడివారంట మైలవారంట-పెండ్లంట పేరంటమంట-
సంసారులంట- సానులంట- వావులంట వరుసలంట- పుణ్యమంట-
పాపమంట- స్వర్గమంట- నరకమంట- క్రిందిజన్మమంట- మోక్షాదికర్మ
మంట- శ్రౌతకర్మలంట- స్మార్తకర్మలంట- వైదికమంట- లౌకి

మంట భార్యలంట- భర్తలంట- తల్లిదండ్రులంట- ఎల్లలంట-
చెల్లెలు తమ్ముఁడు దన్న యప్ప యమ్మ పిన్నమ్మ పెద్దమ్మ
కొడుకు కూఁతురు వదినె మఱఁదలు తోటికోడలు ప్రభువు సేవ
కుఁడు గురువు శిష్యుఁడు దేవుడు దయ్యము న్యాయ మన్యా
యము సదాచారము దురాచారము తనకట్టుబాట్లు తాఁ దెచ్చు
కొన్న చందమున మనుష్యులకుఁ బండితమ్మన్యత చదువు వ్రాఁతలు
స్వర్గనరకములు పూర్వోత్తరజన్మములు లేకపోనియక్కరమాలిన
కట్టుబాట్లుజరగనిమాట యరగనితిండివలెఁ దక్కినజంతువులన్నియును
జ్ఞానహీనములనియు తామొక్కరే యాకసమునుజించి సూర్యునిలో
నున్న లేశమునుకూడ లెక్కింపఁగల తెల్వికలవారమనియు నోటికి
వచ్చినట్లు ప్రేలుచుఁ జేతికివచ్చినట్లెల్ల వ్రాయుచుఁ దమచెడ్డ రాణి
వాసముగాఁ దనమంచి వెలయాలిన్ గావించుచు నహంకారమమ
కారముల విఱ్ఱవీఁగుచు మా దేశము మామతము మాజాతి మాబంధు
వులు మావారు మాయిల్లు మాగాఁకలి మాపరువు మాయాస్తి
మాప్రయోజకత్వము మాపిల్ల మాపాప మాకును మీకును
తేజస్తిమిరములకున్నంత భేదము మాకును మీకును సరిపడదు క్షణ
మైనఁ గిట్టదు మాదేశమున మీరడుగిడరాదు మమ్ములను మీరు
ముట్టుకొనరాదు మీగాలి మాకు సోఁకరాదు మీయునికి మాకుఁ
గిట్టదు మాకారోగ్యము మాకుధనము మీకుఋణము "అస్తిభాతి
ప్రియమ్" ఉన్నది ప్రకాశించుచున్నది ప్రేమించుచున్నది యని
సచ్చిదానందమూర్తియగు దేవుని ప్రతినిధుల మని చాటుకొనుచు
నొకరితో నొకరికి సరిపడక రాజధర్మమంట ధర్మయుద్ధమంట వీరస్వర్గ
మంట ఈతిబాధలతో విధిలేక చచ్చుటయేగాక కోరి తమంత యొదిరి
నానావత్తోపాయములు కల్పించుకొని నానావిధాయుధము లేర్పఱ్చు
కొని బాచవీనఁగు తోడు లేక పోవ దనుసామితోగాఁ దమతోడు

గుఱ్ఱము లేన్గులు మొదలగుమృగములమీఁద బలాత్కారముగాఁ గూలించుచు నొకరినొకరెదుర్కొని కొట్లకొలఁది పోయిగాఁ దిని కుడుచుకాలములో క్రొవ్వి యొండొరులంబొడుచుకొనిచచ్చుచున్నారే మనుష్యులు. కటకటా యితరజంతువులకన్న నెంత తెలివిమాలిన వారు ? సకలజగత్సృష్టిలో నిక్కముగ మనుష్యసృష్టి యొకకుట్ర. సొగసగు తక్కినజంతువుల సుఖజీవనసంపత్సస్యమునకు మానవుఁ డొక వెఱబొమ్మ. నిర్మలబ్రహ్మసృష్టిలో మనుష్యుఁ డొకమసిబొట్టు. తెలిసినవారు దేవతలు తెలివిలేని జంతువులు పశువులు. మునివలెఁ దెలిసినను బాధలేదు. పశువువలెఁ దెలియకున్నను బాధలేదు.

తెలిసీతెలియక జ్ఞానలవదుర్విదగ్ధులౌటచేత మనుష్యులు కొం క్రొవ్వి తమలోఁదాము కొట్లాడుకొని వేదశాస్త్రములు చదువు వ్రాఁతలు తెలిసికొనుటకై పడుచున్నశ్రమకుఁ బైపెచ్చు కొట్ల కొలఁది మూఁకమూఁకలై పందువఁటిదప్పసమున పోయిగా నన్యో న్యానురాగముగ సుఖింపనేరక పోరాడి చచ్చు టెంత యాశ్చర్య మేమి దైవసంకల్పా ? ఆహా ఏమి పౌరుష మేమి వివేక మెంతెగి యెంతెగియెఱుఁగని పశువులకన్న హీనముగఁ బోరుచున్నారే మనుష్యులు ? మనజాతికన్న ఎత్తే ప్రాణియైన నయము రాళ్లు నయము అప్పలు నయము. ఒకరినొకరు చంపుకొననేల ? గాలి నీరు నిప్పు మన్ను నాకసమును దేవుఁడు మనుష్యులందఱు సమముగా ననుభవించి బ్రతుకుటకై యొందఱికిని సమానాస్తిగ సర్వభోగములను సృజించెను. ఎందుకు మీలోమీరు శ్రమపెంచుకొనియన్యాయముగాఁ దక్కినజంతువులకన్న లేనిపోనికష్టములు కోరి క్రొవ్వి తెచ్చుకొని పరస్పరవైరములను బెంచుకొని యకాలమృత్యువును జేతులారఁ దెచ్చుకొనుచున్నారు ? లేనిపోనికష్టము లన్నాతులవలెఁ గల్పించు కొని వృథాభ్రమచెంది యేలదుఃఖించెదరు? మీసృష్టి మీరుమానా

కానఁడు- దైవసృష్టి తక్కినజంతువులకువలె మీా కెంతమాత్రమును
బాధి పఁబోదు- అహంకారమమకారములు స్వార్థపరత మాను
కొనఁడు అందఱును సమానభోగ భాగ్యములతోఁ దక్కినజంతువుల
వలె హాయిగా స్వాతంత్ర్యముగా ఎతి దేవునిలోఁ జేరఁడు చదువు
కొన్నను జదువకున్నను గాశికిఁ బోయినను బోకున్నను ఏదేశమందు
జన్మించినను మఱెట్లున్నను మనష్యుఁడు మనుష్యుఁడే మనుష్యు
లందఱును సమానులే యొకఁ కన్న నొకఁరు గొప్పవారు కొద్దివారు-
జల్తారుటోపీపెట్టుకొన్నకోఁతి కోఁతు రాజగునా? సింహాసనముప
ప్రవాలినయీఁగ యీఁగెఁదొర యగునా? చావుపుట్టులాఁకలిదప్పికలు
మనోవాక్కాయభోగవాంఛలాధివ్యాధులు తాపత్రయము లుమొదలగు
నెల్లతీరులసుఖదుఃఖములు వేయేఁ మనష్యధర్మము మనుష్యులందఱి
కొక్కపోల్కయేకదా? ఇతరజంతువు నమీాశక్తికొలఁదిమీాయిచ్చను
వచ్చినట్లు చంపుఁడు పెంచఁడు కాని మీాలోమీా కన్యోన్యద్వేష
మేలా? యెందుకుపరస్పరవైరము నవివేకముగఁ బెంచుకొనియకాల
మృత్యువుపాలగుచున్నారు? తిన్నగ బ్రతుకలేరా? యేమీాయన్యా
యము? మనుష్యులకెట్లు వచ్చె నీతెలిసినవెఱ్ఱి? కోఁతికన్నఁజాపల్యము-
పాముకన్నఁ గ్రౌర్యము- చీమకన్న నసామర్థ్యము- నల్లికన్న
దొంగతనము- దోమకన్న పాపకార్యము- నక్కకన్న గొంటె
తనము- కాకికన్నఁ జెడ్డతనము- గాడిదకన్నఁ దెలివితేమి- మఱే
జంతువుకన్న నోర్వలేమి- మనష్యుల కేమీావైపరీత్యము? పొట్ట
వేదాంతము- మార్గాలచాప్రాయణము- దంభవేషము- [illegible]
జ్ఞానము- ఏమీాస్వార్థపరత? ఏమీానీతులుబోధించుట? న్యాయము-
పద్ధతి-కట్టుబాటు- పుణ్యము పాపము-మడిపొత్రిపంచ- జపమాల-
నామములు- చదువులుసందేలు వ్రతము లునిష్ఠలు- పరులకొంపకూల
[illegible] యత్నములుసిందవలె- ఒకరికి లేకపోవలైన- ధనముండవలెను. దాఁ

దినవలె నొకరుఁడు మాఁడవలెను- తనకు సుఖ మొరులకుఁ గష్టము
తా బ్రతుకవలె నొకరుఁడు చావవలెను- ఒరులు చెడవలెను దా బాగు
పడవలెను- దా సుఖముగ నున్నఁ జాలు నితరు లెట్లయినఁ దనకేమి?
తాను దనయాలుబిడ్డలు తా మున్నది గంగ తా వచినది రంభ
యోహో యెన్ని పంచాంగము లెన్ని పురాణములు? పరులకు బోధించు
నపుడా కన్నులు తేలవైచుటయు నిలాగు కాప్రించుట చిత్రము! శివునిపై
బత్తిచెప్ప-పై- ఏవస్తువైన నాఁడెము కట్టవచ్చునుగాని మానిసి
నాఁడెముకట్ట బ్రహ్మకైనఁ దరమగునా? సృష్టిలో మనుష్యుఁ డెంత
యున్నతస్థితిలో నుండెనో తిన్నగ నుండకున్న నంత పాటుపడక మానఁడు

పామరులగు ప్రాకృతజనుల కుపాసనాసౌలభ్యము కొఱకును
మఱియును మిక్కిలి సులభబోధకొఱకు నింద్రియ గ్రాహ్యముగా
నవ్యక్తమమూర్తియు నపౌరుషేయము నతీంద్రియమాత్రైకవేద్యము
దివ్యమునగు వేదమునకు యుగాన సారముగా భాషార్థము లను దదను
సారముగాఁ గర్మకలాపమును మునులు వన్నిరిగాని వాస్తవముగా
యోగులకుమాత్రమే యవ్యక్తమైన నాదబ్రహ్మాత్మకమగు వేదము
నకు నుంతయు నింద్రియగ్రాహ్యమగు శబ్దస్వరూపము గాని యర్థము
గాని తదనుసారము గాఁ జేయవలసిన యజ్ఞక్రియాకలాపముగాని లేదు.
నిర్గుణబ్రహ్మమే వేదము- దేవుని నుపాసించు సాధనములుగా విగ్రహ
ములను దేవాలయములను బూజావిధానములను బామరరంజనము
కొఱకును మఱి యాస్తిక్యబుద్ధి హెచ్చరించుటకు నేర్పర్చినట్లు
శ్రౌతస్మార్తకర్మములను లౌకికదుఃఖములనుండి పామరులమనస్సు
లాస్తిక్యబుద్ధికి మఱల్చుటకుఁ గారుణికులై నమును లేర్పర్చినసాధన
ములు సకలయజ్ఞక్రియాకలాపములు- వేదములు కేవలము మాత్రమే
సచ్చిదానందాత్మకమగు నౌర్ధ్వదైహికస్వర్గాపవర్గములబోధించుచున్న
విగాని యైహిక లౌకికకర్మములనుగాని యైహికవస్తువులను వరాగిరాము

క్రతువిధానములనుగాని యెంతమాత్రమును బోధింపవు యుగాను సారముగా నాచారములు నిద్రావాహారవిహారములవిధానములు మాఱు చున్నట్లు వేదములశబ్దార్థములు వానిననుసరించినకర్మములు మాఱక తీఱదు

వేద మాత్మ యాత్మకు మాయాశరీర ముపాధియైనట్లు వేద మున కింద్రియగ్రాహ్యములగు శబ్దార్థవిశేషములుసాధులు గాథలు- నారాశంసులు- ఇతిహాసములు- ఆఖ్యానములు- పురాణములు- కల్పములు- విద్యలు- ఉపనిషత్తులు- శ్లోకములు- సూత్రములు- వ్యాఖ్యానములు- అనువ్యాఖ్యానములు- అను సంజ్ఞలతో వేదభావ కౌలుప్పుచున్నది- వేదద్రష్టలగు ఋషులు గోత్రకారులు పెక్కండ్రు "గోత్రాణాంతు సహస్రాణి ప్రయుతాన్యర్బుదానిచ, ఊనపంచాశదైతేషాం ప్రవరాఋషిదర్శనాత్" లెక్కింపశక్యముకాక గోత్రముల సంఖ్య యెంతయోకలదుకాని ఋషిదర్శనమువలన నలుబదితొమ్మిది మాత్రమే లెక్కింపఁబడినవి- "కస్మైదేవాయ హవిషావిధేమ" ఏవేల్పునుగూర్చి వేలుదుమని ఋగ్వేదమునందల్లి ప్రశ్నముచే వేద మనేక దేవతలను గూర్చియు ననేకవిధయజ్ఞముల గూర్చియుఁ బల్కు చున్నది- వేదమూర్తికి యజుర్వేదము తల- ఋగ్వేదము కుడిప్రక్క- సామవేద మెడమప్రక్క- ఉపనిషత్తు లూపిరి- అథర్వవేదము తోఁక యని చెప్పఁబడుటచే లోకోపకారపరాయణు లతీంద్రియద్రష్టలగు స్వాయంభువ మొదలగు నేఁబదిమువ్వురుఋషులు నిర్గుణపరబ్రహ్మాత్మక మగు వేదము నింద్రియగ్రాహ్యముగా నొనర్చిరి- పంచభూతమయ మగునిజ్జగముత్పత్తిస్థితినాశములందుచునానావిధ దివ్యభౌమవస్తువులతో ననాదిగా నెట్లువెలసినదో యాకారణము వేదమే చెప్పలేకుండెను- చైతన్యము- జడము నాత్మయును దేహమును ఈశ్వరుఁడును- జగము- దృక్కును దృశ్యము- జ్ఞాతయు జ్ఞేయము సత్వరజస్సు-

గుణాత్మకమయిన ప్రకృతియు సచ్చిదానందలక్షణుఁడగు భగవంతుఁ
డును వేదములచే విశదీకరింపఁబడుచున్నారు- పరలోకమును బోధించు
చతుర్విధాభినయములు జగమునం దాయాయి దేశములవారి
కాయాయి వేదరూపములుగా ననాదిగా వెలయుచున్నవి స్వర్గాపవర్గము
లును సంస్కృతము మొదలగు నానావిధ భాషలు- దేవాలయములు-
మతములు- దివ్యతీర్థములు- సజ్జనసంఘములు- నానాదేశజనులకు
నానావిధములయి కాలానుసారముగా సమయోచితపాండిత్యము ననుస
రించి ప్రాచీననవీనాచారములతోఁ ప్రవాహోదకము రీతిని దేశకాల
పాత్రానుసారముగా మాఱుచుండియును మాఱకున్నవి- వేదశబ్దము
నకు మంత్రబ్రాహ్మణములును జౌరుదుబ్బును మొదలగు నానార్థముల
యెడఁ బ్రయోగింపఁబడుటచేతను వర్ణాత్మకముగా కేవల ధ్వన్యాత్మక
ముగా నీశబ్దము ప్రసంగవశమున సమయోచితార్థముల నెలుపఁ
బడుటచేత నర్థానుసారముగా నాచరింపఁబడు శ్రౌతకర్మము సమ
యోచితముగా యథేష్టముగాఁ బ్రయోగింపఁబడుచున్నవి గనుక
బాహ్యయజ్ఞకర్మలన్నియును మానసికములుగా మార్చుకొన్న
ప్పుడు కేవలపరమార్థదాయకములు వివేకాభివర్ధకములు భూతదయా
మయకరులు సర్వలోకోపకారములగుటకు సందేహము లేదు

"చోదనా లక్షణో వేదః" ధర్మమును చెప్పునది వేదము-
ధర్మము స్థూలమనియును సూక్ష్మమనియు రెండువిధములు- ఒక
పురుషునకు పెక్కండ్రు భార్యలుండవచ్చునుగాని పెక్కండ్రు పురుషుల
కొక్కతె భార్యగా నుండరాదని వేదము నుడువుచున్నది- ద్రౌపది
కేవురు భర్త లనుటచేఁ బలువురు పురుషులొక భార్యతోఁ గాఁపురము
చేయవచ్చునని పంచమవేదమగు భారతము నుడువుచున్నది- వేదము-
పంచమ వేదము- వేమన్న చెప్పినది వేదము- సమయోచితముగా ప్రజల
శ్రేయమును లోకోపకారమును చేయఁదగు కర్మమును బోధించుచున్న

శబ్దార్థములన్నియును వేదములే— ఋగ్వేదము— యజుర్వేదము— అథర్వవేదము— అంగిరసవేదము— సర్పవిద్యావేదము— రక్షోవిద్యావేదము— అసురవిద్యావేదము— ఇతిహాసవేదము— పురాణవేదము— సామవేదము— కాఁబట్టి విద్యమొదలుకొని సకలవిద్యలను వేదములే యనిపించుకొనుచున్నట్లశ్వమేధమునఁ జెప్పఁబడుచున్నది—ఈదిక్కుమాలిన వేదములు తెలుఁగునితెంపియినుక పాఁతటి యాద్యంతములు గాక కొక ముక్కు మొనయును లేక లెక్కకుమిక్కిలియైనసకలలోకచర్యల నెఱిఁగించుచునతీంద్రియపదార్థములబోధించుచుజగములోజరుగుచున్న సంగతులనెల్ల పేర్కొనుచుఁ జతుర్విధాభినయాత్మకములై సకలజగత్స్వరూపములై భూతవర్తమానభవిష్యత్కాలిక సకలపదార్థతత్త్వబోధకములై సర్వజగద్వ్యాపకములై వెలయుచున్నవి— వేదమే లోకము మఱియును లోకమే వేదము— లోకములోజరుగుచున్న సంగతులన్నియు వేదములందును వేదములోఁజెప్పఁబడినవన్నియును లోకములోనుగాన్పించుచున్నవి—ఏకార్యమైనను జేయవచ్చుననియు జేయఁదలంచితలంపంతయును వేదమే— వినఁబడినశబ్దమంతయును వేదమే— జరిగినకథనియంతయును వేదమే— సమస్త జగమును వేదమే— దేవుఁడుకానిపదార్థము దైవసంకల్పితముకాని పనియును లేదు దేవుఁడు—వేదము— జగత్తునిక్కముగా నీమూఁడింటికి శబ్దభేదమే గాని రవంతయును వస్తుభేదము లేదు

జడచైతన్యములకువలెలోకవేదములకుభేదమెన్నఁబడుచున్నది. స్మృతినిఁబట్టిలోకముస్ఫురించుచుంట యెల్లరికనుభవమేకదా? సాహిత్యసంగీతమయలోకము—సాహిత్య—మనఁగా జ్ఞానము సంగీత— మనఁగా నామరూపాత్మకమగుజగము—సుషుప్త్యవస్థయందువలెనేన్మృతిప్రకృతిస్లీనముకాఁగానామరూపాత్మకమగుజగముకూఁడఁబ్రకృతియందులీనమై యవ్యాకృతమై సచ్చిదానంద లక్షణమైన బ్రహ్మస్వరూపముగా

మిగులుచుండును. ఇహపరక్రియలు నెఱవేఱుటకు పురుషప్రయ
త్నమూ దైవయత్నమూ ముఖ్యకారణ మని చెప్పంబడెగా కాల
బోధకై యేర్పరింపబడిన దేవాలయములు దేవతావిగ్రహములవిధమున
పావనమును బోధించుటకై పురుషప్రయత్నవ — సకలరూపకములు
పౌరుషము — కార్యసిద్ధికై దైవమువలె బలమైన కారణమని శాస్త్ర
ములు పల్కుచున్నవని మనులు నిర్ణయించినారు కానినిశ్చయముగా
మనుముఖ్యాభిప్రాయము సకలజగత్కార్యములకును సకలపురుష
ప్రయత్నములకు నిశ్చయముగా దైవమే కారణము కాని పౌరుష
మెంతమాత్రమును గాదని సిద్ధాంతీకరింపబడినది

జీవుడు మిక్కిలియజ్ఞానబద్ధుడుమాయకు వశుడు భ్రమావ
హతుడు మిక్కిలి యన్నికార్యములయెడల నస్వతంత్రుడు కావున
సకలజగత్కార్యములకును దైవమదృష్టమే కారణము — నేను నాది
యను నహంకారమమకారబద్ధుడై నజీవుడు మాయావశుడై
స్వప్నమువలె మిథ్యయగు జగమును జూచుచు సుఖదుఃఖము లందు
చున్నాడు. "అనంగోహ్యయంపురుషః" అను శ్రుతిబోధచే నిత్య
సంతుష్టుడై సర్వమునువిష్ణుమయముగా ధ్యానించుచు నిర్వికారుడై
కైవల్యమందుచున్నాడు పౌరుషమన్నశబ్దము కుందేటికొమ్మువలె
అసంభవార్థమునెఱింగించునామమాత్రము నిశ్చయముగా ఆత్మ—
పురుషుడు—బ్రహ్మము— దైవము— అదృష్టము మొదలగుపర్యాయ
శబ్దములుగల యెద్దియోయది యతీంద్రియము మఱి యలౌకికము
నగుపదార్థ మెద్దియో యాపౌరుషమునకు బేరేపకై నత్యమై నిర్వి
కారమై కొంతమై యువ్యయమైన దైవస్వరూపము కలదు కావున
యుత్పత్తియున్నూ దైవమేంగాని పౌరుషమన్నది గగనారవిందమువలె శబ్ద
మాత్రమేగాని తొంతమాత్రమును దైవముకన్న వేఱేపదార్థము
లేనేలేదు

ముముక్షువుల కవశ్యకర్తవ్యము - మును లేర్పర్చిన బ్రహ్మచర్య గార్హస్థ్యవానప్రస్థ సన్న్యాసాశ్రమములను సరిగా నడిపించఁదగిన నత్సహవాసము నహర్దివమును విడువక సకలాంతర్యామియును సజగత్సృష్టిసంహారమూలమును సకలకర్మసాక్షియును సకలకర్మఫలదాయకుఁడును సర్వశక్తియు నచింత్యమహిమాన్వితుఁడును సంశ్రితరక్షాదీక్షాబద్ధకంకణుఁడును సూర్యమండలమధ్యవర్తియును స్వయంప్రకాశుఁడును సకలతేజఃకారణమును సకలభూతప్రవృత్తినివృత్తిశాసకుఁడును జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాత్రయసాక్షియును సచ్చిదానందమూర్తియును సత్వరజస్తమోగుణలీలలన్ క్రీడించుదేవుఁడు నారాయణుఁడు ప్రత్యక్షముగా సకలగ్రహతేజఃప్రవర్తకుఁడై త్రిమూర్త్యాత్మకుఁడై ద్వాదశాత్ముఁడై కాలస్వరూపుఁడై యహర్దివప్రవర్తకుఁడై మింట వెలుఁగుచున్న భాస్కరుఁ డని దృఢముగా నమ్ముకొని, రాజభటునియెదుట నేరముచేయుటకు భయపడుదొంగవలె యమశిక్షకు వెఱచి రేబవళ్లు దిక్కులు భూమ్యంతరిక్షములు సూర్యచంద్రులు వేయేల సకలభూతములు తమతలంపులకును మఱి తాముచేయుసకలకార్యములకును వెల్లడిగాఁ గనిపెట్టు నిష్పక్షపాతసాక్షు లని నమ్ముకొని, యేపనిచేసినపుడు జనులు తమ్ము దూషించి శిక్షించెదరో యేపనులను జేయనీక తమ్ము పెద్దలు నివారించెదరో యట్టిపనులు చేయుటకు సంకల్పించినపుడు చేయుచున్నపుడు గాని చేసినపిమ్మటను గాని తమగుండెలకు దడపుట్టుట యితరులు తమ సంగతి చూచినారేమో యని భయముకల్గుట యేమో వెల్తియును సిగ్గుపాటును వ్యథయు నిట్లెందుకు చేసినా మని నొచ్చుకొనుటయుఁ దప్పుచేసినా రని తమ్ము క్షితిపతులు తర్జనభర్జనాదిశిక్షల శాసించుటయును, మఱి యెవ్వరికిఁ దెలియఁబడకున్నను దమకృత్యములకుఁ దామే సిగ్గుపడుచుఁ దోఁచక మతిపోయినట్లు తమనీడకుఁ దామే వెఱచుట

తటస్థించునో యట్టి కార్యములుచేయుట తమకు తటస్థించ స్వీ
సత్సహవాసమును మోఁగుట - పెద్దలేర్పర్చిన కట్టుబాటులలో
మెలంగలేక మర్యాద నతిక్రమించినపుడు మఱి జీవించి నలుగురిలో
నగుబాటుగానుంటకన్నఁ జావు వేయిరెట్లు మే లని స్ఫుటముగాఁ
దెలిసికొనుట - యీతిబాధలనుండియు సకలప్రమాదములనుండియును
గాపాడుటకు దయానిధీ! భక్తపరాధీనా! సర్వేశ్వరా! భగవంతుఁడా!
దేవదేవ! నీకన్న మఱి వేరేశరణు లే దని ప్రతిక్షణమును రేఁబవళ్ళు
దైవముపై భారమువేసి మంచియైనపు డది దైవకటాక్షమున జరిగె
ననియు చెడ్డయైనపుడు తమయవివేకమును మఱి తమప్రయత్నలోప
మనియును నిశ్చయించుకొనుచు సన్మార్గమున ప్రవర్తించుమానవు
లిహపరలోకసుఖముల ననుభవించుటయే గాక తోడివారినిగూడ తమ
తోపాటు సన్మార్గమునకుఁ దీసికొనిపోవుదురనుట కావంతయు సందే
హము లేదు

## వర్ణాశ్రమవ్యవస్థ - గోత్రావళి

శ్రుతివలన - వస్తువివేకముకలవాఁడు బ్రాహ్మణుఁడు భుజ
బలపరాక్రమముకలవాఁడు క్షత్రియుఁడు ప్రజోత్పాదనసామగ్రికలవాఁడు
వైశ్యుఁడు బ్రహ్మక్షత్రియవైశ్యు లనుమువ్వురను వారివారివృత్తుల
యందుఁ బ్రవర్తింపఁజేయువాఁడు శూద్రుఁ డని తాత్పర్యము. జడ
చైతన్యాత్మకమై జంగమస్థావరాత్మకమగు పాంచభౌతికప్రపంచము
నందలి వివిధవస్తుసమూహమంతయును బ్రహ్మక్షత్రియవైశ్యశూద్ర
జాతులచే నుత్పత్తిస్థితినాశము లందుచున్నది. అచేతనమగు రత్న
ములు నదులు రంగులు మొదలగు నానావిధజడములందును జరాయు
జాండజోద్భిజ్జస్వేదజములందును బ్రహ్మక్షత్రియవైశ్యశూద్ర జాతు
లారోపింపఁబడియున్నవి రాగద్వేషములందలి యథాలాభసంతుష్టి

కలిగి సకలలోకోపకారముగా నున్నప్రాణులకు బ్రహ్మజాతి చెల్లును, అట్టిబ్రహ్మజాతి సంరక్షణమునకై దుష్టసంహారమొనర్చు జీవులకు క్షత్రజాతి యొప్పును బ్రహ్మక్షత్రియులకెల్ల జీవనసామాగ్రికూర్చు జీవులకు వైశ్యజాతి తగును బ్రహ్మక్షత్రియవైశ్యుల సౌకర్యమునకై ప్రవర్తిలు దేహధారులకు శూద్రజాతి వరగును ఎప్పటికైన సదాసమజాతినియమము మాఱకున్నప్పుడు బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రజాతులన్నియును సమానగౌరవమర్యాదలుకలవే కలగల్పు పూలవలె నీనాల్గుజాతిధర్మములును నొక్కదేహధారియందే కాలవశమునఁ బొడచూపుచుంటచే మునులయందుఁదప్ప ప్రాకృతులగు సంసారులలోఁ ప్రత్యేకజాతి యేదేహధారికైన నిర్ణయింప వీలు పడదు కామక్రోధలోభమోహమదమత్సరాత్మకారిషడ్వర్గపీడితులగు సంసారులలో ఓర్పుయొక్క తారతమ్యముఁబట్టి క్రమముగా బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రజాతు లొకదానికన్న నొకటి గౌరవమునఁ దగ్గుచున్నవి ఓర్పుతగ్గుచున్నకొలంది బ్రహ్మజాతి క్షత్రియజాతిగాను క్షత్రియజాతి వైశ్యజాతిగాను వైశ్యజాతి శూద్రజాతిగాను గౌరవమునఁ గొఱఁతపడుచున్నది. మునులందుఁ దప్పఁ ప్రాకృతదేహధారులందు జాతిశుద్ధి నిర్ణయింప వీలుకాదు సత్త్వగుణాధిక్యముచే స్వార్థరహితుఁడుగాక కేవలము పరోపకారముగాఁ జరిపించినపుడు బ్రాహ్మణుఁడు, రజఃప్రవృత్తిచే స్వపరసౌఖ్యముగా నడచినపుడు క్షత్రియ వైశ్య శూద్రజాతులు కలవాఁడును, కేవల తమోగుణప్రధానుఁడై స్వార్థపరుఁడై భూతద్రోహమాచరించువాఁడు జాతిబాహ్యుఁ డనఁబడును బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రజాతులును జాతిబాహ్యులును ముఖ్యముగా దేహధారులందు. మనుష్యులలో నలువది కోట్లమంది మునులగోత్రమువారు ప్రవర్తిల్లుచున్నారు ఒక్కఁ [illegible] ముగ్గురైదుగు రేడ్గురు ఋషులు మూలముగాఁగలగోత్రములు

మొత్తముపై నలువదితొమ్మిదిగోత్రములలోఁ జేరినవారే జగము
నందలి మనుష్యులందఱును మనువను బ్రహ్మవలనఁ గలిగినవారుగనుక
మానవులు మనుజులు మనుష్యులనియును సంకేతము జగమునందలి
జనులకు విలసిల్లుచున్నది మన్ అను ధాతువునకుఁ "దలంచుట" యని
యర్థము భూతభవిష్యద్వర్తమానకాలముల తలంపులుగల జంతువు
లకు మానవు లని పేరుకలిగెను సర్వగోత్రములు ప్రవరగణాయత్త
ములు గోత్రము లనంతసంఖ్యాకము లందులో ఋషిదర్శనమువలన
నలు వదితొమ్మిదిమాత్రమే ముఖ్యము యినవి ఈనలువదితొమ్మిది
గోత్రములఁజేరి కర్మభూమియగు భరతవర్షమందు బ్రహ్మక్షత్రియ
వైశ్యశూద్రజాత్యభిమానముకలవా రనాదికాలము నుండియు
నున్నారు తక్కిన దేశములలోనివారు తమతమకులములకు మూల
పురుషులను వివిధమతములం బరిగణించుచున్నారు భృగ్వంగిరోత్రి
విశ్వామిత్రకశ్యపవసిష్ఠాగస్త్యులనున ఋషులమూలమున నీనలువది
తొమ్మిదిగోత్రములు ప్రవర్తిలుచున్నవి

1 భృగుఋషిమూలమున (1) భార్గవచ్యావనాప్నవ నౌర్వ
జామదగ్ని పంచార్షేయప్రవరాన్విత జామదగ్నివత్సగోత్రము (2) భార్గ
వచ్యావనాప్నవనార్షేయణానూపేతపంచార్షేయ ప్రవరాన్విత
జామదగ్న్యము లేక జామదగ్న్యగోత్రము (3) భార్గవచ్యావనాప్నవ
నౌర్వబైదపంచార్షేయప్రవరాన్వితబిదగోత్రము (4) భార్గవవైత
హవ్యసావేతసత్రయార్షేయప్రవరాన్వితమగు యాస్క— బాధౌ—
మౌన— మౌక— శార్కరాక్షి— సార్ష్టి— సావర్ణి— శాలంకాయన—
జైమిని— దేవంతాయనాదిగోత్రదశకమును (5) భార్గవవైన్యపార్థత్రి
యార్షేయ ప్రవరాన్వితశైత్యగోత్రమును (6) బాభ్రశ్వైనార్షే[illegible]
ప్రవరాన్వితముగాని లేక భార్గవదైవోదాసబాభ్ర్యశ్వత్రయార్షే[illegible]
ప్రవరాన్వితముగాని యగుమిత్రాయువగోత్రము (7) శౌన[illegible]

ద్యైకాత్రేయప్రవరాన్వితముగాని భార్గవశౌన హోత్రగార్త్సమదత్ర
యార్షేయప్రవరాన్వితముగాని యగు శునకగోత్రము

(8) 11 అంగిరసమునిమూలము గౌతమసగోత్రాంతర్భూతములు
(8) అంగీరసాయాస్యగౌతమత్రయార్షేయప్రవరాన్వితమగు గౌతమ
గోత్రము (9)అంగీరసౌతథ్యగౌతమత్రయార్షేయ ప్రవరాన్వితమగు
ఔతథ్యగోత్రము (10) అంగీరసరాహూగణ్యగౌతమత్రయార్షేయ
రాహూగణగోత్రము (11) అంగీరసౌమ్యరాజగౌతమత్రయార్షేయ
సోమరాజకగోత్రము (12) అంగిరసవామదేవ్యగౌతమత్రయార్షేయ
వామదేవగోత్రము (13) అంగీరసబార్హదుక్థగౌతమత్రయార్షేయ
బృహదుక్థగోత్రము (14) అంగీరసపార్షదశ్వవైరూపత్రయార్షేయ
ప్రవరాన్వితముగాని లేక అష్టాదంష్ట్రిపార్షదశ్వవైరూప్యత్ర
యార్షేయ ప్రవరాన్వితముగాని యగుపార్షదశ్వగోత్రము (15)
అంగీరసబార్హస్పత్యభారద్వాజవాంధనమాతవచస పంచార్షేయ
ప్రవరాన్వితఋషిగోత్రము (16)అంగీరసౌతథ్యసత్యగౌతమాశిజకాక్షి
వత్ పంచార్షేయ ప్రవరాన్వితకాక్షివంతగోత్రము (17) అంగీరసౌ
చథ్యదీర్ఘతమ త్రయార్షేయప్రవరాన్వితదీర్ఘతమసగోత్రములను
మరియు అంగీరసమూలమున భారద్వాజర్షినుండి (18) అంగీరస
బార్హస్పత్యభారద్వాజత్రయార్షేయ ప్రవరాన్వితభారద్వాజాగ్ని
వేశ్యగోత్రము (19) అంగిరస భర్మ్యశ్వమౌద్గల్యత్రయార్షేయ ప్రవ
రాన్వితముగాని లేక తార్క్ష్యభార్మ్యశ్వమౌద్గల్యత్రయార్షేయ ప్రవ
రాన్వితముగానియగుముద్గలగోత్రము(20)అంగీరసపౌరుకుత్సత్రసదశ్వ
త్రయార్షేయప్రవరాన్వితవిష్ణువృద్ధ గోత్రము (21)అంగీరసబార్హ
స్పత్యభారద్వాజగార్గ్యశైన్యపంచార్షేయప్రవరాన్వితముగానిలేక
అంగీరసశైన్యగార్గ్యత్రయార్షేయప్రవరాన్వితముగాని యగు గర్గ
గోత్రము (22) అంగీరసాంబరీషయౌవనాశ్వత్రయార్షేయప్రవరా

న్వితములుగాని యయిన హారిత- కుత్స- పింగ- శంఖ- దర్భ- భైమగవము లను నాలుగోత్రములు (23) ఆంగిరసగౌరివీతసాంకృత్యత్రయార్షేయప్రవరాన్వితములుగాని లేక శాక్త్యగౌరివీత సాంకృత్యత్రయార్షేయప్రవరాన్వితములుగానియగు సంకృతి- పూతిమాష- తండి- శంభు- శైవగములను నైదుగోత్రములును (24) ఆంగిరసాజామీఢకాణ్వత్రయార్షేయ ప్రవరాన్వితముగానియగు కణ్వగోత్రము(25) ఆంగీరసామహీయవోరుక్షవస త్రయార్షేయప్రవరాన్వితకపిగోత్రము (26) ఆంగీరసబార్హస్పత్య భారద్వాజశౌంగశైశిర పంచార్షేయ ప్రవరాన్విత శౌంగశైశిరగోత్రము.

III అత్రిఋషిమూలమున (27) ఆత్రేయార్చనానసశ్యావాస్య త్రయార్షేయప్రవరాన్వితమగు ఆత్రేయగోత్రము (28) ఆత్రేయ గావిష్ఠిరపౌర్వాతిథ త్రయార్షేయప్రవరాన్వితమగు గవిష్ఠిగోత్రము

IV విశ్వామిత్రర్షిమూలమున (29) విశ్వామిత్రదేవరాతౌదల త్రయార్షేయప్రవరాన్వితములగు చికిత- గాలవ- కాల- బవ- మనుతంతు- కుశికము లను నైదుగోత్రములు (30) విశ్వామిత్రదేవశ్రవస దైవతరస త్రయార్షేయ ప్రవరాన్వితమగు శ్రౌమత కామకాయన గోత్రము (31) వైశ్వామిత్రమాధుచ్ఛందసధానంజయ్య త్రయార్షేయప్రవరాన్వితమగు ధనంజయగోత్రము (32) వైశ్వామిత్రమాధుచ్ఛందసాజ్య త్రయార్షేయప్రవరాన్విత మగు అజగోత్రము(33) వైశ్వామిత్రమాధుచ్ఛందసరౌహిణ త్రయార్షేయ ప్రవరాన్విత రౌహిణగోత్రము(34) వైశ్వామిత్రమాధుచ్ఛందసాష్టక త్రియార్షేయప్రవరాన్వితమగు అష్టకగోత్రము(35) వైశ్వామిత్రదేవరాతపౌరణత్రియార్షేయప్రవరాన్వితపూరణవారిధావయన్నాగోత్రము(36) వైశ్వామిత్రకాత్యాక్షీల త్రియార్షేయప్రవరాన్వితగోత్రము (37) వైశ్వామిత్రాఘమర్షణకౌశికత్రియార్షేయప్రవరాన్వితమగు అఘమర్షణగోత్రము (38) వైశ్వామిత్రగాధిన రైవణత్రియార్షేయ ప్రవరాన్విత రేణవగో

త్రము(39)వై శ్వామిత్రగాధినవైణవత్రయార్షేయ ప్రవరాన్విత వేణవ గోత్రము(40)వై శ్వామిత్రశాలంకాయనకౌశిక త్రయార్షేయప్రవరా న్వితములగుశాలంకాయన- శాలాక్ష- లోహితాక్ష- లోహితజహ్నువము లనునాల్గు గోత్రములు

V కాశ్యపర్షి మూలమున (41) కాశ్యపావత్సారాసిత త్రయార్షేయప్రవరాన్విత కాశ్యపగోత్రము(42)కాశ్యపావత్సారనైధ్రువత్రయార్షేయప్రవరాన్వితనిధ్రువగోత్రము (43) కాశ్యపావత్సారరైభ్యత్రయార్షేయప్రవరాన్వితరేభ్యగోత్రము (44) శాండిలాసితదైవల త్రయార్షేయప్రవరాన్వితముగాని లేక కాశ్యపాసిత దైవల త్రయార్షేయప్రవరాన్వితముగాని యగుశాండిల్యగోత్రము

VI వశిష్ఠర్షి మూలమున (45) వశిష్ఠైకార్షేయప్రవరాన్విత వశిష్ఠగోత్రము (46) వశిష్ఠాభరద్వస్వింద్రప్రమదత్రయార్షేయప్రవరాన్విత మగు ఉపమన్యవగోత్రము (47) వశిష్ఠశాక్త్యపారాశర్య త్రయార్షేయప్రవరాన్విత పరాశరగోత్రము (48) వశిష్ఠమైత్రావరుణ కౌండిన్యత్రయార్షేయప్రవరాన్విత కుండినగోత్రము

VII అగస్త్యఋషిమూలమున (49) అగస్త్యదార్ఢ్యచ్యుతేధ్మవాహ త్రయార్షేయ ప్రవరాన్వితముగాని లేక అగస్త్యదార్ఢ్యచ్యుత సోమవాహత్రయార్షేయప్రవరాన్వితముగానియగుఅగస్త్యగోత్రమును ఇంతేగాక లెక్కకుమిక్కిలియగు గోత్రసంఖ్య కలదు అందు భృగు వత్సగోత్రములం బ్రత్యేకము డెబ్బదిమూఁడు పేర్లుకలవి- అందులో శౌనకగోత్రము లెనిమిది పైలగోత్రములు పదమూఁడు- పింగళాయన గోత్రములు పదునాల్గు పాణిగోత్రము లిరువదితొమ్మిది- వాల్మీకీయములు ముప్పది విదగోత్రములు పదమూఁడు- ఆర్ష్టిషేణము లెన్మిది యాస్కము లిరువది- మైత్రేయములు పదునొకండు- వైన్యములు

మూఁడు- శౌనకములు తొమ్మిది ఈరీతిన గోత్రములవిశేషము గణితములు శిష్టాచారసంప్రదాయానుసారముగా నాచరింపఁబడు యజ్ఞవిధానములఁబట్టియు వివాహవిధానములఁబట్టియును ప్రాచీన బ్రాహ్మణగోత్రవిశేషభేదము లూహ్యములు

దేవతలకు హవ్యమునం దిచ్చు నగ్నిహోత్రుని ప్రార్థించు విధానము ప్రవర యనఁబడును-అగ్ని కార్షేయమని పేరు- ఆర్షేయ మనఁగా ఋషిసంతానము ఋషులు మొట్టమొదట యజ్ఞముసకై యగ్నిని బుట్టించినారుగనుక- దేవతలలో నగ్ని హోత్రయు నధ్వర్యుఁ డునుగా నున్నాఁడు- హోత్రధ్వర్యులవలె దేవతల కగ్ని యుపచ రించుచున్నాఁడు- బ్రాహ్మణుఁ డగ్నిహోత్రముచేయునపుడు తనవంశ మూలపురుషులను స్మరించవలసినది- అగ్నిహోత్ర ప్రార్థనమందు తనవంశకర్త పేరు ప్రవర యనఁబడును ఇందు కుదాహరణముగా మాండూకేయగోత్రమునఁ జేరిన బ్రాహ్మణుఁలు మాండుకేయులు వత్సగోత్రములోనివారనియు నావత్సలు భృగుసంతతివారనియును దెలిసిగొని యాబ్రాహ్మణుఁలు తక్కినవత్సగోత్రమువారివలెనే భార్గవ చ్యవనాప్నవనౌర్వజామదగ్నపంచార్షేయప్రవరాన్వితవత్సనగోత్రుఁడ నని యగ్నిహోత్రముచేయవలయును మానవశ్రౌతసూత్రములందు యజ్ఞదీక్షితుఁడు తనపేరు తనగోత్రము పేరు తనతండ్రిపేరు తనపితా మహునిపేరును తనప్రపితామహునిపేరును జెప్పవలసినది ఈరీతిగా బ్రాహ్మణుఁ డనాదికాలముగాఁ బ్రవర్తిల్లుచున్న తనగోత్రమును దనవంశమూలపురుషులను మూఁడుతరముల తాతతండ్రులఁ దెలిసి కొనుటచే శ్రౌతస్మార్తకర్మములందుఁ దనకులగోత్రములను వెల్లడించు కొని తనవంశావళిచరిత్రను బ్రచురించుగొని ధర్మశాస్త్రానుసారముగా వివాహాదిసంస్కారములచే గృహస్థయి వర్ణాశ్రమధర్మములఁ గాపాడు కొనుచు నిహపరములఁ దరించుచున్నాఁడు బ్రాహ్మణులందఱును

భృగు- అంగిరసుఁడు- విశ్వామిత్రుఁడు- వశిష్ఠుఁడు కశ్యపుఁడు- అత్రి- అగస్త్యుఁడు- ఈ యేడుగురు ఋషులను బట్టి కలిగిరి- జమదగ్ని- గౌతమ- భరద్వాజ- విశ్వామిత్ర- వశిష్ఠ- కాశ్యప- అత్రి- అగస్త్యలను- నీ యెనమండ్రు నిక్కముగా నందఱు బ్రాహ్మణులకు వంశకర్తలు- ఈయెనిమిదిగోత్రములనుండి పై వివరించిన నలువదితొమ్మిది గోత్రములును గలిగెను

మొదట గర్భమునుండి జంతువుయొక్క శిరస్సు పిదప బాహువులు తరువాతఁ దొడలు తుట్టతుదకుఁ బాదములు వెలువడుట తెలియుచుకదా? కాఁబట్టి విరాట్పురుషుని శిరఃప్రదేశమగు ముఖము బ్రాహ్మణరూపమనియు బాహువులు క్షత్రియవర్ణమనియు నూరువులు వైశ్యజాతియనియు పాదములు శూద్రవర్ణమనియుం జెప్పఁబడెను మొత్తముపై నీజగమంతయును విరాట్పురుషుని శరీరమగుగనుక నంతరిక్షము బ్రాహ్మణస్వరూపము నాయంతరిక్షము నడుమ నగపడు గ్రహములు నక్షత్రములు మేఘములు మెఱుపులు మొదలగునవి క్షత్రియరూపము- భూమి వైశ్యరూపము- పాతాళము శూద్రరూపము భూగర్భములోని పదార్థములు తెలియఁబడవుగాన ద్విజసంస్కారములేక శూద్రజాతివలె నసంస్కృతమై యున్నది భూమిపై భాగము గ్రహనక్షత్రగతులు నంతరిక్షము కొంతవఱ కింద్రియగోచరము గనుక తత్తత్కార్యములయెడఁ బ్రవృత్తినివృత్తుల నుదహరించుటచేత నవి సంస్కృతములై బ్రహ్మక్షత్రియవైశ్యులవలె ద్విజత్వము గాంచిన ట్లూహింపఁబడు చున్నవి వాస్తవముగా మొత్తముపై నాల్గుజాతులం బరఁగు ముఖబాహూరుపాదావయవ విశిష్టమగు మూర్తియంతకును దేహ మనియే పేరుగదా? కాఁబట్టి భూమియందు ద్విజులు ద్విజేతరులు ననిపించుకొన్న బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులందఱును మనుష్యులే- భృగ్వాదిసప్తర్షులు సప్తోర్ధ్వ

లోకములు- సప్తవాయువులు సప్తకిరణాత్ములు - సప్తాగ్నులు
సప్తసాగరములు- సప్తపాతాళములు నేడేళ్లుకలుపఁగా నలువది
తొమ్మిదిగోత్రములుగాని కులములుగాని జాతులుగాని భిన్నవస్తు
సమూహములుగాని తెలుచున్నది- కాఁబట్టియే ద్రవ్యగుణకర్మ
సామాన్యవిశేషసమవాయాభావములు సప్తపదార్థములని లెక్కింపఁ
బడెను బ్రతుకున ముఖ్యముగాఁ బెండ్లి సఖ్యము- సప్తపదులు
ద్రొక్కుట సాప్తపదీనము సఖ్యము- మృతకళేబరము నకు సప్తోట్లు-
సప్తదశాక్షరము యజ్ఞము- సభసప్తాంగలక్షణము- అనాదిగా వేద
ప్రమాణముచేతం ఆగమాః ఖలు దుర్లభా యను నల్కు-
పాటించక వేదభావకు యథేష్టార్థములు పన్ని గోష్పదొద్దులు
తమలోఁదామె మనుష్య లహంకారమమకారములతో స్వార్థపరులై
మునులయభిప్రాయ మెఱుఁగనేరక సర్వభూతదయయును సర్వలోకోప
కారవర్తనమును యథాలాభసంతుష్టియును సకలవేదములు బోధించు
చున్నవని సర్వజనసమ్మతముగా నోరులసుఖపెట్టి తాము సుఖపడ
నేరక తెలిసీతెలియని జ్ఞానలవదుర్విదగ్ధులగు మనుష్యులు తనుకట్టు
త్రిప్పు తాఁదెచ్చుకొన్నట్లు కోరి తిర్యగ్జంతువులకన్నఁ గష్టములఁ
బడుచుంటకుఁగారణము నిక్కముగా స్వాభిమానమే

## తత్త్వనిర్ణయము

నానావిధ పాంచభౌతికోపాధుల నాశ్రయించి స్వకర్మఫల
మనుభవించు వివిధజీవులు ననాదిగా నహంకారమమకారముఁతోఁ
బ్రవర్తిల్లుట స్వభావము- దహనశక్తి యగ్నికి నిత్యమును సహజ
మునుగాని యాయగ్నియొక్క జ్వాలాకారములు మఱి యది వెల్ల
డించు నానావిధములగురంగులు నితరభూతసంయోగోపాధివిశేషజన్య
ములు ననిత్యము లాగంతుకములుగాని సహజము లెట్లుకావో యటు

లనే పృథివ్యాది నవ ద్రవ్య పదార్థములకు గుణకర్మసామాన్య విశేష
సమవాయాభావములను నితరపదార్థవిశేషవ్యక్తీకరణ మనిత్యము
నాగంతుకము గాని వాస్తవముగా స్వతస్సిద్ధము కాదు పాంచభౌతిక
స్థూలోపాధి యుత్పత్తిస్థితినాశములందుటచేత వనిత్యమును స్వప్నము
వలెఁ గల్పితమును మిథ్యయును గాని నిర్విషయమగు మనోద్రవ్యము
వలె నిత్యమును సత్యమును గాదు. ఘటకపాలాదినామరూపము
లుత్పత్తిస్థితినాశవంతములగుటచేత మృత్తునందు. స్వప్నజగమువలెను
మనవికారమువలెను గల్పితములుగాని వాస్తవము లెట్లుకావో
యటులనే పంచభూతాత్మకస్థూలేంద్రియదృష్టములగు నహంకార
మమకారద్రవ్యాత్మక శబ్దస్పర్శరూపరసగంధాదిగుణవిశేషములన్నియును
మిథ్యలుగాని పరమార్థము లెంతమాత్రమును గావు. సత్త్వరజస్తమో
గుణసామ్యమగు ప్రకృతియే యీసర్వజగద్వికారములకు మూలము
నిర్లిప్తుఁడు నసంగుఁడు నగు పరపురుషుని సంపర్కమహిమముచేత
సూదంటురాతిసంపర్కమున నినుము భ్రమించునట్లీప్రకృతి సర్వ
జగద్వికారము లందుంచుట కాత్మవశమున జాగ్రత్స్వప్ననిద్రలం
బరఁగు మనస్సే తార్కాణము

పురుషసంపర్కమహిమముచేత నీత్రిగుణసామ్యమగు ప్రకృతి
ప్రవృత్తి నివృత్తులందుచున్నదికాని నిర్గుణుఁడగు నప్పరమపురుషున
కీప్రకృతిఁగూర్చి తలంపే లేనికారణముచేతను ద్రిగుణసామ్యమగు
ప్రకృతిపురుషునివలె నిర్వికారమగుటచేతను పురుషునకును మఱియుం
బ్రకృతికిని స్వభావముగాలేని జగద్వికారములన్నియును సున్నమునకుఁ
గాని పసుపునకుఁగాని సహజముగాలేని యెఱుపు రెండింటి సంపర్క
విశేషమున నాగంతుకముగా నుద్భవస్థితినాశము లందుచున్నట్లు
కనబట్టుచున్నవి ప్రకృతికిఁబురుషుఁడుగాని పురుషునకుఁ బ్రకృతిగాని
యన్యోన్య మున్న దెంతమాత్రము దెలియదు నిర్విషయమగు మన

స్నువలెఁ ద్రిగుణసామ్యరూపగు ప్రకృతియును దామరాకునంటని నీటి
బిందువువలెఁ బ్రకృతినంటని పురుషుఁడు నన్యోన్యాభావవిశేషము చే
నున్నట్టియు లెవరిమట్టుకువారే నిత్యులును సత్యులు నిర్వికారులను
మఱియుం గేవలులును బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రాదిజాతులు
నానావిధదేహాద్యుపాధివిశేషములు నుత్పత్తిస్థితినాశవంతములగు సకల
జగద్వికారములను స్వప్నవికారములవలె మిథ్యలుగాని వాస్తవ
ములుకావు

కలమున కెందు కిట్లన్యాయముగా గ్రుద్దులాడెదరు? రెండును
మట్టిబొమ్మలే మ్రొక్కుట మ్రొక్కించుకొనుటయు నొక్కయవివేక
మునఁ గలిగినచేష్టలే- వెనుకటిమాట యెందుకు? వేదములు శాస్త్ర
ములు- గఱించినవానిసంగతి నీకేల? ప్రస్తుతము నీయెదుటనున్న
నీతోడిపాటివారినెమ్మి సంపాదించుకొని వారినిసుఖపెట్టి నీవుసుఖ
పడుము- నీవు బ్రాహ్మణుఁడవు కావు మఱి యబ్రాహ్మణుఁడవును
గావు సుఖముగాబ్రతుకుటకై దేవులాడుజంతువులలోనొక జంతువవు
నీతోడిపాటిజంతువుల క్షేమములు కనిపెట్టి యొరులసుఖపెటి నీయూ
పిరియున్నంతవఱకు నీవు సుఖపడుము ఈ సంగతియే వేదములు
శాస్త్రములు మునులు పెద్దలు ప్రాచీనులు నవీను లాప్తులు పిన్న
పెద్దలందఱును బోధించుసమాజధర్మము నీతల్లిదండ్రులు నీయవ్వ
తాతలువలె నీవున్నావా? వారిశరీరము వారిమనస్సులు వారిచేష్టలు
వారికష్టసుఖములు వారిమతములు వారికర్మములువారిగతులు వేఱు
నీస్థితి వేఱు- కాలమునుబట్టి జగమునందలివస్తువులు ప్రతిక్షణ
మొక్కొక్కవిధముగా వికారములందుచుండును నీబ్రతుకు సుఖ
మెట్లుసమకూరునో యటుల నీతోడిపాటివారలతో నీవు వర్తించు
నేర్పు నీలో నున్నది- మఱి యట్టినేర్పు నీకొదవుట కాలరూపియైన
దైవముచేతిలో నున్నది హాయిగాఁబ్రతుకు నీకోర్కె నీపౌరుషము-

మఱి యీసుఖము నీకుఁ జేకూరుట నీయదృష్టమగుదైవము - నీ బ్రతుకు
సుఖము కోరదవేని "సర్వేజనాః సుఖినో భవన్తు" అని యహర్నిశ
మును జపించుచుండుము- వేదములు శాస్త్రములు పురాణములు
ముసలమ్మ పిట్టకథలు వెనుకటిముచ్చటలు గతజలసేతుబంధములు
నీకేల? జగదుపకారముగానడచి యొరులసుఖపెట్టి తాసుఖపడువాఁడు
గొప్పజాతివాఁడు పరులనుబాధించి తాబాధపడువాఁడు క్షుద్ర
జాతివాఁడు. దేశ మెవరేలిననేమి యెవరుప్రభువు లైననేమి
వారివారి చిత్తానుసారముగానడచి వారివారియనుగ్రహమునకుఁ
పాత్రుడవై వారి కుపచరించి సుఖముగా బ్రతుకు మయ్యా!
యవివేకీ! యీదేశ మీభూమి యీయిల్లు స్త్రీ యీధన మీదేహ
మీయాపి రీబ్రతుకు నీయధీన మనుకొనకు నీ వెంతమాత్రమును
స్వతంత్రుఁడవు కావు. కాలవశమున మఱియు నదృష్టవశమున నీ
కీబ్రతుకునందలిస్థితిగతులు తటస్థించుచున్నవి వాస్తవము నీయహం
కారమమకారములు నీచిత్తవికారములు నీస్థితిగతులు స్వప్నవికార
ములవలె మదవికారములమాడ్కి- భ్రాంతిజన్యములుగాని వాస్తవ
ములు కావు- నీ కీబోధ దురవగాహమయ్యెనేని చూడు మాఁకలి
కేయన్నమైనఁ దినకున్నావా? దప్పికేనీరైన ద్రాగకున్నావా? కాఁబట్టి
సుఖముగాఁ బ్రతుకఁ గోరితివేని నిన్నునీవు ప్రేమించునట్లు నీతోడి
పాటివారలం ప్రేమించి వారియౌన్నత్యసంపద నీకున్నట్లు మనస్స
మాధానముచేసికొని యేయెండ కాగొడుగు పట్టి సుఖించుము- నాది
భారతవర్షము- నేను బ్రాహ్మణుఁడను నాయిల్లు నావాకిలి
నాధనము నాజాతి నాపెద్దలంతంతవారు వారలకువలె నాకు జరుగ
వలయును- జాతితక్కువవారికి నేను లోఁబడను నాకుఁగాని
నాజాతివారికిఁగాని దేశవాసులకుఁగాని నన్నుండి యెట్టికష్టములు
వచ్చినను రానీ జాతినిపోఁగొట్టుకొనెదనా? వేదములు శాస్త్ర

ములు పురాణములు ప్రాచీనులు పెద్దలు బోధించిన నాజాతి
నామర్యాద నాకులము పోఁగొట్టుకొందునా యని కాఁచుచ్చిన
గొఱ్ఱె మందనంతను బెదరిచిన ట్లేల నీవు చెడఁయేగాక నీతోఁబవాటి
వారిని జెఱచెదవు? ఆఁడుజాతి పోతుజాతి యీరెండు జాతులుతప్ప
మఱి జాతి లేదు. అన్యాయముగాఁ జెడిపోకు. మనుష్యులంతా
దొక్కటే జాతి. జాతిధర్మము కాపాడఁదలంచుకొందువేని నీవొక్క
మనుష్యులందఱితోఁ బొత్తుగొని వారియిష్టానుసారముగా నడుచుకొని
సుఖించు. ఆయాకాలములకుఁ దగునట్లు వేదములు శాస్త్రములు
పురాణములు మునివచనము లర్థముచేసికొని కాలోచితవర్తనము
సమయోచితవాక్యముఁ బ్రకటించుచు సుఖముగా బ్రతుకఁడనియే
వేదశాస్త్రము లన్నింటి తాత్పర్యము కాఁదెలియుము. పుస్తెకట్టినమాత్ర
మున నీవిపెండ్లామగునా? కవఁగూడినమాత్రమున నీసంతాన
మగునా? యేమివెఱ్ఱి? బదరీబాదరాయణసంబంధ మీసంతసంసా
రము చుట్టరికము వావివరుసలు కులములు జాతులును అనువస్తువు
లకుఁ బెట్టె నీబ్రతుకు నీబ్రతుకుపెట్టె తాళముమాత్రము దైవముచేత
నున్నదికాని నీచేతిలో లేదెందుకు? జాతి హెచ్చుతగ్గులెంచుకొని
కులమునకై గ్రుద్దులాడెదవు నీది మనుష్యజాతి నీవెంతపోఁగొట్టు
కొన్నను మఱి యితరు లెంత జెఱచినను మనుష్యజాతికిఁ బశుజాతికి
వలెఁ దోఁకలు వచ్చునా? తెక్క లబ్బునా? వెనుకటి పంచాగములు
నీకేల? నీతాత యెంతవాఁడైననేమి యెట్లున్ననేమి? మునులసంగతి
ప్రాచీనవర్ణవిశేషవిభేదము నీకేల? అప్పటి కావేదములు నాటి
యాకాలమున కాజాతిమర్యాదలు చెల్లినవి. "ఎప్పటి కెయ్యది
ప్రస్తుత మప్పటి కామాట లాడి" అను న్యాయ మనుసరించి సుఖిం
చుము. నీ కేజాతియును లేదు. నిక్కముగాఁ దక్కినజంతువులవలె
నీ వొకజంతువవు. కాఁబట్టి దక్షజంతువులను నేర్పునఁ దప్పకొని

న్ను సుఖపెట్టుసాధుజంతువులఁ గనిపెట్టుకొని యుండు-ప్రస్తుతము వేదము శాస్త్రముల కిద్దియే తాత్పర్యమని ముమ్మాటికి నమ్ముకొనుము

వేయేల త్రిగుణసామ్యమయిన ప్రకృతికే నిర్వ్వమయిక మన స్సువెంకవపేరు సత్త్వరజస్తమోగుణత్రితయ ప్రకోపమువలన వాతపైత్త్యశ్లేష్మత్రిదోషసామ్య మారోగ్యము మఱి యారోగ్య లక్షణము కొఱ్కలేమి. త్రిగుణసామ్యము ప్రకృతి ప్రకృతిలక్షణము జగముత్పంచని ప్రళయాత్మకమగు సమాధ్యవస్థ యీజగమంతయును స్వప్నజగమువలె మనోభ్రాంతిమూలముగాని వాస్తవము కాదు వాస్తవమైనచో నుత్పత్తిస్థితినాశవత్తుకమగు నేయనిత్యమును గార్యము నగునిదగమె కారణము కానేరదుకదా ? కారణములేని కార్య మెట్లు కలుగును ? మఱియు జగత్సృష్టిస్థితిలయములకుఁ ద్రిగుణ సామ్యమగు ప్రకృతి యొక్క గుణప్రకోపమే కారణమనక తీఱదు- మఱి యాగుణప్రకోపమునకు హేతువు ప్రకృతిపురుషసంపర్కమై యుండును- సూదంటురాలు సూదులసంపర్కముచే వలె ననుమాన ప్రమాణమునఁ బ్రకృతిపురుషసంపర్కమును సాధించి సూచీపరి భ్రమణకార్యసదృశముగా జగత్కార్యమును సాధింపవచ్చును- ప్రకృతిపురుషపరస్పరసంపర్కవశమునఁ బ్రకృతిపురుషతత్త్వమెద్దియు న్గాని జగమను మిథ్యాకార్యము విచిత్రమగనీడవలెఁ బొడముచున్న దనక తీఱదు- నిర్గుణుడగు పురుషునకుఁ బ్రతిబింబముపొడమనేరదు కదా ? త్రిగుణాత్మకమగు ప్రకృతిప్రతిబింబమీజగత్తు జాగ్రదవస్థా వస్తుప్రతిబింబము స్వప్నవస్తువైనట్లు కలుగుచున్నదనియనుమానించ వచ్చును స్వప్నజగము నిక్కముగాఁ బుట్టలేదు పెరుఁగలేదు మఱియు నశింపలేదుకదా ? పుట్టినట్లు నిలిచినట్లు నశించినట్లున్న నీడవంటి మిథ్యాస్వప్నభ్రాంతి సదృశకార్య మీజగము- కానిచో

నిత్యవస్తువులగు ప్రకృతిపురుషు లీయనిత్యమిథ్యాజగత్కార్యమున
కేవిధమైనకారణము గానేరరు మఱియునిజ్జగము త్రిగుణసామ్యమగు
ప్రకృతియొక్క ప్రతిబింబముగాఁగాని నిర్గుణుఁడగు పురుషుని ప్రతి
బింబముగాఁగానియుండనేరదు- ప్రకృతిపురుషసంపర్క భ్రాంతికారణ
ముచే స్వప్నావస్థచే మిథ్యాప్రపంచముతోఁచునట్లీమిథ్యాజగము
తోఁచుచున్నది- త్రిగుణసామ్యమగు ప్రకృతికి స్సంకల్పములేదు.
నిర్గుణుఁడగు పురుషునకు స్సంకల్పమున్నదనరాదు కాఁబట్టి ప్రకృతి
పురుషసంపర్కజన్యమగు నెద్దియో యనిర్వచనీయపదార్థ మీజగ
త్కారణమని నిర్ణయింపక తీఱదు సుషుప్త్యవస్థావిశేషము న్వివరించి
చెప్పనలవికానిచందమున నీజగదుద్భవస్థితివినాశకారణము న్నిర్ణ
యింప నలవికాదు- తెలియశక్యముకాని కారణమే దైవము-
మఱి యాదైవమే ప్రకృతి పురుషసంపర్క మహిమాత్మకమై
యహంకారమమకార జనకమగు స్మృతిరూపమై యున్నది మఱి
యీస్మృతియే సకలసంసార హేతువు- సుషుప్త్యవస్థాత్మకమగు
విస్మృతియే త్రిగుణసామ్యమగు ప్రకృతి- స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థా
సాక్షియై నిర్లిప్తుఁడై నిర్గుణుఁడయిన పరమాత్ముఁడు పురుషుఁడు
వేదములు పరమార్థమును జెప్పుచున్నవిగాని యొక్కింతయును లోక
వ్యవహారములనుగూర్చి చెప్పవు జగదుపకారులయిన యతీంద్రియ
ద్రష్టలగు మునులు పామరబోధకొఱకు మఱి యుపాసనకొఱకు
నలౌకికపదార్థములగు వేదములచే లౌకికపదార్థభినయము నొనర్చిరిగాని
నిక్కముగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది లౌకిక
జాతుల నేవల పరమార్థబోధకములగు వేదములెట్లు వాకొనును?
అగ్ని తన్నుఁదా దహించుకొనఁజాలనట్లు ప్రజ్ఞాన పురుషా
త్మకమగు వేదము తనుఁదాఁ దెలిసికొనఁజాలదు గుణాత్మకమగు
తెలివి నిర్గుణుఁడగు వేదపురుషు నెట్లు తెలియఁగలదు ? వాస్తవ

ముగా వేదపురుషుఁ డీలౌకికాకారాద్యక్షరమూర్తి యని చెప్పుట సాహసము శాఖాగ్రచంద్రవత్తుగాఁ బామరబోధకై మునులు వేదముల నక్షరమయముగా నౌపచారికముగాఁ జెప్పి శ్రద్ధ నుద్బోధించుటకై "అగ్నిమీళే పురోహితమ్" అను మొదలగువాక్యముల నుచ్చరించిరి "పృషోదరా దీని యథోపదిష్టమ్" అను వ్యాకరణసూత్రానుసారముగాఁ గేవలజగదుపకారకులయిన శిష్టులుచ్చరించిన వివిధవేదములు లౌకికములయినప్పటికిం బ్రమాణములుగా నంగీకరించుటయే మిక్కిలి శ్రేయము.

## వేదార్థము

వేదములయర్థమును వేదములభాషయును బ్రతియుగమును మాఱుచుండును పురాణవచనానుసారముగా "ఇషేత్వోర్జేత్వా" అని ప్రారంభించు యజుర్వేదభాషయును మఱి తదర్థమును దదీయకల్పవిధానములును బ్రతియుగమును మాఱుటచే వేదభాషయు నర్థమును మఱియుఁదత్కల్పవిధానములు నైహలౌకికములేయనియు ననిత్యకార్యములని యంగీకరింపకతీరదు మఱియును వేదములన్నియును వైఖరీయాత్మకమనుష్యకంఠోద్భవములు గనుక మానుషాదిదేహములవలె ననిత్యములని నిర్ణయింపకతీఱదు వేదములందు నమ్మకమధికముగాఁ బామరులకుఁ గలిగించి తరింపఁజేయుటకై కాశీవిశ్వనాథుని లింగమును గాశియును బ్రళయాంతమందుఁ గూడ నశింపక శాశ్వతములుగానుండునను వ్యాసవచనములవలెనే జైమినివ్యాసమహర్షులు వేదములు నిత్యములు మఱి యపౌరుషేయములని వేదములను స్తుతించుచుఁ దన్నిత్యత్వము నౌపచారికముగాను గౌణముగాను సిద్ధాంతీకరించి రని ప్రాజ్ఞు లెఱుఁగవలయును "యద్దృశ్యం తన్నశ్యమ్" అను

ట్లు మానుషేంద్రియములను మఱి తద్గ్రాహ్యపాంచభౌతికములగు విశేషము లన్నియు సత్యములును స్వప్నజగమువలె మిథ్యలనియును ప్రకటించు నుపనిషన్మతమే మిక్కిలి యుక్తియుక్తమునఁ గను న్నమంజసగును. స్త్రీ ముందా పురుషుఁడు ముందా? స్త్రీపురుష సంయోగము సంతానమునకుఁ గారణ మని చెప్పఁదీఱునుగదా? స్త్రీపుంసమిథునమునకు నాదికారణము స్త్రీపురుషమిథునమే యని చెప్పినపు డనవస్థాచక్ర దోషము లనివార్యములు. చెట్టుముందా విత్తుముందా యనునప్పుడు చెట్టే విత్తు విత్తే చెట్టు స్థూలసూక్ష్మా కారభేదమున్నప్పటికి వస్తుభేదము లేదయ్యెను. 'వాచారంభణం వికారో నామధేయమ్" అను శ్రుతిప్రకారము మృద్ఘటముల కభేదము "మృదేవసత్యమ్" అనునట్లు నామరూపములు స్వప్నవస్తువు వలె మిథ్యలుం బ్రాతిభాసికములని యంగీకరించినయెడల నీజగమంతయును వ్యావహారికసత్యముగాని నిక్కముగాఁ బారమార్థిక సత్యముకాదని నిశ్చయింపకతీఱదు.

## స్మృత్యర్థము

స్మృతియే యహంకారమమకారాత్మకమై సకలజంగమస్థావరాత్మక జగత్సృష్టిస్థితిలయములకుఁ గారణ మగుచున్నది. విస్మృతి దశయెడల నీసకలజగమును లయమగుచున్నది. కాఁబట్టి సగుణమగు స్మృతియే ప్రకృతిప్రధానమాయావిద్యానిర్వచనీయనామమని మఱి విస్మృతియే సమాధిదశయగు బ్రహ్మతురీయసచ్చిదానందలక్షణ కైవల్యమని సిద్ధాంతీకరింపకతీఱదు. "తెనుఁ గెఱుఁగని సంస్కృత బుధుఁ డెన్నె మెఱుఁగున్" అనునట్లైహలౌకికధర్మమునే తిన్నగాఁ దెలిసికొని నడువశక్తులుకాని మనుష్యులకుఁ బారలౌకికప్రతిబోధనైకప్రయోజనములగు వేదచింతలు వినెడుబరు వెత్తఁజాలక గిజగిజగింజుకొనువాఁడు హిమవత్పర్వత మెత్తనుంకించిన ట్లుండును. అటుం

ప్రభృతద్రష్టలుం గారుశేకు లకుపెద్దలు జగదుపకారధర్మకార్యము లందుఁ బామరులకు విశ్వాసము బుపర్చుటకై పరలోకమున్గల్పించి శాశ్వతస్వర్గసౌఖ్యము కలుగునని యాసపెట్టి బెల్లముగపర్చి చేదు మెపి పిల్లలం బాగుచేయుతల్లివలె స్వార్థపరతమాని “శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్- అహింసా పరమోధర్మః- పరోపకారార్థ మిదం శరీరమ్ అని చేదువలె నారోగ్యకరమును కష్టానుభవ రమగు పరోపకారధర్మమును వేదవేదాంగములంబన్ని నాట్యముచేఁ బాపు ఎుధనమును మారించునట్లు పామరుఎస్వలాభ సౌఖ్య ప్రవమునుమారించి యస్యానుగ్రహ మిచ్ఛామి తస్య విత్తం హరామ్యహమ్” అను న్యాయముగా సంసారభోగసౌఖ్యమును దొలంగించి జగదుపకారక ధర్మాచరణక్లేశమునఁ బ్రవర్తింపఁజేసిరి బ్రతుకునకు సంతుష్ట మొంటనమే ఫలముగమకను స్వలాభప్రవృత్తియొడఁ గోర్కె తీఱక తెల్లి మనస్సున కధికమగుచుండుటచేతను పరోపకారిప్రవర్తనము చేత స్వసౌఖ్యవిముఖతకలుగుకారణముచేత సంతృప్తమయినమనస్సు నిర్వికారమగుటచే మనుష్యుఁడు సంసారదుఃఖ విముక్తుఁడగునని మనులు కేవలజగదుపకారధర్మమును ముఖ్యగౌణవిధులచే వేద శాస్త్రకావ్యరచనావిశేషములచే లౌకికవ్యవహారధర్మముల ననాది కాలమునుండియును బోధింపఁదొడఁగొనిరి

## అహం మమ ప్రత్యయము

అహంకార మమకార జాత్యభిమాన స్వపరవిశేష జన్యరాగ ద్వేషములచే పరస్పరముఁ దన్నుకొని నీరస్వర్గలాభ మనియును ధర్మమనియును యుద్ధము లాడి తెలిసీతెలియని జ్ఞానలవదు ర్విదగ్ధులం ‘క్షణమప్యవతిష్ఠతే శ్వసన్ యది జంతుర్నను లాభవానసౌ” బ్రతికి - యుండిన సుఖములు పడయవచ్చు ననునీతి నపెఁద్రోసి తిన్నిక్రొవ్వి

ఒరులఁ జంపి తాము జావనేల? "శతం దీర్ఘమాయుః" అను శ్రుతిం బాటింపక పశ్చాత్కర్తవ్యములగు సామదానము లవలఁ ద్రోసి స్వపరహానికరములగు భేదదండోపాయము లనుసరించు క్రూరులు బ్రతుకు తెరువెఱుఁగని వెఱ్ఱులు కారె? దేహము మొదలుకొని యేవస్తువును నిక్కముగాఁ దనది కాదని ప్రతిక్షణానుభవమునఁ దెలిసికొనుచుండియు నాయాలు నాబిడ్డలు నాయిల్లు నాశరీరము నాధనము నాభూమి నాదేశము- నాజాతి- నానీతి యని దురభిమానము సహంకారమమకారమూలమగు సంసారమందు మమత విడఁజాలక కేవలం పరోపకారమునకే తన బ్రతుకు ప్రయోజన మని పల్కు వేదశాస్త్ర పురాణాది వాక్యతాత్పర్యము గణింప కూరకొరుల హింసించి తాము హింసపడుచు బ్రాహ్మణులమనియు క్షత్రియులమనియుం బ్రభువుల మనియుం బరిపాలకులమనియు దేశజాత్యభిమానములతో సహంకార మమకారముచే నొండొరుం బొడుచుకొని చచ్చువారు మానుషా కారములనున్న రాక్షసులం బశువులుగాని నిక్కముగా సకలప్రాణ్యు పకారైకధర్మస్వభావలక్షణులగు మానవులెట్లౌదురు? పెక్కుమాట లేల మనుష్యులందఱు నొకరినొకరు నొప్పించక హింసించక సుఖముగా బ్రతుకుమార్గమంతయును సకలవేదశాస్త్రసమ్మతమే. రాజనీతులు- జాతి- జాతినీతులు- వివాహవిధానములును- సంఘశాసనములు- పరి పాలనపద్ధతులు- లోకములోని మనుజు లొండొరులను బాధింప కన్యోన్యానురాగమున నందఱును బ్రతుకుటకై దారులేర్పఱచిన మునియభిప్రాయము సర్వలోకరక్షము కదా? నేను నాదియను సహం కారమమకారములఁ దొఱఁగి మనుష్యులందఱు కలసి మెలసి సమాన నిద్రాహారవిహారసౌఖ్యములతో బ్రతుకుటయే సమస్తవేదశాస్త్రములు ఘంటాపథముగా బోధించుచున్నవి. ఆఁడుదే ముందు పుట్టెనో మగవాఁడే ముందు పుట్టెనో లేకుభయులొక్కసారియే పుట్టిరో "ఇచ్ఛామాత్రత

ప్రభోః సృష్టిః" అనునట్లు దైవసంకల్ప మాత్రముచేతనే కొందఱు వృద్ధులు కొందఱుపడుచువారు కొందఱుకసివారు మొదలుగా నానా వర్ణములతో నానాదేశములందు నానాచారవ్యవహారములతో నానా జాతిభరూపాభావముల వమాన సన్నాకులగు మానవులు కలిగిరో స్వర్గమర్త్యపాతాళములు తత్తద్వస్తువులతో నానా వనములతోడి జడచైతన్యాత్మక జంగమస్థావర వస్తువు లెప్పటినుండి మొదలుకొని యెట్లప్పటివఱకు మాఱుచున్నవో యింక ముం దేసృష్టి యేమగునో నానా వేదశాస్త్రముతాన సారము నానాప్రకారములుగా నూహింపఁబడుచున్నవిగాని నానర్షి మతమున లన్యోన్యయుక్తి ఖండితములౌటచేతను వేదశాస్త్రములు బహుముఖములై బహుమతములం బోధించుచుంటచేతను నిశ్చయము నిదమిత్థమ్మని నిర్ణయించుట కేప్రమాణ మ్మిల్లకుంటచేతను మఱి యీలోకమందలి పదార్థతత్త్వమెద్దియో న నిది యిట్లని వాస్తవముగా నెఱుఁగ వీలుపడకుంటచేతను ప్రతిక్షణము వృద్ధక్షీణతల మాఱుచున్న క్షణికేంద్రియములచేత క్షణికములగు ప్రత్యక్షవస్తుతత్త్వమును నిర్ణయించుటలో ననాదిచరిత్రానుసారముగా నిప్పటివరకు సంశయమే మిగిలియుంటచేతను "పదార్థతత్త్వజ్ఞానాన్నిశ్రేయసావాప్తిః" యను న్యాయము పెండ్లియయింఁగాని వెఱ్ఱికుదురదు వెఱ్ఱికుదిరినఁగాని పెండ్లికాదన్నట్లున్నది- కాఁబట్టి స్వర్గనరకములజోలి మనకేల? మాతృవశములగు పాంచభౌతిక కార్యచింత మనకేల? మనయిష్టానుసారము సూర్యుఁడుదయించునా? ఋతువులు మాఱునా? కాఁబట్టి "అశ్వప్లుతం వాసవగర్జితంచ స్త్రీణాంచ చిత్తం పురుషస్య భాగ్యమ్ అవర్షణం చాప్యతివర్షణంచ దేవో నజానాతి కుతో మనుష్యః" అనుటచేతఁ బదార్థతత్త్వ మెఱిఁగినామనుకొనుట కుందేటికొమ్ము సాధించినామనుకొనుటకదా? నిద్రాహారవిహారసౌఖ్యమాసించుస్త్రీబతు

కునం గొంతవఱకుం దోడిపాటిజనుల యనుగ్రహము సంపాదించు కొన్నట్టుడు ధర్మము లభించుచుంట ప్రత్యక్షధర్మార్థకామమోక్షము. నాల్గిటికిం బాద ధర్మము. అనికనే చాతుర్వర్గమునకు ధర్మమే మొదటం జెప్పంబడెను.

ధర్మమనంగా లోకోపకారకమగు వర్తనము. లోకోపకారక చింతగలవాని కిల్లు నిల్లాలు మొదలగు సర్వసుఖము కలుగును. ధర్మముగా పాదింపంబడిన యర్థమున నాహారసౌఖ్యము నాయాహార సౌఖ్యముంబట్టి లోకసమ్మతవిహారరూపమగు కామసౌఖ్యమును మరి యట్టిజనరంజకవిహారమున నొదవు సుఖనిద్రావిశ్రాంతిరూపకమగు మోక్షానందమును లభించును. అభిలషితాహారవిహారనిద్రాత్మకము లగు నర్థకామమోక్షముల కాలవాలము సర్వలోకోపకారకచింతా స్వరూపమగు ధర్మమే కదా? కాంబట్టి నేను నాది యను జ్ఞప్తి యున్నంతవఱకు దేహధారి సంచలితుఁడగుచు గగనారవింద సదృశమగు లోక[illegible]ముతో లేనిపోని యజ్ఞములు యాగములు క్రతువులు మడి తడులు స్నాన సంధ్యలు జప తపములు జాతి భేదములు శ్రౌత స్మార్త కర్మములు మిట్టవేదాంతములు సన్యాసనములు ఘోరవ్రతములు వివాహపద్ధతులు స్వపరమతభేదములు మఠములు పీఠములు పూజలు సమాధులు భజనము దినములు దైవ ప్రార్థనము లాకాశపంచాంగములు సకలభూతవశ్యమంత్రాభిచార హోమములు వామాచారములు భూతభావిజన్మచింతలతో వ్యర్థ కాలాయాపనము చేయక తమతోడిపాటిజనులను సుఖపెట్టి తాముసుఖ పడు బ్రతుకుతెరువున నడుచువారే మనుష్యులనందగినవారు. నాయాలు నాపిల్ల నాయిల్లు నాభూమి నాధనము నాసొత్తు మనునవి యహంకారమమకారకల్పితములై మద్యవికారజన్యములగు లొప్పుల వలె మిథ్యలుగాని వాస్తవములుకావు. అహంకారమమకారము

తగ్గించుకొన్న పరోపకారపారీణులగు ధర్మాత్ములకు మాత్రము లోక సమ్మతముగా లభించిన నిద్రాహారవిహారాత్మకములగు నర్థకామ మోక్షములతో హాయియగు బ్రతుకు లభించును

## మానవోన్నతి

ఎవ్వరికైనను బ్రతికియున్నంతకు నిద్రాహారవిహార సౌఖ్య చింత తప్పదుకదా? కాని శూరుఁడని పండితుఁడని గొప్పకుల మునఁ బుట్టితినని యితరులకన్న నెక్కువగా నెవ్వఁడైన నధికము గా భోగింప సమర్థుఁడు కాఁడు దేహధారులకుఁ గావలసిన తత్తద్దేశోచిత నిద్రాహారవిహారసౌఖ్యము దైవదత్తమైయున్నది మనుష్యులలో నొకఁడొకనికంటె గొప్పయుం గాఁడు కొద్దియుం గాఁడు జ్ఞానియుం గాఁడు మఱి యజ్ఞానియుం గాఁడు శుద్ధుఁడు న్గా డశుద్ధుఁడు న్గాఁడు పుట్టినవాఁ డంతయు నూపి తీసికొనుటకు నిద్రాహారవిహారసౌఖ్యమనుభ వించుటకు సమానస్వాతంత్ర్యము గలవారే కాన నొకనికంటె నొకఁడు శిష్టుం గాఁడు భ్రష్టు న్గాఁడు ధనికుఁడు న్గాఁడు దరిద్రుఁడు న్గాఁడు లోకోపకారధర్మపరాయణుఁడు యథాలాభసంతుష్టుఁడు గాన సకలజనులను దనవలెఁ బ్రేమించుచు "అస్తి భాతి ప్రియం సచ్చిదా నందలక్షణం బ్రహ్మ" యనునట్టి జగదుపకారపరాయణుఁడై నిత్య సంతుష్టుఁడై సధర్మాత్ముఁడు బాహ్యాంతశ్శత్రుబాధ సంటక మరణ చింతలేక నిర్భయుఁడై "అమృతమభయమాత్మా" అనునట్టు లహం కారమమకారశూన్యుఁ డౌటచే "అశరీరమాత్మా" యనునట్లు జగదుపకారధర్మస్వరూపుఁడై జీవన్ముక్తుఁడై శాశ్వతబ్రహ్మానందమం దును ఊపిరితీసుకొనుటవలెనే నిద్రాహారవిహార సుఖలాభము-నల్ల వారుకానీ తెల్లవారుకానీ యేవర్ణమువారుకానీ యేజాతివారుకాని యేదేశమువారుకానీ చిన్నకానీ పెద్దకానీ సుఖజీవేచ్ఛ మనుష్యులం

వతికిని సమానమే కదా? దండకారణ్యమునఁ దపోధనులగు మునులు
తమ్ము రాక్షసులు భక్షింపఁగా భయపడరేమి ప్రతిఘటించరేమి?
ఆఁకటన్వేఁగు బెబ్బులికిఁ గోరి బుద్ధుఁ డేల తనయొడలి నాహారముగా
నొసంగెను? దేవతల కేల దధీచిముని తనయెముకలను సమర్పించెను?
శిబిచక్రవర్తి యేల తనయొడలి మాంసమును డేగ యాఁకలి తీర్చి గువ్వను
గాపాడెను? “పరోపకారార్థమిదంశరీరమ్”, “అహింసాపరమోధర్మః”
అని తెలిసిన జగదుపకారధర్మమూర్తులు కాఁబట్టి యట్లు పరులకై
తమ ప్రాణము లొసంగిరి శరీరస్మృతియున్నంతవఱకు మనుష్యుఁడు
పరోపకారముగాఁ ప్రవర్తింపక త్రికరణశుద్ధిగాఁ దనతోడిపాటివారల
కుపకరించక నిద్రాహారవిహారసౌఖ్యదాయకద్రవ్యముల నందఱితో
సమానముగా పంచుకొనక దంభుఁడై యితరులకన్నఁ దన కెద్దియో
యాధిక్య మున్నదనుకొని విఱ్ఱవీఁగుచు ధర్మయుద్ధమని న్యాయమండన
మనియును బరుల నేమిష చేతనైన బాధించి చంపుట రాక్షసకృత్యము
పశుకర్మమునుగాని మనుష్యధర్మ మెంతమాత్రము న్గానేరదు. కుల
గోత్రములు పూర్వాచారములు జాతినీతులు శ్రౌతస్మార్తవిహితపద్ధ
తులు వేదశాస్త్రపురాణేతిహాసచోదితములని వంచకులు స్వార్థపరు
లును మునులయభిప్రాయ మరయక వేదశాస్త్రపురాణేతిహాసవాక్య
ముల కపార్థములు ప్రచురించి రాక్షసకృత్యములగు భేదదండోపాయ
ములనుమాత్రమే యవలంబించి కేవలమనుష్యధర్మములగు సామ
దానముల నుపేక్షింపరాదు ఆహారనిద్రావిహారములాసించి ప్రాణు
పశుపక్షికీటములవలె మనుష్యులుఁగూడ నొకవిధమైన జంతుసమూ
హములోఁ జేరినప్రాణులే కదా?

బ్రహ్మసృష్టిలో మనుష్యుఁ డెందు కుత్తముఁ డనవలెను?
ఏజంతువులనైన హింసింపక ధాన్యములు కూరగాయలు పాలు మొద
లగుసాత్త్వికాహారము చేమాత్రము బతుకఁగలిగి జననమరణ ప్రవాహ

దాహకమగు సంసారతాపత్రయమునుండి తప్పించుకొను మోక్షోపాయము నెఱుఁగు తెల్వితేటలు సహజముగాఁ గలిగియుండుటచేతఁ గదా? లోకమందలి మనుష్యులు స్త్రీబాలవృద్ధ జనములను బరస్పరానురాగముతో శక్తికొలఁదిఁ దను తెల్వితేటల నుపయోగపర్చి కష్టపడి భూమిని ఫలవంతముగా సువ్వేళలను సేద్యముచేసికొని కేవల శాకాహారులై తత్తద్దేశఫలితములగు ధాన్యముల న్గూరగాయ పండులను బంచుకొని దేశకాలపాత్రోచితకథ్యాశనపానంబుల సంతుష్టులై యథేష్టకేళీవిహారశయనసౌఖ్యంబులం బ్రతుకవలయుననియే వేదశాస్త్ర పురాణేతిహాస కావ్యముల యన్నింటి ముఖ్యాభిప్రాయ మని సిద్ధాంతీకరింపక తీఱదు- పరోపకారబుద్ధి యొక్కటి దప్ప తక్కినజాతిపద్ధతులు గోత్రములు-వివాహపద్ధతులు ధనదరిద్రతారతమ్యములు- స్వర్గనరకవిభేదములు శ్రౌతస్మార్త కర్మవిధానములు- స్వీయక కీర్తిద్రవ్యకల్పనములు- వావివరుసలు కులవృద్ధిప్రదాయములు- పుత్రపౌత్రవంశపారంపర్యానుగత స్వాస్థ్యవైభవానుభవన్యాయములు మొదలగునాచారములన్నియును స్వార్థపరతచే ధూర్తమానవాకారము నున్న రాక్షసులు కల్పించినవేఁ గదగాని సహజసర్వభూతదయారూపములగు మానవధర్మము లెంతమాత్రమున్నా నేరవు తాముచెడి యొరులనుజెఱచు దుర్మార్గులు మనుష్యాకారములనున్న రాక్షసులు కారా? 'సర్వేజనాః సుఖినోభవన్తు" అని యహర్నిశము చింతించుట యన్న మనుష్యధర్మము వేఱొద్దియున్నాదు

## దర్శనపరామర్శ

ఎవఁడో పండితుఁడు నాయెదుటబడి నేఁ జెప్పినది కాదని సహేతుకముగా శాస్త్రార్థముచేసి వాదము నెగ్గఁగలఁడా? కాని ఇది నాకు తెల్లగా నగపడుచున్నది యథార్థముగానే చెప్పుచున్నాను

వితండము కాదు-నల్పు కాదు తెల్పు వినా కెట్లు బోధించెదవు? మఱియు నన్నెట్లొప్పించెదవు ? నాదృష్టి వేఱు మఱియు నీదృష్టి వేఱు మఱి మన ముభయుల మతమునకు "తత్తు సమన్వయాత్" అనునట్లు సమన్వయ మెట్లు కుదురును ? మన ముభయుల మొక్కఁడైనపుడు కదా యొక్క తెల్పో లేక యొక్క నల్పో తెల్లమగును ? మనోవాక్కాయకర్మల నీకు నాకును నల్పు తెల్పుల కువలె భేదము కలదు కదా ? నీ సత్యము నా కబద్ధము నీ తెల్పు నాకు నల్పు నీవు నీవు నేను నేను నీకును నాకును సామానాధికరణ్య మొందైన సంభవించినపుడు గదా నీ యూహ నా యూహతో సమన్వయించును నీవు లేనే లేవు. నా స్మృతి కొలందినదా నీ సంగతి నాకగపడును ? నా వయోవిశేషములం బట్టి నా స్మృతి యొక్క వ్యక్తావ్యక్త దశలుండును. కాఁబట్టి నా స్మృతి శక్తి విశేషమే నీవు గాని నిక్కముగా నీవనే పదార్థమే లేదు ఇంతేకాక స్మృతి యొక్క యవస్థా విశేషము చేతనే నేనున్నాను నా స్మృతి సుషుప్తి యందువలెఁ బ్రకృతియై త్రిగుణసామ్యమును బొందునపుడు నీవును లేవు నేనును లేను. మన ముభయుల మున్నామా లేమా కలగాంచుచున్నామా ? యిద్ది జాగ్రదవస్థయని యెట్లు నిశ్చయింపఁ గల మిట్లని నా పూర్వపక్షమో నైయాయికమ్మన్యుఁడా సమాధానము చెప్పఁ గాణాదుఁడా యేదీ నీ పదార్థతత్వ జ్ఞానవైభవము ? ప్రమాణప్రమేయాది షోడశపదార్థములను గాని ద్రవ్య గుణాదిసప్తపదార్థములను గాని ప్రతిపాదించు నీ స్మృతి యా యా పదార్థాంతర్భూతమా? లేక తత్పదార్థము నిరూపించు వేఱు పదార్థమా ? నీ స్మృతి నీకంటె భిన్నమా యభిన్నమా ? నేను నా స్మృతి యనుచున్నావే నీ స్మృతి నష్టమైన నీ మూర్ఛావస్థయందు నీకు స్మృతి లేనట్లు చెప్పుచున్నావే ? నీ సుషుప్తియందు నీకు స్మృతి లేనిచో నీ జాగ్రదావస్థలో నీ మూర్ఛావస్థానుభవ మెట్లు వెల్లడియగు

కలిగితివి ? స్మృత్యవచ్ఛేదకావచ్ఛిన్నమగు నీమర్త్యబుద్ధి యనిత్య గుణవిశేషముగా నిర్ణయించిన నీవు సర్వగ్రాహకమయినగుణమునే పొందుంచక ద్రవ్యమును గణింపనేల ? స్మృతినిగణింపక విస్మృతిని గణించునట్లు విస్మృతిని మఱియు స్మృతిని భావాభావములను గణించుటకు స్మృతియే కారణమనునపుడు స్మృతికన్న వేఱుపదార్థమే లేదనియేల నిర్దేశింపరాదు ? ప్రమితి యిట్టిదనికాని ప్రమాణ మిట్టిదనికాని ప్రమేయ మిట్టిదనికాని నిర్ణయించుటకై "ప్రమితి విషయాః పదార్థాః" అనుచుంటివికదా ? ప్రమితికూడ పదార్థమే కదా? పదార్థవిషయాః పదార్థాః అని యనునపుడు "విషయ విషయిణోరభేదః" యని నీ వంగీకరింపక తప్పదుగదా? "గుణగుణినో రభేదః-విషయవిషయిణోరభేదః" అనునట్లు "గ్రాహ్యగ్రాహకయో రభేదః, దృగ్దృశ్యయోరభేదః జడచైతన్యయోరభేదః" అని నీ వొప్పుకొనకతీఱనపు డీషట్సప్తనవబహుసంఖ్యాకపదార్థకథన మేల? కోటికివేయివిధాలన్నట్లు నీయిష్టము వచ్చినట్లు నీవుపదార్థతత్త్వము నిర్దేశించునపుడు నాయిష్టమువచ్చినట్లు నిన్ను నే నోయీ! వేదముల యపౌరుషేయతను నమ్మని కుతార్కికశిరోమణీ! నిన్నుఁగూర్చి నీవు నిర్దేశించి చెప్పఁగలవా ? పృథివ్యాది నవద్రవ్యములలో నీ వేద్రవ్యముతో పృథివ్యప్తేజోవాయుపరమాణువు లెన్నెన్ని యెట్లెట్లుచేరినవో మఱి యవి యాకాశకాలదిగాత్మమనస్సులతో నెట్లుకూడినవో యింతేల జననమరణస్థితులయందలి నీయనుభవమేమో యనుమాన ప్రమాణమున సాధించి నిర్దేశింపఁగలవో-నీవు తల్లిగర్భములో నున్నప్పుడు నీవు సస్మృతుఁడవా లేక విస్మృతుఁడవా- సస్మృతుఁడ వైనచో నీతల్లిగర్భమున బోరగిలఁబంటివా లేక వెల్లకిలఁబంటివా ? ఏమాత్రము చెప్పలేక విస్మృతుఁడవంటివా శరీరము నీతల్లిగర్భమున పెంపొందినట్లు నీ వెట్లు చెప్పఁగలవు ? రౌద్రియో నీకుఁబోఁచిన

ల్లెల్లఁ బదార్థగణనముచేసి న్యాయవైశేషిక సూత్రభాష్యముల
తాత్పర్య మిద్దియని నీవు గ్రహించినట్లు యాదేవభాష కర్థము
కాని, గౌతమకణాదముల తాత్పర్యమిదియేయని పామరుల
యొద్దఁ బండితుఁడ ననిపించుకొని డాబుకొట్టెదు "పశ్యన్నపిచ
నపశ్యతి మూఢః ఉదరనిమిత్తం బహుకృతవేషః" అన్నట్లు కేవల
లోకోపకారకకర్మాచరణమునే బోధించు గౌతమకణాదమునిమతము
లకు బ్రహ్మానుబోధించుటకు వేదాంతమువలె శ్రీవేంకటేశునిబోధించుటకు
రాతిబొమ్మవలెఁ గల్పింపఁబడిన సూత్రములకుం దద్భాష్యములకుం
దెలిసీ తెలియని సంసారాంధకార నిమగ్నులై జీవనసుఖేచ్ఛచేతఁ
గూటికై దేవులాడు పండితమ్మన్యు లజ్ఞానవశవాయి తానుండర్శ
ప్రలాపకర్ణనమున విజ్ఞానులమనుకొని శ్రోత్రవింతసాధ్యతావచ్ఛేదకా
వచ్ఛిన్నపదార్థతత్త్వతాత్వతాత్వతత్వతాపార్థకానర్థ వ్యర్థాడంబర
మేలచేయవలె? విభజింపఁబడనిపరమాణు వతీంద్రియమని యింద్రియ
సాహాయ్యమున వచించుచున్న తెలివితేట లెట్లుండునో?

నీవు రావోయీ వైయాకరణసుఖసూచీ! వాక్కుమందా
లే కర్థముందా? నీలోనితలంపు ననుసరించి పల్కు లనుచున్నావా?
లేక నోటికివచ్చినట్లెల్ల వాగుచున్నావా- ఇద్ది సాధు విద్ది యసాధు
వని శబ్దముయొక్క సాధుత్వాసాధుత్వకల్పనాక్లేశము వ్యర్థముగా
నెందుకట్లద్దమునఁ దననీడ చూచుకొన్నపిచ్చుకవలెఁ బొందెదవు?
"అథశబ్దానుశాసనమ్" అపౌరుషేయ వేదశబ్దములనుగూర్చియా
నీయనుశాసనము లేక లౌకికపుర్త్యవైఖరిన్గూర్చియా? మనుష్యుల
కంఠములనుండి వెలువడినవైఖరి యనుశబ్దవిశేష మలౌకికాపౌరుషేయ
వేదశబ్దమెంత మాత్రము గానేరదుకదా? మఱియును శ్రవణమాత్ర
గ్రాహ్యమగు శబ్దవిశేషము చక్షుర్గ్రాహ్యమగునా? అ-ఇ-ఉణ్
ఋఌక్షరసంజ్ఞారూపమగు వ్రాఁతంబట్టి యెట్లు నిర్దేశింపఁగలవు?

"ఆత్మావివక్షమాణోఽయం మనః ప్రేరయతే పునః మనఃకాయాగ్ని
మాహంతో గాత్సం ప్రేరయతి మారుతమ్" చైతన్యం సర్వభూతానాం
నిర్వృతిర్జగదాత్మనాం నాదబ్రహ్మ ఉపాస్మహే" అని నిర్గుణము
శబ్దబ్రహ్మమును [illegible] యాత్మకుం బరావశ్యన్తీ మధ్యమా వైఖరీ
రూపములఁ బరమాత్మయొక్క పలుకు నిచ్చు పాంచభౌతికోపాధి
వలన శ్రవణగ్రాహ్యమయినదని చెప్పెదవే? నిర్గుణమగు ఆత్మ
కెందుకూరక వివక్షాకల్పనము కుందేటికొమ్మువలెఁ జేసెదవు?
నాదమే బ్రహ్మమనుచు రజ్జువునందలి సర్పమువలె నాదబ్రహ్మము
[illegible]యు నధ్యస్తమారోపితవివర్తమని యొప్పకొను నీమతమున
నాదవివర్తము విన్నతస్వరూపము రజ్జు విమృతసర్పమువలె భ్రాంతి
కల్పితమిథ్యాభూతావాస్తవమగు నకారాద్యాత్మకవాగర్థసాధుతాత్త్వని
రూపణమేల? మనస్సులోఁ జాలఁ గ్రాగినట్లు-అపౌరుషేయ మతీంద్రి
యము కదా? యనిత్యలౌకికశ్రవణమున కగ్రాహ్యము కదా? యావేద
శబ్దము నీ వెట్లు వినఁగల్గితివి? నీకంటికి మాత్రమే గోచరమగు నచ్చుల
యొక్కయు హల్లులయొక్కయు నాకృతివిశేషములగు ప్రాకృతజన
కల్పితసంజ్ఞామయాక్షరపద వాక్యసమూహములే యాయతీంద్రియ
లౌకికాపౌరుషేయనిత్యవేదశబ్దములని నీవు చెప్పట పెట్టనిబచ్చలి
తీగెకెదె పోట్లాటవలె హాస్యాస్పదము కదా? కాఁబట్టి నీవు వేదశబ్ద
ములు సాధుతాసాధుతలనుగూర్చి యుద్దేశించిన శబ్దానుశాసనప్రక
రణము విచ్చితివి- మనుష్యవాక్కు లెట్లుండవలయునో తెలుప
శబ్దానుశాసనము పనికివచ్చునేమోయని యనకొంటివేని- నానాల్క
[illegible] వెంతలగు నవయవశక్తిననుసరించియు నాకంతనాళ
[illegible]ననుసరించియును నాతక్కునశరీరావయవస్థితి విశేషములననుస
రించియును నాతలంపులను వాచికాద్యభినయవిశేషము లందును
[illegible] లక్ష్మీపతియొప్పదన్నట్లు నీశబ్దానుశాసనమెందుకు? కొండ

చేతివాని కంగుళివిన్యాసవిశేష మెఱిఁగించినట్లు ! తమతమ...
శక్తికొలఁది జంగమస్థావరాత్మకప్రాణివిశేషములన్నియుం ...
సుఖములఁ గూర్చి నామరూపాత్మకముగా సహజము వెల్లడించు...
చున్నవి. మఱియును గ్రహణసామర్థ్యము ననుసరించి యావా...
గికాహార్యసాత్త్వికాభినయవిశేషాత్మకనామరూపభేదముల నా...
జంగమస్థావరజీవులు తెలుసుకొనుచున్నవి. నాయనా హెట్లభిన...
చినవు డెట్టి జీవులెట్లు తెలిసికొనవగలరో యట్టియభినయప్రయత్నము ...
కెఱుకగాని నడుమ నీశబ్దానుశాసనమెందుకు? నాయనా పిరిదీసికొ...
నీవు మప్పవలెనా? నీకు పిరితీసిగొనుట యెవరు మప్పినారో...
మధ్యముఁడా? ఏమి నీయచ్చులు హల్లులు నీసంజ్ఞలు నీగం...
నీగడబిడలు నీశబ్దానుశాసనము నీయింట్లోనివారికా? నీయిరుగు...
గులకా? లేక దేశమందలి జనులకా? ఒక్క సంస్కృతభాష...
భాషకా? లేక లోకములోని యన్నిభాషలకా? తలంపులను ...
యాతలంపులఁ దెలుపునుంకించు చతుర్విధాభినయములును ...
దొక రుచి వుత్తేదొక గుణ మన్న ట్లెందఱు మనుష్యులున్నారో...
యన్నివిధములు అభినయవిశేషములు సహజజన్యములు కా...
కృతము లెంతమాత్రము గ్గానేరవు. మఱియును దత్తత్సమయో...
కరాలముగాఁ బ్రసంగముననుసరించి యభినయవిశేషము లుద...
గించుచుండును. కాఁబట్టి నీశబ్దానుశాసనభస్మహోమ మరణ్యరో...
హాంబా శాబ్దికమ్మన్యుఁడా. యేదీ నీ తెల్వి రమధాతువుకంటె ...
ప్రత్యయముచేసినప్పుడు రామయనియయినదా దానికిసుచేర్చిన రా...
ఆగునత్కి. పిదప రుత్వమువచ్చి రామరయి యారు విసర్గగా ...
"రామః" యని ప్రథమైకవచనరూపకమైనదా? లేకాని రమ...
రెండక్షరములుగలశబ్దమే ప్రాతిపదికమా? లేకయారాకు ...
గూరిన ప్రత్యేకప్రాతిపదికము లున్నవా? అర్థవద్ధాతుప్రత్య...

ప్రాతిపదికమ్ యథాగ్నిరిత్యక్షరరూపమ్" అట్టి ప్రాతిపదికప్రకటనము
వలన వక్తకు శ్రోతకునుఁగూడఁ బోధము ప్రయోజన మర్థ మనఁ
బడును. అట్టి ప్రాతిపదికము స్వయంభువు న్గారణముకావలెను గాని
కార్యరూపముగనుండకుంటయు ధాతువనుటకుఁ బ్రయోజనము
మఱియు నా ప్రాతిపదికము సుప్తిఙ్ప్రత్యయములలోఁ జేరఁగూ
డదు కాఁబట్టి యట్టి ప్రాతిపదికరూపమే మోక్షసూచీ పి వెత్తియా
పాపేఁ గల్పింపఁబడవలసిన దేకాని యున్మత్తమనో వికారమువలె
శబ్దమునకారణము స్వయంవ్యక్తమని చెప్పనీ తెల్వితేటలు చాలు నీ
శ్రుత్యాకృతిప్రత్యయకల్పన మదోక వెఱ్ఱి- లోకములో నానావిధవక్తలు
తమయొక్క నానావిధోహాలను నానాప్రకారాభినయములతోఁ
దెల్ప నుంకించుచున్నారు మఱియును శ్రోతలు తమతమ
శక్తికొలఁది గ్రహించుచున్నారు "చత్వారి శృంగాత్రయో
అస్యపాదాద్వేశీర్షే సప్తహస్తాసో అస్య త్రిధాబద్ధో వృషభోరో
రవీతి మహాదేవోమర్త్యా ఆవివేశ" సహజశబ్దబ్రహ్మము నకుఁగనసాధ
ముపకువలె వన్నెలు చిన్నె లేర్పఱ్చు నీపిచ్చి కట్టిపెట్టుము ఆర్య
ప్రేమ మనార్యప్రాణమును భేదముగడించునట్లు శబ్దమునకు
సాధుత్వాసాధుత్వము లేర్పఱ్చు నీతెల్వి చాలును- ప్రతిజంతువునకు
ద్వయాహ లెట్లు వెల్లడింపవలెనో యట్టినేర్పు సహజసిద్ధమే? నదుమ
శబ్దానుశాసన మొందుకుఁ బిలువనిపేరంటకము చెప్పవిందువలెను?
సాష్టముఖములు నీవు వెల్లడించుకొనువిధ మే శబ్దానుశాసన మఱిఁగి
చేయుచున్నావో? అకారాదిస్వరము లెవ్వియో కకారాదివ్యంజనము
లెవ్వియో యేస్వరవ్యంజనములకూడిక న్దొల్లి సకల జనవిదితముగా
నీ పేర్పఱ్చుకొన్నపద్ధతి ననువఱించి నీయాకస్మికకష్టసుఖదశలఁబల్కనై
[illegible] సారావము లేర్పఱ్చుఁగలవా? "అథశబ్దానుశాసనమ్"
[illegible] "[illegible] శబ్దానాము వేదమునకు శబ్దానుశాసన.

మొదల్చెద ననియా? లేక లౌకిక భాష కనియా? అపౌరుషేయము నిత్యమునై బ్రహ్మమువలె నతీంద్రియపదార్థమగు వేదమునకు నీశబ్దానుశాసనశాస్త్రము ప్రవర్తిల్ల నేరదుకదా? మాయవలె జగత్తువలె ననంతవిధమయి క్షణికమై స్వభావముగాఁ బ్రవర్తిలుచున్న లౌకికశబ్దమునకు నీశబ్దానుశాసనము గుడ్డికి కాటుకవలె హాస్యాస్పదమగును. అపశబ్దము సుశబ్దమును సంస్కృతమపభ్రంశమనియును నీయూహలో నున్నవిగాని వాస్తవముగా లోకములో లేనే లేవు-నీయపశబ్దమునాసుశబ్దము-నీసంస్కృతము నాయపభ్రంశము- సహజము నవ్యాకృతశబ్దబ్రహ్మము నానావిధముగా నానావిధదేశజనులందు వ్యాకృతమై తత్తద్దేశమునఁ గ్రాహ్యమై యనాదిగా నున్నయదియే కాబట్టి నీ "అర్థ" శబ్దమును నీ శబ్దానుశాసనమును స్వప్నపులకితములు భ్రాంతిమూలములు- జనులందఱు తమయూహల న్దెలువుకొను నామరూపములన్నియు సంస్కృతములును వ్యాకృతములే సంస్కృతమును వ్యాకృతమును మొదటఁగాకున్నచో నామరూపప్రకటనమే కానేరదు- ఇంతియును నామరూపములయర్థమును భావమును రసమును జనులకందఱకు కాత్మైకవేద్యముగాని యితరమిద్దమ్మని తెలుప నశక్యము- పంచదార యనువస్తువుయొక్క గుణ మిట్టిదని యనుభవైకవేద్యమే కాని యథార్థముగాఁ దెల్ప నశక్యము నీయాఁకలియెంతో నీదప్పి యెట్టిదో నీకష్టసుఖములెట్టివో నీకే స్ఫుటముగాఁ దెలియనపుడుఁ బరుల కెట్లు తెలుపఁగలవు? ఆకాశ మిట్టిదని బ్రాహ్మ యిట్టిదని గాని నిన్ను నీవు చూపించుట గాని యెట్లసాధ్యమో శబ్దతత్త్వము తెల్పనీశబ్దానుశాసనప్రయత్నఫల మట్లసాధ్యమును మఱియు నను భవమును

నీవు రావోయీ మీమాంసకదుర్దురూఢుఁడా- కణాదగౌతమ మనులయభిప్రాయము ద్రవ్యప్రమాణాదిపదార్థతత్త్వము గ్రహించి

జనకమగు ధర్మ ప్రవర్తనముం బ్రతుకు గడుపుకొన్నయెడలం గైవల్యస్వరూపమగు మనస్సంతుష్టి కలుగుననియును "రక్షోహాగమ లఘ్వ సందేహాః ప్రయోజనమ్" అని సకల జంతుప్రాణసంరక్షణబుద్ధి ప్రయుక్తమై విస్పష్టమైన మితవాక్కు గలుగవలయునని పతంజలిముని యొక్క ముఖ్యశాస్త్రమనియును న్యాయమై శేషికమతావలంబులను శాబ్దికు నొప్పించి వంపినాఁడ నీవు రమ్మ 'చోదనాలక్షణధర్మో వేదః" అనునపుడు ధర్మస్వరూపమగు వేదము చోదనాలక్షణము- చోదన మనఁగా నపూర్వఫలమునిచ్చునగ్నిష్టోమాదిక్రతు విధానముపశువపా హోమాదికమని యర్థము చెప్పెదవా? ప్రాణిహింసను జెప్పునదెంత మాత్రమును బ్రమాణము గానేరదు మఱి యలౌకిక మపౌరుషేయ మగు మంత్రబ్రాహ్మణాత్మకమగు వేద మెంతమాత్రమును లౌకిక కార్యకర్మపరము కాదని తలంపవేల? పురుష వేద్యముగాని పురుష ప్రయత్నసాధ్యము గాని యనిత్యమర్త్యహలౌకికమగు పౌరుషమే యగునుగాని యపౌరుషము పాఁలౌకిక మెట్లగును? కాఁబట్టి వేదము తప్పక పౌరుషేయమే యని యనకతీఅక- మఱియును దర్శనముల వలె మునిదృష్టమును కృతమని తప్పకెఱుంగవలయును కాఁబట్టి సలభూతదయాకరులును సకలభూతసములు నతీంద్రియద్రష్టలగు మునులు కేవల పారలౌకికపదార్థవిజ్ఞానదాయకమగు శబ్దజాలమునే చోదనాలక్షణధర్మమగు వేదమని ప్రతిపాదించిరికాని పదార్థములను నాటకములందువలె శృంగారవీరకరుణహాస్యభీభత్సభయానకరౌద్రా ద్భుతము లను నన్మిదిరసములచే జనులకు వేధపుట్టించుటకుగాదు కేవ లార్యయములకుమాత్రమే మంత్రబ్రాహ్మణశబ్దజాల ప్రయోజనము- కేవలమ మలౌకికమగు చిత్తశాంతిని గలిగించి పారలౌకికమగు శాంతరసమును గలిగించి కైవల్యప్రాయమగు నిత్యమనఃసంతుష్టిం గలి గించునట్లు-అన్నమునకు రుచికలిగించు మధురామ్లతిక్తలవణకటుకషాయ

రసములవలె శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషకల్పనిరుక్తములు గౌణము
లుగాఁగల్పింపఁబడెను. కాని యీ యాఱు వేదాంగములు వేదార్థజ్ఞా
నమువలె పారలౌకికధర్మమునగు చిత్తశాంతికి ముఖ్యములుకావు. షడంగ
ములచే వేదమున కపార్థములు కల్పించి వేదశబ్దములు క్రతువిధాన
పరములని లేనిపోనియూహలతోఁ జిత్తశాంతిని బాడుచేయు పశువధా
హోమాదిలౌకిక క్రియాకలాపముఁ బన్ను నీవైదికమ్మన్యత నేమన
వలయును? బుద్ధిజాడ్యజనితోన్మాదుఁడా! శ్రోత్రియుఁడా- నీముఖ్య
ప్రమాణము శబ్దమేకదా? శబ్దమనఁగా నాప్తవాక్యముకదా?
ముఖ్యాప్తవాక్యాత్మకమగు వేదము సకలప్రాణిపోషకముగాని ప్రాణి
హింసకమగునా? యీరహస్య మేల గుర్తెఱుఁగక వేంకటేశ్వరుఁడు
మనుష్యరూపమున నున్నాఁడని నమ్మి మనుష్యునిపోల్కి రాతివిగ్రహ
మును జేసి యామొగమునకు నామములుపెట్టి మ్రొక్కి దేవునివాస్తవ
తత్త్వమెఱుంగని పామరునివలె, దేవతల నెట్టివారో సవిగ్రహాలో
లేక అవిగ్రహాలో తర్కింపక నీవలె వాఁకలినిద్రలును గామక్రోధ
లోభమోహమదమాత్సర్యములను వారికిఁ గల్పించి గ్రామదేవతలందుకు
నడుపుజానపదులవలె నేమేమో తెలిసీతెలియని మంత్రము లుచ్చ
రించు నధ్వర్యుని ప్రవర్తకసహాయమునఁ దక్కుమనుష్యులకన్న నీ
పవిత్రత నగపఱచు దంభకర్మముల విఱ్ఱవీగుచు మేఁకలు మొదలగు
నిరపరాధజంతువులను గటికవలె నేల చంపెదవు? ఏదీ నీ శ్రోత్రియ
కర్మమహిమము- మృతకళేబరము నొకదానినైన సచేతనముగా జేయ
ర్చగలవా? క్షణములోఁ బ్రాణముతీయవచ్చునుగాని ప్రాణముపోయ
నీయబ్బకైనఁ దరమా? నీషడంగ విధానములన్నియును కేవలము
స్వలాభపరులచేఁ గల్పింపఁబడిన దంభక్రియలని తెలిసికొమ్ము. వేదము
సకల జంతుప్రాణసంరక్షకములు. కాని కర్మములన్నిటికి స్వార్థ
పరతయును కేవలస్వోదరపోషణదురాసక్తియు కారణమని తలంచవలెను

శోభాకరసోమాసికి నీ బ్రతుకును పీదారపుత్రుల బ్రతుకు నీ కెంత తీపియో శవర మామేఁకల బ్రతుకు వాని కంత తీపి యని తలంపవేల నో బుద్ధిహీనుఁడా చాలుచాలు నో శ్రోత్రియాతతాయీ! నిన్ను దన్నిదగిలివేయవలయు నిద్దియే నీకుఁ దగినమర్యాద- ఛీఛీ జీవఘాతకుఁడా! దహనము న్నాభూతదయయును ముఖ్యబ్రాహ్మణధర్మములు-నీయధ్వర్యవత్తవశకధూర్తలక్షణమెఱుఁగలేని పామరుఁడవు నిన్గరుణింపకలిఅదు సముద్రఘోషవలె మేఘగర్జితమువలె సనోఁనాక్రోష్టకగోళసరస్వరసంపూర్ణధ్వని సతీంద్రియద్రష్టలగు మునులు లోకోపకారమునకై సృష్టింతములు గావ్యాకృతములు నొనర్చి పఠనమాత్రమునఁ జిత్తశాంతిఁగలిగించి సంసారక్లేశమును మఱపించు మహిమముఁగల మంత్రబ్రాహ్మణరూపముగాఁ గావించిరని తెలియుము వేదములు పఠనమాత్రప్రయోజనములు చిత్తశాంతికరమహిమాస్పదములుగాని కర్మపరములుకావని తెలిసికొనుము- జైమినియభిప్రాయ మిద్దియేయని గ్రహించుము శివనారాయణాది నామోచ్చారణ మెట్లు కైవల్యదాయకమని పురాణమతమో యట్లే మంత్రబ్రాహ్మణాత్మక వేదాధ్యయనము సంసారక్లేశహారకమని జైమిని యభిప్రాయము

వాదించెదవా చెప్పుము- "ఇషే త్వోర్జేత్వేత్యాహ ఇషమేవోర్జం యజమానాయ దదాతి" ఇషేత్వేతి పలాశశాఖాంఛినత్తి" పలాశశాఖకు మోదుగుకొమ్మ యని యెట్లెఱిఁగితివి? గౌతమవ్యాసముఖులు లిరువురు మాత్రమే యాప్తులనఁదగినవారుకదా దక్షిణకై నీ కుపదేశించు నీప్రాకృతులు చెప్పినయర్థము పలాశ మన మోదుగుచెట్టని మాత్ర మెట్లు నమ్మెదవు? "పలాశశాఖాంఛిత్తి" అనఁగా నాకలిగొన్న తోడిపాటివారియాఁకలిఁ దీర్చుటకై పలాశమన అన్నముతో నిండినకుండ- శాఖ మనఁగా కుండలోని యన్నమందలి ధాన్యపుపెద్దబెల్ల మని నే నర్థము చెప్పుచున్నాను "ధాతూనా

మనేకార్థత్వాదవ్యయానా మనేకార్థత్వాన్నిపాతానామనేకార్థత్వా
దుపసర్గాణా మనేకార్థత్వాత్ప్రసంగవశాత్సర్వశబ్దానామన్యార్థత్వా
త్వాత్" అనుటచే శబ్దమున కర్థము సమయోచితముగాఁ దీసికొనుట
సార్వలౌకికమే కదా? కేవల ధ్వన్యాత్మకమగు శబ్దమును వర్ణాత్మక
ముగా వ్యవహారమునకై క్షణములు గడియలు మాసములు సంవత్స
రములు శతాబ్దములవలెను దిక్కునుగూర్చి క్రిందుమీఁదు ప్రక్క
తూర్పు పడమర దక్షిణోత్తరములు వంక తిన్నదనముల మూలలు
చేరువ-దూరములు క్రోసులు యోజనములవలెను గుణియొకటి రెండు
మొదలగుసంఖ్యలు కొలతలు తూనికలు పొడవు పొట్టి మొదలగు పరి
మాణవిశేషములు బ్రాహ్మణాదివర్ణములు - నామభేదములవలెను
కల్పితములుగాని వాస్తవములు కావు మఱియును గటకాద్యలంకారా
కృతివిశేషములు కృత్రిమములనిత్యకార్యములుఁగాని బంగరుమాత్రమే
వాస్తవమైనట్లు స్వరములు వ్యంజనము లచ్చు లల్లులు పదములు
వాక్యములు ఉదాత్తానుదాత్తాద్యాత్మక సప్తస్వరవిశేషము లివన్ని
యును వ్యావహారికసత్యములుగాని నిక్కముగాఁ బారమార్థికసత్య
ములు కావు ఈశబ్దమున కీయర్థమని నియమము లేదు. యీగాను
సారముగా వేదములు వేదార్థములు మాఱుచున్న సమయ[illegible]
నము పాటించక లేదు అనాదిగా పఠనపాఠనసంప్రదాయక్రమ
మున నన్నియక్షరము లెన్నిపదము లని ప్రత్యేక వేదమునకు నియమిత
ములై యున్నవి కాని- వేదముల కర్థయిను వివరించు నిరుక్త[illegible]
వేదాంగమునకుఁ గాని విద్యారణ్యభాష్యమునకుఁ గాని యాస్క[illegible]
లగుటచేత నట్లు గ్రంథసంఖ్య నియమింపఁబడియుండ లేదు. మఱియు[illegible]
దేహములవలెనే వేదాంగములు ప్రాచీనములు కావు. [illegible]
వ్యాకరణమును వేదమునకు ఛందస్సనియును వేదాంగపు[illegible]
కార్థములనియును తర్కమునకావ్యములకు భాషయనియును ప్రతి[illegible]

ప్రవర్తించినయెడల నీ బ్రతుకు హాయిగా జరుగును. లోకులయెడల నీవెట్లు నడిచెదవో తెలుచు లోకులుకూడ నీయెడల నట్లే నడిచెదరు కాఁబట్టి సకలజనరంజకమయిన నీపలుకే సుశబ్దము జనుల కసహ్యమగు నీపలుకే యపశబ్దము. జనరంజకముగా నీ వుచ్చరించినశబ్దమే వేదము - జనరంజకమగు నీ ప్రవర్తనమే యజ్ఞము. ఆత్మమహిమబంధప్రాయమగు వేదముజోలి నీకేల? ప్రతిదినము నీతో వ్యవహరించు నీతోడిపాటిజనుల యనురాగమును సంపాదించుకొని నీ బ్రతుకు సుఖముగాఁ గడమట్టించుకొనుము. సకలభూతదయాపరుఁడవైన నీకు దైవకృతములన్నియు నుపకారములుగాఁ దోఁచకమానవు

ఋగ్వేదమునందలి పదములు ఉదాత్తానుదాత్తస్వరితాక్షరములు ప్రత్యేకము "సతోబంధుమసతి నిరవిందన్ హృది ప్రతీష్యా కవయోమనీషా" అను ఋగ్వేదశ్రుతికి సత్యమగు బ్రహ్మపదార్థమున కనత్యమగు జగత్తునకును సంబంధమును మునులు తమహృదయమందు తమయోగమహిమముచేఁ గనిపెట్టిరని కదా యర్థము! వేదశబ్దములు లౌకికభాషాశబ్దములవలెఁ జాపట్టినట్లు మానవులచేఁ బ్రకృతిప్రత్యయ భాగవిభేదములవలనఁ దోఁచుచున్నవికాని వాస్తవముగా మేఁకకుఁ బొదుఁగునునున్న స్తనమునకు మెడనున్న స్తనములకు వలె తేడిమూరికెగువనున్న కందోయికి మఱి యామీఁదనున్న కందోయికివలె నాకృతిమాత్ర పోలికఁగలదుగాని యర్థమున కెంతమాత్రమును పోల్కి లేదు మఱియును వేదము జ్ఞానపరమేగాని కర్మపర మెంతమాత్రమును గాదు వేదము కేవలమును జ్ఞానసాధనములఁగూర్చియే యుద్దేశింపఁబడెను. పరమాత్మను మునులు తమ హృదయములందు కనిపెట్టి కైవల్యానందమును బొందిరికాని క్రియా స్వార్థపంథ క్రియాకలాపము చేతఁగాదు ప్రగాఢగతులుమా[illegible]

గాని ఋతువులను దాత్మాధీనొనర్చుటకుగాని పంచభూతములను యథే ష్టానుసారముగా నడిపించుటకుఁగాని వేయేల కోరినట్లు కలలుగాంచు టకుఁగాని మతేలౌకికక్రియ లభీష్టానుసారముగాఁ జేయుటకుఁగాని యీ శ్రౌతస్మార్తకర్మములు పనికిరాకున్నవి సర్వక్రియలు విధివశ ములుగాని పౌరుషప్రయత్నసాధ్యములు కాకుంట రూఢికదా ? భూత భవిష్యజ్జన్మములఁ గూర్చియు నవశములగు కాలగతులను గూర్చియును నతీంద్రియములగు స్వర్గపాతాళవస్తువులం గూర్చియును గతజలసేతు బంధనముపగిదిఁ జింతింపనేల ? ప్రకృతమనుసరామః పాయసం భక్షయామః" అన్నట్లు మనతోడిప్రాణులను మచ్చికచేసికొని తదనుగ్రహమును సామదానోపాయములచేతను మాత్రమే సంపాదించు కొని సర్వజనసమ్మతముగా నడుచుకొని యొరుల సుఖపెట్టి తానుసుఖ పడుచు తనజీవితమును గడపుకొనుటకన్న నవశ్యకర్తవ్య మర్త్య కర్మ మింకొద్దియుంగాదని ఘంటాపథముగాఁ జాటెదనోయీ పూర్వ మీమాంసకమ్మన్యుఁడా !

"అథాతో ధర్మజిజ్ఞాసా" అని ప్రారంభించినావుకదా "చోదనా లక్షణోర్థో ధర్మః" అనుచున్నావు వేదచోదితకర్మాచరణము ధర్మ మను చున్నావు కాని వేదశబ్దమునకు అర్థమేమి చెప్పెదవు? "విద్యతేఽనేన విత్తమింది వేదః" అని విద్యారణ్యభాష్య మొప్పుకొనెదవా ? లేక వేద మనఁగా నొకవిధమైనయజ్ఞమునకుఁ జేరినకనిముట్టున కర్థము చెప్పెదవా ? లేక "విద్ జ్ఞానే" అనుటచేతఁ దెలివి కర్థము చెప్పెదవా ? యెట్లైన నిర్వచించుము వేదశబ్దార్థ మెట్లున్నను నిక్క ముగా ధర్మప్రతిపాదకమగుశబ్దము కాకతీఱదుకదా ? ధర్మ మైహ లౌకికము పారలౌకిక మని రెండువిధములుగా విభజించి యైహలౌకిక ముగాఁ బ్రాకృతులును బారలౌకికముగా మునులును- ప్రాకృతులగు మానవులకు పరోపకారవ్రతము ధర్మ మనియును ముముక్షుల కాత్మ

బరస్వరభేదమున్నదికదా? కంఠస్వరము రూపము ప్రాంత యుద్దేశము నడువడి తలంపు మనోవాక్కాయకర్మముల నొకరింకొకరి మఱొకరు వేరొకరివలె నొక రాచరింపఁజాల రొకరు తెలిసికొన్న విధము నింకొకరు తెలియనేర రొకరిమత మింకొకరిమతముగా దొకరియిష్ట మింకొకరిదికా దొకరిగతి యింకొకరిదికా దొకరికర్మ మింకొకరిదికా దొకరియదృష్ట మింకొకరికిరాకుంట నీప్రత్యక్షానుభవమేకదా? వేదము లిట్లు శాసించుచున్నవనియుం బూర్వు లిట్లు నడిచిరనియు నీకన్నఁబెద్దలు నీయాప్తులు చెప్పుచున్నారనికదా నా కులమిది నా వర్ణ మిది నా తల్లి యీయామె నా తండ్రి యితఁడు నా సోదరాదిబంధువులు వీరు మఱి యీశబ్దమున కిది యర్థము నేనొనర్ప వలసిన శ్రౌతస్మార్తకర్మములివ్వియని కేవల శబ్దప్రమాణమాత్రము చేతనే కదా ప్రవర్తిల్లుచున్నావు నీబ్రతుకుసుఖ మాసించికదా యిన్ని పోకళ్లు పోవుచున్నావు? నీవలెఁ గష్టసుఖము లితరుల కుండునని తలంచవా? నీతోడిపాటివారియెడ నీ వెట్లు నడిచెదవో నీయెడల వారట్లు చేసెదరని నీప్రత్యక్షానుభవము నో యవివేకివైదికుఁడా నమ్మవేల?

“ఆపోసుమ్యక్షవరుణభియ సంమత్స్రమాల్ప రావోఽనుమా గృభాయదామేవవత్సాద్విముమగ్ధ్యంహోనహిత్వదారేనిమిశ్చనేశే మెడకిరికిన త్రాడును దప్పించి లేఁగను గాపాడునట్లో వరుణదేవుఁడా నాపాపములనుండి నన్నుఁ దప్పించుము నీవనుగ్రహించినఁ దప్ప నీసాయములేక కనురెప్పలాడించుకొనుటకైనను నేను సమర్థుఁడను కాను ఋక్కు నుపేక్షించెదవా? కన్నపలుపు మెడనిడుకొని పోవుటచే గిజగిజగింజుకొని బాధపడుచున్న లేఁగ నాయురి తప్పించి సుఖపెట్టు దయాశాలికదా మానవుఁ డని యర్థమిచ్చు శ్రుతి నవ హింసను విధించునా? నీపూర్వులు పశుహింసలొనర్చి [illegible]

కామ్యానిత్యకర్మములొనర్చి రని స్వార్థపరులగు ప్రాకృతసంసారుల పల్కులు నమ్మకుము. వేదముల కేయర్థము లైననేమి యొకవేళ వేదము లర్థపరములైనచోఁ గేవల దేవతాప్రార్థనచోదకములుగాని క్రత్వాదికామ్యకర్మచోదకములు కానేకావు "అహరహః సంధ్యాముపాసీత" అను నిత్యకర్మమునకు వేదముచోదకమని చెప్పకతీఱదు సంధ్యోపాసన మనఁగా సర్వజగదుపకారముగాఁ దన్ను నడిపించుమనియును మఱే ప్రాణికైనఁ దననుండి బాధరానీకుమనియును "ధియోయోనః ప్రచోదయాత్" పరమార్థజ్ఞానముం దనకుఁ గలిగించుమనియును మనుష్యుఁడు దైవమును వేఁడుకొనుటయును సర్వలోకోపకారముగాఁ బ్రవర్తించుటయును. నీపూర్వులవలె నీవు నడువనేరవు నీపూర్వు లెట్లునడిచిరో యిప్పటినీయుపదేష్టలుగాని గురువులుగాని యిప్పటిగ్రంథములుగాని నీవుగాని నిర్దేశింపనసాధ్యము నీ విప్పుడొనర్చు క్రతువు క్రూరకర్మమును వ్యర్థము న్గాని నీపూర్వు లొనర్చినయజ్ఞమువలెనే సత్కర్మము కాదు. నీపూర్వులు వేఱు నీవు వేఱు వారిదొక జాతి నీదొక దిక్కుమాలినజాతి వారిదొక కులము నీదొక కులము వారి పుట్టుక వేఱు నీపుట్టుక వేఱు నీతల్లెవతో నీతండ్రియెవఁడో నీవు నిశ్చయముగాఁ జెప్పలేవుకదా నీపూర్వు లొనర్చిన శ్రౌతస్మార్తక్రియావిధానము లిట్టివని తెలియ నీకుఁ గాదు నీయజ్ఞమైన శక్యమా ? యూరకపశుహింసకావించి నీకంటెఁ దక్కువవా రధమజాతివా రని నిరసించి నీవు నిలచినకొమ్మ నీవే నఱకుకొని కోరియేల ముప్పుతెచ్చుకొనెదవో శ్రోత్రియమ్మన్యుఁడా! సోమకటికయాజీ!

"ప్రవృత్తి రేషాభూతానాం నివృత్తిస్తుమహాఫలా" యను మనువచనానుసారముగా నితరులసౌఖ్య మరయక తనయిచ్చ కొలఁది నిద్రాహారవిహారములం బ్రవర్తించుట సకలజీవులకు స్వాభావ

కొమ్ములు ప్రాతఃసవనము మాధ్యందినసవనము సాయంసవనమను మూఁడుపాదములు పత్నీ యజమానులను రెండు శిరస్సులు- గాయత్ర్యాదిసప్తచ్ఛందస్సులు నేడుచేతులు- ఋగ్యజుస్సామవేదములచే మూఁడువిధములను బద్ధింపఁబడి యభీష్టార్థము ను వర్షించుచు స్తోత్రశస్త్రాదిశబ్దములను మాటిమాటికి ఘోషించుచు నిట్లు యజ్ఞరూపమైన మహాతేజస్సు మర్త్యుల నావేశించియున్నదని జైమిని మునియును గౌణముగా "చకవాశస్తనీ హంసదంతావళీకాశవస్త్రా శైవలకేశినీ" అని నదును పండితకవులు వర్ణించునట్లు వర్ణాత్మక శబ్దబ్రహ్మము వోఁడు యజ్ఞము నొకఁడు వర్ణించిరి

మఱి యిప్పుడు స్వరము పదము లయ చేతోవధానము లను నాల్గుకొమ్ములుకలిగి గీత వాద్య నృత్యము లను మూఁడుపాదములు కలిగి- మార్గదేశి యను రెండుశిరస్సులుకలిగి మంద్రమధ్యతార స్థాయిలను మూఁడు తెఱఁగుల బంధింపఁబడి సరిగమపదని యనుసప్త స్వరములచేతఁ నోరినట్లు ధర్మార్థకామమోక్షసంపదలను వర్షించుచు రాగరూపకాలప్రులను మాటిమాటికి మొరయుచు నిట్లు కేవల నాదబ్రహ్మము చేతనజంగమస్థావరాత్మక మర్త్యలోకము నావేశించి మ్రోఁగుచున్నదని కాని, బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థసన్న్యాసము లనునాల్గుకొమ్ములుగలిగి జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూఁడుపాదము లతో స్త్రీపురుషు లనురెండుశిరస్సులతో రక్తము మాంసము మజ్జ వస శుక్రము మేదస్సు చెమ్మ లనునేడుచేతులతో నభీష్టార్థములు వర్షించుచు బాల్య యౌవన వార్ధకములచే బంధింపఁబడి ప్రత్యేకనుమహాతేజస్సు మర్త్యజీవుల నావేశించి ఘోషించుచున్నదని కాని సామదానభేదదండోపాయములను నాల్గుకొమ్ములతో- యుద్ధము-కృషి- సేవ లనుమూఁడుపాదములతో చేతనాచేతనరూపము

లను రెండుశిరస్సులతోఁ సప్తవ్యసనములను నేడు చేతులతోఁ నభీష్టార్థములను వర్షించు చుత్తమమధ్యమాధమస్థితిత్రయముచే బాధింపఁబడి మర్త్యుల నావేశించి ధనమును మహాదేవుఁడు ధ్వని జేయుచున్నాఁడని గాని యర్థము చెప్పవచ్చును

కాఁబట్టి శ్రౌతస్మార్తకర్మములన్నియును నిద్రాహారవిహారములకై వినియోగింపఁగా మిగిలినకాలమును లోకోపకారముగాఁ గడుపుటకై కాలక్షేపార్థమై పండితులచేఁ గల్పింపఁబడిన యాటలు వేడుక లుపాయములు గాని యవశ్య కర్తవ్యము లెంతమాత్రమును గావు, "చోధనాలక్షణోధర్మ" అని వేదవిహితకర్మలగు నగ్నిష్టోమాదికర్మము ధర్మమును నో మీమాంసకుఁడా! ఋగ్యజుస్సామాథర్వములను నాల్గువేదములును బరనపారసమాప్తఫలకములై యధ్యయనసమాప్తిముచేతనే శ్రుతియును వింటమాత్రముచేతనే యాప్తవాక్యప్రమాణమునఁ జిత్తశాంతికమై జననమరణప్రవాహరూపమగు సంసారతాపత్రయమునుపశబ్దమిన్నజేఁయునని నమ్మకొన్న వారికి జగదుపకారకమగు మనస్సంతుష్టిని సం[illegible]లె నొకప్పుడు కలిగింపవచ్చును కేవల ధ్వన్యాత్మకములగు రా రూపకాలపుత్రలకును సంహితాపదక్రమజటఘనాదుల నుచ్చరింపఁబడు వేదశబ్దములకును సముద్రతరంగములకువలెమృద్భాండములకునువలెస్వర్ణకుండలములకు వలె వస్తుభేద మొకింతయును లేదు వేదములో వేదచోదితములో యని యేల పిచ్చివానివలెఁ బ్రలపించెదవు నీకు లోకులవలనఁ బ్రయోజన మున్నదికనుక లోకోపకారమునకై నీబ్రతుకును వినియోగించి యితరులను సుఖపెట్టి నీవు సుఖపడుము సముద్రఘోషవంటి వేదధ్వని వినుటవల్ల స్వప్నవికారములవంటి శ్రౌతస్మార్తకర్మములను నాచరించుటచేతను నిక్కముగా నీవు గ్రహింపఁదగిన పరమార్థముగాని నీనిద్రాహారవిహారసౌఖ్యలాభముగాని జగదుపకారమునకు మత్తే

ప్రయోజనమ్ముగాని రవంతయును లేదు కేవలవృథాకాలక్షేపమాత్ర ప్రయోజనమయి పిచ్చివానిపలుకులవలె నసందర్భములై సకలజన దురవగాహములయిన వేదములు వినుచుస్వార్థపరధూర్తపండితకల్పిత శ్రౌతస్మార్తకర్మములాచరించుచు సోమరివై చెడక నీజీవితమం దవశ్య కర్తవ్యమగు పరోపకారకకర్మమును త్రికరణశుద్ధిగా నాచరించి నీవు తరించి పరులం దరింపఁజేయుము

"ధృతవ్రతా ఆదిత్యా ఇషిరా ఆరే మత్కర్త రహసూరివాగః" దృఢవ్రతులగు నోయాదిత్యులారా రహస్యముగాఁగన్నబిడ్డను జారిణి వలెఁ ద్వరగా నాపాపమును బైటఁబాఱవేయుఁడు ఇద్దియే ప్రకృత్యర్థ మని వెల్లడించువాఁ డెంతబుద్ధిహీనుఁడు? స్త్రీలపరువుతీసి బ్రహ్మ క్షత్రియవైశ్యశూద్రకులగౌరవముం బోనాడ్చి ప్రజలకు దుర్నీతిమప్పి యశ్లీలముగా వేదము పల్కునా? చాలుచాలు "అపాణినీయాః సూత్రేషుపార ఇత్యాహ" పాణిని ప్రోక్తములుకాని సూత్రములు కొన్ని "కౌంజలహస్తిపాదాదిత్యస్యాపాణినీయత్వాత్" మొదలగు నవి పాణిని పేరుతో నుంట కైయటుఁడు కనిపెట్టినవిధముగా నన్ని శ్రుతు లాధునికకల్పితములై శ్రుతులపేరఁ బరఁగుచున్నవో- సకల జనోపకారమగు కర్మలుతప్ప మనుష్యుల కవశ్యకర్తవ్య మింకెద్దియు న్నాదు "వేదప్యేవం శ్రూయతే ఏకస్య బహ్వ్యోజాయా భవంతి నైక స్యా ఏవబహవః పతయస్సంతి ధర్మా ద్వివిధః స్థూలః సూక్ష్మశ్చ మందమతిభిరపి సుఖేన బుధ్యమానః సశౌచాచమన సంధ్యావంద నాదిః స్థూలో ధర్మః శాస్త్రపారంగతైః పండితైరేవ బోద్ధుం యోగ్య ఇతరేషామధర్మభ్రాంతివిషయో ద్రౌపదీవివాహాదిః సూక్ష్మో ధర్మః" ఒకపురుషునకుఁ బెక్కండ్రుభార్యలు కలరుగాని యొకస్త్రీకిఁ బలుపురుభర్తలు లేరని వేదమందునిట్లు చెప్పఁబడియెను స్థూలమ నియు సూక్ష్మమనియును ధర్మము రెండు విధమ్ములు-పామరజనులకు

మిక్కిలి సులభముగాఁ దెలియఁదగిన శౌచాచమన సంధ్యావందనాది
కర్మము స్థూలధర్మము శాస్త్రపారంగతులయిన పండితులచేత
మాత్రమే తెలియఁదగిన ద్రౌపదీవివాహాదికర్మము సూక్ష్మధర్మము-
అని సాయనాచార్యుఁడు స్కుమారిలభట్టును వ్యాఖ్యానించుటచేతఁ
బామరజనులకు మిక్కిలిసులభముగా బోధపడుటకై యేర్పడిన
శ్రౌతస్మార్తకర్మము విగ్రహారాధనమువలె స్థూలధర్మముగాని సర్వ
జగదుపకారకమగు నహింసావ్రతము కేవల పండితైకవేద్యమగు
సూక్ష్మధర్మము "నహింస్యాత్సర్వభూతాని, అహింసా పరమోధర్మః"
అని సర్వప్రాణ్యుపకారకమగు నహింసావ్రతముకన్న మనుష్యులాచ
రింపవలసిన వేదచోదితధర్మమింకెద్దియు న్లేదు సర్వభూతదయావ్రత
మును సకలజనసంతోషకరముగాని తక్కినకర్మములన్నియు శ్రౌత
కర్మములుగానీ లేక స్మార్తకర్మములు మతకర్మములయిన న్గానీ
మిక్కిలి హేయములుగాని యాదేయము లెంతమాత్రము న్గావు నా
పంచేంద్రియచేష్టలతెప్పొప్పులు నేనే కనిపెట్టుచు ఖేదమోదము
లందుచు నాలోనిరహస్యము నేనేదాఁచుకొనలేనివిధమున నాయంతః
సాక్షియెద్దియో నేను వివరింపశక్యముకానికారణ మున్నదని నే
నెఱుంగుచుంట యత్యాశ్చర్యకరము-"సతాంహి సందేహపదేషు
వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః" జీవులు తమయింద్రియ
గోచరమగు వస్తుయాథార్థతత్త్వము నిశ్చయింపఁజాలక సంశయపడు
నపుడు వారివారియంతఃసాక్షియెద్దియో వారివారికి సంశయముతీర్చి
వస్తుయాథార్థ్యమును దెలుపునుఅని కాళిదాసన్నట్లు మనుష్యులు స్వలా
భమాసించి చేయుకర్మములెవ్వియో మఱియుఁ గేవల లోకోపకారక
ముగాఁ జేయుకర్మములెవ్వియో వారివారియంతఃసాక్షియే వారికిఁ దెల్ప
కమానదు స్వార్థపరులుగాక లోకోపకారమునకై జను లేకర్మములు
చేసినప్పటికవన్నియును వేదచోదితధర్మములే. వేదశాస్త్రములు

జగత్తునకెల్ల మిత్రులవలె సర్వప్రాణ్యుపకారకములై యహితముల నుండి జనులను మళ్ళించుటకును మఱి హితములందుఁ బ్రవర్తింపఁ జేయుటకుమాత్రమే యభిప్రాయపడుచున్నవని ప్రాజ్ఞుల తీర్పు

"అథాతనశాయీా" అథ శబ్దస్య నవర్ణదీర్ఘశ్ఛాందసోఽపహారోవా, అగ్లాస్తు- తత్రానుస్వారపరశ్ఛాందసః అపహారోవా" అని సూత్రములనుగూర్చి భాష్యకారు లనుటచేతసూత్రభావనుసవరించినట్లే సూత్రార్థములుకూడ సవరింపఁబడి జగదుపకారక భూతదయాదరము లుగా నేలసవరింపఁబడరాదో? బౌద్ధులు ఋగ్యజుస్సామవేదములు బ్రహ్మముఖమున సకలప్రాణ్యుపకారములుగా వెలువడినసంగతి సత్యమేకాని క్రూరకర్ములగు కొందఱు బ్రాహ్మణజాత్యాభిమానముతో మఱి శ్రోత్రియమ్మన్యగర్వముతోను బండితమన్యతతోను మిక్కిలి స్వార్థపరులయి ప్రాణిహింస కర్మపరములుగాఁ గొన్ని శ్రుతులను దాము వన్ని యావేదత్రయమున దోఁపి రనియును గాఁబట్టి పుచ్చినగొఱియ మందనెల్లఁ జెడిపెనన్నట్లు వేదములన్నియుం దమకు బ్రమాణములు కావనియును దమ గ్రంథములందు వెల్లడించిరి విదేహరాజగు జనకుఁడు బ్రాహ్మణాధ్వర్యసాహాయ్య మక్కఱ లేకయే తనయిష్టానుసారముగా నగ్నిష్టోమాది యజ్ఞకర్మములను స్వతంత్రముగా నిర్వర్తించుకొన్నాఁడని ఛాందోగ్యముపల్ల వెల్లడి యగుచున్నది దర్శపూర్ణమాసాదిశ్రౌతకర్మములు కేవలమును శ్రుతివిహితములనియు ఆ కర్మములన్నియును గార్హపత్యాగ్నిస్థాపన మయినపిమ్మటఁ జేయబడవలయుననియును, స్మార్తకర్మములు ప్రచ్ఛిన్నవేదశాఖాభేదరహస్యమిదులైన ఋషులచేతఁ జెప్పబడినవి గాన- బుణ్యాహవాచ నాదికర్మములన్నియును స్మార్తకర్మములని యును జెప్పఁబడుచున్నవి

"శ్రుతిరపి స్మృతీనాం వేదమూలత్వమాహాయ ద్వైకించ మనురవదత్తద్భేషజమితి భేషజం యథాహితమేనం మనువచనమపి ప్రమాణత్వేనహితమిత్యర్థః" మనువుచెప్పినది మం దని శ్రుతికూడఁ బలికె ననుటచేత శ్రుతి పేర్కొన్న వశిష్ఠాత్రిపరాశరవ్యాసయాజ్ఞవల్క్యాదిమహర్షులచేఁ గావింపఁబడిన స్మృతులన్నియును ప్రమాణములేయనియును వాజసనేయశాఖలో వేదద్రష్టలగు పరాశరాది మునులు పర్కొనింపఁబడుటచేతను గాఁబట్టి శ్రౌతకర్మములవలె స్మార్తకర్మములుఁగూడ వేదవిహితములగుట నొక్కింతయైన నుల్లంఘింపఁబడరాదనియును వేదద్రష్టలగు మునులే స్మృతుల నొనర్చిరి కావున శ్రౌతమువలె స్మార్తముంగూడ వేదచోదితమే యనియు నొప్పుకొనకతీఱనపుడును,సంగీతవిద్వాంసుఁ డొక్కఁడే మోక్షమంద నని యాజ్ఞవల్క్యుఁడును,"సర్వధర్మా న్పరిత్యజ్య మామేవ శరణం వ్రజ" శ్రౌతస్మార్తకర్మములన్నియును విడిచి నన్నే భజించుమని భగవద్గీతను జెప్పినవ్యాసుఁడును, స్వార్థత్యాగముగా కేశవనామ సంకీర్తనము గాని భగవత్సంస్మరణముగాని కలియుగమునఁ దక్కిన శ్రౌతస్మార్తకర్మములన్నింటికన్న ముఖ్యమని పరాశరుఁడును, పాయసము పువ్వులచేత మాత్రమే విష్ణువు నారాధింపక క్రూరులై క్రతువులందు పశుహింస కావించువారికి నరకముతప్ప దనుమనువువాక్యమును నిరసించి యోపూర్వకమ్మన్యుఁడా క్రతువులందు పశువుల నేల హింసించుచున్నావో ?

"సూత్రేషు స్మృతిత్వం స్మృత్యధికరణేస్థితం- తత్సూత్రకారైరేవోక్తం న్యాయవిత్సమయ ఇతి మీమాంసాసిద్ధాంత స్వీకార దర్శనేన హిరణ్యకేశిసూత్రవ్యాఖ్యాతయగు మహాదేవుఁడను పండితుఁడు సూత్రరూపములగు వేదషడంగాదులెల్ల స్మృతులనియే పేర్కొనియెనుగాఁబట్టి శిక్ష- వ్యాకరణ- చ్ఛందో- జ్యోతిష-

కల్ప- నిరుక్తములగు వేదాంగములాఱును న్యాయ- వైశేషిక- సాంఖ్య- యోగ- పూర్వమీమాంసోత్తరమీమాంస లనుషడ్దర్శనములును వెయ్యేల సూత్రరూపములతో నున్న గ్రంథములన్నియుం గొన్ని యనుష్టుప్ఛందోరూపగ్రంథములును స్మృతులనియే న్యాయవిస్తరమయములని మీమాంసా సిద్ధాంతస్వీకార దర్శనముచేఁ బరిగణింపఁబడెను "శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్" శ్రుతుల యుద్దేశమునే స్మృతులు వక్కాణించుచున్నవని కాళిదా సన్నట్లు శ్రుతులకును స్మృతులకును రచనాభేదముతప్ప నర్థభేద మొకింతయు లేదని స్వీకరింపకతప్పనపుడు సకల శ్రుతిస్మృతులను సమన్వయము చేసినప్పుడు సచ్చిదానందలక్షణమగు బ్రహ్మపదార్థ మొక్కటియే సిద్ధించునప్పుడును "అస్త్రభాతి ప్రియమ్" అనుటచేతఁ బ్రేమయే స్వప్రకాశుఁడై యున్న దేవుని తత్త్వ మని చెప్పకతీఱనపుడును ప్రాణిహింసను విధించుకల్పవిధాన మెంతమాత్ర మాదేయముకాదు గదా!

"తత్ర యాపద్ధర్మమోక్షసంబంధి తద్వేద, ప్రభవమ్- యత్త్వర్థ సుఖవిషయం తల్లోకవ్యవహారపూర్వకమితి వివేక్తవ్యమ్ ఏషైవేతిహాసపురాణయోరప్యుపదేశవాక్యానాం గతిః" అని తంత్రవార్తిక మందు కుమారిలభట్టు వేదషడంగము లను పురాణేతిహాసములును సాంఖ్యాది షడ్దర్శనములును ఋగ్యజుస్సామమంత్రములుతప్పఁ దగిన గ్రంథములన్నియుం గృత్రిమములనియును లోకవ్యవహారముం దత్తత్పరిస్థితానుకూలముగ దేశకాలపాత్రానుసారముగ నాయాలోకుల కలవడిన నిద్రాహారవిహారసౌఖ్యానుకూలముగా మనుష్యులు కల్పించిన గ్రంథములే యని స్పష్టపర్చె నోశ్రోత్రియ స్మార్తులారా! యీపాటి నీహారవిహారణకృత్యమున్గట్టిపెట్టుము స్త్రౌతస్మార్త కర్మము వేదత్రయివలె నిత్యములు కావు గ్రామదేవతజాతరలవలె బొమ్మలాట

వలె నాటకముఁ దీరున కగటివేషములమాడ్కిఁ బ్రాకృతజనకల్పిత ములుం బామరోత్సాహజనకములగుట విస్పష్టము- నీవరవు బయ లయ్యె నింక నోర్మూసికొని పొమ్ము శివనారాయణాదిదేవతల పేర్లం బిలువఁబడు మానవులు శివనారాయణాదిదేవత లౌదురా ? యట్లే వేదద్రష్టలగు మునులపేర్లుపెట్టుకొన్న వేదాంగపురాణేతిహాసాది గ్రంథకర్తలగు ప్రాకృతమనుష్యులు మును లవుదురా ? స్వార్థ పరుఁడుఁగాక ఫలవృక్షమువలెఁ బరోపకారమునకు మాత్రమే బ్రతుకుమహాత్ముఁడు ముని స్వలాభ మాశించి దక్షిణచేఁ బొట్ట పోషించుకొంచు నహంకారమమకారముల ననుసరించు మనుష్య కల్పితములయిన పశుహింసాకర శ్రౌతస్మార్తకర్మములు చోదనా లక్షణములగు ధర్మము లని ప్రపంచక పొమ్ము- అగ్నిష్టోమాద్య శ్వమేధాంతమగు శ్రౌతకర్మమును నిషేకాదిశ్మశానాంతస్మార్త కర్మమును దత్తద్దేశకాలపాత్రానుసారముగా నానాజనాభిమతాను కూలముగా నిద్రాహారసంభోగములకు వినియోగింపఁగా మిగిలిన కాలమం దుబుసుపోఁగొట్టుకొనుటకై ప్రాకృతాధునికమర్త్యవిద్వాం సులుపన్నినపన్నుగడలుగాని సహజసిద్ధములు గావు తక్కినజంతువుల కన్న మనుష్యులు కేవల లోకోపకారమునకై పాటుపడుటమాత్రము సార్థకమైన పౌరుషకర్మము లోకోపకారముగా సంచరించుటమాత్రమే మనుష్యులకుఁ దగినమర్యాద స్వార్థపరతయును లోకోపద్రవముగా బ్రతుకుటయును రాక్షసులకును క్రూరజంతువులకును సహజధర్మ ములుగాని నిక్కముగా మానుషధర్మ మెంతమాత్రము న్గాదు

## యజ్ఞము - పశుహింస

హరదత్తుఁ డను పండితుఁ డాపస్తంబప్రోక్తసామయాచారిక సూత్రములకు వ్యాఖ్యానముచేయుచు "అథాతః సామయాచారికా

న్ధర్మా న్వ్యాఖ్యాస్యామః” అను మొదటిసూత్రమునకు శ్రౌతస్మృతి గృహ్యావిధులు చెప్పఁబడినవి కనుక నావిధులకుముందుగా దంతధావనాది శౌచకర్మములు విధింపఁబడుచున్నవి- శ్రౌతస్మార్త కర్మములు చేయఁబూనినవాఁడు మున్ముందు దంతధావనాదిశుద్ధులు కావించుకొని పవిత్రవర్భను ధరించి యజ్ఞోపవీతధారియైనవాఁ డెల్ల సామయాచారిక విధుల నాచరింపవలయును- త్రికాల సంధ్యావందన మాచరింపనివాఁడే శ్రౌతస్మార్త కర్మము చేయుటకుం బనికిరాఁడు అని చెప్పెను విధి నియమప్రతిషేధములని సామయాచారికకర్మములు మూవిధములు-

శాఖానాం విప్రకీర్ణత్వా త్పురుషాణాం ప్రమాదతః, నానాప్రకరణస్థత్వాత్స్మృతేర్మూలం నదృశ్యతే” స్మృతి పుట్టినమూలమగు వేదశాఖ యగపడకుంటచేతను మరి యా వేదశాఖలు చెదరియుండుటచేతను అధ్యయనము మఱువఁబడుటచేతను నానాధికారములుగా నానాంశముల న్నిరూపించుచు నానాస్మృతు లొకదానికొకటి భిన్నముగా నుండుటచేతను స్మృతికి వేదమూలము న్నిరూపింపశక్యముకాదని కుమారిలభట్టు గోడమీఁదిపిల్లివలె స్మృతులు శ్రుతిమూలము లని బౌద్ధుల భయముచే చెప్పలేకున్నాఁడు

“అనుమాన శ్శిష్టాచారః తేనహిభూతం శ్రుతిస్మృతిలక్షణం ప్రమాణమనుమీయతే” స్మృతి యనఁగా మన్వాదికృత ధర్మశాస్త్రము కుమారిలస్వామి మానవకల్ప సూత్రములఁ గూర్చి చేసినభాష్యగ్రంథ సం 2200 లు 32 అక్షరముల సంఖ్యకు గ్రంథమని పేరు యజుర్వేదతైత్తిరీయసంహిత ననుసరించి మీమాంసించిన మానవకల్పసూత్రభాష్యము కుమారిలుం డొనర్చెను రాజమానమగ్న్యాధాన- మగ్నిష్టోమము- చాతుర్మాస్య మని నాల్గు విధములం బెక్కధ్యాయముల నీసూత్రగ్రంథము వెలయుచున్నది

## హోమవిధులు కర్మభేదములు

"అంశు అగ్నిచయన అగ్నిపరిస్తరణ అగ్నిప్రస్తరణ- అగ్ని మంథన- అగ్నియాజ్- అగ్నిష్టోమ- అగ్నిసంస్కార- అగ్నిహోత్ర (దర్శహోత్రాగ్నిహోత్ర ప్రథమాగ్నిహోత్ర) అగ్నిహోమ- అగ్న్యాధాన అగ్న్యాధేయ (అగ్న్యాధేయిక) అగ్న్యాధేయేష్టి- అగ్రపాక- అతిరాత్ర- అధియజ్ఞ- అధిశ్రవణ- అనుజ్ఞాపన- అనుమంత్రణ- అనుయాజ- అన్వాధాన- అన్వారంభణీయా- అభిఘార- అభిధారణ- అభినిర్వాప- అభిమర్శన- అభ్యంజన- అభ్యుక్షణ అభ్యావాహన- ఆగ్నేయయాగ- ఆగ్నేయేష్టి ఆగ్న్యాధేయి - ఆగ్రాయణ ఆజ్యహోమ- ఆజ్యాహుతి- ఆధాన- ఆమంత్రణ ఆరంభణీయ ఆవసన- ఆవసథ్య- ఆస్తరణ- ఆహుతి (యాగ)- ఆహ్వాన- ఇష్టి (ఐష్టిక)- ఉత్పవన- ఉద్ధనన- ఉద్ధావ ఉద్ధలన- ఉద్వాసన- ఉద్వాహ (జాద్వాహిక) ఉన్నయన- ఉపక్లృప్త-ఉపచార-ఉపయుంజన- ఉపయామ- ఉపవపన- ఉపవసథ- ఉపసద్- ఐష్టిక- కాకిహోమ- కామ్యేష్టి- కృష్ణలిపాక- గోదానా గోదావాన) చిత్రేష్టి- చాతుర్మాస్య-చాంద్రాయణ- జప- తుషవిమోక- తుషాపాప దర్శదర్శపౌర్ణమాస- దర్శహోత్రాగ్నిహోత్ర దీక్షా దేవయజన(దేవయజని) దోహ(గోదోహ) ద్వాదశాహిక- నారాశంస- నిత్యహోమ- నియుతభోజన- నిర్మంథ నిర్వపణ- నిర్వాప- నిష్టపన-నిష్టాపన- పత్నీసంయాజ పరిమార్జన- పరివాపణ పరిషేక - పరిస్తరణ - పరిహారణ- పర్యగ్నికరణ పర్యుక్షణ-పశుబంధ పశుశ్రపణ పాక-పాకయజ్ఞ - పాణిగ్రహణపిండనిధాన పిండపితృయజ్ఞ-పితృకార్య-పితృమేధ-పితృయజ్ఞ పిష్టపేషణ పిష్టలేప పూర్ణాహుతి-పౌర్ణమాస-ప్రణయన-(ప్రణయనాగ్ని) ప్రథమాగ్నిహోత్ర- ప్రాయశ్చిత్త ప్రైష- ప్రోక్షణ - ప్రోహణ - ఫలీకరణ- బహిఃప్రహరణ - బహిఃస్తరణ - బలిహరణ - బ్రహ్మవరణ - భక్తదాన - మన్త్రిస్తోమ - మంత్రావృత్తి - యజ్ఞ (యజ్ఞీయ)-

యాగ - యూపవేష్టన - యూపసంమార్జన - యూపాహుతి - రాజసూయ - రాష్ట్రభృత్ - వపన - వరణ (బ్రహ్మవరణ) వ్రత విమోక - వ్రతోపాయన - శునాసీర్య - శ్మశ్రువపన - శ్రవణ - సంస్కార - సంస్పర్శ సత్ర - సంహవన - సంవివపన - సాకమేధ (సాకమేధిక) సాన్తపన (సాంతపనీయ) - సోమపాన - సోమాధాన - సౌమేష్టి - స్తరణ స్వాహాకార - స్విష్టకృత్ - హోమ -” అను శబ్దములు హోమమునుగూర్చియును హోమవిధులనుగురించియును, మఱియును “అగ్ని (ఆహవనీయాగ్ని) ఆహితాగ్ని - ఉపహితాగ్ని - గార్హపత్యాగ్ని - దక్షిణాగ్ని - శాలాగ్ని - అగ్నిష్ఠ అగ్నిహోత్రవణీ అజ అశ్వ అశ్వత్థ అష్టాకపాల ఆజ్య - ఆదుహ - ఆమిక్షా ఆహవనీయాగ్ని - ఆహితాగ్ని ఇడా ఇధ్మ ఇధ్మాబర్హిష - ఇష్టిపశు - ఉత్తరవేది (ఔత్తరవేదిక) ఉపహితాగ్ని - ఉపభృత్ (ఔపభృత్) - ఉపల - ఉలూఖల - ఊర్ణా - ఏకకపాల ఓదన - ఓషధి - కపాల - (అష్టాకపాల - ఏకకపాల - దశకపాల - నవకపాల - పంచకపాల - షట్కపాల - (సప్తకపాల) కర్షూ - కాంస్య - కాష్ఠ కుండల - కుంభి - కృష్ణాజిన క్షామ - ఖనిత్ర ఖాదిర - ఖలేవాలి గార్హపత్యాగ్ని - గగ్గులు - గోక్షీర - గోమయ - గ్రావన్ ఘృత - చమూ - చరు - చరుస్థాలీ - చర్మన్ - చాత్వాల - జపమంత్ర - జరద్గవ జుహూ (జౌహవ) తండుల - తిల - తుషి దక్షిణా దక్షిణాగార - దక్షిణాగ్ని దక్షిణాపాత్ర - దండ - దధి దర్భ దర్భపింజూల - దర్భరజ్జు - దర్వి దశకపాల దిత్యవాహ (దిత్యౌహీ) దృషద్ - ద్రప్స - ధాన్య - ధిష్ణ్య ధ్రువా (ధ్రౌవ) నవకపాల - నవనీత పంచకపాల - పరిధి - పర్ణశాఖా - పవిత్ర - పశు పశుపురోడాశ పాత్ర (పాత్రీ) - పింజూల - దర్భపింజూల) పిండ - పూతీక - పృథుగ్రావన్ - ప్రాశిత్ర - ప్రస్తర - ప్రాచీనావీత - బర్హిస్ - బలి - బ్రహ్మాదన - (బ్రహ్మాదనిక) - భక్త - భద్రస్రుజ్ - భస్మన్ - మధుపర్క - మన్త్రమహాహవిస్ - మాంస - మాష - ముద్గ - ముద్గర - ముసలమూల - మృగ - మృదంగ - మేషీ - మాండ - యజ్ఞాయజ్ఞియ - యజ్ఞోపవీత (యజ్ఞోపవీతిన్) - యవ -

యవాగూ-యాజ్యానువాక్య- యూప- యోక్త్ర- రజ్జు- రథ-లేఖా-
లేప-లోమన్- వత్స-వస్త్ర- వామదేవ్య- వీరవస్త్రీయ- వేది (ఉత్తర
వేది-వేదిశ్రోణి)- వేహత్-వ్రీహి- శకట-శతమాన-శతాయుధ-శమీ
(శమీశాఖా)-శర-శరావ-శాఖా-శాలా- శాలాగ్ని- శుల్క- శూర్ప-
శ్మశ్రు- శ్యామాక- శ్యేనీ- షట్కపాల- సప్తకపాల- సమిష్టయజుస్-
సంభార సాంనాయ్య-సోమ స్తంబయజుస్-స్రుచ్(స్రౌచే) స్రువ-స్ఫ్య-
హవిర్ధాన-హవిస్-హిరణ్య" అనెడుహోమద్రవ్యములుపనిముట్లుప్రార్థ
నములును దక్షిణహోమసంబంధవస్తువులును, మఱియును హోమకర్మ
ములగూర్చినసమయ ప్రదేశములు - అనుమతీఅమావాస్యాఉపసత్కాల-
కృత్తికా-చైత్రీ-దక్షిణాకాల- ద్యావాపృథివీ-పునర్వసు- ప్రాతర్-
ఫాల్గునీ- భువనే- భూ- మాధ్యందిన- మార్గశీర్ష- మృగశిరసీ-రాత్రి-
వర్షాః (వార్షిక)- రేవతీ- రోహిణీ- వసన్త- వైశాఖ- వ్యుష్ట- శరద్-
శిశిర-శునాసీర-సంవత్సర-సద్యఃకాల-సాయమ్-సూర్యోదయ-స్వర్-
స్వర్గ హేమంతములును, మఱియును అధ్వర్యులన్గూర్చి, అధ్వర్యు (అధ్వ
ర్యవ) అగ్నీధ్ర-ఆధానర్త్విజ్- ఉద్గాతృ- ఋత్విజ్- చమసాధ్వర్యు-
పత్నీ- పురోహిత- ప్రతిప్రస్థాతృ- బ్రహ్మన్(బ్రహ్మత్వ)- యజమాన
(యాజమాన) యజ్ఞపతి- యష్టృ- హోతృ (హౌత్ర) శబ్దములును-
మఱియుద్దేవతలనుతత్ప్రకృతులనుదెల్పుటకై అగ్ని- అగ్నిషోమీయ-
ఆగ్నేంద్ర(ఇంద్రాగ్ని)అదితి అపాంనప్తృ-అపోనప్తృ(అపోనప్త్రీయ)-
ఆగ్నేంద్ర- ఆగ్నేయ- ఆదిత్య- ఆశ్విన- ఇంద్ర- ఇంద్రాణీ- ఐంద్ర-
ఐంద్రాగ్న- గంధర్వ- తనూనపాద్- త్ర్యంబక- దేవ- దేవతా-
పూషన్- బలదేవ- బహుదేవత- బృహస్పతి- మరుత్ (మారుత)-
మహేంద్ర - మైత్రావరుణ - మైత్రాయణ - రక్షస్ - రుద్ర -
వరుణ (వారుణ) వాయు - వైశ్వదేవాః (విశ్వదేవ) - విష్ణు -
వైశ్వానర - సూర్య (సౌర్య) - సోమ - సోమపౌష్ణ - సౌర్యవారుణ

హిరణ్యగర్భశబ్దములును మానవసూత్రములం దున్నవి పూర్వమీమాంసాశాస్త్రమగు మానవధర్మసూత్రములకు వ్యాఖ్యాత కుమారిలభట్టు. కుమారిలభట్టునకుముందు శబరస్వామి జైమినికృతపూర్వమీమాంససూత్రములకు భాష్య మొనర్చెను పూర్వమీమాంసాసూత్రములకు భాష్యముచేసినవారిలో మాధవాచార్యుఁడు కడపటివాఁడు 'లోకవ్యవహార పూర్వకాశ్చకేచిద్వృత్త్యాగాది వ్యవహారాః సుఖార్థహేతుత్వేనాశ్రితాః'' అనుటచేత శ్రౌతస్మార్తకర్మవిధానములు కొన్ని నానాజనాభిరుచి ననుసరించి కల్పింపఁబడుట నిక్కమని కుమారిలభట్టు వ్రాసెను నాలోనూఱు నేనులున్నా నను సంగతి ప్రతిజనుఁడు తెలిసికొనునప్పుడు నన్ను గూర్చి నేను విచారించుకొని తెలిసికొన నెంచుకొనుట నన్ను మెచ్చుకొనుట దూషించుకొనుట నాపాపపుణ్యములు నా గుణదోషములు నా మంచిచెడ్డలు నా హేయాదేయములు నేను బరికించుచుంట నా మొగము నేఁ జూచుకొనుట నాలో నే నానందించుటయు నొచ్చుకొనుటయు నోహో నే నున్న నేనులో నొకప్పుడు జగమంతయును నేనే యింకొకప్పుడు నేను నేను కాను మఱొకప్పుడు నేను లేను నిక్కము నిట్టులాత్మతత్త్వము నెఱిఁగి "ఇదమిత్థమ్'' అని నిర్ణయించి యేదో యొక పద్ధతి నడుపశక్యము కానపుడు శిష్టాచారముచొప్పున నడువఁబూనుకొని ప్రకృతోపయోగకరమగు వర్తమానోచితముఖ్యకర్మాత్మకోభయలోకసంతారక పరోపకారకవర్తనము న్మానుకొని ప్రస్తుతమునకుఁ బనికిరానిపూర్వాచారముల నవలంబించి లోకోపద్రవకరములు ప్రాణిహింసకములు నగు పశుబలి హేతువులగు క్రతువులఁ దలపెట్టి జైమిన్యాదిమునుల మత మని నిర్దిష్టసంజ్ఞారూపకశ్రౌతస్మార్తకల్ప గ్రంథములకుఁ దెలిసీ తెలియని ప్రాకృతులొనర్చిన వ్యాఖ్యానముల కపార్థము లొనరించి శ్రోత్రియమ్మన్యులునకల ప్రాణిసంతృప్తిగావింపక వ్యర్థముగా ద్రవ్యము

నగ్గిలోను బుగ్గిలోను నీటిలోను గల్పుచున్నా రనువివేకుల న్యాయమందు లని నిందించుటొక దుర్విధికదా ?

స్వప్న సుషుప్తిదశలయందలి పనులు జాగ్రద్దశ కెట్లు కొఱగావో యట్లే భూతభవిష్యదాచారములు వర్తమానమున నాచరణీయములు కానేరవు. తన బాల్య యౌవన వార్ధక దశలలోని కృత్యము లొకదానికొకటి విరుద్ధములగుట సర్వజనానుభవసిద్ధమే కదా ? "వేదాదృతేఽపి కుర్వన్తి కల్పైః కర్మాణియాజ్ఞికాః నతు కల్పైర్వినా కేచిన్మంత్ర బ్రాహ్మణమాత్రకాత్" అని కుమారిలభట్టు నిర్దేశించినట్లు శ్రౌతస్మార్తకర్మము లన్నియు నిదివఱకు "గతానుగతికో లోకో నలోకః పారమార్థికః" అన్నట్లు వివేకహీనులైన క్రూరమానవు లవంతశ్రుతవచనమూలములగు ననంతసంఖ్యాక వేద శాఖల స్సమన్వయ మొనర్చి "అహింసా పరమోధర్మః" అను నిత్యశ్రేష్ఠధర్మము ననుసరింపక తాముచెడి యొరులను జెఱచుచుంట దుర్దైవముపాటిల్లియాభిచారికహింసాకృత్యములు జరుగనికాలమే కదా సకలజనశ్లాఘనీయమగు కృతయుగ మనిపించుకొనుచున్నది ప్రాణిహింస నడ్డఁజాలనుగాని ఓకూళ యాజకమ్మన్యుఁడా ప్రాణిహింస నేవేదమైనఁ బ్రతిపాదించలేదు నీవు నీక్రూరస్వభావముచేతను నీమాంసాశనవ్యసనాతిశయదోషముచేతను మఱి నీజాత్యభిమానము చేతను నీపండితమ్మన్యతచేతను నీస్వార్థపరతచేతను నీదురహంకార మమకారములచేతను తనదికానిచో గోదావరివఱకును దేఁకుమన్నట్లు నీవు నీయాలు నీపిల్లలునీబంధువులు నీమిత్రులు సుఖించుటకై స్వర్గము లభించునని మిషపెట్టి కేవల కుక్షింభరుడవై సాధుల నోర్మసపుచ్చి క్రతుతాటకములాడి పశువులం జంపి తిని క్రొవ్వుచున్నావా?

## మానవధర్మము

ఏదీ "పశుమాలభేత" అను వాక్యమునందలి పశుమ్-ఆలభేత యనుపదములం కర్థమేమో నీవే ప్రమాణముచేఁ దెలిసికొంటివి ? నీయంతట నీవు తెలిసికొంటివేని నీయాజనమున నీవు కూర్చుంటివపుట నీకు సందర్భముగాఁ దోఁచునా ? లోకులు చెప్పినారుగనుక నా రెండుపదముల కర్థ మెఱిఁగితి ననెదవా ? నీ కాపదార్థతత్త్వ మెఱిఁగించినలోకులు గతానుగతికులుగాని పారమార్థికులు కారను లోకుల మాట పాటింపవేల ? నీప్రాణము నీకు బెల్లమా ? ఇల్లుకట్టుకొన్నట్టుల మూర్తమగు స్వర్గమును నీతక్కిరిబిక్కిరిపిచ్చిశ్రౌతకల్పముచే రచించుకొందువా ? చాలుచాలు నీగతజలసేతుబంధనప్రయత్నము నీతిలకాష్ఠమహిషబంధనగ్రంథపాండిత్య దంభము పూర్వులయాచారము పూర్వులకుమాత్రమే తగును నవీనుల కెట్లుపచరించునురా దుర్మతీ! మునులమతము మునుల కెఱుకగాని నీకెట్లు తెలియఁగురా జ్ఞానలవదుర్విదగ్ధా! నీసుఖము నీవుకోరిన ట్లితరప్రాణులు తమతమసుఖము లభిలషించుట సహజధర్మమని తెలియని నిన్నుంచుటగాని నిన్గూర్చి యరణ్యరోదన మిట్లు నాచే చేయించుటగాని నిక్కముగ దైవముపొరపాటు "బ్రహ్మణే బ్రాహ్మణమాలభతే" అను శ్రుతి కెట్లర్థముచేసెదవో? "ఆలభేత" అనుక్రియకొకప్పుడు చంపుటయు మఱొకప్పుడు స్పృశించుటమాత్రమే యని యర్థము చెప్పుచు నీవాడైనచో ముట్టుకొనెదవుగాని యితరజంతువైనయెడ జంపెదవా ? "ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి" అనుచందమున నోకామ్యకర్మాచరణమోహాంధుఁడా! నీకుఁ జూడు శబ్దార్థమెఱుంగుట చూడు మోజైమినిమ్మన్యుఁడా! శబ్దబ్రహ్మతత్త్వమెఱుఁగఁ బ్రాకృతజనుల శక్యమా ? "పశుః" అను పకార శకారోకార విసర్గములకుఁ బ్రత్యేకము "ప్-అ, శ్-ఉః"

అనెడు వ్రాతకుఁగాని లేక ధ్వనికిఁగాని కర్ణాకర్ణిగాను మఱియు దృష్టిదృష్టిగా నీవెఱుంగుట తప్ప మఱేయాధారము నీ కున్నది ? ప్రత్యక్షానుమానోపమానశబ్దప్రమాణములు నాల్గును నిక్కముగా నన్యోన్యాంతర్వ్యాప్తములు మఱియుం బరస్పరకారణములని తెలియ నీన్యాయ మొకమూలనుంచువారు చెప్పినారు-వీరు చెప్పినారు గనుక నీశబ్దమున కిది యర్థమనుచున్నావుగాని నీవు స్వయముగా "పశుమాలభేత" అను శ్రుతి కర్థముచేసికొనఁగల్గితివా ? పూర్వులు చెప్పినయర్థము నీవు చెప్పనేల ? పూర్వులువేఱు నీవు వేఱు నిన్న నేఁడగునా ? యీపూర్వాచారపరాయణమ్మన్యుఁడా ! పూర్వుల సంగతి నీ కేమిటికి ? నీజీవితమందలియనుభవమెంచుకొను మప్రస్తుతాధికప్రసంగము నీకేల ? నిన్నటి నీసంగతికొక్క యథార్థస్థితి నీకే కూలంకషముగాఁ దెలియనశక్యమని నీవొప్పుకొనకతీఱదుగదా? నీపూర్వులు పూర్వాచారములు నీవేదములునీశిష్టాచారసంప్రదాయములు నీకుఁ దెలియునని దంభుఁడవై చాటుకొను నోకూళ్ఛాందసుఁడా ! చాలుచాలు నిఁకనైన నహింసాకృత్యములను భస్మహోమములను మాని సకలభూతదయతోఁ బరోపకారమొనర్చి పరుల సుఖపెట్టి నీవు సుఖించుము- వేదములశాఖలును సంహితలును బ్రాహ్మణములు నశించిపోయెనుగాని యాధునికముగాఁ దమతమ మతములకుఁ బనికివచ్చినచరణములను శాఖలును బ్రాహ్మణములను సూత్రము కొందఱాచార్యులుసంగ్రహించుకొన్నారు చరణవ్యూహమను గ్రంథమునందు ఋగ్వేదమున శాకల-బాష్కల ఆశ్వలాయన-సాంఖ్యాయన-మాండూకాయనము లను నైదుచరణములును యజుర్వేదమున చరకములు మొద లెనుబదిశాఖలు పేర్కొనబడినవి కాని వానిసగముసంఖ్యయైన గ్రంథమునఁ గానరాకుండెను సామవేదమునకు వేయిశాఖలు కలవు కాని వానిలో రాణాయనీయ సాత్యముగ్ర-

కాలాప-మహాకాలాప-లాంగలాయన-శార్దూల- కౌథుమశాఖ లేదు మాత్రమె పేర్కొనఁబడెను మఱియును కౌథుమశాఖ లేదు భేదములు ఇవి అథర్వవేదమున పైప్పల- దాంత- ప్రదాంత స్నాత-బ్రహ్మదావల- శౌనకీ- వేదదర్శతీనామముల నేడు మాత్రమె లెక్కింపఁబడెను. మఱియును పైప్పలాద- శౌనక- దామోద- తోత్తాయన- జయాల- బ్రహ్మపలాశ- కౌనఖి- దేవదర్శిని- చారణవిద్య లను తొమ్మిది పేర్కొనబడెను ఈ వేదశాఖలన్నింటిలో ఆశ్వలాయన- హిరణ్యకేశి- భారద్వాజ- ఆపస్తంబ- బౌధాయన పారాశర్యాది శాఖలు సూత్రరూపములు కావున నవీనములనక తీఱదు-ప్రాచీనులు కొందఱు తమపేర్లు శాశ్వతముగా నిల్పుకొనుటకై కొన్నిశాఖలం బన్ని యనాదిగ్రంథములందు దోఁప రనవచ్చును గణింపనశక్యమగు పురాతనకాలమునందు మంత్రబ్రాహ్మణములును బిమ్మట నాఱు వేదాంగములును కలిసి సకలాష్టవిద్యలు పౌరుషేయములు కృత్రిమములుగాని పంచభూతప్రకృతులవలె సహజసిద్ధము లెంత మాత్రము గావు మనుష్యకల్పితము లీయష్టాదశవిద్యలు కావున వీనిలోఁ బ్రకృతమున సకలభూతదయాపరములును సకలప్రాణ్యుపకారములు నగువిద్యలనుమాత్రమే యనుసరించి తత్తద్దేశజనులన్యోన్యసుఖంకరముగా బ్రతుకుట మిక్కిలి శ్రేష్ఠమానవధర్మము కాశికయందును సిద్ధాంతకౌముదియందు మాత్రమే కొన్ని వార్తికములున్నవి కాని భాష్యముఁగానరాకుండుటచే నావార్తికములు మిక్కిలి యాధునికకల్పితములైనట్లు । శ్రౌతస్మార్తకర్మములు స్వార్థపరాధునిక మనుష్యకల్పితములు-సందియ మొకింతయును లేదు- ఏకాలమునకుఁదగున ట్లాకాలమున నుభయతారకములుగా జీవనోపాయ కర్మములు బుద్ధిమంతులు కల్పించిరిగాని వానకురిసినట్లు రేఁబవళ్లు తోఁచిన ట్లీవిద్యాస్థానగ్రంథములు కల్పితములుగాని సహజసిద్ధము

లెంతమాత్రమును గావు. అనాదికాలమునుండియు నొకదానితో నొకటి కలిసి యుత్తమై సముద్రరూపముగా నిల్చినయుదకబిందువుల వలె నగణిత ప్రాచీనకాలమునుండియుం దత్తద్దేశమానవులయూహలు వివిధభావల నొక్కత్రముగా సంగ్రహింపఁబడి గ్రంథరూపముగా వెలయుచున్నవి కావుననే వ్యావహారికదశయందుమాత్రమే వేదము లున్నవికాని నిక్కముగఁ బారమార్థికదశలో వేదములు లేవని శంకరాచార్యాది భాష్యకర్తలు సిద్ధాంతీకరించిరి పరమార్థము వాఙ్మనసగోచరము పాంచభౌతికమాయోపాధివిశిష్టులగు జీవులచేఁ బారమార్థికసత్య మెఱుఁగఁబడ రాదు. మఱియును దెలుపఁబడ శక్యముకాదు. వ్యవహారదశయందు శాఖాచంద్రన్యాయముగా నవ్యక్తమగు సత్యపదార్థసిద్ధికై స్థూలరూపముగా నష్టాదశవిద్యా విశేషములచే లోకోపకారపరాయణులు పరమకారుణికులు నతీంద్రియ దర్శనప్రతిభాలంకృతులు సహజపాండిత్యవిశారదులగు మునులు పామరులకుఁ బరమార్థప్రాప్తిమార్గము నగపర్చిరి కోవెలలందలి పాంచభౌతికవిగ్రహములు దేవతలకుమాఱుగా నెట్లు భావింపఁబడుచు నుపాసనాసౌలభ్యమున కెట్లు సాధనములగుచున్నవో యట్లే యీ శ్రుతిస్మృత్యాదివిద్యాస్థానములన్నియు నపౌరుషములనియు దివ్యము లనియుం భావింపఁబడి పరమార్థప్రాప్తిసోపానము లగుచున్నవి నడుమ అక్కమ్మపతి యెప్పుడన్నట్లు నీబోధలు నీవ్రాఁతలే ? జగమునఁ గాలానుసారముగా జరుగుపనులను నీయిష్టానుసారముగా మార్చుట నీ తరమా? కొన్ని జంతువులు కేవలమాంసాహారముచేతను గొన్ని కేవలశాకాహారముచేతను మఱికొన్ని యుభయాహారములచేతను దత్తత్సముచితదైవనిర్ణీతములై బ్రతుకుచున్నవి. యెవరిజ్ఞానము వారిది మఱి యెవరియిష్టము వారిది. శిష్టాచారసంప్రదాయులు కొందఱు. కొందఱు యథేష్టసంచారులు. మొత్తముపై నూఁగిలీసి కొనుమెలఁకువ బ్రతుకుచున్నవారికెల్ల సహజసిద్ధమైన సర్వప్రాణులకు

వారివారికిఁగావలసినసుఖములనందు ప్రయత్నమునుమఱివారిదుఃఖకర కార్యములఁదప్పించుకొను నుపాయమును వెదకుకొనక మానరు తమతమకోరినసుఖముల నందుటకై ప్రయత్నించుట యెల్ల జీవులకు సహజముగాని తాము కష్టపడియైన లోకోపకారముచేయుయత్నించుట స్వభావముకాదు తనదేహమును దాఁ గన్నపిల్లల యెడ ల్లను సహవాసబలమున మచ్చికపడి తనకూరిమి కాలవాలమగు ప్రాణులశరీరములను దనకు శరీరస్మృతియున్నంతవఱకుఁ గాపాడుచుంటకూడ దేహధారులకు సహజధర్మము- "అహమన్న మహమన్నాదః" అను శ్రుతిచొప్పునఁ బాంచభౌతికోపాధి యన్నస్వరూపము కావుననే యన్నము భక్ష్యమగుచున్నది సమానధర్మములగు పదార్థములు పరస్పరముఁ గలియుచున్నవి- నీటిలో నీరు- నిప్పులో నిప్పు- గాలిలో గాలి - మట్టిలో మటి - యాకసమం దాకసము మఱి పాంచభౌతికపదార్థము పాంచభౌతికపదార్థమందును గలియఁ దగినరీతి నగలియుట సహజప్రకృతిలక్షణము వ్యక్తావ్యక్తస్థితులంబట్టి పాలు నీరు కలిసిన విధముగా జడచైతన్యము లరెండు నగలిసియే యున్నవి- పాంచభౌతికోపాధియును జైతన్యము నొండొంటికి వేఱై యుండనేరవు కాబట్టిజీవులుయథేష్టాహారనిద్రావిహారభోగము లందత్తత్కాలస్వభావచోదితులై యనుభవించుచున్నారో ప్రాజ్ఞమ్మన్యులారా నీతత్త్వోపదేశములు నీనీతులు నీజ్ఞానబోధలు నీవ్రాఁతలు నీగోడవ లెదుకనదరా? పశుఘాతుకులగు నో శ్రోత్రియమ్మన్యులారా? మీరు వనొప్పించలేనట్లు మిమ్ము నే నొప్పించఁజాలనుగాని మీరు వ్యర్థముగాఁ బ్రాణిహింసకావించుచు మీకంటెనితరులు నాస్తికులనియు నబ్రాహ్మణులనియును మ్లేచ్ఛులనియును గర్మబాహ్యులనియు నరకగాములనియును బరమపాతకులనియును మీరే యార్యావర్తవాసులనియు నితర దేశవాసులందఱు ననార్యులనియునుమీరు చంపితినుపశు

పులు మాత్రమే స్వర్గ మేగుననియునో బుద్ధిజాడ్యజనితోన్మాదములారా! మీకుగాకతక్కినమనుష్యులందఱు నబ్రాహ్మణులు నీతిబాహ్యులు బహిష్కృతు లపాత్రులు నస్పృశ్యులనియును మీరునిరసించుటకు మీకెంత స్వాతంత్ర్యమో-లోకద్రోహులు ప్రాణిహింసకులు పశుమారకులు సంగీతసాహిత్యకురాకములు కఠోరహృదయులు పరమమూర్ఖులగు మీకు మీఁదిస్థితి బోధించినట్లు గ్రంథమొనర్చుట మాదృశమహాకవిపండితులకు సహజస్వాతంత్ర్య మేలకాదో? ఏమియునైనఁ బశుహింసచేయు శ్రోత్రియమ్మన్యు లెట్లు తమ యాచరణము వేదశాస్త్రసమ్మతమన్నిశిష్టాచారసంప్రదాయసిద్ధ మని సాధించుచున్నారో యట్లే సర్వప్రాణ్యుపకారముగా సకలభూతదయాపరముగా నెట్టినియమముచే నైన నేజంతువును జంపరా దని "నహింస్యా త్సర్వభూతాని" యను శ్రుతినిమత్సంప్రదాయానుసారుల కిట్టిగ్రంథములు వెల్లడింపరాదో? అష్టాదశవిద్య లెంతమాత్రమును బశుహింసం బ్రతిపాదింపలేదు సకలవిద్యలును లోకోపకారకమగు నడువడితోఁ దనతోడిపాటిజీవులను సుఖపెట్టి తా సుఖింపవలయుననియే మర్త్యులకు నిశ్చయముగా బోధించుచున్నవి నీ వితరులదయఁకుపాత్రుఁడవైనఁగాని నీకోరినసుఖము నీకు రాదు

## మతసమీకరణము

ఓరీ దంభుఁడా! పట్టెడునామములు పైకిఁ బెట్టుచున్నావు గాని శివుఁ డెఱుఁగని గొందులా, యందఱును శ్రీవైష్ణవులయినచో గింపెడుహరిగె లెట్లు మాయమయ్యె నన్నట్లు నీసుఖముకొఱకుఁగదా నీరంభానంభోగముగూర్చికదా నీయాలుబిడ్డలసేమముకై కదా నానా జంతువులను దేవతాసమర్పణమిషను జంపి తినుచున్నావు మఱియు నీవలెఁ గ్రూరకర్ములు కొప్ప కేమియునైనఁ బశుహింసచేయక

కేవలజంతురక్షణమునకై మాత్రమే సాత్త్వికాన్న పానములనువినియో
గించు భూతదయాపరులం బాపండులు కర్మబాహ్యులని మోస
కాండవు స్వార్థపరుడవై ఏల నిందించెదవు? స్వార్థపరులుగాక కేవల
లోకోపకారపరులైన పూర్వులసాటి యోకుక్షింభరుండా యిపుడు
నీకెందుకు? పూర్వము క్రతువులెట్లు జరిగెనో యాక్రతువులందలి
పశువు లెట్లుండెనో నీకెఱుకా? తిరుపతిగుడిలోనిబొమ్మ శ్రీ వేంకటేశుం
డగునా? నారాయణుండను పేరు వహించినమర్త్యుండు నారాయణుం
డగునా? క్రతువులం బశుహింసచేయుక్రూరు లురిదీయంబడుదురని
ప్రభుశాసనమైనచో నీక్రతువు లేమగునో? నీశిష్టాచారసంప్రదా
యానుసరణవ్రత మేగంగలోం గలియునో నీవెఱుంగవా? ఒకశబ్ద
మున కొక యర్థమునువిధించు టెక్కడిది? ప్రసంగవశమునం బ్రతి
శబ్దమున కర్థము మాఱుచున్నది "యదాయాకయాచవిధయా
బహ్వన్నం ప్రాప్నుయాత్" అ నీబ్రతుకుసుఖముకొఱకై నీశిష్టా
చారము నవలంద్రోసి రాజ్యపాల శాసనపద్ధతులకులోంబడి పొట్ట
పోషించుకొను చున్న మోహవైదికమ్మన్యుడా? నిత్యధర్మగు
నహింసావ్రత మవలంబించి నీతోడిపాటిప్రాణులబ్రతుకు పొడిగించు
నీబ్రతుకు వృద్ధిచేసికొనుము 'అహింసా పరమోధర్మః" అని
మాత్రమే వేదశాస్త్రములన్నియున్తాత్పర్య"పడుచున్నవి మఱియును
మునులందఱునుసర్వలోకోపకారకమగు నహింసావ్రతమునుమాత్రమే
బోధించిరి 'మూఢః పరప్రత్యయనేయబుద్ధిః' అన్నట్లునీవుమూఢుడ
వో కూళసోమాసీ! నీపూర్వులక్రతువిధాన మెట్లు జరిగెనో నీవెఱుం
గవు. పశుమారణకర్మమును బోధించి నీచేత శ్రౌతక్రియాదీక్షను
జేయించు నాధునికాధ్వర్యులో "యథాంధైర్నీయమానాయథాంధాః
అనునట్లు. నీవు కేవల స్వార్థపరమూఢుండవుగాని. స్వార్థపరులను
వంచకులను కూళలను బరమమూర్ఖులనియు నెఱుంగవేల? సర్వ

భూతదయాపరులగు మును లెంతమాత్రమును జీవహింసను బోధించ లేదు

“పశుమాలభేత” అనుచోఁ గళ్ళమైనఁ బట్టుకొనుట-పామైన విడిచిపెట్టుటవలెనే-బలిద్రవ్యము గను సి పాదిసత్వములను యజ్ఞశాల యందు బొయలుగా నుంచి సాధుజంతువులగు మేఁకలం జంపు నీక్రూరశ్రౌతకల్పనాచాతురి గట్టిపెట్టుము యుగానుసారముగా సకలధర్మములను సకలశ్రౌతస్మార్తగ్రంథములను మారుచున్నట్లు ప్రమాణమున్నదిగాని నీయొక్క దిక్కుమాలిన క్రతువిధానము న నపార్థముగఁ గ్రూరాధ్వర్యులచేఁ దప్ప నహింసావ్రతధర్మము మఱెందైన నెన్నండైన మాఱినట్లు ప్రమాణ మగపడ్డఁగలవా? ఎందు కీడొంక తిరుగుడు? మునుల యంతటియొక్క ముఖ్యతాత్పర్య మన్ని విద్యల యందును- సర్వజగదుపకారకమగు దయను వహించి తనతోడి ప్రాణుల నుఖముగ బ్రతుకనిచ్చి మనుష్యుఁడైనవాఁడు తాసుఖముగ బ్రతుకవలెననియే- పశుశబ్దమున కర్థము మనవ్యాపారము- ఆలభేత యనుశబ్దమునకు భూతదయాపరము కావించుట యని తాత్పర్యము- మొత్తముపై “పశుమాలభేత” యను శ్రుతి కితరజీవులు నీయెడల నెట్లు వర్తింపఁగోరుదువో నితరజీవులయెడ నీ వట్లు ప్రవర్తించుమని యష్టాదశవిద్యలయొక్క ముఖ్యఫలితార్థము- శిష్టాచారమనియు నగులధర్మమనియు విధిచోదితమనియు నోక్రూరుఁడా! యేమియైనన జంతువులం జంపించుటయును జంపుటయు నీస్వభావమైనచో నీ కిది తగదని చెప్పుచు లోకములో జరుగుచున్న జంతుహింసకై యిట్లే ప్రతిక్షణ మసీదుఃఖబాష్పరచనావిచిత్రప్రబంధగ్రంథరచనవ్యసనినౌట నాస్వభావము

“బ్రాహ్మణేన షడంగ వేదో౽ధ్యేతవ్యః” అని శ్రుతిని నిరాకరించి జ్యోతిశ్శాస్త్రకారులగు మునులలో యవనునిఁగూడఁ జేర్చి యవా

యవనుఁ డొనర్చిన పారసీకభాష నెట్లు బ్రాహ్మణులుచదివికొని తాజిక
శాస్త్రమును వేదాంగముగా గ్రహించిరో! "బాలాదపి సుభాషితమ్"
అనునట్లాస్తికుఁడనో నాస్తికుఁడనో జీవహింసచేయువాఁడో మొఱటు
కూళమానిసులారా! మీతోడి ప్రాణిజంతువుల సుఖపెట్టి మీరు సుఖ
పడుఁడు శాకాహారముకన్నా తమే జీవించుఁడు మాంసాశనము
మానకొనుడు యంత్రములచే మీకార్యముల నెఱవేర్చుకొనుఁడు
మీకార్యములకై జంతువుల బాధించకుఁడు మీజాతినీత్యభిమాన
ములన్నియుం గట్టిపెట్టి యోమనుష్యులారా! మీలో మీరు పొత్తు
గొని హాయిగా నన్యోన్యసాహాయ్యమున మనుండు డనియే యష్టా
దశవిద్యారహస్యతాత్పర్యసిద్ధాంతము

## జగన్నిర్ణయము

అనాదికాలము నుండియును వివిధదేశములందలి బుద్ధిమంతులు
ప్రత్యక్షాదిప్రమాణములచేతఁ దమతమయూహలంబట్టి జగత్సృష్టిస్థితి
లయకారణములఁగూర్చి చేసినసిద్ధాంతవాక్యములన్నియును సందర్భా
నుసారముగఁ దత్తద్దేశభాషలందును మఱియు సకలజనసామాన్య
వేద్యములుగాఁ గల్పించిన సంస్కృతాదిగ్రాంథికభాషల న్వెల్లడింపఁ
బడుచు ననాదిసంప్రదాయసిద్ధములై పరంపరాక్రమముగాఁ బ్రచు
రింపఁబడుచు బ్రాఁతలమూలమునఁ గొన్నియుం గేవలశ్రవణమాత్ర
ములై కొన్నియుం గేవల చక్షుర్గోచరములై కొన్నియు న్మఱియు
నామరూపోభయాత్మకములై కొన్నియుం బ్రచురింపఁబడుచుఁ గొన్ని
వ్యవహారము ల్మఱి కొన్ని పరమార్థమునుబోధించుచుఁ దత్తద్దేశ
ములం దత్తద్భాష ల నష్టాదశవిద్యలయి వెలయుచున్నవి

ఐహలౌకికపదార్థములం బోధించువిద్యలలోని గుణదోషము
లనుభవముచే నెఱుంగవచ్చును కాని పరలోకముంగూర్చిన గ్రంథ

ములమందలి గుణదోషములు కేవ విశ్వాసమూలములు- వారివారి
యభిరుచులం బురస్కరించుకొని దేవతాప్రతిపాదకములగు ఋగ్వేదు
స్సామాధర్వాత్మక వేదచోదితకర్మములు దేవతాప్రార్థనము దేవతా
పూజయును దైవసంకీర్తనమును మఱియాభిచారికకర్మములుం గామ్య
నిత్యనైమిత్తికరూపముల నానాదేశములం బరగుచున్నవి-ఇంద్రియ
గ్రాహ్యములగు సకలజగత్కార్యముల కతీంద్రియకారణస్వరూపు
లగు దేవాసురులంగల్పించుకొని సుఖదాయకులగు దేవతలయనుగ్రహ
కరములగు ప్రార్థనాదికర్మములను దుఃఖదాయకులగు రాక్షసులం
బాఱఁదఱుముటకై కొన్ని మంత్రతంత్రవిధానముల న్జరిగించుటయును
బాల్యము గడచి వయసుమించినకొలంది మనుష్యులకు మీసములు
మొదలగు కొత్తయవయవవిశేషములవలెఁ బొడచూపుట సహజ
గుణము- మనుష్యులు పెండ్లి హాస్యము- సిగ్గు- వ్రాత- యలంకార
ధారణము- వంట మొదలగు నాహారనిద్రావిహారోపయోగకరక్రియ
లకు మించిన కొన్ని పనులందుఁ దక్కినజంతువులకన్నఁ బెచ్చుగఁ
జేయు స్వభావముకలవారు లోకమునందు సకలజంతుసామాన్య
ములు నశన శయన విహరణ జరారుజా మరణక్రియలకు మించి
పెచ్చు మనుష్యులం దగపడు హాస్య లజ్జా లేఖన వసనాలంకరణ
యజన పచనాది క్రియ లన్నియును వారలకు సహజముగా సుఖా
భాసములు దుఃఖప్రాయము లయి సహవాసబలమున నబ్బిన యంటు
తెవుళ్లు, సకలభూతదయయును సర్వలోకోపకారపరాయణతయునుఁ
గల మనుష్యులు మాత్రమే నిరోగు లనదగును ప్రత్యక్షముగా
నున్న వర్తమానవస్తుతత్త్వ నిర్ధారణ మొనర్చుటయే సంపూర్ణముగా
శక్యముకానపుడు భూతభవిష్యజ్జగత్కార్యయథార్థస్థితి న్గడించుట
మిక్కిలి శంకాస్పదము సృష్టి యెట్లు జరగుచున్నదో సృష్టికి లోఁబ
డినవారు నిర్ణయింపఁ దరముకాకుంట యొకబ్బురముకాదు కానిసృష్టి
కధ్యక్షుఁడగు పరమాత్మునకే మీజగత్సృష్టి యెట్లగుచున్నదో

యాసంగతి యాదేవునకైనఁ దెలియునో లేదో యని "సోఽంగ వేదయదివాన వేద" అని శ్రుతి వల్కుచున్నది. కావున నానా వర్ణాగుణ వేషభాషాచారములతో నున్న నానావిధజంగమస్థావర ప్రాణుల యుత్పత్తిస్థితిలయములకునిత్యకారణమైన నానావిధసంఖ్యాక దేవతలన్భావించి తమతమసుఖజీవనాభివృద్ధికై కొల్చుచుంట మనుష్య స్వభావము

ఆర్యులు ననార్యులు నానాదేశములందు మొట్టమొదట స్త్రీపురుషద్వంద్వము లనంతసంఖ్యాకులై పిల్లలనుగాంచి యిట్లు మానవులను సృజించువా రెట్లున్నారో. వలయరేఖాది మధ్యాంత ములు లేని యీజగమునకు సృష్టిస్థితిలయకాలమును గణింపశక్యము కాదు. ఆదిదంపతుల నిర్ణయింప వీలులేదు. తలిదండ్రులు లేక పిల్లలు పుట్టుట యసంభవము. పాంచభౌతికవికారములకుఁ బాంచ భౌతికసంయోగవియోగములే కారణములు. వేయేల యీజగము నకు మొదలు మొదళ్ళు లేనేలేవు. మొదట నెట్లనో యీప్రపంచము మఱి దీని తుదిమాటయూ పెద్దియో. నానావిధపరమాణువుల సంయోగవియోగముల కాధారమగు నాకాశ మొకటి యుండక తీఱదుగా? ఆయాకాశమునందే యీ జగత్సృష్టి లయము లగు చున్నవి మఱియును శరీరస్మృతియున్నంతవరకుగదా యీజగ త్కార్యచింత కలుగుచున్నది. విస్మృతిరూపమగు సుషుప్తి యెట్టిదో యట్టిదే యాకాశ స్థితి యని స్వప్నజాగ్రత్సుషుప్తుల స్థితిఁ గనిపెట్టిన మనుష్యులందఱికి ననుభవసిద్ధమేకదా? కాఁబట్టి సర్వేంద్రియము లుపశమించి యున్నప్పటిసుషుప్తి యందఱియనుభవమందొక్కరూపే యైనట్లు లాకాశ మొక్కవిధముగానే నిత్యమై యున్నది. నిర్వికార మగు సుషుప్తివలెనే నిరాకారమగు నిర్గుణమగు నాత్మ యీభౌతి కాకాశమునకు మఱి యీస్వప్నజాగ్రత్సుషుప్తుల గనిపెట్టు తెల్వి

మూలాధారమై నిత్యమై యుండదగినది. మఱి యాయాత్మయే యాకాశమునకును మఱి తక్కిన భౌతికవికారముల యుద్భవస్థితినాశములకు స్థూలకారణమై విస్మృతిస్మృతిరూపములతో సకలదేహధారుల యనుభవమునం బ్రత్యక్షమయి యున్నది ఈ స్మృతివిస్మృతులనే తెల్విచే గనిపెట్టుచున్నామో యాజ్ఞానమే యీసకలజగదుద్భవస్థితి నాశములే జ్ఞానము కనిపెట్టుచున్నదో యట్టిజ్ఞానమే యాత్మ కావుననే "ప్రజ్ఞానం బ్రహ్మ" అను శ్రుతికలిగెను. సరియే యీజగమున కాది మధ్యాంతములు నిర్ణయింపం దరముకాదు మఱియును పంచేంద్రియములు పనిచేయకున్న సుషుప్త్యవస్థకూడ సర్వజనసామాన్యానుభవము

కాంబట్టి విస్మృతిరూపమగు సుషుప్తి ప్రకృతి యనియును స్మృతిరూపంకములగు స్వప్నజాగరములు వికృతులనియును జెప్పక తీఱదు. బీజము ప్రకృతి. వృక్షము వికృతి. ఆత్మ ప్రకృతి. జగము వికృతి విస్మృతి ప్రకృతి. స్మృతి వికృతి. స్మృతి. యెట్లు విస్మృతియగుచున్నదో మఱియు విస్మృతి స్మృతి యెట్లగుచున్నదో స్వప్నజాగరములు సుషుప్తిలో నెట్లుపశమిల్లుచున్నవో మఱియును సుషుప్తిస్థితి నుండి స్వప్నజాగరము లెట్లు పుట్టి పెరుగుచున్నవో చెప్పశక్యము కాని ట్లీజగమున కాదిమధ్యాంతము లున్నవని మాత్రము నిర్ణయింప వచ్చునుగాని మొదలెద్దియో నడుమెద్దియో తుదయెద్దియో జగద్బీజ మెట్లుండునో వృక్షబీజములోక దానికొకటి వస్తుతత్త్వమునకు వేఱు కాన ట్లీజగదాత్మలకు వస్తుభేదము న్నిర్ణయింపరాదు. మూలప్రకృతియగు నాత్మ సుషుప్తదశవలె నవ్యక్తము మఱియు ననిర్దేశ్యమును గాంబట్టి యీజగదుద్భవస్థితులకు నీజాగ్రత్స్వప్నదశలకు న్గారణము న్నిర్ధారింప శక్యముకాదు వస్తుతత్త్వము న్నిరూపింగనెఱేఁగికదా యావస్తువు న్వైద్యు లుపయోగించవలయును తనజననమరణస్థితు లనుభ-

వించినవమ్మటఁగదా తనజననమరణస్థితు లిట్టి వని యెవ్వఁడైన యథార్థముగా వర్ణింపఁగలఁడు "నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్" అన్నట్లు తీఁక రుచియుఁ జొకర లోఁతు నెఱుఁగ రానిచందమున "అవ్యక్తాదీనిభూతాని వ్యక్తమధ్యాని భారత, అవ్యక్తనిధనాన్యేవ కాతత్ర కరివేదనా" అను భగవద్వాక్యముంబట్టి సృష్టికి మొదలుం దుదయును నిర్దేశింప నెవ్వరికిం దరముకాదుగాని స్థూలరూపముగా వ్యక్తమందు వ్యవహారము సాగించుటకై దిగ్దేశ కాలవిభాగ మేర్పర్చితిఅనందున నీసకలభూతసృష్టి స్థితిలయములకుఁ గారణముగాసృష్టిస్థితులకుం బ్రేమమూలముగు భూతదయాస్వరూపులు సర్వజగదుపకారకులగు దేవతలను మఱియును సంహారమునకుఁ గార్యస్వభావముఁగల ప్రాణిహింసకులగు నసురులను వేదములు వర్ణించుచు రాక్షసనిగ్రహమునకును దేవతానుగ్రహమునకు దగిన శ్రౌతస్మార్తకల్పమును విధించుచున్నవి

సృష్టిస్థితులు సత్త్వరజోగుణమూలములు నాశము తమో గుణమూలము కాఁబట్టి లోకోపకారకము యిఁరజస్సత్త్వగుణముఁ నవలంబించి భూతదయాపరులయిన సజ్జనులు శ్రౌతస్మార్తవిధానము లన్నియును సకలజంతుప్రాణసంరక్షణమునకై మాత్రమే వినియో గించుచుఁ బశుహింసాది క్రూరకర్మములను నిషేధించుచున్నారు నీబ్రతుకు సుఖము నీవు కోరుట సహజము కదా? పరుల సుఖము నీవు కనిపెట్టనియెడల బరులు నిన్ను సుఖపెట్టరు కాఁబట్టి యొరులను సుఖపెట్టి నీవు సుఖించుమనియే సకలవేదముల అభిప్రాయము సకల భూతదయాపరుఁడవై ప్రవర్తిల్లుచున్న నీనడతయంతయు వేదచోదిత ధర్మమని యోమీమాంసకుఁడా నీవు తెలిసికొనుము జైమిన్యాది మీమాంసకులు సకలభూతదయాపరులు కావుననే మునులు నాఁ బరగి రోకుక్షింభరుఁడా! అమ్మని శాస్త్రముల విపరీతార్థము

లోనర్చి యామిషాశనుఁడవై నీవ్యసనమునకుఁ దగునట్లు జంతుహింస
వేదచోదిత మని యపార్థ మొనర్చెదు మోకూళిసోమాసీ“ పాపాయ
పరపీడనమ్ పరోపకారార్థమిదం శరీరమ్, అహింసా పరమోధర్మః”
అను పరమధర్మరహస్యము లెఱిఁగి యితర జంతువుల సుఖపెట్టి నీవు
సుఖపడుము. కల్పమునకు నీవు చేసినదే యర్థముగాని నేఁ జెప్పిన
దర్థముకాదా ? స్వార్థపరుండవు కాఁబో నీయర్థమును గ్రహింప
నగును. నీసుఖముకొఱకై యొరుల హింసించి కామ్యకర్మములగు
క్రతువులందు నీచేతికి లొంగిన నీవేఁ జంతువుల న్ముక్కుసెవులుమూసి
చంపుచున్నావు నీకేమి చేటుకాలము ? నీతప్పుకాదు. నిన్నిక్రూర
కర్మములకుం బ్రేరేపించిన కూళదయ్యము నిన్నాడ నూపిరాడనీక
తెగటార్చునప్పుడు నీతప్పు నీకు జ్ఞప్తికిరాఁగమానదుసుమీ ? పరుల
సుఖపెట్టి నీవు సుఖపడుము. పరులఁ జెఱచి నీవు చెడకుము. అష్టాదశ
విద్యలయభిప్రాయము సకలప్రాణిసంరక్షణ మొనర్చుటకన్న రవంతయు
న్వేఱుకాదు

నీకు బుద్ధిలేదో పశుమారణదారుణాజై మినికడియురుఁడా ?
పదార్థతత్త్వజ్ఞానము నీకుసున్న “పశుమాలభేత” అను శ్రుతియందుఁ
పశుశబ్దమునకు దేహధారియని యర్థము ఆలభేత యనుపదమునకుఁ
భేదించుట యర్థము. కాఁబట్టి స్వార్థపరులగు మాంసాశనక్రూర
కర్మలొనర్చిన యపార్థముల ననుసరించక స్వార్థత్యాగులగు సర్వ
భూతదయాపరులగు మహాత్ముల యుపదేశము నంగీకరించుము. నీజాతి
నీనీతి నీవావి నీవర్తనము నీబ్రతుకంతయు నితరప్రాణుల సుఖపెట్టుట
కై వినియోగపడినప్పుడు వేదచోదితకర్మానుసారములని ముమ్మా
టికి నమ్ముకొనుము సచ్చిదానందలక్షణుఁడగు దేవునకుదూరుండవై
క్రూరముగాఁ బ్రాణిహింసచేసి నరకమున నేలకూలెదవు ? ఋషిభి
రతీంద్రియప్రకాశకైః మంత్రైః” అని ఋషిశబ్ద మతీంద్రియప్రకా

మగు మంత్రపర్యాయమని నాయనాచార్యుఁడు చెప్పుటచేత ముమ్మాటికి వేదమంత్రము లింద్రియదృష్టమగు జగము నెంత మాత్రమును జెప్పవు కాఁబట్టి శ్రౌతికల్పములం దైహలౌకికపదార్థము లగు నగ్ని యజ్ఞాయుధములు అధ్వర్యుప్రదర్శకము పశువులు మొదలగుయజ్ఞద్రవ్యములు ఆసక్త్యము నలిగించుటకై మఱియును దమజీవనోపాయముగా వంచకులైన ఛాందసులు శ్రౌతకర్మవిధానములఁ బన్నిరి మఱియును ధూర్తులుస్వార్థపరులై స్మార్తకర్మముల నల్పించిరి కాని వాస్తవముగా వేదము లిహము నూర్చి యెంతమాత్రమును బోధించకుంట యూఢి ఆహారనిద్రావిహారసౌఖ్యము నదనతోడిపాటి జంతువుల కభివృద్ధి కావించుకర్మములు మాత్రమే యవశ్య కర్తవ్యములు

కర్మమనఁగా శరీరావయచాలన మని "ద్రవ్యగుణకర్మ సామాన్యవిశేష సమవాయాభావాః సప్తపదార్థాః" యనునపుడు కర్మమను పదార్థముఁ కవయవవిక్షేపణాకుంచనాది నంచలనార్థము చెప్పఁబడెను శ్రౌతస్మార్తకర్మములు చెప్పఁబడలేదు సకలజగ దుపకారక కర్మమే యవశ్యకర్తవ్యముగాని ప్రాణిహింసాకరమగు క్రూరకర్మము ధూర్తులు స్వార్థపరులు నయినశ్రోత్రియమ్మన్యులు చేసిన కుట్ర కన్నికలు- కాఁబట్టి ప్రాణిహింసాకరములు బూటక నాటకములు హోమములు వృథాప్రయుక్తములగు శ్రౌతస్మార్త కర్మములు వంచకల్పితములని ముమ్మాటికి నిర్ణయించి సర్వజను లకు నిద్రాహారవిహారసౌఖ్యకరమ లగు కర్మములు మాత్రమేయవశ్య కర్తవ్యములని తెలిసికొనవలయును

## జనతాకృతి

అ ఇ ఉ ణ్ మొదలగు పదునాల్గువ్యాకరణసూత్రముల నాడు లనియును మహేశ్వరుడో లేక వేదపురుషుఁడో యాపదు

నాల్గుసూత్రములకు గర్త యనియును దక్షిణ వ్యాకరణసూత్రము లను పాణిని యను నొక పండితుఁ డొనర్చె నని నాగోజీభట్లు వక్కాణించెను అఇఉణ్ మొదలగు సనాదివ్యాకరణ సూత్రము లెట్టివో యనాద్యవ్యక్తధ్వనిని వర్ణాత్మకము గావించి ఋగ్యజుస్సామాథర్వ రూపములుగా నింద్రుఁ డొనర్చిన మంత్రబ్రాహ్మణాత్మకవేదమట్టిదే మహేశ్వరసూత్రముల ననుసరించి పాణిని చేసినవ్యాకరణసూత్రముల వలె వేదములంబట్టి శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషకల్పనిరుక్తము లను నానాపండితులు రచించిరి స్వరములు వ్యంజనములు పదములు వాక్యములుం బదార్థములుం గల్పితవికారములుగాని వాస్తవములుకావు మఱియు నష్టాదశవిద్యలయొక్క ముఖ్యప్రయోజనము మనుష్యుల కహంకారమమకారము లుడిగించి స్వార్థపరత మాన్పించి తమతోడి పాటిప్రాణుల న్సుఖపెట్టి తన్మూలమున సుఖపడి నిత్యసంతోషులై తమజీవనము గడుపుకొనున ట్లొనర్చుట- జగమునందలి దేహధారు లలో నొకొక్కని కొకొక్క యూహ కావున నొండొరుల శక్తిభేద మున న్నామరూపములం బ్రతిక్షణము మాఱుచుందురు నామరూప ములు వ్యావహారికములు, అనిత్యములు మఱి యౌపాధికము లాగంతుకములు నవశములు నగు పాంచభౌతిక గుణవికారములగు నామరూపములకు నిక్కముగా నొకవ్యవస్థ యెద్దియును లేదుగాని లోకోపకారములగు శబ్దాదిగుణములు మాత్రమే సర్వజనాదరణీ యములు-తమవర్తమానస్థితి లోకోపకారముగా గావించుకొనిజనులు నిత్యసంతోషమున బ్రతుకుట యవశ్యకర్తవ్యము - కాని-భూత భవి ష్యజ్జన్మములఁగూర్చిగాని మీఁద మేహాద్యాకాశపంచాణ్డములఁ గూర్చి గాని యతీంద్రియస్వర్గనరకాదికల్పనలంగూర్చిగాని యసాధ్య యోగ ప్రాప్తిఁగూర్చిగాని యశరీవాణిశ్రవణాసక్తి చేతఁగాని యసంభవ బ్రహ్మ సాక్షాత్కారజిజ్ఞాసచేఁగాని లోకోపకారకప్రవర్తనము మానుకొని

వ్యర్థముగా ఖరలోమసంఖ్యాగణనము మాడ్కి కాలక్షేపము చేయు
వార లిహపరదూరులై యుభయభ్రష్టులై యొరు ను సుఖపెట్ట నేరక
తాము సుఖపడఁజాలక రిత్తగా నజాగళ స్తనములవలెఁ గాలక్షేపము
చేయుచుందురు

"పరోపకారాయ సతాంవిభూతయః" తమతోడిపాటివారి
సంతోషపెట్టుటకుమాత్రమే సత్పురుషుల యాయుస్సంపద వినియో
గించన పరోపకారముగా జనుఁడు పాటుపడి నిద్రాహారవిహార
సౌఖ్యములను సంపాదించుకొనుటకై గడువుచిక్కని పూరుషాయువును
జపమువిడిచి లొట్టలకుదిగునట్లు నిద్రాహార విహారసౌఖ్యముం జెఱచు
శ్రౌతస్మార్తకర్మల వెఱ్ఱిచే వ్యర్థముగా దుర్విధిహతులై శ్రోత్రి
యమ్మన్యులు యొరులజెఱచి తాము చెడుచున్నారు తనతోటిపాటి
వారి నిద్రాహారవిహారసౌఖ్యములకై పాటుపడి తన బ్రతుకు హాయిగా
గడవుకొనక దెలిసీదెలియక దంభులై స్వోదరపూరణపరాయణులై
యాషాఢభూతులై యహంకార మమకారాభిమానదూషితులై కూటి
కల్లాడుచు మొండికూటివేషములు వేయుచు ననుభవించక తిఱని
కాంతాకనకాశలం దేవులాడుచు నాభూమి నాసొత్తు నాయిల్లు నాస్త్రీ
నాజాతి నాకులాచారము నానివాసము నాయూరు నాపేరని వ్యర్థా
హంభావమున గింజుకొనుచుఁ బెక్కండ్రు పెక్కుతెఱఁగుల సోమ
రులై పిచ్చివారై వృథానటనతత్పరులై లోకోపకారమునకుం బాకి
రాకుంట మిక్కిలి కుటిలకాలవైపరీత్యము మనుష్యులందఱు అన్యో
న్యానుకూలవిహితప్రవర్తనముచేఁ బరస్పరోపకారులై సమకూర్చు
కొనుట విధిలేని నిద్రాహారవిహారములన్ సర్వభూతదయాపరులై
కాయకష్టమున సంపాదించుకొని హాయిగా బ్రతుకుటకన్నఁ జేయఁ
దగిన యవశ్యకర్తవ్య మింకెద్దియును గాదు శ్రవణసుఖముగాఁ
బలుక్కుట నయనానందకరముగా నగపడుట మఱియు సర్వలోకోప

కారముగా నడిచి యొరుల సుఖపెట్టి తా సుఖపడుట కన్న మర్త్య జీవితమున నాచరింపఁదగినకృత్య మింకెద్దియు న్నమ్మాటికి న్గాదు శ్రవణసుఖమగు పలుకే వేదము పరోపకారప్రవర్తనమే శిష్టాచారము- ఒరులను సుఖపెట్టి తా సుఖపడుటయే వేదచోదితస్వర్గ యజ్ఞయజ్ఞశ్రౌతస్మార్తకర్మధర్మము "సర్వేజనాః సుఖినోభవంతు" అని సంతతముం గోరుచుంటయే బ్రహ్మానందానుభవము వాయ్వాది మహాభూతప్రకోపోపద్రవములకులోఁబడక తీఱదు మరణమున్దప్పించుకొనఁ దరముకాదు నిద్రాహారవిహారసౌఖ్యములకై దేవులాడక ఏలుకాదు తప్పనిదైవకృత్యములగు మహాభూతప్రకోపోపద్రవ జరామరణవ్యాధు లుపశమిల్లుటకై దైవముమీఁదే భారమువేసి పురుషప్రయత్నముచే జనులంద అన్యోన్యకాయక్లేశముచేసుఖని దాహారవిహార సాధనసామగ్రి న్సంపాదించుకొని పరస్పరవిహితోపకారములు బ్రతుకవలయునని బోధింపని దెద్దియును వేదచోదిత ధర్మము కానేకాదు

## ప్రగతి

కృతయుగమున రెండువేల సూర్యగ్రహణములు రెండువేల చంద్రగ్రహణములు- త్రేతయందు గ్రహణసంఖ్యనాల్గురెట్లు ద్వాపరమున నేఁబదిరెట్లు కలియుగమున గ్రహచారనియమములేదు గ్రహణములపరిమితసంఖ్యాకములు కాలనియతికానరాదు కావునఁ గలికాలమందు శ్రౌతస్మార్తవిధానములు పనికిరావు- మఱియుప్రాచీనాచారములు శిష్టసంప్రదాయములుజాతినీతులుచతుర్వర్ణనియమ వర్ణాశ్రమధర్మములు స్వర్గనరకచింతలు జపతపములు మొదలగువేదశాస్త్రోపదేశములు నిరర్థకములు- కాఁబట్టి దేశకాలపాత్రానుసారముగానొరుల సుఖపెట్టి తానుసుఖపడఁదగిననిద్రాహార విహారమాత్రోపయోగకరము

లగు సాధనసామగ్రి సమకూర్చుకొనుటయే పరమపురుషార్థమని ముమ్మాటికి నలికా మాటవు లెఱుంగవలయును వేసవికిఁ [illegible] వచ్చిన విసనకఱ్ఱలు మ మఘశీత కాలమున నమ్ముఁజూవు నవివేకివస్త్రైన్నే కృతత్రేతద్వాపరయుగార్హ్వములగు తపోజ్ఞానయజ్ఞాచరణము నలిక్షాలమునుపదేశించు వా వసుఁడు మిక్కిలి హేయుఁడు కాఁడా? "నేవర్ష్యాధీయతే కలౌ" కలికాలమున జనుల పరస్పర సేవచేతఁగాని సుఖముగ బ్రతుక నేరరు కాఁబట్టి శ్రౌతస్మార్తకర్మములు కలిజనులకుపకరణ్యరోదనములు పరస్పరోపచారముల ననోన్యాన్యవిహితాచరణము ం గలిజనులు కలసిమెలసి బ్రతుకుటయే పరమనీతి

వేదాగకర్తలనేకులు ప్రాచీనులు పేర్కొనఁబడిరి వ్యాకరణమున పాణిని ఆపిశలి కాశ్యప- గార్గ్య- గాలవ చాక్రవర్మణ భారద్వాజ- శాకటాయన- శాకల్య సేనక స్ఫోటాయన ప్రాచీనోదీచీనాచార్యులు మఱియు "నొక వైయాకరణుఁడు పల్కెను ఇట్టితర వైయాకరణులు కొందఱు వైయాకరణులు మఱొక వైయాకరణుఁడని" భాష్యకారుఁడును పల్కొనుటచేత లెక్కకు మిక్కిలిగా ననాది భూతకాలమునందలి వైయాకరణులు పేర్కొనఁబడిరి - కావున వేదములందలి శబ్దములును సంస్కృతభాషయందలి శబ్దములును బలువిధములం బెక్కండ్రు వైయాకరణులచే కాలానుసారమ్ముగా వాడుకంబట్టి పరిష్కరింపఁబడుచు వచ్చినవి- ప్రతియుగమునందు వేదములును వేదార్థములు నింద్రులు మనువు లాచారములు వర్ణాశ్రమ ధర్మములు జంతువులును సకలోషధులు సకలసృష్టివిధానమ్ములు మాఱుచున్నవని పురాణములు పల్కుచున్నవి- కాఁబట్టి ప్రతిశబ్దమును ప్రపంచస్థితి మాఱుచుంట సహజము- కాని- సకలజంతువులకు నిద్రాహారవిహారసౌఖ్యాభిలాష మనాదికాలమునండియు నాశశమువలె నొకరీతిగా నిత్యమై మాఱకున్నది-"ప్రవృత్తిశ్చ భిన్నాఽస్మ[illegible]

యశ్చభిన్నా మహర్షీణాం మతయశ్చ భిన్నాః అనంతా వై వేదాః"
అనుటచేతఁ దత్తద్దేశకాలపాత్రానుసారముగా సర్వలోకోపకారక
మగా నెవ్వడైన దేహధారులు తమతమజీవయాత్ర గడపుకొనక
తీఱదు

అ మొదలగుస్వరములతో క మొదలగు వ్యంజనములతోడను
దమతమయుద్దేశములను వెల్లడించుకొనుటకై సకలదేహధారు
లన్యోన్యబోధకై యెలుగెత్తుటయును కరచరణాద్యవయవచాలనికాభి
నయవిశేషము లగపర్చుటయును చక్షుర్గ్రాహ్యముగాను అభిప్రాయ
బోధకముగా వ్రాతయును సకలేంద్రియగ్రాహ్యావస్తునివేదనము లోన
ర్చుటయు ననాదిగా ననాదికాలమునుండియును సహజముగా నలవాటు
పడియుంటచేత వాచికాంగికాహార్య సాత్త్వికాభినయ విశేషములు
నానాజంతుకోటికి స్వభావములు చతుర్విధాభినయములు దేశమునుబట్టి
జంతువులలో మనుష్యాదిజంతువులకుఁ గొన్నిటికి త్రికాలజ్ఞప్తియును
వస్తుసంగ్రహమును నూత్నకల్పనాచాతుర్యమును స్వభావములు
కావునఁ దా మొకధ్వనినిగాని మఱేసంజ్ఞనుగాని దమయుద్దేశమెద్ది
యోసిఁ బరులకుఁ దెల్పనూహించిచేసినపు డాయుద్దేశము నట్టిసంజ్ఞచే
నితరులుగ్రహించినతీరు తమకుఁ దిరిగి సంజ్ఞాపూర్వముగా బదులు
సల్పినప్పుడీయుద్దేశ మీసంజ్ఞఁ దెల్పునను నిశ్చయముతో నట్టిసంజ్ఞఁ
లను సందర్భానుసారముగా సంగ్రహించి జ్ఞప్తిరూపముగాఁగాని గ్రంథ
రూపముగాఁగాని యుంచుకొనుచు సమయోచితముగాఁ దత్తత్సంజ్ఞల
నుపయోగించుచున్నవి స్వభావముగాఁగొన్నిక్రియలు సహవాసమునఁ
గొన్నిపనులు నలవాటుపడుచున్నవి మనుష్యుల చతుర్విధాభినయ
విశేషములు స్వభావముచేతఁగన్న సహవాసబలముచేతనే మూఁడు
పాళ్ళు వెల్లడింపఁబడుచున్నవి ధ్వనియందు నవయవములందు వర్ణ
రచనయందుఁ గొన్నియభినయవిశేష లుద్దేశములేకయే మఱే సహ

వాసనకర్మలేకరయే శీతకాలము మొదలు కొన్నిసమయవిశేషములం బట్టి స్వభావముగా వెలువడుచున్నవి తమతమయభిప్రాయములను ఫలింపజేసిన తమతమయభినయవిశేషములను జ్ఞప్తియుంచుకొని యింద్రియగ్రాహ్యములగు వ్రాత మొదలగు సంజ్ఞారూపకములగా కొందఱు గ్రంథరూపముగాను గొందఱు విగ్రహరూపముగాం గొందఱు మఱియు నానారూపములఁ గొందఱున్వర్తమానభావిజనోప యోగముగా ననాదికాలమునుండియును లోకోపకారముగా సంగ్ర హించుచు వచ్చిరి. దేశకాలపాత్రలంబట్టియుం బ్రసంగానుసారముగా నీచతుర్విధాభినయము లర్థమిచ్చుచున్నవి చీమలుకూర్చిన యిసుక లేశములు కాలక్రమమున గొప్పపుట్టలై వివిధాకారములతో సృష్టిస్థితి నాశములందునట్లు మఱియును వర్షబిందువు లొకదానికొకటి చేరి పల్లములందు గొపగొప్ప జలాశయములై యుద్భవస్థితిలయవిశేషము లందున ట్లనాదికాలముకొలంది నామరూపాత్మకమగు వస్తువు లన్నియుం గొన్ని స్వభావవశతంబట్టియుం గొన్ని కృత్రిమరచనా విశేషముచేతను బ్రతిక్షణము మాఱుచు స్థూలసూక్ష్మగతు లందు చున్నవి కాఁబట్టి యవాఙ్మనసగోచరమగు నాత్మపదార్థముతప్పఁ బాంచభౌతికాత్మకములగు నామరూపాత్మకసంజ్ఞలుగాని తదర్థములు గాని యనిత్యకార్యములని సిద్ధాంతీకరింపవలయును అకారాది స్వరాత్మకధ్వనులకుం గకారాదివ్యంజనాత్మకధ్వనులకు మఱియుం దదుభయాత్మకేతరలిఖితాదిసంజ్ఞలకును సమయోచితముగా దేశకాల పాత్రముల ననుసరించి యుచ్చారణమందును లేఖనాదీతర సంజ్ఞ యందు మఱి వాని వానియర్థములందును మాఱుదల ప్రతిక్షణమును గలుగుచుండుటయే స్వభావము

"అగ్నిమీళే పురోహితమ్" అను ఋగ్వేదమంత్రాక్షర ములు పూర్వయుగమున నెట్లున్నవో మఱి యిప్పుడున్న యక్షర

సమూహమ్మునందున కర్తమేమో మఱి యాశ్రుతి కెన్నియంగములో యాయంగములకు విసిరోగ మెట్లుండెనో ఎచ్చినమ్మకము కలవారు తప్ప వివేకులు నిర్ధారణము చేయగలరా ? ఇప్పుడుమాత్రమకార గకారేకార నకార సమూహామగు నగ్నిశబ్దమందు అకారమున కర్తమేమో- ఇకారమునకు గకారమునకు నకారమునకుఁ బ్రత్యే కార్థము లెవ్వియో మఱి అ- ఇ యను నచ్చులను గ్- న్ అను హల్లులను వ్యక్తీకరింపఁజేసిన మూలప్రకృతిధ్వను లెవ్వియో మఱి యట్టి ధ్వనులకు జనకములగు నాకాశవిశేష మెట్టిదో మఱి యానాడి కాకాశ పూరితము నట్టి యతీంద్రియపదార్థము ప్రవే శించెనో నిక్కముగా నీ పాంచభౌతికసృష్టికి మూలకారణమగు నాత్మ పదార్థ మిదమిత్థ మ్మని కూలంకషముగా మునులుగూడ సహేతుక ముగా భోధింపఁజాల రాత్మపదార్థ మెఱుఁగు సాధనములనుమాత్రమే లోకానుగ్రహకరులై బోధించిరి ధ్వనిగ్రాహియంత్రముఁ వలె నాది కవులయిన మునులు సహజములగు పాంచభౌతికగుణము లగు శబ్ద స్పర్శరసగంధములను దత్తద్దేశకాలపాత్రానుకూలములగా లోక వ్యవహారమునాగుటకై విభజించివాచికాంగికాహార్యసాత్త్వికాభినయ మూలకముగా సంగ్రహించి వంశపారంపర్యముగా సమయోచిత సంస్కారార్హములుగా వెల్లడించిరి ఇంద్రుఁడను మని మొట్ట మొదట నాదబ్రహ్మమును "అగ్నిమీళే పురోహితమ్" ఈ మొద లగు ఋగ్వేదశబ్దములను "ఇషేత్వోర్జేత్వా" అను యజుశ్శబ్దములు గాను మఱి నానావిధానంతసంఖ్యాక సామాధర్వవేదశబ్దములుగాను ‘ఇమమిషుపోర్జం యజమానాయదధాతి" అని మంత్రార్థమును తెల్ల డిగను బ్రాహ్మణవాఙ్మయముగాను బ్రకృతిప్రత్యయనిర్ణయమున నవ్యాకృత శబ్దబ్రహ్మమును వ్యాకృత మొనర్చెను అనఁగా జగమున నానాదేశములందు వేదసంజ్ఞల నలరు శబ్దములన్నియు నింద్రునివంటి

యూదికవులు ధ్వనిగ్రాహియంత్రములవలె సంగ్రహించిన శబ్దములే
ఆయింద్రులాకవులు మహాధ్వనిగ్రాహియంత్రములనఁదగునతీంద్రియ
దర్శనసామర్థ్యముఁగల మహాత్ములు ప్రాచీనార్వాచీనసామర్థ్యవిశేషము
లచే "అగ్నిమీళే పురోహితమ్" అని యిప్పటికి సంగ్రహింపఁబడి
పారంపర్యముగా వచ్చుచున్న వాఙ్మయమిదియుం దెటుచ్చారణ
మున నక్షరముల రీతియు నర్థములందెట్లు మాఱునో యెవ్వ
రూహింపఁగలరు ? పాంచభౌతిక పదార్థ స్థూలసూక్ష్మక్రమము నానా
రూపవిశేషము న్గాలవశమున మాఱుచుండుట సర్వజనానుభూతమే
కదా ! "యాదృశీభావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్నట్లీశబ్ద
మునకీయర్థమనునియమము లే దెల్లెంచినవారి కట్లర్థము ప్రతిశబ్దాది
గుణసంజ్ఞ కలిగించును గావున సకలాష్టాదశవిద్యలుం గేవలలోకోప
కారకభూతదయనుమాత్రమె బోధించుచు జంతుహింసను నిషేధించు
చున్నవను మానవపరాశరస్మృతులు మాత్రమే ప్రస్తుతగ్రాహ్యము
లనుకొనవోయీ పూర్వమీమాంసకదుర్దురూఢుఁడా ! చాలుచాలు
నీయశాల క్రూరవైదికహింసాచరణము

సమయోచితముగా జగముతోనే వేదములు న్వేదాంగవిధాన
ములు సంప్రదాయమూలాచారములు ఋతువులమాడ్కి సకలైహిక
గతులుం దాఱ్మాలు కాకతప్పదు వేదాధ్యయన పలవాటు లేక
క్రొత్తగా నధ్యయనవేత్త యనిపించుకొన నాశించిన ద్విజమ్మన్యుఁ
డొకఁడు "ఆయతనవాన్ భవతి" అని యుచ్చరించుటకు బదులుగా
"ఆయెదదవా బవది" అని యుచ్చరింపఁగా నతనిం బెద్దగా గణించు
కొన్న పిన్న లాయుచ్చారణమే సమంజసమనుకొని తమకుఁ గ్రమా
గతము నాపాతమే సాధువుగా గ్రహింపకుందురా ? కాఁబట్టి *
అనాదిగా వచ్చుచున్న యాకాశగుణముగు శబ్దము జగమునం దేడి-
మానవులు తమతమ శ్రవణేంద్రియసామర్థ్యానుసారముగాఁ *దాత్ర-

త్సమయోచితార్థానుకూలము విధివశమున నెట్లు గ్రహింపఁగల్గిరో మ తెల్లె ట్లాశబ్దమును ప్రకృతిప్రత్యయము లేర్పఱచి యేయే తాత్పర్యముల నిర్దేశించి యెట్లు పల్కి మఱి యేయే గుఱుతులను సంగ్రహించి తమ సహచారులకు నేర్పిరో మఱి శిష్యులందఱా వా గర్థము లెట్లు మాఱుచువచ్చెనో యింకను దీర్ఘకాలముల కెట్టి మాఱుపల కలుగునో యింకఁ నెవరి శక్యము? కావున "పశుమాల కేత" అను వాక్యము చే ప్రకాశుఁడవై స్వార్థపరుఁడవై యో తెలిసీ తెలియని యహంకారవిమూఢచ్ఛాందసుఁడా! క్రతుకార్యమ్యము న్మాను నీ బ్రతుకుపందు నీ కెంత తీపియో తక్కిన జంతువులకుఁ గూడ నట్లే యని విశ్వసించుము నీ వింక పశుహింస మానుకొనవేని యింతకన్న వేయిరెట్లు నీకు సరిగా బుద్ధిచెప్ప పశువునోరు నీవు మూయించినట్లు నీనోరు మూయించుభూతదయాపరులు వేనవేలు చెలరేఁగెదరు సుమా! పూర్వులవలెఁ గాక నీవు కేవల స్వార్థ పరుఁడవు పరమార్థ మొక్కింతయు నెఱుఁగఁజాలనివాఁడవు గనుక నిక్కాలము నీకుఁ గ్రతువొనరించుట కెంతమాత్రము నగదు తగదు

మొదటఁ దల్లిగర్భమునుండి శిశువు వెలువడినతోడనే పంచేంద్రియశక్తి సుషుప్తియందువలెనే సూక్ష్మస్థితిఁగలిగియుంటనే యాశిశు వూపిరితీసికొనుట ప్రారంభించుటకు సమకాలికముగా నా శిశువుయొక్క స్పర్శేంద్రియము పనిచేయుటకై ప్రారంభించును స్పర్శేంద్రియము మేలుకొన్న గుర్తుగా నాశిశువు కంఠ వాక్యాకాశగుణమగు ధ్వని వెలువడును మఱియు నాశిశువునకు గ్రుక్కమ్రింగెడుశక్తి సహజముగాఁ గలుగును పిదప నాశిశువు క్రమక్రమముగ వినుటకు కనుట ఘ్రాణించుటకుం జవి నెఱుంగుట కలవాటుపడును మఱియు నాశిశువునకు దానిచుట్టుపట్లనున్న వస్తు

గుణములను దనపంచేంద్రియపాటవముకొలంది స్గుణతువట్టుజ్ఞానము
కొనసాగినకొలంది దనతలిదండ్రుల పిలుపు నాకారములు నెఱుంగుచుఁ
క్రమక్రమముగాఁ దనకు హేయాదేయవస్తువులను దనతల్లిదండ్రుల
మప్పుబడిచే నెఱుంగఁజాలును మొదటఁ దనయుద్దేశము నాంగిక
సాత్త్వికాభినయములచేతమాత్రమే వెల్లడింపఁగల్గి బాల్యముగడిచిన
కొలంది న్వాచికాహార్యాభినయములకు నుప్పుఁబడి లౌకికవ్యవ
హారానుసారముగా దొరఁకొనను శిశువునందు మొట్టమొదట
వెలువడినశబ్ద మొకయ్రాకందసూచకమగు అ-ఇ- మొదలగు కేవల
ధ్వనిమాత్ర హెచ్చుతగ్గుసాయివిశేషములు మాత్రమే సహజముగాఁ
దోతెంచును క్రమక్రమముగా నాశిశు వుచ్చరింపఁ గ మొదలగు
వ్యంజనములన్నియు నాశిశువునకుఁ దలిదండ్రులు మొదలగుజనులు
నేర్పినయవియే మఱి యెట్టిభావము మఱి యెట్లాభావనుచ్చరించిన
నేలయగా నాంగికాభినయమొనర్చిన యునో యాపద్ధతులన్నియు నా
శిశువు లోకవ్యవహారానుసారముగా నట్టి వాచికాంగికాభినయము
లనుకరించును ఆశిశువు తొలుదొల్త నేయభిప్రాయము లేక యే
ధ్వనిచేయును మఱి శరీరావయవచాలనముచేయును కాని క్రమ
క్రమముగ మాదిరినకొలంది లోకవ్యవహారానుసారముగాఁ జతు
ర్విధాభినయము లొనర్చుటకుఁ దలకొనను మొదటినుండియును
దనకు లోకజ్ఞానము ప్రారంభించిననాఁటనుండియును దనతన
స్నిద్రాహారవిహారమనోరథములు దెల్పుటకై సాజముగాఁ దను శబ్దిత
కేవలధ్వనిమాత్ర మొనర్చు శ్రమచేఁ గలిగినయవయవచాలన
విశేషములుతప్పఁ బదార్థవివేకముగానొనర్చఁదగిన పంచేంద్రియ
వ్యాపారమంతయును మప్పుఁబడినవేకాని సహజము లెంతమాత్రము
న్గావని బాల్యముఁ గడచనదనులందఱికిం బ్రత్యక్షానుభవసిద్ధమేకదా ?
కాలోచితములైన వివిధలోకవ్యవహారసిద్ధములగు వాచికాంగి

కాహార్యసాత్త్వికాభినయవిశేషములు దేహధారుల కాగంతుకములు సహవాసజన్యములై పాంచభౌతికోపాధులకీతి ననిత్యకార్యములై వివిధగతుల నుద్భవస్థితినాశము లందుచుండును కాఁబట్టి యనాది సంప్రదాయములోకమందలి ముదిరిన మానవులు వాడుచున్న చతుర్విధాభినయవిశేషములన్నియును వ్యావహారికములును గృత్రిమములుఁగాని స్వభావసిద్ధములు కాకుంటచే నీ యష్టాదశవిద్యలన్ని కృత్రిమములు కల్పితము లని సిద్ధాంతీకరింపక తీఱదు శ్రౌతస్మార్తకర్మములన్నియును గృత్రిమములలోఁ గృత్రిమములు. జగదుపకారకమై సర్వభూతదయాపరమైన పుణ్యాచరణకర్మమే స్వర్గము ప్రాణిహింసాకరమగు రౌద్రబీభత్సభయానకరసము లగపఱచు పాపకృత్యమే నరకము ఈ లోకమునకు మించి వేఱుగా స్వర్గనరకములు లేనేలేవు ఈ లోకమున మానవులు సకలభూతదయాపరులై పరస్పరానురాగముతోనన్యోన్యదేహసంరక్షణప్రీతితోఁ గలసిమెలసి బ్రతుకుటకొఱకై భూతభవిష్యజ్జన్మకర్మఫలములు పుణ్యపాపఫలప్రాపక స్వర్గనరకాద్యూర్ధ్వలోకములు సకలలోకపాలురు స్వర్గపాతాళాద్యప్రత్యక్షలోకములు నిఖిలదేవాసురకోట్లు సకలభువనసృష్టిస్థితినాశకర్తలగు బ్రహ్మవిష్ణుశివులు మంత్రబ్రాహ్మణాత్మక వేదములుం బురాణేతిహాసకావ్యాదిగ్రంథములుం దేవతాలయములయందలి దేవతావిగ్రహములవలెఁ గల్పింపఁబడెను కాని పాంచభౌతిక పదార్థమయమగు నీలోకమువలె సహజములు వాస్తవములున్గావు మఱింతభక్తిశ్రద్ధలు కలుగుటకొఱకై యీ లోకసుఖదుఃఖములం దుపేక్ష న్గలిగింప యీ సంసారతాపత్రయము న్మఱపించి పరధ్యానవశమున నిత్యసంతుష్టాంతరంగుల న్గావించుటకై పురాతనవిరచితములగు దేవాలయములు దేవతానిర్మాణములనియు దేవతావిగ్రహములు బ్రహ్మప్రతిష్ఠితములనియు న్గాశీపట్టణము బ్రహ్మప్రళయమందుఁగూడ నశింపక

నిత్యమై యుండుననియు నతిశయోక్త్యలంకారవిశేషములం బ్రతిపా
దింపఁబడియె న్గాని వాస్తవముగా "సర్వం క్షణికం క్షణికం దుఃఖం
దుఃఖం స్వలక్షణం శూన్యమ్" అను శ్రుతి ప్రకారము "ఆత్మసత్యం
జగన్మిథ్యా, యద్దృశ్యం తన్నశ్యమ్" అనురీతిని సకలజగత్కార
ణమై సచ్చిదానందమూర్తియగు దేవుఁ డొక్కఁడే సత్యముతక్కిన
యీజగమంతయు ననిర్వచనీయ మాయాకల్పితమైస్వప్నప్రపంచము
వలె మిథ్యయని నిత్యసంతుష్టకారణగాఢవైరాగ్యమున్ స్థిరపర్చుట
కొఱకై మనఃసమాధిజనకహేతువుగా నాదిఋషులు నానావిధముల
లోకోద్ధరణమునకై పన్నిన పన్నికలు- మఱియును తమతోడిపాటిదేహ
ధారులకు శ్రవణసుఖముగాఁ బలికినపలుకే వేదము - తమయభి
ప్రాయమున్నాలంకమను దెలుపఁగలభాషయంతయును సంస్కృతమే
పరలోకఫలసాధకమగు వాక్కుచ్ఛందస్సు- ఐహికవ్యవహారమునకు
పనికివచ్చినశబ్దములన్నియును భాషలు- జనుల కొండొరుల యభిప్రా
యము ల పూర్ణముగా నెట్లు తెలియునో యట్టి చతుర్విధాభినయ
పద్ధతియె వ్యాకరణశాస్త్రము అన్యోన్యము దేహాధారులు తమ
యూహ నెట్లు తెలుపుకొన్నం దెల్పుకొననిమ్ము- నడుమ నీవైయాక
రణులేల- ఇట్లూపిరితీసికొనవలయునని తెలిసియే దేహధారులూపిరి
తీసికొనుచున్నారా? సహజముగాఁ జతుర్విధాభినయములతో జనులు
పరస్పరము న్దమశక్తికొలఁదిఁ దమయూహల న్దెల్పుకొనుచునే
యున్నారు పరస్పరరంజకముగా జగదుపకారపరులైన యుత్తములు
చతుర్విధాభినయములన్వినియోగించుకొనుచునేయున్నారు లోకోపకా
రముగా నాధివ్యాధులనుండి కాపాడుటకై యౌషధవిశేషము లెఱిఁగించు
నట్లు జగదుపకారకములు సర్వప్రాణిరంజకములగు చతుర్విధాభి
నయవిశేషములు ధర్మార్థకామమోక్షకారణములుగా సహజప్రతిభా
లంకృతులగు నాదికవులు విరచించిన యష్టాదశవిద్యలందు సప్తవ్యసన

దుష్టచిత్తులగు కొందఱు మాంసాశనక్రూరవ్యాఘ్రాదయులు ధూర్తులై స్వార్థపరులై పశుమారణాదిక్రూరకర్మముల కుపచరించున ట్లష్టాదశవిద్యల న్లోనిపోని తటుకల్పనంబుల న్జొనుపుచుఁ పసుపక్షము న్గాపాడుటకై యంత్రములు శస్త్రములు వధోపాయములు హననసాధనాయుధములు- భేదదండోపాయవిశేషములు- జాతులు పరువు లధికారములు శ్రౌతస్మార్తకర్మములు వేయుమాటలేల సకలజనచిత్తరంజకములును భూతదయాపరములుగాని దుష్టకృత్యములనెల్ల ననాది శాసనములుగాఁ బానకములోనిపుడుకలవలెఁ గుహకముతోఁ బన్నియున్నారు నీతోడిపాటివారి నిద్రాహారవిహారసౌఖ్యదాయకమగు పల్కు పల్కుము నీనిద్రాహారవిహారసౌఖ్యమునకుఁ గొరగాని వ్యర్థాలాపములగు "ఇషేత్యా" యని వెఱ్ఱివానివలె నటిచెదవు- నీతోడి పాడిజనులకుం గూడుగుడ్డలు సమకూర్చి నీకాయకష్టమున ధాన్యాది సాత్వికాహారద్రవ్యములం బండించి యొరుల నుసుఖపెట్టి నీవు సుఖపడు నడుపడి నేర్చుకొనుము జీవహింసలేని యన్నపానములను సంపాదించి నీతోడిపాటిజనులకు నీతో సమానవంతు పంచిపెట్టి నీ వనుభవించుము- నిద్రాహారవిహారసౌఖ్యము సరిగా సకలజను లనుభవించవలసినదే- మనుష్యులు తమలోఁదా మొకరి కొకరు గొప్పవారుం గారు- కొద్దివారుం గారు శ్రీమంతులు న్గారు- పేదలు న్గారు- పండితులుం గారు- పామరులు న్గారు- పుణ్యాత్ములుం గారు- పాతకులుం గారు స్త్రీలందఱు న్భార్యలే పురుషులందఱున్ భర్తలే- స్త్రీలందఱు న్దల్లులే- పురుషులందఱు న్దండ్రులే- స్త్రీలంద ఱక్క చెల్లెండ్రే- పురుషులంద ఱన్నదమ్ములే- స్త్రీలందఱు న్గొమార్తెలే- పురుషులందఱు న్గొడుకులే- జనులకుఁ బరస్పరానురాగము న్దొలఁగించి ద్వేషము న్గల్పించి ప్రాణహింసనుగావించి యొండొరులు తన్నుకొని బాధపడి చచ్చువిధమునకు హేతువులయిన దేశ కుల జాతి మతాభిమానము

లహంకారమమకారములు స్వార్థపరత యొరులసుఖముచూచి
యోర్వకుండుట లోకుల బీడించు నుల్లాసపడుట యాత్మస్తుతి- పర
నింద- కామక్రోధలోభమోహ మదమత్సరములు క్రౌర్య మోసము
దంభ వేషము-మాంసాశనము న్మొదలగుదుశ్చేష్టల్నిక్కముగా రాక్షస
క్రూరకృత్యములుగాని మనుష్యధర్మము లెంతమాత్రము న్గావు-
ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను సంపాదించుకొనుట
మనుష్యులందఱుం బాత్రులు మనుష్యులు తా మొనర్చుకర్మములకు
ఫలము తమజీవితకాలమందే 'అవశ్య మనుభోక్తవ్యం కృతంకర్మ
శుభాశుభమ్" అనున ట్లనుభవించకతీఱదు భూతభవిష్యజ్జన్మములు
ధర్మబోధకములయిన కల్పనములుగాని యథార్థములుకానేకావు వెను
కటిజన్మమునులేదు భవిష్యజ్జన్మమునులేదు స్వర్గము న్లేదు నరకము
న్లేదు నీనిద్రాహారవిహారసౌఖ్యసాధనము న్సంపాదించుకొనుటకన్న నీ
జీవితమున మఱి నీకుం గర్తవ్య మెద్దియును లేదు లోకోపకారముగా
నీవదువడియుండినగాని నీతోడిపాటిజనుల యనురాగమును నీవు
సంపాదించుకొన్నగాని నీకుం బ్రతుకుసుఖ ముండదు కావున నీతోడి
పాటిజనులను సుఖపెట్టి హాయిగా న్నిద్రాహారవిహారసౌఖ్య మనుభ
వించుకొమ్మా విద్వన్మనుష్యుఁడా! నిద్రాహారవిహారసౌఖ్యసంపాదకము
కానిదెద్దియు న్విద్యకాదని తెలిసికొను మూరకేల పిచ్చివానివలె
మదమత్తునివలెన ప్రస్తుతప్రశంసలగు శ్రౌతస్మార్తషోడశకర్మలం బ్రల
పించెదవు? ఒరులసుఖపెట్టి నీవు సుఖపడు మిద్దియే సకలమునిస్మృతి
వచనము నీతోడిపాటిజనుల దేహములన్నియును నీదేహమే
మఱియు న్వారియందలి ప్రాణము నీప్రాణములేయని త్రికరణశుద్ధిగా
నీవు సంతతము న్భావించకుంటివేని నీకు నిద్రావిహారసౌఖ్యము చేకూ
రదు సుఖానుభవప్రయోజనమగు నీబ్రతు కెందు కన్యాయముగా
నహంకారమమకారములన్ బశువువలె దుఃఖపెట్టుకొనెదవు? సుఖ

దుఃఖములకు నీవే కర్తవు నీవు లోకోపకారపరుఁడవై సర్వజగము
నీశరీరముగాను సర్వభూతజీవనము నీజీవనముగాను సర్వభూతదయా
మయుఁడవైనప్పుడే నీ బ్రతుకున నీకు సౌఖ్య మలరును నీవు నిక్క-
ముగా మానవులలో లెక్కింపఁబడెదవు

## వైద్యజ్యోతిషావశ్యకత

ప్రాచీనగ్రంథములలో వైద్యము జ్యోతిషము తప్పఁ దక్కిన
శాస్త్రము లెవ్వియును వర్తమానకాలమునకు మతగ్రంథము లు నీవు
తెలిసికొనవలసినపని లేదు ఆయుర్వేదమును జ్యోతిష మను వేదాంగ
మును లోకములో నానా భాషలన్నల వివిధగ్రంథ పరిశోధనము చేసికొని
ప్రత్యక్షమును గ్రహగతులం బరిశీలించుచు ఋతువుల మార్పు
కనిపెట్టి జగదుపకారముగాఁ బత్రికయులోఁ ర్చుచు సరిగా నోషధులను
కనిపెట్టి నానావిధచికిత్స లుచితముగాఁ జేయుచు శిల్పశాస్త్రమును
భూమిపైఁబండించు నేర్పును నిద్రాహారవిహారసౌఖ్యాభివృద్ధి కావించుచు
నన్నతోడిపాటిజనుల కుపకారము చేయువారు నిక్కముగా మనుష్యు
లనఁదగుదురు లోకోపకారమునకై తన బ్రతుకు ధారపోయు సజ్జనునకు
దైవసాహాయ్యము తప్పక కలుగక మానదు మఱి యట్టి లోకోపకార
పరాయణుని నిత్యసంతుష్టి కొనసాగుచుండును ఈ బ్రతుకున సంపూర్ణ
మనస్సంతుష్టిపొందుట కన్నఁ గోరఁదగినసంపద యింకెద్దియు న్గాదు
నిద్రాహారవిహారసౌఖ్య మన్యోన్యానురాగముకోరి జగమునందలి
మనుష్యులందఱు తమ దేహారోగ్యానుకూలముగా సకలభూతదయా
పరులై బాలవృద్ధాతురుల నెల్ల విధములఁ బోషించు సమానస్వాతంత్ర్య
మున నొప్పారుచుండు నప్పటికాలమే కృతయుగముం బుణ్యకాల
మనియుం గొనియాడఁబడుచుండును జాతిమతాచారము లెవ్వి
యెట్లున్నను బరస్పరమైత్రితో నన్యోన్య నిద్రాహారవిహారసౌఖ్యము

లరయుచు సర్వభూతదయాకరులై మానవులందఱున్ సంతతముం బ్రవర్తించుటయే నిశ్చయముగా —యున్నాటికిన్ సకలవేదశాస్త్ర సమ్మత మనుష్యధర్మము అనాదికాలమున నష్టాదశవిద్య లెల్లయుం బ్రవర్తిల్లుచుంటచేతఁ బ్రాచీనఋషుల —ట్రతి యాచార్యుల నిర్ణయింప వీలులేదు గణించుటకు శక్యతముకాని యువ్యక్తకాలముం బరమాణువుల లను లోకోపకారముకొఱకై స్థూలదశ లాకాలపరమాణువు కేర్పఱిచి ప్రాచీనమహర్షులు ప్రాకృతజనులఁగూర్చి లోకవ్యవహారముకై సకలజగదుపకారార్థమై వ్యాప్తిగల్పించిరి కాని దైవవశమున నానాఁటి కావిద్యలు దత్తన్నియత తాచారములుం బాంచభౌతికపదార్థమును ఋతుధర్మములు మానుషజీవికి కర్తవ్యకార్యము లోక నియమమెద్దియు నేక యెట్టి నిత్యనియతపద్ధతియు ననుసరింపక మాఱుచు వచ్చుచున్నయది. కాని. నిక్కముగా ప్రాణికోట్లయందు సుఖించుటకై ప్రవర్తించుటయును కష్టమునుండి తప్పించుకొనుటకై ప్రయత్నించుచుంటయును నిత్యములై మాఱనిగుణము లనకతీఅదు కారణబీజము నిత్య మవ్యక్త మొకప్పుడు కార్యరూపముగా వ్యక్తీకరించి యుద్భవస్థితులం బరిణమించి తిరిగి బీజరూపముగా లయము నొందును శిశువునందలి శబ్దస్పర్శరూపరసగంధజ్ఞాన మవ్యక్తకారణ బీజరూపమునసనుండి బాహ్యేంద్రియోపాధిస్థితివిశేషములఁబట్టి పలువిధముల ననిత్యకార్యరూపముం బ్రవర్తిల్లి నిత్యావ్యక్తకారణ బీజముగా నిర్వర్తించును త్రిగుణసామ్యముగు ప్రకృతిపురుషునకుఁ గదలిక పుట్టించి స్వభావముగా బుద్ధ్యహంకారాదులం బరిణమించుచుఁ దనకుదాఁ భోగ్యభోగభోక్తృరూపమునన్ జ్ఞానజ్ఞేయజ్ఞాతృరూపముల న్వికారములం బరిభ్రమించుచుం బరమపురుషాచింత్యశక్తిమహిమముచే నద్దముచూచుకొనుపిచ్చుకవలె నానావికారములందుచు వ్యష్టిసిలినాశాత్మకమగు జగద్రూప మగుచున్నది

## శతం దీర్ఘమాయుః

త్రిగుణమాయమును సకలజగద్రూపకమగు ప్రకృతియును నిర్గుణుఁడగు పరమపురుషుఁడు నీరెండు తత్త్వములును వాస్తవములే కాని వ్యక్తావ్యక్త కార్యాకారణ స్థూలసూక్ష్మ పంచభూత తన్మాత్రాత్మక పరిణామసుఖదుఃఖానుభవఫ ము లందుచున్న జీవతత్త్వమీ ప్రకృతి ప్రకృతికి వేఱుపదార్థమే "సాక్షీచేతాః కేవలో నిర్గుణశ్చ" అని వేదాంతములచేఁ బ్రతిపాదింపఁబడిన యీపరమ పురుషుఁడు కారణములేక కార్యము కలుగదు గనుక నీప్రకృతి నివృత్తిరూపక జగదుద్భవస్థితినాశహేతువుగాఁ బరమపురుషునిశక్తి మహిమ ముప్పవత్తు కల్పించెనేమో- త్రిగుణమయమగునీప్రకృతియే యొకపుడు జగదుద్భవస్థితినాశముల నార్యరూపమగుచు మఱొకవేళ సుషుప్తియందలి మనస్సువలె త్రిగుణసామ్యమై యవ్యక్తకారణ రూపమగుచుంట ప్రతిమనుష్యు తెఱఁగానుభవము కాఁబట్టి యోగ మహిమచే నిద్రాహారవిహారముల స్మితముగా నియమించుకొని పౌరుషముతప్ప మఱి వేఱేపదార్థమే లేదని నిశ్చయించుకొని వృథా దైవకల్పనమును బిచ్చివానివలెఁ జేసికొనక కామక్రోధలోభమోహ మదమత్సరములకు సందీని కేవల పరోపకారకప్రవర్తనము స్వార్థ పరత మాని యహంకారమమకారములఁ దొఱంగి సర్వభూతదయా పరుఁడైన మనుష్యుఁడు కపిలమహామునివలె తాపత్రయము నొక్కింతయునంటక నిత్యసంతుష్టుఁడై గుణప్రకోపనవికృత్యనిత్యకార్యాత్మక సంసారదుఃఖ మొక్కింతయు నంటక త్రిగుణసామ్యకారణాత్మక ప్రకృతి నిత్యుకై వల్యానందపదవి నోలాడుచుండును "మనఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః" లోకోపకారక సర్వభూతదయాపరుఁడై నియమితాహారనిద్రావిహారుఁడై యున్నమనుష్యునకుఁ దప్పకమనః

సంతుష్టి సమకూరును యథాలాభసంతుష్టుఁడై కోర్కె లేకున్న యమనస్కయోగియే జీవన్ముక్తుఁడై శ్రుతిస్మృతిప్రసిద్ధులగు వామదేవ శుక కపిలాది మహామునులవలెఁ ద్రిగుణసామ్యాత్మకమగు చిచ్ఛక్తి ప్రకృతి నిత్యానందమయు లయ్యెదరు వేయేల సర్వభూతదయాపరుఁడవై యహింసావ్రతము నవలంబించుకొను మేనుంగు పాదమునఁ దక్కినయడుగు లన్నియు నిముడునట్లు "అహింసా పరమో ధర్మః" అను నార్యోక్తి ననుసరించి నీయొక్క సకలశ్రేయస్సులకును మఱియు నీకోరిన నీమనస్సంతుష్టికి నాచరింపవలసిన సర్వవేదశాస్త్రవిహితధర్మములన్నియు నాచరించినవాఁడవే యగుదువు "సర్వే జనాః సుఖినోభవంతు" అను వాక్యముకన్న నీవు జపింపవలసినది మఱి నీవితరుల కుపదేశింపవలసిన మంత్రముకన్న శ్రేష్ఠమంత్ర మింకొద్దియు న్నాగు లోకోపకారముగాఁ బ్రవర్తించుమనియును సర్వభూతదయాకరుఁడవు కమ్మనియును మాత్రమే యష్టాదశవిద్యలు నీకుపదేశించుచున్నవని సర్వజ్ఞుఁడగు కవి యిట్లు వ్రాయుచున్నాఁడని ముమ్మాటికి నమ్ముకొను మోహకూళసోమయాజీ! యింకనైన బుద్ధిఁగొని పశుహింస మాను శ్రోత్రియమ్మన్యుఁడా! యౌకటికయాజులూ! స్వార్థపరులగు ధూర్తకల్పితక్రూరకల్పము నవలంబించకు వేదవేదాంగములకు భాషానియమము లేదు ఆత్మకు శరీరములేనట్లు విద్యకు భాషయను నుపాధి కల్పితముగాని వాస్తవము కాదు

ఇది శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాస విరచితమగు
జగజ్జ్యోతియందు దైవపౌరుష నిర్ణయ నిర్వచనము



# జగజ్జ్యోతి

## మూఁడవ ప్రకాశము

### నిష్కృష్ట ప్రత్యభిజ్ఞానము

"ఫలనిర్వృతిశ్చ" అను పూర్వమీమాంసాసూత్రముంబట్టి ఇంద్రశబ్దముయొక్క యర్థమును మహేంద్రశబ్దముయొక్క యర్థమును వేఱు కనుక "అథశబ్దానుశాసనమ్" అను పతంజలిభాష్యానుసారముగా సత్యభామా యనుపదమునందు సత్యా యనుపదమును భామా యనుపదమును సమానార్థములనుటచేత మహాత్ - ఇంద్ర-మహేంద్ర యను మూఁడుపదములు సమానార్థము లగును పతంజలి వైదిక శబ్దములకును మఱి లౌకికశబ్దములకుఁగూడ ననుశాసన మొనర్చెనుగదా ఇందుఁబట్టిచూడఁగా శబ్దార్థములకు సంబంధముండీ లేనట్లగపడుచున్నది ఏశబ్దమున కేది యర్థమో నిర్దేశింపనలవి కాదు తలంపును వెల్లడించుసంజ్ఞ శ్రోత్రగ్రాహ్యమగుశబ్దము అర్థరూపమగు తలంపుముందును మఱియాతలంపు న్వెల్లడించు శ్రోత్ర చక్షుర్గ్రాహ్యములగు నామరూపాదిసంజ్ఞలయుత్పత్తి వెనుకనుగలుగుచున్నవి ఈతలంపుల నీనామరూపములు వెల్లడించుటను నియమమెద్దియును లేదు ఒకనామమే మఱియొకరూపమే దేశకాలపాత్రముల ననుసరించి గణింపనలవికాని యర్థములను వెల్లడించుచుంట యెల్లరికిం బ్రత్యక్షానుభవసిద్ధమే నామరూపములయుత్పత్తికారణము తలంపు మఱి తలంపుపుట్టుటకుగారణము శరీరమందలి చైతన్యము "చైతన్యంసర్వభూతానాం నిర్వృతి ర్జగదాత్మనామ్ నాదబ్రహ్మ

ముపాస్మహే" అనుటచేత చైతన్యమే నాదబ్రహ్మము తనకుఁ దాఁ
గారణము "శాస్త్రాద్దృష్టిర్బలీయసీ" అనుటచేతఁ దెలియనశక్యమగు
కారణరూపకమగు శాస్త్రము న్దెలిసికొనటకై వృథాప్రయత్నమును
మానుకొని నిక్కముగా బుద్ధిమంతు లింద్రియదృష్టములగు నామ
రూపకార్యములను దమ కోడిపాటిజనులసుఖమునకై యుపయోగ
పర్చుచుఁ దాముకూడ సుఖపడుచుందురు వేదశాస్త్రములన్నియు
ననంతవిధములుగాఁ గడచినసంగతుల గుఱించిన కవిలకట్టలు మఱియు
గతజలసేతుబంధనములు- అందునుగూర్చిన పాతపంచాంగములతోఁ
బ్రయోజనమేమి? ప్రతిక్షణము జగత్కార్యములన్నియును మాఱు
తీఱుచుకదా? భూతకాలమున ననంతవిధములుగా మాఱినజగత్కార్య
ములు వర్తమానభవిష్యత్కాలములందుఁగూడ నెన్నివిధముల మాఱ
నున్నవో యెవరు నిర్దేశింపఁగలరు? "సోఽంగ వేదయదివా న వేద"
అని శ్రుతియే యీజగత్సృష్టినిగూర్చియెద్దియు నిర్దేశింపలేక సంశయ
మున దేవులాడుచున్నది వాస్తవముగా నత్యాసన్నకాలభూతకార్య
ములు మాత్రమే తెలియశక్యమగునుగాని భవిష్యత్కార్యములు రూఢి
చేయఁ దరముకాదుకదా? అనుభవములో నందఱకు నత్యాసన్నభూత
కాలకార్యములేయుంటచేత వాస్తవముగా వర్తమానభవిష్యత్కాల
కార్యము లూహ్యములుగాని ప్రత్యక్షములు కానేకావు కాఁబట్టి
భూతకాలము మాత్రమే వాస్తవముగాని వర్తమానభవిష్యత్కాల
ములు రెండును మిథ్యలే-కల్లలే మఱియు లేనేలేవు గడచిన సంగతి
కఱయో యింత పొట్టిగాఁ బట్టినానేమి యని వగచెడు వెఱ్ఱివానివలె
నిఁకముందెట్లయ్యెదనో యీలాగైననాకు మేలనుకోరికలనువ్విళ్లూరు
జనుఁడంతకన్న బుద్ధిహీనుఁడుగదా? 'సాక్షీచేతాః కేవలోనిర్గుణశ్చ'
అనుతీరుగా నిద్ది యీలాగున జరిగె నిట్లగుచున్నది మఱిట్లు కాఁగల
దింతకేదియెట్లయినఁగని పెట్టుటకన్న నీజగత్కార్యములతో నాకేజోక్య

మును లేదు. కేవలమూ నేను సాక్షిమాత్రుఁడను దటస్థుఁడ ననుకొను
వాఁడే ఏకముగా జీవన్ముక్తుఁడును మిక్కిలి ప్రశాంతుఁడును మఱెద్దియు
ననుకొనక మఱే మనోవృత్తియును లేక స్వయంప్రకాశమగు తత్త్వమే
వాసుదేవుండను శాస్త్రమే మిక్కిలి యుక్తియుక్తము. నా నమ్మకము
ఇంతకును నెద్ది సత్యమో యట్టి తత్త్వము యుక్తిగోచరము కాదు మఱి
యనుభవమునకు రాదు కాఁబట్టి యనుకొన్న దెద్దియున్నాదుగాని నిక్క-
ముగాఁ దనయునికి తనకుఁ బ్రత్యక్షము కాకమానదుకదా? "సత్యంజ్ఞాన
మనన్తంబ్రహ్మ" అనుటచేత నాయునికిమాత్రమే నాకుఁ బ్రత్యక్షము
గాని నాయునికి గుణ మెట్టిదో యది వాస్తవముగాఁ దెయఁజాలను
మఱి తెలుపలేనుగనుక "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అను శాస్త్రము
చేత నేను నాది యనుకొనుటకుఁ గారణముండక తీఱదు గాన నట్టి కార
ణము దెలిసికొన్న యెడల నేను నాది యనుకొనుటవలనగలిగిన దుఃఖము
శాంతించునని పరమకారుణికుఁడైనగురుఁడు వృత్తగమీమాంసాశాస్త్ర
ముపదేశించెను ఇంతకును బ్రతుకకవిధిలేదు బ్రతికిన సార్థకము లేదు.
మఱెద్దియుం బాలుపోదు గాని యీ బ్రతుకున దెల్ల యనుభవము "యద్దృ
శ్యం తన్నశ్యమ్" అను తీరుగాఁ బ్రతికార్యమును గడిచిపోవుటమాత్రమే
యందుచేత నే ననఁగా సత్యాసన్నభూతకాలజ్ఞానస్వరూపుఁడ నని
తేలినఫలితార్థము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా. తత్తు సమన్వయాత్"
అను సకలబ్రహ్మసూత్రముల సారభూతములగు నీ రెండుసూత్రములచేత
"సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" శ్రుతి స్ఫూర్తించుటచేత సచ్చిదా
నందలక్షణమగు బ్రహ్మమే నేను. "శివః కేవలోఽహమ్" కేవలము
నేను నిర్గుణుఁడ ననఁగా సత్త్వరజస్తమోగుణములనుండి విముక్తుఁడ
నైతిని. ఇదివఱకు నన్నంటిన సుఖదుఃఖభోగరూపసంసారము త[illegible]ను
గతించిపోయెను. ఇప్పుడు నేను కేవలముముకుఁడను. వెనుకటివి తలంచు
కొని వెక్కివెక్కి యేడ్చెడు వెఱ్ఱివానివలె "తత్త్వజ్ఞానాదేవ నిశ్శ్రేయ

సావా ప్తః” అనున్యాయానుసారముగాఁ గడచిపోయిన యవస్థలఁ దలంచుకొని వృథా కుంద కుబ్బక నన్నంటినదెల్ల గడచియేపోవును మఱి యెద్దియు నంట కెప్పటినేనే మిగిలియున్న వాఁడను- మఱి త్రిగుణాత్మక మయిన సంసారమంతయు నన్నంటియుంట కున్నది- కనుక క్షణికమగు సంసారవిషయచింత వృథాగా నేఁ జేయనేల యని ప్రతి క్షణము నదనుగలిగినమనోవృత్తి నలక్ష్యముచేయుచు “విస్మృతిః ఖలు ముక్తిః” అను గురూపదేశమునుంబట్టి యేతలంపు లెట్లున్నను ఖేద మోదములు లేకున్న వాఁడు కపిలమహామునివలె నిత్యశుద్ధబుద్ధముక్త స్వరూపుఁడగుచున్నాఁడు ఇదుగో లోకులందఱి కభయమిచ్చుచున్న భగవంతుఁడు గోవిందుఁడు “తత్త్వమసి శ్వేత కేతో” ఓయీ నీ ప్రతు కంతయున్ గల గాని వాస్తవము కాదు కాదు “మాయామాత్ర మిదం విశ్వ మద్వైదం పరమార్థత ఆత్మైవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్” అని శ్రుతిస్మృతిపురాణేతిహాసాద్యష్టాదశవిద్యాత్మక జగజ్జ్యోతియై ప్రతిజీవునకుఁ బ్రత్యక్షముగా సూర్యభగవానుఁడై యగ పడుచుండఁగా నొడిలో బిడ్డనిఁ బెట్టుకొని యూరెల్ల వెదకు విభ్రాంతుని వలె నేల దేవులాడెదరు? “ఆత్మావై శ్రోతవ్యో మన్తవ్యోజిజ్ఞాసితవ్యో నిదిధ్యాసితవ్యః” అనుతీరుగా నేను నాది యనుకొనుటచేఁ గలిగినసుఖ దుఃఖాత్మకజగత్కార్యములన్నియును స్వప్నకార్యములవలె మిథ్యలు ‘ఈశ్వరః సత్యమ్ జగన్మిథ్యా’ యనుకొనుటచేత మాయామాత్రము లయినకార్యములన్నియు నశింపఁగా సత్యమైనకారణమే నారాయణుఁ డొక్కఁడేసచ్చిదానందలక్షణుఁడై మిగులుమిగులు మిగులును దేహ ధారులలోఁ గోర్కెలేకుంట, యేకపిలమునికో చెల్లునుగాని సర్వ సామాన్యమనస్సును నిర్విషయముసర్చుకొనుట దేవతలకైన నసాధ్య మైనప్పుడు సంసారపాశబద్ధులగు మానవులన నేపాటి? “బ్రహ్మ సత్యమ్ జగన్మిథ్యా” యనుటయు యుక్తియుక్తమే- మఱియను శాస్త్రీ

యమేకాసీగానీ యక్కరకురానిచుట్టమువలె తనకెన్నఁడైన నంద నలవిగాకున్న నవనిధులకన్న చేతఁజిక్కిన దమ్మిడియైన నెంతయో మేలు కాదా ? మా కెందు కీవెఱ్ఱి మొఱ్ఱి వేదాంతతత్త్వము మా కోర్కెలు తీర్చి మా బ్రతుకుసంతుష్టిగా నడుపఁగలయుపాయము మాచేతనైనది చెప్పుము- "బ్రహ్మ సత్యమ్ జగన్మిథ్యా" అను నీగీర్వాణము మాఁకు దెలియదు తెలిసికొనుటకు మాతల చాలదు మహాప్రభూ కృష్ణా ! నీవుబోధించిన భగవద్గీతలు తెలిసికొనుటకు నిద్రాశనాదిలోలురము మే మొకింతయు నధికారులము కాము కాఁబట్టి నీవు దయాసముద్రుఁడవు కనుక మాకష్టములఁబాపి మామంచి కోర్కెలు కొనసాగనిమ్మని మంచినడువడి నొరులకు మేల్చేయుచుఁ, పొరపాటున దారితప్పినపుడు పెద్దలబోధను విశ్వసించి తెలివితెచ్చు కొని తప్పులు దిద్దుకొని సకలజనసమ్మతముగా నడుచుకొనుచుందుము క్రమక్రమముగా నీయంతటనీవే నీకోరినమనస్సంతుష్టి నందఁగలవను న్యాయశాస్త్రము చేతఁజిక్కి యక్కరకువచ్చినపండు భాగవతము

## సంసారసంగ్రహదశ

అద్వైతమతము నీటిలోని గేద బేరమువలెఁ గొనఁగల గేదెకుఁగల బెట్టఁగల బచ్చలివలె నద్దములోనిముల్లెవలె నంసారులకు మొగముదుడుపుమాటవలె నంతగాఁ బనికిరాదు పనికిరాదు నడుచు దంపతులకు వైరాగ్యబోధ పనికిరాదు "అహంబ్రహ్మాస్మి" అను మహావాక్యము నుదెలిసికొనుటకధికారి పదునాల్గుభువనములలో స్థాణుఁ డగుపరమశివుఁడుతక్క నొకఁడుమరి లేఁడు లేఁకు ఊసుపోనిమంగలి పిల్లితల గొఱుగనట్లే తనతోడిపాటివారి కూడుగుడ్డలకై తోడ్పడక సోమరిపోతులై యొరులకష్టమున బ్రతుకు నాల్గ్రముచ్చుటక్కరులును భ్రాంతమనస్కులు తప్పఁ గాయక్లేశమున న్యాయార్జితమునఁ దాము

సుఖపడి యొరుల సుఖపెట్టు మంచివారికి భగవద్గీతలు నామాలు
కావళాలు మంత్రాలగొణుగుడులేలా? త్రికరణశుద్ధిగానొరులమేలు
కై పాటుపడి నీతోడిపాటివారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడ
వగుటయే నీవు పుట్టిన సార్థక్యము బ్రతికున్నంతవఱకు నేను నాది
యనునభిమాన మేజీవునకైనను దప్పదు తప్పదు కనుకఁ దననిద్రా
హారవిహారసుఖము సంపాదించుకొనుటకై ప్రతిజనుఁడును ప్రయ
త్నముచేయుటలోఁ బరకోటికిం కడ్డు దగులునవి జడములుగానీ లేక
చేతనములుగానీ యట్టివానినన్నింటిని నిర్మూలముచేసికొనక తీఱ
కుండుటచేత దేహధారులన్యోన్యకలహమాడుకొని యాకలహమునం
దోడినవారు కష్టములను, గెల్చినవారు సుఖములను సహజముగా
జగముపుట్టినదిమొదలుకొని యనుభవించుచున్నారు కాఁబట్టి పశు
ప్వాది సకలదేహధారులలోఁ బరస్పర శత్రుత్వము సహజముగాఁగల
రెండు తెగలేర్పడినవి జంతువు-మాట యటుండఁగా మనుష్యులలో
మనుష్యులు- రాక్షసులని రెండు తెగలున్నవి ఏమిచేతనైనప్పటికి
ప్రాణిహింసకొప్పనిదయార్ద్ర-హృదయులు మనుష్యులు-అట్టిదయార్ద్ర
హృదయులైన మనుష్యులు వాయుభక్షు లబ్భక్షులు పర్ణభక్షులుం
గేవలశాఖాహారులు మాత్రమే అట్టి మహాత్ములయొద్ద మూఁడు
పూఁటలకుమాత్రమే యుపయోగించు శాకాహారముమాత్రమేనిల్వ
యుండును వారియునికిపట్లు కొండగుహలు వృక్షమూలములు
మాత్రమేయై యుండును వారు కట్టుకొనుటకుం గప్పుకొనుటకుం
జెట్టుపట్టలు మాత్రమే యుపయోగించుకొనెదరు- వారి కిల్లుగాని
నగలుగాని నాణెములుగాని పశువులుగాని వస్త్రములుగానియాయుధ
ములుగాని మఱేవనిముట్లుగాని మఱేవిధమయిన యాస్తిగాని పుస్తక
ములుగాని కావళములుగాని నామములుగాని జన్నిదములుగాని
[illegible]సైలుగాని పూసలుగాని పెండ్లిండ్లుగాని మఱెట్టిగార్హస్థ్యపద్ధతులు

గాని షోడశకర్మములుగాని మఱెట్టిసంస్కారములుగాని లేనేలేవు ఈజు
జోడుకుదిరి యన్యోన్యప్రేమానురాగముకల స్త్రీ పురుషులిరువురు
మాత్రమే నిర్జనప్రదేశమున వసింతురు సంతానముకలిగినయెడల
నాపిల్లలకుఁ బన్నెండేండ్లు యీడువచ్చువఱకుఁ బెంచి విడిచిపెట్టి
తామిద్దఱుమాత్రమే యెడతెగక కలిసియుందురు పురుషుఁడు
మృతిపొందిన భార్య మఱి బ్రతుకదు - భార్యమృతిపొందినఁ బురుషుఁ
డామెకై యేడువక కేవల మేకాకియై యెవ్వరికిం గంటఁబడక
యావజ్జీవ మెచ్చటనో కాలక్షేపముచేసికొనును అట్టిమనుష్యులకు
యథార్థవసుజ్ఞానముకలిగి శాశ్వత కైవల్యానందానుభవదాయక
మగును సకలభూతముల కభయమిచ్చువారు కనుక నామనుష్యులు
తమ యెముకలున్నంతవఱకనఁగా స్త్రీపురుషులు సంభోగార్థములగు
పైతొడుగుశరీరములం దొలఁగినప్పటినెప్పటికి స్థిడనిసూక్ష్మదేహము
లతోఁ బరస్పరప్రేమానురాగసౌఖ్యము శాశ్వతకైవల్యానంద మనుభ
వించుచుందురు అట్టి యుత్తమమనుష్యమిథునము లెన్నియుగములకు
ముందో స్థూలదేహములతో నుండెను అట్టి నిక్కువుమనుష్యు లెన్ని
యుగముల క్రిందటినుండియో మఱి పృథివిలోఁ గలుగనేకలుగ లేదు.
బంగారునకు ముచ్చిబంగారువలె నాపుణ్యదంపతుల తరువాత
నానిక్కువుమనుష్యుల ప్రతిఫలములయిన కల్లమనుష్యులు కలిగిరి
ఏడురంగులతో సూర్యకిరణము వ్యక్తీకరించును గుణముకలది
గుణమునను రెండువస్తువులుచేరి యొక్కటిగాఁ దోఁచును. గుణి
పురుషుఁడు గుణము స్త్రీయనఁ గాఁబట్టి ప్రతివ్యక్తియును స్త్రీపుం
మిథునమే. కనుక సూర్యకిరణము లేడుగుణములతోడను మాఱి
యేడుగుణులతోడను గలిసియున్న దాయేడుగుణులను పురుషవ్యక్తు
లేడుగుణములను స్త్రీవ్యక్తులును వశిష్ఠారుంధతులు మొదలగు సప్తర్షి
మండలములు మొట్టమొదట వ్యక్తీకరించెను ఆసప్తర్షిగోత్రము

లోకొక్కటి యేడింట రెటింపఁబడి నలువదితొమ్మిది మూలగోత్రము లయ్యెను. మనుష్యులనఁగవా రాసప్తర్షిదంపతులు. ఆదంపతు లొక్కొక్కశిశువు నని యాశిశువును బాల్యముగడచువఱకుం బెంచి పిమ్మట నాపిల్ల యథేష్టముగా బ్రతుకుతెరువుచూపి తాము మఱి పరస్పరసంభోగమును మానుకొనియును జంటఁబాయ కింద్రియముల స్వాధీనపర్చుకొని దంపతీధర్మమును శిశురక్షణోపాయమును గూర్చిన తమయనుభవమును దమయొద్దకువచ్చి తెలిసికొననిచ్ఛగించిన కన్యక లకు వటులకు నొబోధించుచు విజనస్థలముల న్దమబ్రతుకు గడపు కొందురు

“ఋషిభ్యశ్చ పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ” అను తీరుగా జగమునందలి భూతభవిష్యద్వర్తమానకాలములందలిమానవు లందఱాసప్తర్షి గోత్రములఁ జేరినవారే. మొట్టమొదటిఋషి ద్వంద్వము లేదు మఱి యేకుజంటలసంతానమే తక్కిన మనుష్యు లందఱును, కాబట్టి మనుష్యులకు మూలకారణ మిథునములగుటచేతఁ బితరులనియు నతీంద్రియద్రష్ట లగుటచేత ఋషు లనియును స్వాధీనేంద్రియులుగనుక మహాయోగులనియు మూలపురుషులై పైతృకము లందుఁ జేర్కొనఁబడుచున్నారు. సూర్యకిరణము మందమైనపుడు రాత్రియు తీవ్రమయినపుడు సంధ్యయును దీవ్రతరమైనపుడు పగలును బొడముచుండును. కాఁబట్టి యీమూఁడుకాలవ్యవస్థలంబట్టి మనుష్యాదిజంతువులన్నియు పుంస్త్రీనపుంసకులఁదాల్చిన సత్త్వరజస్తమోగుణవిశేషములచేత నుత్తమమధ్యమాధమస్థితుల మనుగడ నడపుకొనుచుండును. రాత్రియందు స్త్రీవ్యక్తి సంధ్యయందు నపుంవ్యక్తి పగటియందు పుంవ్యక్తియుం బొడమును గుణోపచయమునఁ బుంలింగమును గుణాపచయమున స్త్రీలింగమును గుణాంతరాళావస్థయందు నపుంలింగమును వ్యక్తీకరించును. మొట్టిలో మొట్ట నా మొండిచేయి

చూపించుమరా యన్నట్లు నాతోడివా రేమో వారికిఁ దోఁచినట్లు
పల్కుచున్నారు గనుక నేఁగూడ నేమోచదువరివలె నిట్లు
వ్రాయుచున్నానుగాని నాకు మాత్రము తెలిసియేడుచునా? తొల్లింటి
పెద్దల కేమితెలిసెనో వారొనర్చినసూత్రములనియును వారు ప్రతి
పాదించినగ్రంథములనియు నిప్పుడు ప్రచురింపఁబడినపుస్తకములను
బట్టి చూడఁగాఁ దొల్లింటిపెద్దలు నిస్సందేహముగా నెఱిఁగినవారే
కావచ్చునుగానివారుచేసినగ్రంథముమాత్రమిప్పటికాలమునఁ బ్రచు
రింపఁబడిన వేదశాస్త్రములెవ్వియును గావు కావు. కారణ మేమన
వ్రాఁతలు తలంపులఛాయనుమాత్రము తెలుపఁగలవుగానినిక్కమగు
తలంపుల ప్రాణాంకురసము నసింతయైన వెల్లడింపనేరవు ఉసురడలిన
బొందియొక్క చిత్రపటము స్వస్థునిదేహసౌష్ఠవముగాని విద్వాంసుని
యంతరంగమునుగానిఁ బొత్తిగాఁ దెలుపనేరవు. ధ్వనిగ్రాహి రూప
గ్రాహియంత్రములంబట్టికొంతవఱకుస్వస్థుఁడైనవిద్వాంసునివాగ్రూప
ములు స్థూలదృష్టి కందినప్పటికిని సూర్యుఁ డగ్ని యనియును భూమి
కిన్ని యోజనములమేఱ నున్నాఁడనియును మింటిపాలదారిలోని ప్రతి
నక్షత్రమును సూర్యునికంటెఁ బరిమాణమున లక్షంతలు పెద్దయును
నంచనా టప్పాలు కట్టవలసినదేగాని ఇదమిత్థమ్మని నిస్సంశయముగా
స్థూలసూక్ష్మదశలన్నియుం బరీక్షించి చెప్పనలవియగునా? మఱి
యును బెద్దలుపదేశించిన వేదశాస్త్రములివ్వియని వర్తమానమునఁ
బ్రచురింపఁబడినవ్రాతలంబట్టి యమ్మునులయభిప్రాయములను యథా
ర్థముగాఁ దెలియ నెవరితరమగును? నన్ను నేనే తెలుపలేకున్నప్పు
డొరులసంగతి తెలిసి తెల్పఁగలపండితుఁడ నని చెప్పుకొనుట
దంభము మోసము స్వార్థపరత కూటివేషముగు న్గాని యథార్థ
మగునా? "విజ్ఞాతారమరేకోవిజానీయాత్" అని డప్పువేసి శ్రుతి
ఘాటుచున్నదికదా? యథార్థవస్తుతత్త్వ మెవ్వరికి దెలియఁబడదు,

మరొకవేళ నతీంద్రియద్రష్టయగు కపిలునివంటిముని తెలిసికొన్నప్ప
టికిం బరమార్థ మింద్రియగ్రాహ్యముకాదుగనక "మౌనం వ్యాఖ్యా
నమ్" అనుచందముగా యథార్థవస్తుజ్ఞానలక్షణము కేవలబ్రహ్మ
సమాధిస్థితి కాకతీఱదు కావున లౌకికవ్యవహారమగు నీకలములు
సిరాబుడ్లు కాగితములు వ్రాతలు పుస్తకములు లేనిపోని వ్యయ
ప్రయాసములన్నియును కేవల ముదరపోషణార్థమైన దంభములుగాని
యథార్థజ్ఞానబోధకము లెంతమాత్రము న్గావు కావు కావుగాని
యేదో యొకవృత్తి యవలంబించి పొట్టపోషించుకొనకతీఱదుకనుకం
బహువృత్తు న్గాని నడువని లోకమందలి లోకవృత్తిగొనునప్పుడు వివిధ
కళలుగడపుకొనకతీఱని బ్రతుకు జనసమ్మతముగా నడుపదుకనుక
యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహణములు బ్రతుకువారు
బ్రాహ్మణులనియుం బ్రతిగ్రహణము యాజనాధ్యాపనలు మాత్రము
విడచినవారు క్షత్రియులనియు దానప్రతిగ్రహణము మాత్రమే
యధికారులు వైశ్యులనియును బ్రతిగ్రహణమునకొక్కదానికే యధి
కారులు శూద్రులనియును నియమ మగపడుచున్నది "చూలే లేక
న్నప్పుడు కొడుకుపేరు పులింగ" యన్నట్లీలోకవ్యవహారమునకుం బర
మార్థమే లేనప్పుడు కేవలపరమార్థప్రయోజకములగు యజనయాజ
నాధ్యయనాధ్యాపనములు నాల్గును దంభములుకాని యథార్థములు
కానేకావు

దానప్రతిగ్రహణములు రెండునుమాత్ర మీలోకవ్యవహార
మున నుండకతీఱదుకనుక నారెండే సత్యములని యెల్ల రెఱిగినదే.
దాన మనగాం బనికిందగినకూలి. ప్రతిగ్రహణమనంగాం గష్టార్జిత
మును గుడుచుట తనకుం గావలసినపని న్సరిగాం జేసినవారి కేవలసిన
ప్రతిఫలము దానము తనకష్టమునకుం దగిన ద్రవ్యమునుమాత్రము
పుచ్చుకొనట ప్రతిగ్రహణము ఈదానప్రతిగ్రహణము లనంగా

నిచ్చిపుచ్చుకొనుటలు పనిచేయించుకొనువారును బనిచేయువారు నన్యోన్యైకమత్యము జరుపుకొన్నపు డీలోకవ్యవహారమంతయును సరిగా నడుచును కావలసినపని చేయించుకొనునేర్పును పనిచేయు నేర్పును మఱెంతపని కెంతప్రతిఫల మీవచ్చునో యేపని కెంతప్రతి ఫల మడుగఁదగునో యాచొప్పున జగముతోనే పెద్దలు పిన్నలకుఁ దాము చేసి చూపించుచున్నారు పనిచేసి పెద్దలు చూపించినపుడే సరిగా గ్రహింపఁగలపిన్నలు కోటికొకరైన లేనపుడు "పట్టపగలు చేయిపట్టుకొని లాగినపుడే రాని దమావాస్యనాఁటి చిమ్మచీకటిలో నామడదూరమునుండి కన్నుగీటిన వచ్చునా" యన్న ట్లీపుస్తకము లక్షరములు వ్యాకరణములు తర్కములు కవిలెకట్టలు పంచాంగ ములు తిలకాష్ఠ మహిషబంధనములవల్ల యథార్థజ్ఞాన మెన్నియుగము లైన నొక్కరికైనను ముమ్మాటికి న్లభించదు లభించదు ధర్మమును దా నడిచి పిల్లల కగపఱచినవాఁడే యాచార్యుఁడుం బెద్ద యగుఁగాని పుస్తకములు జన్నిదములు నామములు ధరించినమాత్రముఁ దా ధర్మవేత్తననుకొనుఁడు బొత్తిగా వెఱ్ఱివాఁడో లేక తెలిసీ తెలియని దురహంకారపూతుఁడో లేక కేవలము మోసకాఁడో యైయుండక తీఱదు పిల్లికిఁ జాంద్రాయణవ్రతమువలె నక్కకేకాదశిపారణము వలెఁ గేవల నిద్రాశననిధువనపరులగు సంసారులకు యజనయా జనాధ్యయనాధ్యాపనములుగాని మఱి యట్టిపరమార్థజ్ఞానచిహ్నము లగు జన్నిదములు నామములు జపతావళములు మడిమైలలు జాతి పద్ధతులు షోడశసంస్కారము లివన్నియును గేవలపంథకృత్యములే నిక్కముగా సాధనచతుష్టయసంపన్నులగు ముముక్షువులకు మాత్రమే యజనయాజనాధ్యయనాధ్యాపనము లుద్దేశింపఁబడినవి కాని స్వార్థ పరులు కుక్షింభరు లగు సంసారుల కెంతమాత్రము న్గానే కాదు ఆకస్మికముగా విజనప్రదేశమున నడవిలో నొండొరున్గలిసికొని

పరస్పరప్రేమానురాగము లగపర్చిన నవవయోవంతులగు స్త్రీపురుషు
లోకసంతానము గన్నవఱకుమాత్రము సంభోగసౌఖ్యమున నోలలాడి
తక్కిన తమజీవనము గడుపుకొనుటకొఱకై మాత్రమే యీయజన
యాజనాధ్యయనాధ్యాపన ముద్దిష్టములైనవిగాని సంఘములుగాఁజేరి
గ్రామములందు నిరంతరవిషయభోగతత్పరులై నివసించుమనుష్యులకుఁ
గానేకాదు గ్రామవాసులగు మనుష్యులందఱికిని గేవలము దానప్రతి
గ్రహములు రెండుమాత్రమే చెప్పఁబడినవి దాన మనఁగాఁ దోడి
పాటివారి కుపకార మొనర్చుట- ప్రతిగ్రహ మనఁగాఁ బ్రత్యుపకారము
నందుట- తోడిపాటివారికొఱకై పండించి యిళ్ళు వాకిళ్ళు కట్టి వండి
వడ్డించి బ్రతుకు హాయిగాఁ గొనసాగించుటకై తగిన యన్నివిధముల
పరిచర్యలు చక్కఁగా నెఱవేర్చుట దానము- తా నెల్లవిధముల
నొరులమేలునకై త్రికరణశుద్ధిగాఁ గష్టపడుచు నొరులచేతఁ దగిన
ప్రత్యుపకారమందుచుంట ప్రతిగ్రహము ఈ దానప్రతిగ్రహమును
సరిగా నడుపఁగలవారే సాధనచతుష్టయసంపత్తి బొందఁజాలి
ముముక్షువులు కాఁదగి యజనయాజనాధ్యయనాధ్యాపనముల న్వాన
ప్రస్థాశ్రమమునఁ జరించి "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అను
తీరుగాఁ బరమార్థవేత్తలు కాఁగలరు కావున మునులు, గ్రామవాసు
లకుగూడ క్రమక్రమముగా దానప్రతిగ్రహముల స్వృతకృత్యులైన
వారికిమాత్రమే యజనయాజనాధ్యయనాధ్యాపనములు- మీరు
ముముక్షువులై వానప్రస్థాశ్రమనియమములను వహించ యడవిలో
నాచరింపవలసి యుండుననిమాత్ర మాచార్యముఖమున వెల్లడిం
చిరి కన్నున్నట్లు పైవారనుకొన్నఁజాలునని గ్రుడ్డివాఁడు గాజుకన్నులు
పెట్టుకొన్నట్లే గ్రామవాసులయిన సంసారులు యజనయాజనాధ్యయ
నాధ్యాపనము వెల్లడించుచున్నారు పైకిపటారము లోపల లొటార
మన్నట్లున్న వీదంభుల షోడశసంస్కారములు వేయేల యీపుస్తకము

లీపంచాంగము లీవేదశాస్త్రము లీచాతుర్వర్ణ్య పద్ధతు లీయజనయా జనాధ్యయనాధ్యాపనము షోడశసంస్కారము లీసంస్కృతగ్రంథము లీగడబిడలన్నియును గేవలదంభకృత్యములే

"స్వ్యస్వ్య నేస్వ్యనాని హేమత్స్వ్య" జహా! యేమిసంస్కృతభావ? ముళ్ళకంచెమీఁదనడిచిన ట్లెంతసుఖము! నోటికినిక్కముగా బ్రతుకంతట నక్కరయగు మెత్తని తీయని యచ్చతేట తెనుఁగు నాటుమాటాడ నేర్చినవారు తెలియనివారా? "హేమత్స్వన" అని యెంతో పీంట్రించుకొన్న సంస్కృతమో "నా తెడ్డు" యనే కదా? ఈ సంస్కృత మీవర్ణపద్ధతు లీయజనయాజనాధ్యయనాధ్యాపనము లీషోడశసంస్కారములును హాత్తిగా మచ్చుమాసినన్గాని యిచ్చిపుచ్చుకొనుటలు సరిగా నడువనేరవు మఱి యిచ్చిపుచ్చుకొనుటలు తిన్నగా జరుగనంతవఱకు నెవ్వరు నెడతేఱనేరరు నేరరు ఏమియును జదువనిగొల్ల డెప్పుడు వానగురియునో తనగొఱ్ఱెలనడువడింబట్టియు, నెప్పుడెంత ప్రొద్దో ఎట్టగా యుపు బట్టియు నేతెవుళ్ళ కేమందో, తనతలిదండ్రులమాటలఁబట్టియు మిన్నమిన్న ట్లెఱిగి షట్కర్మ నిరతులకన్న వేయిరెట్లు హాయిగా బ్రతుకుచుంట కనిపెట్టియున్న సోమరితనమునకలవడి పనిచేయనోడి పోకిరిమాటలం బలికిమాలిన వ్రాతలం బ్రొద్దుపుచ్చు టాటోటుచక్కరితేటా బ్రముచ్చులకన్న పసులు నయము, చెట్లు నయము, రాలు యమె తమోస మెంత జూటక మెంతనగుబా టీషట్కర్మషోడశసంస్కారవృథాయాసము? తమ చిన్ననాఁటి తీయని తెలుఁగుమాటల యలవాటుతప్పి మంచినీరు మాని వెఱ్ఱినీళ్ళకలవడిన చెదుగులవలె తెక్కలెఱుఁగొన్న మాటకారులవలె నంటించుకొన్న వేల్పుబాసచదువు బడాయిచూపు తెలిసీ తెలియనివారికొఱకై తత్సముమువ్రాయక తీఱదుగనుక కేవల లోకోపకారపరాయణులు లతీంద్రియద్రష్టలు పరమకారుణికులు పూర్ణ

లోకాప్తులగు గౌతమవ్యాసాదిమునులేర్పరిచ్చినధర్మపద్ధతులు స్వార్థ
పరులకుఁ గోఁతి చేత కొబ్బరికాయవంటిదేకదా ?

ఊరికి జోగి వెఱ్ఱి, జోగి కూరు వెఱ్ఱి అన్నట్లు సంసారికాని
జోగి యూరికి రానేరాఁడు మఱియు సంసారములోనున్నవాఁడుజోగి
కానేకాఁడు కాఁబట్టి విరాగులమని జోగులమని సన్న్యాసులమని
పరమహంసలమని యవధూతలమని వేదాంతులమని మతగురువుల
మని పీఠాధిపతులమని గురువులమని యుపదేష్టలమని శ్రోత్రియుల
మని యజ్వలమని బ్రాహ్మణులమని మడికట్టుకొన్నవారమని తప
శ్శాలురమని యెక్కువజాతివారమని శ్రేష్ఠులమనియుం బామరుల
మోసపుచ్చుచు మూఁకరిసోమరిపోతునాలిమ్రుచ్చులు తప్ప నొరుల
కష్టార్జితమగు సొమ్ము గుడుచుచు నూళ్ళ సంచరించనే సంచరించరు
నిక్కముగు విరాగులు గ్రామములకు రానేరాక విజనప్రదేశములగు
కేవలారణ్యములందే యదృచ్ఛాలాభసంతుష్టులయ్యేదరు ముంజేతి
కంకణమునకద్దమేలా ? కాషాయవస్త్రములు కౌపీనములు జడలు
గడ్డములు వికృతవేషరూపములు చేఁత గుండచిప్ప కట్టెలు
పావకోళ్లు దమ్మపడకలు వెఱ్ఱిమొఱ్ఱి కేకలతోఁ నా మాత్మజ్ఞాన
వంతులమనియుం బరమార్థవేత్తలమనియు నవశవ్రతులమనియు
నూళ్ళం జొరఁబడు కనికిమాలిన సోమరిపేలుడుగట్టుం దెవ్వళుల
నుపద్రవజంతువులను బాఁఅదరుమని ట్లింట నడుగుపెట్టనీక బుద్ధిమంతు
లగు సంసారులడవికిఁ దన్నితగిలివేయవలెను ఇల్లువాకిలి భార్యపిల్ల
యిరుగుపొరుగు నాజ్ఞయడ్డు మర్యాద పెద్దవన్న మంచిచెడువడి
పొలమువ్యవసాయము కాయక్లేశము కష్టార్జితమున బ్రతుకుట తోడి
పాటివారికిఁదోడుపడుట యొరులను సుఖపెట్టిజనసమ్మతముగాఁ బతుకు
సౌఖ్యమునొందుచు సంచరించుట మొదలగు కట్టుబాట్లు గలగృహస్థ
ధర్మమాచరించుటకన్న మనుష్య లిహపరములందరించుట కింకొక

యుపాయము ముమ్మాటికి న్లేదు లేదు లేదు- ఇంద్రియప్రత్యక్షము
లయినసంగతులు తోడిపాటిజనులు పెద్దలలో నూటికి డెబ్బదియైదుగు
రొప్పుకొని యాయాయిచోట్ల జగత్తునఁ దమపిన్నలకు నిక్క-
ముగాఁ దాము రూఢిగాఁ దెలిసినసంగతులని బోధించిన
యతీంద్రియ వస్తువులు తప్పఁ దక్కిన యతీంద్రియములను
గూర్చి యూహించి పెద్దలు చెప్పినసంగతుల న్గూర్చి తెలిసి
కొనుటకై స్వస్వవిహిత సంసారకృత్యములు మానుకొని యెవ్వఁడో
రొక పిచ్చివాఁడుగాని మోసగాఁడుగాని తనకుఁ బ్రత్యక్ష
మయ్యెనని యొక లేనిపోనిదయ్యమును గూర్చి చెప్పిన దంతయును నిజ
మని నమ్మరా దొకవేళ యట్లుండవచ్చునని యుక్తిచేత నమ్మకొనినను
దనతోడిపాటివారి కుపకారకమగు సాంసారికధర్మమును విడుచుకొనుట
స్వప్నచింతవలెఁ గావలసినపని చేటునకుఁగాని మఱెందుకుం గొఱ
కాదు అతీంద్రియకారణము లతీంద్రియకార్యక్రమము నూహించుట
కధికారు లడవిలో దపసుచేసికొనుమునులే ఏది సంసారమున జరుగ
వలసినదో మఱియును మర్త్యజీవనమున కెంతయవసరమో యీజగ
మున నెప్పు డెట్లేది జరుగకతీఱదో యట్లే యగుచుండును మనుష్యులు
తమలోఁదామందఱు న్గలసిమెలసి పొందిపొసఁగి యన్యోన్యప్రేమాను
రాగముల సంచరించుటమాత్రమే సంసారమున నవశ్యకర్తవ్యమగు
విధి- కాఁబట్టి బుద్ధిమంతులగు మనుష్యులు లేనిపోని గగనారవిందవర్ణ
నములకుఁబూనుకొనివనికిమాలినమాటలు వ్రాఁతలుపుస్తకములన్నియు
గట్టిపెట్టి కూడుగుడ్డలు కష్టార్జితముగా సంపాదించుకొని గృహకృత్యము
లన్నియును స్త్రీపురుషులందఱును నెఱవేర్చుకొను నేర్పు సంపాదించు
కొని సకలజనసమ్మతముగా నడుచుకొను నన్యోన్యమైత్రిం బరఁగుచు
నాకస్మికములు దైవికములగు నీతిబాధలనుండి కాపాడుమని లోక
బాంధవుఁడును బ్రత్యహప్రత్యక్షుఁడగుసూర్యభగవానులకు నిద్రలేచిన

వెంటనే ప్రొక్కి హాయిగా బ్రతుకుటమిక్కిలి దొడ్డబుద్ధి జనులందఱి
కన్యోన్యమైత్రిం జెఱచి పరస్పరద్వేషమును స్వార్థపరతను హెచ్చించు
మతగ్రంథము నబూర్వాచారములను వేషభాష యందలి కట్టుబాట్ల
నన్నింటి నాయాయి దేశము నుండి బుద్ధిమంతు లేకీభవించి యహింసా
వ్రతానుసారులై బహిష్కరించకతీఱదు దయామయుఁడగు భగవం
తుఁడు వేదశాస్త్రములెన్నియుం బ్రజలు పరస్పరప్రేమానురాగము
లతో సర్వజనసామాన్యభోగభాగ్యము లనుభవించి యిహపరముల
నరించుటకొఱ కేర్పఱ్చెనుగాని యొండొరులు కలహించి బ్రతుకు
సౌఖ్యము చెఱచుకొని నిరయభాజనులగుట కెంతమాత్రము న్గానే
కాదు తెలిసీ తెలియని మొఱ్ఱ నీ కెందు కీయవస్థ? దైవసంకల్పముచొప్పు
న నే కాలమున కెట్లుండవలయునో యాతీరుగానే జనుల వేషభావలు
మఱి సకలాచారపద్ధతు లుండకతీఱదు నీయిష్టానుసారముగా గాలివాన
లును గ్రహగతులును ఋతువులును దేహధాతుల యుత్పత్తిస్థితినాశము
లును మొదలగు సహజ ప్రకృతిపద్ధతుల న్మార్పనప్రయత్నము
నుంతయు న్మార్పలేవుకదా! ఎప్పు డెట్లు జరుగవలయునో
యట్లే జరుగుచున్నది పదుము నీకేతువుపెట్టరా ఉబార మెందుకు!
నీమనసు నీయిష్టానుసారము నీవే దిద్దుకొన నొక్కింతయును సమ
ర్థుఁడవు కావుకదా! కాలగతులు తప్పింప నీతరమా? యెందుకు
నీపిచ్చివ్రాఁతలు కాగితములు కలము లంజనములు చేటు వ్యర్థవ్యయ
ప్రయాసములు నీకేల "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అను తీరుగా
యెట్లేది జరుగుచున్నదో కనిపెట్టుటన్దప్ప నీకర్తృత్వము మఱెందును
లేదని తెలిసియుం దెలియనట్లు వృథాభ్రాంతి నెందు కల్లాడెదవనఘా
మాయాప్రతికక్షీ! చూడు యీఁడు మదిరినమున వ్యుఁడు సహజమునకా
వ్యత్వగుణప్రధానుఁడయ్యును నేని వగచినలాభము లేదని యూషిగాఁ దెలిసి
కొన్నప్పటికిం బ్రాణిహింసకొప్పఁడు. మఱితనతోడి పాటివాఱందఱును

కూడఁ దనవలె సత్త్వగుణప్రధానులై పరస్పరప్రేమానురాగముల హాయిగాఁ బ్రతుకుచుండుటకై సంతతము న్గోరుచుండును మఱియుం బరస్పరప్రేమానురాగములతో స్వార్థపరతమాని తనతోడిపాటివారం దఱును సమానభోగభాగ్యముఁ హాయిగాఁ గలసిమెలసి సుఖముగా నెట్లు జీవించగలరో యట్టియుపదేశము నొరులు వినినను వినకున్నను పల్కులన్ వ్రాఁతల నిట్లు వెల్లడించుచుండును స్వార్థపరుఁడవై నీవు నీ తోడిపాటివారికన్న ధనము విద్య కులము బలములందు శ్రేష్ఠుఁడని పించుకొనుటకు తంటాలుపడుచుంట నీకెట్టిస్వభావమో నీవంతశ్శత్రువుల జయించి సత్త్వగుణప్రధానుఁడవై నన్ను నీతో సమానునిగా ననుగ్రహమునఁ జూచెదవేమో యిట్లు వ్రాఁతల నీమనసుగరఁగించుటకై కలమునఁ గన్నీటిసముద్రముల న్గల్పించుట నా స్వభావము. జనులంద అన్యోన్యప్రేమానురాగములతోఁ గలసిమెలసి దేశకాలపాత్రానుసారముగా బ్రతుకుటకై పెద్ద లేనాఁడో పన్నినవాక్యములే వేదములు కావునఁ బౌరుషేయములు కృత్రిమములేగా; పంచభూతములవలె సహజములు కావు కాఁబట్టి వేదములు వేదాంగములు మొదలష్టాదశవిద్యలన్నియును ధర్మసంగ్రహార్థమై బుద్ధిమంతులున్ సర్వలోకహితైషణులగు ప్రాచీనులు పన్నినపన్నాగములే. కాఁబట్టి దేశకాలపాత్రానుసారముగా వర్తమానకాలమం దష్టాదశవిద్యల న్గల్పించుకొనవచ్చును

## బ్రతుకుతెరువు

సకలజనసమ్మతమైన వర్ణకలవారి కొఱకు మాత్రమే శ్రౌతస్మార్తకర్మములు విధింపఁబడెనుగాని ఒరులకష్టమున బ్రతుకునాలిముచ్చుపోమరిపోతు బూకరిగాండ్రకొఱ కెంతమాత్రము న్గానేకాదు

బ్రతుకున కవశ్యమగు కృషి వాణిజ్యము పశుపాలనము- దుష్ట శత్రుమర్దనచాతుర్యము గృహవస్త్రాద్యవశ్యజీవనసదుపాయవిరచనా చాతుర్యము- సకలశిల్పకళాకౌశలము తోఁ దనతోడిపాటివారి న్సుఖ పెట్టి తానుసుఖపడనేరనివాఁడు కేవలపరమార్థబోధకములగు వేద శాస్త్రాభ్యాసమునకును శ్రౌతస్మార్తవిధానములు జరుపుట కెంతయు న్పనికిరాఁడు పనికిరాఁడు- తెనుఁగెఱుఁగని సంస్కృతంబు తెన్నెఱుఁ గున్- నేర్చుకొని నెఱవేర్చుకొనకతీరని సంసారికృత్యములే చేతఁ గానివారికిఁ గేవల పరమార్థసాధకములగు శ్రౌతస్మార్తకర్మము లాచరించు నేర్పెన్నటికి న్గుదురనే కుదురదు- ఉట్టికెగరలేనమ్మ స్వర్గ మున కెగ్గెగురునుగీవంచకులుటక్కరులుతుంటరులుదుర్వ్యసనాసక్తులు కేవలస్వార్థపరులుకర్తవ్యాకర్తవ్యవివేకము లేనితెలిసీతెలి యునిజ్ఞానలవ దుర్విదగ్ధులుతప్ప-జపము లువిడిచిలొట్టలకుదిగుపట్లు దనతోడిపాటివా రును దానును సుఖముగా పరస్పరప్రేమానురాగములతో బ్రతికి నెఱ వేర్చుకొనఁదగిన సుఖజీవనోపాయములను సంపాదించుకొనుటమాని గగనారవిందవర్ణనమగు కేవలపారలౌకికప్రయోజనములగు శ్రౌత స్మార్తకర్మాచరణమేలా? తనతోడిపాటివారి న్మోసపుచ్చికష్టపెట్టక తనకష్టార్జితమునఁ దనకుటుంబము ను సంతోషపెట్టి తా సుఖించినఁ జాలును- కేవల ముముక్షువులకుమాత్రమే యుద్దిష్టములగు పరమార్థ విచారణము మాలయుల్లో మంగళాష్టకములవలెఁ గేవలన్నిద్రాహార విహారసౌఖ్యసంపాదన ప్రయోజనమగుసంసారమునవిష్ఫలములగుట యేగాక నగుబాటుకూడ గాదా? కాఁబట్టి వేదవేదాంగవేత్తలమనియు శ్రౌతస్మార్తకర్మనిష్ఠాపరులమనియు స్వర్గమునకుఁ దమకున్నైత్తె దే యొడమనియు తమ భాష సంస్కృతమనియు నితరులభాషయపభ్రంశ మును మ్లేచ్ఛితమనియుఁ దమ్మునుత్తపుణ్యమునకే కూడుగుడ్డలిచ్చి

యందఱికన్న ముందుగా నాదరింపనివారందఱును నాస్తికులుంగులటా
ప్యులనియు అనువారు ఉపరనిమిత్తంబవాఙ్కృతవేషమన్నట్లు అవివేకులు
పామరులుం బిచ్చివారను మఱియుం దమ్ముఁను ఊముఁపట్టగావించుకొని
లోకులను బెదరించి బ్రతుకనెంచిన మోసకాండ్రు

అట్టివారి మాటలిట్లుండును - ఓహో సెట్టిగారు! నే నేమని
మనవిచేసెదను నేను సోమయాజులనుగదా, యబద్ధమాడను చిత్త
గించితిరా నాపిలుక, నానామములు, నాచేతితడియుంగవస్త్రము, చిన్న
కాగిజారీయును ఒక్కపూఁటే నా భోజనము రాత్రి వాసెనపోతే,
దానిలో నంచుకొనుటకుఁ బప్పు పచ్చి ఖర్జూరుగాయలు, ఫలాహార
మైనపిణ్ముట దొరకినన్ని పాలు నాసోమిదేవికిఁ బదాజేండ్లవయసు,
నాకిపుడు డెబ్బదవపడి నేను బెండ్లాలవులి నిదివఱకైదుగురుని మాట
దక్కించుకున్నాను ఇపుడు ముసిలిబోసివులినై యీపెను మీవంటి
ధర్మాత్ములసహాయము చేతఁ బెండ్లాడి ఎల్లలననుచున్నాను కాఁపుర
మునకు నే బొత్తిగాఁ బనికిరానైనప్పటిఁ గర్మచెడిపోదా? కాఁబట్టి
మా శ్రోత్రియులలో "నూఁపరివిడుచుచున్నప్పటికిఁ బెండ్లాడు మా
దిక్కుమాలిన చావు చావక తీఅనిగూనివంపు మరియాద - అని
అందును సరే యావల నగ్నిహోత్రము వేళ యగుచున్నది చిత్త
గింపుడీ, మహానుభావుని పురమందలి శ్రోత్రియులు షట్ఛాస్త్ర
పండితు లందఱను మీతరణోపాయమునకై తెచ్చినాము చూడండీ
యీమహాత్ముఁడు వేదమందు రాజసూయాంత శ్రౌతకర్మములు, పితృ
మేధాంత స్మార్తకర్మములు చేయించుటలో నింతవాఁడదివఱకు లేఁ
డిఁక ముందు పుట్టఁడు- వ్యాకరణమా పతంజలే- తర్కమా గౌత
ముఁడే- బుద్ధికి బృహస్పతిం జంపి పుట్టినాఁడు- వేయేల సర్వతస్స్వ
స్వతంత్రుఁడు దర్శనములన్నియును ముమ్మాటికి సకలవేదశాస్త్రము
లన్నియు నిమ్మహాశయునిసొమ్మలే "పుంభావ సరస్వతి శుభ్రశు

రథఫల ప్రాముఖ్యాఖ్యాన ప్రఖ్యాక్షర క్షుభిత క్షుణ్ణావచ్ఛేదా
వచ్ఛేదకావచ్ఛిన్నఖఫయ్ - వసనర్ - మత్స్ఫ్రిన పరిష్కృత
ప్రకృతిపురుషచతుర్వింశతి తత్త్వాకాశవంచాంగానాహత మణిపూర
స్వాధిష్ఠాన బ్రహ్మప్రళయ సమాధ్యుచ్ఛిష్ట ప్రమాణ ప్రమేయ
సంశయ సంశయద్రవ్యగుణ విక్షేపణావక్షేపణాది కర్మాభావ
సమవాయకారణచక్రకదోషా నవస్థావస్థానుప్పగ్గదురారూఢ దాష్ట్యే
షేత్యేత్యావహ పలాశఖాంఛినత్వా దర్వీ హోమ పురోడాశ స్విష్టకృ
ద్భక్షణమదమత్తాంబాంబాలికేన కశ్చిన్మాంయభ్యత్యశ్వకంవినాశాలా
ప్రవేశావభృథస్నాన యజ్ఞోపవీతసూత్ర నిష్పీడనోదకంత్రిఃపరిషిచ్య
'భూర్భువస్సుః' మంత్రిప్రాణాంత షోడశ వైదికస్మార్తపద్యాం
బ్రహ్మాస్మి'యేమిచెప్పుదుసెట్టిగారూ! యిమ్మహాత్ముండవతారపురుషుం
డాలాగుకాదు సాష్టాంగపడవలసినదే చూచితిరా యీయూరి వేద
వేదాఙ్గవేత్తలను మేముండఅను మాతోనే యిప్పటికిఁ గొంత
బ్రాహ్మణ్యము నిలిచియున్నది చిత్తగించండి బ్రాహ్మరథశ్రోత్రియ
శిరోమణి మహామహామహామహోపాధ్యాయ పండితసార్వభౌముని
క్రింపడుగు పెట్టనీ మాపౌండరీకయాజులుగారి కిపుడు డెబ్బదేండ్లు
దాఁటినవి గాని యింకను చేయవలసిన మహావ్రత మొక్కటియే
తరువాయి ఇంతలో గ్రహచార మపత్నీకుఁ డయ్యెను- సపత్నీకుఁడు,
కాని యజ్ఞము చేయనర్హుఁడు కాఁడోహో మీతాతతండ్రులు-
కుబేరునకైనఁ గొంతకలదుగాని మీరు సర్వసంవత్సమృద్ధిమంతులు-
"అగ్నిమేవవరూథంకృత్వా"అని యన్నాఁడు- మీవంటిధర్మాత్ము
లీమహావ్రతకర్మ సకలజన బాహాటముగానలిపించకతీఱదు-మీభాతమ్ము
చూచినారా! లక్షరూపాయలు నగదున్న దొకవైదికునకైన
మీరొసఁగిచ్చినాఁడా "వేదవిదే ఖలు దత్తం దత్తమ్" అన్నాఁడు

వదునాల్గేండ్ల కన్యక లోనసాలుకీఁడుచున్నది పుస్తె ముడివేయుటే తరువాయి. రెండువేలరూపాయలునగలకు నాల్గువేలరూపాయలలో తీరా వేయుటకు కావలె నింతవండితుఁ డవత్నీకుఁడై శతవృద్ధిరపవృత్తి కుంటకు బ్రాహ్మణ్య మిష్టపడ దీపుణ్యము మీరు దక్కించుకొన వేమయ్యా కుబేరుఁడవు నీకొకపూఁట తాంబూలముపాటి నెలవ్రే దీయాఱువేలరూపాయలను" - అని

## విశ్వహితకాంక్ష

అఱువదిలక్షలసంవత్సరముల కొకమాఱు క్రమక్రమముగా సూర్యునకు మర్త్యలోకమంతయును దగ్గరయై యొక్క క్షణములో భస్మమై యాకసంబున నంతర్హితమగును పిదప నాసూర్యగోళము కూడ వాయ్వగ్నిజలపృథ్వీతత్త్వము లన్యోన్యము కలిసి ఘనీభవించి సముద్రములు పర్వతములు నదులు వనము లాకాసమునఁ గల భూమండలముగా నేర్పడుచున్నకొలంది నెనుబదినాల్గుకోట్లజీవరాసులు నానావిధోద్భిజ్జస్వేదజాండజజరాయుజదేహులు "ధాతా యథా పూర్వమకల్పయత్" అను శ్రుతిచొప్పునఁ బ్రత్యేకముగా స్త్రీపుం వ్యక్తులేర్పడి ఋతుధర్మమునను సరించి యుద్భిజ్జములందు స్వేదజము లందు నండజములందును జరాయుజములందుం బొడము కీటసరీసృప పక్షిమృగమనుష్యజాతిదేహములందు సమానాకారములనున్న స్త్రీ పుంవ్యక్తులు ఋతుధర్మానుసారముగా మిథునములు పుట్టుకొలది తమపోల్కి స్త్రీపుంరూపసంతానము గన మొదలిడును సమానముగాఁ బుట్టిన కీట సరీసృప పక్షి మృగ నరులు దేవదానవు లనంబడు మొట్టమొదట స్త్రీపుంవ్యక్తుల పరస్పరసంభోగముతలనఁ గలిగిన

దేహధారులు ద్విజస్వేదజాండజజరాయుజప్రాణులు మర్త్య లోక
వర్తియామర్త్యజీవులు సృష్టిమొదలు ముప్పదిరెండులక్షలయేండ్ల
వఱకున్న కాలము కృతయుగము. తరువాతకలిగిన దేహధారులు
పదారులక్షలయేండ్లవఱకు న్వెలసిన కాలము త్రేతయుగము పిదప
నెన్మిది లక్షలవత్సరములవఱకుఁగల సకలజంతుసృష్టికాలము ద్వాపర
యుగము కొట్టకొనకు నాల్గులక్షలవర్షములవఱ కున్న కాలము
కలియుగము పిమ్మట నలువదిలక్షలవఱ కెట్టిసృష్టియును లేకున్న
కాలము ప్రళయకాలము ఇట్లు తుదమొద ల్గ్లెఱుఁగఁ దరము కాని
యలువదిలక్షలసంవత్సరముల గడువు లెన్నిగడచినవో లోకబాంధవుఁ
డును కర్మసాక్షియు జగచ్చక్షువునగు సూర్యునకే యెఱుక కృత
యుగమున మర్త్యధర్మము మూర కొక్కటీరుగా నుండును త్రేతా
యుగమున నొకవంతు మాఱజొచ్చును. ద్వాపరము ధర్మమున
నగమొడిదొడుకగుచు మాఱుచుండు. కలియుగమున ధర్మమంత
యున్న నగము న్నిలుకడ నెట్లుమాఱునో యామాఱుదలఁగూడఁ
జెప్పనలవికాక ప్రతిక్షణము మాఱుచు నొక్కింతయును వ్యవస్థల
లేక తానురాను సన్నగిలి తుదకు నిశ్శేషముగా మర్త్యలోకముతోఁ
బ్రళయాగ్నిపాలై నశించును. చెట్టుచచ్చెదుకాలమునకుఁ గుక్క
మూతిపిందెలన్నట్లు "కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణసంకరః"
అన్నతీరుగా నిపుడు వర్ణసాంకర్యము పొడచూపెను శిష్టాచారము
లణఁగంటెను. దుస్స్వాతంత్ర్యము దురభిమానము కుతర్కము
వితంతుభావనయును బెరుఁగఁ దక్కినజంతువుల సంగతియేమోకాని
మనుష్యులంతు మర్యాద తాఱుమాఱగుచుండెను. ఇపుడా దేయ
[illegible] హేయమెద్దియో యెవఁడేజాతివాఁడో కర్తవ్యమెద్దియో
[illegible]రాక గతచినయైదువేలసంవత్సరములక్రిందటఁగూడ ప్రాచీనుల

యందు నిప్పటివారియం దచ్చటచట ముదిరిన యభావచేష్ట లున్నవని నిశ్చయించునంతదుస్థితిలో ధర్మమున్ బఁగఁగుచున్నది. దగ్గరట న్యాయముగాఁ జాతుర్వర్ణ్యమును శిష్టాచారమును నామమాత్రావశేషములయినవి ఓయీ! యెప్పటిధర్మ మప్పటి దెప్పటికిని మర్యాద లప్పటివి నీ కెందు కీయరణ్యరోదనమనినచో- "ఏటికి వంకలున్నవిగాని నీటికి వంకలున్నవా" అనునట్లు కృతత్రేతాద్వాపర కలియుగములం దెన్నఁడైన 'సోఽయం దేవదత్తః' అను న్యాయముగా నచ్చటనున్నప్పటికి దేవదత్తుఁడు మాఱెడుగా? జనులందఱు స్థలసి యన్యోన్యప్రేమానురాగముల నున్నపుడు ఆరోగ్యమయినశరీరము నకు మందవసరములేన ట్లీవ్రాఁత యవసరమే లేదు - నోర్యాని కొనుమోయీ ప్రతికక్షి! యారోగ్యముదప్పినవుడు నీ వెన్నిబింక ములు పెంకితనములు కట్టిపెట్టుకొని మొఱ్ఱో మందో మందో యనవా? ఇప్పటిజనము లేమియుఁ బోల్చపిలుకాని జన్నియ నున్నారు. నిక్కమే నారోగమే నే గుదుర్చుకొననేరనుగాని నాయిరుగుపొరుగుల పోఁడుము నంట నావారుసుఖమంట చూచుట నాస్వభావముగాన నిట్లీవ్రాఁత రొుకటుండై యిష్టులు నాతోడిపాటిమంచివారలు సుఖపడుదురుగా దొడ్డబుద్ధినలరుదురుగాక యని కోరచుంటిని ఇంతకును దేహస్మృతి యున్నదనుక నహంకార మమకారయుతుఁడై తన్ను న్దనకుంగా వేఱుగా విశ్వము స్ఫురించకతీఱదుకనుకఁ బరోపకారమున కడ్డు పడుబలు నాచారమును ద్యజించి పరోపకారకప్రవర్తనముం జేయని తనవ్రాన్కి నెఱవేర్చుమని సర్వశక్తియు సర్వకర్తయు నిర్మలాంతరంగప్రకాశకుఁడగు వాసుదేవు నహర్నిశము న్వేఁడుచు జీవయాత్రను గడుపుచు బుద్ధిమంతుఁడు లోకులందఱిచేత మంచివాఁ డనిపించుకొనును. యావజ్జీవము "సర్వేజనాః సుఖినోభవంతు" అని

మంత్రతముకన్న నగు మనుష్యుఁడు జపించఁదగినమంత్ర మింకెద్దియును
లేదు. తాఁబుట్టకముం దున్న తనస్థితివలెఁ దేహత్యాగము పిదపఁ
గలుగు తనస్థితి యేమగునో దైవమునకే యెఱుక కావున ఫలాపేక్ష
యెద్దియు న్నాని కేవల లోకోపకారమునకై తన బ్రతుకును వినియోగ
పఱచుకొను నుపాయమునే మును లష్టాదశవిద్యల నుపదేశించి రని
మాన్యాత్మకి నమ్మకొనవలయును ఇది నా నమ్మకము మఱి యీనా
మతముతో నెవ్వరైన నేకీభవించినయెడ నుపకారము పొందెదు రేమో
యని యిట్లు నిద్రాహారసౌఖ్యములైన నుపేక్షించి యీ గ్రంథమును
రచించుచున్నాఁడను సర్వాంతర్యామియగు భగవంతుఁ డీకృతి న్గౌర
వాగించుగాక

## మానవ జీవన రహస్యము

మొట్టమొదట స్వతంత్రముగాఁ బుట్టిన స్త్రీపురుషు లీడునకు
వచ్చి యన్యోన్యము ప్రేమించి కవగూడి తమకుఁ గలిగినశిశువును
పన్నెండేండ్లవఱకుఁ బెంచి యిఁక నీయిచ్చవచ్చినట్లు బ్రతుకు మని
విడిచిపెట్టి మఱి దాము కవగూడక తమపుట్టుటకును దమయన్యోన్య
ప్రేమానురాగములకును దమకుఁ గలిగినసంతానమునకును మఱియుఁ
దమవలె సృజింపఁబడిన యితరదేహధారులకును దమకుఁ బ్రత్యక్ష
ముగాఁ దోఁచు జగత్కార్యములన్నింటికినిఁ గారణమెద్దియో కనుఁ
గొనుటకై తమ మిగిలినజీవితమును వినియోగించుచు ఋషిదంపతు
లనాఁ బరఁగిరి ఆఋషిదంపతులకుఁ బుట్టిన స్త్రీలు పురుషు లన్యో
న్యము ప్రేమించి యీడునకువచ్చి పూర్వులవలె నొకసంతానము
మాత్రమునఁ దృప్తిపడయఁజాలక ఋతువున్నంతవఱకుఁ దా
మొకటఁ బ్రేమించిన పురుషునే స్త్రీ సేవించుచు నడవిలో వల్కలు

ములుకట్టుకొనుటయును బదిపదేనుగురువఱకుఁ గుటుంబములుచేరి యొక్కచోఁ గుటీరములు నిర్మించుకొని కాఁపురములు చేయుచుఁ గందమూలఫలములచేతమాత్రము జీవించుచు ఋషిసంతతివారమని తమతమమూలపురుషులను బ్రత్యహము స్మరించుకొని వారియమోనిజత్వమహత్త్వమును మఱి యొక్క సంతానముతోమాత్రమే యా పుణ్యదంపతులు సంభోగవాంఛ గట్టిపెట్టుకొని పరమార్థవిచారణచేత మాత్రమే తమజీవయాత్రఁ గడపుకొనఁగలిగినవ్రతమును గొనియాడుకొనుచుం బరస్పరోపకార మొనరించుకొనుచు నడవిలోనున్న మేఁకల నావు మచ్చికకావించుకొని పాల్పితుకుకొనుటయు దుంపలుదుకఁ బెట్టుకొనుటయు నివ్వరిపంచుకొనుటయును గావలసినయాహారపదార్థములను భూమినిబాగుచేసికొని పండించుకొనుటయును దమపాఁడిపటలకుఁ దోడుకమ్మని సూర్యచంద్రులను జుక్కలను గాలి వాన యగ్ని నీరు భూమి చెట్లు పర్వతములు నదులు మొదలగుజగమునఁ గలయన్ని వస్తువులం దొకశక్తి యెద్దియో యున్నట్లు భావించి యట్టివేల్పును దమబ్రతుకుసౌఖ్యము నభివృద్ధికావించ వేఁడుకొనుచుఁ దాము తిను పదార్థములను నావేల్పునకు మొట్టమొదట నివేదించి పిదపఁ దామనుభవించుచుం దమపుట్టుకకుం బెరుఁగుటకును మఱియు మృతికి న్గారణముగాఁ నెద్దియో దైవ మున్నదనియుఁ దా మంద అన్యోన్యోపకారము గావించుకొను చాదైవమును వేఁడుకొనుచుండినయెడలఁ దాముకోరినట్లు తమబ్రతుకు హాయిగాఁ గడచునని దృఢముగా నమ్ముకొనుచుఁ దమతమమూలపురుషుల క్రతిగౌతమవశిష్ఠకశ్యపభృగ్వంగిరభరద్వాజాది సప్తర్షినామంబులిడి తద్గోత్రభవులము తామని నలువదితొమ్మిదిగోత్రములవారై మఱిలెక్కకు మిక్కిలియైన యవాంతరగోత్రంబులం దామరతంపర జగమునందుఁ జిన్నచిన్న కొండపల్లెలందుఁ బెక్కుతావుల నివసింపఁదొడఁగిరి- జనసమూహా

మధికమయినకొలఁది శాకాహారము దొరకనిచోట్లంగూడ నివసించి
చేపలు మృగమాంసముగూడఁ దినక విధిలేనిచోట్లఁగూడఁ గొందఱు
నిసికందొడఁగి క్రిములు మొదలగునీతిశాఖం దాఁకటివెత్తిచే
జేతఁజిక్కిన శాకమునుగాని యేజంతువునైనఁగాని తుదకుఁ దమతోడి
పాటివారినిగాని భక్షించి బ్రతుకు నిల్పుకొన నాసించిరి ఈవిధముగా
మనుష్యసంఘము పెరిఁగినకొలంది జగమం దన్నిచోట్లకును వ్యాపించి
కేవలము మంచుది బ్బలమీఁదను మఱి మండుచున్న యెడారుల
యందును బర్వతములందును నదులందును నదులచేతను సముద్రము
చేతను జుట్టఁబడిన చిన్నచిన్నద్వీపములందు ఘోరారణ్యములందును
నివసించి శాకాహారమునకును మాంసాశనమునకుఁగూడ నలవాటు
పడిరి సంభోగవంఛను మానుకొనలేక ఋతురజస్సు బొత్తిగాఁ
గట్టఁబడిపోవుటకు స్త్రీలు పురుషసంయోగసౌఖ్యమున నోలలాడుచుఁ
దమ బ్రతుకులు పొడిగించుకొనుటకై యాహారపదార్థములను సంపా
దించుకొనుటకై తమపిల్లలనుగూడ నమ్ముకొనఁజొచ్చిరి భూమిని
బడించుకొనుటకై మఱి పాలకొఱకును మాంసముతినుటకొఱకై
వివిధజంతువులను మనుష్యులనుగూడఁ గ్రయమిచ్చిగాని బలాత్కార
ముగాఁగాని దొంగతనము మోసముచేతఁగాని స్వాధీనపర్చుకొను
చుండిరి శరీరబలము మఱి బుద్ధియుపాయముల సామర్థ్యముగల స్త్రీ
గాని పురుషుఁడుగాని బలహీనులను జేతకానిమనుష్యులను జంతువు
లను దనవశములోనుంచుకొని యథేష్టసుఖము లనుభవించుచుండును
జగమందుఁబెక్కుచోట్ల లెక్కింపవలనవికాని గుంపుగుంపులుగా మను
ష్యులు గూడి యొండొరులం దమవశము గావించుకొని యథేష్టభోగము
లనుభవింప నాసించి పరస్పరకలహముంగొని జయాపజయంబులసుఖ
దుఃఖంబు లనుభవింపఁజొచ్చిరి కేవలము స్వార్థపరులై కుక్షింభరులై
భక్ష్యాభక్ష్యవివేకము లేక తమసౌఖ్యముకై తమకంటె వేఱగునే ప్రాణి

నైన హింసించుస్వభావముకలవారు మనుష్యులలో రాక్షసులు
క్రవ్యాదు లసురులుం బూర్వదేవత లనంబడిరి. దేహమాత్రము
భక్షింపఁబడునుగాని స్వప్నజాగ్రత్సుషుప్తులం బరికించుసాక్షియగు
చైతన్యము దేహాతిరిక్తము నిత్యమని తెలిసి తద్దేహము నుపే
క్షించు స్వభావముకల మనుష్యులు సురలు దేవతలు మునులు
బ్రాహ్మణు లనంబరఁగిరి. తోడిపాటివారికి రాక్షసులు భీకరులు
మఱి బ్రాహ్మణు లనుకూలురు. మొత్తముపై మనుష్యులలోఁ గేవల
శాకాహారులై యేమియుచేతనైన జంతువులను జంపనొల్లక తమ
తోడిపాటివారికి సంతోషకారులైనవారు దేవతలు మఱి మాంసాశను
లై లోకకంటకులై జీవహింసాపరులైనవారు రాక్షసులు. సుఖదుఃఖము
లను రెండు నుపేక్షించి స్వార్థపరతలేక కేవల లోకోపకారపరాయణు
లగువారు మనుష్యులలో దేవతలు భూసురు లనంబడుచు నిత్యమన
స్సంతుష్టికిఁ బాత్రులై జననమరణప్రవాహరూపకసంసారమునకు
సాక్షిమాత్రులై యుదాసీనులై యరిషడ్వర్గమునకు లోఁబడక జీవ
న్ముక్తులగుచున్నారు. స్వార్థపరులై పరస్పర కలహముల నెడతెగ
కరిషడ్వర్గమునకుఁ జిక్కి సకలవిషయభోగవ్యసనమగ్నులై తమ
సౌఖ్యముకై తమతోడిపాటివారి నెల్లవిధముల బాధించుచు బుద్ధి
మాంద్యమును హెచ్చించు మద్యమాంసాశనములకులోనై సచ్చందన
వనితాదిలంపటమును వదలలేనికూళలు రాక్షసులు ఘాతుకు లాత
తాయులు నృశంసు లనంబడుచు జనభీకరులై యవివేకులై తాప
త్రయాభీలదావాగ్నికి మిడుత లగుచున్నారు తనతోడిపాటివారిదేహా
రోగ్యాభివృద్ధికొఱకును మరియును వివేకాభివృద్ధిని గుఱించియును దా
నెట్టియిక్కట్టులు సైచియైనఁ బాటుపడు వారు మనుష్యులలోఁ
బ్రత్యక్షదేవతలు భూసురులు మునులు మహాత్ములు బ్రాహ్మణులు
పండితులు నాదరింపదగు వారు కేవల స్వార్థపరులై కుక్షింభరులై

తమదేహసౌఖ్యము కొఱకై లోకులం బీడించువారు రాక్షసులు క్రూరులు దుర్వ్యసనపరులు క్షుద్రులు చండాలురు మూర్ఖులనఁ గర్హింపదగువారు- అల్పసంతుష్టులు శాంతులు మనుష్యులలో నుత్తములు మతియానపోతులు వంచకులు మనుష్యులలో నధములు- ఉత్తమాధములకు నడిమివారు మధ్యములు- సృష్టిలో మొట్టమొదట మనుష్యులందఱు గేవలముత్తములున్నకాలము కృతయుగము- కృత యుగమునందున్న మనుష్యసంఖ్య రెట్టించినకొలందిని త్రేతద్వాప రములందు మనుష్యులలో మధ్యము లధములు బొడఁజూపఁ గలియుగ మునం దెక్కడనో కోటి కిద్దఱు మగ్గురు తప్ప నుత్తములు లేనే లేరు కృతయుగమందున్నమనుష్యసంఖ్యకన్న రెండురెట్లు త్రేత యందును త్రేతకన్న నాల్గురెట్లు ద్వాపరమందును ద్వాపరయుగము కన్న నెన్మిదిరెట్లుకలియుగమునందునుమనుష్యులసృష్టిస్థితినాశము లధిక మగుచుండున "పెరుగుట విఱుగుటకొఱకే ధరతగ్గుట హెచ్చుకొఱకె తథ్యము సుమతీ" యనునట్లు కలియుగమునం దెంత విషయభోగ సృష్టి సంపాదనోపాయము హెచ్చుచుండునో స్వభావముగా నాశక సాధనముకూడ దానితోనే పెరుఁగుచుండును ఇంతకును జగత్సృష్టి మొదలు కాలక్రమమున రానురాను బితపకాలమున స్వార్థపరత ముదిరినకొలంది నీకలికాలమున మనుష్యులలో నుత్తములు నామ మాత్రావశిష్టులుకాఁగా నధమాధములలో కేవల స్వార్థపరులు మాత్రము లోకద్రోహులయి చండాలజాతిగా నేర్పడి యొక్కటియే కుక్కముఱికిగాఁ బెచ్చుపెరిఁగి యల్పాయువులై పుట్టి పరస్పరకలహ మునఁ గిట్టుచుందురు తప్పనిసరి మిన్నువిఱిగి మీఁదఁబడిన నాఁప నెవరితరము ? కాలకృత్యమును మాన్ప నేరిశక్యము ? కటకటా ! జగమం దెక్కడనో యేమూలనో యొకరిద్దఱు నాబోంట్లు "వలదు వలదన్నలారా ! మనలోమనకుఁ గలహమెందుకు? కోరికోరి యకాల

మృత్యువు పాలయ్యెదరేల ? కొంచమైననుఁ దగఁబంచి కుడువ మేలు మనుష్యులందఱు గలసిమెలసి పరస్పరప్రేమానురాగములతో సమాన భోగము లనుభవించఁగలిగినపుడు ప్రతిజనున కొకవిధమయిన నిత్య మనస్సంతుష్టి కలిగి పొదలి యందఱిని జీవన్ముక్తులఁ గావించు" నని యిల్లెంతకాలమునఁ గన్నీరు సముద్రమై యుప్పొంగ బతిమాలి వ్రాసినను నోటిమాటలం బోధించినను నిక్కముగా నరణ్యరోదన ముగా- ఘోరకలికాలము కావింపకమానదని తెలిసియునిల్లు వ్రాత వ్రాఁతలం దెల్పుచుంటకూడ సహజకృత్యమే

సరియే- యెవ్వరిరుచి యెట్లున్నను సుఖజీవితేచ్ఛ యందఱికి సమానమేకదా ? స్వాభిలషితసౌఖ్యమును సంపాదించుకొనఁదగిన యుపాయమునే పరమకారుణికులు సర్వజ్ఞులయిన గౌతమవ్యాసాది మహర్షులు వేదశాస్త్రముఖములఁ బ్రాకృతులగు మనుష్యులకు దేశకాలపాత్రోచితముగా నుపదేశించి పద్ధతులేర్పరిచిరి ఆ పద్ధతులే శ్రౌతస్మార్తవిధులుగా లోకమునననాదికాలమునుండియును మనుష్య లందఱును దేశకాలపాత్రానుసారముగా వాడుకొనుచున్నారు కాని నిక్కముగా దేశకాలపాత్రానుసారముగా మనుచేర్పఱచిన మానవ పద్ధతు లెపుడెట్లు మార్చుకొని వాడుకొనవలయునో యాసఁగతి స్వార్థపరతలేక కేవల లోకోపకారపరాయణులగు వేదశాస్త్రవేత్తలు ప్రవక్తృతానుసారముగాఁ జతుర్విధాభినయమూలముగా నిట్లు దెలుప వలసివచ్చెను "తినకరుచి, చొరకలోఁతు తెలియదు"న్నట్లూపిరియు చున్నవానికి వానిబ్రతుకు కష్టేమములు తెలియవుగా? సర్వజగత్సృష్టి లయకార్యములకుఁ గారణమగుకాలము న్నిర్దేశింప నెవ్వరికిం దరము కాదు సూర్యాదినవగ్రహగతుల ననుసరించి జగత్కార్యము లన్నియుం జరుగుచుంట సర్వజనప్రత్యక్షమైనప్పటికిని గ్రహనక్షత్ర ములకన్నింటికి న్గారణమెద్దియో తెలియఁదరముకాదు కాఁబట్టి

మనుష్యాదిసర్వజంతువు లనుభవించుకష్టములకు 'ఇదమిత్థమ్' 'అని మూలకారణము నిర్ణయింపశక్యము కాదుగనుక నట్టి మూలకారణము నకు దైవమనియు నదృష్టమనియును గర్మమనియును విష్ణుమాయ యనియుం దెలియఁదరముకాని యొద్దియొూతత్త్వమనియును వేదశాస్త్ర ములు పల్కుచున్నవని పెద్ద లనుచున్నారు భూతభవిష్యద్వర్తమాన కాలికకార్యములు కొంతవఱకు శక్తికొలంది కనిపెట్టుటకంటె మను ష్యుఁడు మఱెందుకైనను సమర్థుఁడుకాఁడు ఏపనినైనను నెఱవేర్చు టకై తలపోసి ప్రయత్నము చేయుటపౌరుషము మఱియున్నార్యమును ముగించుట దైవవశము కాఁబట్టి లోకములో జరుగుచున్న మంచి చెడ్డలకు మనుష్యుఁడేమాత్రము న్కర్త కానేకాఁడు "సాక్షీ చేతాః కేవలోనిర్గుణశ్చ" అన్నట్లు మనుష్యుఁడు కేవలము సాక్షిమాత్రుఁడే కనుక నేను నాదను నహంకారమమకారములు వ్యర్థముగాఁ బొంద రాదుకాని యట్లుపొంగుచుంబొంగుచుఁ గ్రుంగుచుంటకుఁగూడ దైవమే కారణమగుట నిస్సందేహముగాన "నానుశోచంతిపండితాః" అను భగవద్వాక్యముచొప్పున సంసారముకిటుకు తెలిసికొనునదృష్ట శాలురగు పండితులకు వేదశాస్త్రముఁతోఁ బనిలేదుగాని యహం కారమమకారదూషితులగు పామరులకు మాత్రమే వేదశాస్త్రము లుద్దిష్టములయినవి

శ్రౌతస్మార్తకర్మములన్నియు నాయుర్వేదాంతర్భూతములై మనుష్యులు నీరోగముగాఁ బిల్లలన్గని సుఖముగా నూరేండ్లు బ్రతుకు వైద్యసాధనములనే చెప్పుచున్నవి 'దధ్నేంద్రియకామస్య జుహుయాత్" అనుటచేత దధిభక్షణముచేత వీర్యపుష్టి కలుగును "ఘృతేనవర్ధతేబుద్ధిః" ఘృతపానముచేత బుద్ధి యభివృద్ధియగును " కొన్నికొన్నివస్తువులగ్నిలో వేల్చినపుడు కలిగినపొగ మొదలికిఁ బట్టినపుడు కొన్నికొన్నిరోగము లుపశమించి మనుష్యుల కారోగ్య

మిచ్చుటయేగాక యాపొగ యాకసమునఁగలిసి వర్షముగురియుటకుఁ గూడఁ గారణమగును కాఁబట్టి "యజ్ఞాత్పర్జన్యః పర్జన్యాద్వృష్టిః" అని చెప్పఁబడెను కాఁబట్టి వర్షమువలన నస్యము-సస్యముతినుటచేతఁ బశువు లభివృద్ధిపొందుచున్నవి కనుకనే "పశుకామో హ్యేతేనయజేత" పురుషప్రయత్న మీవిధముగాఁజేసిన పశువృద్ధి యగునని చెప్పఁబడెను "యో వృష్టికామో యో అన్నాద్యకామో యః స్వర్గకామః స సాధరేణస్తువీత" అనుటచేత మానవులకుఁ దమబ్రతుకు నందలి యభీష్టసౌఖ్యములు చేకూర్చుకొనఁ దగినసాధనములనే శ్రౌతస్మార్తవిధులన్నియు నుపదేశించుచున్నవి ఏదోపరమార్థము స్వర్గము చేకూరునని యాసపెట్టినగ్గాని లోకులు సరిగా నౌషధసేవ చేసి చెప్పినట్లు తిరుగరని మునులు శ్రౌతస్మార్తవిధులందుఁ జెప్పిన పారలౌకికసౌఖ్యములన్నియు నీసంసారమం దనుభవించఁదగిన సౌఖ్యములే. స్వార్థపరు లెంతమాత్రము గ్గాక కేవల లోకోపకారపరాయణులై సర్వజ్ఞు లతీంద్రియద్రష్టలగు ఋషులు వేదశాస్త్రముల నోర్చధించినటుల నడుచుకొన్నమనుష్యు లభీష్టసంపదలందెదరం దెవరు. అభీష్టసౌఖ్యములనందుటకై యుండఁజు గ్గోరక మానరుకదా? కోర్కె-నెఱవేఱుట దైవాధీనము. "దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతమ్, తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదేవతా" జగత్తునందు జరిగెడుక్రియలన్నియు నెద్దియో మనుష్యులయూహ కందని దైవమను పేరిటికారణముచేత జగత్తునందు నెఱవేఱుచున్నవి జగత్తనఁగా జంతుజాలమునకుఁ గావలసినసుఖసంపద - మంత్రమనఁగా సుఖమందుటకై చేయుపురుషప్రయత్నము. బ్రాహ్మణుఁడనఁగా సుఖసంపద యెట్లులభించునో యాయుపాయము వెల్లడించు వేదశాస్త్రవేత్త - కాఁబట్టి వేదశాస్త్రరహస్యములెఱిఁగి లోకోపకారముగ్గావించు పెద్దలేర్పర్చినపద్ధతులంబట్టి నడుచుకొన్నవా రిష్ట

పరమసౌఖ్యములం దప్పక పొందెదరు శ్రౌతస్మార్తకర్మములన్నియు
దేశకాలపాత్రానుసారముగా జనులందఱు ఆచరించుకొనక తీఱదు
తనతోడిపాటిజనులందఱికి సమ్మతముగ నడుచుకొన్న బుద్ధి
మంతుఁడు తనబ్రతుకునఁ జేయుపనులన్నియును వేదచోదితకర్మ
ములు కాకమానవు సత్యమును భూతదయయు గలవానిబ్రతు
కంతయును సకలవేదశాస్త్రచోదిత ధర్మస్వరూపకమే "సాభకే
పురుషశ్రుతేః నిధనం కామసంయోగః" అను సూత్రముచేత నిహ
పరసౌఖ్యమును సంపాదించుకొనుటకై పురుషప్రయత్నమవశ్యకర్తవ్య
మని నిర్దేశింపఁబడెను కాఁబట్టి వెఱ్ఱిమొఱ్ఱిమెట్టవేదాంతముల నట్టి
పెట్టి సర్వము దైవాధీనమేయని మాటవానకను సోమరిపోతుమాట
లను లక్ష్యపెట్టక బాగుపడఁగోరినవారందఱును సత్యదయాభివర్ధకమగు
మంచినడవడి దప్పక తనతోడిపాటివారిని సుఖపెట్టి తరింపఁజేసి
తాము సుఖపడి తరించుచున్నారు "వసన్తే బ్రాహ్మణోఽగ్నినాద
ధీత గ్రీష్మే రాజన్యః శరది వైశ్యః" అను శ్రుతులకు వసంతర్తువు
నందు సత్కార్యమాచరించినమనుష్యుఁడు బ్రాహ్మణుఁడనియు గ్రీష్మ
ర్తువునందు లోకోపకారమునకై కష్టపడువాఁడు రాజన్యుఁడనియు
శరదృతువునందు సత్కార్యమాచరించువాఁడు వైశ్యుఁడనియు బిరుదు
లందెదరని యర్థము మొత్తముపై మనుష్యులలో సత్యభూతదయల
దప్పక లోకోపకారమునకై నాల్గుపాళ్ళు పూర్ణముగాఁ ద్రికరణ
శుద్ధిగా సత్కర్మ మాచరించినవాఁ డుత్తమోత్తముఁడు బ్రాహ్మ
ణుఁడు- ముప్పాలు నడిపినవాఁడు క్షత్రియుఁడు- సగపాలు నడిపినవాఁడు
మధ్యముఁడు వైశ్యుఁడొక్కపాటిమాత్రమే మంచిపనికై కష్టపడువాఁ
డధముఁడు శూద్రుఁడని యర్థము- వేయేల సహస్రవేదశాస్త్రములు
స్వేదేలన్నియుఁగూడ మనుష్యు లభీష్టాయురారోగ్యైశ్వర్యము లనుభ
వింపఁదగినయుపాయములనే బోధించుచున్నవి ఆధివ్యాధులంటక

సుఖముగా మిక్కిలియారోగ్యాభివృద్ధికలుగువిధమున నిద్రాహార విహారములందు మిక్కిలి జాగరూకతతోఁ బ్రవర్తించినమనుష్యులు తప్ప కిహపరలోకములరెండింటినిం దరించి తమపుట్టుక సార్థక్యము చేసికొనఁగలరు ధర్మార్థకామముల సరిగా వ్యవహరింపక దుర్వ్యసన పరులైన సోమరిపోతుల కిహపరసౌఖ్యమెద్దియుఁగలుగదు కలుగదు ఉభయలోకసౌఖ్యము పొందనెంచువారు వేదశాస్త్రములను విశ్వసించి తమతమకులమర్యాదప్రకారము నడుచుకొనవలెను 'వాయవ్యం శ్వేతమాలభేత భూతికామః" అనఁగా ఆవు సరిగాఁ బాలిచ్చుటకై యద్దానియెదట దానిదూడను లాలించవలయు నట్లు లాలింపఁబడిన దూడగల యావుపాలు త్రాగినవారికి వాతరోగ మంటదని తాత్పర్యముగాని వాయుదేవతాప్రీతికై తెల్లదూడను జంపవలయునని గోమాంసభక్షకులు చెప్పునర్థమెంతమాత్రము సరికాదు- సర్వభూతదయనుబోధించు శ్రౌతస్మార్తవిధు లహింసాపరములుగాని రవంతయున్ బశుహింసను బోధింపవు మాంసప్రియులు క్రూరకర్ములగు కుక్షింభరులు పామరుల నవ్వశపర్చుకొని "పశుమాలభేత" అను శ్రుతి పశువునుజంపుట వేదచోదితమని యపార్థమును జెప్పుచున్నారు" శ్వేతమాలభేత" అను శ్రుతి మొదవు సంతోషించుటకై పాలుబితుకుకొనువాఁడు మొదట దానిదూడను ముద్దుపెట్టుకొని లాలించవలయునని ప్రతిపాదించిన యర్థమునే ముమ్మాటికి నొప్పధించుచున్నది "అథాతోఽగ్నిమాగ్నిష్టోమేనాను యజతి- అగ్నిం యజతి- సమిధో యజతి" అను శ్రుతులం దగ్నియు సమిత్తును నిక్కముగా నొకవిధమయిన యజ్ఞవిశేషములపేర్లుగాని యగ్నియుం గట్టియలుం గానేకావు "భావనాం వినా ద్రవ్యస్వరూపమేవ నాస్తిఖలు" అనుటచేత సకల భూతదయనుమాత్రమే బోధించు శ్రుతిస్మృతులు జీవహింసను బశుహింసను విధించుచున్నవని క్రూరులు మాంసాశనవ్యసనపరులగు దుర్జ

నలు తప్ప నిక్కముగా మనుష్యుఁడైనవాఁడెవఁడు నెప్పఁడుచెప్పఁడు.
“ఐంద్రమేకాదశకపాలం నిర్వపేత్ప్రజాకామః” అను శ్రుతి వైద్యనిమను
నోషధిని బదునొక్కసారి పుటముపెట్టి సేవించినవారు తప్పక పిల్లలఁ గనఁ
దగినశక్తి స్వహించెదరని యర్థము శ్రుతిస్మృతులన్నియును సకలా
ష్టాదశవిద్యలు నాధివ్యాధులు మాన్చి యాయురారోగ్యసౌఖ్యమిడు
నుపాయములనే బోధించుచున్నవి “స్వర్గకామోయజేత” అనుచోట
మిక్కిలి యారోగ్యముగా హాయిగా బ్రతుకనెంచినవారు వైద్య
శాస్త్రానుసారముగా నిద్రాహారవిహారముల సరిగాఁ బ్రవర్తింపవలయు
ననియే బోధించుచున్నవి ఇహమందు సరిగాఁ బవర్తించి దేహారో
గ్యము సంపాదించుకొననే నివారికి స్వర్గసౌఖ్యము లేనేలేదు
కాబట్టి యెవ్వరికైన నిర్దేశింపశక్యముకాని దైవమున్గూర్చి చింతింపక
కేవల పౌరుషమునే యాసరాచేసికొని వేదశాస్త్రముఖముఁ బెద్ద
లుపదేశించిన తెరువున దేశకాలపాత్రోచితప్రవర్తనమున్గొని బుద్ధి
మంతుఁ డోరులకు మేల్చేసి యెరులయనుగ్రహమును సంపాదించుకొని
హాయిగాఁ దన బ్రతుకు గడపుకొనవలయును ల్లముంబట్టి నిర్వాలు
నట్లు పురుషప్రయత్నము నప్పక దైవము వెంబడింపకమానదు

“యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతితాదృశీ” అనుట చేతఁ
బురుషప్రయత్నానుసారముగా దైవము ఫలమిచ్చునుగనుకనే దైవ
పౌరుషములలోఁ బౌరుషమే ముఖ్యము కానిచో వేదశాస్త్రములు
విధినిషేధములం బ్రతిపాదించనే ప్రతిపాదించవు దైవమే ముఖ్య
మగునెడల లోకములో శాస్త్రప్రవృత్తియే పుట్టకుండును శ్రౌత
స్మార్తకర్మముఁ యవసరమే లేకుండును సుఖాభిలాషమున్నంతవఱకుం
బురుషప్రయత్న మత్యంతావశ్యకము కాకతీఱదు అహంకార
మమకారములున్నంతవఱకుం బౌరుషమే ముఖ్యము అహంకార
మమకారము లుడిగినవాఁడు దైవస్వరూపుఁడేకనుక వానికే వేద

శాస్త్రములతో నైనఁ బని లేనేలేదు "యావజ్జీవం దర్శపౌర్ణ మాసాభ్యాం యజేత" సుఖాభిలాష మమావాస్యతో మొలకెత్తి వెన్నెలవలెఁ బున్నమతో నిండారఁబండును కనుకఁ బురుష ప్రయత్నము స్వనయభీష్టము నెఱవేర్చుకొనుటకై ప్రారంభించిన కాలము దర్శ మనంబడును మఱి యాకోర్కె సంపూర్ణముగా ఫలించినకాలము పౌర్ణమి యనంబడును కాఁబట్టి ప్రతిమానవుఁడు తన కోరిన కోర్కె నెఱవేర్చుకొనుటకై తాఁ జేయవలసినపురుష ప్రయత్నము చంద్రకళ శుక్లపక్షమునఁ బ్రతిదినము రెట్టించినట్లు రెట్టింపఁజేసికొనవలెనని యాశ్రుతియొక్క తాత్పర్యము బ్రతుకు నందలి పురుషప్రయత్నము వెన్నెల యమావాస్యనుండి తలచూపి పున్నమతో సంపూర్ణమగునట్లు దేహావసానముతో సంపూర్ణముగా ఫలించిస్వర్గమను పండువెన్నెలగాఁబరిణమింపఁజేసికొను మనుష్యుఁడే వేదశాస్త్రానుసారముగాఁ బ్రవర్తించిన బుద్ధిమంతుఁడు బుద్ధిమంతుఁడు మఱియును బ్రతిమనుష్యుఁడు యావజ్జీవము "క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" అనునట్లు విద్య యనఁగా దశతోడిపాటి వారి యనుగ్రహము సంపాదించుకొనునుపాయము మఱి యర్థ మనఁగా సుఖజీవనము విధేయోద్దేశ్యములగు విద్యార్థముల రెండింటిని బౌరుషముచేత బుద్ధిమంతుఁడు సాధించుకొని తన బ్రతుకు సార్థకమొనరించుకొనును- "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" బుద్ధిమంతుఁడైనవాఁడు నిద్రాహారవిహారము లన్నియు మముతో లోకోపకారముగానొనరుచుకొని యొరులనుసుఖపెట్టి తాసుఖ పడునని శ్రుతి తాత్పర్యము అగ్నిహోత్రమనఁగా లోకోపకారక పురుషప్రయత్నమని యర్థము ఇంతకును ఫలితార్థము దైవము- నీరు పౌరుషము తరంగమువలె- నీటియొక్కవికారము కావున దైవ పౌరుషములకు వస్తుభేదము లేనేలేదు- దైవము సత్యము పౌరుషము

మనఃకల్పితము. కావున సహజపద్ధతియగు దైవమే పౌరుషమునకు మూలకారణమని యొప్పుకొనక తెలియక మఱియును వేదశాస్త్ర విధ్యుక్తముగాఁ బ్రవర్తించినవానికిఁ దప్పక దైవమే వాస్తవము మఱి పురుషప్రయత్నమంతయును వృథా భ్రాంతికల్పితమని బోధ పడును. శ్రౌతస్మార్తవిధ్యుక్తకర్మముల నాచరించునపుడు పురుష ప్రయత్నమునఁ బ్రమాదమునకు దైవమే కారణము. కాఁబట్టి ప్రాయశ్చిత్తము ప్రమాదమొనర్చిన పురుషకారమున విధింపఁ బడెనుగాని దైవకారమునకుఁ బ్రాయశ్చిత్త మెంతమాత్రమును విధింపఁబడలేదు. పౌరుషమునకే పొరపాటుగాని నిక్కముగా దైవమునకుఁ బొరపాటు భ్రాంతియుం బ్రమాదముం బశ్చాత్తాపముం బ్రాయశ్చిత్తము నాకసమునకు వికారమువలె లేనేలేదు ఇంతకు జరిగినమంచిచెడ్డ లనుభవించుటకు మాత్రమేగాని నిక్కముగా మేల్కీడులొనర్చుటకు మనుష్యుఁ డేపాటియు సమర్థుఁడుకాఁడు. సూర్యునుదయింపఁజేయుటకుఁగాని యస్తమింపఁ జేయుటకుఁగాని యెట్లు మనుష్యుఁడు శక్తుఁడుకాఁడో యట్లే మంచిపనిగాని చెడ్డపని గాని చేయుటకు సమర్థుఁడుకాఁడు మనుష్యుఁ డేపనినైనను జరుప లేఁడుగాని జరిగినమంచిచెడ్డ లనుభవించక తీఱదు పౌరుష మేపని నెఱవేర్చలేదుగాని కడచినకష్టసుఖములను మనుష్యులచేత ననుభ వింపఁజేయును దైవము పనులన్నియు నెఱవేర్చునుగాని తా నెఱవేర్చుపనులవల్లఁ గలిగినకష్టసుఖములు రవంతయుననుభవించదు. పనియొనర్చుటమాత్రమే దైవమువంతు మఱి దైవకృత్యము లనుభ వించుట పౌరుష మనఁగా జీవులవంతు చావకతీఱని గూనివంపువలె మనుష్యాది దేహధారులు దైవకృత్యములవలనఁ దమ వచ్చు కష్టసుఖములు యావజ్జీవమనుభవించక తీఱదు

“ప్రారబ్ధకర్మణాం భోగాదేవక్షయః” అనుచోట ప్రారబ్ధ కర్మములనఁగా దైవకృత్యములని పిండితార్థము పురుషప్రయత్నము

వ్యర్థము దైవకృత్యమనుభవించకతీఱదను నిశ్చయజ్ఞానము వేదశాస్త్ర పద్ధతులంబటి పెద్దలు బోధించినట్లు పురుషప్రయత్నము దృఢముగా నొనర్చు వ్రతపరాయణు లగు మనుష్యు లెఱిఁగి "స్వభావోహి ప్రవర్తతే కాతత్ర పరివేదనా నానుశోచన్తి పండితాః" అను రీతిగా దృఢమనస్కులై యోర్మిగొని యుదాసీనులై కైవల్యమందుచున్నారు-తినకరుచి చొరకలోఁతు తెలియదుగనుక పెద్దలు వేదశాస్త్రముఖములం బోధించినచొప్పున సత్కర్మాచరణమునకై దృఢపురుషప్రయత్నము చేయఁగలవిద్వాంసులకుఁదప్ప "ఈశ్వర స్సత్యం జగన్మిథ్యా"అను సంగతి బోధపడి నిత్యస్సంతుష్టి కలుగనేరదు కనుక మునులేర్పఱచిన శిష్టాచారపద్ధతులను శ్రేయస్కాములగు మనుష్యు లవలంబించుట యవశ్యకర్తవ్యము కర్తవ్యము "స్వర్గకామో యజేత" స్వర్గ మనఁగా నహంకారమమకారములుడిగి యథాలాభసంతుష్టి యట్టి నిత్యసంతోష మభిలషించినబుద్ధిమంతుఁడు స్వర్గకాముఁ డనఁబడును- స్వర్గము పొందుటకుఁదగినయుపాయము యజ్ఞ యనఁబడును యజ్ఞ మనఁగా "యజపూజాయామ్" అనుటచేత భగవంతునిం బూజించుట యజ్ఞ మనఁబడును. పూజించుట యనఁగాఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రేమించుట- భగవంతుఁ డనఁగా నైశ్వర్యవంతుఁడుమఱి యైశ్వర్య మనఁగా సకలలోకరంజకశక్తి ధర్మ మనఁగాభూతదయ కాఁబట్టి సర్వలోకోపకారకమగునహింసావ్రతము కలవాఁడే స్వర్గకాముఁడైన సోమయాజి యనఁదగిన పుణ్యాత్ముఁడు- సరేగాని యింతకును మంచిచెడ్డలు భావనామూలములు- జగమునందు మంచియంతయును నిర్మలమగుదైవము- మఱిచెడ్డయంతయు మనోభ్రాంతికల్పితము కుందేటికొమ్మువలె నామమాత్రమగు మాయశక్తి- లోకములోఁ జెడ్డ లేనేలేదు- "హరిరేవ జగజ్జగదేవ హరి ర్హరితో జగతో నహి భిన్నతనుః" అనునట్లు "బ్రహ్మసత్యం

జగన్మిథ్యా" అన్న ట్లీదైవమే వాస్తవము మఱి పౌరుషము కల్ల యని దేశకాలపాత్రోచితముగాఁ బెద్ద లేర్పర్చిన మరియాదననుస రించి పురుషప్రయత్నముచూనక తనబ్రతుకునఁ బ్రమాదములు తటస్థించినప్పటికి బట్టినకట్టు విడువక పశ్చాత్తాపముపొంది ప్రాయ శ్చిత్తము గొనుచు సకలలోకోపకారధర్మమునఁ బ్రవర్తించువానికి మాత్రమే నిరూఢిగా సత్యము బోధపడి జీవన్ముక్తియను నిత్యమన స్సంతుష్టి లభించి యనర్థకము గు నహంకారమమకార ముపశ మించి దైవములో నైక్యమగుట సంభవించును యావజ్జీవ మగ్ని హోత్రం జుహోతి- యావజ్జీవం దర్శపూర్ణమాసాభ్యాంయజేత" అనఁగాఁ బురుషప్రయత్నము దృఢముగాఁ జేసి యారోగ్యము గా శరీరమున్గాచుకొనుటకై "అగ్నిమూలంబలం పుంసాం రేతోమూలంచ జీవితమ్-తస్మాత్సర్వప్రయత్నేన వహ్నిం శుక్రంచ రక్షయేత్' అను న్యాయముగా జఠరాగ్నిం బథ్యాశనముచేత సరిచేసికొని సప్తధాతు వులం బలపర్చుకొని ఎక్కుదేవతాకమయిన యమావాస్యేష్టిరూపక మగు శిష్టాచారపద్ధతి నడచి నిండుపున్నమవెన్నెలవలె వృద్ధిమూల మగు శతాయువు సంపాదించుకొనవలయునని శ్రుతి తాత్పర్యము సర్వలోకోపకారపరాయణులై చంద్రకళచాటునవసించుపిత్రుదేవతల యనుగ్రహముం సంపాదించుకొనుటకై "అన్నస్యక్షుధితం పాత్రమ్" అనునట్లు న్యాయార్జితద్రవ్యము నవినియోగించి భూతతృప్తి చేయు వార లిహపరసౌఖ్యముం జూఱకొందురని మొత్తముపై శ్రౌతస్మార్త విధులన్నియు నుల్లసించుచున్నవి పున్నమ యనఁగాసంపూర్ణ యౌవన మమావాస్య యనఁగా శరీరబలము బొత్తిగా తగ్గిపోయిన దేహావసానసమయము- "దర్శపూర్ణమాసాభ్యామ్" అనఁగాపున్నమ వంటి సంపదయందు నమావాస్యవంటి యాపత్సమయమందు నల్పి లేములరెండింటియందును "యజేత" పురుషప్రయత్నము సరిగాఁజేసి

లోకోపకారకధర్మమునఁ బ్రవర్తింపవలయునని శ్రుతి తాత్పర్యము ఆహారనిద్రావిహారనియమ మగ్నిపరిచర్య దివ్యౌషధములనగ్ని వ్రేల్చిన ధూమసంపర్కము మొదలగుసంపూర్ణాంగములతో విధ్యుక్తముగా భగవదారాధనచేయువారి కైహికాముష్మికసంపద కరతలామలకమని శ్రౌతస్మార్తపద్ధతులం బెద్దలు వెల్లడించినారు. సుఖాభిలాషముగల సంసారులంతయు నప్పక పెద్ద లేర్పఱిచిన కట్టుపాట్ల ననుసరించి యభీష్టసంపదలు తప్పక పొందెదరు "ఉదితే జుహోతి. అనుదితే జుహోతి" అనుటచేత ధర్మాచరణ దేశకాలపాత్రానుసారము బలురకములం గన్పట్టుచున్నది కాఁబట్టి యిద్ది యిట్లే చేయవలయు నను నియమ మే ధర్మమునకైన న్లేదు బ్రతికిన దూరు మానినది మం దన్నట్లు తనతోడిపాటివారి కుపకారముగావించిన నదుపడి యంతయు ను మనుష్యుఁడు యావజ్జీవ మాచరింపవలసిన ధర్మమే యగుఁ లోకోపకారకమగు కర్మమంతయును విధ్యుక్తముకాక మానదు" కర్తా భోక్తా జనార్దనః" అను నట్లీజగమును జగమునడిపించు వాఁడును దేవుఁడే. దేవునికన్న నిక్కముగా వేఱే యొకవస్తువును లేనేలేదు నేను నాది నా కిది కావలె నిద్ది యక్కఱలేదను తెలివి యెండమావులనీటివలె భ్రాంతిమూలముకాని వాస్తవము కానేకాదు

శోకమోహాపహాజహాతి. భిద్యన్తే సర్వసంశయాస్తస్మి న్దృష్టే పరావరే" అను తీరుగా నహంకారమమకారములు వదలినందప్ప జీవన్ముక్తి కలుగనేరదు పెద్దలు వేదశాస్త్రముఖమున బోధించిన యహింసావ్రతపరాయణునకుఁదప్ప నహంకారమమకారములు కేవల స్వార్థపరస్వోదరమాత్రపూరకున కెన్నఁడు న్వదలనే వదలవు కావున సర్వలోకోపకారకప్రవర్తనమను యజ్ఞదీక్షవహించి పెద్దలు బోధించినధర్మమార్గమున నడిచిన సజ్జనునకుమాత్రమే "త్యాగేనైకే నమృతత్వ మానశుః" అనురీతిగా నహంకార మమకారాత్మక

స్వార్థపరత మానుకొని కేవల లోకరంజనమునకై మాత్రమే తన
బ్రతుకు వినియోగించుట యనంబడు త్యాగయజ్ఞాచరణముచేతఁదప్ప
నమృతకైవల్య మనంబడు శ్రుతిప్రతిపాదితాపూర్వస్వర్గఫలము
లభించనేరదు మనోవాక్కాయకములని యజ్ఞములు మువ్విధములవి
యథాపూర్వముగా నొకదానికొకటి కారణము. "పరోపకారః
పుణ్యాయ పాపాయ పరపీడనమ్" అను పెద్దలవాక్యముచొప్పున
నొరులకు మేలుగోరుట స్వర్గదాయకమగు పుణ్యకార్యమనియు నిత
రుల న్దనసౌఖ్యమునకై బాధించుట నరకవేదనాకారణమగుపాపకృత్య
మనియుం దెలిసికొని స్వర్గనరకస్వరూపకమగు పరలోకమున్నదని
నమ్మికొని 'సర్వేజనాః సుఖినోభవన్తు" అని నిరంతరమును గోరు
చుఁట మానసికయజ్ఞము సర్వజనరంజకముగాఁబల్కుటవాగ్యజ్ఞము-
లోకోపకారకముగాఁ బ్రవర్తించుట కాయకయజ్ఞ మిట్లు త్రికరణ
శుద్ధిగా పరోపకారమును యావజ్జీవము జేయువాఁడే "యావజ్జీవ
మగ్నిహోత్రం జుహోతి"అనుతీరుగా నగ్నిహోత్రమనుపేరఁ బరఁగు
బ్రతుకనుయజ్ఞమును యథావిధిగాఁ జేయఁగలిగిన యజ్వ యనిపించు
కొని సంసారమను నరకకూపపాల్పడక నిత్యసంతుష్టియను నపూర్వ
స్వర్గసంపద న్సంపాదించుకొనఁదగును

"కర్మాణ్యపి జైమినిః ఫలార్థత్వాత్- ఫలంచ పురుషార్థ
త్వాత్- పురుషశ్చ కర్మార్థత్వాత్" అను సూత్రములంబట్టి వడ్ల
దంచుట బియ్యముకొఱకు,బియ్య మన్నముకొఱ,కన్న మాఁకలితీర్చు
కొనుటకొఱ, కాఁకలితీర్చుకొనుటకొఱకు బ్రతుకుకోరుట జీవునకు
స్వభావము హాయిగా బ్రతుకుటయే స్వర్గమనంబడును "స్వర్గకామో
యజేత" హాయిగా బ్రతుకనెంచుమానవదేహధారి యజ్ఞము చేయ
వలయును యజ్ఞ మనఁగా హాయిగా బ్రతుకుటకై తగినరీతి నన్నము
కూర్చుకొని యాఁకలిఁదీర్చుకొని సంతుష్టి పొందుట. హాయిగా బ్రతు

కుట యనుయజ్ఞముయొక్క సంభారములు ప్రయోజము లనంబడును
దర్శపూర్ణమాసయజ్ఞస్వరూపమగు మానుషజీవితమునకు సకలశ్రౌత
స్మార్తవిధులన్నియును సాధనములే దేహధారి కభీష్టజీవనమును స్వర్గ
మును సంపాదించుకొనుటకై- బియ్యమును వండుకొనుటకై యగ్ని
నీరు వంటకట్టెలు పాత్రములు పొయ్యి పొయ్యిపెట్టుకొనుటకై వేది
కాస్థలము వడ్లుదంచుకొనుటకై రోళ్లు రోఁకళ్ళు దంచుకొనుశ్రమను
మఱపించుటకైన దంపుళ్ళపాట వడ్లు పండించుకొనుటకై పొలము
పొలము దున్నుటకు నాఁగళ్ళు నక్కలు పూజాలు పలువులు నరు
గుళ్ళు బండ్లు కసరము లుడుపులు కోతలు గ్రామదేవతలు జాత
రలు కోళ్ళుగొఱ్ఱెంగోయు మ్రొక్కులీవ్యవసాయమంతయున్నదుపఁ
దగినపెద్దలువివిధములగుపనిముట్లువలె శిష్టాచారపద్ధతులు వేదశాస్త్ర
ములు శ్రౌతస్మార్తవిధానములు దేవత లాదేవత ప్రీతివిధానము
లన్నియునుసాధనములు కాగాపోయిగామనుష్యుఁడుయావజ్జీవము
యజమానుఁడనుపేరఁబరఁగిపశుకామః- పుత్రకామః- స్వర్గకామఃఅను
క్రతులంబట్టి యాధివ్యాధు లంటనికీతి పోయిగాఁ బొట్టపోషించుకొ
నకతీఱదు- కనుకనే "యజేత" అనిసుఖజీవేచ్ఛగల దేహియన్నసంపా
దకకర్మస్వరూపమగు యజ్ఞమును జేసికొనకతీఱదని శ్రుతి విధించుచు
న్నది- స్వభావమగు నాఁకలితీర్చి సంతుష్టిపొందించునన్నమును సంపా
దించుకొనుటకేర్పడిన సాధనములే శ్రౌతస్మార్తయజ్ఞకర్మములన్ని
యును ఆఁకలితీఱినపిమ్మట సంతుష్టుఁడై సుఖావేశమున నొడలుమఱచి
యానందించుచున్నపుడు- శ్రౌతస్మార్తకర్మములతోడిప్రయోజనము-
కుడిచినపిమ్మట నొంగిలివిస్తళ్ళతో నెంతప్రయోజనమో యంతే
"కామోదాతా కామః ప్రతిగ్రహీతా" అన్నట్లు కోర్కె లేకున్న
వాసుదేవునకు శ్రౌతస్మార్తయజ్ఞములతో బనియేలేదు "ఏకస్స్వాదు
పిప్పలమత్తి - ఏకోఽనశ్నన్నభిచాకశీతి" అన్నట్లు దేహధారి

యగు జీవునకే కామస్వభావముచేత యజ్ఞసాధకమగు జీవనసౌఖ్యా
నుభవాభిలాషయున్నదిగాని సర్వజగత్సృష్టిస్థితినాశకారణమైనప్పటికిని
దేవుఁడేకోర్కెయులేనివాఁడు. కావున సుఖజీవనానుభవమెద్దియు
న్లేకయే నిత్యతృప్తుఁడై ప్రకాశించుచున్నాఁడు. వాసుదేవుఁడుతప్పఁ
బ్రతిజీవుఁడు శ్రౌతస్మార్తకర్మస్వరూపకయజ్ఞము నాచరింపకతీఱదు
తీఱదు. "దేవాయజ్ఞమతన్వత. అసురావై యజ్ఞమతన్వత యజ్ఞో
యజ్ఞమతన్వత యజ్ఞేనయజ్ఞమయజన్తదేవాః" అను శ్రుతులంబట్టి
సహజముగా సుఖజీవనేచ్ఛయనుకామముతో దేహధారియగు జీవుఁడు
"స్వాదుఃపప్పలమత్తి" అనుటచేత నెడతెగక తీర్చుకొన్నకొలఁది
మఱి త పుట్టుచున్న యాఁకలి యనుతృష్ణాపాశబద్ధుఁడగుటచేతనే
సకాముఁడగుజీవుఁడు "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" అను
శ్రుతులంబట్టి యాఁకలిలేని వాసుదేవునిలోఁ జేరునవధియగు
యావజ్జీవకాలమునుం బ్రతిదినము స్సుఖజీవనముకై "యజేత"
అన్నము సంపాదించుకొనుటకు పురుషప్రయత్నము చేయక
తీఱదని శ్రుతులు విధించుచున్నవి అహంకారమమకారము
లున్నంతవఱకు సుఖజీవనసంపాదకప్రయత్నముచేయకతీఱదు అహం
కారమమకారము లుడిగినజీవుఁడు నిత్యతృప్తుఁడగు వాసుదేవుఁడే.
సముద్రమున్జేరిన నది సముద్రమేయగున ట్లాచున్నాఁడు విధ్యుక్త
యజ్ఞాచరణముచేత స్వర్గరూపుడగు వాసుదేవునిలో లయముచెందిన
జీవునకు వేదచోదిత శ్రౌతస్మార్తయజ్ఞధర్మాచరణముతోఁడి ప్రయో
జనము మఱి యుండనేరదు. మొత్తముపై లోకమున జరుగుచున్న
ప్రతికార్యమును యజ్ఞకర్మమనియే చెప్పఁబడినది కానిచో "దేవావై
యజ్ఞమతన్వ న్వ. అసురావై యజ్ఞమతన్వత. యజ్ఞో యజ్ఞమ
తన్వత.పశవోవై యజ్ఞమతన్వత. సమిధోవై యజ్ఞమతన్వత
అను శ్రుతులం బట్టియు "విష్ణుః ర్యోని మకల్పయత్.

సర్వం విష్ణుమయం జగత్" అను రీతిగా జగమంతయును యజ్ఞకర్మస్వరూపమే. కావున జగత్సృష్టినాశకార్యములన్నియును యజ్ఞములే యనఁగా దేవునిలోనుండి యీజగముత్పత్తియై తిరిగి దేవునియందే లయమగునపుడు జగత్కార్యప్రవృత్తినివృత్తివిశేషము లన్నియును యజ్ఞములే యగుచున్నవి యజ్ఞముకానిపని యేజగమున లేదు కాఁబట్టి "యజ్ఞో వైవిష్ణుః" అను శ్రుతి గల్గుచున్న దనఁగా జగమునకును దేవునకును "సత్యపిభేదాపగమే నాథ తవాహం నమామకీనస్త్వమ్, సాముద్రోహి తరంగః క్వచనసముద్రో న తారంగః "హేతుహేతుమతోరభేదాత్ - గుణగుణినోరభేదాత్" అనున్యాయముంబట్టి దేవునిస్వరూపమే యజ్ఞమా యజ్ఞమే జగదుత్పత్తిస్థితిలయ విశేషకార్యాత్మకమని తేలినఫలము మఱియును దేహధారులందఱును సకలజంగమస్థావర ప్రాణికోట్లనవరసాత్మక చతుర్విధాభినయ విశేషమంతయును యజ్ఞవిశేషమే. యజ్ఞమే దేవుఁడు దేవుఁడే యజ్ఞము. దేవుఁడే జగము. జగమే దేవుఁడు. నీరే తరంగము తరంగమె నీరు "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యముంబట్టి "హరిమయముకానివస్తువు, పరమాణువు లేదు వంశపావన వింటే" అను పురాణోక్తి ననుసరించి పశుభావనము వీరభావనము దివ్యభావనము లనుమెట్టెక్కినజీవులు జీవన్ముక్తులై దైవస్వరూపులే యగుచున్నారు. అన్ని యజ్ఞములలో జ్ఞానయజ్ఞము దేవునిలోఁ జేరుటకు మిక్కిలి చేరువదారి. జ్ఞాన మనఁగా నహంకారమమకారము లుడిగి సర్వభూతసముఁడై యహింసావ్రతపరాయణుఁడగు దేహధారియొక్క ప్రవర్తనము. తనసుఖముకై దేవులాడుట సంసారనరకము. బంధము. లోకోపకారముకై మాత్రమే ప్రవర్తించుట సన్న్యాసము స్వర్గము మోక్షము. 'యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్" అనునట్లు సంసారి చేయుచున్న మనోవాక్కాయ

కర్మములన్నియును భగవత్పూజనమే "యజపూజాయామ్. రాధ పూజాయామ్" అనుటచేత యజనారాధనశబ్దములు రెండును పూజా శబ్దాపర్యాయములే కనుక లోకములోని సృష్టిస్థితిలయకార్యము లన్నియును యజ్ఞములే కాకతీఱ దైనప్పటికి దేహధారులందఱును జంగమస్థావరప్రాణికోట్లయినప్పటికి లోకవ్యవహారము సాగుటకై మనుష్యపశుపక్షికీటస్థావరప్రాణిభేదము లేర్పర్చబడునట్లు యజ్ఞము లందు దేవపితృమనుష్యయజ్ఞాదివిశేషము లేర్పడినవి కర్మములు విధినిషేధములు రెండు తెఱంగు లీరెండు నవాంతరభేదంబుల యనంత విధముల జగమునఁ జరుపబడుచున్నవి దేశకాలపాత్రవిశేషముఁబట్టి యనాదిగా మనుష్యులం దనంతవిధనామరూపములుగా శ్రుతిస్మృతి లును శ్రౌతస్మార్తకర్మములును వ్యవహరింపఁబడుచున్నవి జగమున ననాదిగా నత్తద్దేశకాలపాత్రానుసారముగా నెల్లజీవులందును ముఖ్య ముగామనుష్యులందువ్యవహరింపఁబడుచున్న యాచారములన్నియును శ్రుతిస్మృతిచోదితధర్మములే కావుననే "యథాలోక స్తథావేద వేదాన్ స్మార్యధాతా యథాపూర్వ మకల్పయత్" అనువాక్యము లనాదిగాఁ బ్రవర్తించుచున్నవి "పండితాః సమదర్శినః" అనుటచేత సర్వజనసములై మాత్సర్యములేని సత్పురుషులు,లోకములోనివల్కు లన్నియును సర్వజగమును వాసుదేవుఁడే యనియును నిశ్చయించుకొని రాగద్వేషములు రెండును లేక నిర్విషయమనస్కులై జీవన్ముక్తులై కైవల్యానందమున నోలలాడుచుందురు

## యజ్ఞకర్మము

మొత్తముపై మనుష్యుఁ డాచరించవలసినయజ్ఞకర్మము తన తోడివారి కుపకారముగాఁ బ్రవర్తించుట యని సకలవేదశాస్త్రము సమ్మతమయిన సిద్ధాంతము అశ్వమేధమునందు జంపఁబడిన గుఱ్ఱము మాకు గడ్డి మేపఁబోవుట- మహావ్రతమునందు పందిరికూటమి

"నష్టాంకశ్చనయభతే" యను బండబూతుహాస్యములు- వేయేల యజ్ఞమిషం బ్రకటించు కామ్యకర్మమంతయు గౌణమౌపచారికమే గాని ముఖ్యమెంతమాత్రము న్గానేకాదు కవిత్వమునందు తు, హి, చ, వై లవలె నిష్ప్రయోజకములయ్యు ననాదిగా గతానుగతికములై శిష్టాచారములనియు నలంఘ్యములనియును "శతాన్ధాః కూపం ప్రవిశన్తి" అనుతీరుగా వారుచేసినారని వీరు వీరు చేసినారని వారు యేనుగుఁబోల్చు గ్రుడ్డివానివలెనసందర్భపుపనులు చేయుచు నవన్నియును వేదచోదితయజ్ఞధర్మములే యనుకొనుచు దంభులై లోకోపకారమునకుబదులు తమతోడిపాటివారి కసహ్యమును ద్వేషమును బాధను గలిగించుచున్నారు తనతోడిపాటిజనులందఱు సంతోషించునట్లు ప్రవర్తించుట తప్ప మఱి మనుష్యుఁ డాచరింపవలసినయజ్ఞమింకెద్దియు న్నమ్మాటికి న్లేదు లేదు ఒరులను సుఖపెట్టినందప్పుఁ దనకు నిక్కముగా సుఖము రానేరదు- బ్రతుకు సుఖము కోర్కె దేహధారికిఁ దప్పని స్వభావము ముంజేతికంకణమున కద్ద మేల ? యెవనిమట్టుకు వానికే తెలియును- దా సుఖింపఁగోరినట్లితరులుగూడ సుఖింపనెంచెదరని తెలిసికొనుట మానసయజ్ఞము జనరంజకముగాఁ బల్కుట వాగ్యజ్ఞము తోడిపాటివారుసంతోషించునట్లు సంచరించుట కాయకయజ్ఞము- లోకోపకారముచేయనికర్మమంతయును నిషిద్ధమే కాని యెంతమాత్రము న్విధి కానేకాదు మునులు ప్రకటించిన వేద శాస్త్రములకు కేవల కుక్షింభరులగుధూర్తులపార్థము చేసి పామరుల స్వశపర్చుకొని యెద్దుచాటునుండి కొంగలం జంపు లుబ్ధకునివలె శ్రౌతస్మార్తవాక్యములఁ బిక్కపెట్టి వల్లించి పశుహింస చేయుచు లోకద్రోహ మాచరించుచున్నారు తల్లిదండ్రులు పిల్లలన్గావనెంచునట్లు వేదశాస్త్రములన్నియును సకలప్రాణుల రక్షించునుపాయమునే బోధించుచున్నవి వేదశాస్త్రప్రవర్తకులగు మునులందఱు సర్వజన

సములే కావున నందఱికిని హితమునే యుక్తదేశించి ప్రాణులందఱికిఁ బరస్పరానురాగమునే బోధించిరి "యావజ్జీవం దర్శపూర్ణమాసా భ్యాం యజేత" అను శ్రుతియందు దర్శన మనఁగా నాయుర్వేదము విధించినలంఘనము- పూర్ణమాస మనఁగా బృంహణము-కావునఁ బ్రతిజనుఁడును సరియైన యాఁకలిదప్పికలు పుట్టించుకొనుటకై తన కడుపున కిచ్చుకొన్న యవధికాలము దర్శ మనఁబడును మఱి యాయాఁకలి దప్పికలం దీర్చుకొనుటకై యన్నపానములచేఁ దన కడుపునించుకొన్నకాలము పూర్ణమాస మనంబడును శ్రౌతస్మార్త కర్మములన్నియు నాధివ్యాధుల నడ్డుకొని హాయిగా నొరుల సుఖింపఁ జేసి తా సుఖముగా దేహధారి బ్రతుకునుపాయమును మాత్రమే బోధించుచున్నవి "శరీరమాంద్యం ఖలు ధర్మసాధనమ్" అనుతీరున ధర్మార్థకామమోక్షముల న్సాధించుకొనుటకు నారోగ్యమైన దేహము నరిషడ్వర్గమునంటనిమనస్సును ముఖ్యసాధనములుగదా ? కాఁబట్టి సకలశ్రౌతస్మార్తకర్మములన్నియు నాయుర్వేదచోదిత ధర్మములే యని బుద్ధిమంతులు తెలిసికొనుచున్నారు- భవవైద్యుఁడు వాసు దేవుఁడు- మరి సంసారరోగనివారకమగు మందు సర్వలోకోపకారక ప్రవర్తన మని నిక్కువుమనుష్యుఁడు తెలిసికొను- తెలిసికొనును- తెడ్డు- మూకుడు పొయ్యి- చేట- చర్మము- సెమ్మె- రోలు- రోఁకలి- నన్న గొడ్డ యిాపది యజ్ఞాయుధము లివన్నియు వంటసాధనములే- యిందులో చర్మముమాత్రముశీతలప్రదేశమందలి మును లేర్పర్చినట్లు పొడఁగట్టుచున్నది ఆధ్వర్యవమనఁగా వంట యనియు నధ్వర్యుఁ డన వంటవాఁ డను ప్రతీతి యిప్పటికిం గలదు- గాన "స్వర్గకామోయజేత" అనఁగా స్వర్గమనంబడిన బ్రతుకు సౌఖ్యమునకై దేహారోగ్యకరమగు నశనమును సంపాదించుకొన వలసినదనియే శ్రుతి యభిప్రాయము- దేహధారులుకాని యశరీరులు

సర్వవ్యాప్తులు విభులగు దేవతలకుఁ పీట పొయ్యి తెడ్డులతోఁ బనియేమి ? కనుక యజ్ఞవిధానములన్నియును మనుష్యుల బ్రతుకు కొఱకై వేదశాస్త్రముఖమునఁ బెద్ద లనాదిగా బోధించుచున్నారు

అనాదిగా జగమునం దయాయి యభినయవిశేషములతో దత్తద్దేశకాలపాత్రానుసారము నాయాయి భాషావిశేషములతో మనుష్యులలో ననంతభేదములుగా వేదశాస్త్రములును శ్రౌతస్మార్త కర్మములును వ్యవస్థాత [illegible] చున్నవి- స్వర్గము కొఱకై చేయఁ బడుచున్నదిగ [illegible]క యజ్ఞము స్వర్గముకంటె ముఖ్యముకాదు యజమానుఁ డొనర్చిన యజ్ఞముంబట్టి స్వర్గముం పుట్టుచున్నది కనుక యజమానునికంటె స్వర్గముముఖ్యముకాదు కామము బట్టియజమానుఁడు స్వర్గమపేక్షించెను గనుకఁ గామముకంటె యజమానుఁడు ముఖ్యుఁడు కాఁడు కాఁబట్టి లోకములో నన్నిపదార్థములకంటె "కామో దాతా కామః ప్రతిగ్రహీతా" అనునట్లు సంకల్పమే ముఖ్యము "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ, మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" ఇదివఱ కనుభవించిన సుఖదుఃఖము నందుగాని కోరిక పుట్టనేపుట్టదు కాఁబట్టి కోరికకంటె ననుభూత సుఖంకరపదార్థము మఱి యాపదార్థముకంటె ముందుగా నద్దానిచవి నెఱింగినకర్త యుండకతీఱదు కాఁబట్టి జీవుఁడే జగత్కార్యముల ముందున్నాఁడు జీవాత్మయొక్క సంకల్పముచేతనే జగత్సృష్టినాశము లగుచున్నవి సంకల్పముకలవాఁడు జీవాత్మ-నిర్వికల్పుఁడు పరమాత్మ కావునఁ బరమాత్ముఁడు జీవాత్మకంటె ముందున్నవాఁడని యొప్పకొనకతీఱదు- జగము జీవునియధీనము మఱి జీవుఁడు దేవునియధీనము-అనఁగాఁ జరాచరమంతయును దైవాధీన మని సర్వశ్రుతిస్మృతి పర్యాలోచనముచేతఁ దేలినఫలితము ఫలితము- మఱియును దేవుఁడు కారణ మనియును సకలజంగమస్థావరాత్మకచరాచరప్రపంచమంత

యును గార్యమనియును సిద్ధాంతీకరింపఁబడెను కారణము నిత్యము న్గార్య మనిత్య మని యెల్ల రెఱింగినసంగతియేకదా ? "దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వ ముచితజ్ఞతా, అభ్యాసేన నలభ్యంతే చత్వారః సహజగుణాః" అనఁగా నాహార్యాభినయమగు దాతృత్వము నాంగికాభినయమగు ధీరత్వము సాత్త్వికాభినయమగు నుచితజ్ఞత వాచికాభినయమగు ప్రియవక్తృత్వమును స్వభావముగా లభించినపుడే లోకరంజకమగును గాని "బలాదాకృష్యమాణాచేత్సరసా విరసా భవేత్" అను తీరుగా శిక్షవలనఁ దిన్నఁబడనేరవు సత్కర్మచరణగుణము స్వభావముగాఁ బుట్టినపుడే లోకోపకారము నుభయతారక మగునుగాని కేవల స్వార్థపరతగాఁ గామ్య మైనపుడు మంచికిబదులు చెడ్డ కావింపకమానదు

"తస్మాత్పూషా ప్రపిష్టభాగః అదన్తకోహి సః" "కాఁబట్టి పూషుఁడనఁబడుసూర్యునకుఁ బిండిముద్ద పెట్టవలెకారణమేమనఁగా నాదేవత బొక్కివాఁడుకనుక" ఏమీయన్యాయము దేవతలలోఁ గూడ బొక్కి గుడ్డి సొట్ట మూఁగ చెవిటి మొదలగునంగ వైకల్యమున్నదా ? నిక్కముగా వెఱ్ఱివాండ్రు శ్రోత్రియులు "బుద్ధిజాడ్యజనితోన్మాదు లక్కడా శ్రోత్రియుల్" అనుకవివాక్య మెంత నిజము! శ్రౌతస్మార్తకర్మము లన్నియును స్వార్థపరులయిన సోమరిపోతు ధూర్తులు పామరుల న్మోసపుచ్చి దక్షిణను సంపాదించుకొనుటకై పన్నినకన్నికలు. కాఁబట్టి లోకోపకారకములు కాని యసంభవకార్యములెల్ల వేదచోదితములను వంచకులసంగతి యిట్లు వెల్లడి కాఁబడియెను పూషుఁ డను దేవత బొక్కివాఁ డట కాఁబట్టి యాదేవతకొఱకుఁ బిండినిఁ బాలు చక్కెరలతో సుగంధద్రవ్యములతో బాగుగ నుడుకఁబెట్టినఁగానిబొక్కితుంటరియాజకుఁడుతిననేరఁడుగా? మేఘగర్జితమునసముద్రఘోషమవలెఁగేవలాతీంద్రియ ద్రష్టయగుఋషులకు

మాత్రమే యోగదృష్టిచేత గ్రహింపఁదగిన వేదమునకుఁ గేవల
కుక్షింభరధూర్తశ్రోత్రియమన్యులు శ్రౌత మనుపేరుపెట్టి స్వార్థ
పరులై యింత పనికిమాలిన యపార్థములు వేదమునకుఁ జెప్పి
పామరుల న్మోసపుచ్చి సొత్తుకూర్చుకొనుట యెంతఘోరకలికాల
చేష్టితమో? "అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత అవ్యక్త
నిధనాన్యేవ కాతత్ర పరివేదనా" అను రీతిగా నీజగత్కార్యములు
భూతకాలమునందు బీజరూపముగా నున్నవి భవిష్యత్తునందును బీజ
రూపమున లయమగుచున్నవి వర్తమానకాలమునందు మాత్ర
ముత్పత్తిస్థితివిశేషములం బరిణమించుచున్నవి భూతభవిష్యత్కాల
ములందు లేనికార్యము వర్తమానకాలమందుమాత్ర మెట్లు చూపిం
చును? నిద్రకుముందుగాని మెలఁకువవచ్చినతరువాతగాని లేనిస్వప్న
జగ మెట్లు వాస్తవముకాదో యట్లే యీజగత్కార్యము సర్వా
ద్యంతభూతభవిష్యత్కారణమైన యాత్మయందు రజ్జువునందుసర్పము
వలె నధ్యస్తముగాని వాస్తవము కానేకాదు. కాఁబట్టి విధినిషేధము
లతో నీకేమియుంబనిలేదని తెలిసియు నెందుకిట్లు వృథా దేయహేయ
కర్మములన్నూర్చి శ్రమపడి వ్రాసెద వని యడిగెదవా యోపూర్వ
పక్షీ విను మీవ్రాఁతకూడఁ దుదమొదళ్ళనవ్యక్తదశలోనుండి యీ
నడుమ నిట్లు వ్యక్తమగుచున్న నీతర్కశాస్త్రమిటుండనీ. తర్కముల
కన్నింటి కాద్యంతావ్యక్తాత్మయే మూలము పూర్వపక్షసిద్ధాంతము
లన్నియుం దెలిసీ తెలియని మనుష్యకృత్రిమస్వప్నసదృశమిథ్యాకార్య
ము లయినప్పటికి "అహ మ్మమ" అను జ్ఞప్తియున్నంతవఱకు నీకుఁ
గాని నాకుఁగానివిధి నిషేధచింతకలుగకతీఱదు కాఁబట్టియిట్టివ్యర్థచింత
నుపశమింపఁజేసి మనలనుద్ధరించుటకొఱకే పిన్నలకుఁ బెద్దలు వస్తుజ్ఞా
నము న్బోధించుతీరున వేదశాస్త్రముఖములచే మనపూర్వులు సంత్య
క్తాహంకారమమకారులయినప్పటికి మఱియు జీవన్ముక్తులయినప్పటికి

సర్వభూతదయా పరిపూర్ణులై ఘోరదు:ఖాత్మకాపారసంసారసంతర
ణోపాయములగు విధినిషేధకర్మములం బోధించిరి కాఁబట్టి వేద
శాస్త్రములన్నిశ్వసించి విధులనాచరించి నిషేధములఁబరిత్యజించుటకై
యాపార్థివములు యావజ్జీవము మనము పాటుపడి "చావని పుట్టని
త్రోవ వెదకుకొనుట దొడ్డబుద్ధి" అను తీరునఁ గైవల్యానందమునొం
దుటకొఱకే యీ బ్రతుకు సాధనముగా నేర్పడినదని మనము తెలిసి
కొనవలయును- వలయును- "కామి గాక మోక్షగామి కాఁడు"
అన్నట్లు సత్కర్మాచరణము సద్గృహస్థాశ్రమము నిర్వర్తించిన
వారుగాని కేవలనిత్యకైవల్యానందపదవిం బొందలేరు పొందలేరు
"ఏష వా ప్రథమో యజ్ఞానామ్" ఈజ్యోతిష్టోమ మనుయజ్ఞమే యన్ని
యజ్ఞములకు నొమ్మొదటిది అనఁగా నీశరీరజ్ఞప్తియే సర్వవేదవిహిత
ధర్మాచరణములను నానాఖ్యలం బేర్కొనఁబడిన యజ్ఞములన్నింటి
కిని మొదటియజ్ఞము సోమపౌష్ణంచరుంనిర్వపేతనేమఃపిష్టమ్" సోము
నకు బిరుసుగాను పూషునకు ముద్దగా నొక్కసారే యొక్కపాత్ర
లోనే యన్నము డికించవలెనఁట అశరీరులగు దేవతలలో సోము
నకు దంతము లున్నవఁట పూషుఁడు బొక్కివాఁడట ఇందునుబట్టి
చూఁడగా నెన్నని యాఁకలిదప్పిక లెట్లు తీర్చవలెనో యేరోగ
మున కేయౌషధమో యనుపానమో యేదిపథ్యమో యద్ది
బోధించు నాయుర్వేదాంతర్భూతములే ఋగ్యజుస్సామాదివేదశాస్త్ర
ములన్నియును, మఱియును జంగమస్థావర ప్రాణ్యంతర్భూతములే-
"అగ్నిముఖావై దేవా" అను తీరున బ్రతుకును బెంచుజఠరాగ్నిస్వరూ
పులే దేవతలందఱు నని తేలినఫలము-జగమునందలి జంగమస్థావర
జీవులకన్న వేఱే దేవతలు లేనేలేరు కాఁబట్టి బ్రతుకునభివృద్ధి హాయిగా
నొనర్చుటకుఁదగినట్లు ధింపఁబడిన నిద్రాహారవిహారయోగ్య
ప్రవర్తనలక్షణములే వేదవిహితాచరణీయయజ్ఞకర్మములన్నియును

"యుక్తాహారవిహారశ్చయుక్తచేష్టశ్చ" అనుతీరుగాఁగోరినంతకాలము బ్రతుకు పొడిగించుకొనుటకై పెద్దలు బోధించిన మంచియుపాయములే శ్రౌతస్మార్తవిహితయజ్ఞవిశేషకర్మములన్నియును

దేవతలకై యుపవీతము పితృదేవతలకై ప్రాచీనావీతము ఋషులయెడ నివీతము ధరించవలయు ననఁగా- దేవతాస్వరూపమై దైవికమైన యాయుర్వృద్ధికై యుపవీతముగా నెడమప్రక్కను శయనించవలయును- పితృదేవతాకమై సులభమరణముగోరి ప్రాచీనావితముగాఁ గుడిప్రక్కగా శయనించవలయును-ఋషిపాటులుచేయుటకై సన్నద్ధముగా మనుష్యప్రీతిగా నివీతముగా వెలకిలఁ బరుఁడవలయు ననఁగా దేవతాప్రీతికై యుత్తరదిక్కున కేగి లోకోపకారకకర్మ మాచరించవలయును- పితృసంతృప్తికై దక్షిణదిక్కునందు సత్కర్మ మాచరించవలయును- తనతోడిపాటివారి కుపకారము తానున్న దేశమందే సత్కర్మ మాచరించవలయునని యభిప్రాయము ఉపవీత మనఁగా నుత్తరదిక్కు సన్న్యాసమున కుత్తరదేశమును వానప్రస్థమునకు దక్షిణదేశమును బ్రహ్మచర్యగార్హస్థ్యములకుఁ దనజన్మభూమియును నివాసయోగ్యము లని 'నివీతమితి మనుష్యధర్మః శబ్దస్యతత్ప్రధానత్వాత్' సూత్రమభిప్రాయపడుచున్నది "దిగ్విభాగశ్చ తద్వత్సంబంధస్యార్థహేతుత్వాత్" అను సూత్రముంబట్టి ప్రాచీనులు దేవతలు దాక్షిణాత్యులు పితృదేవతలు పాశ్చాత్యులు మనుష్యులు మఱియుత్తరాత్యు లసురు లని తెలుపఁబడెను- అనఁగా సూర్యుఁడుదయించినపు డెండ వెనుకఁబెట్టుకొని పశ్చిమదిక్కుగా నడుచువాఁ డేపనినైనఁ జేయఁగలఁడు- మనుష్యులొక్కరుమాత్రమే లోకోపకారకుగుపని చేయఁదగినవా రని యభిప్రాయము దేవతలు పితృదేవతలు మఱి యసురులు జనసంఘమున కెంతమాత్రము పనికిరారు పనికిరారు

ప్రస్తోత ఉద్గాత-ప్రతిహర్త- సుబ్రహ్మణ్యుఁ డనునల్వురుం సామగాయకులు- పాటకులకుమాత్రమే కడుపునిండఁ దిండిపెట్టవలెను కాఁబట్టి లోకములోనన్నిపనులకన్నఁ బాడుటయే నిక్కముగా మిక్కిలి శ్రమకరమగు విద్య "శ్రుతిరంజకమగు గానమువంటి విద్య మఱి గానము గానమెయ్యేడను" అనునట్లు వాచికాంగికాహార్య సాత్త్వికాభినయములలో వాచికాభినయమగు స్వరమువలె జన రంజకమయిన దింకొకవిద్య మఱెద్దియును లేదు శరీరారోగ్యకర ములై ప్రాణిహింసను చేయక మనోరంజనములైన శ్రౌతస్మార్త కర్మములు మాత్రమే మున్యుపదిష్టములుగాని ప్రాణిహింసాకర ములు విద్వేషకరములు కేవలస్వోదరపూరకమగు కర్మములు కేవలస్వార్థపరులగుధూర్తజనులుకల్పించినవన్నికలుగాని వేదచోదిత కర్మము లెంతమాత్రము న్గానేకావు ఉద్గాత ప్రస్తోత ప్రతిహర్తలు మువ్వురుమాత్రము పాటపాడెడువారు సుబ్రహ్మణ్యుఁడు నీవుదంచు నేన ప్రక్క లెగరవేసెద నన్నట్లున్నవాఁడు కనుకనే పాటకులలోఁ జేరినప్పటికి న్దలమాత్ర మూఁచువాఁ డగుటచేత వానికి యజ్ఞవిశేష భోజనము వంతులేదు నిజమే సోమరిపోతులకు మేపుట దండుగ బ్రాహ్మణులమని డాబులుగొట్టుచు లోకోపకారకమగు పనుల న్గష్ట పడనివారికి గ్రొన్నగూర్చుండ మేపువారు మిక్కిలి యవివేకులు కదా?

వరి నివ్వరి సోమలతకుఁ బూఁతికయు బదులుపెట్టవచ్చును గదా? కాఁబట్టి జీవత్పశువులకుమాఱు కాయగూరలేలపెట్టరాదో? శాస్త్రోక్తలక్షణములుకల జీవవత్పశువులు లోకములోలభించవుకదా? కాఁబట్టి మేఁకలు మొదలగుపశువులకుమాఱు పిష్టపశువులే వేయక తీఱదు- కూటికొఱకు కోటివిద్య లన్నట్లు శ్రౌతస్మార్తకర్మము లన్నియు న్గూటికై ధూర్తులు కల్పించినవిద్దలే- గార్హపత్య మాహవ

నీయ దక్షిణాగ్ను లనుమూఁడగ్నులు వాస్తవముగా వాతపైత్య శ్లేష్మము లను త్రిదోషములు- త్రిదోషసామ్యమారోగ్యము త్రిదోష ప్రకోపము సన్నిపాతరోగము కాఁబట్టి యారోగ్యమునకై త్రిదోషసామ్య మొనర్చు సాధనమయి నిద్రాశనవిహారములు న్యుక్తియుక్తముగా నడుపుసాధనవిశేషమే యజ్ఞ మనంబడును త్రిదోషమయమగు శరీర మందు గార్హపత్యము పైత్యకోశ మాహవనీయమామకోశము దక్షిణాగ్ని మూత్రకోశము 'సప్తదశకం లింగమ్" పంచభూతములు- పంచతన్మాత్రలు- పంచేంద్రియములు- మనస్సు- మతి యాత్మయు నీపదేడుపదార్థములు బ్రతుకు కల్పించఁబ— నీపదేడింటికే పదేడ్గు రధ్వర్యు లనియు యజమానుఁ డాత్మనివలె నీపదేడుపదార్థములలో ముఖ్యుఁడు కాఁబట్టి వానికే తల గడ్డముల గొఱిగించుట కాటుక పెట్టుట మొదలగుసంస్కారము లాత్మునకు సత్త్వరజస్తమోగుణ విశేషములవలె నిరూపింపఁబడుచున్నవి "తపశ్చఫలసిద్ధిత్వాల్లోకవత్" యజమానుఁ డుపవాసము చేయవలయును లోకములో జ్వరముతగిలినవానికి లంఘనము చేయించెదరు లంఘనబృంహణము లాయుర్వేదమున సమయానుకూలముగా విధింపఁబడెను కాఁబట్టి యగ్నిష్టోమాదియజ్ఞకర్మములన్నియు వేయేల శ్రౌతస్మార్తకర్మము లన్నియుం జికిత్సావిశేషములే యాయుర్వేదతంత్రములే-

అధ్వర్యులు బంగరుకంటెలు పెట్టుకొనవలయు నెఱ్ఱతలపాగాలు చుట్టుకొనవలయును కట్లు బొట్లు జుట్లు నగలు స్నానము లుపవాసములు వేయేల బాహ్యయజ్ఞకర్మవిశేషము లన్నియును "గుణత్వాచ్చ వేదేనవ్యవస్థాస్యాత్" అను సూత్రముంబట్టి గౌణములుగాని ముఖ్యము లెంతమాత్రము న్గావని యాధ్వర్యవోద్గాత్రాత్మక వాక్కాయకర్మప్రబోధకయజుస్సామవేదోక్తవాచికాంగికాహార్యాభినయము లన్నియు న్గౌణము లౌపచారికములు న్గాని ముఖ్యము

లెంతమాత్రము స్థావు కావు- హస్త్రమగు ఋగ్వేదాత్మక మానసిక యజ్ఞస్వరూపక సాత్త్వికాభినయ మొక్కటియే కేవల సత్సంకల్పాత్మక మగుటచేత నిర్వికారనిర్మలభావనాత్మకమగుటచేత ముఖ్యమానం బడును కావున బాహ్యలౌకికకర్మములను విధించుయజుస్సామ వేదములకన్న ఋగ్వేద మొక్కటియే మానసికమైన మంత్ర మనఁదగి ప్రధానమగుటచేతనే "అథర్వర్త్రింతంచ" అను సూత్రమునకుఁ దార్కాణమై త్రయీవిద్యయందు ఋగ్యజుస్సామము లని యజు స్సామములకంటె ముందు పల్కఁబడెను, సత్సంకల్పమే సత్కర్మము లకు మూలము. కావున సంకల్ప మలౌకికాత్మవశము కావున సత్సంక ల్పాత్మ ఋగ్వేదము లౌకికబాహ్యవాక్యకర్మోద్బోధకాధ్వర్య వౌద్గాత్రములకన్న శ్రేష్ఠ మని చెప్పఁబడెను "యేధర్మకర్మ నిరతా ద్విజదేవభక్తాః యది మనసా వచసా చ ప్రద్రుహ్యంతి న సర్వ భూతేభ్య" ధర్మకర్మనిరతులు ద్విజదేవభక్తులుమాత్రమే గ్రహ పత్నాయు వనుభవించఁగలరని జ్యోతిశ్శాస్త్రమును సర్వభూతదయ కలిగియుంటమాత్రమే పథ్యాశనవ్యాయామజితేంద్రియత్వములకన్న మిక్కిలియారోగ్యదాయకమని వైద్యశాస్త్రమును "పారదార్య మనాయుష్యమ్" వ్యభిచార మాయువును హరించునని వేదములును జాటుచున్నవి, ఇంతకును "సర్వేజనాః సుఖినోభవన్తు" అని సంత తమును నిర్మలాంతఃకరణమునఁ గోరుచు పత్యదయలను తప్ప కొరులను సుఖపెట్టి తా సుఖపడుటయే జన్మసాఫల్య మని సర్వ వేదశాస్త్రములయొక్క ముఖ్యాభిప్రాయము

మఱియును చిత్తైకాగ్రత నలిగించుటకై ప్రతిమారాధనము స్మృతులు విధించిరని తెలిసికొనలేక "ప్రతిమా మందబుద్ధీనామ్" అను నట్లు చపలచిత్తులగు మనుష్యులకుమనస్సాకపదార్థము నే ధ్యానించుట సాధనముగా శ్రౌతస్మార్తకర్మకలాపమును విగ్రహారాధనవిధి స్మృతు

తేర్పర్చిరి కాఁబట్టి బుద్ధిమంతులగు మనుష్యులు శ్రౌతస్మార్త కర్మాచరణమంతయుం జిత్తశుద్ధికారణములని తెలిసికొని గౌణములగు కామ్యకర్మము లాచరించి ముఖ్యమగు చిత్తశుద్ధిని సంపాదించుకొనవలయును "చిత్తశుద్ధిలేని శివపూజలేలా కోవిశ్వదాభిరామవినురవేమ" అన్నట్లున్ని దాహారవిహారవిషయభోగైకతత్పరులైన స్వార్థపరధూర్తజనులు యజపూజాయామ్" అను ధాత్వర్థ మెంచి కేవల ధర్మస్వరూపుఁడగు యజ్ఞపురుషుని నిర్మల మనఃపుష్పమునఁ బూజింపక కేవల కుక్షింభరులై యధ్వర్యదంభవేషములతో తమములినాంతఃకరణముల న్శుద్ధిచేసికొనుటకుబదులు "ఏకాదశకపాలం నిర్వపేత్" అనఁగా మనస్సుతోఁగూడిన దశేంద్రియము లేకాదశపాలములు కావించుకొని యేకాదశరుద్రులకు సంప్రీతిగా నేకాదశేంద్రియ నిర్వర్తిత లోకోపకారధర్మరూపక హావిర్దాన మిచ్చి నిత్యసంతోషాత్మక స్వర్గము న్మనుష్యుఁడు పొందవలయునని శ్రుతి విధించుచున్నది "జ్ఞాతేచవాచనం నహ్యావిద్వాన్విహితోఽస్తి" అనఁగా 'ఆయుర్యజ్ఞేన కల్పతామ్" అను మొదలగ క్లుప్తిమంత్రములు యజమానుఁడు మాత్రమే చెప్పవలెను మంత్రము న్మంత్రార్థము న్దెలియనివాఁడు యజ్ఞము చేయరాదు వేదమంత్రములన్నియును వల్లించి చక్కఁగా జ్ఞప్తినుంచుకొని యేమంత్రము న్మఱువక నత్తస్వరజ్ఞానముతో నుదాత్తానుదాత్తస్వరితములం బొరపాటులేక సుస్వరముగా నచ్చరింపఁగలిగి సరిగా మంత్రార్థమంతయు నెఱిఁగిన విద్వాంసుఁడు తప్ప నితరుఁ డెవ్వఁడును యజ్ఞము చేయుటకెంతమాత్రమును బనికిరాఁడు "ఏకశ్శబ్దః సమ్యగ్జ్ఞాతః సుష్ఠుసంప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి" అనునట్లు మంత్రోచ్చారణము సరిగాఁ జేయుటకుఁగాని మంత్రార్థమెఱుంగుటకుఁగాని యజ్ఞ మొనర్చుటకుఁగాని కేవలము ఋషులే తగుదురు పామరమనుష్యులైహిక

విషయభోగవ్యసనాతురులు కనుక వేదోక్తకర్మము లాచరించుట కెంతమాత్ర మధికారులు కానేరరు కానేరరు పరాపశ్యన్తీ మధ్యమావైఖరు" లను చతుర్విధశబ్దములలో మనుష్యుడు వైఖరి న్దప్పఁ దక్కిన మూఁడింటి న్దెలిసికొననేరఁడు కనుకనే పతంజలి యనుముని తన శబ్దానుశాసనమున శబ్దచాతుర్విధ్య మెఱిఁగి సుస్వరముగా నుచ్చరించినవాఁడే "యజ్ఞేన స్వర్గమకురత" స్వర్గకారణమగు వాగ్యజ్ఞ మొనరింపఁదగినవాఁడని నిర్దేశించెను కనుక నతీంద్రియద్రష్టలగు ఋషులకుమాత్రమే శ్రౌతస్మార్తకర్మములు విధింపఁబడుచున్నవి కాని యింద్రియవివశులు విపరీతదృక్కులు భ్రాంతులుం బామరులగు ప్రాకృతసంసారబద్ధులగు మనుష్యులు కెంతమాత్రము న్విధింపఁబడఁలేదు విధింపఁబడలేదు కాఁబట్టి సర్వజ్ఞులగు మునులు తప్పఁగించిజ్ఞులగు మనుష్యులు యజ్ఞమాచరించుట కెంతమాత్రముం బనికిరారు ఉ కిరారు శ్రౌతస్మార్తకర్మములు చిత్తశుద్ధిలేని ప్రాకృత పామరమనుష్యులకే విధింపఁబడునెడల నెట్టినేరు, లింగము కదిసేర్లన్నట్లు విధింపఁబడిన శ్రౌతస్మార్తకర్మములలో నూఱవవంతుకన్నం బ్రమాదమురానీ కావంతైన నాచరింపఁజాలని పామరులకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తకర్మము వేయిరెట్లుండును ప్రాయశ్చిత్తకర్మమే సరిగా నెఱవేర్చుకొనఁజాలని సంసారులు విధ్యుక్తకర్మ మెట్లు రవంతైన నొనసాగింపఁగలరు? ద్విజత్వము మొట్టమొదట సిద్ధించినన్గాని బ్రహ్మక్షత్రియవైశ్యులు కానేరరుగా? బ్రహ్మక్షత్రియవైశ్యులుతప్ప ఇతరులు అగ్నిష్టోమ మాచరింపఁదగరుగా? వెఱ్ఱికుదిరనంగాని పెండ్లి కాదు పెండ్లియైనన్గాని వెఱ్ఱికుదరదన్నట్లు ద్విజుళ్ళుతప్ప నగ్నిష్టోమ మాచరింపరాదు మఱి యగ్నిష్టోమమాచరించినందప్ప ద్విజులు కానేరరు సంస్కరింపఁబడిన మాత్రము చేత మనుష్యులు ద్విజులయినచో శూద్రు లేల ద్విజులయి యగ్నిష్టోమమాచరింపరాదో? నిక్కముగా

మంత్రమున్యథావిధి నుచ్చరించుటకుఁగాని మంత్రార్థము తెలిసికొను
టకుఁగాని "శ్రుతిస్థానే స్వరాన్వక్తుం నాలం బ్రహ్మాపి తత్త్వతః" అని
నారదముని చెప్పినట్లు మనుష్యు లెంతమాత్రము న్జాఁరు చాలరు
కాఁబట్టి శ్రౌతస్మార్తకర్మాచరణము విద్వాంసులతీంద్రియద్రష్టలగు
ఋషులకేగాని ప్రాకృతులగు పామరజనుల కెంతమాత్రము న్గాదు
కాదు. కాఁబట్టి మనుష్యు లుచ్చరించునది త్రయీవిద్యయు న్గాదు
ద్విజులమనుకొని వీ రాచరించుకర్మములు విధ్యుక్త శ్రౌతస్మార్తకర్మ
ములు న్గావు పరమార్థము న్నిత్యమైన వేదమంత్రము అనిత్యమర్త్య
వ్యవహారమునకు సాధ్య మెట్లగును? కనుక నిద్రాశనవిహారసౌఖ్య
మునకై పాటుపడని యేవో తెలివిపోని యూకాశపంచాంగములు
చెప్పుచుఁ దాము శ్రోత్రియులమని దంభవేషములతోఁ బకుహింప
కావించుచు వెఱ్ఱికల్పములం బన్ని స్వార్థపరులై సోమరులై మంత్రము
మావలె నుచ్చరించవలయుననియును శ్రుతిస్మృతుల కర్థము మేము
చెప్పనదేయనియును మఱి యాధ్వర్యవమునకు మేమేతగినవిద్వాంసుల
మనియు ననాదిగా స్వార్థపరధూర్తుల కృత్రిమకల్పముస న్దమబ్రతుకు
వృత్తిగా నేర్పఱచుకొని వ్యభిచారమును దొంగతనములకు వాత్స్య
యనసూత్రముల న్గామారతంత్రము న్విధ్యుక్తములను దుర్జనులవలెఁ
దాము చేయుకర్మములు శ్రుతిస్మృతిసమ్మతములు న్వేదచోదితధర్మము
లని చాటుచుం దెలిసీతెలియని ధూర్తమానవులు తమతోడిపాటి
వారలం జెఱచి క్రొవ్వునం దాముచెడుచున్నారు తనతోడిపాటివారి
బ్రతుకుసౌఖ్యమునకుఁ దగునన్నపానవస్త్రముల న్గూర్చుకొనుటకై
చేయుపనికన్న మనుష్యుఁడాచరింపఁదగిన విధ్యుక్తకర్మ మింకెద్దియు
న్గాదు కాదు. కూడుగుడ్డలకై పనికిరాని శ్రౌతస్మార్తకర్మములన్నియు
నిస్సంశయముగా ధూర్తజనకల్పితములే దంభకృత్యములే మోస
ములే మోసములే. వేదము న్మనుష్యులు పఠింపనేరరు. బ్రహ్మకైన

వేదార్థ మెఱుంగరాదన మంత్రార్థము దెలిసికొనుట మనుష్యు
లేపాటివారు? మంత్రార్థము తెలియఁజాలనిపామరులకు శ్రౌతస్మార్త
కర్మాచరణ మెట్లు నిర్వహింపఁగలరు ? ఋషులు ఋషులానందించుట
కొఱకుమాత్రమే వేదరచన మొనర్చిరి మంత్రార్థము న్వెల్లడించిరి
శ్రౌతస్మార్తవిధ్యుక్తకర్మము లాచరించిరి మనుష్యుఁడు మనుష్యుల
కొఱకే వంకాయకచ్చడిచేయునుగాని తేళ్ళ కొఱకు కాదుగా ?
యతీంద్రియద్రష్టలు కామరూపులు సత్యసంకల్పులగు ఋషుల
నడువడి ఋషులు తెలిసికొని యానందించుటకేగాని సంసారపాశబద్ధు
లగు మర్త్యుల కెంతమాత్రము న్గాదు కాదు- "శ్రుతేరివార్థం స్మృతి
రన్వగచ్ఛత్" అను విధముగా శ్రుతియొక్క తాత్పర్యము శ్రౌత
కర్మముచేతఁ గన్న స్మార్తకర్మముచేతనే సరిగా వెల్లడింపఁబడు
చున్నదను మహాకవిపలుక మిక్కిలి గణనీయము

అశ్వమేధమునందు చచ్చినగుఱ్ఱమునకు మేఁతపెట్టు శ్రౌత
కర్మముకన్నఁ దప్పటడుగులిడుచు హాయిగా నాడుకొనుచున్న పిల్లని
కన్నప్రాశనము కావించుస్మార్తకర్మము శ్లాఘ్యముం గన్నదండవు
కదా ? "శబ్దగుణక మాకాశమ్" అనుతీరున నావేదపురుషుఁడే శబ్ద
బ్రహ్మమాకాశమునఁ బ్రతిఫలించె నాప్రతిబింబముమాత్రమే శ్రవ
ణేంద్రియగ్రాహ్యముకాని నిక్కముగా నాదబ్రహ్మముభౌతికముకాదు
కనుక శ్రవణేంద్రియముచేత యథార్థముగా గ్రహింపఁబడనేరక
ప్రతిబింబితమైమాత్రమే గ్రహింపఁబడుచున్నదని బోధించిన మునుల
బోధనుకూడఁ బ్రాకృతులు విపరీతదృష్టులుకావున శబ్దబ్రహ్మమగు
మంత్రమునకు విపరీతార్థముచేసి శ్రౌతస్మార్తకర్మకలాపము స్వార్థ
పరులై కామ్యకర్మముల నావించుకొని తమతమయిష్టానుసారముగా
నన్నపానముల గల్పించి దేవతలపేరుచెప్పి మద్యమాంసాశనులై
వ్యసనపరులై సౌత్రామణిమున మద్యపానము మాంసాశనముం గ్రతువుల

విధ్యుక్తమని పామరుల నవ్వశపర్చుకొని తా మొనర్చు క్రూరకర్మములు బీభత్సకార్యము లశ్లీలచేష్టలన్నియును శ్రౌతస్మార్తవిధ్యుక్తములని చెప్పి విఱ్ఱవీగుచు భూతద్రోహము గావించుచున్నారు బ్రతుకున నెద్దియోపని సేయకతీరదుకదా ? తనతోడిపాటివారికి సుఖమగు తీరునఁ బ్రవర్తించియొరులనుసుఖపెట్టి తాసుఖపడునట్లుచేసినపనియంత యును విధ్యుక్తమేయని వేదశాస్త్రోపదేశ మొనర్చిన మునుల ముఖ్య తాత్పర్యము

“స్యాత్త్వకృతిలింగాద్ద్వైరాజవత్” అను సూత్రముంబట్టి యజమానుఁడు వేఁటాడి చంపినమృగమాంసముతో సవనీయమను నప్పము చేయఁబడవలయునని ప్రతిపాదింపఁబడ, సవనీయ మను నప్పము మాంసముతోడనే చేయఁబడనక్కఱలేదని సూచింపఁ బడెను కాఁబట్టి మాంసాశనులుమాత్రమేమృగములను వేఁటాడెదరు కాఁబట్టి క్రతువులు మాంసాశనులకుమాత్రమే విధింపఁబడెనుగాని శాకాహారుల కెంతమాత్రము న్విధింపఁబడలేదు. కాఁబట్టి మృగము లను వేఁటాడి చంపి యామాంసముందిని జీవించుక్రూరకర్ములగు మనుష్యులుతప్ప కేవలభూతదయాకరులై యహింసాపరాయణు లగు సజ్జనులు పశుహింస న్విధించు యజుర్వేదవిధు లెంతమాత్రము న్జేయఁదగదు

## జగద్గురు ప్రశంస

“పౌరుషేయవచనానితు పురుషబుద్ధి ప్రభవత్వాద్భ్రాంత్యా విప్రలిప్సయా వా ప్రయుక్తాని మూలదోషేణ దుష్టత్వాదయథార్థా నిభవంతి” మనుష్యులందఱును భ్రాంతులు వంచనాపరులగుటచేత వారలాడుపల్కులుయథార్థములుకావనిసర్వతస్స్వతంత్రుఁడని తెగ బారెడుబిరుదుతో ఘంటించుకొన్న పార్థసారధి మిశ్రునిపల్కులుకూడ

పౌరుషేయములగుటచేత నయథార్థములు కాకమానవుగదా? కా
జేసినశాస్త్రదీపిక పౌరుషేయము భ్రాంతిమూల మయథార్థమని
తెలిసియుం బూర్వమీమాంసాశాస్త్రము న్యథార్థముగా బోధచేయు
నని వెఱ్ఱినమ్మక మేలకో నెనో? నాకెద్దియు నెలియదు నేను బొత్తిగా
భ్రాంతుఁడ నసమర్థుఁడనై నప్పటికిని శాస్త్రార్థముం జేయఁగలనని సభ
లలోఁ బండితునివలె సంభావనము గోరు ధూర్తమానవుల నేమన
వలయును? గ్రహచారముచే నోటకివచ్చినట్లాడు పిచ్చివాఁడను
బొట్టకూటికొఱ కిట్లు పండితునివలె నటించు న న్గరుణించి నాకోరిన
యన్నపానముం దాత లీఁగోరెదనన్న నెంతబాగుండునో యట్లు
తన యజ్ఞతం బాహాటము నొప్పుకొనక తానేమో వేత్తననియుఁ
దాఁ జెప్పినదే శాస్త్రార్థమనియు విభ్రాంతి సమ్మిశ్రు లహంకార
విమూఢాత్ములై నావలె నెంత చాటభారతము శాస్త్రదీపిక ప్రచు
రించిరో! "శతాంధాః కూపం ప్రవిశన్తి" అను చందమునఁ "గురూపీ
కురూపీ యేలఁ బుట్టితివే" యను సురూపుల న్వెక్కిరించుట కన్నట్లు
సర్వభూతదయాపరు లహింసావ్రతపరాయణులు సకలజగన్మిత్రులు
సర్వజనసములును "యదేవ శ్రేయస్సాధనరూపం యాగహోమాది
తదేవ ధర్మ ఇత్యుచ్యతే లోకే-నాపూర్వమన్తఃకరణప్రవృత్త్యాది వా
లోకప్రసిద్ధి విరహాత్" అనిమిశ్రులు నీయెడమచేయి తీయుము నా
పుఱ్ఱచేయి పెట్టెదనన్నట్లు వ్రాసిరి శ్రేయస్సాధనమగు ధర్మము
పశుహింసాత్మక యాగహోమాది క్రూరకర్మమే యగున్గాని సర్వ
భూతదయాపరతంత్ర నిర్మలాంతఃకరణాది సాత్త్వికకర్మము కావఁట-
లోకప్రసిద్ధము క్రూరక్రతుకర్మమేగాని యహింసావ్రతము కాదట-
యోహో మాంసాశనక్రూరాంతఃకరణలకు సర్వభూతదయావ్రత
పరాయణులొక్క మెట్లు తెలియు న దటుండఁగా పౌరుషేయలోక
వ్యవహృతములగు శబ్దార్థములు పౌరుషేయము లేయగున్గాని

యపౌరుషేయము లెట్లగును ? నా కెట్టిగా నగపడెన్ గాని నేఁ
జూడలే దను మోసకానివలె నివి మంత్రము లని పురుషప్రయత్నము
చేతనే వేదము లుచ్చరించు వేదము లపౌరుషేయములను ధూర్త
ప్రలపితము లేమనవచ్చునుఁ? మిత్రిగారూ ! దేవతాప్రీతిగా రాజుగారు
యాగముచేసెద రాక్రతువునందు మనుష్యపశువు కాఁదగినవారు
మీరుగాని మీపుత్త్రుఁడుగాని నిశ్చయింపఁబడిరని రాజభటులు
మెడన్పాశములు వేసిలాగుచున్నడు మీరేమిచేయుదురు? శునశ్శేపుడు
యజ్ఞపశువు కావింపఁబడినలోకప్రసిద్ధి నొప్పకొనెదరోకతనదికానిచో
గోదావరివరకు దేఁకుమన్నట్లున్నది వీర్కివాఁత- పురుషప్రయత్న
కృతములు కావున మంత్రమంత్రార్థములు రెండును బౌరుషేయములే
ఇది పౌరుషేయమనియు నిది యపౌరుషేయమనియును నిర్ణయించు
తెలివికూఁడ బౌరుషేయమే "పురిశేతఇతి పురుషః" హృదయమం
దవ్యక్తముగానుండి సకలలోకవ్యవహారకారణమగు జ్ఞానము పురుషుఁ
డనఁబడును "పురుషఃపద్మపత్రాంబువ న్నిర్లిప్తః అసంగోహ్యయం
పురుషః" అని తెలుసుకొన్నవాఁడు"బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి' అన్నట్లు
"నకర్మణా నప్రజయా త్యాగేనైకే అమృతత్వమానశుః" న అనిత్య
సంతుష్టియే స్వరూపముగాఁ గలజ్ఞానమే పురుషుఁడని తేలినఫలితము
కదా ? "స్వర్గకామోయజేత" అనుటచేత స్వర్గము నాసించువాఁడు
యజ్ఞము చేయవలయునని విధ్యుక్త కర్మాచరణమునఁ జిత్తశుద్ధి
కలుగును విశుద్ధాంతఃకరణమునందు జ్ఞాన ముదయించును
"ప్రజ్ఞానంబ్రహ్మ" అనుటచేత జ్ఞానమే బ్రహ్మస్వరూపము- మతే
కోర్కెయులేక నిత్యసంతుష్టి నిక్కముగు ధర్మ మగున్గాని పశు
హోమాది క్రూరకామ్యకర్మము ధర్మము కాదను నితనిచెంత నాట
పాటలఁ జాటుచున్న పరమభాగవతలోకమును ఘూకమునకు లోక
బాంధవునివలె నీక్రూరక్రతుకర్మమున కెంత యప్రసిద్ధమయ్యెను ?

(ఎలుకకు) దొండ సాక్షి యన్న ట్లీవిషహింసాపరులకు మాంసాశనవ్యసననిమగ్నపండితమ్మన్యలోకమే ప్రసిద్ధసాక్ష్యమా ? పౌరుషేయవాక్యములు దోషభూయిష్ఠములు వేదవాక్యము లపౌరుషేయములు కనుక నిర్దుష్టములు కావునఁ బ్రమాణములనుట మనుష్యులెంత బుద్ధిహీనులో ! మంత్రబ్రాహ్మణాత్మకవేదవాక్యములు—"ఇషేత్వోర్జేత్వా- ఇమమేవోర్జం యజమానాయదధాతి" అనువాక్యములు మనుష్యు లుచ్చరింపఁగా వేదవేత్తలు విన్నారా ? లేకవాక్యము లాకాశవాణి వల్లనా ? "అధ్యేతవ్యో వేదః" అనునవ్వి దధ్యాపకులనోళ్ళ పౌరుషేయములా లేక యపౌరుషేయములా? యధ్యాపకులమ్మకడుపునఁ బుట్టలేదా ? అపౌరుషేయములైన వేదవాక్యములు దోషభూయిష్ఠములగు మర్త్యులనోళ్ళ వెలువడుటెట్లు ? "తస్మాదనాప్తవచసాం సత్యేవా ప్రామాణ్యే వక్తృదోషాధీనత్వాద్వేదేచ తదభావాత్ప్రామాణ్యమేవ వక్తవ్యమ్" అని ప్రతిపాదించిన మిశ్రులనాదిసంప్రదాయసిద్ధమై పారంపర్యముగా నుపదేశింపఁబడుచుఁ బఠనపాఠనముల మాఱకున్న హేతువుచేత నిషేత్వాదివాక్యములపౌరుషేయములుం బ్రామాణ్యములనుచున్నట్లే యనాదిగాఁ బఠనపాఠముల మాఱ కార్యావర్తేతరదేశముల న్వేదములని వాడుకొనఁబడుచున్న వాక్యములప్రమాణములని యెట్లు నిర్దేశింపఁగలరో? "అన్నాత్పురుషః" అనుటచేత లోకములో పందతికన్న మిశ్రుల తాతలే ముందు పుట్టిరా ? యాగహోమాదికర్మమే ధర్మముగాని యితరకర్మమెద్దియును శ్రేయస్కరసాధనమగు ధర్మము కాదని- తమ తాతల సమానకాలికులగు సాంఖ్య శాక్యార్హత వైశేషిక మతావలంబుల వాక్యము చోదనాలక్షణము కాదా ? శ్రేయస్కరసాధన చోదనాలక్షణధర్మము కాదా ? "అనంతావై వేదాః" అనియును బ్రతియుగమును వేదములు మాఱుచుండునని మిశ్రు లెఱుఁగరా ?

కేవలముమాంసాశనవ్యసనపరులు తాము తినుటకై గ్రామదేవతకుఁ
గోడిని మ్రొక్కుకొన్నట్లు "అజః ప్రథమః పశూనామ్" అనుతీరుగా
నల్లమేఁకమాంసము దేహారోగ్యకరమని రుచిమరగి "పశుమాలభేత"
అనునవాదివాక్యమున కపార్థకల్పనముం బన్ని యాగహోమాది
కర్మమే శ్రేయస్కరసాధనధర్మ మనుచున్నారు

"మనస్తు పృథివ్యాదీనామేవాన్యతమాత్మకం తేభ్యోఽ
న్యద్వాసర్వథాతావదస్తు మనః, తచ్చాత్మతద్గుణేష్వేవ స్వాతన్త్ర్యేణ
ప్రవర్తతే న బాహ్యేషు రూపాదిష్వేతావాన్తర ముచ్యతే, రూపాది
జ్ఞానేవ్యాపితచ్చక్షురాదిసహాయం ప్రవర్తతే ఏవమనుమానాదిష్వపి
లింగాదిసహాయమ్, అన్యమనస్కస్య సంశయయుక్తేష్వపి రూపాదిషు
జ్ఞానానుత్పత్తేః స్మృతావపి సంస్కారసహగతస్తత్ర ప్రవర్తతే నస్వ
తంత్రమ్" అనిపెద్దలమాట మనస్సనునది ఆత్మగుణము లందదిస్వ
తంత్రము ఇతరములందుపరతంత్రము మనస్సునుజయించినవారేద్రష్టలు
వాస్తవముగాశబ్దబ్రహ్మమగు వేదపురుషుని దెలిసికొనుట కతీంద్రియ
ద్రష్టలగుఋషులుమాత్రమే యధికారులా ఋషీంద్రుడు తాఁ దెలిసి
కొన్నతీరుతక్కినఋషులకుఁ దెల్పగోరి యాశబ్దబ్రహ్మమున "ఇషే
త్వోర్జేత్వా" అనురీతిగాఁబ్రకృతి ప్రత్యయములేర్పఱచి యింద్రియ
గ్రాహ్యముగావించెను శ్రవణపథమందుతోఁచిన వేదాత్మకమగు శబ్ద
బ్రహ్మమును దశసాటిఋషులమెప్పునగోరి జైమిని "అథాతో ధర్మ
జిజ్ఞాసా"అనుసూత్రములద్వారమునవివరించెను "ఛన్దోవత్సూత్రాణి"
అనుటచేత నిషేత్వాదివేదశబ్దములవలె సూత్రార్థవిచారణమున కతీం
ద్రియద్రష్టలగుకపిలపతంజలిగౌతమకణ్వజైమినివ్యాసాదులవంటి మహ
ర్షులుదక్క విపరీతబుద్ధులు ప్రకృతిబుద్ధులు ప్రాకృతులగు పామరజను
లోకవేళమిశ్రులవలెఁ బ్రతిభావిరాజితులయినప్పటికిఋష్యైకగ్రాహ్య
మగు దేవభాష భాషచేత వివరించుట నిష్ప్రయోజనము కావుననే
యుత్తమమనుష్యులైన గౌతమబుద్ధ మహావీరాదులు తమతమమతము

లను దనుతమదేశభాషలగు పాళీ మొదలగునాటుపలుకులతో వెల్ల
డించిరి జగద్గురుఁ డతీంద్రియద్రష్టయగు మహర్షి కావున బ్రహ్మ
సూత్రముల న్గేవల సాధనచతుష్టయసంపన్నులయిన ఋషితుల్యులు
మాత్రమే యధికారులని దేవభాష న్దెలిపెను వేదములకు ఋషి
కృతసూత్రములకు దేవభాషచే భాష్యమొనరించుట జన్మసిద్ధులగు జగ
ద్గురువుల కొక్కరికే చెల్లును జగద్గురువులు గీర్వాణభాషచేత
భాష్యముచేయుట పులినిజూచి నక్క వాఁతలువేసికొనుటయే జగ
ద్గురువులవంటి యాజన్మసిద్ధులం బుట్టుసన్న్యాసులకుఁ దప్ప నితరులు
దేవభాషయొక్క మర్యాద నొకవేళఁ దెలిసికొనుప్రతిభ నొప్పారియు
దేవభాషతో వ్యాఖ్యానమొనరింప సమర్థులగుట శశవిషాణమువలె
మిక్కిలియసంభవము దేవయోనిసంభవుఁగు కపిలాదిమహర్షులమాట
యటుండఁగా మనుష్యులలో నొక్క జగద్గురువులుతప్ప ఛందస్సూ
త్రార్థములఁ దెలిసి గీర్వాణభాషతో భాష్యమొనరింపఁగలప్రతిభ
మఱెవ్వనికిన్ లేదు లేదని ఘంటాపథముగాఁ జాటక తీఱదు తీఱదు
అమ్మకడుపునపుట్టిన తక్కినవారందఱును స్వోదరపోషణార్థమైతమకుఁ
గూడ దేవభాష తెలిసినట్లు దంభముతో వ్రాసిన వ్రాఁతలుగాని
యామిత్రాదులభాష యాలపెయ్యగాక గేదెపెయ్యయున్గాక దేవ
భాషయు న్గాదు దేశభాషయు న్గాదు కాదు "శ్రుతిశ్చభిన్నా స్మృత
యశ్చభిన్నా మహాఋషీణాం మతయశ్చభిన్నాః" వేదార్థము
న్గూర్చియు సూత్రార్థమున్గూర్చియు నభిప్రాయభేదముండు దేవతల
యొక్కయును ఋషులయొక్కయును సందేహము న్దీర్చుటకై సాక్షా
త్తుగా శివుఁడే జగద్గురుఁడుగా నుదయించి ప్రస్థానత్రయము కావిం
చెను కానిచో సూత్రకారులకుఁగూడ శక్యముకానియట్టి శాస్త్రీయ
గభీరవాగ్రచనము జగద్గురున కొక్కనికే చెల్లు టెట్లు ?

## మిశ్రవాదనిరాదరణ

“బ్రహ్మణితు సహావస్థానాద విరుద్ధా విద్యా నతేనోచ్ఛేత్తుం శాక్యా - తతశ్చానిర్మోక్షప్రసంగః - తస్మాద్బ్రహ్మణః ప్రశంసార్థైరస్థాయిత్వేన ప్రపంచస్య సత్త్వముపచర ద్భిరౌపనిషదైస్తదనుసారిభిశ్చేతిహాసపురాణై ర్భ్రాంతానాం వాక్య తాత్పర్యమజానానాంన్యాయాభియోగశూన్యానాం ప్రలాపోయమద్వైతవాద ఇత్యుపేక్షణీయః - తత్సిద్ధమవికల్పస్య ప్రత్యక్షస్య విశేష[illegible]యిత్వమ్” ఇట్టే మీ దౌర్జన్యము! జ్ఞానలవదుర్విదగ్ధులు సంకరమిశ్రులు పెద్దకుండల కెసళ్ళు పెట్టుచున్నారు వేదాంతేతిహాసపురాణమతానుసారులగు మహర్షులు భ్రాంతులై యద్వైతముగాఁ బ్రేలెదరని వదరుచున్నాఁడు “స్వర్గపుత్రాదిభేదశ్చ కీదృశాత్కర్మభేదతః, ఇతియావన్న విజ్ఞాతం తావన్నైవ ప్రవర్తతే” కాఁబట్టి యేకర్మముచేసి నందువల్ల యేఫలమువచ్చునో యాకర్మము నడిపించువిధానమును దత్ఫలవిశేషమునాకర్మచేయువానికి ముందుగాఁ దెలిసియుండవలెనుగదా సంభోగకర్మమువలన సంతానముకల్గుచుంట ప్రత్యక్షముగానియపూర్వమప్రత్యక్షమననుభూత మయినస్వర్గఫలమందు మనుష్యునకుఁ గోర్కెపుట్టనేపుట్ట దొకవేళదయ్యమునుగిన్నస్వప్నమువలెఁ బిచ్చివా రోడుగొనుకర్మ కాఁబట్టి లేనిస్వర్గఫలానుభవము త్రాగినవానికిఁ బొమ్మలగపడినవిధమునఁ దోఁచినప్పటికి న్గగనారవిందము న్గోయుటకై వెఱ్ఱివాఁడుతప్ప నేమాత్రమైనం బుద్ధియున్నవాఁడు చెయిచాఁచునా? ప్రత్యక్షముగాఁ జిత్తవిశ్రాంతికరములగు నుపనిషద్వాక్యములు విభ్రాంతప్రలపితములఁట యీ గగనారవిందము వలె శశవిషాణమురీతి నసంభవమగు స్వర్గఫలబోధకకామ్యకర్మవిధాయకక్రూరాధ్వర్యువాక్కులు సత్యములఁట యోహో! యేమీ సంకరమిశ్రుల పొగరుఁ

బోతుర్వాఁత ? తాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళని వాదించుచు నుపనిషదితిహాసపురాణమతములను దూషించుచున్నాఁ డీమాత్రపు పురుషుఁ డీసంకరమిశ్రి ? యుక్తి చెప్పుచున్నాఁడా వీనితాతయుక్తులు చెప్పి వీని వాద మడఁగఁద్రొక్కి కేవలాద్వైతమతవైభవ మొక్కింతయు న్దలపోయనేఁడా ? వేదములు విభజించి పురాణేతిహాసములను సకలలోకోపకారార్థమై యుపదేశించి ముముక్షువులకుఁ గైవల్యపదవి కరతామలకమగునట్లు బ్రహ్మసూత్రములఁ గావించి యద్వైత మతముం బ్రవర్తింపఁజేసిన వేదవ్యాసమహర్షి కూడ వేదవాక్య తాత్పర్య మెఱుఁగఁడని తృణీకరించిన క్రూరక్రతుకర్మవ్యసనపర ధూర్తమిశ్రుల నేమనవలయును ? "అథాతో ధర్మ జిజ్ఞాసా" అని లౌకికవస్తుధర్మ మెఱిఁగించి యాయుర్వేదతత్త్వ మెఱిఁగి యాధి వ్యాధుల మాన్చుకొను నుపాయము న్లోకులందఱు న్దెలిసికొని నిద్రా హారవిహారముల న్నియమించుకొని హాయిగాఁ దమబ్రతుకు గడపు కొనుటకై శ్రుతిచోదితకర్మమని మిషవెట్టిన స్నాని తిన్నగా నియమ ముల ననుసరించి తమబ్రతు కారోగ్యముగాఁ బొడిగించుకొననేరరని జనులకు "పూర్వజన్మకృతంపాపం వ్యాధిరూపేణ బాధతే, తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమాదిభి స్సదా" అనుతీరుగాఁ బూర్వ మీమాంసాశాస్త్రమును సర్వజ్ఞుఁడుం బరమకారుణికుఁడైన జైమిని యుపదేశించెను పూర్వమీమాంస యనఁగా సాధనచతుష్టయ సంపన్నులగు ముముక్షువు లాచరింపఁదగిన పారలౌకికకృత్యముల విధించుశాస్త్రము వ్యాసముని "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని యుపదేశించె నిట్లు తెలిసికొను ప్రజ్ఞలేమి మిశ్రులు "మూఢః పర ప్రత్యయనేయబుద్ధిః" అనుతీరుగాఁ దనుగన్న తల్లిదండ్రు లెవ్వరో శ్రుతివాక్యతాత్పర్యముంబట్టి తెలిసికొనెనా మిశ్రులు లేక తన యిరుగుపొరుగు పామరవాక్యతాత్పర్యముంబట్టి తెలిసికొన్నాఁడో ?

న్యాయాభియోగశూన్యు లద్వైతవాదు లనుచున్నాఁడే! తా నేన్యాయముంబట్టి తల్లిదండ్రుల నెలిసికొనఁగలఁడో ? ప్రత్యక్షాది ప్రమాణముల నెట్లు తన తలిదండ్రుల న్నాథింపఁగఁడో? తనపుట్టుక సంగతియే తాను స్వప్రమాణముగా నిర్దేశింపఁజాలని గర్వపర్వతా రూఢమిశ్రుఁ డుపనిష్మతఖండన మొనరింప సాహసించుట కొండ నద్దరు ఢీకొనుటకదా ? కోళ్ళు తోలుచున్నఁ గోటలోని సంగతులు చర్చించునట్లు పూర్వమీమాంసాశాస్త్రముం బ్రతిపాదించు జైమిని సూత్రముల న్వివరించుటయేగాని తానుగాని తనతాతలుగాని కలనైనఁ గనుఁగొనని యుపనిషన్మతము చర్చించుచుండెనా! హా! యీమిశ్రుఁ డెంతధూర్తు ? బ్రహ్మముతో నొక్కటిగా నవిద్య చేరియున్నదఁట- కాఁబట్టి బ్రహ్మమునుండి యవిద్యతొలఁగింపఁబడశక్యముకాదఁట- యేమీ మిశ్రుల విపరీతపు తెల్విపోగరు ? తనపేఁపే తానెఱుఁగని మిశ్రుఁడు కేవల మలౌకిక మచుంబిత మతీంద్రియమగు బ్రహ్మము నూర్చి తానెఱిఁగిన యజ్ఞాయుధములు చేట రోలు రోఁకలి తెడ్డుల కంటెఁ జులకనఁ జేయుచున్నాఁడు

"అల్పవిద్వాంసుడే యాక్షేపణకు పెద్ద" అనుకవివాక్య మీదేవానాంప్రియునెడ నెంతె నిజమయ్యెను ? బుద్ధి మానసిక కర్మము యజుస్సు కాయికకర్మము సామము వాక్కర్మము కనుక మనోవాక్కాయములు మూఁడు నింద్రియవికారములు న్నార్యాత్మక ములే. యుత్పత్తిస్థితినాశవత్తులే. యనిత్యములే కావున స్వప్న కార్యములవలె మిథ్యలే. మఱియును మనోవాక్కాయకర్మసాక్షి నిత్యనత్యోపవర్గకారణకేవలనిర్గుణాద్వైతపరమాత్మయొక్క యునికి నొప్పక తీఱదుగా ? "యజ్ఞేన స్వర్గమకురుత" యజ్ఞకర్మము చేత స్వర్గముం బుట్టించినాఁడని కదా యర్థము. స్వర్గ మతీంద్రి యమా ? యింద్రియగోచరమగు పదార్థమా? అవాఙ్మనసగోచరము

స్వర్గమయ్యెనినేనిఁ ద్రికరణసామ్య మెట్లగును? స్వర్గముయజ్ఞముచేత జేయఁబడినపుడు కార్యముగాకతీరదుగదా? యజ్ఞము సాధనము, స్వర్గము సాధ్యము యజమానుఁడు సాధకుఁడు కాఁబట్టి యజమానుఁడు యజ్ఞమును సహజసత్యవస్తువులు రెండున్నపుడుమూఁడవ వస్తువయిన యపూర్వస్వర్గవస్తువు దంపతులవల్ల సంతానమువలెఁ బుట్టింపఁబడుచున్నది పాంచభౌతికోపాధితో నుండినన్గాని మఱియు దేహధారియై యజమానుఁ డుండకతీరదు సచేతనులగు యజమాన దంపతులచేతనమగు యజ్ఞకర్మముచేత బుట్టించుసంతానరూపమగు స్వర్గముకూడ సచేతనము కాకమానదుగా? పాంచభౌతిక దేహధారి కాకతీరదు పాంచభౌతిక జగదతీతాపూర్వఫలము స్వర్గమనెడు ద్వైతు లేమి యిట్లు పప్పులోఁ గాలు వేసిరి? దేహమువలన దేహము కలుగునుగాని యశరీరముచేత శరీర మెట్లు కల్పింపఁబడును? కాఁబట్టి యశరీరస్వర్గఫలము నను యజమానుఁడుకూడ నశరీరుఁడు కాకతీరనపుడు ద్వైతవాదమునకు నీళ్ళుధార విడువ వలయును "సతోఽసన్నజాయతేఽసతః సన్నజాయతే" (నాసతో విద్యతే భావో నాభావో విద్యతేసతః) అను లోకజ్ఞానమించుకయైన లేక ద్వైతులు లాహా యెంత దివాంధులై లోకబాంధవులగు సుకని మత్తేజము గ్రసఁజాలకున్నారు బ్రహ్మతో నెడతెగ కెవ్వఁడు నీవిద్య యున్నది కాఁబట్టి బ్రహ్మనుండి యవిద్య పెఱికివేయఁబడదుగావున మోక్షము లభించనేరదఁట- యేమీద్వైతులభ్రాంతి- పూర్వమీమాంసాసూత్రముల కిట్టు లవకతవక వ్యాఖ్యాన మొనర్చిన మిశ్రులు తనమేన దానినీడతో నెడతెగకుండుటచేత శుద్ధశరీరులు కాకుంటచేతనే సంకరుఁడు మిశ్రియని పిల్వఁబడుట కొప్పుకున్నా రతని శరీరమువలె నద్దానినీడకూడ వాస్తవమేయనుకొని తనశరీరమును గూర్చి చింతించినపుడెల్ల దానినీడనుగూర్చి చింతించుచున్నాఁడు

మఱి యాసీడతోఁ దనశరీరమున కెంతమాత్రము వాస్తవసంబంధము లేదని నిశ్చయింపలే కొకప్పు డాసీడ తన శరీరప్రతిబింబమా లేక తనశరీరమాసీడయొక్క ప్రతిబింబమా యనికాని మ అతని శరీర ప్రతిబింబ మొకవాస్తవమగు దయ్యమని కాని భ్రమకూడఁ బడుట చేతనే కాఁబోలు నీదేవానాంప్రియుఁడు "ఇంద్రాయాను బ్రూహి"- అని మనఃకల్పానుకృత మృషాదేవతలతోఁ బిచ్చివాఁడు దయ్యములతో వలె వ్యవహరించుచుఁ దనసీడకుఁ దనశరీరమునకు గలసంబంధము కేవలము భ్రాంతికల్పితమని తెలియకున్నాఁడు వాస్తవజీవాత్మకుఁ డైన దనకుఁ ఎట్లు తనశరీరమునకుఁ దచ్ఛాయ మిథ్యా ప్రతిబింబమో యట్లే వాస్తవమగు బ్రహ్మమునకు మిథ్యయగు జగదాకృతావిద్య ప్రతిబింబమని తెలిసికొనలే కద్దమునఁ దనసీడతోఁ బోరాడు పచ్చుక యగుచున్నాఁడేమి ద్వైతసంకరమిశ్రి ?

"బ్రహ్మవి ద్బ్రహ్మైవభవతి-అహం బ్రహ్మాస్మి-మాయామాత్రమిదం విశ్వ మద్వైతం పరమార్థతః" అను నుపనిషద్వాక్యవిచారణ కధికారి సాధనచతుష్టయసంపన్నుఁడగుముముక్షువు కాని, యహంకార మమకారాత్మకసంసారబద్ధుఁడై మిథ్యావిషయ సుఖభోగతత్పరుఁడై యసంభవగగనారవిందసదృశస్వర్గఫలాపేక్షుఁడగు కామ్యకర్మబద్ధుఁ డగు మిశ్రివంటి ద్వైతమతావలంబుఁ డించుకయు న్దగడు తగడు ఆహా! తనసీడ యెట్లు కేవల మిథ్యయో యట్లే తనమనోవాక్కాయ కర్మప్రవృత్తి హేతువగు ప్రత్యక్షభౌతికజగమంతయును మఱియు లేని పోని పిచ్చిపిచ్చి యధ్వరకర్మముల న్విధించు ఘుణాక్షరసదృశకర్మ కాండమును మఱియుం బడరానిపాట్లుపడి కేవలస్వార్థపరత నాసించు స్వర్గఫలముగూడ నట్లే శశవిషాణమువలె నెండమావులతీరున స్వప్న వస్తువులవలె మద్యవికారమువలె వ్యర్థశబ్దస్వరూపములుం గేవలానం భవములుం గల్లలుగాని వాస్తవము లెంతమాత్రము గావని ఘోర

సంసారాంధకారనిర్మగ్నుఁడగు ద్వైతి "పిల్లకాకి కేమి తెలియునురా యుండవిల్లిదెబ్బ"యన్నట్లోనమాలవంటి త్రయీవిద్య కొంతనేర్చుకొని తెలిసీతెలియక జ్ఞానలవదుర్విదగ్ధుఁడై యుపనిషద్విద్యన్దూలనాడుట యొకవింతకాదు - సర్వజనసఖులు సర్వభూతదయాపరులు నిత్యసంతుష్టులగు నుపనిషద్విద్యాపారంగతులగు నద్వైతులు న్యాయాభియోగశూన్యులై భ్రాంతులై ప్రేలెదరఁట యాహా యేమీ సంకరబీజ ద్వైతారూఢమిశ్రు సాహసము ? దివ్వెనంటు మిడతవలె భ్రాంతుఁడై వ్యర్థముగాఁగామ్యకర్మాగ్ని నాత్మహింసకావించుకొనుచున్నాఁడీద్వైతమతావలంబుఁడీగృహస్థీయజమానుఁడీవృథా మిథ్యాసంసారమోహపాశబద్ధుఁడీసంకరమిశ్రి అన్నిపాములు తలలెత్తిన వానపాముకూడఁ దల యెత్తెనన్నట్లు జగద్గురు శంకరాచార్యాదిపరమహంసలు గ్రంథనిర్మాణము జూచి, తా చేయఁగా శబ్దజ్ఞానమైనం దిన్నఁగాలేని మిశ్రికూడ నొకగ్రంథకర్తయై యుపనిషత్వరాణేతిహాసమతములం బ్రువ్వతిట్టినాని"యనిపించుకొనుట యత్తగారా నిస్వభావమా"యన్నట్లు వడితో మాఱు కుడువవలసివచ్చునేమో యెఱుఁగలేఁడయ్యెన్గదా? శాంకర ముపనిషద్వాదులు న్యాయమరయఁజాలరఁట ? "నవిద్యత ఇత్యవిద్యా - విద జ్ఞానే, విద్యత ఇతి విద్యా"అనుటంబట్టి వాస్తవమైనదివిద్య - వాస్తవము కాని దవిద్యయని మిశ్రి తెలియఁడా ? చీకటి నల్లగానున్నదను బాలునివాక్యము వంటిదే "బ్రహ్మణితుసహావస్థానాదవిరుద్ధాఽవిద్యా న తేనోచ్ఛేత్తుం శక్యా"అని యసందర్భముగా శబ్దజ్ఞానమైన నెఱుఁగఁజాలని మిశ్రుల యెడ వైయాకరణఖసూచి శబ్దము సార్థకమయ్యెను అతీంద్రియ ద్రష్టలయిన మహర్షు లేయుద్దేశముతో నేవాక్యమున బ్రయోగించిరో - వ్యాసాదిమహర్షి తాత్పర్య మిట్లుండునేమోయనిమాత్రము ప్రాకృతు లూహింపవచ్చునుగాని "ఇదమిత్థమ్" అనిశ్రుతిస్మృత్యర్థ

మును సంసారాంధకారనిర్మగ్నులగు మిశ్రాదిప్రాకృతజనులు నిర్ణ
యింప నెంతమాత్రమును సమర్థులు కారు కారు. "ఇదం పుణ్య
మిదం పాప మిత్యే తస్మి న్పదద్వయే, ఆచండాలం మనుష్యాణా
మల్పంశాస్త్రప్రయోజనమ్" ఇది పుణ్యము మఱి యిది పాపము నని
గుఱుతెఱుఁగుటకు మనుష్యులనందఱకిని సహజజ్ఞానమే చాలును.
శాస్త్రముతోఁ బనిలేనే లేదు తనుగొట్టుట తనకుబాధయని తెలిసిన
వానికిఁ బశువులనఱకుట కాపశువు లొవ్వకొనవని తెలియదా ?
తెలిసినప్పటికి స్వార్థైకపరత న్క్రూరులై హింసావ్యసనపరులై యొరుల
నొప్పించుట కలవడిన మొండిమనుష్యులు విధ్యుక్తమని చేతికిలోఁగిన
మేఁక మొదలగు పేదజంతువుల న్బలివేసి దేవతానైవేద్యము ప్రసాద
మని మాంసాశనమునఁ గ్రొవ్వుచుఁ దా మాచరించు హింస విధి
చోదితమని శ్రుతుల కపార్థము చేయరాదు సర్వప్రాణ్యుపకారపరు
లగు మునులు "అహింసాపరమోధర్మః" అనియే శ్రుతి తాత్పర్య
మును స్మృతిముఖమున వెల్లడించిరి "అహింసాపరమోధర్మః"
అనుట నాస్తికమత మఁట "బ్రాహ్మణే బ్రాహ్మణమాలభేత" అను
సున్నాలపన్నములోఁ బ్రతిపాదింపఁబడిన సింహవ్యాఘ్రాదిపశువుల
న్గూర్చుకొనక వెఱచి పేద మేఁకలమెడలం బిసుకుధూర్తయాజుల
దౌర్జన్యమి"స్సీసీ. ఎండిపోయినయెముక న్దినుంకించి కుక్క యా
యెముక న్గొఱకుచుఁ దనదౌడల న్గారుచున్న తననెత్తు రాయెముక
నుండి వచ్చుచున్నదని భ్రమించి తననెత్తుతే తాజుఱ్ఱు చానందించు
తీరున మఱియుం దనబొటమనవ్రేలు చీకుకొనునర్భకులవలెఁ దా
నేర్పఱచుకొన్న తనకల్లతెల్విప్రమాణముచేత సత్యముందెలిసికొను
చున్నాననుకొనుచు పశుహింస విధ్యుక్తమని యుక్తులన్వెల్లడించు
శ్రోత్రియమ్మన్యునిం బశువుగాబంధించి క్రతువాటికకుఁదెచ్చినప్పుడు
గాని "అహింసాపరమోధర్మః" అనుస్మృతి కర్థము బోధపడఁగలదా ?

"యస్మానురవదత్తత్ప్రమాణమ్" అను శ్రుతియును "వైదికైః స్మర్యమాణత్వాత్తత్పరిగ్రహదార్ఢ్యతః, సంభావ్యవేదమూలత్వాత్ స్మృతీనాం వేదమూలతా" అను శిష్టవాక్యముంబట్టియు "అతఃస్మృతయః ప్రమాణ మితి సిద్ధమ్" అని "వేదాః ప్రమాణమ్" అను విధమున నంగీకరించి సిద్ధాంతముచేసిన పూర్వమీమాంసాపండితమ్మన్యులు "వృత్తైః పుష్పైః పాయసేన విష్ణుమభ్యర్చయే ద్ద్విజః, యజ్ఞేషుయః పశూన్ హన్తి సనూనం నరకం వ్రజేత్" అను మనుస్మృతిం బాటించక మాంసాశనవ్యసనధూర్తశ్రోత్రియులు పశుహింస విధిచోదితమని క్రూరచండాలకృత్య మాచరించి కోరి తాము చెడి యితరుల నూడఁ జెఱచి నిరయగాము లగుట యెంతఘోర కలికాల దుష్టచేష్టితమో?

"యాపదేకం శ్రుతౌకర్మ స్మృతౌ చాన్య ప్రతీయతే, తావత్త యోర్విరుద్ధత్వే శ్రౌతానుష్ఠాన మితవ్యతే- తేనఫలితోఽప్రామాణ్యం శ్రుతివిరుద్ధానాం స్మృతీనామితి సిద్ధమ్" అని యిట్లు తుద కేమీ వైదికమ్మన్యమిశ్రి తన నైయాయికయుక్తి నద్దుస్సుమన్నాఁడు? వేదాంగములన్నియును స్మృతులేకదా? స్మృతులచేత నద్భుత శ్రుతుల తాత్పర్యము నిర్ణయింప శక్యముకాదుగదా? శ్రుతిస్మృతివాక్యములయొక్క వినమవిరుద్ధార్థములన్నూడ సాధించుటకు స్మృతులే సాధనములుకదా? ప్రమాణప్రమేయములవంటి శ్రుతిస్మృతులుకారణకార్యములతీరున వస్తుభేద మెంతమాత్రము లేకున్నవని యెఱుఁగ డెంత భ్రాంతుఁ డీద్వైతశ్రోత్రియమ్మన్యుఁడు? కారణకార్యములు రెండును భ్రాంతిచిత్తునకు రెండుపదార్థములుగాఁ దోఁచును దృగ్దృశ్యములగు చూపును వెల్లడియును నిక్కముగా భిన్నపదార్థములు కానేరవు- నామరూపము లారోపితములుగాని వాస్తవములగునా? సూర్యబింబమునకును మఱి యాసూర్యకిరణములకుఁగవచ్చు

సూర్యప్రకాశమునకును మఱి యాసూర్యబింబ సూర్యకిరణములను
రెండింటిని జూచుదృక్కునకు మఱి యాదృక్కున్గల ద్రష్టకు వస్తుభేద
మున్నదను తార్కికమ్మన్యుఁడుమీమాంసదర్దురాధముఁ డెంత భ్రాం
తుఁడో? పరస్పరభిన్నవస్తువులు తేజస్తిమిరములవలె నన్యోన్యగ్రాహ
కములగునెట్లు? శరీరమునకును శరీరావయవములకును వస్తుభేదము
న్నిరూపించుతార్కికపశువులు ద్వైతశ్రోత్రియమ్మన్యులు వేదశరీరము
నకు వేదశరీరావయవములగు శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషనిరుక్త
కల్పములనుస్మృతులకును వస్తుభేదము గణించి నోటికివచ్చినట్లు
వాగుచుఁ జేతికివచ్చినట్లు వ్రాయుచుఁ గేవల స్వార్థపరులై కూళత్రై
క్రతుమిషం బశుహింసకావించుచు సర్వభూతదయను హెచ్చరించు
వృద్ధమనుస్మృతిని గ్రుడ్డు ఎల్లను వెక్కిరించునట్లు "నహింస్యాత్సర్వ
భూతాని- అహింసా పరమోధర్మః" అను శ్రుతిస్మృతులు న్నిరసించు
చున్నారు- సముద్రఘోషవలె నఖండశబ్దమాత్రమగు శ్రుతికిఁ బ్రకృతి
ప్రత్యయములేర్పర్చి సార్థకమొనర్చిన స్మృతి శ్రుతికిఁ దల్లివంటిది మఱి
యును స్మృతి వేదమాత ప్రతిబింబమువంటిది ప్రతిబింబస్వరూపమగు
స్మృతి బుద్ధివంటిది- శ్రుతి యాత్మవంటిది- బుద్ధియనుగుణముం
బట్టియే యాత్మ ప్రతిపాదింపఁబడును స్మృతి ప్రకృతి- శ్రుతి పురు
షుఁడు స్మృతిశక్తి- శ్రుతి శివుఁడు "గుణగుణినో రభేదః" అని
నైయాయికుఁ డొప్పుకొనకతీఱదుకనుకనే "ద్రవ్యగుణాదిసప్తపదార్థ
ములను- ప్రమాణప్రమేయాది షోడశపదార్థములను పామరబోధకై
మొదట నుపక్రమించి "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అని బాలు
రకై కర్మపరముగా శ్రుతిని వివరించి ప్రౌఢులకుఁ గేవలాద్వైత
బ్రహ్మపరమని నిరూపించి విరమించెను- సాంఖ్యయోగ న్యాయ
వైశేషిక పూర్వమీమాంసాశాస్త్రము లుపాసనాసాఫల్యమునకై
కర్మకాండచే ద్వైతమును బ్రతిపాదించెను మఱి యుత్తర

మీమాంసాశాస్త్రము నిత్యసంతుష్టిరక్షకై జ్ఞానకాండచే నద్వైతమును ప్రతిపాదించెను.

"నాద్వైతజ్ఞానవతః కర్మాణి విధీయన్తే" అనుటచేత భూత హింసాకరములైన యాధ్వర్యవకర్మములు మూర్ఖజనులకు మాత్రమే యుద్దిష్టమయ్యెనుగాని ప్రాజ్ఞులకు సర్వభూతదయను బోధించు కేవ లోపనిషద్వైతము నే బోధించుసర్వలోకబాంధవి మానవధర్మశాస్త్ర ప్రకాశము నధ్వర్యవైదికమ్మన్యదివాంధమీమాంసిగణింకకున్నం బర మార్థమగు సుష్టనిమత్సూర్యకాంతి లోకలోపమా? శబ్దమయ వేదశరీర మపౌరుషేయమనియు నిత్యమనియు నొప్పుకొనుచున్న ద్వైతి వేదశరీరావ యవములగు శిక్షాదిస్మృతులు పౌరుషేయములు కనుక వేదశరీరము వలె ప్రమాణములు కావనుచున్నాఁడే? నామరూపభేదమాత్రమే గాని సముద్రమునకుఁ దరంగములకువలె వేదమునకు వేదాంగము లగుస్మృతులకు వస్తుభేదము లేదుగా? శరీరమునకుం ద్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణాద్యవయవములకు వస్తుభేదము లేనేలేదు దేహాంత ర్యాభూతము లే యింద్రియములగునట్లు శ్రుత్యంతర్భూతములే స్మృతులు. గుణము గ్రాహకము ద్రవ్యము గ్రాహ్యము బుద్ధిగుణము గ్రాహక మాత్మ ద్రవ్యము గ్రాహ్యము "యజ్ఞేన స్వర్గమకురుత" "యజ్ఞోవై విష్ణుః" అను శ్రుతుల కర్థము వేదాంగ మనఁబడు నిరుక్తి యను స్మృతిచేతనే నిర్ణయింపఁబడెను కృత్కృంబట్టి దృశ్యము "ప్రమితి విషయాః పదార్థాః" అనుటచేత యథార్థబుద్ధిచేత గ్రహింపఁబడునవి పదార్థములుగను స్వర్గఫలము సాధ్యము యజ్ఞకర్మము సాధనము- యజ్ఞసాధనము లౌకికము సాధ్యస్వర్గఫల మపూర్వ మలౌకికము- యజ్ఞసాధనము ప్రత్యక్షము- సాధ్యస్వర్గమ ప్రత్యక్ష మనుమానైక గమ్యము- చేతివెన్నముద్ద పాఱవైచి చేయినాకుకొను వెంగలివలె కోరి బురదలోఁ బడి రొంపలుకడుగుకొను నవివేకివలె స్వయం

ప్రకాశుఁడగు వేదపురుషునకు శిక్షాద్యవయవములు కల్పించి నిత్యా
పౌరుషేయశబ్దబ్రహ్మము నల్పితాధ్వరక్రియాకలాపముచేత శశవిషా
ణమువలె నామమాత్రప్రసిద్ధమగు లేనిపోని స్వర్గ మనుగగనారవింద
మాఘ్రాణింపఁదలఁచు భ్రాంతద్వైతమతావలంబనతత్పరశ్రోత్రియ
మ్మన్యు లెంత దేవానాంప్రియులో? తమ యాఁకలిం దీర్చుకొను
టకై మేఁకలు మొదలగుపసులం జంపి యీవైదికమ్మన్యులు తిన్న
నొంతనయముగాని యేమో ఎచ్చిపిచ్చికూఁతలు కూయుచు వ్యర్థ
ముగా నేతులు వస్త్రముల నొఱకునట్లు పాములుం దేల్చి బాధించు
తీరున క్రూరప్రవర్తనముచేత జంతుహింసగావించుచుఁ దమక్రూర
వ్యర్థధూర్తచేష్టితములు విధ్యుక్తధర్మము లనుచు సర్వభూతదయా
పరులు సర్వప్రాణ్యుపకారపరాయణులు "సర్వం విష్ణుమయం జగత్"
అను నిత్యసత్యజ్ఞానానందతన్మయులు నద్వైతమూర్తులగు పరమ
భాగవతుల నలంచుచుంట యెంతఘోరకలికాలచేష్టితమో? జంతు
వులం బోషింపఁదగిన పాలు నేయి ధాన్యాదులను వ్యర్థముగా నగ్గి
బుగ్గి పాల్చేయుచు తెలిసీతెలియు కేమేమో ప్రలపించుచుఁ జేతికి
లొంగిన మేఁకలు మొదలగుసాధుజంతువుల నోర్మ్ముక్కుచెవుల మ్మూసి
చంప "ఇంద్రాయానుబ్రూహి" యని భీకరధ్వనులొనర్చు క్రూర
క్రతుకర్మరుల స్వార్థైకపరత్వముం బ్రోత్సహించు వైదికపిశాచములం
బాఱఁదోలఁ దగినసాధన మోర్పు తప్పఁ బరమభాగవతుల కింకెద్ది?-
స్వభావముగా మాంసాహారమునఁగాని బ్రతుకఁజాలని జంతువులు
చేయుహింసమాత్రమే వైధేయహింస యనఁబడి [illegible]శా శ్రుతి
స్మృతులచేతఁ బరిగణింపఁబడలేదు కేవల శాకాహారమున హాయిగా
బ్రతుకఁగలమనుష్యు లధ్వరమిషచేఁ జేయుపశుహింస వైధేయహింస
యని మాంసాశనవ్యసనపరులగు క్రూరమానవులు శ్రుతుల కపార్థము

చేయరాదు. మనుష్యు లేమియు చేతనైనప్పటికిం బశుహింస చేయ
రాదనియే మన్వాదిఋషులు చాటుచున్నారు

"బ్రహ్మణే బ్రాహ్మణ మాలభతే" అని సున్నాలవన్నము
నందుఁ జెప్పఁబడిన మనుష్యాదిపశులనన్నింటిని దలంపుచేత
మాత్రమే దేవతలకు మానసికయజ్ఞము న్దలపెట్టుయజమానుఁడు
నివేదన మొనరించవలసినదనియే శ్రౌతాదిస్మృతి తాత్పర్యము.
మఱియుం బ్రత్యక్షమైన స్వర్గమును నుఁగొంటకై జంతుసంతృప్తి
కరములగు నన్నపానములను వ్యర్థముగాఁ జత్వరము లేనివాఁడు
సులోచనములతోఁ జూచునట్లు యజ్ఞముచేయ నవసరము లేదు స్వర్గ
మ్ప్రత్యక్షమైనపుడు గ్రుడ్డివాఁడు సులోచనములు తగిలించుకొన్నట్లు
స్వర్గము న్గనుటకై యజ్ఞ మొనరింప నవసరము లేదు కాఁబట్టి శ్రౌత
క్రియాకలాపమంతయును ఒకబంధనన్యాయమువలెఁ గేవలము మూర్ఖ
పద్ధతియేగాని యొంతమాత్రము న్వివేకకృత్యము కానేకాదు
"అశరీర మాత్మా" అనుటచేత నింద్రుఁడు కేవల తేజోమూర్తిగాని
పాంచభౌతికమూర్తి కాకుడుటచేతనే నానాదేశములం దొక
ముహూర్తమున జరుపుయజ్ఞము లన్నియును గేవల మానసికము
లగుటచేతనే మంచితలంపన హవిస్సును భుజింపఁగల్గెను కాఁబట్టి
యశరీరులగు నింద్రాదిదేవతలకై యశరీరములగు నాంతరంగిక
యజ్ఞములే చేయవలయునుగాని బాహ్యయజ్ఞములు చేయఁగూడ
దనియే శ్రౌతముయొక్క ముఖ్యతాత్పర్యము. మఱియును శ్రౌత
స్మార్తకర్మములన్నియును బ్రతిమార్చనమువలె నోనమాల
యక్కరముల తీరున కేవల మందబుద్ధు గు పశుప్రాయులకై యేర్పడి
నవి కాని వివేకవంతులగు మనుష్యుల కెంతమాత్రము న్గాదు. దండ
ధారణము పశువునుగూర్చిగాని మనుష్యునిగూర్చి కానే కాదు.
ఏమ్మాత్రమైనను వస్తువివేకముకలిగి తన పర యనుకొను తెల్విగలిగి

తన కష్టసుఖము వంటివే యితరప్రాణుల కష్టసుఖములని తెలిసికొనఁ
గలవారే మనుష్యులనందగినవారు పరులకష్టసుఖము లాలోచించక
కేవల స్వార్థపరతచేతఁ దాము వేదశాస్త్రవేత్తలమని దంభముచూపు
మనుష్యులు రాక్షసులకన్నం బశువులకన్న బిశాచములకన్న
మిక్కిలి హేయులు హేయులు

"సోమేనయజేతేతి సోమశబ్దో లతా వచః" సోమ మనఁగా
యొకవిధమైన లత యని పూర్వుల యభిప్రాయమని నమ్మికొని
మిశ్రి "సోమేన యజేత" అను శ్రుతిః మదకరమైన యొకతీఁగెను
నూఱి యది దేవతానివేదనముకావించి యజమానుఁ డామద్య
పానముచేత మత్తుఁడై యొడలుమఱచి యుల్లాసముగాఁ ద్రుళ్ళుచుఁ
దా నివేదించిన సోమలతారసపానముచేత దేవతలుకూడఁ దనవలె
మత్తెక్కి యుల్లాసమున యజమానునికోర్కె లిచ్చెద రని పామరుని
వలె శ్రుతి కపార్థము చేయుచుఁ దనవంటిపామరులచేతఁ దా వేద
వేత్త నని విఱ్ఱవీఁగుచుఁ జేతికివచ్చినట్లు తనకుఁ దెలిసీ తెలియని
యేదో భావము గల్పితముగాఁ గొని వ్యాఖ్యానరూపముగా వ్రాసి
నాఁడు "సోమేన యజేత" అను శ్రుతియందలి సోమశబ్దమునకు
సోముఁ డనఁ జంద్రుఁడు 'చంద్రమా మనసః' అనుటచేత చంద్రు
తత్త్వము మనస్సు కాఁబట్టి యజమానుఁడు తన మనస్సును శోధించు
కొని విశుద్ధాంతఃకరణుఁడు కావలసినదనియే "సోమేన యజేత"
అను శ్రుతికిఁ బండితుఁడు చెప్పఁదగినయర్థము మఱియును "అగ్నీ
షోమీయం పశుమాలభేత" అను శ్రుతియందలి పశుశబ్దమునకు
యజమానుఁ డని యర్థముగాని మేఁక మొదలగుజంతువు కానేకాదు
అగ్ని యనఁగాఁ గోర్కె గాని యగ్ని కానేకాదు ఆలభేత యనఁగాఁ
బ్రవర్తింపఁజేయట యర్థము గాని చంపుట కానేకాదు కాఁబట్టి
"అగ్నీషోమీయం పశుమాలభేత" అను శ్రుతియొక్క తాత్పర్యము

యజమానుఁడు తనయంతరంగమును నిర్మలముకావించుకొని లోకోప కారముగాఁ దన బ్రతుకును గడపుకొనవలసినదనియే. పండిత మ్మన్యుఁడు క్రూరస్వభావుఁడు జ్ఞానలవదుర్విదగ్ధుఁడు మిత్రివంటి దుర్జనుఁడు తప్ప నిక్కముగాఁ బడితుఁడెవ్వఁడును మద్యపానము (సోమపానము) చేయవలసినదనికాని మేఁకమొదలగుజంతువుల జంపి దేవతలపేరు చెప్పి తిని క్రొవ్వుమనిగాని యెంతమాత్రమును "అగ్నీషోమీయం పశుమాలభేత" అను శ్రుతికి యెల్లమ్మజాతర వంటి యుస్మత్త క్రూరకర్మపరమగు తాత్పర్యముం జెప్పనేచెప్పఁడు శబ్దము లేనేలేదు కాఁబట్టి మనుష్యులు విని యుచ్చరింపఁగలశబ్దము నిశ్చయముగా "అగ్నీషోమీయం పశుమాలభేత" అనునది యథార్థ వేదశబ్దము కానేకాదు. అద్దమునఁ బ్రతిఫలించు వందు నందుకొనఁ గేల్చాఁచు నవివేకివలె నీలోకమునఁ బ్రతిఫలించుశబ్దబ్రహ్మమును గ్రహింపఁగల్గితినని నోటికివచ్చినట్లు ఎచ్చికూఁతలుగూయుచుఁ జేతికి వచ్చినట్లసందర్భముగా వ్రాయుచుం గ్రూరకర్మలకుం బూని తాఁ జెడి యొరులఁ జెఱచు శ్రోత్రియమ్మన్యులు రాజశాసనముచేతఁగాని తిన్నఁబడరు తిన్నఁబడరు "ఏతానివై దశయజ్ఞాయుధాని" అని చేట తెడ్డు మొదలగుపనిముట్లును యుద్ధసాధనములకు నగీనపేరగు నాయుధశబ్దము లాక్షణికముగాఁ బ్రయోగింపఁబడినవుడు "పశుః" అను శబ్దము శాఖాహారవిశేషమని యేల లక్షణార్థము చెప్పరాదో? "పశుమాలభేత" మేఁకను జంపవలయుననుటకుబదులుగా ఆఁకలిఁ దీర్చి సంతృప్తియనుస్వర్గసుఖమునిచ్చుటకై యాఁకలిన్బాధపడువాఁడు ఫలాహారము చేసికొనవలయునని "పశుమాలభేత" యను శ్రుతికి లాక్షణికార్థమున శ్రోత్రియమ్మన్యుఁ డేలచేసికొనరాదో? వేదములు వేదాంగములును మొత్తముపై సకలజగదుపకారకములై నిద్రాహార

విహారసౌఖ్యమును సంపాదించుకొనఁగల యుపదేశమునే చేయు
చున్నవి కాని లోకాతీతగగనారవిందప్రాయస్వర్గమును సాధించు
కొనుమని యెంతమాత్రమును పిచ్చిచేష్టలను జెప్పనేచెప్పలేదు-
స్వార్థపరధూర్త శ్రోత్రియమ్మన్యులు పామరులన్మోసవుచ్చి సుళువుగా
నైహికభోగములం దాసం జేకొని యెక్కువగా ననుభవింపఁగా
శశవిషాణగగనారవిందవర్ణన మొనరించుచు వేదశాస్త్రములకు విపరీ
తార్థముచేయుచున్నారు- ఏనామరూపములకైన నెవ్వ రెట్లు భావించు
కొనెదరో మతేనమ్మకముచేత నెట్లు తలంచుకొందురో యావిధముగా
నర్థము స్ఫురించును "యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ"
అనుతీరుగా నామరూపములకెల్ల ముఖ్యము గౌణార్థముల నెవ్వరికిఁ
దోఁచినట్లు వారు గ్రహించుచు నహంకారమమకారదురభిమానముల
చేత నేనుం గెట్లుండునో చెప్పఁగలమను గ్రుడ్డివారివలె నసందర్భ
గ్రంథరచన కావించు వైదికమ్మన్యులు తాము చెడుటయేగాక
క్రూరులై సాధుజంతుహింస కావించుచున్నారు

## శాబ్దిక క్రియాతత్త్వము

అష్టాదశవిద్యలు ననాదులే జగముతోడివే యందులో నాల్గు
వేదము లనఁగా జగత్కారణమగు నాదబ్రహ్మమే- ఆనాదబ్రహ్మ
మును శబ్దగ్రాహియంత్రమువలె సహజపండితులగు మొదటిఋషు
లనుకరించి యాధ్వనికిఁ బ్రకృతిప్రత్యయము లుదాత్తానుదాత్తాది
స్వరములు పదములు వాక్యములుగా విభాగించి ప్రాకృతజనుల
కుపదేశించి జగమునందు మనుష్యులు హాయిగా నభీష్టసౌఖ్యము
లంటఁగల యుపాయమును జగమునందలి సకలపదార్థతత్త్వమును
బోధించునట్లు శ్రుతుల కర్థము బోధించిరి. వేదశబ్దవిభాగమును మఱి
యాశబ్దార్థమును సహజపాండిత్యమునఁ గొంతవఱకు ప్రాకృతజనులకు

ప్రతులకు తెరువు బోధించినఋషులు జగముతోనే సృష్టింపఁబడిరి కాని వారనుకరించినవేదశబ్దములు జగత్సృష్టికిఁ గారణమై జగముకంటె ముందుగా ననాదిగా వెలయుచున్న నాదబ్రహ్మమే. జగము కార్యము. నాదబ్రహ్మము కారణము. జగము నాదబ్రహ్మము యొక్క వికృతస్వరూపము. నాదబ్రహ్మమొక్కటియే సత్యసత్య పదార్థము నాదబ్రహ్మముయొక్క వికృతస్వరూపములే వేదములు వేదశాస్త్రములన్నియును. నాదబ్రహ్మము సూక్ష్మము. జగమును మఱియు నందలియష్టాదశవిద్యలన్నియును నాదబ్రహ్మముయొక్క ప్రతిబింబములు. "ఏకమేవ ద్వితీయం బ్రహ్మ" అను శ్రుతివాక్య మొక్కటియే పరమార్థములను బోధించు సకలాష్టాదశవిద్యాసార భూతమయిన శబ్దబ్రహ్మముంబట్టి తొంటివారలు ఉచ్చరించిన మొట్ట మొదటి యనుకృతవాక్యము తదనుకృతివిశేషములే తక్కిన యనంతము లయిన యష్టాదశవిద్యాబోధకములగు శబ్దము లన్నియును మఱియును వైదికశబ్దమునకుఁ గాని లౌకికశబ్దమునకుఁ గాని వాస్తవముగా నర్థనిర్దేశముపట్ల ముఖ్యము గౌణముగాను గౌణముముఖ్యముగానురూఢి యోగముగాను యోగము రూఢిగాను దేశకాలపాత్రానుసారముగా విధి యర్థవాదముగా నర్థవాదము విధిగాను భావసంబట్టియే యోజనము లెల్లయేశబ్దములను పారంపర్యముగా నేయే యర్థములందు వినియోగించుచున్నారో కనిపెట్టి యాశబ్దమున కిద్దియే యర్థ మని నిర్ణయింపఁదరముగాక ననంతవిధముల యుదాత్తానుదాత్త శ్రుతిస్వరభేదములతోఁ బ్రతిక్షణ ముపాధిమారుదలంబట్టి మాఱుచుంటచేత శబ్దార్థతత్త్వమును "ఇదమిత్థమ్" అని బ్రహ్మపదార్థమువలె తెలిసికొనుటకుఁగాని తెలుపుటకుఁగాని యేవారలకైన శక్యముకానేకాదు. ఇది వైదికశబ్దమనియు నిద్ది లౌకికశబ్దమనియు నీశబ్దమున కిద్ది యర్థమనియు నీయర్థముంబట్టి యిక్కర్మ మాచరించ

తలసినదనియు నిది విధి యనియు నిద్ది నిషేధ మనియును నోటికివచ్చి
నట్లు వాగుచుఁ జేతికివచ్చినట్లెల్ల వ్రాయుచుఁ దెలిసీతెలియని మను
ష్యులు వెఱ్ఱికుదిరినది రోఁకలి తేరా తలకుచుట్టుకొనెదనన్న ట్లాకస
మున మిద్దెంట్లు నవివేకజంతువులు మనుష్యులు తక్వమతేజంతువులు
స్గావు కావు- కాఁబట్టి బ్రతుకుసౌఖ్యము లేనిపోనివిచ్చియూహాలు
లేని తక్కినజంతువులవలె మానవజంతువులకు లేనేలేదు- తద్దినము
కొని తెచ్చుకొన్నట్లు విధినిషేధచ్ఛాందసకర్మములు శ్రుతిస్మృతివిచార
మునుతక్కినజంతువులవలె నాహారవిహారసౌఖ్యములతో హాయిగాఁ
దమ బ్రతుకుఁ గడపుకొనఁ దగినబుద్ధిసహజముగా లేని దౌర్భాగ్యజీవు
లీమనుష్యులు - శ్రుతులనియును స్మృతులనియు విధులనియు నిషేధము
లనియును "శతాంధా కూపం ప్రవిశన్తి" అనురీతిగా మూనాళ్ళ
ముచ్చట బ్రతుకులోఁ గోరికోరి సకలజీవులకు సమముగా భగ
వంతుఁడు సహజముగా నేర్పర్చినజీవితసౌఖ్యముం జెడఁగొట్టుకొనుచు
నూకదంపువలెఁ గొఱమాలినచేష్టలుచేయు చద్దముంజూచుకొని
వికారకుడు నహంకారమమకారబద్ధులవలెఁ దమకున్న శ్రుతిస్మృతుల
చేతఁ దమనీడఁ దాము చూచుకొని లేనిపోని చింతలపాలై నిద్రాహార
విహారసౌఖ్యోపాయము లరసికొనక నిక్కముగా వ్యర్థసంసారమున
దేవులాడుచున్నారు

అగ్నిశబ్ద మొదుగయి వేదాధ్యయనముచేయుచు నగ్నివలె
శుచిగానుంటచేత బాలునకు వర్తించునపుడు "అగ్నిర్మాణవకః"
అని యగ్నిశబ్దమునకు లాక్షణికార్థము గౌణము- మఱియు వంటకట్టె
యల నంటించువేఁడి కగ్నిశబ్దము వాచకార్థము ముఖ్యము - కాఁబట్టి
ప్రతిశబ్దముయొక్క యర్థము భావనావశము- మఱి యేశాస్త్రమైనను
వివక్షామూలమే కనుక నెవ్వరెవరిభావననుసరించి వారువారు తమ
యిచ్ఛానుసారముగా నామరూపాత్మక జగత్కార్యము లన్నింటిని

గ్రహించి తమయూహచొప్పున నానానామరూపతత్త్వము న్నిర్ణయించుకొని కర్మము లాచరించుచున్నారు. ఏనామరూపములతత్త్వ మెట్లున్నను వేదశాస్త్రప్రవక్తలగు మును లేతాత్పర్యముచేత నేకర్మములు విధించినను సకలవేదశాస్త్రములు మొత్తముసర్వజగదుపకారప్రయోజకములే కావున దేశకాలపాత్రానుసారముగ మనుష్యులందఱును బరస్పరప్రేమానురాగములతో నారోగ్యముగా హాయిగాఁ జిరకాలము బ్రతుకఁదగినయుపాయములనే సర్వజ్ఞులును సకలభూతదయాపరులును నిఖిలజనసములగు మహర్షులందఱును బహువేదశాస్త్రముఖముల ననాదిగా భూతభవిష్యద్వర్తమానసముయోచితములుగా సకలలోకోపకారమగువిధమునుమాత్రమే బోధించుచున్నారని యేమాత్రపుబుద్ధిగలమనుష్యులైనను గ్రహించి మంచినడువడి న్నాము సుఖపడి తమతోడిపాటిజనుల న్సుఖపెట్టుచుందురు. స్థూలసూక్ష్మదశాభేదములు తప్ప నామరూపముల కెద్దానికైనను మతభేదవిశేషములైనను సహజముగా లేనేలేవు. వ్యక్తావ్యక్తిదశాభేదములుతప్ప నామరూపాత్మకజగమునఁ దక్కిన వర్ణభేదములన్నియును వాస్తవములు కానేకావు. స్వప్నకల్పితస్వప్నప్రపంచమువలె మిథ్యాభ్రాంతికల్పితములే

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత, అవ్యక్తనిధనాన్యేవ కాతత్ర పరివేదనా" "యద్దృశ్యం తన్నశ్యమ్" "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అను యథార్థవస్తుతత్త్వమెఱిఁగిన ఋషులు దప్ప బ్రాకృతజనులందఱును భ్రాంతులే కావున మంత్రద్రష్టలు కలరని తన్నుగన్నవా రున్నారని నమ్మకొనకతీరనిచందమున నమ్మవలసినదేగాని యామంత్రములే మనుష్యు లుచ్చరించు "ఇషేత్వోర్జేత్వా" అను మంత్రశబ్దములని నిర్దేశించుటకుఁ బ్రమాణ మెద్దియును లేనేలేదు తనకుఁ దల్లికలదనుటకుఁ బ్రమాణమున్నది తనయున్కికిఁ బ్రమాణము సహజముగా నాత్మానుభవమే ప్రమాణము. కాని

తనకుఁ దల్లి కలదనుకొనుట సహజానుభవసిద్ధప్రత్యక్షప్రమాణము లేనేలేదు. కాఁబట్టి వెనుకటిదానిఁ దలంచుకొని వెక్కివెక్కి యేడ్చెనన్నట్లు పరోక్షచింతచేయుటకే నడువడిచే హాయిగాఁదనబ్రతుకుగడవుకొనవచ్చునో యట్టి సకలజనసమ్మతమగు ప్రవర్తనముకలిగి వివేకి యొరులన్సుఖపెట్టి తా సుఖపడుచు నిత్యసంతుష్టుఁడై సచ్చిదానంద తత్త్వమున లీనుఁడై సంసారబాధమునుండి తప్పించుకొని ప్రకృతి కంటక భ్రాంతినందకసర్వసముఁడై కపిలాదిమునివలెఁ గైవల్యానంద పదవి నోలలాడుచున్నాఁడు దైవకృతములగు గ్రహచారవిశేషకార్యముం బురుషప్రయత్నముచేత నడ్డఁ దరముకాదుగాని పురుషకారముం బురుషప్రయత్నముచేత స్వాధీనము కావించుకొని సుఖపడ నెంచుట సర్వజనసాధారణప్రత్యక్షానుభవమేకదా?

అత్యాసన్నభూతభవిష్యత్కాలవిచారణము వర్తమానకృత్యముల నెఱవేర్చుకొను దారిచూపునుగనుకనే ప్రపితామహు నాబ్దికమున స్మరించువాఁడును ప్రపౌత్రుని మోము గన్నవాఁడును మిక్కిలి ధన్యులను న్యాయ మొంతయును గణనీయము. అనఁగాఁ ప్రపితామహునినాఁటి గతకాలమునాఁటి యాచారానుసారముగాఁ బ్రవర్తించుచుఁ బ్రపౌత్రుఁడు కలుగు భవిష్యత్కాలమువఱకు సరిపడునంత ధనసంగ్రహముకావించుకొనువాఁడు మిక్కిలిబుద్ధిమంతుఁడై తా సుఖపడి తనయిరుగుపొరుగుల సుఖపెట్టఁగలఁడు కాఁబట్టి నూటయిరువదేండ్లకంటె వెనుకటివిగాని ముందిటివిగాని భూతభవిష్యత్కాలములందలి మనుష్యాచారములను వర్తమానకాలమందు చింతించుట యుబుసుపోని మంగలి పిల్లితల గొఱుగటవలె మిక్కిలి కొఱగానిపిచ్చిచేష్ట యని యేమాత్రము బుద్ధిగలవాఁడైనను దెలిసికొని తనతోడిపాటివారికిఁ దెలుపకమానఁడుమానఁడ, మానఁడు ఇషేత్వాది వేదములను ఇకోయణజాదిశాస్త్రములనూటయిరువదేండ్ల క్రిందగతించిన

కవుల గ్రంథములకు కొనగలగేదెకు పెట్టఁగలబచ్చలి యను సామె
తగా నూటయిరువదేండ్లజీవదయకుఁబోవు కార్యము ను నిక్కముగా
బుద్ధిమంతుడు విచారించఁడు జగమునందలి జనులందఱుం బరస్ప
రానురాగముతో హాయిగాఁ దమబ్రతుకుఁ గొనసాగించుకొనుపా
యమును బట్టుదలతో వెదుకుటకన్న నిక్కముగా నవశ్యకర్తవ్య
కార్యమింకెద్దియు న్గానేకాదు. బ్రతికిన దూరు మానినది మం దన్న
సామెతగాఁ దనజీవితసౌఖ్యమును బరోక్షముగాఁగాని ప్రత్యక్షముగాఁ
గాని కావించువాఁడు తనపాలిటి దేవుఁడు తా నట్టిదేవునియెడలఁ
కృతజ్ఞతచూపుటకన్న వేఱేపురుషకార మింకెద్దియు న్గానేకాదు
అట్టిపురుషప్రయత్నము ఫల మొరులనుసుఖపెట్టి నొరులయనుగ్రహ
ముచేఁదా సుఖపడుటయే. కాఁబట్టి వెఱ్ఱిమొఱ్ఱి యూహలతో లేని
పోనిచింతలపాలై తెలిసీతెలియని వేదశాస్త్రిచర్చలతో నాకాశ
పంచాంగముల బోధింపక ప్రకృత్యోపయోగమగు మంచినడువడితో
నొరుల సుఖపెట్టి తా సుఖించుటయే నిక్కమగు మానవధర్మము
ధర్మము

“అవశ్యం కల్పనీయం హి మంత్రస్య బ్రాహ్మణస్యవా,
గౌణత్వం తచ్చ మంత్రస్య యుజ్యతే” అనుటచేతను మఱి
కవ్వడు విధిలిఙ్ప్రత్యయములోదర్థమందుమాత్రమే గౌణముగా
“లభేత సికతాసుతైలమపి యత్నతః పీడయన్” అనుతీరుగాఁ
బ్రయోగింపఁబడుటచేతను ముఖ్యముగా నేశబ్దమున కేది
ముఖ్యార్థమో యేది గౌణార్థమో తెలిసికొనుటకు శక్యముకాకుంట
చేతను దేశభాషంబట్టియే దేవభాష కిది యర్థ మని ప్రాకృతజనుల
బోధను కేవలము విశ్వాసముచేతమాత్రమే ‘సర్షపః” అన్నఁగా
నావా లని ప్రత్యక్షముగా గురువులు తెల్పినపుడఁగాని తెనుఁగు
మొదలగుదేశభాషలనుమాత్రమే చదువుకొనకముం దలవడిన బాలు

రకు తెలిసికొనుట మిక్కిలి యసాధ్యమగుటచేతను వేదవేదాంగ శబ్దముల యథార్థతత్త్వము నిర్దేశింప నెవ్వరికిం దరముకాదుకనుక మిస్త్రి మొదలగు వైదికమ్మన్యులు దేవభాష తమకుఁ దెలిసినట్లు ముని సూత్రములకుఁ దమకుఁ దోఁచినట్లు యేమో పిచ్చిపిచ్చి వ్యాఖ్యాన ములను దెలిసీతెలియని వాక్యములతోఁ బ్రకటించుట మిక్కిలి కొఱగానిదని అపౌరుషేయములగు మంత్రబ్రాహ్మణాత్మక వేదముల కతీంద్రియవేత్తలగు జైమిన్యాది మునులు వ్రాసిన సూత్రములకుఁ దగిన వ్యాఖ్యానము లాజైమిన్యాదిమహామునులకు తెలియునుగాని ప్రాకృతు లగు మిస్త్రి మొదలగు మర్త్యు లెంతమాత్రమును దెలిసికొననేరరు నేరరు- "కోవక్తా తారతమ్యస్య తమేకం వేదసంవినా ఆగమాః ఖలు దుర్లభాః" అనుటచేతఁ బరమార్థములను మునులు తప్పఁ బ్రాకృతమర్త్యులు తెలిసికొంటిమనుకొనుట యచ్ఛదార్జ్యము దార్జ్యము- దేవభాష దేవతలకుమాత్రమే యుద్దిష్టమగుటచేతనే దేవభాషనాఁ బరఁగెను కాఁబట్టి వేదవేదాంగములు కేవల మతీంద్రియజ్ఞానముగల మునులకై మాత్రమే ప్రవర్తిల్లుచున్నవి వేదశాస్త్రవేత్తలమని దుర్జనులుతప్ప సజ్జను లెన్నఁడును విఱ్ఱవీఁగి తనతోడిపాటిజనులను వంచింపనే వంచింపరు "వచనాద్ధి సకల ప్రయోగోగమ్యతే- తత్రావిద్యమానార్థాన్యపి పదాన్యదృష్టాయ ప్రయోక్తుం శక్యంతస్మా దిష్టదేవతానురోధేన వచనాదితి నిష్కర్షః" అని లోకోపకారమునకై దేవతల నారాధించునపుడు సూక్త వాక్యమునకుఁ బర్యాయపదమైన వైదికశబ్దమునకు యథేష్టార్థమును జెప్పుకొనవలసినదని నిష్కర్ష చేయు శ్రోత్రియమ్మన్యమిస్త్రి "పశు మాలభేత" అను శ్రుతికిఁ బ్రతిగృహస్థును సర్వజనరంజకముగాఁ దను బ్రవర్తింపఁజేయుమని భగవంతు సహర్నిశమును విధిగాఁ

ప్రార్థించవలసియు దనను నర్థమేల నిష్కర్ష గావించి వివిధాహార
ద్రవ్యము లగ్గిపాలుచేసి వ్యర్థముగాఁ గూళతనమున దేవతాప్రీతి
చేయు నెపమున మేఁకలంబట్టి చంపెడు క్రూరకర్మముల మాను
కొనుటయే యెక్కుముగా మనుష్యావశ్యకార్యమని తెలిసికొని సర్వ
భూతదయాపరుఁడై తరింపఁజాలక యధోగతిపాలగుచున్నాఁడేమి ?
"అగ్న ఆయాహి వీతయే" అను శ్రుతి స్వభావముగాఁ బ్రతిదేహియును
దనకోర్కె నీర్చుకొనుటకై ప్రయత్నపడవలెనని యర్థము వేద
మనఁగా దెలివి బ్రతుకుచున్న ప్రతిజంతువునకు దేహమున్నట్లే
తెలివికూడ యుండుట యూపిరితీసికొనుటవలె నైజగుణము. స్వభావ
మును బ్రతిజంతువునకుఁ దెలుపు నామరూపములే సకలవేదస్వరూపము
"యథాలోక స్తథా వేదః" అనుటచేత జగమే వేదము వేదమే
జగము. జగత్తునకును వేదమునకును వేఁడికివలె భేదము లేశ
లేదు కాఁబట్టి బ్రతుకు లోకము వేదమను నీమూఁడుశబ్దములు
భూమి నేల పుడమి యను శబ్దములవలెఁ బరస్పరపర్యాయపదములు.
విశ్వమ్ అను నామము మొదలుకొని సర్వప్రహరణాయుధః అను
నామమువఱకున్న విష్ణుసహస్రనామములన్నియు నొకవిష్ణుదేవుని గూర్చి
వివరించు పర్యాయపదములే యయినట్లు "అగ్నిమీళే పురోహితమ్,
ఇషేత్వోర్జేత్వా" అను వేదమంత్రములన్నియును సకలమర్త్యజీవిత
మును వివరించు పర్యాయపదములే. ఈజగమంతయును గోర్కెయొక్క
రూపమే. మఱి కోర్కె నీర్చి సంతుష్టి నొసంగు నుపాయమే దేవుఁడు.
కోర్కె నీర్చుకొని సంతుష్టి పొందఁదగిన యుపాయస్వరూపుఁడగు దేవుని
యొక్క వాస్తవతత్త్వము సకలజనసమ్మతమగు సత్ప్రవర్తనమే.
కాఁబట్టి ప్రతిమనుష్యుఁడు దనతోడిపాటివారి యనుగ్రహమును సంపా
దించుకొని సంతుష్టుఁడగుటకన్నఁ జేయఁదగిన యజ్ఞము మఱేదియును
గానేకాదు కాదు. తనయూపిరి తానెట్లు తీసికొన్నఁ దనకు హాయిగా
నుండునో యాసంగతి నిశ్చయించుకొనుటకుఁ దనమట్టుకుఁ దానే

ప్రత్యక్షప్రమాణము కాఁబట్టి తక్కినయనుమానోపమానశాబ్దిక ప్రమాణములన్నియును ముంజేతియద్దమువలె నిక్కముగా వ్యర్థములు నవహాస్యాస్పదములు కావా? కాఁబట్టి యీవైదికమ్మన్యుఁడా నీవేదశాస్త్రశుష్కతర్కము న్మానుకొని గతమేమైననేమి యాగత మెట్లున్ననేమి నీబ్రతుకున నొరులసుఖపెట్టి నీవుసుఖించునట్లు నడుచు కొనుము "ప్రకృతమనుసరామః పాయసం భక్షయామః" అనుతీరున నేయొండకా గొడుగుఁబట్టి నీబ్రతుకును గాపాడుకొనుటకై నీతోడి పాటివారియనుగ్రహమును సంపాదించుకొనుతెన్నున నడుచుకొనుము వేదశాస్త్రములు తెలిసినట్లు నిన్నుమోసపుచ్చి సోమరులై నీచేత సేవచేయించుకొని సుఖపడనెంచుదుర్జనుల తక్కిరిబిక్కిరిమాటలు డంభవేషము లెంతమాత్రము న్నమ్మకుము. నీబ్రతుకుకన్న మఱి వేఱే దేవుఁడు లేనేలేఁడు. నీవుసంతుష్టిపొందుటకన్న స్వర్గము మఱివేఱే లేనేలేదు. మఱియు నాదేవుఁడు నాదేవునిద్వారకమగు స్వర్గమును జనరంజకమగు నీనడువడికన్న మఱెద్దియు న్గానేకాదు. తన వీఁపే తా దెలియఁజాలని మూఢమానవుఁడు దేవునిగూర్చియు వేదశాస్త్రములనుగూర్చియు స్వర్గనరకములఁగూర్చియును దెలిసినట్లు నటించు టెంత మోసము? తన తలిదండ్రులెవరో రూఢిచెప్పఁ జాలని మూఢమానవుఁడు తనవర్తమానజీవితకాలముయొక్క పరోక్ష భూతభవిష్యత్తులఁగూర్చి యుపన్యసించు గగనారవిందవర్ణన యథార్థ మనుకొనిపరమార్థసాధనమగునీజీవిత మూఱక పాడుచేసికొనకుము ప్రకృత మనుసరించి నీ నిద్రాహారవిహారసౌఖ్యము ను సంపాదించు కొనుట కెట్లు నీతోడిపాటివారియెడ నీవు నడుచుకొనవలసినదో బాల్యముగడచినపిమ్మట నీమట్టుకు నీకే సహజముగాఁ దెలియక మానదు. నీయాత్మ స్వయంప్రకాశము "ఆత్మావా అరే శ్రోతవ్యో మన్తవ్యోనిదిధ్యాసితవ్యః" అనుశ్రుతిబోధ నీయూఁపిరి నీకు సహజ

ముగాఁ గాలానుసారముగా లభించినట్లు కలుగకమానదు. కాఁబట్టి వెట్టి మొట్టిపోకిళ్ళుమాని తలకుమించినమాటలాడక "తగినవేషంబు తనుఁదానఁ బొగడుకొనమి నొచ్చియును గీడు పలుకమి యిచ్చి వగవకునికి, తన కెంత గల్గియున్నఁ, బథము తప్పకుండుట నడువడి కొప్పఁ జేయు" ప్రత్యక్షముగా నీతలిదండ్రులు పెద్దలుచేయుబోధను శ్రద్ధతెచ్చుకొని పెద్దకొండల కెపళ్ళుబెట్ట కొరులసుఖపెట్టి నీవుసుఖపడుమనియే సర్వవేదశాస్త్రముల ముఖ్యతాత్పర్యమని తెలిసికొని యన్నివిధములచేత సకలజనరంజకుఁడవై సర్వభూతదయాకరుఁడవ్వు నివై నన్న నీబ్రతుకు మత్తేప్రవర్తనముచేతనైనను విన్నపడదు తిన్నపడదు. నీతోడిపాటివారి సుఖపెట్టినఁగాని నీబ్రతుకు నీకు సుఖము కానేరదు. నీకోర్కెనీడేర్చుకొని సంతుష్టిపొందుటకన్న మఱి వేఱే నివు చేయవలసినపని లేనేలేదు

## విశ్వమాంగళ్యబోధ

"ప్రజాపతిరకామయత ప్రజాః సృజేయేతి. సతపోఽతప్యత స్మాత్తేఽపానాత్త్రితయోదేవా అసృజ్యన్తాగ్నిర్వాయు రాదిత్యస్తే తపోఽతప్యన్త తస్మాత్తేపాన్తేభ్యస్త్రయోవేదా అసృజ్యన్తాగ్నే ఋగ్వేదోవాయో ర్యజుర్వేద ఆదిత్యా త్సామవేదః" ప్రజాపతి యను దేవత ప్రజలను సృజింపఁగోరి తపస్సుచేయఁగా యతని తినుకు నుండి యగ్నియు వాయువు నాదిత్యుఁ డను ముగ్గురు దేవతలుపుట్టిరి మఱి యామువ్వురు తపస్సుచేయఁగా వారి యథఃకాయములనుండి తినుకఁగా ఋగ్యజుస్సామములను మూఁడువేదములు పుట్టినవఁట. యేమీ ఎచ్చిపల్కులు ఆకస మవ్వా యెందు కంత దూరముగా నున్న దనఁగా మనుమఁడా నాచిన్నప్పుడు నాపీఁపునకుఁ దగులు చుంట కోర్వక నాచీపురుతో నాయాకాసము నెగురఁగొట్టినాను కాఁబట్టి నాచీపురుదెబ్బల కోర్వ కాయాకాసగాఁడు భడిసి యంత

మీఁద నంటుకొన్నాఁడని యవ్వ యాపిల్లనికి సమాధానము చెప్పిన ట్లున్న దీయసందర్భమంత్రార్థము లీబ్రాహ్మణవాక్యములు. కష్ట పడి వ్యవసాయముచేసి పండించుకొనితనతోడిపాటివారి కన్నవస్త్ర సౌఖ్యమున్గలిగించి తాఁ దిని సుఖపడలేని సోమరిపోతు లుబుసు పోఁ గొట్టుకొనుటకై వాగుఁచ్చికూఁతలు వెఱ్ఱిచేష్టలుగా కీమంత్రబ్రాహ్మ ణము లీశ్రౌతకర్మములు వేఱు కావు. ఆఁకలిదప్పికలు తీర్చునన్నపాన ములే దేవతలు మఱి యాయన్నపానములను సంపాదించుకొను తెరువులే శ్రౌతకర్మములు హాయిగా బ్రతుకుటయే స్వర్గము. ఒరులసొఖపెట్టి తాము సుఖపడుబుద్ధిమంతులు కేవలము సోమరిపోతు తుంటరులకుమాత్రము ప్రొద్దుపుచ్చుకొనుటకుమాత్ర మేర్పడిన యసందర్భప్రలాపములు పిచ్చిచేష్టలగు మంత్రబ్రాహ్మణశ్రౌతకర్మ ముల నెంతమాత్రము న్దుపెట్ట దగదు తగదు

"యశ్శబ్దస్య శ్రవణాదేవ వినియోగః ప్రతీయతే స శ్రౌత ఇత్యుచ్యతే" ఏధ్వని వినినతోడనే యేదైనఁ బని చేయఁ దలంపు గలుగునో యట్టి పని శ్రౌత మనంబడును. తినుమనుపలుకు వినిన తోడనే తినుపని శ్రౌత మనంబడును. శ్రుతి యనఁగా వినుట. శ్రౌత మనఁగా వినంబడినధ్వనియొక్క యర్థముంబట్టి నడుచు కొనుట. మొత్తముపైఁ దనకు వినంబడినధ్వనింబట్టియు నగపడిన యాకారముంబట్టియు మఱియుం దనసకలేంద్రియములకు న్గోచరము లగు శబ్దస్పర్శరూపరసగంధముల న్దాను గ్రహించినవిధముగాఁ దన యిష్టాయిష్టముల ననుసరించి తాఁ జేయుపని శ్రౌత మనంబడును. కాఁబట్టి యీజగమునందు సమస్తప్రాణు లొనర్చుమనోవాక్కాయ కర్మములన్నియును శ్రౌతకర్మములే. "యథాలోక స్తథా వేదః" సృష్టిస్థితిలయముల జరుగుపనులన్నియును మొత్తముపై జగత్కా ర్యములన్నియును వేదవిహితయజ్ఞకర్మములే శ్రౌతక్రియలే. జగత్తు

శ్రౌతకర్మము- శ్రౌతకర్మచే జగత్తు- సమస్తజంగమస్థావరప్రాణుల
కన్నింటికిని చైతన్య మొక్కటియే- మనుష్యప్రాణమునకు నద్కిన
జంతువులప్రాణమునకు స్థావరప్రాణుప్రాణమునకునువిశేషమైనభేదము
లేనితీరున సర్వప్రాణుల నిద్రాహారవిహారకర్మఫలమునకు యజ్ఞకర్మ
ఫలమునకు న్భేదము లేనే లేదు- జగమంతయును యజ్ఞమే సమస్త
జంతువులును దమతమ నిద్రాహారవిహారసౌఖ్యమునకై చేయు
ప్రయత్నమంతయును విధిచోదితశ్రౌతకల్పమే- సమస్తజంగమస్థావర
ప్రాణులబ్రతుకంతయును యజ్ఞమే- బుద్ధికృతములు మఱి యబుద్ధి
కృతములని యజ్ఞకర్మములు ద్వివిధములు-జంగమప్రాణుల బ్రతుకులు
బుద్ధికృతయజ్ఞములు- స్థావరప్రాణుల బ్రతుకుల బుద్ధికృతయజ్ఞములు-
కాఁబట్టి జగమునందు జరుగుచున్న పనులన్నియును స్వర్గసాధనములగు
విధిచోదితశ్రౌతకర్మములే- ఈజగమంతయు సాలెపురుగుకడుపులో
నుండి నూలు పైకివచ్చి తిరిగి యాసాలెపురుగుకడుపులోనికే పోవు
నట్లు వాసుదేవునిలీలచేతఁ గలిగి యావాసుదేవునియందే లీనమగు
చున్నది "కర్తాభోక్తాజనార్దనః తమేవ భాన్త మనుభాతి సర్వమ్
సర్వం బ్రహ్మైవఖలు ఈశ్వరస్సర్వభూతానాంహృద్దేశేఽర్జునతిష్ఠతి*
అను విధమున "హరిమయముకాని వస్తువు పరమాణువులేదు వంశ
పావన వింటే" అన్నట్లీజగమంతయును యజ్ఞమే "యజ్ఞో వైవిష్ణుః"*
"హరిరేవ జగజ్జగదేవ హరిర్హరితో జగతో నహి భిన్నతనుః"*
అనుటచేతను స్వర్గాపవర్గస్వరూపుఁడై సమస్తజగద్రూపము యజ్ఞ
మూర్తియై సకలభూతాన్తర్బహిస్సంగతుఁడై ప్రత్యక్షస్వర్గమైనసకల
ప్రాణిజీవనస్వరూపముగానున్న శ్రీకృష్ణపరమాత్మను మిథ్యాశ్రౌత
కర్మల న్సాధింపఁబూనుట యొడిలోనున్న బిడ్డను వెదకుట యాకసో
మునే మిద్దెలల్లుటవలెనే రిక్తవ్యర్థమిథ్యాసంసారకృత్యములన్నియును
మిక్కిలియవివేకకార్యములే- యెందుకిన్ని డొంకతిరుగుళ్ళు వాసు

దేవుఁడు తప్ప వాస్తవమింకెద్దియు న్నాదని తన యహంకారములు విడుచుకొనగల్గిన యద్వైతస్థితిమాత్రమే ప్రత్యక్షస్వర్గాపవర్గస్వరూపము మిథ్యాహంకారమమకారకల్పితసంసారమంతయును ప్రత్యక్షనరకదుఃఖస్వరూపము. బెబ్బులిం దప్పించుకొనఁగోరి యవివేకముచేత భ్రాంతుఁడై యాబెబ్బులిచెంతకే పోవుదేబెవలె చేతనున్న వెన్నముద్దన్నెలపాల్కావించుకొని యుత్తచేయి నాకుకొను వెంగలివలె బిడ్డనొడిలోన పెట్టుకొని యూరెల్ల వెదకుఁవెఱ్ఱవలెఁ దాఁ గోరినస్వర్గమే తనప్రబతుకురూపమునఁ దాఁ బ్రత్యక్షముగా ననుభవించుచుండియు వృథాప్రయాసమున రుచ్యము లగు నన్నపానములు తనతోడిపాటివారికిచ్చి తాఁ గుడిచి సుఖింపక స్వార్థపరుల ధూర్తప్రలాపముల నమ్ముకొని పాల్పెరుగు నేయి మొదలగ్గుతినఁబడినదార్థములన్నియును భ్రాంతులై యజ్ఞమునెపమున నగ్గి బుగ్గి పాల్గావించుకొను మూర్ఖుల దురదృష్ట మెంతయును శోచనీయము మును లుపకారమునకై యనుభవింపఁదగిన పద్యాశనము బోధింపఁగా వారియాజ్ఞచొప్పున నడువనేరక ధాన్యమును దంచుకొని మెత్తగా వండుకొని తిన కన్నమును కుళ్ళఁబెట్టి సారాయి చేసికొని త్రాగి మత్తునఁ జెడిపోవు మూర్ఖులచందమున మునులయుద్దేశము ప్రకారము సర్వలోకోపకారముగా నడువనేరని మోనకాంద్రును మఱియెద్దియు న్దెలియని యవివేకులు శ్రౌతస్మార్తకర్మములన్నియును విపరీతదృష్టులై యప్రయోగముకావించి కోరి దుఃఖము న్గొనితెచ్చుకొనుచున్నారు

ఇది శ్రీమదజ్ఞాడాదిభట్ట నారాయణదాస విరచితమగు

జగజ్జ్యోతియందు నిష్కృష్టప్రత్యభిజ్ఞాన నిర్ణయ నిర్వచనము



# జగజ్జ్యోతి

## నాలుగవ ప్రకాశము

### కాలగతి

లోకమునందలి జనుల యభిప్రాయములం దెల్పుకొను చతుర్విధాభినయవిశేషములు సకలలోకోపకారములుగా మఱియును సకలజనరంజకములుగా మఱియును సర్వజనసాధారణములుగా సకలజనులు ననాదిగాస్వభావముగా నేర్పాటుచేసికొనుచున్నారు నిద్రాహారముల వ్దనివిచెంద మిగిలిన కాలమునఁ దిరిగి నిద్రాహారసౌఖ్యమునకు సహాయమొనర్చుటకు ముఖ్యహేతువగు విహారము సుభయకారకముగాఁ కృషివాణిజ్యములం ద్రికరణశుద్ధిగా సజ్జనులు పాటుపడి యొరులను సుఖపెట్టి తాము సుఖించెదరు సోమరిపోతుటక్కరికూళమోసకాండ్రు వేదవేదాంగగగనారవిందవర్ణనములతో మూఢులం బెదరించి డంభవేషములతోఁ ద్రిపుండ్రధారణములతో మడిమైలదంభవేషములతో శ్రౌతస్మార్తవ్యర్థకర్మకలాపముతో నితరుల కన్యోన్యమతద్వేషములు పుట్టించి యొదలువంచి కష్టపడి తమకూడుసంపాదించుకొనుటకు బద్ధకించి యన్యాయముగా మోసమున బ్రతుకనెంచి వేదములనియు శాస్త్రములనియు స్వర్గనరకములనియు జాతిమతవిశేషములనియును లేనిపోని టక్కరిబూటకపుమాటలుం దిలకాష్ఠమహిమబోధములవలె నసందర్భగ్రంథవిశేషములను వేదవేదాంగములు దైవనిర్మితము లపౌరుషేయము అని యనాదికులసంప్రదాయానుసారముగా ధూర్తకల్పితవర్ణసమామ్నాయమునుబఠించుచు

వృథా పశుహింసాదిదంభకర్మము లాచరించుచు శ్రోత్రియులమని,
యగ్రజాతులమని, సన్న్యాసులమని, మఠాధికారులమని, పూజారుల
మని, పురోహితులమని లోకుల నెట్లయిన రంజింపఁజేయనేరక కులము
నుండి వెలి చేసెదమనియును- చామరులను బెదరించి క్రతుమిషలన్
షోడశకర్మాచరణములచేఁ బశుహింసకావించుచు భూతములవలె
లోకుల నగ్గలపెట్టి పీడించుచు సోమరిపోతులై దంభవేషములతోఁ దామే
యార్యులమనియుం దమదేశమే కర్మభూమి యార్యావర్త మనియుం
దక్కినవా రనార్యులు మ్లేచ్ఛులుం బతితులు పాషండులు నరకపాత్రు
లని సారకాయలు నఱకు వంచకులుకల్పించినగ్రంథములే యా
ధూర్తులు వెల్లడించు వేదవేదాంగములు- వాస్తవముగా సకల
లోకోపకారకములు సర్వభూతదయాపరములు సకలజనరంజకములు
నిద్రాహారవిహారసుఖసాధనములుగాని పలుకులుగాని కర్మములుగాని
వేదవేదాంగములు కావని అనాదివంచకరాక్షసపారంపర్యకల్పితములని
సిద్ధాంతీకరింపకతీఱదు ఈడుముదిరినకొలందిని మనుష్యులు నిద్రా
హారవిహారపాటవముఁ గోలుపోయి లోకోపకారముగాఁ గాయక్లేశము
పడుట మాని కేవల కాయకష్టసాధ్యములగు పనులను యావన
వంతుల కప్పగించి తాము సుఖముమరగి కూర్చుండి యన్నలను దమ
యిష్టానుసారము నడిపించుచు సోమరులై లేనిపోని శాస్త్రచర్చలం
బ్రొద్దుపుచ్చుచు తమరచించినగ్రంథములందుఁ దమ యిష్టానుసారము
తమకుసిలితనపు గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసాశ్రమములచే బ్రహ్మ
క్షత్రియ వైశ్యులు తమజీవనము గడపుకొనవలయుననియును
శూద్రులు మాత్ర మా ద్విజ సేవచేతను జీవనము వెళ్ళపుచ్చవలసిన
దనియును ఎన్మిదివిధములయిన వివాహములచే నీచాతుర్వర్ణ్యము
సంసారమున చేసికొనవలయుననియును ఈనాల్గువర్ణములం దన్యోన్య
స్త్రీపురుషదుష్టసాంగత్యముచేతఁ బుట్టినవారు నానావిధసంకరవర్ణులై

చండాలాద్యధమజాతులలోఁ జేరి కులబాహ్యులు కర్మబాహ్యులు
పతితులునై నరకభాజనులగుచున్నారని చెప్పుచు ఆహారనిద్రావిహార
సామర్థ్యముఁ దొలఁగి ముదుసళ్ళు పిన్నలం దిన్నగ సుఖజీవనము
గడపనీక నేమేమో పిచ్చిబోధలు చేయుచు నసందర్భపుగ్రంథము
లల్లుచు మనుష్యుల కన్యోన్యద్వేషములు పుట్టించుచు పుచ్చినగొఱ్ఱె
మందనంతయుఁ జెఱచునట్లు వృథా జాతిమతాభిమానములచే స్వార్థ
పరులై యహంకారమమకారవిమూఢులై తక్కినజంతువులకన్నఁ
దమమనుష్యజాతి కన్యాయముగ నకాలమరణములను లేనిపోని
దుఃఖముల నాధివ్యాధులను హెచ్చించుచున్నారు. వాస్తవముగా
దేహధారులగు జీవులందఱికి నిద్రాహారవిహారసౌఖ్యమును సుఖజీవి
తాశయును జననమరణములు నాఁకలిదప్పికలు తాపత్రయమును
సమానములే కాని మనుష్యులకుఁ దక్కినజంతువులకన్నఁ దా
మెక్కుడు తెలివికలవారమని విపరీతభ్రాంతదృష్టిచే దైవమునకు
బ్రతికూలముగాఁ దమనియతిఁ దప్పించుకొను ప్రయత్నముచేతఁ దక్కిన
జంతువులకన్న నెక్కుడుదుఃఖములు క్రొత్తక్రొత్తయాధివ్యాధులు
కోరి తెచ్చుకొని యస్వతంత్రులయి తమజీవితసౌఖ్యమునఁ గొఱఁత
పడుట హెచ్చునైజము. ఆహారనిద్రావిహారసౌఖ్యమును దక్కిన
జంతువులవలె హాయిగాఁ దా మనుభవించి యన్యోన్యానురాగమున
సుఖపడలేనిమనుష్యులకు దుష్టకలికాలవశమునఁ బుట్టినయనన్యజంతు
సామాన్యమగు క్రొత్త తెవుళ్ళష్టాదశవిద్యాప్రస్థానములు

మనుష్యులు తక్కినజంతువులకన్న బలహీనులై యాధివ్యాధు
లకు మఱింతలోనై కోరి యల్పాయువులై తాము చెడి తక్కిన
ప్రాణులను బాధించుటకు నిక్కముగా వృథా భ్రాంతికల్పిత విద్యా
ప్రస్థానములే కారణములు సహజముగా దైవ మమర్చియిచ్చిన
దుంపలు కాయలు పండ్లు ధాన్యములు తిని యాఁకలి తీర్చుకొని

వాన నీట నిండినయడవికొలనులు కొండకాలువలు నదులు మొద
లగుస్వభావసిద్ధములగు జలాశయములఁ దాసమాడి దప్పితీర్చుకొని
కొండగుహలు వృక్షమూలములు పట్టములగు వెదురు మొదలగుపొద
లలో దైవసృష్టములై యెండ గాలివానలం జొరనీని సున్నని ప్రదేశ
ములు మఱియు నొడలు దాఁచుకొనఁదగిన సహజసిద్ధములగు నాశ్రయ
ములు కీట పక్షి మృగములకువలె మనుష్యులకుఁగూడ దైవనిర్మిత
ములై యున్నవి ఈతి బాధలనుండి మనుష్యు లెట్లు తప్పించుకొన
లేరో భూకంపాశనిపాతక్షామాదిభూతోపద్రవములనుండి తమ్ముఁ
దామెట్లు కాపాడుకొనలేరో యట్లే తమకు నియతములైన జనన
మరణ వ్యాధి క్షుత్పిపాసాది సుఖదుఃఖములు తక్కినజంతువులకన్న
తగ్గించుకొనుటకైగాని హెచ్చించుకొనుటకుఁగాని సమర్థు లెంత
మాత్రము నానేరరు తక్కినజంతువులకన్నఁ దమదురదృష్టముచేఁ
దమకబ్బినవిపరీతబుద్ధి యనునైజముచేఁ దా మీవిద్యాప్రస్థాన
ములు కల్పించుకొని వ్యసనములమఱిగినయవివేకులవలె దేహదార్ఢ్య
మున మిక్కిలికొఱఁతవడి కోరి సహజముగాఁ దమకుదైవమిడిననిద్రా
హారవిహారాత్మకజీవితసౌఖ్యమును మఱియు నారోగ్యమును మనస్సం
తుష్టినిఁగూడఁ గలికాలవశమునఁ బాడుచేసికొని నశించుచున్నా
రయ్యో! యేమీ ప్రస్తుత మర్త్య దుర్దశ? కాలపక్వమయిన
యాహారపదార్థముకన్న వండుకొన్నయాహారపదార్థముల కలవడుట
చేత దైవదత్తములగు పర్వతగుహాదులనుండ కూళ్ళలో నుండుట
చేతను సహజమగు స్త్రీపురుషాన్యోన్యానురాగముచేఁ గవకూడక
బలాత్కారవివాహపద్ధతు లేర్పర్చుకొనుటచేతను తమయాహారము
తాము కూర్చొనుశక్తి వచ్చినపిమ్మటఁగూడఁ బిల్లల నడఁబాయ
కుంటచేతను తమకుఁబుట్టినవారు పరులకుఁబుట్టినవారు నని భ్రాం
తితో స్వీయపరకీయ విభేదమెంచుకొనుటచేతనుసహజవాచికాంగిక

పార్శ్వసాత్త్వికాభినయములచేఁ దక్కినజంతువులవలెఁ దాత్కాలిక
ముగాఁ బరస్పర మూహ తెల్పుకొనక గ్రంథమూలముగాఁ దమ
యూహాలను సంగ్రహించుకొంట చేతను ఎచ్చటనున్నవా రచట నుం
డక వింతవింతరుచుల కలవడి మిక్కిలి దేశద్రిమ్మరులగుటచేతను
మఱియు ముఖ్యముగా దైవకృత్యము స్వపౌరుషమునఁ దప్పించు
కొనఁగలమను దుర్భ్రమచేతను విపరీతబుద్ధులై తక్కినజంతువులకన్న
మిక్కిలి దుఃఖితులగుట కలియుగమానవుల దుర్విధి పుణ్యదశయగు
కృతయుగమున మానవులలోఁ దక్కినజంతువులకువలె స్త్రీపురుషు
లను రెండుజాతులు తప్ప బ్రాహ్మణాదిజాతులును వర్ణాశ్రమధర్మము
లును స్వర్గనరకాదిచింతయును భూతభవిష్యద్వర్తమానకాలగణనయును
పరస్పరద్వేషమునఁ దన్నుకొని చచ్చుటయు నున్నట్లు పురాణ నిద
ర్శనము లేదు.

"తపఃఫలం కృతయుగే " అను పరాశర స్మృత్యనుసార
ముగా హేయోపాదేయవస్తుచింత యే లేకుండుటమానవులు కలిసి
మెలసి హాయిగఁ దక్కినజంతువులవలె నుండుట యిప్పటి మనుష్య
స్వభావము కుళ్ళాయిచొక్కా ముక్కుకమ్మి చెవికోవకాయల కల
వడి మనుష్యునిచే నాడింపఁబడిన తిమ్మనివలె మఱి దుస్తుల కలవడి
ముంగటికా లెత్తుటయు వెనుకటిది నిలుపుటయును మప్పఁబడిన
గంగిరెద్దుతీరున తక్కినకోఁతులకన్నను దక్కినయెద్దులకన్నను ముసలి
తనమున బాధపడుట తప్పించుకొననేర కౌరా యీవిద్యాప్రస్తావ
వేత్తలకు కాకిముక్కునకుఁ గట్టినగవ్వవలె మఱి కుక్కతోఁక పట్టిన
తీరున మనుష్యులకీవేదవేదాంగపరన మాగంతుకముగాని సహజ
సిద్ధము కాదు అద్దముచూచుకొని వికారపడు నవివేకివలె జాతిమతా
దర్శనముచే వ్యర్థముగా భ్రాంతులై బుద్ధివైపరీత్యమున మదమత్తుల
వలెఁ బిశాచగ్రస్తులవలెను సన్నిపాతరోగాధీనులవలెను స్వస్న భ్రాం

తుఁ వలె వేదవేదాంగవిద్యాగంధవికారము చే నన్యాయముగాఁ దక్కిన జంతువు లన్నిఁ గలికాలదుర్విధివిహారులగు మనుష్యులు బుద్ధిహీనులై దేహసౌఖ్యమునకై నానావాదములు చేసికొని జాతిమతభేదముల గల్పించు కొని ప ది ... ్రై స్పర్ధగలై యన్యోన్యద్వేషమున నకాల మృత్యునిహతు లగుట కలియుగస్వభావ మెవఁ డడ్డగించెడో! కూళ పోమాసీ! కోయుము కోయుము నీచేఁ జిక్కినన్ని మేఁకల నో వైదిక శ్మశ్రుండా! పంచవేదము నిట్లె బొట్టు కట్టు జుట్టుంచుకొనని జను లధము లనార్యులు చండాలురు మ్లేచ్ఛు లని తిట్టి కోరి జగడ మాడి తన్నులుతిని తిన మోక్షప్రాదకర్మ్యుండా! నీయహంకార మమకారముల నిపు డోలగినదాఁక నిట్లు ఎచ్చిఎచ్చిమెట్ట వేదాంత మతబోధ చేయుచు ప్రబోధించు మాయప్రకాశనము చే బుద్ధిజఠరమాం ద్యములం జెడు చెడు మోహాధికారపిశాచగ్రస్తుఁడా! యసూయా పరులు నిన్నుఁ జిరము బ్రతుకనీరని తెలిసికొనక సాధారణప్రపంచ దనవనితాదిభోగము నందఱికన్న ముందు ముందు ముందు మోహాసక్తిభూతదయాపరభాగవతుఁడా నిన్నిట్లు దుర్విధి దుష్ట కలికాలమునఁ బుట్టించినందున నిద్రాహారవిహారసౌఖ్యమొకటిఁగ కిట్లు కలయునఁ గన్నిటిఁ జదల నార్చు కార్చుము కాలగతి దప్పింప నెవరి శక్యము? ఇంతకు నీతప్పుగాదు నాస్మృతిగన్న నీసర్వజగ త్కార్యములకు మఱి వేఱేకారణము లేనే లేదు. "తదాసంకర్నో భవతి" అను వేదాంతవాక్యము చొప్పునం గేవల సుషుప్త్యవస్థలో నున్నచో నిట్టిచింతలు నీవాఁతయు నొక్కింతయూ నలుగఁ బోవుగదా?

సరితమే! నాపనియేమో నేఁ జేయకతప్పదుగదా? "ఇషేత్వో ర్జేత్వా" అను శ్రుతియందు "త్వో" అను సంయుక్తాక్షరమున కను దాత్తస్వరము "ఉచ్చై రుదాత్తః నీచై రనుదాత్తః" హెచ్చుస్థాయి

నుదాత్తమనియుం దగుస్థాయి కనుదాత్తస్వరము చెప్పఁబడెను ఉదా
త్తముమీఁదుగననుదాత్తముక్రిందుగను మను- ౦ం ధ
మూఁడుస్థాయిల ధ్వనిభేదము కలదు లావు సన్నము సమములగా
నున్నయొక్కతీరగు నుక్కుతీఁగె లొక్కపొడవుగాసమముగాబిగింపఁ
బడినపు డొకపోలిక నాద మిచ్చునుగాని యారెండుతీఁగె లో నొక
తీఁగెకన్న నొకటి బిగింపున సగముతగ్గినపుడు బిగింపఁబడి తీఁగెనుండి
పుట్టిన నుదాత్తధ్వని యనియును సడలినతీఁగెయొక్క ధ్వని యను
దాత్తమనియు సంజ్ఞలం బరఁగును ఆరెండుతీఁగెలతో నొకటియెంత
బిగింపఁబడగలదో హెచ్చుస్థాయిసంజ్ఞగల యుదాత్తధ్వనిని రెండవది
యెంతసడలింపఁబడగలదో యంతతగ్గుస్థాయి సంజ్ఞకలది యనుదాత్త
ధ్వనిని వెల్లడించును ఉదాత్తమనంతవిధములు మఱి యనుదాత్తము
గూడ ననంతవిధములు "ఇషేత్వోర్జేత్వా"అను శ్రుతి నుచ్చ
రించుటలో "త్వో"అనునక్షరద్వయము మనంతభేదములగు ననుదాత్త
స్వరవిశేషములం జేయునుదాత్తస్వరము శ్రుతిజాతిగ్రామమూర్ఛనలం
బట్టి యుచ్చరించవలెనో మఱి యాయనుదాత్త స్వరమున కాకారము
స్వర్ణము న్వాహన మాహారమధిదేవతావిశేషములెవ్వియో కూలం
కషముగా మునులే తెల్పలేక "శ్రుతిస్థానే స్వరాన్వక్తుం నాలం
బ్రహ్మపితృత్వతః"అని నారదశిక్షానుసారముగాఁ బ్రాకృతులల్పాయు
వులు కించిజ్జ్ఞు లల్పశక్తులు దైవోపహతులగు నీవైదికమ్మన్యులు
"ఇషేత్వోర్జేత్వా"అను శ్రుతి స్వరముగా నుచ్చరించుట మిక్కిలి
యసంభవము-కాఁబట్టి వేదశబ్దోచ్చారణసామర్థ్యము బ్రహ్మకైన
లేదని నారదముని నిర్దేశించుటచేత నీవైదికు లుచ్చరించుశబ్దములు
వేదము లెంతమాత్రము గావు ఈవైదికులుమంత్రబ్రాహ్మణములని
యుచ్చరించుశబ్దములను వీరు వేదచోదితములని చేయు శ్రౌతస్మార్త
కర్మము లన్నియును పంచకకృత్యములు స్వార్థసంపాదనమాత్ర

ప్రయోజకము లు పామరజనులను బెదరించి సోమరిపోతులయిన ధూర్తద్విజమ్మన్యులు చేయుడంభములు నిష్ప్రయోజనములు బూటకములు మాయలు కపటోపాయములు భూతోపద్రవకరములు,లోకోపకారకము లెంతమాత్రమును కావు- అతీంద్రియ మపౌరుషేయము లోకాతీతమగు నాదబ్రహ్మాత్మికవేద మీద్విజమ్మన్యులనోటఁ జౌరుషేయమై యుచ్చరింపఁబడుట యాకాశముబ్రద్దలగుటవలె నసత్తవాశక్యము- వేదములే లోకాతీతములయినవుడు వేదచోదనాలక్షణమగు శ్రౌతస్మార్తధర్మములుం జాతుర్వర్ణ్యనియమములును గగనారవిందకింజల్కములవలె శశవిషాణములవలె ధూర్తకల్పితాసంభవ పదార్థములు కావన్నే ?

## ఉపనిషద్గాథ

ముఖ్యములగు నుపనిషత్తులు పరాపరములను జెప్పు రెండు విద్యలలోఁ బరవిద్యను జెప్పుచున్నవి- వేదము కర్మకాండ బ్రహ్మకాండము లను రెండుకాండములుగా విభజింపఁబడినయది- కర్మకాండ మపరవిద్యను బ్రహ్మకాండము పరవిద్యను జెప్పుచున్నవి బ్రహ్మకాండాత్మకమగు నుపనిషత్తు లనేకము లందులో బృహదారణ్యక- ఐతిరేయ ఛాందోగ్య- తైత్తిరీయ- ఈశ కేన- కఠ- ప్రశ్న- ముండక- మాండూక్యము లనుపదియును ముఖ్యములు ఈపదియును గాక మఱితొంబదెన్మిది యుపనిషత్తులుగూడఁ బేర్కొనఁబడినవి- ఉపనిషత్తులకు బ్రాహ్మణాత్మకములగు నారణ్యకములు మూలములు "తస్యవా ఏతస్య యజుషోరస ఏవోపనిషత్"యజుర్వేదముయొక్క సారమే యుపనిషత్తు- కాఁబట్టి "నహింస్యాత్సర్వభూతాని"అనునుపనిషత్తు "పశుమాలభేత"అను మంత్రముకన్న ముఖ్యముగా నెన్నఁదగినది- సాంఖ్యయోగన్యాయవైశేషికోభయ

మీమాంస లనత త్త్వమును జెప్పుచున్న నములును గనిషన్మూలములే ఉపనిషత్తులలోఁగూడఁ గొందఱు భూరులు తమ తము మతములను వెల్లడింపఁగోరి లేనిపోని క్రొత్తక్రొత్త లనుపనిషత్తు లని ప్రాచీనోపనిషత్తులదొంగతనము జేర్చిరి-సగుణాత్మస్వరూపుఁడగు నీశ్వరుఁడు లేనేలేఁడనియును చైతన్యము క్షణభంగురమనియును దెలిపి మద్యవిశారమనియుఁబల్కు-బౌద్ధమతఖండనముకై శివసంకల్పోపనిషత్తులు 31-40 అధ్యాయములుగాను వాజసనేయసంహితయేయని యుపనిషత్తులకు మంత్రబ్రాహ్మణాత్మకాపౌరుషేయానాదిత్వమున్గల్పించిరి ఉపనిషచ్ఛబ్దమునకు రహస్యమనియు నుపదేశముపొందుటకై గురుసమీపమునఁ గూర్చుండుటయనియు మొదలగుసర్థములు చెప్పఁబడుచున్నవి "యదేకవిద్యయాకరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరమ్" అను ఛాందోగ్యోపనిషత్తు ప్రకారము-జాగరూకతతో గురుసమీపమున నభ్యసించిన యోగము సిద్ధించుననుటచే నుపనిషత్తనఁగా గురువునొద్ద సంతత ముండుటయనియే వ్యాఖ్యార్థము "గురువులేని విద్య కూడదు కూడను విశ్వగాభగామ వినరవేమ" కాఁబట్టి యుపాద్ధి వము గురుసమక్షమున నుండియోగాభ్యాసముచేయవలయు నట్లు గురుసమక్షమున యోగ మభ్యసించుటకై కూర్చుండుట యుపనిషత్తనఁబడును "ఉపాసితో గురుం భవాన్- ఉపాసితో గురు ర్భవతా" అను భాష్యోక్తులంబట్టి గురువుజెంతఁ గూర్చుండి గురుముఖము నుండి విద్య నభ్యసించవలయును శ్వేతాశ్వతరోపనిషత్తు ప్రారంభములో "కిం కారణం బ్రహ్మకుతఃస్మజాతాజీవామకేన క్వచ సంప్రతిష్టితాః-అధిష్టితాః కేనసుఖేతరేషు, వర్తామహే బ్రహ్మవిదో వ్యవస్థామ్-కాలఃస్వభావో నియతిర్యదృచ్ఛా భూతానియోనిః పురుష ఇతి చింత్యా సంయోగఏషాన త్వాత్మభావా దాత్మాప్యనీశః సుఖదుఃఖహేతోః-మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్

తస్యావయవభూతైస్తువ్యాప్తం సర్వమిదంజగత్- ననుశ్వేతాశ్వత
రోపనిషది మాయాయాః ప్రకృతిత్వే పరమాత్మనస్సన్నిధేయం
తృత్వం ప్రతీయతేమాయాం న్వితి-నాయందోషః మాయాయాః పర
మాత్మశక్తిత్వేన శక్తిమతో౽పార్థక్యాత్ ప్రకృతిత్వావశంభావాత్-
దహనశక్తియుక్తే౽గ్నౌ దాహకత్వే వ్యవహారదర్శనాత్- ఆత్మ
శక్తిత్వంచమాయాయాస్తస్యామేవోపనిషది శ్రుతం తేధ్యానయోగాను
గతాఅపశ్యన్దేవాత్మశక్తింస్వగుణైర్నిగూఢమ్"

బ్రహ్మకారణవాదము- మన మెవ్వడు ఘటించినాము- మనము
దేనిచే బ్రతుకుచున్నాము- మన మెటకుఁ బోవుచున్నాము- పద్ధతి
ప్రకారము మన మెవనియాజ్ఞంబట్టి సుఖదుఃఖముల ననుభవించు
చున్నాము- కాలమా స్వభావమా విధియా లేక భూతములా కార
ణము- మనుష్యుఁ డింతంతకును జన్మస్థానమా- లేక వీనిన్నియుం గలిసి
యున్న స్థితియా- ఇవి యెద్దియుఁ బ్రత్యేకముగఁ గాని యన్నియు
గూడగాని కారణము కానేరవు- సర్వస్వతంత్ర మాత్మయొకటి
యుండకతీరదుగనుక శక్తియు నాసర్వస్వతంత్రమగు పరమాత్మకు
న్గూడ సుఖదుఃఖముల నేవస్తువుకలిగించుచున్నదో యట్టివస్తువును
శాసించునధికార మున్నట్లు తోఁచదు- ఇట్లుపనిషత్తును దాని
భాష్యమునుబట్టి తెలియవచ్చుచున్నది- పైనుదహరించిన ప్రశ్నము
లకు బహ్వృచోపనిషత్తు "సదేవసౌమ్యేదమగ్రఆసీత్ - ఏకమ
ద్వితీయమ్- తదైక్షతబహుస్స్యాంప్రజాయేయేతి -తత్తేజో౽సృజత-
తత్తేజఐక్షత బహుస్స్యాంప్రజాయేయేతితదపో౽సృజత- తదేక ఆహు
రసదేవేదమగ్రఆసీదేకమేవాద్వితీయం తస్మాదసతస్సజ్జాయతే" మొట్ట
మొదట నీజ్జగమంతయును సత్తే (నిర్గుణపదార్థమే) యాసత్పదార్థము
కన్న నింకొకవస్తువెద్దియుం బ్రవర్తింపలేదు- ఆసత్పదార్థము "నేను

జగము సృజించనీ" అని తలపోసెను మఱి యీజగములను
సృజించెను

ఇందుమూలమున సగుణమగు పరమపదార్థము తనసంకల్ప
మాత్రముచేత యీజగమ్ము సృజింపఁబడుచున్నదనియు-
మఱి యింకొక్క యుపనిషత్తుంబట్టి నిర్గుణపదార్థమే యీజగత్సృష్టికిఁ
బూర్వ ముండెను మఱి యాశూన్యమునుండి యీజగము గలిగెను
ప్రకృతియే మాయగాను మాయాశక్తిమంతుఁడు మహేశ్వరుఁ
డనియును ప్రకృతీశ్వరుల సంయోగమున జగము పుట్టెననియును
వేఁడియగ్నికున్నశక్తి వలె "శక్తిశక్తిమతోరభేదః" అను న్యాయాను
సారముగా అగ్నిదహనశక్తితోఁ గూడినట్లు ప్రకృతితో మహేశ్వరుఁ
డున్నాఁడనియును దనగుణములందుఁ దా డాఁగి యాపరమాత్ముఁ
డున్నాఁడనియును మూలముంబట్టి భాష్యములంబట్టియు నుపనిషత్తులు
బీరకాయపీచువలెఁ గలకాపులమిగా పరసినకొలంది మఱింత
సందేహమునఁ జొన్పుచున్నవి- ఇంతకు స్వప్నజాగరరూపమగు
నాస్మృతియే యీజగత్తుం బన్నుచున్నది మఱి సుషుప్తిరూపమగు
నావిస్మృతియే యీజగమును లయముచేయుచున్నదని సకలప్రౌఢ
వయస్కమనుష్యుఁ డనుభవించుచున్న ప్రత్యక్షానుభవముగనుకను
ప్రతిజనుఁడు దుఃఖములం దప్పించుకొని సుఖించుటకై కోరుచుంట
చేతను నిక్కముగాఁ దనసుఖముఁ గోరెడు ప్రతిమనుష్యుఁడు పరోప
కారముగాఁ దా నడచినందప్పుఁ దన నితరులు సుఖింపనీరుగనుకఁ దన
పురుషప్రయత్నము నొరులకు హితముగా నడిచి తనహితము సంపా
దించుకొనుటకు మఱి యట్టి తన ప్రయత్నమును సఫలము గావించి
తనకు సంపూర్ణసంతుష్టినయుచేయుమని తన స్వప్నజాగ్రత్సుషుప్త్యవ
స్థలమూఁడింటికి న్గారణమగు దైవమును సంతతమునునిర్మలాంతఃకరణ
మునఁ బ్రార్థించుచుంటయు నవశ్యకర్తవ్యములని నిర్ధారణ మొనర్చ

కొనకతీఱదు తీఱదు- స్మృతికి విస్మృతికిన్నాడఁ గారణమగు
పదార్థము నిర్గుణమా సగుణమా ? అట్టిపదార్థము నిక్కముగా
నున్నదా లేదా ? ఇట్టి వాఙ్మనసగోచరభగవత్తత్త్వము నీవు
ప్రార్థింపనేలయనినచో నట్లు దైవమును నీసాయముగోరుటకు నీవు
ప్రార్థించుచుండుమనుటయందలి యర్థము దృఢముగాఁ బరోపకారము
నేమరక చేయుచుండుము నీకు బ్రతుకున దప్పకనీకోరినమనస్సంతుష్టి
కలుగునని దైవప్రార్థనయందలి ముఖ్యోద్దేశము కాఁబట్టి నీకుపురుష
ప్రయత్నపర్యాయమగు పౌరుషముకన్న వేఱేపదార్థమే లేదు-
దైవమను మాట లోకోపకారమును దప్పక చేయుచు నీకోరినమనః
సంతుష్టినొందుటకుఁబన్నిన ప్రతిబోధకసంజ్ఞామాత్రోపరిచారికశబ్దముగా
భావింపవలయును వలయున- నీకు దుఃఖమిడిన నీస్వార్థపరతకే నీవు
పశ్చాత్తాపుఁడవై నకొలంది నీవు నీకు సుఖమిచ్చుపరోపకారకవర్తన
మున నడిచెదవు నీవు నీస్వార్థపరతనన్మాని సర్వభూతసముఁడవై
పరోపకారముచేసినకొలంది నీకోరినమన సంతుష్టి చేకూరుచుంటయే
నీవు త్రిగుణాతీతపదార్థమగు పరమాత్మునిలోఁ జేరుచుంటయే నీ
ప్రార్థన మాలించి నీకు దైవము సాయపడుచున్నాఁ డనిభావించుము-
భావించుము? "యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతితాదృశీ" ఇది
తప్పదు తప్పదు- నాస్మృతివలననే యీజగము కలుగుచున్నది మఱి
విస్మృతిదశయందే జగము ద్రోఁచకున్నది కాఁబట్టి నాస్మృతియొక్క-
రూపమే నామనఃప్రవృత్తిరూపమే స్వప్నజగమయినతీరున నిజ్జగ
ముగాఁ బరిణమించుచున్నదని చెప్పుట యుక్తికిఁగిట్టినదికాని లక్ష
కోట్లు సంఖ్యాకరూప్యమఃలంకెలయందు సయుక్తికముగా 100000×
10000000 = 1000000000000 యొకంకెవేసి పదునొకండు
సున్నలు చుట్టిన వచ్చినసంఖ్య లక్షకోట్లు యగు నన్నిరూప్య
ములప్రోవు లెక్కలోఁ గన్పర్చవచ్చునుగాని యనుభవముసఁ

జూచుటగాని మూపించుటగాని శక్యముకా ట్టీజగత్కార్యములన్ని
యును స్మృతి(ఆత్మ ప్రకృతి)యొక్క రూపములుగాని మనఃప్రవృత్తి
రూపమగు స్మృతికిమించి ఎతివేతేపదార్థము లేదయు స్మృతియును
విస్మృతియు ననుమనఃప్రవృత్తులు రెండును వాస్తవముగా మాయ
యనియుం బ్రకృతి యనియు నవిద్య యనియు దైవశక్తి యనియును
పేర్లం బరంగుచున్న యనిర్వాచ్యమూలాజ్ఞానమను వేదాంతతత్త్వము
ప్రత్యక్షానుభవములో లేదు కాంబట్టి యీమిట్టవేదాంతములతోం
బనిలేదు- తనశరీరము తనయొక్కయును దానెట్లు వాస్తవముగని
తలంచుచుం దనసుఖముకొఱకై జనుండు పాటుపడుచున్నాండో తనకు
వేఱుగానున్న జగము తయును నిక్కమనియును సమస్తజగత్సృష్టిస్థితి
లయకర్తయగు వాసుదేవుండు భక్తవత్సలుండై పరమభాగవతులకు
సాయపడుచుండుననియుం బరమభాగవతులధర్మము పరోపకారబుద్ధి
యును సర్వభూతదయయును అంతతదైవభక్తియు నని నిశ్చయించి
కొని ప్రతిజనుండుం దా భాగవతుండౌటకు నిరతముం బ్రయత్నించు
చుంట మనుష్యధర్మ మని తెలియవలయుం తెలియవలయును- తన
జాగ్రదవస్థయందు దృష్టమగు జగమంతయు సత్యార్థమనియును
ధర్మాత్ముం డీజగత్కర్తయగు నారాయణు ననుగ్రహమునకుం
బాత్రుండై సంసారదుఃఖము లేక నిత్యానందవదవినోదుననియును
ద్వైతము జగమంతయు నశింపంగా నిర్గుణుండగు వాసుదేవుం
డొక్కండు మాత్రమే మిగిలియుండు నను విశిష్టాద్వైతమతము- వాసు
దేవః సర్వమితి- పురుష ఏవేదగ్ంసర్వం” అనునట్లు బ్రహ్మసత్యం
జగన్మిథ్యా” జగమంతయు నెండమావులజలము వలె భ్రాంతికల్పితము
“ఏకమేవా ద్వితీయం బ్రహ్మ” నిర్గుణబ్రహ్మముతప్ప సత్యమైనవస్తువు
మఱిదియు న్లేనే లేదను నద్వైతము నీద్వైతాద్వైతవిశిష్టాద్వైతము
ల్లోనే నానావిశేషములతో సమస్తమనుష్యమతము లిమిడియున్నవి

లోకములోని మతములన్నింటికి నానాభాషలలో నున్న యుపనిషత్తులే యాధారము 1180శాఖాలంబట్టి పదునొకొండువందల యెనుబది యుపనిషత్తులు కలవు ముక్తిగ్రంథముంబట్టి తెలియ వచ్చుచున్నది గౌడపాదుండు శంకరుడు మొదలగునాధునిక విద్వాంసులల్లిన యుపనిషత్తులుకూడం గొన్నిగలవు శతపథ బ్రాహ్మణములో బృహదారణ్యకోపనిషత్తు చేరియుంటచేత నా బ్రాహ్మణ ద్రష్టయగు యాజ్ఞవల్క్యుడే యాయుపనిషద్గ్రంథకర్త యని నిర్ణయింపబడెను "జ్ఞేయం చారణ్యకమహం యదాదిత్యాద వాప్తవాన్ యోగశాస్త్రంచ మత్ప్రోక్తం జ్ఞేయం యోగమభీ ప్సతా" అనుటచే వేదములం జేర్పంబడిన 'యన్మనురబ్రవీ త్తదేవ భేషజమ్" అను శ్రుత్యుక్తమునువు నారణ్యకద్రష్టయగు యాజ్ఞవల్క్యుండును ధర్మశాస్త్రకర్తలగు మనుయాజ్ఞవల్క్యులు కారనుట స్పష్టము సామాథర్వవేదములం దారణ్యకములు లేవు ఈ యారణ్యకములు మఱి యీయుపనిషద్విద్యయుసన్న్యసించి సంసారమును వదలియేకాకులై యడవింబట్టినవారలకొఱకుమాత్రమే చెప్పంబడుటచేత సంసారులీయారణ్యకచింత చేయుటకు మరణో న్ముఖుడు పెండ్లాడుటకై తలపోయుటవలె వ్యర్థమును లోకమునకు హానికరము కావున నిద్రాహారవిహారసౌఖ్యమాసించి పల్లెం బట్టణ ముల కాంపురముండువారు సన్న్యాసిభిక్షులుచేయుటయును వేదాంత విచారణముసల్పుటయుం దగదు తగదు సంసారులకుం దమతోడి పాడిపనులు నిద్రాహారవిహారసౌఖ్యములకై తోడ్పడుటతప్ప వేదాంత విచారణ వ్యర్థము లోకహానికరమని సిద్ధాంతీకరింపకతీఱదు మంత్ర బ్రాహ్మణారణ్యకోపనిషత్తుల నిద్రాహారవిహార సౌఖ్యతత్పరులగు సంసారులు పఠించి తదర్థమును వెల్లడించుచు శ్రోత్రియులవలె నటించి రేని మిక్కిలిస్వార్థపరులు ధూర్తులగుసోమరిపోతులుగా ద్వీపాంతర

వాసముచేయుటకై మనుష్యసంఘంబునుండి బహిష్కరింపఁబడ వలయున వేదములు కేవలము సన్న్యాసులకుమాత్రమే యుద్దిష్టములుకాని నిద్రాహారవిహారసౌఖ్యతత్పరులగు సంసారులకెంత మాత్రము న్గాను కాదు వేదాంగసూత్రములు మొదలగుసూత్రములకన్నింటి కీయారణ్యకములే పుట్టిండ్లు

## ఆరణ్యకములు

గృత్సమద- విశ్వామిత్ర- వామదేవ- అత్రి- భరద్వాజ- వశిష్ఠ- ప్రగాథ- పావమానిదృష్టము లారణ్యకము లనియు ఋగ్వ్రాహ్మణములు వేదములకుఁ బెట్టినపేర్లనియును నిర్దేశింపఁబడెను ఋగ్వేదమందున్నవ్యంజనములు ఘోషము లూష్మములు మొదలగు నక్షరవిశేషములు లెక్కించుటయును కొన్నిపుక్కిటిపురాణకథలను జెప్పుటయును మూఢులం బామరులను బాలురను స్త్రీలను బెదరించి భయపెట్టుచియ్యములచర్యలు గణించుటయును నాటకబూటకములు గారడిమాయ మాళిక మంత్రయంత్రతంత్రములు వేడుకమాటలుబుసుపోవుటకు న్గాలక్షేపమునకు నీయారణ్యములు కల్పింపఁబడుట నిశ్చయము మంత్రబ్రాహ్మణములు బ్రాహ్మణములు బ్రాహ్మణజాత్యభిమానులచే గల్పింపఁబడి కొన్నిక్రతువిధానములను కొన్నిహోమవిధులను కొన్నిశ్రౌతస్మార్తగృహ్యకర్మములు గొన్ని వ్యాకరణనిరుక్తశిక్షానైఘంటికవిశేషములను గొన్ని యసందర్భాకాశపంచాంగములను గొన్నిమసలమ్మకయ్యాలకథలను గొన్నియసంభవపురాణగాథలను మఱికొన్నియతీంద్రియస్వర్గనరక భూతభవిష్యజ్జన్మకథనమునుమఱికొన్ని లేనిపోనిపోచెలను వెల్లడించుచున్నవి "భూర్భువస్స్వరిత్యేతావావవ్యాహృతయఇమే త్రయో వేదాభూరిత్యేవ ఋగ్వేదోభువఇతి యజుర్వేదః స్వరితి సామవేదః" అని నిర్వ

చించుం గొన్నియు బ్రాహ్మణము న్నియు విధ్యర్థవాదములను వెల్ల
డి చుచున్నవి బ్రాహ్మణములు శ్రౌతకర్మములను గొన్ని- మఱి
కొన్ని వ్యాఖ్యానరూపములనియు నాపస్తంబుఁడు చెప్పుచున్నాఁడు
పూర్వము చేయఁబడనికర్మములు పూర్వము తెలియఁబడనికర్మములఁ
గూర్చియుం గొన్ని బ్రాహ్మణములు విధించుచున్నవి దీక్షణీ
యేష్టియం దగ్నివిష్ణువు కుఁ బురోడాశమిచ్చుట పూర్వము లేని
శ్రౌతవిధి- మఱి"సదేవేదమగ్రఆసీత్ "అని కొన్ని బ్రాహ్మణములు
వ్యాఖ్యానరూపములు ఇవి మంత్రములు మఱియివి బ్రాహ్మణము
లని పూర్వుల యేర్పాటునుబట్టి తప్ప ఒకేవిధము చేతనైనను మంత్ర
బ్రాహ్మణముల రెండిటికిని భేదము చెప్పుటకు వీలులేదని సాయనుఁ
డనుపండితుఁడు నిర్ణయించెను

వేఱున్న చెప్పినది వేదముకాదన్నవాఁడు గాడిద అనునట్లు
మంత్రబ్రాహ్మణాత్మకమగు వేదమును గూర్చియును వేదాంగములను
గూర్చియును శబ్దమొకన్న వేఱేప్రమాణ మెద్దియును లేదు విధుల-
అర్థకథనములు పరమార్థముగ నుద్దేశించునుపనిషత్తులన్ బ్రాహ్మణ
ములు తెల్పుచున్నవి- 'ఆగ్నేయమష్టాకపాలన్నిర్వపేత్ -దర్శపూర్ణ
మాసాభ్యాం స్వర్గకామోయజేత-వ్రీహిభిర్యజేత" అని మువ్విధము
లుగాఁగాని యీమూఁడువిధులను గలిపిగాని చేయవచ్చునని బ్రాహ్మ
ణము లుద్దేశించుననియు "అగ్నిర్వైదేవానా మవమోవిష్ణుః పరమః
అగ్నిర్వైదేవానా మవరార్ధ్యోవిష్ణుః పరార్ధ్యః"అని ఐతరేయబ్రాహ్మ
ణము వైకల్పికము పల్కుచున్నదని మధుసూదనుఁ డనపండితుఁ
డనుచున్నాఁడు- ప్రౌఢబ్రాహ్మణము - షడ్వింశబ్రాహ్మణము -
అద్భుతబ్రాహ్మణము- వెదకినకొలంది ననేకబ్రాహ్మణములు నుపని
షత్తులు బయలుపడుచు నానామతముల కాధారముగా జనులకుఁ
బ్రమాణములగుచున్నవి- అద్భుతబ్రాహ్మణము దేవాలయముఁ

గూర్చియు నాలయములో నర్పుచు నాడుచుం బాడుచు మఱియు నానావికారములొనర్చు విగ్రహములంగూర్చి చెప్పుచున్నది- యజుర్వేదముయొక్క ప్రాచీనశాఖలు చరకశాఖలను సంజ్ఞ కలవి ఈచరకశాఖలకు నింద్యనామము ఖిలము లని ముప్పదియవయధ్యాయమునఁ బురుషమేధము ; "దుష్కృతేచరకాచార్యమ్" దుష్కృతకై చరకాచార్యుని బలివేయవలసిన దని యున్నది మేఁకను వధించి బలియిచ్చుటకన్నఁ బశుబలి నియమించు కూళమానవులం జంపి బలియిచ్చుట కొంతనయముకదా? తైత్తిరీయసంహితయందు "వాయవస్థ ఉపాయవస్థ" అనఁగా ఆలదూడలను మీరు గాలులవంటివా రని చెట్టుకొమ్మతోఁ గొట్టెడి కర్మము మాంధ్యందినశాఖయందు "ఉపాయవస్థ" అను వాక్య మన్యశాఖీయము గాన విధిగా విడిచిపెట్టవలెనని బ్రాహ్మణము నిషేధించుచున్నది "తస్మాదాహావాయవస్తే త్యుపాయవస్తేత్యుహైకఆహురుపహిద్వితీయోధతీతతమత భాస్బ్రూయాత్ ఇషేత్వోర్జేత్వేతిశాఖామ చ్ఛినత్తివాయవస్థోపాయవస్తేతివత్సానపాకరోతి-వాయవస్తేతిపుంసఉపాయవతిస్త్రియః" అని - బ్రాహ్మణకల్పములు-వాజసనేయసంహితయందు దర్శపూర్ణమాసములు-సోమయజ్ఞములు-అగ్నిచయనములు ఆనిమూఁడు భాగములుగ నానావిధ యజ్ఞకర్మములు విధింపఁబడుచున్నవి "ఉపాజ్ఞాతే ఎనో- దేశగజ్ఞాతమ్ తేనప్రోక్తం యత్తేనప్రోక్తంనచతేనక్ళ్పలమ్" అనిపాణిని తజలుచే నుపపాదింపఁబడుటచే నొరుల యుపదేశములేకయే స్వయముగాఁ దనకుఁదోఁచిన ట్లొనర్చిన గ్రంథము మఱియితరులుచేసిన గ్రంథమును దా బయలుచేయుట క్రమముగా నుపజ్ఞాతమనియుం బ్రోక్తమనియుం జెప్పఁబడుటచేత మంత్రబ్రాహ్మణాత్మకములగు వేదములు వేదాంగములు మొదలగునష్టాదశవిద్య లీరెండువిధములలో నేభాగ మెద్దియో తెలియఁబడక్నీక గంతగోళకషాయమువలెఁ గఁగా పులకములుగా

నన్నవి.- కేవల స్వార్థపరతం బ్రోత్సహించు ద్వైతము పైకొకటి లోపలనొకటియుం గల్పించి కాపట్యమును హెచ్చించి "వాసుదేవః సర్వమితి" అని పైకి మాత్రము చెప్పుచు స్వార్థపరతె వదలలేక సంసరించుటచేత విశిష్టాద్వైతము "సోऽహమ్" అని దుఃఖము లందఱికన్న నెలిసి యనుభవించు నద్వైతము న్మాత్రము పైని ద్వైతాద్వైతవిశిష్టాద్వైత మతములు మూఁడును స్వార్థపరత నడఁగించి లోకోపకారకబుద్ధి నధికము గావించి సర్వభూతదయను హెచ్చింపకున్నపుడు జనుల కాదేయములు శ్రేయము లెంతమాత్రమున్నావు సర్వభూతదయాపరమై యహింసావ్రతమూలమై సోమరితనము న్నాసింపించి స్వకాయకష్టార్జితము సంపాదించుకొన్న యన్నపానములు తోడిపాటిజనులకు పంపకించియిచ్చు "సర్వేజనాః సుఖినోభవంతు" అని జపించు పరమభాగవతమొక్కటి మనుష్యధర్మమును సర్వలోకశ్రేయస్కరమును సప్రామాణమును సహేతుకమును మఱి వివేకవిలసితమని మనుష్యులందఱు అవలంబించఁదగిన మతము—

పాంచభౌతికమగు నిజశరీరమే యజ్ఞశాలయే పాంచభౌతిక పదార్థములన్నియును యజ్ఞార్థములే- యజమానుఁడగు మనుష్యుఁడు తనయింద్రియ ద్రష్టములై తాను సంపాదించఁగలిగిన జడచేతనపదార్థములన్నింటిని మఱియుఁ దనమనోవాక్కాయకర్మములను దనయాత్మతోఁగూడ దేవతానివేదనము చేయుచు నిత్యకైవల్యానందమున నుండుటయే సకలవేదవేదాంగవిధులాచరించుటకు ఫలము స్వార్థపరతలేక కేవలలోకోపకారమునకై మాత్రము సర్వభూతదయాపరుఁడై ప్రయత్నించు భాగవతుఁడీ సకలశ్రౌతస్మార్తకర్మములన్నింటిని నిర్వర్తించి ప్రత్యవాయము గనక శ్రోత్రియుకన్న వేయిరెట్లు సులభముగాఁ బరలో నుభయలోకము గడించును స్వార్థపరులు స్వజాతికులాభిమానులై తోడి సకలజనాన్యద్వేషకారణముగఁ బహుహింసను విధించి జాతరవలె జనులకు లౌకిక విడంబమును మెచ్చుటలఁ

జవిచూపు శ్రౌతస్మార్తకర్మములు ప్రమాదప్రత్యవాయప్రాయశ్చిత్త
ముల కావాసమగుటచేతం గర్భయోగమునం దరించుట చంద్ర
సూర్యబింబములనంటుటకై యాకసమున కెగరంబూనుటవలె వృథా
ప్రయాసకరము- వానిస్వాస్వ్రసము భూతబాధకమగుటచేతనే కామ్య
కర్మకాండమును "నాద్వైతజ్ఞానవతః కర్మాణి విధీయన్తే" అని పరమ
భాగవతులకు- శ్రౌతస్మార్తకర్మము లవసరములేదని యుపనిషన్మ
తము- సర్వమేధ బ్రహ్మయజనములు రెండును నాటకములవలె లోక
రంజకములగు తక్కినకర్మములకుం బ్రతికూలములై కేవల శాంతరస
ప్రధానములగుటచే నారెండు శ్రౌతకర్మముల నారణ్యకములందుం
జేర్చి దంభులగు నధ్వర్యులు పాంగోష్ఠము నుండి యతులనువలెం దక్కిన
శ్రౌతకర్మములనుండి బహిష్కరించిరి వాజసనేయసంహితకు శతపథ
బ్రాహ్మణము వ్యాఖ్యానరూపమైనది- "తైత్తిరీయకేసమామ్నాయే
సమానాధ్యయనే నానాసూత్రాణి- తస్మాదపి శాఖాభేదః తథా
చైకస్యాం తైత్తిరీయశాఖాయాం సమానపారాయణాం సూత్రభేదా
దనాంతరశాఖాభేదః" అనుటచే సూత్రభేదముచే శాఖాభేదములగు
టచే శ్రౌతస్మార్తకర్మము లగణితములు- కావున నెవ్వరే శ్రౌత
స్మార్తకర్మము లాచరించుటకర్హులో తెలియశక్యముకాదు మఱెట్టి
వారికే శ్రౌతస్మార్తకర్మములు విధింపంబడెనో నిర్దేశింప నశక్యము
"ముద్గలో గోకులో వాత్స్యః శైశిరః శిశిరస్తథా, పంచైతే శాక
లాః శిష్యాః శాఖాభేదప్రవర్తకాః" చరణవ్యూహాఖ్యగ్రంథము
నందు ఋగ్వేదమునకయిదు చరణములు యజుర్వేదమునకెనుబది
యారు చరణములు సామవేదమునకు వేయి చరణములు అథర్వ
వేదమునకుం దొమ్మిది చరణములు చరణస్వరూపములగు శాఖలు
ప్రతివేదమునకనేకవిధాగణితసంఖ్యాకములు నష్టములుం బరిశిష్టము
లును- ఈవేదచరణశాఖలందు రూపుమాసిన వెన్నో ప్రాచీనము
లెన్నో నవీనము లెన్నో సూత్రములకు బ్రాహ్మణములకు సంహితల
కెవ్వెవ్వి యెన్నెన్ని మూలములలో తెలియరాదు- మంత్రోచ్చారణ

విశేషము శాఖ, ఆయుచ్చారణ మనంతభేదముఁ నుండుటచే ననంత సంఖ్యాకశాఖలు కలిగెను- శాఖాధ్యయనానుసారముగాఁ గులభేద ముం గోత్రభేదముం గలిగించినవి చరణములు కాఁబట్టి యనంత వేదము లనంతశాఖ లనంతచరణము లనంతగోత్రము లనంతకులము లసంఖ్యాకములై యున్నవి

## యజ్ఞదీక్ష

దీక్షణీయ మనునిష్టికర్మమున "అగ్నిర్వై దేవానమవమో విష్ణుః పరమస్తదన్తరేణ సర్వా అన్యా దేవతాః" అగ్ని మొదలువిష్ణువు తుద తక్కిన దేవతలందఱు నడుమ "ఆగ్నావైష్ణవం పురోడాశం నిర్వపతిదీక్షణీయ మేకాదశకపాలమ్"పదునకొండుకపాలముల పురోడాశ మాగ్నావైష్ణవ మనఁబడును అగ్నియును విష్ణువునఖిలదేవతలే కనుక సర్వదేవతల కీపురోడాశము చెందును"సర్వాభ్య ఏవైనం తద్దేవ తాభ్యోఽనన్తరాయం నిర్వపన్తి - అగ్నిర్వై సర్వా దేవతా విష్ణుః సర్వా దేవతాః-ఏతేవై యజ్ఞస్యాన్తే తన్వౌ యదగ్నిశ్చ విష్ణుశ్చ తద్యదాగ్నా వైష్ణవం పురోడాశం నిర్వపన్త్యన్తత ఏవ తద్దేవానృధ్నువన్తి- తదా హుర్యదేకాదశకపాలః పురోడాశో ద్వావగ్నా విష్ణూ క్వైనయోస్తత్ర క్లుప్తిః కా విభక్తిరితి-అష్టాకపాలఆగ్నేయోఽష్టాక్షరా వై గాయత్రీ గాయత్రమగ్నేశ్ఛన్దస్త్రికపాలో వైష్ణవ స్త్రిర్హీ దం విష్ణుర్వ్యచక్రమ తె సైనయోస్తత్రక్లుప్తిస్సా విభక్తిః - ఘృతేచరుంనిర్వపేత యోఽప్రతి ష్ఠితో మన్యేత-అస్యాం వావ స న ప్రతితిష్ఠతి యో న ప్రతితిష్ఠతి" అగ్నియే సమస్తదేవతలును మఱియును విష్ణువే సమస్తదేవతలును కాఁబట్టి యగ్నిని విష్ణువు నుభయుల నారాధించినవారు సమస్తదేవతల నారా ధించినవారగుదురు

ఎనిమిది కపాలముల పురోడాశ మగ్నిదేవతకుఁ జెందును- గాయత్రి యెనిమిది వ్యంజనములుగలదగుకను మఱియు న్గాయత్రి యగ్ని దేవతాకముగనుకను మూఁడుకపాలముల పురోడాశము విష్ణువున

కేర్పడెను కారణమేమన విష్ణువు త్రివిక్రముఁడై ముజ్జగముల నాక్ర
మించెనుగనుకను- మఱేయాస్త్రయమున లేనివాఁడు తనేతినే చరవుగా
దేవతల కల్పించవచ్చును- ప్రపంచములేనివాఁ డీలోకమునందు నె దుకుం
నకిరాడు "తస్మాద్ధ్రువంతి స్త్రియో యోనావే తండులా స్త్రైపుంసస్త్
న్మిథునం- మిథునేనైవేనం త్ప్రజయా పశుభిః ప్రజనయ ప్రజాత్యై ప్ర
జాయతే ప్రజయా పశుభిర్య ఏవం వేద - ఆరబ్ధయజ్ఞో వా ఏష ఆరబ్ధదేవ
తో యో దర్శపూర్ణమాసాభ్యాం యజతే అమావాస్యేన హవిషేష్ట్వా
పౌర్ణమాసేన హవిషా తస్మిన్నేవ హవిషి తస్మిం ప్రతిరిక్షేతైషా వై దీక్షా- సప్త
దశ సామిధేనీరనుబ్రూయాత్ - సప్తదశో వై ప్రజాపతిర్ద్వాదశ మాసాః
పంచర్తవో హేమంతశిశిరయోః మాసేన తావాంత్సంవత్సరః సంవత్సరః
ప్రజాపతిః ప్రజాపత్యాయతనాభిరేవా మిరాధ్నోతి య ఏవం వేద-
యజ్ఞో వై దేవేభ్య ఉదక్రామత్ … మిషిభిః ప్రైషమైచ్ఛన్ … దిష్టిభిః ప్రైష
మైచ్ఛం స్తదిష్టీనా మిష్టిత్వం … స్వవిందన్" చరువుపందలి చేయి స్త్రీ
యొక్క -చను బాలుధాన్యపుగింజలు పురుషునిబీజము కాబట్టి యీ రెండును
మిథునమైనది కాఁబట్టి యీ ప్రకారముగా నాచరువు వాఁడభివృద్ధి
పొందునట్లు వానివంశమును బశువులను వృద్ధిచేయును ఇట్లు తెలిసిన
వాఁడు వంశాభివృద్ధినొందును అమావాస్యపూర్ణిమాహోమములు
చేయువాఁడుయజ్ఞకర్మములకును దేవతారాధనమును మొదలిడినవాఁ
డగును ఇట్లు దర్శపూర్ణమాసేష్టులు జరిపినమ్మట యీదేవతా
నివేదనములతో నేయీ యజ్ఞవేదికయందే వాఁడు దీక్షపూనవచ్చును
ఇదియొక దీక్షారూపము - హోత్రిపదేడు సామిధేని శ్లోకములను
జదువవలయును జగత్ప్రభువగు ప్రజాపతి పదేడురెట్లే యున్నాఁడు
మాసములు పన్నెండు హేమంతశిశిరర్తు లొకటిగా నెంచఁబడి
నపుడు ఋతువులైదు అదే సంవత్సరము మఱి యీసంవత్సరమే
ప్రజాపతియై యున్నాఁడు- ప్రజాపతిలోని పదేడు సామిధేని శ్లోకము

లున్నవని తెలిసినవాఁ డభివృద్ధిఁ బొందును-యజ్ఞము దేవతలనుండి పాఱిపోయెను-ఆయజ్ఞము నిష్టులచే దేవతలు వెదకఁగోరిరి- యజ్ఞమును వెదకుటకై కోరఁబడినసాధనములుగనుక నిష్టులిష్టులని చెప్పఁబడినవి- (ఇష అను ధాతువునకుఁ గోరుటయని యర్థము) ఆ దేవతలిష్టిమూలముగఁ దిరిగి యజ్ఞమును బట్టుకొనిరి- "అనువిత్తయజ్ఞం రాధ్నోతి యఏవంవేద - ఆహూతయా వైనామైతాయదాహూతయ ఏతాభిర్వైదేవాన్ యజమానోహ్వయతితదాహూతీనామాహూతిత్వం- ఊతయోఖలువై తానామయాభిర్దేవాయజ మానస్యహవమాయంతి యేవైపంథానోయాః స్రుతయస్తావాఊతయస్తఉఏవైత త్స్వర్గయాణా యజమానస్యభవంతి-తదాహుర్యదన్యో జుహోత్యథయోఽనుచాహ యజతిచకస్మాత్తంహోతేత్యాచక్షతఇతి-యద్వావసతత్రయథాభాజ నందేవతాఅముమావహాముమావహేత్యావాహ్యయతితదేవహోతుర్హోతృత్వంహోతాభవతి-హోతేత్యేనమాచక్షతేయఏవంవేద - పునర్వా ఏతమృత్విజోగర్భంకుర్వంతియం దీక్షయంతి-అద్భిరభిషించంతి- రేతో వాఆపఃసరేతసమేవైనంతత్కృత్వాదీక్షయంతి- నవనీతేనాభ్యంజంతి ఆజ్యంవై దేవానాంసురభిఘృతం మనుష్యాణామాయుతం పితౄణాం నవనీతంగర్భాణాంతద్యన్నవనీతే నాభ్యంజయతిస్వేనైవైనంతద్భాగ ధేయేన సమర్ధయంతి ఆజ్యంతేనం" ఈవిధముగాఁ దిరిగి యజ్ఞము లభించెనని తెలిసినవాఁ డభివృద్ధిఁ జెందెను-ఆహుతులచే దేవతలు యజమానునిచేఁ బిల్వఁబడెదరు- కనుక నవి యాహూతిసంజ్ఞ నొందెను-అవియూతులని పిల్వఁబడెను- యజమానుని నాయూతుల వలన దేవతలుఎల్వఁబడిరికనుకను లే కవి మార్గములు స్రోవలయిన కారణములచేత నవి యూతు లయినవి- మఱి యవి యజమానుఁడు స్వర్గమునకేగు దారుల గను-కను-అధ్వర్యుఁడు వేల్చుచుండఁగా మంత్ర ముచ్చరించువాఁడు హోత యెట్లయ్యెనని కొందఱు పల్కిరి

వాని నిచ్చుటికిఁ దీసికొనిరా తీసికొనిరమ్మని తనయజ్ఞవేదికకు దేవత లను రప్పించుటకుఁ గారణమైనాఁడుగనుక హోత యని చెప్పఁబడెను వాఁడు హోత (ఆవహా యనుధాతువునకు దగ్గఱకుఁ దెచ్చుట యని యర్థము) ఈసంగతి యెఱింగినవాఁడు హోత యనంబడును

దీక్షాకర్మముచే నధ్వర్యు లెవనిని సంస్కరించెదరో వాఁడు ద్విజుఁ డగుచున్నాఁడు- వానిని నీటిచే వా రభిషేకించెదరు నీరు బీజము (రేతస్సు) ఈరేత స్సవిధముగా యజమానునిపైఁ జల్లుటచే వాని నధ్వర్యులు సంస్కరించుచున్నారు- అప్పుడే తీసినవెన్నను యజమానునకుఁ బూయుచున్నారు- వెన్న కరుగు దేవతల కాజ్యము- మనుష్యులకు సురభిఘృతము ఆయుతము పితృదేవత కు- నవనీతము చూలులకు కాఁబట్టి నవనీతమునఁ బూయుటచే గర్భ ధారణము కావించుచున్నాఁడు వానికిఁ గాటుకఁ బెట్టుచున్నారు "తేజో వా ఏతదక్ష్ణోర్యదాఞ్జనం సతేజస మేవైనం తత్కృత్వా దీక్షయంతి ఏకవింశత్యా దర్భపింజూలైః పావయంతి- శుద్ధమేవైనం పూతం దీక్షయంతి- దీక్షితవిమితం ప్రపాదయంతి-యోనిర్వా ఏషా దీక్షితస్య యద్దీక్షితవిమితం యోనిమేవైనం తత్స్వాం ప్రపాదయంతి-తస్మాద్ధ్రువా ద్యోనే రాస్తేచ చరతిచ- తస్మాద్ధ్రువాద్యోనేర్గర్భాధీయంతే చ ప్రచ జాయంతే- తస్మాద్దీక్షితం నాన్యత్ర దీక్షితవిమితాదాదిత్యోఽభ్యుద యాద్వాభ్యస్తమియాద్వాపివాభ్యాశ్రావయేయుః- వాససా ప్రోర్ణు వంతి- ఉల్బంవా ఏ దీక్షితస్య యద్వాస ఉల్బేనైవైనం ప్రోర్ణువంతి- కృష్ణాజినముత్తరం భవతి- ఉత్తరం వా ఉల్బాజ్జరాయు జరాయుణైవైనం తత్ప్రోర్ణువంతి- ముష్టీకురుతే- ముష్టీవై కృత్వా గర్భోఽంతః శేతే ముష్టీ కృత్వా కుమారో జాయతే తద్యన్ముష్టీకురుతే యజ్ఞం చైవ తత్సర్వాశ్చ దేవతా ముష్టీకురుతే" కాటుక పెట్టుట కన్నులకుఁ దేజము కాటుకనుంచుటచేఁ దేజస్సుగ వా రాయజమానుని దీక్షితుని

గావించెదరు ఇరువదొక్క దర్భకట్టలతోఁ దుడిచి వానిని శుద్ధి చేసెదరు ఇట్లు పరిశుద్ధి కావింపఁబడినవానిని దీక్షితునిగాఁ జేసెదరు వానిని శాలాప్రవేశము కావించెదరు. దీక్షితుని కాయజ్ఞశాల గర్భమువంటిది (ఆయజ్ఞవేదిక ప్రాచీనవంశ మనఁబడును) కలిలరూపమగు నాయజమానుని యజ్ఞశాలాగర్భాశయమున నుంచెదరు ఈ యథార్థమైన గర్భగోళమం దాయజమానుఁడు కూర్చుండి మఱి యందుండి వెలువడును కాఁబట్టి బీజము యథార్థమగు గర్భాశయమునుండి యుద్దానినుండి పోఁచును కాఁబట్టి తపయుద యాస్తమయకాంతిని సూర్యుఁ డాయజమానునిపైఁ బ్రసరింపకుండ నిమ్ము మఱియు నధ్వర్యులు వానితోఁ బలుకకుండనిమ్ము. వానిని వస్త్రముతోఁ గప్పెదరు ఈవస్త్రమే శిశువు నివసించి పైకి వెలువడఁ దగిన జరాయువు కాఁబట్టి వానిని జరాయువుచే మూసెదరు నల్ల సారగల మృగశీర్షచర్మము వానిపై కప్పు. ఉ ల్బముమీఁదిది జరాయువు మఱి యీవిధము నాయజమానుని జరాయువందుంచెదరు ఆయజమానుఁడు తనపిడికిళ్ళు మూసికొనును. మూయఁబడినపిడికిళ్ళలో బీజము శిశురూపముగాఁ జేయుగర్భాశయముందును. శిశువుపిడికిళ్ళు మూసికొనియే పుట్టునువాఁడు వానిపిడికిళ్ళు మూసికొనునుగనుక యజ్ఞమును గట్టిగాఁ దనపిడికిళ్ళలోఁ బట్టుకొనును మఱి యజ్ఞదేవతలంద ఱాపిడికిళ్ళలోనిమిడియుందురు 'తదాహుర్న పూర్వదీక్షిణఃసంసవోఽస్తి పరిగృహీతో వా ఏతస్య యజ్ఞః పరిగృహీతా దేవతానై తస్యార్తిరస్త్యపరదీక్షిణావన యథాతర్థేతి ఉన్ముచ్య కృష్ణాజిన మవభృథమభ్యవైతి తస్మాన్ముక్తాగర్భాజరాయుర్జాయంతే-సహైవవాసపాభ్యవైతి తస్మాత్సహైవోల్బేనకుమారోజాయతే - త్వమగ్నేసప్రథాఅసి సోమయాస్తేమయోభవఇత్యావృత్యాభాగయోఃపురోమవాక్యేఅనుబ్రూయాద్యఃపూర్వమనీజానఃస్యాత్తస్మై -త్వయాయజ్ఞంవితన్వతఇతియః

మేవాస్మావతద్వితనోతి - అగ్నిఃప్రత్నేనమన్మనాష్టాపయమితయః పూర్వమిజానఃస్యాత్తస్మై-ప్రత్నమితిపూర్వాంకర్మాభివదతి- తత్తన్నా దృత్యమేఅగ్నిర్వృత్రాణిజంఘనత్త్వంసోమాసిసత్పతిరితివార్త్రఘ్నా వేవకుర్యాత్ - వృత్రంవాఏషహన్తియోయజ్ఞఉపనమతితస్మాద్వార్త్రఘ్నా వేవకర్తవ్యావితి" మొట్టమొదట దీక్షితుఁడౌవాని కితరులుదీక్ష నందుదౌమ్మగందరగోళ మంటదు కారణమేమన వానియజ్ఞము వానిపిడికిళ్ళలో గట్టిగఁ బట్టుకొనఁబడెనుగనుక మఱియు దేవతలందఱు న్వాని పిడికిళ్ళలో నిమిడియుండుటచేతను కాఁబట్టి వాని కాలస్యముగా దీక్షితుఁడౌవానికివలెనష్టమెద్దియు నగలుగదు ఆదీక్షితుఁడు తనపై కప్పుతొలగించుకొని స్నానమాఁడదొడఁగును కాఁబట్టి జరాయువు వెడలినపమ్మట లోపలియుచ్ఛతిత్తిమాత్రమే మిగులును-వానిలోపలి వస్త్రముతో వాఁడు స్నానముకై నీట దిగును కాఁబట్టి శిశు వుచ్ఛతిత్తితోఁ గప్పఁబడి పుట్టును- అదివఱకు యజ్ఞముచేయనివానికి "త్వమగ్నేసప్రథాఅసిసోమయాస్తేమయోభువ" అను రెండు పురోఽను వాక్యములు హోత్రి విన్పించనిమ్ము క్రమముగా మొదటియాజ్యభాగమునుగూర్చియును రెండవయాజ్యభాగమునుగూర్చియును "నీద్వారమున యజ్ఞమును వారు కొంపోయెదరు"

మొదటిశ్లోకమందలి మూఁడవపాదము చదివి హోత్రి యజమానునిగూర్చి యజ్ఞముచు మోసికొపోవును అదివఱకు యజ్ఞము చేసినవానికి "అగ్నిఃప్రత్నేనమన్మనా - సోమగీర్భిష్ట్వా వయమ్" అని చదివి వినిపించనిమ్ము- ప్రత్నశబ్దమూచేఁ దొంటియజ్ఞము గూర్చి తెల్పును- అదివఱకు యజ్ఞముచేసినవానికిం జేయనివానికిం గొన్ని శ్లోకములు హోత్రి విన్పించవలయునను నీరెండువిధు లాచరింపఁ దగదు అగ్నిర్వృత్రాణిజంఘన - త్వంసోమాసిసత్పతిః" ఆహోత్రి వృత్రుని ధ్వంసము కావించుటకై ముఖ్యముగా నీరెండుమంత్రము

లుచ్చరించనిమ్ము- కారణమేమన యజ్ఞ మెవనిని సమీపించునో వాఁడు వృత్రుని నశింపఁజేయును కాఁబట్టివృత్రునిధ్వంసముకావించు శ్లోకములే యుపయోగించవలయును "అగ్నిర్ముఖంప్రథమోదేవతానామగ్నిశ్చ విష్ణోతపఉత్తమం మహఇత్యాద్యా వైష్ణవస్యహవిషోయాజ్యానువాక్యేభవతః, ఆగ్నావైష్ణవ్యౌరూపసమృద్ధేవతద్వైయజ్ఞస్యసమృద్ధంయద్రూపసమృద్ధంయత్కర్మక్రియమాణమృగభివదతి అగ్నిశ్చహవై విష్ణుశ్చదేవానాం దీక్షపాలౌదీక్షయా ఈశాతేతద్యదాగ్నావైష్ణవంహావిర్భవతియాదీక్షయాఈశాతేతౌప్రీతౌదీక్షాంప్రయచ్ఛతాంయాదీక్షయితారౌదీక్షయేతామితి-త్రిష్టుభౌభవతఃసేన్ద్రియత్వాయగాయత్ర్యౌస్విష్టకృతః సంయాజ్యేకుర్వీతతేజస్కామోబ్రహ్మవర్చసకామః- తేజోవైబ్రహ్మవర్చసంగాయత్రీ- తేజస్వీబ్రహ్మవర్చసీభవతియఏవంవిద్వాన్ గాయత్ర్యౌకురుతే-ఉష్ణిహౌవాయుఃకామఃకుర్వీత-ఆయుర్వాఉష్ణిక్-సర్వమాయురేతియఏవంవిద్వానుష్ణిహౌకురుతే" "అగ్నిర్ముఖంప్రథమోదేవతానామ్" అనునదిపురోఽనువాక్యము "అగ్నిశ్చవిష్ణోతపఉత్తమంమహః" అను మొదలగునది యాజ్యశ్లోకము- అగ్నివిష్ణువుఁగూర్చిన యీరెండుశ్లోకములు సరిగానున్నవి-యజ్ఞముయొక్క శుద్ధి నిర్దుష్టాకృతింబట్టి యుండును ఈయంశములో సందర్భించినశ్లోకములు కర్మమనుగూర్చి విశదపర్చును- దేవతలలో నగ్నియు విష్ణువును దీక్షారక్షకులు వా రుభయులు దీక్షాప్రభువులు కనుక అగ్నికి విష్ణువునకు హోమములు జరుగును దీక్షాప్రభువులయినవా రిద్దరును సంప్రీతులై దీక్షను గొనసాగించి యీహోమకర్మము నాచరించు దీక్షితులు కాఁదగినదని పల్కెదరు శరీరబలమిచ్చుటకై వారుత్రిష్టుభు లని చెప్పఁబడెదరు- సౌందర్యమును బుద్ధి నాసించువారు స్విష్టకృత్తులైన గాయత్రీశ్లోకముల రెంటిని నుపయోగించుగాక- గాయత్రి సౌందర్యమును బుద్ధి నై యున్నది ఇట్లెఱింగి యారెండు

గాయత్రీశ్లోకముల నుపయోగించువాఁడు సౌందర్యము బుద్ధియుం గలవాఁ డగును దీర్ఘాయు ర్దాయువును గోరినవాఁ డుష్ణిగ్‌శ్లోకములు వాడనిమ్ము- ఉష్ణిహాన్నే యాయువు - ఈసంగతి తెలిసి యాతం డుష్ణిహములుపయోగించినవాఁ డభీష్టాయువు పొందును "అనుష్టుభా స్వర్గకామః కుర్వీత-ద్వయోర్వా అనుష్టుభోశ్చతుష్షష్టిరక్షరాణి త్రయ ఇమే లోకా ఏకవింశా లోకా ఏకవింశత్యైకవింశత్యైవేమాం ల్లోకాన్రోహతి స్వర్గ ఏవ లోకే చతుష్షష్టితమేన ప్రతితిష్ఠతి- ప్రతితిష్ఠతి య ఏవం విద్వాననుష్టుభా కురుతే-బృహత్యా శ్రీకామో యశస్కామః కుర్వీత శ్రీర్వై యశశ్ఛందసాం బృహతీ - శ్రియ మేవ యశ ఆత్మన్ధత్తే య ఏవం విద్వాన్ బృహత్యా కురుతే పంక్త్యా యజ్ఞకామః కుర్వీత - పాంక్తో వై యజ్ఞః ఉపైనం యజ్ఞో నమతి య ఏవం విద్వాన్ పంక్త్యా కురుతే త్రిష్టుభా వీర్యకామః కురుతే-ఓజో వా ఇంద్రియం వీర్యం త్రిష్టుప్-ఓజస్వీంద్రియవాన్ వీర్యవాన్భవతి య ఏవం విద్వాంస్త్రిష్టుభా కురుతే-జగత్యా పశుకామః కుర్వీత-జాగతా వై పశవః- పశుమాన్భవతి య ఏవం విద్వాన్ జగత్యా కురుతే-విరాజా వన్నాద్యకామః కుర్వీత అన్నం వై విరాట్- తస్మాద్యస్యైవేహ భూయిష్ఠమన్నం భవతి స ఏవ భూయిష్ఠం లోకే విరాజతి తద్విరాజో విరాట్త్వమ్"

స్వర్గమునుగోరువాఁడు రెండనుష్టుభుల నుపయోగించనీ రెండనుష్టుభులలో నఱువది నాల్గక్షరములు లవు మఱి యొక్కొక్కటి యిరువదొక్క భాగములుగల మూఁడు లోకములున్నవి ప్రతియిరువదొకక్షరముల భాగముతో నాయజమానుఁ డీమూఁడు లోకముల ననుభవించును మఱిమిగిలిన యఱువది నాల్గవయక్షరముతో నతఁడు స్వర్గమందు శాశ్వతముగా నత్తుకొనియుండును ఇట్టి రెండనుష్టుభుల నుపయోగిం పెఱుంగువాఁడు స్వర్గమున స్థిరముగా నుండును సిరియుఁ గీర్తియుఁ గోరినవాఁడు రెండుబృహతుల నుపయోగించనీ- బృహతీచ్ఛందమే లక్ష్మియును గీర్తియును ఇట్లు రెండుబృహతుల

యుపయోగ మెఱిఁగినవాఁడు శ్రీయశస్సుల రెండింటిం బొందును
యజ్ఞం బ్రేమించువాఁడు రెండు పంక్తిచ్ఛందములనుపయోగించని-
యజ్ఞము పంక్తిచ్ఛందము వంటిది రెండు పంక్తిచ్ఛందముల నుప
యోగ మెఱిఁగినవానికియజ్ఞము సిద్ధించును- శరీరదార్ఢ్యము కోరిన
వాఁడు మూఁడు రెండు త్రిష్టుభుల నుపయోగించని శరీరబలము
తేజము మఱి యింద్రియపుష్టి త్రిష్టుభై యున్నది ఇట్లు త్రిష్టుభుల
సంగతి యెఱిఁగినవాఁడు బలముం దేజ మింద్రియపుష్టిం బ్రాపించును
పశుసంపదఁ గోరువాఁడు రెండు జగతీచ్ఛందము లుపయోగించని-
పశువులు జగతీచ్ఛందము వంటివి ఇట్లు రెండు జగతీచ్ఛందముల
యుపయోగ మెఱిఁగినవాఁడు పశువుల సమృద్ధికలవాఁ డగును
అన్నముం గోరువాఁడు రెండువిరాట్ ఛందముల నుపయోగించనిమ్ము-
విరాజమే యన్నము - (రాజృధాతువునకుఁ బ్రకాశ మర్థము)
అన్న సమృద్ధికలవాఁడీలోకము లో మిక్కిలి ప్రకాశించును కాఁబట్టియే
యన్నము విరాట్టయ్యెను ఈ సంగతి నెఱిఁగినవాఁడు తనతోడి
పాటివారిలో మిక్కిలి ప్రకాశించును మఱి యట్టివాఁడే తనమిత్రులకు
మిక్కిలియుపకారము చేయఁగలఁడు సర్వేషాంఛందసాంవీర్య
మవరున్ధే సర్వేషాంఛ న్దసాంవీర్యమశ్నుతే సర్వేషాంఛన్దసాంసాయుజ్యం
సరూపతాంసలోకతామశ్నుతేఽన్నాదోఽన్నపతిర్భవత్యశ్నుతే ప్రజ
యాన్నాద్యం య ఏవం విద్వాన్ విరాజౌ కురుతే" ఇట్లెఱిఁగి యా విరాజ
శ్లోకముల నుపయోగించువాఁడు సకలచ్ఛందములశక్తిని సంపాదించు
కొనును మఱి సకలచ్ఛందశక్తిని దనయందు నిల్పుకొనును
మఱి సకలచ్ఛందములతో నేకీభవించును సకలచ్ఛందస్స్వరూ
పుఁడగును- కావలసినట్లు కందుచును మఱియథేష్టముగానను భవింపఁ
దగినంతయన్నము ను నిల్వ చేసికొనును తనకును తనకుటుంబము
నకును సమృద్ధిగా బ్రతికినన్నాళ్ళు పోలుంగా ననుభవింపఁదగినంత

యన్నమును సంపాదించుకొని నిల్వచేసికొనను "తస్మాద్విరాజా
వేవకర్తవ్యా ప్రేద్ధోఅగ్న ఇమోఅగ్న ఇత్యేతే" ప్రేద్ధోఅగ్న ఇమో
అగ్న యని మొదలిడు నీరెండువిరాజములు తప్పక ముఖ్యముగా
నుపయోగింపఁబడును "ఋతంవావదీక్షాసత్యందీక్షాతస్మాద్దీక్షితేన
సత్యమేవవదితవ్యం అథోఖల్వాహుఃకో౽ర్హతిమనుష్యః సర్వంసత్యం
వదితుంసత్యసంహితావై దేవాఅనృతసంహితామనుష్యాఇతి- విచ
క్షణ్వతీంవాచంవదేత్-చక్షుర్వైవిచక్షణందిహ్యేనేనపశ్యతీతి(చక్షుర్వై
విచక్షణంచక్షుషాహివిపశ్యతి)- ఏతద్ధవైమనుష్యేషుసత్యం నిహితం
యచ్చక్షుః-తస్మాదాచక్షాణమాహురద్రాగితిసయద్యదర్శమిత్యాహా
థాస్యశ్రద్దధతియద్యువైస్వయంపశ్యతిసబహూనాంచనాన్యేషాంశ్ర
ద్దధాతి-తస్మాద్విచక్షణవతీమేవవాచంవదేత్సత్యోత్తరాహైవావాస్య
గుతితాభవతిభవతి" దీక్షయే సరి దీక్షయేసత్యము కాఁబట్టిదీక్షసల్పు
వాఁడు సత్యము పల్కవలయును (ఋత మనఁగాఁ దిన్నని తెన్ను
సత్య మనఁగా నిజమాడుటఋతము తలంపునుబట్టి సత్యము మాటను
బట్టి యుండును) అంతయు సత్యమునే పల్కఁదగుమనుష్యుఁ డెవఁ
డని యనుచున్నారు- సత్సంపూర్ణులు దేవతలు- మఱి మనుష్యు
లనృతభూయిష్ఠులు- మాటాడునపుడెల్ల విచక్షణనామమును వాఁ
డుచ్చరించనిమ్ము- కన్ను విచక్షణ మగును కంటితోనే వాఁడు
స్పష్టముగాఁ జూచును గనుక (విచక్షధాతువునకుఁ జూచుటయర్థము)
మనుష్యులలోఁ జూపే సత్యముగా నేర్పర్చఁబడెను కాఁబట్టియే
యొద్దియైనసంగతి నెఱిఁగించువానితో నీవు కన్నారఁ జూచితివాయని
జను లడిగెదరు- నేఁ జూచితినని వాఁ డన్నప్పు డాసంగతిని జనులు
విశ్వసించుచున్నారు ఎద్దియైనఁ దా నొక్కఁడు మాత్రమే చూచిన
వాఁ డితరులం గొందఱిన్గాని యందఱిన్గానినమ్మించలేఁడు కాఁబట్టి
ప్రతిమనుష్యుఁడుం దా నోరెత్తినపుడెల్ల విచక్షవిచక్షణ యని యుచ్చ

రించుచు దవలయును  అట్లు విచక్షణశబ్దముం దా నాడు ప్రతి వాక్యమునకుఁ దోడుగాఁ బల్కుచుండువానియొక్క పల్కుంతయును సత్యమే యగును

ఈ బ్రాహ్మణను లుచ్చరించునవు డొక స్వరనియమము లేదు యథేష్టముగా నుదాత్తానుదాత్తములు పల్కవచ్చును- మంత్రోచ్చారణస్వరమున కిఁ వడినఛాందసులు స్మార్తకర్మములం దుపయోగించు పదములను వటియుం బురాణేతిహాసకావ్యశ్లోకము లనేగా గృహకృత్యము ఒదలి యేమాటలకైన హాస్యాస్పదముగా మంత్రస్వరముతోనే యుచ్చరించుచుం దమపల్కులు మిక్కిలి సంస్కృతములయును శుద్ధములనియు సభ్యములనియును శాస్త్రీయములనియు శ్రోత్రియములనియుఁ దక్కుజాతులవారిపల్కులను గర్హించుచున్నారు ఇటియును దాన దీక్షవహించకున్నప్పటి కీనాము బ్రాహ్మణులు దీక్షితవేషముతో డంభముం జూపుచుఁ దమ జాతిశ్రేష్ఠతం జాటుకొనుచు స్వార్థపరులై మనసులో నొకటి పైకొకటిగా వ్యవహరించుచు లోకమును మోసపుచ్చుచున్నారు "శ్రుతిస్థానే స్వరాన్వక్తుం నాలం బ్రవక్ష్యే తత్వతః" అని దేవర్షియగు నారదుఁడు శిక్షావిధి నిర్దేశించుటచే వేదమును నియతస్వరముగా నీకుక్షింభరులు వైదికమ్మన్యులు పామరులు ప్రాకృతులుగు మర్త్యులెంతమాత్రము బఠింపనేరరు అద్దమున నెవనిమట్టుకువాఁడు చూచుకొని సంతోషించున ట్లుదేశమువా రాదేశమందలి వేదపాఠము నకు సంతోషించుచుఁ దమపాఠమే తక్కిన వేదపాఠముఁ కన్న సరియైన దని పొగడుకొనుచున్నారు గ్రుడ్డికి గ్రుడ్డి త్రోవచూపుచందముగా గురువులు శిష్యులకు వేదమంత్రములం జెప్పుచున్నారు- అవ్యక్తమగు వేదనాదబ్రహ్మము నారాయణుఁడు వేంకటగిరియందు శిలారూపమున నవతరించినాఁ డన్నట్లు "ఇషేత్వా" మొదలగుశబ్ద

రూపముగా నెట్లున్నదని నక్రమచున్నానో మనుష్యు లట్టి తా
ముచ్చరించు [illegible] యజ్ఞ [illegible] తాదివ్యరము లట్లు శాస్త్రీ
యము లని పామరుల నమ్మించి స్వార్థపరులై తాము పఠించునవి
వేదము లనియును దామె శ్రోత్రియుల మనియును దక్షిణజాతులవా
రందఱుం ద మ్మాశ్రకే మేపుచుం బూజించుచుఁ దమమాటచొప్పున
నడువవలయున- దంభవేషము లూని తాము చెడి యితరులం జెఱచు
టకు ముఖ్యహేతువు దుష్టకలికాలము తప్ప నింకొకటి కాదు. బ్రహ్మ
యజ్ఞమునందు వేదముల దు మంత్రబ్రాహ్మణములే గాక యితిహాస
పురాణకల్పగాథానారాశంసులు కూడఁ గలవ చెప్పఁబడుటచే
మొత్తము యనాదిగా వేదమునందు మంత్రసంజ్ఞ కలది మంత్రము.
బ్రాహ్మణసంజ్ఞ కలది బ్రాహ్మణము. ఇంతకన్న మంత్రబ్రాహ్మణ
ముల నేర్పాటుచేయుటకి కొక దారి లేదు "బ్రాహ్మణేనామిశ్రిత
మంత్రాత్మకం శుక్లంయజుః అధ్వర్యవం కించిద్ధాత్ర క్వచిదిత్యవ్యవ
స్థయా బుద్ధిమాలిన్యహేతుత్వాత్ కృష్ణ యజుః" బ్రాహ్మణములోఁ
గలియక కేవల మంత్రాత్మకమైనదగుటచే శుక్లమనియును ఆధ్వర్య
హోత్రములతోఁ [illegible]లశావులకమై బుద్ధిమాలిన్యమునకు హేతు
వగుటచేఁ గృష్ణయజుస్సనియును యజుర్వేదము రెండు విధములు
"ఆదిత్యానీమాని శుక్లాని యజూంషి వాజసనేయేన యాజ్ఞవల్క్యే
నాఖ్యాయంతే" ఈ శుక్లయజుర్వేదము వాజసనేయుఁడగు యాజ్ఞ
వల్క్యునిచే సూర్యునివలనఁ బొందఁబడెను నూఱధ్యాయములు
కలదిగనుక శతపథబ్రాహ్మణ మయ్యెను శతపథబ్రాహ్మణము
శుక్లయజుస్సునకు వ్యాఖ్యానము వాజసనేయసంహిత శుక్లయజు
ర్వేదము తైత్తిరీయసంహిత కృష్ణయజుర్వేదము కృష్ణయజుర్వేదము
నకుఁ దైత్తిరీయబ్రాహ్మణము శుక్లయజుర్వేదమునకు శతపథ
బ్రాహ్మణమును వ్యాఖ్యానరూపములయినప్పటికిఁ గొంకొంటిలో

నారెండుబ్రాహ్మణములు కలిసియే యున్నవి దీక్షితుఁడు తనపేరు తనగోత్రముపేరు తనతండ్రిపేరు తనతాతపేరు తనముత్తాతపేరు చెప్పవలసినది ఐతరేయబ్రాహ్మణమందలి దీక్షణీయమును బైప్రకార మాంగీకరింపఁబడెను మఱియును యజ్ఞమునందు సదస్యుఁ డిదివఱకు జరిగినతప్పుం దెలియపర్చవలయును మఱేయధ్వర్యులయినను గడచినతప్పుపట్టి తెలుపవచ్చును ఈచేసినదోషము విూ కెట్లు వదలు నని యడుగఁగా నధ్వర్యుఁ లూరకుందురు వారి బ్రహ్మ యాలీకయుఁ డతఁడు వాచస్పతిసంతతివాఁ డాప్రశ్నమున కయోగ్యు నాకుఁ దెలియదు పెద్దజాతూకర్ణ్యుఁడను మనతండ్రుల గురువు నడుగుదము- అప్పుడు జాతూకర్ణ్యుఁ డాప్రశ్నమును విని తిరిగి యావేద వాక్యమును జదువుఁ డనెను ఆలీకయుఁ డందుకు శాస్త్రమనువచనము నిగదము యాజ్యము మఱెద్దియైన మొదటినుండి తుదివఱకుఁ జదువ వలయుననఁగా శ్లోకముగాని శ్లోకార్థముగాని శ్లోకపాదముగాని యంపలియొకపదము గాని యక్షరముగాని యెంతవఱకుందప్పెనో యంతవఱకుం జదువవలసియున్నదనెను

అపుడు కౌషీతకి యనువాఁ డాగ్రంథము తిరిగి పఠింపఁబడ నవసరములేదు హోతలు ప్రమాదమున యజ్ఞమునందు చేయు తప్పులు దివ్యహోతయగు నగ్నిదేవుఁడు దిద్ది యజ్ఞముఁ దయం బవిత్ర మొనర్చునని ఋగ్మంత్రము చెప్పుచున్నదని పల్కెను ఇట్లు నైమిష ఋషులు చేయుచున్నక్రతుశాలకు వెళ్ళి ప్రశ్నించినదివోదాసపుత్రుఁ డగు ప్రవర్ధనభూపతిచేసిన ప్రశ్నమునకు సమాధానము చెప్పఁబడెను బ్రాహ్మణములవలనఁ దొల్లి మనుష్యులం గ్రతువులందు బలియిచ్చు నాచారము కలదందుకై బ్రాహ్మణులు తమపుత్రుల నమ్ముకొనువా రని తైత్తిరీయబ్రాహ్మణము సాంఖ్యాయనసూత్రమును శునశ్శేపుని కథంబట్టి తెల్లమగుచున్నది శౌనకలు మొదలగువారు తెలి

జంతువులను క్రతువులందుఁ జంపుటకన్న మానిసులం జంపుట కొంత యంగీకరింపవచ్చును- సర్వజంతువునాశకుఁడు లోకద్రోహ మొనర్చు నుపాయ మన్ని జంతువులకన్న లెక్కువగాఁ దెలిసినవాఁడును సర్వ భక్షకుఁడు స్వార్థపరాగ్రేసరుఁడు విద్వాన్మానియు గర్వపర్వతశిఖరా రూఢుఁడగు నొక మానిసిం జంపనొప్పటికిం గొంత సాధుజనోపకారమే కదా ? ఇట్లే బ్రాహ్మణము లెడ్డదిడ్డ క్రూరకర్మములను వ్యర్థమయిన ద్రవ్యవినియోగమును వృథోద్యమములను సోమరిపోతుతనముల నబద్ధ పౌనికథలను బుక్కిటిపురాణములను సోదెలను దంభవేషములను బామరరంజకములగు కట్టుకథలను ముచ్చటలను వాలకములను మొక్క లగుబుద్ధిలేనినో వాక్కు-యకర్మములను బోధించుటకు మను వెంత మాత్ర ముద్దేశింపలేదు క్రమక్రమముగా వివేకులు వంచకులు స్వార్థపరు లీ శ్రౌతవిధానముల గల్పించి రని సిద్ధాంతీకరింపక తీఱదు జీవహింసయును వ్యర్థకాలక్షేపమును జనుల కన్యోన్యవిద్వే షముం బరమకారుణికులన సర్వజ్ఞులగు మునులు వేదవేదాంగ ముఖమున నెంతమాత్రము నొక్కి బోధింపరు బోధింపరు

## యుగస్వరూపము

మనుష్యుఁడు పడుకొన్నసమయమే కలియుగము - మేలుకొన్న వేళ ద్వాపరము నిలువఁబడినతతి త్రేత- ఇతి నడుచుచున్న కాలమే కృతయుగ మని బ్రాహ్మణము చెప్పుటచే నడుచుచున్నసమయ మనఁగా లోకోపకారముకై కాయక్లేశముతో కృషిమొదలగు పాటు పడుట భూమినిదున్నుకొని పండించుకొనుట మొదలగుపాటుపడి తనతోడిపాటివారలకుం దోడ్పడక సోమరితనమున నిద్దురించుచుఁ గూర్చుండి సోదెచెప్పుచు సన్యాసులమని మెట్టవేదాంతములు పలుకుచుండు సోమరిపోతులే కలిజనులు తమయొక్క సుఖముకొఱకు

లోకోపకారార్థమై దున్నుట యిండ్లుకట్టుట బట్టలునేయుట మొదలగు కాయక్లేశము వ్యాయామమొనర్చు పుణ్యాత్ములెక్కతెయుగపురుషులు, వ్యాయామముతోఁ శరీరకష్టమున నిద్రాహారవిహారసౌఖ్యసాధన సామగ్రి నంపాదింపక సోమరులై గ్రంథకాలక్షేపమును స్వర్గనరకము లనుగూర్చి తెలిసీ తెలియని యుపన్యాసములను మెట్టవేదాంతబోధ లను జపమంత్రోపదేశములను మతచర్చలను కేవలస్వార్థపరుఁడై ధూర్తుఁడై కూర్చుండి తినమరగినతుంటరిమాత్రమే కపటఖండిత వేషముతోఁ దనకుఁ దోడితరులకుఁగూడ నాధివ్యాధులు హెచ్చించి భూభారమునకుమాత్రమే జీవించు దిక్కుమాలినగ్రంథకల్పనముల వ్రాఁతలచేఁ దాఁ దరింపలేకితరులఁ దరింపనీక సంశయమున ముంచి లోకులఁ జెఱచి తాఁ జెడుమానఁడు. మిరెపకాయకార మిట్లుండు నని తినక చవి చూడక లోఁతుఁ దెలియదనుసామెతగా మిరెపకాయ చవిచూడనివాని కాకారమునుగూర్చి యెంత యుపన్యసించినను మఱెంతగ్రంథము వ్రాసి చదివించినను తెలియునా? నిద్రాహారవిహార సౌఖ్యసంపాదకసాధనములగు వ్యవసాయము మొదలగుపనులు తాఁ జేయుచు నితరులకు మప్పవలెను. వేదశాస్త్రములు బ్రతుకు సుఖ ముగ నడుపుకొను త్రోవను సూచించునుగాని తా మశరీరము లగుటచే నట్టిజీవితసౌఖ్యకరమగు త్రోవను దాము నడచి జనులకు నడచి చూపించనేరవు. లోకములోని పురుగులు పక్షులు మృగములు తమనిద్రాహారవిహారసౌఖ్యమునకై యెట్లు పాటుపడు చున్నవో మనుష్యులుకూడ నట్లే పడుటమాని వేదములనియును శాస్త్రములనియును స్వర్గనరకములనియు జాతిమతవర్ణాచారశిష్టసంప్ర దాయములనియు సహజముగాఁ దమకు లేనిపోనివికారము లను అద్దము చూచుకొన్న విధమునఁ గల్లుద్రాగినచందమునఁ బిశాచ

గ్రస్తునివడువున సన్నిపాతరోగపీడితునివలెం గోరికోరి సోమరిపోతులై
యాధివ్యాధులకు లోనగుచుంట దుష్టకలికాల చేష్టితముకాదా!
నిష్కపట హృదయములతో నిద్రాహారవిహారములోనచ్చు బాల్య
దశయే నాల్గుపాదముల ధర్మముతో నడుచు కృతయుగము నూత్న
యౌవనము ధర్మము మూఁడుకాళ్ళ నడుచు త్రేత- ప్రౌఢవయస్సు
రెండుపాదముల ధర్మము నడుచు ద్వాపరము- క్రమముగా నొకపాద
ధర్మముతోనైన నడువనేరక పాదములశక్తి రవంతయులేక నడువ
నేరక మూలఁబడి స్వకరసౌఖ్యకరమగు కాయక్లేశకసాధ్యమగు
వ్యాయామము నొకింతయును చేయలేక వేదములనియు శాస్త్రము
లనియు స్వర్గనరకము లనియు జాతులనియు మతములనియుం బూర్వా
చారములనియు సారకాయలు నలకు వార్ధకదశయే నాల్గుపాదముల
శక్తి సమూలముగ నశించిన ధర్మశూన్యమగు కలికాలము- అట్టి
నిరర్థకవార్ధకదశయందు కాయక్లేశముననిద్రాహారవిహారసౌఖ్యము సం
పాదించుకొననేరక యితరులంగష్టపెట్టి తమవ్యర్థజీవనముం బొడిగించుకొనం
గోరిన ధూర్తబకధ్యానపరులగు ముసలిముద్దలు తన్నిన కృత్రిమ
కల్పనములే యీవేదశాస్త్రములు మతగ్రంథములు పుక్కిటిపురాణ
ములు ఈవృద్ధులు పాటుపడి తమనిద్రాహారవిహారసౌఖ్యసాధనము లు
తాము సంపాదించుకొనుటకుం బనికిరాక పరుల న్దగుకొఱకై కష్ట
పడుట కొప్పించునుపాయములే యీశ్రుతిస్మృతులు శ్రౌతస్మార్త
కర్మములం బోధించు సకలగ్రంథములు వేయేల పెద్దలు తమ
నిద్రాహారవిహారసౌఖ్యమున కెట్లు కాయక్లేశమందుచున్నారో వారి
నడువడిచూసి పిన్నలు సహజముగాఁ దాముగూడ నానడువడినే
యవలంబించుట సర్వజంతువులందు సమానసహజపద్ధతియే కదా!
సహజపద్ధతినిబట్టి నడుచుట సహజగుణమే పనికివచ్చునుగాని మనుష్య
కల్పితకృత్రిమపద్ధతు లనవసరములు వ్యర్థములు లేనిపోనిక్రమాత

హేతువులు—చలిబాధ తనకుఁ గలిగినపుడు తనకంటెఁ బెద్దవారు బట్టలుకప్పుకొని సుఖముండుట సహజముగాఁ జిన్న కనిపెట్టి కాఁగూడ బట్టకప్పుకొనఁడా? పెద్దవాఁ డెట్లు బట్టను సమకూర్చుకొనునో యట్లే తాను బట్టను సమకూర్చుకొనునుపాయము సహజముగా నెదకుకొనఁడా?

ఊపిరితీసికొనుటకు వినుటకుఁ జూచుటకుఁ జవిగొంటకు వాసనగొంటకు స్పర్శమనుభవించుటకు నిద్రించుటకునవయవములుకదలించుటకు నడచుటకుఁ బరువిడుటకు నిద్రించుటకుమేల్కొనుటకాఁకలిదప్పికలబాధదీర్చుకొనుటకు స్వభావముగాఁ బ్రతిజంతువును బ్రవర్తిల్లుచుండును వేదశాస్త్రప్రహోమతో మఱియును గ్రంథములతోఁ బనియేమి? పంచభూతాత్మకములగునానావిధశరీరములకు నిద్రాహారవిహారసౌఖ్యమాసించుజీవితమునఁ బాంచభౌతికపదార్థములకన్న నశరీరములగు వేదశాస్త్రములతోను స్వర్గనరకములతోను ఆత్మభేదములతోనుమొట్ట వేదాంతములలోను లోకాతీతపదార్థవర్ణనములతోను మఱి యితం బ్రియాకాశపంచాంగములగు భూతభవిష్యద్వర్తమానకథనములతోనుపరస్పర విద్వేషకారణ కులజాతిమతాచారవిశేషచర్చలతోను రవంతయుం బనిలేదు కోటి రూప్యములిచ్చెద నను మాటకన్న నొక్క దమ్మిడి యొక్కటిమిచ్చుట కోటింతలు నయము కదా? వేదములు శాస్త్రములు పురాణములువల్లించుట బ్రాఁతలనగపర్చుటకన్న నాఁకలిగొన్నవానికిఁ బట్టెడుకూడిడుట కోటింతలు మేలుకదా? నిద్రాహార విహారాత్మకమగు స్త్రీబతుకున నిద్రాహారవిహారసౌఖ్యసంపాదకసాధనమగు బ్రోవ నన్నిజంతువులకు సహజముగాఁ జిన్న పెద్దవరుసంబట్టి నడచుకొన్చే నడచుకొన్చున్నవి కాలాతీతకంకణమున కద్దమువాలె నీవేదశాస్త్రములీపోమరిపోతుమునలిపాతపంచాంగములు మిక్కిలియును నిరుపయోగములు ఒకరికన్ననొకరు గొప్పవారమను స్వార్థపరులైరయాస్తి

కూడబెట్టుకొనుట కుంజాతి మతాచారవైషమ్యములతో లేనిపోనితర్కా-
ములతోఁ గొంగాని వేదశాస్త్రచర్చలతో నన్యోన్యద్వేషములతోఁగోరి
కోరితెక్కున జంతువులకన్నఁజావునకు ముందుగాఁజచ్చుట కలియుగము
నందలి మనుష్యులస్వభావము – జను లన్యోన్యానురాగముం జెఱచి
పరస్పర ద్వేషము కల్పించు వేదశాస్త్రశిష్ట సంప్రదాయములమతాచార
ప్రవర్తకులు లోకమునకు సహజముగఁ దప్పని యీతిబాధలు ఈవేద
శాస్త్రము లీమతాచారభేదము లీయన్యోన్యకలహము లీయసంబద్ధ
జాతినీతులు మఱి యీ స్వార్థపరములు వంచకములునగు నోమరిపోతు
చేష్టితములన్నియు నెవ్వడు కటంటి సమూలముగ నశించునో సకల
మానవు లన్యోన్యానురాగములతో సమాన స్వతంత్రభోగభాగ్యము
లతో నుందురో యటివేళ సహజానందకర బాంధవవంటిపుణ్యయుగ
మగును మిగులదప్పిగొని మేఘోదయమెప్పుడగునో యెపుడు వాన
చినుకులుపడునో యను చాతకములచందమున నిక్కలికాలమందలి
భూతహింసాపిపాసకోన్నని భాగవతులు దశావతారరూపుఁడగు భగవం
తునకిట్లు చతుర్విధాభినయపువేషముల మొఱపెట్టుచున్నారు అన్నమే
సమయానుకూలమున నాఁకలిం బోగొట్టఁటకును బఱియుం బుట్టించు
టకును మూలమైన శ్రీ వేదశాస్త్రానుసార కుల మతాచారములన్ని
యును జనుల కన్యోన్యద్వేషము గల్పింపకుంటకును మఱియున్నబరస్పర
ప్రేమానురాగము లొదవించుటకును గారణములగుట నిశ్చయమే కాని
యవు డీలోకమునకు శని రాజు పాపసహవాసముచేఁ గావుఁడయ్యె
బుధుడు క్షీణచంద్రుఁడు రవికుజు లిక్కలిస్వరూపుఁడగు శనికిఁబరి
వారము గురున కస్తమితదోషము శుక్రునకుశత్రుగృహస్థితియును
కేంద్రాధిపత్యము లభించి మారకసంబంధము లభించెను మఱియు
శనికి మారకసంబంధము గురుశుక్రులకన్న నెక్కుడయ్యెను కావున
ధర్మాత్మజీవితము కొనసాగుటకు బొత్తిగా కలికాల మవకాశ [illegible]

కుండెను "పాపీ చిరాయుః సుకృతీ గతాయుః" అను కలికాల
కృత్యము ప్రామాణ్యమయ్యెను కాఁబట్టి కృతయుగమున నాల్గుపాద
ములతోఁ ద్రేతయందు మూఁడుపాదములతో ద్వాపరమున రెండు
పాదములతో జరించుచున్న ధర్మధేనువు కలియుగమున నొంటి
కాలితో నడువఁజాలక కూలఁబడి శనిరాజనుపులి వాతంబడి భక్షింపఁ
బడెను ధర్మధేనువుయొక్క దుమ్ములవలె నచ్చటచ్చట నగపడు భాగ
వతులన్గూడ దుర్మలగొండుల మొట్టవేదాంతములన్వల్లడించుచు నీస
డింపునవ్వుఁతో స్త్రీబ్రాహ్మణశిశువాజకమణ్మతస్థాపకమతాధికారిమ్మ
న్యులుఁగూడఁ దలచూపనీకాపొక్కిళ్లమందు పాపులతోనున్న యాగ్ర
హములవలెఁ బెచ్చురేఁగుచుఁ గలికాలమునుమతింత ముదఱఁబెట్టుచు
దుర్దాహముఁబుట్టించు పానీయమువలె దాపరించుట మిక్కిలి శోచ
నీయము మనుష్యపశువుగాఁ జంపఁబడుటకై యొప్పగించబడిన శున
శ్శేఫుఁడు నోరున్న మనుష్యుఁడు గానఁ దన మొఱ్ఱచేసందజీనీబతిమాలి
తన బ్రతుకును గాపాడుకొనినట్లు లైతరేయబ్రాహ్మణమునఁ జెప్పఁ
బడెనుగాని నోరులేనిమేఁక కనికర మెట్లు తన బ్రతుకుం గాపాడుకొని
క్రూరయూపబంధనముల దప్పించుకొనఁగలుగున ? మొత్తముపై
మాకాయువు మాకారోగ్యము మాకుధనము మాకుఋణమను సామె
తగాదిక్కుమాలిన క్రూరశ్రోత్రియమ్మన్యులు బోధించుచున్నారు

తనపొట్టకై అజీగర్తుఁడను బ్రాహ్మణుఁడు నూఱావులనుబుచ్చు
కొని తన కొడుకును యజ్ఞపశువుగా నమ్మకొన్నాఁడు తనయాఁకలిం
దీర్చుకొనుటకై తాఁగన్నకొడుకులంగూడ క్రతుపశువులుగాఁ జంపఁ
బడుట కొప్పుకొనిరి తొంటికాలమున బ్రాహ్మణులు తమపుత్రులను
యజ్ఞపశువుల న్గావించి వంద కోఁడె గోవులను గ్రయధనముక్రిందఁ
బుచ్చుకొని యాకొడుకుల నమ్ముకొనుట యాచారము కలదు కాఁబ
ట్టియే "దుహితా దుఃఖం పుత్రిస్త్వజః" అనుశ్రుతి ప్రవర్తిలుటకు

హేతు వయినది కోమార్తెలు యజ్ఞపశువులగుటకుఁ బనికిరానికార
ణముచేత నాయాఁడుపిల్లలం బెంచి తగినవరులకు జతపర్చుటయందు
మిక్కిలి క్లేశమగుటచేతను దండ్రికిఁ బుత్రికకన్నఁ బుత్రుఁడే జీవన
లాభకారియై తా యజ్ఞపశువుగా నమ్మఁబడి తనతండ్రికి సుఖజీవన
హేతువగు ధనాగమమునకుఁ దగినసాధనమగుటచేతను "అపుత్రస్య
గతిర్నాస్తి" అనుధర్మశాస్త్రమును గలిగెను పుత్రులవలనఁ దండ్రికి
ధనలాభము కలుగుటచేతను బుత్రికవలనఁ గొన్ని బాధలుతప్ప ధన
లాభ మెక్కింతయు లేనికారణముచేతను బుత్రిక తనజీవనదుఃఖహేతు
వనియును బుత్రుఁడు తనజీవనసుఖమూలమనియును కొడుకు పుట్టిన
తోడనేయజ్ఞపశువుగా వాని నమ్మికొని ధనలాభమంది సుఖముగా నా
ధనముచేతఁ బొట్టనిండఁగూడుతినవచ్చునని బ్రాహ్మణగృహస్థు మిన్ను
ముట్టువాఁడు మఱియుఁ బుత్రిక పుట్టెనని విన్నతోడనే చెల్లనిద
బ్బయాఁడుపిల్ల యజ్ఞపశువుకై పనికిరాదు దీనిని బెంచి తగినవరునకు
జతగూర్చువఱకునాకంఠమునఁ జుట్టుకొనును నీయాఁడుపిల్లవలన నాకు
నష్టమేగాని లాభమేమియు లేదని యాతండ్రి మిక్కిలిదుఃఖించు
వాఁడు పూర్వకాలమున కొడుకులు తమప్రాణమైన ధారపోసి
తండ్రులను సుఖపెట్టువారు- పూర్వకాలమున స్వార్థపరులుగాక
లోకోపకారముకై శ్రోత్రియబాలకులు తమప్రాణమైన ధారపోయు
వారు కనుకనే యాకాలమునకు వేదవేదాంగము లుపయోగములు
గాని స్వార్థపరులై తమసుఖముకొఱకై యెట్లయిన లోకద్రోహ
మొనర్చుఘోరకలికాలములో నావేదవేదాంగములు మఱి నాఁటి
యఖిలశాస్త్రములు బొత్తిగా నిష్ప్రయోజనములు- కాఁబట్టి దేశ
కాలపాత్రానుసారముగా వేదములును వేదార్థములును మాఱు
చున్నవను పురాణమత మెంతయును శ్లాఘ్యము- కాఁబట్టి కలికా
లమందు ఇషేత్వాది వేదమంత్రములు ఇదమేవార్థం యజమానాయ

పధాతీత్యాది బ్రాహ్మణములు ఇషేత్వేతి పలాశశాఖాం ఛినత్తీ
త్యాది కల్పము వేయేల వేదములు వేదాంగములు మఱియును
స్వర్గనరకములను భూతభవిష్యజ్జన్మములను శ్రౌతస్మార్తకర్మములను
చాతుర్వర్ణ్యమును ప్రాచీన శిష్టకులమతాచారములను బోధించు
గ్రంథములన్నియును చెల్లనిడబ్బులవలె చెల్లువ్రాయఁబడి రద్దు
కాఁబడిన ఋణపత్రములవలె మృతునిపంచేంద్రియములవలె నిష్ప్ర
యోజనములయి ప్రస్తుతకాలమునలోకోపకారకములెంతమాత్రము
న్గావు- ఆవేదవేదాంగములకు మఱియుం బ్రాచీనమునిప్రోక్త నానా
శాస్త్రములకును బ్రకృత్యోపయోగముగ సకలజనులన్యోన్యాను
రాగముతోఁ గలసిమెలసి హాయిగా బ్రతుకుసాధనములం బోధించు
తెన్నున వ్యాఖ్యానములు చేయఁబడవలసియున్నది ఇప్పుడు వాడుక
లోనున్న యష్టాదశవిద్య లనాదికాలమునుండియును వాగర్థములం
గాలక్రమమున మాఱుచు వచ్చుచున్నవిగాని ప్రారంభకాల
మెప్పుడో నిర్ణయింప వలనుపడదు- ఉదకబిందువు లొండొంటఁ
గాలక్రమమున మహాసముద్రములయిన ట్లావాఙ్మయమష్టాదశవిద్యా
ప్రస్థానము లయ్యెను. కాఁబట్టి జగత్సృష్టితోనే సకలవిద్యలు నెను
బదికోట్లజీవరాశులును మఱియును జగమునందలి పదార్థములును
బొడచూపెను జడచైతన్యాత్మకమగు నీసర్వప్రపంచమును స్మృతి
యందు పుట్టి పెరిఁగి విస్మృతిలో లయమగుచున్నదని స్వప్నజాగ్ర
త్సుషుప్త్యవస్థలచే నెల్లరకుం బ్రత్యక్షానుభవమే తుదమొదళ్ళుగాని
యొకకారణముగాని తెలియఁబడక విష్ణుమాయామయమైన యీ
ప్రపంచతత్త్వ మిదమిత్థమని నిశ్చయింప నశక్యము సత్త్వరజస్తమో
గుణమయమైన ప్రకృతి వలయరేఖవలె తుదమొదళ్ళు నిశ్చయింప
నశక్యమై యాకాశమువలె నిరవధికమై స్వప్నమువలె నవశమై
యాగంతుకమై గారడివలె నద్భుతమైయున్నది. ఇదివఱకె నాధికా

వచ్చుచున్న శిష్టసంప్రదాయానుసారముగా నీశ్రౌతకర్మ మిట్లున్నదని బ్రాహ్మణములు "ఇత్యాహ" అను రోక్తిభూయిష్ఠముగ నుచ్చరించుటచేత వేదములుకూడఁ దమకుఁ బరోక్షములగు వేదవేదార్థములఁ దాము వల్లెవేయుచున్నట్లు వెల్లడించుచున్నవి. వేదవేదాంగాది విద్యనెప్పటినుండి ప్రవర్తిల్లుచుండిన నెట్టివాఙ్మయమైనను మఱెట్టి యర్థమును వెల్లడించు నేయేకర్మమును విధించుచున్నను మఱేయే యిహపరసాధనముల బోధించుచున్నను మొత్తముపై సకలజనముల కన్యోన్య ప్రేమానురాగములను పరస్పరోపకారక విధానములను మాత్రమే బోధించుచున్నవిగాని జంతుహింసను జనులకుఁ బరస్పర ద్వేషము నెన్నఁడు నుద్బోధించలేదని వివేకులందఱును సిద్ధాంతీకరింపక తీఱదు.

## యజ్ఞపశువిచారణ

దేవతలు మనుష్యుని యజ్ఞమునందు తమకు బలి యీఁగోరిరి. ఆమనుష్యపశువును యూపమునకుబంధించి చంపుటకై యధ్వర్యుఁడు సిద్ధపడినంత నామనుష్యపశువునుండి మేధ యను హోమార్హమగు నింద్రియశక్తి బయలయి గుఱ్ఱములోఁ బ్రవేశించెను. ఆగుఱ్ఱమును యజ్ఞపశువుచేయఁగా దానిలోని మేధము ఎద్దులోఁ బ్రవేశించెను. ఆదూడను చంపుటకు సిద్ధపడఁగా దాని మేధము గొఱ్ఱెలో దూఱె. నాగొఱ్ఱెను యజ్ఞపశువుగా సిద్ధపఱచఁగా దాని మేధస్సు మేఁకలో దూఱెనా మేఁకను యజ్ఞపశువు గావించి చంపనున్నంత దాని శక్తి భూమిలోఁ బ్రవేశించెను. ఆభూమినుండి వరి మొలచెను. వరి దంచి బియ్యముచేసి యాపిండినే పురోడాశముగా వండి దేవతల కధ్వర్యు లర్పించినారు. మనుష్యుని యజ్ఞపశువుగాఁ జంప దలఁచి చంపలేక తత్ప్రతినిధులుగా గుఱ్ఱమును యజ్ఞపశువుగావించి దానిఁగూడఁ జంప

నొల్ల కాఁగుఱ్ఱము నశ్వబ ఱెద్దును యూపమునఁ గట్టి దానింగూడఁ
జంపనొప్ప కెద్దున కెదులు గొఱ్ఱెను బశువుగాభావించి దానిఁగూడఁ
జంపనొల్లక గొఱ్ఱెకెదులు మేఁక నట్టి దానింగూడఁ జంపనొల్లక
తుదకు బియ్యమును ... తెము పశువుగా భావించి యాపిండిని దేవతల
కధ్వర్యులు సమర్పించి మనుష్యుని గుఱ్ఱము నెద్దును గొఱ్ఱెయను
మేఁకను బశువు గ్గావించి యూపముకుఁ గట్టి జీవహింస యొంత
మాత్రము న్గూడదని విడిచిపెట్టి తుదకధ్వర్యులు బియ్యపుపిండి
నామనుష్య హాయ నప్రభృ మెమచ్ఛాగములన బ్రతుకనిచ్చి వడ్లు
దంచినబియ్యపుపిండిని మాత్రమే యాజంతువులకు బదులు పశువుగా
భావించి దేవతలకు సమర్పించిరి మనుష్యుఁడు యజ్ఞపశువగుటకుఁ
బనికిరాక గుఱ్ఱముగాను గుఱ్ఱ మెద్దుగా నెద్దు గొఱ్ఱెగా గొఱ్ఱెమేఁకగా
మేఁక భూమిగా భూమి వరిగా యజ్ఞపశువగుటకు మాఱెను కాఁబట్టి
యజ్ఞమునందు దేవతార్థమై యెట్టి జంతువును జంపఁగూడదు
మనుష్యుఁడును మఱియు న్నజంతువులు నమేధ్యస్వాహాకులుగనుక దేవత
లకై బలి యీరాదు కేవలము ధాన్యమునుండి వచ్చినబియ్యపు
పిండి నొకవిధముగా రొట్టెజేసిమాత్రము సకలవిధయజ్ఞములందును
దేవతలకు సమర్పించవలయును మఱియును మనుష్యుఁడు గుఱ్ఱ మెద్దు
గొఱ్ఱె మేఁక మొదలగుజంగమజీవులగు నెల్లజంతువులు నమేధ్యములు
గనుక దేవతలకై యజ్ఞములందుఁ జంపి బలి యీరాదు మరియే
జంతువునైనం జంపి "నఁగూడదు" అని స్పష్టముగా నైతరేయ
బ్రాహ్మణము ఘంటాధముగాఁ జాటిచెప్పుచున్నది కాఁబట్టి యజ్ఞ
పశువులం జంపి దేవతలకు బలియిచ్చు క్రూరులు మాంసాశనులగు
మనుష్యులు వేదచోదిత కర్మబాహ్యులగుటయేగాక దేవతాను
గ్రహమున కెంతమాత్రమును బాత్రులు కాఁర కారు "నహింస్యా
త్సర్వభూతాని" అను సకలభూతదయాపరమగు శ్రుతికి "అన్యత్ర

వైదిక హింసాయాః" అని సంజాడు చవి మరగిన క్రూరమానవులు
ప్రక్షిప్తమును జెప్ప శ్రౌతకల్పమునందు ఏష్టపశువునకు మాఱు జీవ
త్పశువును జంపుచు మాంసాశనమును బ్రోత్సహించుచుం దామే
శ్రోత్రియ శ్రేష్ఠులమని తమస్వార్థపరతయుం గుక్షింభరిత్వమును
మఱుఁగుపఱి భూతహింసాపరులై వేదముల కపార్థమొనర్చి దంభ
వేషములతో గోముఖవ్యాఘ్రములట్లు కలికాలవశమునఁ జెలరేఁగు
చున్నారు పశుహింస యేవిధముగానైనం జేయఁగూడదని శ్రుతులు
"యన్మనురవదత్తద్భేషజమ్" అని శ్లాఘించిన మనువుకన్నఁ దెలిసిన
వారు కాఁబోలు నిప్పటి ప్రాకృతక్రూరదంభశ్రోత్రియమ్మన్యసోమ
యాజులు మాంసాహారమునకు బదులు శాకాహారమే యిహపర
సౌఖ్యసంపాదకసాధనమనియైతిరేయబ్రాహ్మణము జంతువులమేధ్యము
లనియు కేవలోద్భిజ్జములే మేధ్యములు కాన దేవతాసమర్పణము
కావించి యజమానుఁడారగించవలయునని మాంసాశనమును బొత్తిగా
నిషేధించి కందమూలఫలాశనమును మాత్రమే ప్రోత్సహించిధాన్యము
కూడ మనుష్యాదిజంతువులవంటిదేయని నిరూపణము కావించుటకై
ధాన్యముపైనున్న పొట్టుముక జంతువులపైనున్న రోమములవంటిదని
యును బియ్యపుగింజ నావరించిచుట్టుకొనియున్న పొల్లంతయును
జంతువులశరీరమువంటిదనియును ధాన్యమందున్న పచ్చియే నెత్తురువంటి
దనియును మఱి వండినయన్నము మాంసమువంటిదనియును ధాన్యపు
కాడ లెముకలవంటివనియును బ్రతిపాదించెను స్వర్గసాధనముగాఁ దన
కీదేహము నిచ్చిన దేవతలఋణము తీర్చుకొనుటకై యజమానుఁడు
మొదటఁ దాఁ బశువయి తనశరీరమును యజ్ఞమున దేవతలకుఁ గృత
జ్ఞతాసూచనముగా సమర్పింపఁ గోరెనుగాని తనశరీరము మిక్కిలియస
హ్యము దుర్గంధపూరితమమేధ్య మని తలంచి తనదేహమునకు
మాఱుగ గుఱ్ఱ మెద్దుగొఱ్ఱె మేఁక మొదలగు జంతువులశరీరముల

వర్జింపఁ దలంచి యాజంతుదేహములు కూడఁ దనదేహము వలె నమేధ్యములనినిశ్చయించి కమ్మనితావిగలిగిపవిత్రములగుస్వాదు కందమూలఫలములను యజ్ఞమునందు దేవతలకు సమర్పించి యా ప్రసాదమయిన కేవల శాకాహారమున మాత్రమే బ్రతుకుచిహావర ములందరింపవలయుననియే యనాదిగా సకలశ్రుతిస్మృతుల తాత్పర్యమను బరమకారుణికులు సర్వజ్ఞులగు మన్వాదిమహర్షులు విస్పష్టముగా వెల్ల డించుట తెలిసియుం గ్రూరశనిశాసితకలికాలవశులై స్వార్థపరులైన జ్ఞానలవదుర్విదగ్ధులగు శ్రోత్రియమ్మన్యులు వ్యసనబద్ధులై దంభవేష ములతో పామరజనరంజకముగా పశుబలిని మఱియు మాంసాశనముం బ్రోత్సహించుచు వృథా జాతిమతకలహములు పన్ని జనులకన్యోన్య ద్వేషముం బురిగొల్పుచు సోమరిపోతులై నోటిబూకరమున ధనార్జన మొనర్చుకొను ఈషణత్రయము విడనాడలేక తాజెడ్డకోఁతివనమంత యుం జెఱచె నను సామెతగాఁ దాము చెడి యొరులం జెఱచు చున్నారు

## నూతనధర్మమార్గము

వంశబ్రాహ్మణమునందు గురువు లేఁబదిమువ్వురు పేర్కొన బడిరి తనతండ్రి తాత ముత్తాతల పేర్లవఱకు వైదికములందు పేర్కొనఁ బడినట్లు వంశముల నది పరంపరఁగా ననంతసంఖ్యాక వేదద్రష్టృఋషి వంశములు విస్మృతములు కాఁగాఁ బ్రకృతమున జ్ఞప్తిలోనున్నవి యాయాకాలప్రకటితబ్రాహ్మణానుసారముగాఁ బేర్కొనఁబడుచున్నవి వేదశాస్త్రములసృష్టి జగమువలె ననాదియుగపరంపరలన్ సృష్టిస్థితి నాశము లనంతవిధములుగాఁ బొందుచున్న త్రైలోక్యమువలె వాఙ్మ యముకూడ ననంతవిధములుగా నుద్భవస్థితినాశములందుచు నాయా యుగములందు వంశపారంపర్యముగా జనులచే వైదికములందు తండ్రి

తాతముత్తాతలపేర్లుమాత్రమే స్మరింపఁబడునట్లు స్మృతివిధమునఁ బ్రవ
ర్తిల్లుచుం బరంపరాప్రచారములం దున్నవి ఖండితములై విస్మృతము
లయిన విద్యల సంఖ్యలో ప్రస్తుతము ప్రచారములోనున్న విద్యల
సంఖ్య యపారపారావారమునం దొక జలకణపరమాణువువంటిది
మఱియొకటిలోఁ బర్వతాగ్రభాగము వంటిది. తాతముత్తాతయొక్క
మూలవంత మిద్దియనియు వేయియేండ్లక్రింద మాతాత యెక్కిన
గుఱ్ఱపుడెక్కకతికిన నాఁడిది యని తరతరములుగాఁ గొంతకాలము
నుండి వంశపారంపర్యము దాఁచుకొని జనులు చెప్పఁబడుటకై
చూపించునట్లు ప్రాచీనుల వేదభాషాచారములు వెల్లడించు కొంత
కాలముక్రింద వ్యవహరింపఁబడిన వాఙ్మయమును నాచారములను వేద
వేదాంగములని యిప్పుడు వైదికమన్యులు వ్యవహరించు వేదశాస్త్ర
ములు శిష్టాచారములు గూఢదంతములంబలెను డెక్కనాఁడును
బట్టియు వేయియేండ్లక్రిందటి మనుష్యుని యాథార్థ్యము నిర్దేశింప
నలవికానట్లు వేదశాస్త్రాచారములఁబట్టి యనాదిప్రాచీనకాలవ్యవ
హృత వేదవేదాంగాచారము యథార్థస్థితి యిట్టిదని నిర్ణయింపఁ
దరమగునా? శునశ్శేపాది ముఖ్యనామములు బుచ్చెన్న అచ్చన్న
క్రిందనేల్లు మాతాతనో యట్లే సకలవ్యవహారములు మాఱుచుంట
తలపోయక ప్రాచీనవైదికాచారానుసారముగాఁ దాము నడుచు
చున్నామని డాబుచేయు శ్రోత్రియమ్మన్యుల దార్ఢ్య మేమన
వచ్చును? వేయియేండ్లక్రిందటి మనుష్యుని నిగూఢదంతముం
బట్టియు డెక్కనాఁడుంబట్టి గుఱ్ఱము సంపూర్ణాకారములను వ్రాసి
తాయతండ్రులచరిత్రమంతయును ప్రతిక్షణ జీవితచర్యయు నిట్లే
యుండునని తన బుద్ధిచాతుర్యమగపఱచు చిత్రలేఖక చరిత్రకారుల
వలె నెవ్వరో యనాదికాలమునుండియును వంశపారంపర్యముగ
నిత్యనూతనములుగా ననంతవిధములుగా మాఱుచుం బొడచూపు

శబ్దకర్మముల న్దమతను బుద్ధిఁగొంది న్లోకోపకారముగా నతీంద్రియ
జ్ఞానము సహజముగాఁగల ఋషులు కాలక్రమమునఁ దేనెటీఁగలు
పట్టుపెట్టినట్లు బంగరుపిచ్చుకలు గూఁడల్లుకొనువిధమున వేదశాస్త్ర
ములను నిర్మించుచుండఁగాఁ గాలక్రమమున వారిగ్రంథములును వారి
వ్యవహారధర్మములును నామావశేషములై ఖిలములు కాఁగాఁ దిరిగి
బుద్ధిమంతులు దేశకాలపాత్రానుసారముగా సకలవిద్యలును గర్మము
లును వ్యవహారధర్మముల నేర్పర్చుచుండఁగా నవియుం గాలక్రమమున
మాఱుచు నశించుచు నొకొక్కయుగము నొకొక్కవిధముగా నుద్భవ
స్థితినాశములన్ ఋతువులవలె తుదమొదళ్ళు తెలియఁబడక మాఱు
చుండును నిన్నటివంటి దినమే నేఁ డయినప్పటికి నిన్న నేఁడు కాని
చందమున నిజ్జగము మునుపటిజగము కా దీజడచేతనపదార్థములు
తొంటివి కా వీవేదశాస్త్రము లీశ్రౌతస్మార్తకర్మములు మఱియిప్పటి
సృష్టిస్థితినాశవిధానములు మునుపటివి కావు బాల్యయౌవనవార్ధక
దశలందుఁబోలెఁ బ్రతిక్షణము శరీరమనోగుణముల న్మాఱుచున్న దేహ
ధారివలె కృతత్రేతాద్వాపరకలియుగములం బ్రతిక్షణమును నామ
రూపాత్మకమగు జగము మాఱుచున్నది కాఁబటి యిప్పటి వేద
శాస్త్రములు శ్రౌతస్మార్తకర్మములు మునుపుగూడ నిట్లే యున్నవని
కాని మేమువలెనే మనపూర్వులు వ్యవహరించిరని కాని యిప్పటి
యాచారములవలెనే పూర్వాచారములున్నవని కాని నిర్ణయించి
పూర్వాచారముగా మేము మాంసాశనులమై క్రతువులం బశుహింస
చేయుచు కులజాతిమతాభిమానముల న్స్వార్థపరులమై పరస్పరకలహ
ముల న్గొట్లాడి తన్నుకొనుచుందుమనియుఁ దొంటిచాతుర్వర్ణ్యధర్మ
ములు కావే యనుసరించుచున్నామనియుం బహుక్రూరదంభ
శ్రోత్రియమ్మన్యులు క్రమక్రమముగాఁ బాలనాధికారుల వశులై
[illegible] మొదలయినశిశిరఋతుప్రాంతదశవలెఁ గృతయుగప్రారంభ

హేతువగు కలియుగాంతమునఁ దమతమ కులజాతిమతాభిమానము
లనుదమతమ శ్రౌతస్మార్తకర్మములను దమతమ దంభవేషములను
నన్నిటి నగ్గటిపెట్టి తమతోడిపాటి మనుష్యులంతటితో నేకీభవించి
పరస్పరప్రేమానురాగబద్ధులై యొవరిమట్టుకువారు సర్వస్వతంత్రులై
యన్యోన్యద్వేష మొక్కింతయును లేక తక్కిన జంతువులవలె పేద
సాద- కొద్దిగొప్ప- తనపర యనుభేదమెంచక నన్యోన్యసహాయమున
నిద్రాహారవిహారసౌఖ్యములందుచుం గాలక్రమమునఁ గృతయుగ
జనులవలెఁ గృతార్థులు కాకమానరు మానరు

"కం॥ ఎప్పటి కెయ్యది ప్రస్తుత, మప్పటి కామాట లాడి
యన్యుల మనసుల్ నొప్పింపక తా నొవ్వక, తప్పించుక తిరుగు
వాఁడు ధన్యుఁడు సుమతీ" అను వాక్యానుసారముగాఁ జరించిన
వివేకవతుని జీవితకాలమే కృతయుగము అన్యోన్యద్వేషముగల
యవివేకుల జీవితకాలము కలికాలము కనుఱెప్ప వేసినంతకాలములవ
మందులో వేయియవభాగముతత్పరము దానిసహస్రభాగకాలము
లగ్న మాలగ్నకాలముం దెలిసికొన నాతాత వశిష్ఠు చాలఁడు
మఱియుం దేవగురువగు బృహస్పతియైనఁ జాలఁడని పరాశరముని
పల్కుటచేతను లగ్నవశమున నవగ్రహాత్మకుఁడు ద్వాదశరాశి
స్వరూపుఁడు నక్షత్రరూపక కాలరూపియు నగుజనార్దనుండయిన
సూర్యుఁడు కూడ నుదయాస్తమయకాలముల వ్యత్యస్తముగా
మాఱుచుం బ్రతిక్షణము తనమాఱుదలం ద్రిగుణవినిమయహేతువై
యనంతసంఖ్యాకబ్రహ్మాండములం దనయందు సముద్రమందలి జల
బుద్బుదములవలె నుద్భవస్థితిలయములొనర్చుచుం "సాక్షీ చేతాః
కేవలో నిర్గుణశ్చ" అనుతీరునఁ దా నసంగుఁడై శాశ్వతుఁడై నిర్గుణా
ద్వైతబ్రహ్మమై సకలజగత్సృష్టిస్థిత్యుద్భవలయహేతుమూలకారణ
మయ్యు సచ్చిదానందమూర్తియై యున్నాఁ డనునిశ్చయజ్ఞానము

గల కపిలమున్యాదిమహాత్ములు సంపూర్ణమనఃసంతృప్తిస్వరూపక
కైవల్యజనకమగు సర్వజనసమతయును స్వార్థత్యాగమునుబరోపకార
చింతయును సర్వభూతదయయు ననుసరించి కేవలమును దమనడువడి
చేతమాత్రమే లోకులకు హేయాదేయమార్గములం బోధించిరి
ప్రతిక్షణము మాఱుకల స్వభావమగుటచే సమస్తపాంచభౌతికస్థూల
సూక్ష్మాకారములు వేదవేదాంగములు శ్రౌతస్మార్తకర్మములు
మఱియు నఖిలలోకవ్యవహారములు మాఱుచునేయుండును కాఁబట్టి
ప్రస్తుతదేశకాలపాత్రానుసారముగా బుద్ధిమంతుఁడగు మనుష్యుఁ
డొరుల సుఖపెట్టి తా సుఖపడుచుం బ్రతిక్షణసంతుష్టమనస్కుఁడై
యిహపరములం దరించును ప్రస్తుతకాలానుసారాముగఁ దమ నిద్రా
హారవిహారసౌఖ్యములను సంపాదించుకొనుచుండియునుస్వార్థపరులయి
ధూర్తులై కపటులై సోమరిపోతులై కష్టపడకయే వలసినభోగము
లందఁగోరి నోటిబూకరింపుచేతను దంభవేషములచేతను దాము
వచించునవియే బ్రహ్మముఖమున స్వయము వెలువడిన వేదము
లనియును మఱియుఁ దామాచరించుకర్మములే విధ్యుక్తము లనియును
తాముమాత్రమే "వర్ణానాం బ్రాహ్మణః ప్రభుః" అన్నట్లు
బ్రాహ్మణులమనియును తాముమాత్రమే యవధ్యుః మనియును
మఱియుం భూదేవతల మనియుం గష్టపడక సకలభోగముల ననుభ
వించుటకుం దమకుమాత్రమే యధికార మున్నదనియును తామే
సకలజనవందితుల మనియును తాము నిర్దేశించినదే ధర్మ మనియును
సార్థకాయలు పలుకుచు డాబుచేయు శ్రోత్రియమ్మన్యులే దుష్కాలి
వశమున జనుల పరస్పరకలహములకు మఱి సకలమానవుల యన్యోన్యస్నే
హింసకుం దప్పక కారణముగ చున్నారు కుఁ జాతిమతభేదములను
స్వార్థపరతయుఁ బుణ్యావశమున మనుష్యానం దెవుడు నిశ్శేషము గా

నంతరించునో యపుడే సర్వజనులకుం బరస్పరప్రేమానురాగజనక మగు పుణ్యాస్వరూపక కృతయుగము తిరిగి తలచూపును

భృగ్వాంగిరసనిగాని అథర్వాంగిరసనిగాని పేరం బరఁగు బ్రహ్మ వేదమునకు వ్యాఖ్యానరూపముగ గోపథబ్రాహ్మణ మని కలదు ఈగోపథబ్రాహ్మణమునందే పదినెన్మిదివేలసూత్రములు గలవు. భౌతికశాస్త్రము మొదలగుమంత్రతంత్రయంత్రములచేతఁ ద్రిభువన వ్యవహారజ్ఞానమును సకలవిద్యారహస్యము లష్టైశ్వర్యసిద్ధిసాధన జ్ఞానము నీగోపథబ్రాహ్మణ మెఱిఁగించును భూతభవిష్యద్వర్తమాన కాలములం దిహపరముల సాధి పఁదగిన సమస్తలోకకృత్యములు నీబ్రాహ్మణమునందుఁ జెప్పఁబడినవి కాని యీ బ్రాహ్మణము చాల మట్టుకు ఖండమాటచేతఁ బ్రాచీను లెఱిఁగి వ్యవహరించిన యనేక విద్యారహస్యము లడుగంటినవి యుగయుగమున కనఁగా నైదేసివేల సంవత్సరములకు సంపూర్ణముగా సమస్తభావలు సమస్తమనుష్య వ్యవహారములు సమస్తవిద్యలు సమస్తజతువులు నదులు పర్వత ములు సముద్రములు భూప్రదేశములు గ్రహగతులు పేయేల చరా చరప్రాణికోట్లతోడి త్రిభువనవస్తువులన్నియును దాఱుమాఱయి క్రొత్త క్రొత్తసృష్టి కలుగుచుండును అయిదువేలసంవత్సరములక్రిందనున్న జలాశయములెవో భూములెవ్వియో జంగమస్థావరప్రాణివిశేషములు తదాకృతిచేష్టలెవ్వియో గ్రహస్వరూపములును మఱియుం దద్గతి విశేషములెవ్వియో మఱి యప్పటి జగ మెట్లుండెనో మఱి యేది యెట్లుండెనో తెలిసి తెలుప నెవ్వరికి నశక్యముకాదు అయిదువేల సంవత్సరములక్రిందటి యనాద్యనంతయుగములందలి జగత్సృష్టిస్థితి నాశములగుఱించి చెప్పుచు నిప్పుడు వ్యవహరింపఁబడుచున్న వేద వేదాంగాద్యష్టాదశవిద్యలన్నియు నీ యైదువేల సంవత్సరములనుండి యును సంగ్రహింపఁబడిన మనుష్యుల యూహలే అనాదికాలము

నుండియు దేవమానముంబట్టి యైదువేలసంవత్సరములక్రిందనున్న మనుష్యులలోఁ గొందఱతీంద్రియజ్ఞానవంతులు గౌతమవ్యాసాది మహర్షులుండి యుండవచ్చును అయిదువేలసంవత్సరములలోపుగా జన్మించిన మనుష్యులలో నతీంద్రియద్రష్టలగు మునులు లేరు కాబట్టియే మనుష్యమానము బట్టి యీయైదువేలసంవత్సరముల నుండియు గలియుగము ప్రవర్తిలుచున్నది కలియుగలక్షణము తెలిసీతెలియని మనుష్యులు తెలిసినట్లు స్వార్థపరులై యొండొరుల నోర్మసవుచ్చుచు డంభవేషములతోఁ బరస్పరజాతిమతభేదములతోఁ బోరాడుచు నీల్గుట పరస్పరప్రేమానురాగము సంపూర్ణముగా మనుష్యులందఱియెడ గలకాలము కృతయుగము మూఁడుపాళ్ళున్నది త్రేత- రెండుపాళ్ళున్నది ద్వాపరము- పాదమాత్రమునఁ బ్రారంభించి తుదకుఁ బరస్పరప్రేమానురాగాత్మకమగు మానవధర్మము శూన్యమై భూతహింసయును స్వార్థపరతయుం బరస్పరబద్ధవైరముగా మాఱినకాలము కలియుగము దేవమానపు దినము మనుష్యుల సంవత్సరము కాఁబట్టి 5000 × 360=1800000 × 4=7200000—5000= 6700000 = అఱువదియేఁడులక్షలమనుష్యమానసంవత్సరములపి మ్మట్టఁదిరిగికృతయుగము గానికలియుగముమాఱునప్పటివఱకున్వర్తమానభవిష్యత్కాలమున రెండింటియందు నిదినదిప్రవర్ధమానమగు దౌర్జన్యము న్మాన్ప నెవ్వరికి న్శక్యముకాదు పన్నెండుగంటల కాలమువఱకును జరగవలసిన యమావాస్యరాత్రి లోకమ్ముదింబున్నమ న్గావింప నెవ్వరికశక్యమగును? స్వభావము నడ్డఁ దరము కాదు కాలక్రమమున మాఱుపల కలుగక తీఱదు తీఱదు

ప్రత్యక్షాదిప్రమాణములచేత వస్తుతత్త్వజ్ఞానము కలుగును మఱియుం బ్రత్యక్షాదిప్రమాణజ్ఞానమునకు దేహస్మృతి హేతువు దేహస్మృతి ప్రతిక్షణమును దేశకాలపాత్రానుసారముగ స్థూలసూక్ష్మ

గతుల మాఱుచుండు, స్మృతియొక్క సూక్ష్మతమబీజస్థితియే సుషుప్తి యనంబడి విస్మృతి యగును స్మృతియొక్క స్థూలతమస్థితియే జాగ్రద్దశాతిశయప్రమాణబోధకపండితపాండిత్యప్రకర్షాత్మకమగు వస్తుతత్త్వవివేకమునాఁ బరఁగును మనుష్యులయొక్క యుత్తమజాగ్రద్దశాపరిణామాత్మకస్మృతివిశేషమగు వివేకమే బుద్ధియనంబడును అట్టి మనుష్యబుద్ధి క్షణిక మగుటచేతను మఱియుం బాంచభౌతికపదార్థముల యుద్భవస్థితినాశవిశేషములు క్షణికము లగుటచేతను "ఇదమిత్థమ్" అనిఏవస్తుతత్త్వము న్నిర్ణయించుటకుగాని స్మృతిగోచరపదార్థము విస్మృతిమఱపించుటచేతఁ దెలుపుటకుఁగాని-త్రిప్పఁబడుచునగ్నికొఱవియొక్క చక్రాకారరేఖకుఁ దుదమొదళ్ళనిరూపింపనలవికాని విధమున జాగ్రత్స్వప్నసుషుప్త్యాత్మకస్మృతివిస్మృతిదశల తుదమొదళ్ళుగాని మఱి యాస్మృతివిస్మృతులలో నెద్ది ముందో మఱెద్ది వెనుకయో పాంచభౌతికపదార్థములును మఱియు వాని దెలిసికొను సాధనములగు త్వక్చక్షుర్ఘ్రాణశ్రవణరసనేంద్రియమయమనస్సును మఱి యామనస్సుయొక్క సారమగు బుద్ధియును బరస్పరాశ్రయసంబంధముచేఁ బ్రతిక్షణమును మాఱుచుంటచేత నతీంద్రియద్రష్టలగు ఋషులయనుగ్రహముచేతం బారంపర్యముగా నుపదేశింపఁబడుచుం బరస్పరకారణములగు సృష్టిస్థితినాశకార్యముల స్మృతిరూపకజాగ్రద్దశ, కృతత్రేతద్వాపరకలియుగములందుఁ గ్రమక్రమముగా క్షీణించుచు స్వప్నసుషుప్తులందు లయమగును కలియుగమునందు జాగ్రద్దశాత్మకస్మృత్యౌన్నత్యవిశేషరూపకమగు బుద్ధియొక్క యుత్తమస్థితియగు శ్రద్ధ యనఁగా విశ్వాసము క్షీణించుచుండుటచేతఋషులు వేదశాస్త్రముఖముల నొప్పిధించిన సచ్చిదానందతత్త్వస్వరూపమగునహింసావ్రతముం బరస్పరప్రేమానురాగాతిశయజ్ఞానము నానాఁటికి నశించుటచేత నిట్లు సకలభూతహింసకులు తలచూపదొడఁగిరి

## వేదవిజ్ఞానము

"యస్యనిశ్వసితం వేదాః - ఆత్మనఆకాశః - శబ్దగుణకమాకాశమ్" పరమాత్మయొక్క నిట్టూర్పు వేదము - ఆత్మనుండి యాకాశము పుట్టినది - శబ్ద మాకాశముయొక్క గుణము "యోబ్రహ్మాణం విదధాతిపూర్వం యోవేదాంశ్చ ప్రహిణోతితస్మై - ఈశానః సర్వవిద్యానామ్" బ్రహ్మ నెవఁడు తొల్లి సృజించెనో మఱి యాబ్రహ్మకు వేదమే దేవుఁడు తెల్పెనో - సమస్తవిద్యలునేలు దేవుఁ డెవఁడో యను వాక్యములంబట్టి వేదములకుఁ బరమాత్మునకు భేదమెద్దియును లేదు వేఁడియే యగ్ని యగ్నియే వేఁడి కాఁబట్టి పరమాత్మునకు మఱి యాదేవుని నిట్టూర్పగు ఋగాదివేదములకును భేదమెద్దియును లేదు అగ్నినుండి వేఁడిపుట్టినదనునపుడగ్నినుండిఅగ్నియే కలిగెననకతీఅదు అగ్న్యౌష్ణ్యములు రెండింటికి నామభేదమే గాని వస్తుభేదము లేదుకదా! యట్లే పరమాత్మకును వేదమునకును వస్తుభేదమెక్కింతయును - సముద్రజలమునకును సముద్రతరంగజలమునకును భేదములేనట్లు మఱియును బీజమునకును వృక్షమునకును వస్తుభేదములేనట్లు మహాకాశమునకును ఘటాకాశమునకును వస్తుభేదము లేనట్లు వ్యక్తావ్యక్తదశలచే స్థూలసూక్ష్మస్థితులచే మఱియు కార్యకారణరూపములచే వర్ణాత్మక ధ్వన్యాత్మకశబ్దములకువలెనాదబ్రహ్మమునకు ఋగాదివేదశబ్దములకును భేదమెద్దియును లేకయున్నప్పటికి మిథ్యాకారములతో ఘటాకాశములు తోఁచు విధమున నాదబ్రహ్మమగు పరమాత్ముఁడు ఋగాదివేదశబ్దరూపములఁ గనుపట్టుచున్నాఁడు ఘటాకారమున ననుసరించి ఘటాకాశాకారము తోఁచువిధమున పరుగిడుచున్నబండియొద్ద నిలిచియున్నబండికూడఁ బరువిడుచున్నట్లు కన్పట్టువిధమునఁ బ్రవహించునదిలో నిలవఁబడినవాఁడు కా ముందేగుచున్నట్లు భ్రమచెందుపోలికం బరమాత్మనుండి యాకాశముపుట్టినట్లు మఱి యాయాకాశమున శబ్దముకలిగినట్లు మఱి యా

శబ్దమువర్ణాత్మకఋగ్వాదివేదములయినట్లు మనుష్యులు తమసహజవిపరీత విభ్రాంతి మిథ్యాదృష్టి వశమున ననుకొను చున్నారు "సాక్షీచేతాః కేవలోనిర్గుణశ్చ" అను వాక్యానుసారముగా సచ్చిదానంద లక్షణమై నిత్యనిర్గుణాద్వైతనాదబ్రహ్మమగు పరమాత్మనుండి వర్ణాత్మకములగు ఋగ్వాదివేదములుగాని నామరూపాత్మకమగు నీజగము గాని పుట్టినట్లు మాయాబద్ధుఁడై విభ్రాంతుఁడై నదేహి యనుకొను చున్నాఁడు కాని మహాకాశమునకును ఘటాకాశమునకును వస్తుభేదములేనివిధమున నిజముగాఁ బరమాత్మకును మఱి యీనామరూపాత్మకమగు నిజ్జగమునకును వస్తుభేద మొక్కింతయును లేదు

"వాచారంభణం వికారోనామధేయమ్" నామరూపములు స్వప్నవస్తువులవలె మనోవిభ్రాంతికల్పితములును మిథ్యలుగానివాస్తవములు కావు ఘటకపాలాదులయొక్క నామరూపములు స్వప్నమువలె మిథ్యాభ్రాంతికల్పితములుగాని యాకుండ మూకుఁడులకుఁ గారణమగు మట్టివలెఁ గుండమూఁకుడులవంటి "అగ్నిమీళేపురోహితమ్" అను వేదవాక్యమునందలి వర్ణములు మఱి యట్టి వర్ణోచ్చారణమందు వ్యక్తమగుశబ్దమును స్వప్నమువలెమనోవిభ్రాంతికల్పితమై యెండమావులనీటివలె మిథ్యగాని వాస్తవ మింతమాత్రము గ్గాదు నిర్గుణాద్వైతపరమాత్మయగు నాదబ్రహ్మము ఘటకపాలాదులకు మృత్తికవలె ఋగ్వాదివేదశబ్దములకు మూలకారణము నాదబ్రహ్మము కారణము నామరూపాత్మకము జగమంతయును గార్యము అగ్నికి నగ్నిజ్వాలకు నామరూపభేదముతప్ప వస్తుభవము లేనట్లు నాదబ్రహ్మమునకు నిజ్జగమునకు వస్తుభేదము లేనేలేదు చంద్రుఁడు జలమునందు బ్రతిఫలించినచందమున మనస్సు స్వప్నమునఁ బరిణమించినవిధమున ఎండమావుల నీరు రగపడునట్లు జలము తరంగరూపమున నున్న ట్లాకాశము నానావిధాకారములఁ గనుపట్టినరీతిన్ నిర్గుణాద్వైతనాద

బ్రహ్మము ఋగాదివేదశబ్దములం దోఁచుచున్నది నాదబ్రహ్మము బీజము- ఋగాదివేదశబ్దములు వృక్షములు- నాదబ్రహ్మము కారణము ఋగాదివేదశబ్దములుకార్యములు నిత్యమునిర్గుణనాదబ్రహ్మము మఱి యనిత్యములు సగుణఋగాదివేదవర్ణములు నాదబ్రహ్మమునకుత్పత్తిస్థితినాశములు లేవు ఋగాదివేదశబ్దము లుత్పత్తిస్థితినాశము లందుచుండును నాదబ్రహ్మము బింబము ఋగాదివేదశబ్దములు ప్రతిబింబములు నాదబ్రహ్మము నిరుపాధికము ఋగాదివేదశబ్దములన్ప్రతిబింబములు సోపాధికము నాదబ్రహ్మము సగుణుండగు పురుషుఁడు నాదబ్రహ్మము స్వయంప్రకాశము ఋగాదివేదశబ్దములుత్పత్తిస్థితినాశవంతములగుటచే నస్వతంత్రప్రకాశములు భ్రాంతికల్పితములు బొత్తిగా నబద్ధములు కలలవలె మిథ్యలు మఱి మనోవిభ్రాంతములు, కృత్రిమపౌరుషేయములుగాని యెంతమాత్రమును వాస్తవములు కావు కావు కాఁబట్టి తన కెన్నఁడునులేని గుఱ్ఱమును గూర్చి యితరుఁడు తనతో నోయీ! నీగుఱ్ఱముపోయిగా నీసావడిలో నున్నదనిగాని లేక దొంగచేఁ గొంపోఁబడినదనిగాని విన్న వివేకవంతుఁడు మోదఖేదములు రెండును బొందనివిధమున ఋగాదివేదము లపౌరుషేయములైనను పౌరుషేయములైనను సత్యములయినను కల్లలయినను జీవునకును ఋగాదివేదశబ్దజాలమునకును సంబంధము వివేకమునకు భ్రాంతికివలె నిజమునకుఁ గల్లకువలె జాగ్రత్స్వప్నములకువలెఁ బింబప్రతిబింబములకువలె జీవితమరణదశలకువలె లేదు ఋగాదివేదశబ్దజాల మిద్దియని మర్త్యు లుచ్చరించుశబ్దములు నాదబ్రహ్మప్రతిబింబములుగాని వాస్తవములు కావు నీడలపోల్కి నబద్ధములుం బురుషభ్రాంతికములుఁగు ఋగాదివేదశబ్దముల పతనపాతనములు శ్రౌతకర్మములు నిశ్చయముగావివేకవంతులగు మానవులెంతమాత్ర మవలంబించ రవలంబించరు. పామరజనులకు విగ్రహా

రాధనమువలె మూఢులకు మాత్రము ఋగాదివేదాధ్యయనమును
శ్రౌతకర్మాచరణముం గొంతవఱకు యథార్థజ్ఞానసాధనములును
సంసారదుఃఖవిస్మృతి నలిగించునుపాయములగుట కేసంశయము
నైను ఒకొక్కమనుష్యునకు క్షణక్షణానుభవము ననుసరించిన
యొకొక్క మనోనిశ్చయజ్ఞానము- పుట్టెదొక గుణముజిహ్వాదొకరుచి
యొవనినమ్మకము వానిది ప్రత్యక్షరము ప్రతిశబ్దముం జతుర్విధాభి
నయములం జేరినప్రతిసంజ్ఞయును దేశకాలపాత్రానుసారముగఁ
బ్రసంగవశమున గ్రాహకశక్త్యానుసారముగ నర్థమిచ్చును కాఁబట్టి
యింద్రియగ్రాహ్యములు మఱియును బురుషప్రయత్నమూలకావ
యవచాలనవిశేషసంభవములగు ఋగాదివేదశబ్దము లుత్పత్తిస్థితినాశ
వంతములగు ననిత్యకార్యములనియుం బౌరుషేయములనియును
సిద్ధాంతీకరించినమతెము మిక్కిలిసమంజసము కాఁబట్టి ఋగాదివేద
ములును వేదాంగములును సమయోచితముగా యుగయుగమునకు
శబ్దార్థములరెండింటిచే మాఱునని పురాణవచనము కలదు కావుననే
యథేష్టలౌకికస్వరమున ఋగాదివేదము లుచ్చరించుచు వేదచోదితము
లని నానావిధములుగా శ్రౌతస్మార్తకర్మము లాచరించుచు ద్వైతా
ద్వైతవిశిష్టాద్వైతాది నానామతములు ప్రవర్తిల్లుచుం బ్రత్యహమును
వేదోచ్చారణమందును గర్మాచరణమందును నానావిధముల మాఱు
చున్నవి

పశుహింస నొలఁగించి జను కుం బరస్పరానురాగమొదవించు
శబ్ద మెద్దియైనను మఱి యుచ్చరింపఁబడినను అగ్నిస్తంభ జలస్తంభ
భూస్తంభాది వివిధవిద్య లాకాశాగమనవిశేషముల నైలుపువిద్యలు
మఱియుంబ్రస్తుతకాలమునకసాధ్యములయిన అనేకవిద్యావిశేషములును
మఱి యిప్పటి సృష్టిలోలేని నానాజంగమస్థావర ప్రాణివిశేషములను
ప్రస్తుతమున వాడుకలోలేని యనేకభావములును సముద్రనదనదీపర్వ

కారణ్యములు మఱియుం బ్రకృతకాలమున నూహింపఁబడని యనేక జగద్విశేషము లూరుంబేరు లేకయు నామమాత్రావశిష్టములయ్యెం బూతకాలమున నీటిలోనిగిఱులవలెఁ బుట్టి క్రమక్రమముగావిస్తరించి తుదకు మఱి తలచూపనివిధమున నాశము చెందియుండవచ్చును భూకంపము లగ్నిపర్వతాది భూతప్రకోపోద్రవములు- ఈతిబాధలు యుద్ధములు మఱి యూహకందని లౌకికదైవికోపద్రవములచేనున్న వస్తువులు రూపుమాయుటయు జగత్తునలేని క్రొత్తవస్తువులగపడుట యును గొన్ని వస్తువులు పెరుగుచుంటయుం గొన్నితరగుచుంట యును పాతవి యడంగుటయును గ్రొత్తవి తలచూపుటయును బ్రత్యే హమును జగమున మాఱుచల సకలపదార్థముల నన్నట్టుటయును వివేకులకందఱికిం బ్రత్యక్షానుభవమేకదా ? అథర్వవేదమునకు వ్యాఖ్యానరూపమగు గోపథబ్రాహ్మణగ్రంథసంఖ్య యెంతయోఖల మాటచే ననేక విశేషవిద్యలను వివరించు భౌతికశాస్త్ర మంతరించెను మనుష్యులయూహకుఁ దోఁచు కార్యములన్నియును సాధ్యములు కాని యసాధ్యములు కానీ సాధ్యాసాధ్యములు కానీ పూర్వము జరగిన సంగతులే- ముందులేనివస్తువు లివ్వడు క్రొత్తగా నుండనేరవు పాంచభౌతికపదార్థములన్నియును స్థూలసూక్ష్మస్థితివిశేషముల మాఱు చుండునుగాని కఠినపదార్థము ద్రవముగా ద్రవ మగ్నిగా నగ్ని వాయువుగా వాయు వాకాశముగా నాకాశ మాత్మగా శేషించి యుండును

ఉన్నవస్తువు కాలవశమున మాఱుదలచెందును కానిబొత్తిగా లేకపోదు స్థూలసూక్ష్మగతులతో వ్యక్తావ్యక్తదశలతో నానాపాంచ భౌతికపదార్థములు కాలవశమునఁ బ్రవృత్తినివృత్తులందుచుండును సత్త్వరజస్తమోగుణమయమగు నిజ్జగము గుణసామ్యమందినపుడు ప్రకృతిగా శేషించుచు మఱలమఱల గుణవైషమ్యముచే సృష్టిస్థితి

నాశరూపకజగద్రూపమునఁ బరిణమించుచుండును ఇంతకు నప్రత్యక్షములగు భూతభవిష్యద్వర్తమానపదార్థములు యథార్థతత్త్వమును బ్రత్యక్షతర ప్రమాణములచేఁగదా నిశ్చయింపవలసి యుండును అప్రత్యక్షవస్తువులనుగూర్చి యెవరెవరికినమ్మకముకొలంది మఱియు బుద్ధికొలఁదిని "యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అను విధమున శబ్దప్రమాణమునందలి దృఢవిశ్వాసముకొలంది నెట్లు భావించినవారి కట్లు వస్తుయథార్థతత్త్వము పొడఁగట్టుటసహజపద్ధతి. మంచిచెడ్డలు పుణ్యపాపములు క్రిందుమీఁదులు మఱియు సమస్త పదార్థతత్త్వజ్ఞానమునకు మూలకారణము మనోనిశ్చయమేకదా? శబ్దప్రమాణముంబట్టి నమ్మకొని నడుచుకొనువారియెడల నొరులు తప్పుపట్టుటకు వీలులేదు వేదశాస్త్రము లెప్పటినుండి ప్రవర్తిల్లుచున్నవో యీజగత్సృష్టికిఁ గారణమేమో ప్రగుడ్డివాం డ్రేనుగుం బోల్చువిధమున శబ్ద ప్రమాణ మనుసరించని పండితమ్మన్యులు తమకుఁ దోఁచిన ట్లితర ప్రమాణములచేత తెలిసీతెలియక సంశయాత్ములై చెడుచున్నారు సమస్తవేదశాస్త్రరచనకు నిక్కముగా దృఢముగ శబ్దప్రమాణభూతమగు దృఢవిశ్వాసమే మూలము

గోపథబ్రాహ్మణమునఁ గోశబ్దమునకుఁ గిరణ మర్థము గోపథ మన సూర్యమండలము కాఁబట్టి గోపథబ్రాహ్మణము సూర్యమండలతత్త్వమునుగూర్చి తెల్పుచున్నది సూర్యునికిరణము లనంత సంఖ్యాకములై యొండొంటికి గుణముచే భిన్నములై యనంతకోటి బ్రహ్మాండముల సృష్టిస్థితినాశము లొనర్చుచుండును మొత్తముపై సూర్యునికిరణములెన్నో యేయేకిరణ మేయేపని యొనర్చుచుండునో యాశాస్త్రమును బోధించునది గోపథబ్రాహ్మణము కాఁబట్టి యా గోపథబ్రాహ్మణశాస్త్రము కాలవశమున నామమాత్రావశిష్టమగుట చేత త్రైలోక్యయథార్థతత్త్వజ్ఞానము ప్రస్తుతజనులకు బొత్తిగా లేదు

డెను ఆశాస్త్రమే సమగ్రముగా దొరికినయెడల వాయుస్తంభ జల స్తంభాద్యమానుష ప్రజ్ఞలు ప్రచారమం దుండకపోఁడదు

పాంచభౌతికపదార్థములకువలె నుద్భవస్థితినాశవృద్ధిక్షయ ములు వేదవేదాంగాది సకలవిద్యలకు గలవని సిద్ధాంతీకరింపకపోఁడదు కారణ మేమనఁగా త్రిజగత్కార్యములు మర్త్య లనిత్యములని ప్రతి మనుష్యబుద్ధి కనుభవమేకనుకను మర్త్య లమృతులు కానేరరు మఱి యనిత్యమును గార్యము నగుమనుష్యబుద్ధి నిత్యమును గారణము నగు నీశ్వరబుద్ధితత్త్వము నెన్నఁడున గ్రహింపఁజాలదు కాఁబట్టిన్యాయ వైశేషికశాస్త్రములకు స్వవచనవ్యాఘాత ము చెప్పకపోఁడదు కాఁ బట్టి శబ్దముకన్న నితరప్రమాణములు నిలువనేరవు - కావున వేదము లపౌరుషేయములనియును శబ్దము నిత్యమనియును శబ్దమే ముఖ్య ప్రమాణమనియును విశ్వసించినందవ్వ లోకవ్యవహారమే నడువదు నడువదు ప్రబతికియున్నవాఁడు కానుజీవించియున్నట్లే ప్రమాణముచే నమ్ముచున్నాఁడో యదే శబ్దప్రమాణము వేదశాస్త్రములే శబ్ద ప్రమాణస్వరూపములు కాఁబట్టి వేదశాస్త్రములంబట్టికాని "ఇద మిత్థమ్" అను పదార్థతత్త్వజ్ఞాననిశ్చయముకలిగి మనస్సంతుష్టినొంద వింపఁజాలదు మనస్సంతుష్టినందుటయే ప్రబతుకునం దందఱు కోరు చున్న నిత్యానందపదవి యజుర్వేదము తల - ఋగ్వేదము కుడి పార్శ్వము-సామవేద మెడమప్రక్క-ఆదేశనామముగల యుపనిషత్తు లుచ్ఛ్వాసనిశ్వాసములు- అథర్వవేదము కొసయగుపుచ్ఛము - సప్త కోటిమహామంత్రములు మఱి యనంతసంఖ్యములగు క్షుద్రమంత్ర ములు త్రిభువనములయందలి నానావిధజంగమస్థావరప్రాణులప్రవృత్తి నివృత్తికారణములగు మనోవాక్కాయకర్మముల నెఱిఁగించు యంత్ర ములు తంత్రములు వేయేల సకలభువనవ్యవహారముల సాధించు నుపాయముల నథర్వవేదమే తెలుపుచున్నది త్రయీవిద్యయనుటచేత

ఋగ్యజుస్సామవేదములుమూఁడు మాత్రమే ముఖ్యస్వర్గసాధనములై
యేర్పడియున్నవి కాఁబట్టి త్రయీవిద్య యైహలౌకికకర్మములఁజెప్పు
చున్నదనువారు కేవలమును వంచకులు- స్వార్థపరులు శ్రౌతస్మార్త
కర్మము లథర్వవేదచోదితములుగాని ఋగ్యజుస్సామవేదచోదితము
లెంతమాత్రమును గావు

స్వర్గమన గా నిత్యమనఃసంతుష్టికి మూలమగు స్వాహంకార
మమకారనిర్మూలనకారణసంభూతమయిన 'వాసుదేవఃసర్వమితి' అను
భావనము- మఱి యట్లు భావించువాఁడే పరమభాగవతుఁడా మహా
త్మునిగుణములు స్వార్థత్యాగము పరోపకారవర్తనము సర్వభూత
దయయును జనులందఱును బరమభాగవతులై యున్ననదియే
గురూపదిష్టపుణ్యయుగము ను కృతయుగ మని చెప్పఁబడును. జను
లకుఁ బరస్పరద్వేషముకావించు కులజాతిమతాభిమానాచరణశ్రౌత
స్మార్తకర్మములు ప్రవర్తిల్లుకాలమే శనిగ్రహప్రేరితమగు క్రూర
ఘోరకలికాలము గ్రహములలో గురునికన్నఁ బరమశుభకారియును
శనికన్న ఘోరదుఃఖకారియును మఱి లేఁడు- కాఁబట్టి శ్రౌతస్మార్త
కర్మములన్నియును శనికృత్యములేకనుక నాశ్రౌతస్మార్తకర్మాచార
ములకు లోఁబడని పరమభాగవతులు గురుకటాక్షముచేత నిత్యమన
స్సంతుష్టిస్వరూపమగు కైవల్యానందపదవిం జూఱకొని జననమరణ
ప్రవాహరూపమగు సంసారతాపత్రయమునంటక తాము తరించి
యొరులం దరింపఁజేయుచున్నారు

అథర్వవేదము కేవలైహలౌకికములగు శృంగారహాస్యకరుణా
ద్భుతరౌద్రవీరబీభత్సభయానకములను నెన్మిదిరసములనుమాత్రమే
శ్రౌతస్మార్తకర్మమూలముగఁ దెల్పుచున్నది శాంతరసము కేవల
పారలౌకికమగుటచేతనే యైహలౌకికరసములలోఁ జేర్పక కొందఱాలం
కారికులు శాంతరసము నంగీకరింపలేదు త్రయీవిద్య కేవల శాంత

రపమునుమాత్రమే బోధించుచున్నది కనుక శిక్షా వ్యాకరణచ్ఛందో
జ్యోతిషనిరుక్తకల్పములను నాలుగు వేదాంగము లథర్వ వేదాంగములు
గాని త్రయీవిద్యయగు ఋగ్యజుస్సామవేదాంగము లెంతమాత్రము
గావు త్రయీవిద్య యెంతమాత్రమైహిలౌకికము కానేకాదుగనుక
నీలోకమున వాడుకలోనున్నప్రస్తుతము ఋగ్యజుస్సామ వేదములును
నిక్కముగా నైహలౌకికమంత్రయంత్రతంత్రములను బోధించునథర్వ
వేదాంతర్భూతములే- కేవలపరలోకబోధకనిత్యపరశబ్దాత్మకమగు
త్రయీవిద్య "అగ్నిమీళే పురోహితమ్" అను మొదలగునవిత్యమంత్రముల
పౌరుషేయమైన శబ్దము కానేకాదు- కేవలపరోపకారకభూతదయా
స్వరూపమగు త్రయీవిద్యయీలోకములో బరమభాగవతప్రవర్తనము
చేతమాత్రమే వెల్లడింపబడును ఆకసమైహలౌకికములగు వాయ్వగ్ని
జలభూవిశేషపదార్థముల వంటియువంటక "యో౽స్యాధ్యక్షః పరమే వ్యో
మన్" అనునట్లు కేవలము పారలౌకికపదార్థ మెట్లగుచున్నదో
త్రయీవిద్యానుసారులగు పరమభాగవతు లీలోకమున సంచరించు
చుండియును కేవల పారలౌకికులే యగుచు నిత్యసంతుష్టాంతరంగులై
పరజీవన్ముక్తులగుచున్నారు కేవలపరమార్థబోధకమగు వేదవిద్య
స్వార్థత్యాగులు లోకోపకారపరాయణులు సర్వజనీనములు సకలభూత
దయాపరులగు పరమభాగవతుల ధర్మప్రవర్తనముచేత వెల్లడింపబడును
గాని "ఇషేత్వోర్జే" అక్షరములచేతను శ్రౌతస్మార్తరూపకకామ్య
కర్మములచేతను శిక్షా వ్యాకరణచ్ఛందోజ్యోతిష్యములచేత నెంతమా
త్రము దెలుపబడదు తెలుపబడదు. పరమభాగవతులపలుకే ఋగ్వే
దము. ప్రవర్తనమే యజుర్వేదము తలంపులే ఋక్కులు- వారి తలం
పులే సామములు- మఱియు మహనీయుల ప్రవర్తనములే యజుస్సులు
నిక్కముగా నీలోకమందలి పరమభాగవతోత్తములే ప్రత్యక్షత్రయీ
స్వరూపులు

హోత్ర యగ్ని- అధ్వర్యుఁడు వాయువు- ఉద్గాతసూర్యుఁడు- బ్రహ్మచంద్రుఁడు- సదస్యుఁడు పర్జన్యుఁడు (వాన)- చమసాధ్వర్యు లోషధివనస్పతులు- (వనమూలికలుం జెట్లు)- హోత్రకులు విశ్వే దేవులు- గోప్తలు (యజ్ఞపాలకులు) అథర్వాంగిరస్సులు- అని గోపథబ్రాహ్మణము యజ్ఞమును వర్ణించుటచేత నొక్కయథర్వ వేదముమాత్రమే యీలోకమును మఱి యిందలి జనులయొక్క కులమతాచారవిద్యలన్నార్చియుం జెప్పుచున్నది కాఁబట్టి శిక్షాది వేదషడంగ మథర్వవేదము ప్రతిపాదించుమనువ్యాకల్పితశాస్త్రమని చెప్పకతీఱదు యజ్ఞమందు నియమింపఁబడిన మనుష్యులు- హోత్ర మైత్రావరుణ- అచ్ఛావాక- గ్రావస్తుతులు ఋగ్వేదమునడుపుటకును అధ్వర్యు-ప్రతిప్రస్థాతృ-నేష్ట్ర-ఉన్నేతృ-సంజ్ఞకలవారుయజుర్వేదము నడుపుటకునుఉద్గాతృ-ప్రస్తోతృ-సుబ్రహ్మణ్య-ప్రతిహాతృనామముఁ బరఁగువారు సామవేదమునకును- బ్రహ్మబ్రాహ్మణాచ్ఛంసీ-పోత్రీ- అగ్నీధ్రనామకుల థర్వాంగిరోవేదమునకును నియోగింపఁబడుదురు మఱియును సదస్యుఁడు పత్నిదీక్షితా (యజమానురాలు)-సామిత్రీ- గృహపతి(యజమానుఁడు)-అంగిరస్సును యజ్ఞమునడుపుతక్కినవారు "ఓమ్" అను వ్యాహృతిశబ్దమును- స్వరవేదము- పిశాచవేదము- అసురవేదము- ఇతిహాసవేదము పురాణవేదము-విరిష్ట- ఊన-యాత యామము లనుసంధానములు నథర్వవేదములోఁ జేరినవే మరియును బ్రహ్మ తనపాదములనుండి భూమిని తనకడుపునుండి యాకసమును- తనకపాలమునుండి స్వర్గమును సృజించెననియు భూమికొఱ కగ్ని దేవతను-ఆకాశముకొఱకు వాయుదేవతను స్వర్గముకొఱకు సూర్య దేవతను సృజించెననియును కొట్టకొనకు వేదత్రయమును నిర్మించె ననియును-అగ్నినుండి ఋగ్వేదము-వాయువునుండి యజుర్వేదమును- ఆదిత్యునినుండి సామవేదమును గలిగెననియును మరియును భూః

భువః-సువః అను మూఁడు వ్యాహృతులు సృష్టిలోఁ జేర్చఁబడె ననియును అని యథర్వవేదము తెల్పుచున్నదికాని తనసంగతి వెల్లడించుకొనలేదు

గోపథబ్రాహ్మణమందలి కొట్టకొన ప్రపాఠకమునందు "సప్త సుత్యాః సప్తచపాకయజ్ఞా హవిర్యజ్ఞాః సప్తతథైకవింశతిః సర్వేతే యజ్ఞా అంగిరసోఽపి యన్తి నూతనాయాస్పృచయోస్సృజంతి యేచ సృష్టాః పురాణైః యాంశ్చగ్రామే యాంశ్చారణ్యే జపంతి మంత్రా న్నానార్థా స్పృహాంధాజనాసః- సర్వే తేయజ్ఞా అంగీరసోఽపి యంతి నూతనాసాహిగతి ర్బ్రహ్మణో యావరార్ధ్యాత్రివిష్టపం త్రిదివేనాక ముత్తమం తమే తయాత్రయ్యావిద్యయేతి- అత ఉత్తరే బ్రహ్మ లోకా మహాంతో ఽథర్వణా మంగిరసాంచసాగతిః" సుత్యము లేదు పాకము లేదు హవిస్సు లేదు మొత్తముపై యజ్ఞము లిరువది యొక్కటి ఈయిరువదొక్క-యజ్ఞములును మఱి ఋషు లేయేయజ్ఞ ములను గల్పించిరో మఱి యేయేయజ్ఞము లనాది ప్రాచీనులు వన్నిరో యాయజ్ఞములన్ని నథర్వవేదచోదితములే- గ్రామములందు నడవులలోను నివసించినజనులందఱును చేయుకర్మను లును మఱియుం జపించు మంత్రములన్నియు నథర్వవేదచోదితములగు యజ్ఞవిధాన ములే బ్రహ్మయొక్క- సకలసృష్టిస్థితినాశకార్యములు ప్రాచీనములు కానీ లేకిప్పటివికానీ సమస్తభూతభవిష్యద్వర్తమానజగత్కార్యము లన్నియు నథర్వవేదోక్తయజ్ఞవిధానములే ఉత్తమమైన స్వర్గసాధ నము ఋగ్యజుస్సామములను త్రయీవిద్యయే స్వర్గంకంటెఁ బర మగు బ్రహ్మలోక మచ్చటికిఁగూడ నథర్వవేదచోదితయజ్ఞమే చేర్చుగతి సాధనము- అనుటచేత ఋగ్యజుస్సామవేదములు కేవల స్వర్గసాధనములు స్వర్గవర్ణనమొనర్చుశబ్దములు- ఋగ్యజుస్సామవేద శబ్దసమూహము సముద్రఘోషవంటి దొక్క- యవ్యక్తకలనాదము,

కాఁబట్టి మర్త్యులానాదము ననుకరించి- నారదమహర్షి సిద్ధాంతీకరించిన
విధముగా- యథాశాస్త్ర శ్రుతిస్వరలయకాలనియమములతో మనుష్యు
లన నేపాటి? చతుర్ముఖబ్రహ్మయైన నా త్రయీవిద్యం బలుకనేరఁడు
నేరఁడు- కాఁబట్టి మనుష్యుల కెంతమాత్రముం ద్రయీవిద్యయగు
ఋగ్యజుస్సామవేదములను దమతమ చతుర్విధాభినయ సామర్థ్య
మెఱిఁగియు నుపయోగించినప్పటికి నొక్కింతయు న్దెలుపదరము కాదు కాదు
శిక్షాదివేదషడంగము నైహలౌకికసామరూపము ల వెల్లడించు
నథర్వవేదమునకుమాత్రమే చెప్పఁబడినయవి త్రిగుణాత్మకప్రాకృత
సృష్టిలోఁ జేరిన పాంచభౌతికజగత్కార్యము లన్నియు ను మనోవాక్కాయ
కర్మములన్నియును సమస్తజంగమ స్థావరవిశేషగతులన్నియు నాత్మైక
వేదావ్యక్తనాదబ్రహ్మస్వరూపమగు ఋగ్యజుస్సామవేద త్రయీ
విద్యాజ్ఞాపకమైన యథర్వాంగిరోవేదకృత్యములే- కారణము త్రయీ
విద్యయగు ఋగ్యజుస్సామవేదములు- కార్య మథర్వవేదము- త్రయీ
విద్య యవ్యక్తనాదబ్రహ్మము- నాదబ్రహ్మము యొక్క వివృతరూప
మగు పాంచభౌతికజగత్తంతయును నాదబ్రహ్మాత్మక ఋగ్యజుస్సామము
లను త్రయీవిద్యకుం బ్రతిబింబమువంటి వ్యక్తాథర్వవేదశబ్దకార్య
కలాపము- అథర్వవేదచోదితములగు నైహిలౌకికవేదషడంగజ్ఞానము
క్రమక్రమముగాఁ బరమభాగవతవర్తనజనకమై బ్రహ్మానందస్వరూప
మగు నిత్యమనస్సంతుష్టిం గలిగించుసాధనమని సిద్ధాంతీకరించు
వలయును ఈలోకములో దేహధారుల కెన్నియూహలుండునో
యవన్నియు నథర్వవేదమంత్రములే మఱియును సకలజంగమస్థావర
ప్రాణికోట్ల మనోవాక్కాయకర్మములన్నియు నథర్వవేదచోదిత
యజ్ఞకర్మములే కాఁబట్టి పాంచభౌతిక దేహధారులగు జీవులందఱును
యజ్ఞదీక్షితులే

## దీక్షావివరణము

సకలజీవు లొనర్చుకర్మస్వరూపకయజ్ఞములు సాత్త్వికములు రాజసములు తామసములు నని మూఁడు విధములు స్వార్థపరత యొక్కింతయున్లే కరిషడ్వర్గమునకు లోఁబడక సర్వభూతదయాపరులై సర్వజనసములై కేవలలోకోపకారమునకుమాత్రమే తమజీవితము నుపయోగించుచుం దమ యుద్యమమునకుం దోడ్పడుమని సకలభువన కారణమగు వాసుదేవుని బ్రతిక్షణముం బ్రార్థించు పరమభాగవతులు సాత్త్వికయజ్ఞదీక్షితులు-వరులను సుఖపెట్టి తమతమ కోరిన యైహిక భోగము లనుభవించువారు రాజసయజ్ఞదీక్షితులు ప్రాణిహింస గావించుటచేతనే సుఖించువారు తామసయజ్ఞదీక్షితులు పరమ భాగవతులు మనుష్యులలో-మృగములలో మాంసాశన మెఱుఁగని గోవులు మొదలయినవి పక్షులలోఁ జిలుకలు మొదలయినవి సరీసృపములలోఁ దేనెటీఁగలు మొదలయినవియును సాత్త్వికయజ్ఞ దీక్షితులగు ప్రాణులు- మాంసాశనులుకాక స్వార్థపరులై కేవల సామదానభేదోపాయములచేతనుమాత్రమే తమ నిద్రాహారసౌఖ్య మును సంపాదించుకొను జీవులు రాజసయజ్ఞదీక్షాపరులు- మాంసా శనులై యెద్దియో నెపమున జంతుహింసగావించి కేవల భూతద్రోహ మున జీవించుచు సామదానభేదోపాయము లరయక కేవల దండో పాయముననే తమతమ కార్యముల సాధించు క్రూరులుమనుష్యులలో- వ్యాఘ్రాదులు మృగములలో-గ్రద్ద మొదలయినవి పక్షులలో-పాము మొదలయినవి సరీసృపములలోఁ దామసయజ్ఞదీక్షాపరులు సాత్త్విక యజ్ఞదీక్షితులకుఁదప్ప నితరజీవులకుఁ గైవల్యానందపదవి యెన్నటికి న్రాదు రాదు మఱియును సంసారతాపత్రయము తప్పదు తప్పదు రాజసయజ్ఞదీక్షితులు స్వర్గమున కేగెదరు మఱి తామసయజ్ఞదీక్షితులు

నరకబాధలం బడెదరు మఱియును వేయేల త్రిగుణాత్మకపాంచ భౌతికజంగమస్థావర ప్రాణికోట్లుండఱును జననమరణప్రవాహాత్మక సంసార మను యజ్ఞకర్మమందు దీక్షితులే ఇంతేగాక వేదమందు జెప్పఁబడిన కర్మమయమే యీపాంచభౌతికమగు జగము కాఁబట్టి యీ జగత్కార్యము లన్నియును వేదచోదితధర్మములే మఱి యీనమస్కర్మములలో సాత్త్వికకర్మములు ఋగ్యజుస్సామాత్మక వేదత్రయీమూర్తి యైన సవితృమండలమధ్యవర్తియగుదయాప్రకృతి నారాయణస్వరూపక గురుచోదితములు రాజసతామసకర్మములు సహజజడప్రకృతికక్రూరాధర్వాభిచారిక కృత్యములు అనాదియగు జగదుద్భవస్థితివినాశకారణము త్రయీవిద్య- జగదుద్భవస్థితినాశము లథర్వవేదస్వరూపములు మనుష్యులు తమపురుషప్రయత్నమంత యును విఫలముకావించుశక్తి యొద్దియోయున్నదని తమతమకోరిన వనులు జరుగొనటకుఁ దమ పురుషప్రయత్నము చెల్లకున్న సుముఖమం దాకోరికల నాదివ్యశక్తి కొనసాగించుననునాసతో నట్టి దైవశక్తి ననేకప్రకారములుగా భావించుకొని తమకోర్కెల నెఱ వేర్చుకును ప్రార్థనారూపకశబ్దజాలము ఋగ్వేదము "తత్పరిచరణా వితరౌ వేదౌ" యజుస్సామవేదములు రెండు నాఋగ్వేదమునకుఁ బరిచరులవంటివై ఋగ్వేదప్రవృత్తిక సాహాయ్య మొనరించును ఋగ్వేదము రాజు- యజుస్సామవేదములు రెండును బరిచారకులు- ఆత్మ రవి యగ్నిమనస్సు-చంద్రుఁడు జలము-శక్తి కుజుఁడు భూమి వాక్కు- బుధుఁడు మెదడు జ్ఞానసుఖములు గురుఁడాకాశముమదము- శుక్రుఁడు వీర్యము దుఃఖము శని వాయువు- అంధకారము రాహువు మనోభ్రాంతి- కాంతి కేతువు దిగ్భ్రాంతి ధూమము- పాతము-పరిధి మాంది- ఆచ్ఛాదనము సన్నిపాతదోషములు పంచీకృతపంచేంద్రియ పంచతన్మాత్రవికేషములు ఈపదునాల్గుగ్రహోపగ్రహములసమావేశ విశేషములం బదునాల్గుభువనముల సృష్టిస్థితిలయము లగుచున్నవి

## ప్రకృతిలీల

ఈసృష్టి యెట్లు జరుగుచున్నదో సృష్టి కధ్యక్షుఁడగు పరమాత్మునకే తెలియదను శ్రుతియొక్క యభిప్రాయము, మఱియును సర్వమును దెలిసికొనునాత్మను దెలిసికొనునితరవస్తువు మఱి లేదను శ్రుత్యభిప్రాయమును వక్ష్యమాణంబుగ వివరింపవలసియుండును నా దేహము నామనస్సునా పంచేంద్రియములు నాకగపడులోకము నా యెఱింగినపదార్థము న్నియును నాకుఁ బ్రత్యక్షమగుజగమంతయునిద్ది యని నేను నాశక్తి కొలఁదిం దెలిసికొని తెలుపఁగలనుగానిమఱియును "ప్రమితివిషయాః పదార్థాః" ప్రమితియనఁగాయథార్థజ్ఞానమీ తెలివికి గోచరములయినవి ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయాభావములను సప్తపదార్థములు. సత్త్వగుణమయమగు తెలివిప్రమ రజస్తమోగుణమయినది భ్రమ సమభాగములుగానీసత్త్వరజస్తమములున్నస్థితి యనఁగాసత్త్వరజస్తమములనెడుమూఁడుగుణము లొకదానికంటె నొకటి హెచ్చుతగ్గులులేకున్నస్థితియే ప్రకృతి అట్టి ప్రకృతిస్వరూపమే ప్రమితి యనఁబడును వాతపిత్తశ్లేష్మము ను త్రిదోషములసామ్య మారోగ్య మనంబడును సత్త్వరజస్తమోగుణములు సామ్యము చెడి యొకదానికంటె నొకటి హెచ్చుతగ్గై పరస్పరస్థితిభేద మొందినదశ ప్రవృత్తి యిహము బంధము అహంకారాత్మకరోగదుఃఖము త్రిగుణసామ్యము నివృత్తి పరము మోక్షము సమాధిప్రజ్ఞానాత్మకమగు నారోగ్యానందమగును

త్రిగుణసామ్యమనంబడు ప్రకృతినిత్యము యథార్థము ప్రమితిస్వరూప మారోగ్యము కైవల్యము బ్రహ్మ పరమార్థము భ్రమస్వరూప మనిత్యము రోగము సంసారము నేన మిథ్యాపదార్థము దేహస్మృతి ప్రవృత్త్యాత్మకజగత్కారణము దేహవిస్మృతి నివృత్త్యా

త్మకకైవల్యకారణము ప్రకృతియే సర్వలోకజననియగు నాదిశక్తి-
త్రిగుణసామ్యమగునాప్రకృతియను నాదిశక్తి బాలాత్రిపురసుందరియై
దయాస్వరూపిణియై యాశ్రితవత్సలయై నిజలీలచేత గుణవైషమ్య
మంది చతుర్దశభువననిర్మాణరక్షణవిబర్హణముల నాటాడుకొనుచున్న
దనియే "యోఽస్యాధ్యక్షః పరమేవ్యోమన్సోఽఙ్గవేదయదివానవేద-
యతోవాచోనివర్తన్తే అప్రాప్యమనసాసహ- కంకేనపశ్యేత్సర్వమా
త్మైవభూత్-విజ్ఞాతారంకేనవిజానీయాత్" అని మొదలగు శ్రుతులతాత్ప
ర్యము కాఁబటియిప్పుడు నున్న నేఁ దెలిసికొని యథార్థముగాఁ దెలుపఁ
గలను ప్రకృతియు నాదిశక్తియు నగుబాలాత్రిపురసుందరీదేవి నిజ
లీలచే సృజింపఁబడిన యస్వతంత్రాన్తఃకరణస్వరూపుఁడను అయిన
అగ్నికిని వేఁడికిని నామభేదము మాత్రమే యున్నట్లు అంతఃకరణాత్మక
స్మృతికిని నాకును నామభేదము మాత్రమే కలదు మఱియు నాస్మృతి
యొక్క స్థూల దశ జగత్తు మఱి శుద్ధానసూక్ష్మదశ త్రిగుణసామ్యముగు
ప్రకృతి- ప్రకృతిస్వరూపమును గైవల్యాత్మకకారణమును, త్రిగుణ
వైషమ్యస్వరూపము జగదాత్మక కార్యమును నేనేయై యున్నాఁడను
కాఁబట్టి "అహంబ్రహ్మాస్మి" నేనే బ్రహ్మనై యున్నాను కాఁబటి
నాకన్న భిన్నపదార్థ మొద్దియును లేదు ఈసృష్టి యెట్లు జరగు
చున్నదో సృష్టికర్తృత్వునకే తెలియుదను శ్రుతితాత్పర్యము జ్ఞాతృ
జ్ఞానజ్ఞేయములు- వృక్షబీజములు- అగ్న్యౌష్ణ్యద్రష్టృదృశ్యములు
పరస్పరాశ్రయస్థితి హేతుకము లగుటచేత నన్యోన్యభిన్నపదార్థము
లెంతమాత్రము గానేరవు కాఁబట్టి యీజగత్సృష్టికిని మఱియీసృష్టి
కర్తృత్వుఁడై యున్నిర్దేశ్యపరమాకాశమందున్న దేవునకు నొక్కింత
యును భేదమే లేదు "హరిరేవ జగజ్జగదేవ హరిర్హరితో జగతో
నహి భిన్నతనుః ఆత్మైవేదగు సర్వమ్" అను వాక్యములచేత నీజగత్తు
నకును నాస్మృతికిని మఱియు నాకు నాస్మృతికిని త్రిగుణసామ్యమగు

మూలప్రకృతిని నామభేదమును స్థూల సూక్ష్మదశాభేదముమాత్రమే కాని వస్తుభేద మెద్దియును లేదు ఈసృష్టి యెట్లయినదో సృష్టిలోని దేవతలు మానవులు తెలియకుంటయబ్బురము కాదుగానియీసృష్టిలోఁ జేరక పరమై యీసృష్టి కధ్యక్షుఁడగు దేవునకుఁగూడ నీసృష్టి యెట్లగుచున్నదో యాంతి తెలియునోలేదోయని శంకించు శ్రుతి సకలజగత్కారణమగు పరమాత్మునివిషయమై తన కెద్దియు నెలియ దని యభిప్రాయమిచ్చుచున్నదని యాశ్రుతియొక్క తాత్పర్యము నాస్మృతియొక్క స్థూలదశ నాకు గోచరమగు జంగమస్థావరాత్మక మగు నిఖిలజగము నాస్మృతియొక్క సూక్ష్మదశయేసకలజగత్కార్య కారణస్వరూపిణియగు ప్రకృతి యాదిశక్తి జగదంబ బాలత్రిపుర సుందరియే మూలప్రకృతి ఏదినాయీస్మృతికాదికారణమోయాదేవి యొక్క జ్ఞానేచ్ఛాక్రియాశక్తులే నిఖిలజగత్సృష్టిసంహారకారణముఅది లేనిది కార్యముకలుగదు మఱి యీజగత్కారణమగు దేవతత్త్వము నెఱుంగుట వేదములే చాలవన బ్రాకృతముల బుద్ధియెంతమాత్రము? కార్యకారణములకు వస్తుభేదములేదని నిర్దేశించుటనయుక్తికము-సకల జీవుల తలంపులు ఋక్కులు- వాక్కులు సామములు- కాయకర్మ ములు యజస్సులు, కాబట్టి జంగమస్థావరాత్మకమగు జగమునందు జరగుచున్న వాచికాంగికాంగహార్యసాత్త్వికాభినయవిశేషములన్నియు వేదమే అదే యీలోకము మఱి యీలోకమే వేదము జగదుద్భవ స్థితివినాశములు మూఁడును వేదస్వరూపములే మఱియు నాయీ లోకము నెలసికొనుచున్న దేహస్మృతియే వేదము నాయీస్మృతి యత్యల్పము మఱి యనిత్యము మర్త్యముద్భవస్థితివినాశకార్యస్వరూ పము- నాయీస్థూలజగద్సృష్టికి మూలకారణమగు ప్రజ్ఞానాత్మకాది శక్తియు సచ్చిదానందస్వరూపిణి యగుబాలాత్రిపురసుందరి భక్త పరాధీనయుం గరుణామూర్తియు నచింత్యవైభవయు నాకాశమువలె

వాయ్వగ్నిజలభూపదార్థవిశేషములకన్నింటి కాధారమై యంతట నిండి యును సకలజగత్సృష్టిస్థితినాశకారణమయ్యు నవాఙ్మానసగోచరయై స్వయంప్రకాశముతో నిర్వికారిణియై యొప్పుచుండియును సహజ లీలచే దేహధారుల కీజగత్స్వప్నసుషుప్త్యవస్థల నగలిగించుచు స్వార్థ పరతమాని సకలభూతదయాపరులై సర్వజనసములై కేవల లోకోప కారమునకై మాత్రమే వ్యవహరించు పరమభాగవతులరూపమునం బ్రత్యక్షమగుచున్న దాదేవి

హోతకు మైత్రావరుణుఁడు- అచ్ఛావాకుఁడు- గ్రావస్తుతుఁడు సహకారులు- అధ్వర్యునకు ప్రతిప్రస్థాత నేష్ట- ఉన్నేతయును సహ కారులు- ఉద్గాతకు ప్రస్తోత- ఆగ్నీధ్రుఁడు- పోతయును సహకారులు బ్రహ్మకు బ్రాహ్మణాచ్ఛంసి- ప్రతిహర్త- సుబ్రహ్మణ్యుఁడును సహ కారులు ఈపదాఱుగురును యజమానుఁడు స్వామియు ననఁబడు వానిచే నధ్వరమున నెన్నుకొనఁబడిన ఋత్విజు లనఁబడుదురు మఱియు నధ్వరమునఁ బశువును జంపువాఁడు సామిత్రియును పశువు యొక్క యవయవములం ఖండించువారు వైకర్తలు అధ్వర్యులకుం బరిచారకులు చమసాధ్వర్యులును గలరు కాని యీసామిత్ర్యాదులు ఋత్విజులలో గణింపఁబడరు సకలాధ్వరక్రియలు నడిపించు పదేడవ ఋత్విజుఁడు సదస్యుఁడుకూడఁ గలఁడని కౌషీతకు లనుచున్నారు కాఁబట్టి ఋత్విజులు పదేడుగురు యజమానాశ్రితులై యధ్వర్యము నడుపుచున్నారు ఒక్కంకెవేఁ పదేడుసున్నలు చుట్టఁగా వచ్చిన సంఖ్యకు(100000000000000000)పరార్థమనిపేరు సత్త్వగుణము రజో గుణము తమోగుణమును మూఁడు నొండొంటితోఁగలియకున్నపుడు జగము లేదు కేవల ప్రకృతిస్వరూపిణియగు నాదశక్తి బాలాత్రిపుర సుందరిమాత్రమే కలదు మఱి యాదేవి స్వలీలచే నొక్కటి పదేడు సున్నలతోఁగూడి పరార్థసంఖ్యయైనట్లు (3×100000000000000000)

త్రిపదార్థసంఖ్యచే మూఁడు ముమ్మాఱు హెచ్చింపఁబడఁగా ~~౯×3=27~~ అయిన ట్లిరువదేడు నక్షత్రముల స్వరూపమంది కాలరూపిణియై నవగ్రహస్వరూపిణి ద్వాదశరాశికాలమూర్తియై సత్త్వరజస్తమోగుణాత్మ బ్రహ్మవిష్ణుశివత్రిమూర్త్యాత్మకయై ఋగ్యజుస్సామత్రయీవిద్యారూపిణియై త్రిభువనస్వరూపిణియై "త్రిపాదస్యామృతం దివి" అను శ్రుతి ప్రకారము మర్త్యులబుద్ధికందక తనలీలాలేశముచేత ననంతకోటిబ్రహ్మాండములను దనలో మహాసముద్రజలబుద్బుదముల వలెఁ బుట్టి లయమొనర్చుచున్న దావిశ్వజననియగు బాలాత్రిపుర సుందరీకటాక్షమున నిజననమరణప్రవాహరూపక సంసారదుఃఖము నరించుటకొఱకై నానావిధముగ సకలజంగమస్థావరప్రాణులందఱును ఋత్విజులే- తదీయ మనోవాక్కాయకర్మములన్నియు నధ్వరకర్మములే- ఈజగమంతయును యజ్ఞశాలయే- ఈజగదధ్వరమునందు సకలజీవులతలంపులు ఋగ్వేదము- వాక్కులు సామవేదము- కాయక కర్మములు యజుర్వేదమున- మఱి యీమూఁడువేదముల న్నదువు కాల మధర్వవేదము సత్త్వరజస్తమోగుణములు ఋగ్యజుస్సామ వేదములు మూలప్రకృతియగు నాదిశక్తి- ఆదేవి లీలయే జగదుద్భవ స్థితినాశస్వరూపమగు నధర్వవేదము త్రిగుణసాంకర్యసంభూతము. సత్త్వరజస్తమోగుణములను సహజలీలచేతఁ దనకుఁదాను వహించి స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థల నందుచు జ్ఞానేచ్ఛాక్రియాశక్తుల న్మూఁడింట క్రీడించుచు సచ్చిదానందరూపిణియైన త్రిపురసుందరియుం ద్రిభువనజననియగు నెన్మిదేండ్లవయసు నిత్యముగ నలరారు గౌరీదేవి యొక్క సహజలీలయే యీనానాజగద్రూపమునఁ బ్రతిబింబించిన దేహస్మృతి- ఈనానాస్మృతియే పరమార్థవస్తువుయొక్క ప్రతిబింబమా వస్తువే యాయాదిశక్తియగు బాలాత్రిపురసుందరీదేవియొక్క సహజనిత్యగుణమయలీల- భూతాదర్శమున విపరీతముగాఁ బ్రతిఫలించు

వస్తుయథార్థమును గ్రహింపనలవికాని విధమున యీనాదేహస్మృతి యను భూతాదర్శమునఁ బ్రతిఫలించు జగద్రూపమునఁ బ్రతిబింబించుచున్న యాదిశక్తియుం ద్రిభువనజననియగు బాలాత్రిపురసుందరీదేవి యొక్క వాస్తవస్థితి నెఱుంగుటకుఁ దనశక్యముకాకుంటచేత శ్రుతి యీసృష్టి యెట్లగుచున్నదో యాసంగతి యాపరమాత్మకుఁగూడఁ దెలియునో లేదో యని శంకించుచుంటచేతఁ దనతెల్వితక్కువను మాత్రమె వెల్లడించుకొనుచున్న దని తాత్పర్యముగాని పిల్ల పుట్టుక తల్లికిఁ జాటా యన్నట్లు త్రైలోక్యజననియగు నాదిశక్తియు శివుఁ డెఱుంగని గొందులు కలవా? కాఁబట్టి యాచిచ్ఛక్తిలీలరూపమగు నాయీదేహస్మృతియేనేఁ గనిపెట్టుచున్న సమస్తజగద్విశేషములకును గారణము మఱియును నాస్మృతికన్న యథార్థవస్తు వింకెద్దియును లేదు కావుననే "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్యము ప్రవర్తిల్లెను "నీలంనభః-నీఁ చలతితమః" ఆకసము నల్లగా నున్నది చీకటి నల్లగాఁ జలించుచున్నది కలలో జగ మగపడుచున్నది అద్దములోఁ బర్వతము ప్రతిబింబించుచున్నది ఇవన్నియును విభ్రాంతిస్వరూపములు-మఱియును విపరీతదృష్టిజన్యములు గానియథార్థము లెట్లు కావో బాలాత్రిపురసుందరియగు త్రైలోక్యజననియొక్క సహజలీలాప్రతిబింబ మీనాదేహస్మృతి మఱి యీజగమంతయు నాస్మృతియొక్క విపరీతప్రతిబింబము కాఁబట్టి యీజగదుద్భవస్థితి వినాశక్రియలన్నియును స్వప్నపదార్థములవలెఁ గల్లలు మిథ్యలు ననుటకు "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ- నాస్తినానేహ కించన" అను మొదలు శ్రుతులే ప్రమాణము

యుక్తికిట్టించుటకును మఱియును గించిజ్జ్ఞులగు మనుష్యుల యల్పజ్ఞానము నుద్బోధించుటకును అహంకార మమకారబద్ధులగు మనుష్యులకుఁ బరమార్థజ్ఞానప్రాప్తిసాధనముగా భగవదుపాసనకై

శాఖాచంద్రన్యాయముగా "తదైక్షతబహుస్యాం ప్రజాయేయేతి" అను శ్రుతి ఘోషించెను మరియును జంగమస్థావరాత్మకమగు జగము నాస్మృతిరూపకభ్రాంతికల్పితముగాని వాస్తవము కాదు కార్య కారణముల రెండింటికి చక్రకదోషముచే వ్యవస్థ లేదు మఱి యన్యోన్యాశ్రయదోషము నివర్తింప నేరితరమగును? నానాజాతి దేహధారుల నన్ని మొదటిదంపతు లెవరు? మఱి యాదంపతులకుఁ దలిదండ్రు లెట్లు పుట్టఁగలరు? ఆఁడు మగ జంట కలియక స్త్రీలు గాని పురుషులుగాని పుట్టనేరరుకదా? లోకములోని జనులకుఁ దలిదండ్రులయున్కియును బుట్టినసమయమును సర్వజనసాధారణ ప్రత్యక్షానుభవమేకదా? ఉద్భవస్థితినాశములం బొందు నీజగత్కార్య మునకుఁ గుండకుఁ గుమ్మరివలె మన్నువలె చక్రదండములవలె మఱి మొదలగు ననేక కారణము లుండకతీఱదుగా? కార్యకారణములు వృక్షబీజములవలె వస్తుభేదమునెడల స్మృతిక్రొలంది వస్తుజ్ఞానము కలుగుచున్నది కనుక జ్ఞానముతప్ప మఱేవస్తువును లేదు జ్ఞానమే యీసర్వజగద్రూపమైన దనకతీఱదు మఱియు నెన్నిమాఱ్లులో యున్నితుట్లు లన్నట్లు పూర్వపక్షసిద్ధాంతములకు మేఱ లేదు కనుకఁ దర్కము మనఃక్లేశముమాత్రము కలిగించునుగాని యెన్నండును శబ్ద ప్రమాణమందలి శ్రద్ధవలె మనస్సంతుష్టి కలిగింపనేరదు స్మృతి రూపకజ్ఞానముతప్ప మఱేవస్తువును లేదను నద్వైతము యుక్తికి కట్టించినదిగాని పురుషప్రయత్నమునుగాని యరిషడ్వర్గమునుగాని మాన్పించఁజాలకున్నది వేసవి యెట్లువచ్చెనో యట్లెపోవు తెఱఁగున స్వభావముగా నీసంసారబంధ మెట్లు కలిగెనో యట్లే తొలంగునను దృఢనిశ్చయమును మఱి యీదుఃఖమును ద్వారగ మాన్పించునని సర్వజగత్కారణమగు భగవంతుని వేఁడుకోలురూపమగు పరోక్ష కారకధర్మాచరణావలంబనము నవశ్య మానుషకర్తవ్య మని వేదశాస్త్రనిపుణులుఁ బరమకారుణికులైన మునులు బోధించిరి

## పరమ భాగవతులు

పలుకుట మొదలగు చతుర్విధాభినయ మెట్లొనర్చిన నితరులకు బోధపడునో యట్లుచేసినవుడు సంస్కృత మగును కాంబట్టి యితరులకుందనయభిప్రాయ మెఱింగించువాచికాంగికాహార్యసాత్త్వికాభినయ విశేషములన్నియును సంస్కృతములే. కాంబట్టి లోకములోని దేహధారులంద అన్యోన్యబోధకై వ్యవహరించుకొను భాషలన్నియును సంస్కృతభాషలే తనయభిప్రాయ మితరులకుం దెలుపంజాలనిభాష సంస్కృతభాష కాదు అనాదియనియు నపౌరుషేయ మనియును సూర్యకాంతివలె స్వయంప్రకాశ మనియును సహజసిద్ధ మనియు నీశ్వరుని నిశ్వసితరూప మనియును కేవలాపూర్వఫలకకర్మమును స్వర్గాదిపరలోకమును ఇంద్రాదిదేవతలను గూర్చి బోధించు వాఙ్మయము ఛందస్సనియును శ్రుతి యనియును వాడంబడుచున్నది లోకములో వేదసంజ్ఞ లేని యితరవాఙ్మయమునకు భాష యని సంజ్ఞ మఱి యాభాష సంస్కృతప్రాకృతాపభ్రంశభేదములతో నానా విధములుగా దేశకాలపాత్రానుసారముగా సంస్కరింపంబడి వ్యవహరింపంబడుచున్నది. కాంబట్టి శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషనిరుక్త కల్పములు కేవల వేదములం దెల్పుటకై మాత్రమే వినియోగింపంబడుచున్నవి కేవల పరమార్థబోధకములగు వేదచతుష్టయముతోంగాని వేదాంగషట్కముతోంగాని యీలోకమున కెంతమాత్రము సంబంధమే లేదు మఱొకవేళ సంబంధమున్నచో రవ్యాదినవగ్రహములతోను మఱియుం బాతాళాంతరిక్ష లోకములతోడ నీమధ్యమలోకమగు భూలోకమున కెంతసంబంధమో యంతే వేదవేదాంగములతో నీలోకవ్యవహారమునకు నిస్సంశయముగ సంబంధలేశమని సిద్ధాంతీకరింపకతీఱదు చూపుచేతను స్పర్శేంద్రి

యముచేతను మనుష్యుఁడు సూర్యతత్త్వము నెంత తెలిసికొనుచు
న్నాఁడో యంతకంటె కోటింతలు తక్కువగా వినికిచేతను మఱియును
గ్రంథావలోకనముచేతను వేదవేదాంగములను దెలిసికొనుచు
న్నాఁడు మఱియును ఖగోళముల కీలోకమందలి ప్రాణులకుఁ గొంత
సంబంధము ప్రత్యక్షానుభవము గాని వేదవేదాంగములతో సంబంధము
మనుష్యులకుఁ గృత్రిమకల్పితముగాని వాస్తవము కాదు కాదు
కాఁబట్టి ఋగ్యజుస్సామాథర్వవేదచతుష్టయము వేదాంగషట్కము
నుభయలోకములఁ దరించునుపాయములుగాను మఱియు దైవోపాస
నము స్థిరముగా నభివృద్ధికావించి యల్పజ్ఞులగు మర్త్యులకు నిత్యమన
స్సంతుష్టిపదవినందింపఁగోరి లోకోపకారపరాయణులుసర్వజనసములు
సర్వభూతదయాపరు లతీంద్రియద్రష్టలగు నాదిమునులు దేవుఁడు
పాంచభౌతికసృష్టినొనర్చినవిధమున నధ్యయనమాత్రముచేదివ్యపదవిం
జేర్చు సామర్థ్యము వెలయున ట్లపౌరుషేయావ్యక్తశబ్దబ్రహ్మమును
వేదవేదాంగరూపములుకావించి యీలోకమునందు దేవాలయముల
న్దేవతావిగ్రహములఁ బ్రతిష్ఠచేసినట్లు శ్రౌతస్మార్తకర్మబోధకములుగా
నొనర్చిరి. అనాదిగా నీలోకములో నిహపరలోకములను వివరించువేద
వేదాంగస్వరూపక వాఙ్మయము దేశకాలపాత్రానుసారముగా నామరూప
విశేషములతో వెలయుచున్నది ఇదివైదికశబ్దమనికానియిది లౌకికశబ్ద
మని కాని యేశబ్దమునకైన మనుష్యలోకమంతట నొక్కనియమమెద్ది
యునులేదు "ఇషే" శబ్ద మొక దేశమున వైదికముగాను మఱొక దేశ
మున వ్యావహారికభాషాపదముగాను మఱొకదేశమున నిరర్థకశబ్దము
గాను వాడుకొనఁబడుచున్నందున జగమునం దీశబ్దమున కీయర్థ మని
నిర్దేశింప వీలు లేదు దేశకాలపాత్రానుసారముగా శబ్దార్థములు వ్యవ
హరింపఁబడుచుంట సకలజనప్రత్యక్షానుభవమేకదా? కాఁబట్టి సకల
జనరంజకమగు శబ్దమే వేదము మఱియునుసర్వలోకోపకారకకర్మమే

వేదచోదితకర్మము కాఁబట్టి సర్వభూతదయాపరుఁడై సకలజనరంజ
కముగాఁ బలుకుచు సర్వలోకోపకారముగాఁ బ్రవర్తించుటమాని సోమ
రులై ధూర్తులై కేవల స్వార్థపరులై ప్రాణిహింసకులై పామరులను
బెదరించు శ్రోత్రియమ్మన్యులు నీలోకమున కింట తెవుళ్ళని డప్పువేసి
జగమంతటను జాటిచాటి పరమభాగవతులు లోకి ముద్ధరించుట
మిక్కిలి యవశ్యకర్తవ్యము కర్తవ్యము సర్వభూతదయాకరమును
సర్వలోకోపకారకమును సర్వజనాన్యోన్యప్రేమానురాగజనకమును
గాని మనోవాక్కాయకర్మము లుత్తమజాతిమనుష్యధర్మము లెంత
మాత్రము గ్గావు కావు సర్వవేదశాస్త్రప్రణేతలగు మునులు
సర్వజనసమలై సర్వలోకోపకారపరాయణులై సర్వభూతదయా
పరులై మనుష్య నివాసరముల న్దరించుమార్గమునే సర్వవేదశాస్త్ర
ముఖముల బోధించిరని మాత్రమే యుత్తమజాతిమనుష్యులు పరమ
భాగవతులై తాము తరించి యొరులం దరింపఁజేయుచున్నారు

## ఋత్విగాచారము

అగ్నిహోత్ర మాపాసనఁజేయుట కొక ఋత్విజుఁడు నొక
యధ్వర్యుఁడును మాత్రమే చాలుననియును దర్శపూర్ణమాసముల
నల్వురు కావలయుననియును జాతుర్మాస్యమున నైదుగురును పశు
బంధనమున నాలుగురును జ్యోతిష్టోమమునకుఁ బదునాఱుగురును
ఋత్విజులు కావలయునని గౌతమసూత్రము చెప్పుచున్నది అశ్వల
యనుచేతఁ బదునార్గురు ఋత్విజులహీనము (రెండు మొదలు పదకొండు
దినములు సాగు యజ్ఞము) నకును బదేడ్గురు సత్రములకును (పదమూఁడు
మొదలు నూఱుదినములవఱకు జరుగు యజ్ఞము) నియమింపఁబడెను
హోతచేయువిధులు బహ్వృచబ్రాహ్మణమందును (కౌషతికి-ఐతరేయ

బ్రాహ్మణములు) అధ్వర్యుఁడు చేయవలసినకృత్యములు చరకములను (తైత్తిరీయక) బ్రాహ్మణము లందును మఱియు ను శతపథబ్రాహ్మణము లందును ఉద్గాతయొక్క విధులు ఛాందోగ్య (తాండ్య) బ్రాహ్మణము లందును జెప్పఁబడెను. ఆపస్తంబుఁడు తనపరిభాషాసూత్రములం దావిధులు ఋగ్యజుస్సామవేదముల మూఁడిటియందుం జెప్పఁబడె ననియెను. హోత ఋగ్వేదముచేత నుద్గాత సామవేదముచేత నధ్వర్యుఁడు యజుర్వేదముచేతను బ్రహ్మ ఋగ్యజుస్సామవేదములు మూఁడింటిచేతను విధులు నడుపుదురనెను. పశువును ముక్కు చెవులు మూసి చంపెడు శామిత్రియు పశువుయొక్క యవయవముల న్గోయు వైకర్తలు మఱియుం జమసాధ్వర్యులు బ్రాహ్మణేతరులు కూడనై యుండవచ్చును. "అంజోర్మయూప మనుబ్రూహి" యూపనకుఁజమురు రాయుచున్నాము మంత్రములు చదువు మీరు మావెంట నుండుడీ" యనువాక్యము పాంశీ మనఁబడును. బిగ్గరగా ను పాంశు మంత్రము యజుర్వేదమున నధ్వర్యుఁడు తక్కినఋత్విజుల నాజ్ఞాపించును. పైవారలకు వినఁబడనీక చమసాధ్వర్యులు యథావిధిగాఁ దమలోఁదాము కంఠపాఠము చేసికొన్నమంత్రమును గొణఁగుకొను చుందురు యజ్ఞమునం దుపయోగించుమంత్రములం దొలఁగింపఁగా మిగిలినమంత్రములు కేవలాధ్యయనమాత్రప్రయోజనములయినవి యజుర్వేదసంహిత యనఁబడును. ఉద్గాత యలౌకికస్వరనియమములతో హోమవిశేషములననుసరించి పాడెడువాఙ్మయముసామవేదసంహిత. ఉద్గాత సామవేదప్రయోగమున నుపయోగించుపాట లౌకికసంగీతము వలె సకలజనరంజకముకాని యొకవిధమైన కఁఠఘోష. సామవేద సంహిత యనఁబరఁగును. హోత ఋగ్వేదముయొక్క పదిమండలము లందలి మంత్రముల నలక్షణముగా నుచ్చరింపఁగలుగుటయే గాక ధ్యామంత్రార్థమును జక్కఁగా నెఱింగియుండును. యజుర్వేద

మంత్రములు కొన్ని "దేవఃసవితోత్పునాతు" అను మొదలయినవి ఋక్కులని ఎల్లఁబడుటచేతను "అక్షితమసి- అచ్యుతమసి- ప్రాణ శంసితమసి" మొదలగు ఋగ్యజుర్మంత్రములు సామవేదమునం దుంట చేతను మఱియును "అవేరహోధ్వర్యా 3 ఉ - ఉతేమనంనమః" అధ్వర్యుఁడా నీళ్ళు తెచ్చుకొన్నావా- ఆహా తెచ్చుకొన్నాను" అను యజుర్మంత్రములు హోత యుపయోగించుటచేతను ఋగ్వేదశాఖ లన్నియును లోకప్రచారమునకు రాలేదనియుం గ్రొత్తగా వాలఖిల్య మంత్రములు ఋగ్వేదము యొక్క పదియవమండలమున దూర్పఁబడె ననియుం జెప్పవచ్చును- ఋగ్వేదము యొక్క యెన్మిదవయష్టకమందు రాజపురోహితుఁడు రాజుం జంపుటకై ప్రయోగముచేసిన సుబంధు డను రాజుయొక్క ప్రాఁతపురోహితుని దాము క్రొత్తగా మంత్రము కల్పించి యది ప్రయోగించి చంపినట్లును మఱి యాసుబంధుసోదరు లా క్రొత్తపురోహితునిం దాము క్రొత్తగా మంత్రములుకల్పించి స్తుతి చేసి యాతనిదయ వడసి తమప్రాణములు దక్కించుకొన్నట్లును జెప్పఁబడెను "భరామేధ్మంకృణవామహవింషి తేచితయంతఃపర్వణా పర్వణావయమ్, జీవాతవేప్రతరంసాధయాధియోఽగ్నేసఖ్యేమారిష మావయంతవ" "సమిధలను దెచ్చుకొందుము పర్వపర్వమును నిన్ను స్మరించుకొని బూజానై వేద్యముల నొల్చుకొందుము మా పవిత్రకర్మములను గొనసాగించి మమ్ములఁ జిరాయువుల నొనర్పుము నీతోఁచెల్మినుండి మమ్ములం జారిపోనీకు మోయగ్ని దేవుఁడా" "యదద్యసూర్యఉద్యతి ప్రియక్షత్రాఋతందధ- యన్ని మ్రుచిప్రబుధివిశ్వవేదసోయద్వామధ్యందినేదివః- యద్వాభిపిత్వేఅసు రాఋతం యతచ్ఛర్ది ర్యేమవిదాశుషే- వయంతద్వోవిసవోవిశ్వవేదస ఉపస్థేయామమధ్యఆ- యదద్యసూరఉదితేయన్మధ్యన్దినఆతుచి-వామ ధత్థమనవేవిశ్వవేదసోజుహ్వానాయప్రచేతసే- వయంతద్వః సమ్రాజ

ఆపృణీమ హేవృత్రో నబహుపాయ్యం—ఆశ్యామతదాదిత్యాజుహ్వాతో హవిర్భ్యనవస్యో ఉనశామహే” అనునది సూర్యోదయ కాలమందు మధ్యాహ్నసమయమందు సాయంకాలమం దిట్లుఁ గటిము వ్వేళలం దగ్నిదేవున కాహుతు లర్పించుచుఁ బ్రార్థించుట కేర్పడినమంత్రములు అరణియను కఱ్ఱ జంత్రము న్మథించి యం దగ్నిం బుట్టించి ప్రాహ్ణాపరాహ్ణసాయాహ్నములం బూజించి హోమములొనర్చి తమ కైహికాముష్మికసుఖము లిమ్మని ప్రార్థింపను పయోగించు ఋక్కులు వేదములందు లౌకిక కావ్యములందువలె నవరసము లున్నవి

అశ్వమేధమున “నపూంయభతిశ్చన” అను నశ్లీలములు నీచశృంగారహాస్యరసములు- ఋగ్వేదము నేడవమండలమున వేదపారకుల నుద్దేశించి “ఒకసంవత్సరము నిట పండుకొని మౌనవ్రతము పట్టి బ్రాహ్మణులవలె నీకప్పలు వానకురిసినవెంట నేతమగొంతుకులం దిరిగి యెత్తుచున్నవి చెరువులో నెండు చేఁపలమీఁదవలె వాన తమపైఁబడినవు డీకప్పలు మేళము సంగీతమునకు దొరఁకొనును ఈ కప్పలరొద యావులు లేగలతో నఱచుపోల్కి నుండును ఈకప్పలు డప్పితో వేగుచుండఁగాఁ జప్పున వాన కురిసినపుడు తండ్రికొడుకు లొండొరుం గలిసి మాటాడుకొనునట్లు అక్ఖా అక్ఖాయని యఱచుచు నొకదానిచెంత నొకటి చేరుకొనును ఈకప్ప లొండొంటి న్వాన కురియుచున్నపు డుల్లాసముతో నవ్వుకొనును ఎఱ్ఱకప్ప నీటిలో బాతువలె మున్గి పైఁ దేలి గంతులిడుచుఁ బచ్చనికప్పతో ముచ్చటలాడఁజొచ్చును గురుశిష్యులపోలిక నీకప్ప లొండొంటి ననుకరించి పల్కుచు నీటిమీఁ దంతఁ దమయవయవములుబ్బునట్లు శ్రావ్యముగా నుపన్యసించుచుండును ఈకప్పలలో నొకటి యెద్దువలె నింకొకటి మేకవలె నఱచుచుండు నొకటి కొంచె మెఱ్ఱని దింకొకటి యాకుపచ్చని దీకప్ప లొకదానిపోలి యొకటి లేకున్నప్పటి కన్నియుం గప్ప

పేరుననేఁ బరఁగును మణీకప్పలు తమ నానాస్వరముల న్వెల్లడించి
చిత్రవిచిత్రముగా నఱచుచుండును ఓకప్పలారా! మీరు తొలివాన
కురిసినదినమునం జెలువుచుట్టున త్రిరాత్రయజ్ఞమున బ్రాహ్మణులవలె
నేకదీక్షగా రొదచేయుదురుకదా’’ ఈవిధమున వేదఘోష కావించు
శ్రోత్రియుల తొల్కరికప్పలవంటివారని యెగతాళిచేయుఋక్కులు
కలవు

## వర్ణవ్యవస్థ

వివిధయజ్ఞకర్మములను మునులు జనులకు విధించునుద్దేశము-
జనులందఱు మిక్కిలి యైకమత్యముతో యజ్ఞశాలయం దొక్కచోఁ
గలిసి పన్నెండుదినముల చయనమునందును నూఱుదినముల సత్ర
యాగమునందు నన్యోన్యసందర్శనసల్లాపసంతోషముతోఁగలసిమెలసి
పొత్తుగా భోజనములొనర్చుటకును మఱి సకలసౌఖ్యములం దమ
బ్రతుకులం బొదలించుఁడని దేవతలం బ్రార్థించుటకును సకలజనుల
కాస్తిక్యము కలుగఁజేయుటకు సర్వభూతతృప్తిగా నన్నపానములు
వినియోగింపఁబడుటకొఱకు- వండివడ్డించువారును దేవతార్చనము
చేయువారును దేవతలమహిమమునుబోధించువారును బ్రాహ్మణు
లనియును దుష్టులను శిక్షించి సాధువుల రక్షించువారు క్షత్రియు
లనియును కృషివాణిజ్యపశుపాలనములచేసి జనులకువివిధాన్నపాన
సంభారములను కూర్చువారు వైశ్యు లనియును మఱి యీమూఁడు
విధములవారల కష్టేష్టములకై తోడ్పడుచు సహాయభూతులై స్వార్థ
పరత యొక్కింతయును లేక కేవలపరోపకారమునకై మాత్రమే పాటు
పడు నాజన్మపరిశుద్ధులగువారు శూద్రులనియును జనులకు జాతు
లేర్పర్చి పరస్పరమైత్రితో మనుష్యులందఱు తమతమ జీవనగౌరవ
మర్యాదలం బరస్పరసహవాసమున వృద్ధికావించుకొనుటకై వవస్త

వేదములను శాస్త్రములను శ్రౌతస్మార్తకర్మములను బురాణమునులు కేవల లోకోపకారార్థమైననానాదేశకాలపాత్రానుసారముగా నేర్పర్చిరని సిద్ధాంతీకరింపకతీఅదు

"వేదవిక్రయిణశ్చైవ లేదానాం చైవలేఖకాః వేదానాం దూషకాశ్చైవ, తేవైనిరయగామినఃయథైవాన్యాయవిజ్ఞాతాద్వేదాల్లేఖ్యాదిపూర్వకాత్, శూద్రేణాధిగతాద్వాఽధర్మజ్ఞానంనసమ్మతమ్" డబ్బుకై వేదపఠనమొనర్చువారు వేదములు వ్రాయువారు వేదములను నిందించువారు నరకములోఁ గూలెదరు అవిధిపూర్వకముగా దెలిసికొనుటచేతను లిఖింపబడిన గ్రంథమూలముగా వేదముల నెఱుఁగుటచేతను శూద్రునివలన నుపదేశింపఁబడుటచేతను గలిగిన ధర్మజ్ఞానము సమ్మతముకాదు అనుటచేత వ్రాల్లులు మఱి యాచ్చ్రవ్రాఁతమూలముగాఁ బ్రచురింపఁబడిన వాఙ్మయమంతయునుయథార్థబోధక మెంతమాత్రమునుగాదు ధనార్జనకై పఠింపబడినవి వేదములు పరిశుద్ధములు కావు మఱియును జీవనార్థమైహికభోగముల నమకూర్చుకొనుట స్వార్థపరులు ప్రకటించు శ్రౌతస్మార్తకర్మములన్నియును కేవల దంభకృత్యములే మఱియు జనులకుఁ బరస్పర ద్వేషమును కలిగించు జాతులు కసింతయును బరిశుద్ధములు కావు

## ప్రకృతి పరిణామము

జనులకుఁ బరస్పరద్వేషమును భూతహింసయును గావించు కేవల స్వార్థపరులు విక్రమముగా నొకమ్మ కబ్బకుం బుట్టని సంకర జాతులుకాని శుద్ధజాతు లెంతమాత్రము న్గారు-మఱియును మునులు సర్వజనోపకారకముగను సర్వజనరంజకముగను సకలజనులకుం బరస్పరప్రేమానురాగకరమగు తెన్నునసే నానాదేశకాలపాత్రాభిరుచిం బట్టి వివిధవేదశాస్త్రము లనాదికాలమునుండియు నానార్థాభముల్ల

నుపదేశించిరి తమతోడిపాటివారితోఁ బొత్తుగొని వారిని సుఖపెట్టి తాము సుఖపడెడు మనుష్యులుమాత్రమే వేదశాస్త్రానుసారముగా నడుచు శుద్ధజాతిలోనివారు కేవలస్వార్థపరులై భూతద్రోహులై ప్రాణిహింసాపరులై పరస్పరద్వేషముం బ్రతుకుమానవులు సంకర జాతులును వేదబాహ్యులని దస్కువేసి చాటకతీఱదు తీఱదు దేశకాల పాత్రానుసారము దేహారోగ్యమునకై సుఖనిద్రాహారవిహారసాధకో పాయములను బోధించుటకై వివిధ శ్రౌతస్మార్తకర్మములు మఱియు వివిధ శిష్టసంప్రదాయాచారానుసరణ విధాయకజాతినీతులేర్పడినవి పరస్పరానురాగముతో సకలభూతదయతో బ్రతుకునుపాయము లన్నియు దేశకాలపాత్రానుసారముగా మునులు కవులు వెల్లడించిన వాఙ్మయమే వేదశాస్త్రములన్నియు నని ఫలితార్థము నిశ్చయింపక తీఱదు తీఱదు ఈజగము మఱి యీలోకములోని సచేతనాచేతన పదార్థములు మఱి దైవకల్పితములు పురుషకల్పితములగు సకల క్రియలు పంచేంద్రియములు మఱియుం బంచేంద్రియగ్రాహ్యములగు పదార్థములన్నియును జంగమస్థావరప్రాణిచేష్టలన్నియును మఱియుం బంచభూతములు పరస్పరసంయోగవియోగవిశేషజన్యములగు సకల పదార్థములును భూతభవిష్యద్వర్తమానకాలములందు జరిగినవిజరుగు చున్నవి మఱి జరుగఁబోవునవి యగునన్నివిధములయిన విషయములు నిక్క మరయఁగా నీలోకమందలి సకలపదార్థముల కాదిమధ్యాంత కాలమును నిర్ణయింప శక్యము కాదు కాని లోకమును లోకమందలి సకలపదార్థములు నెద్దియో మార్పుమాత్రము ప్రతిక్షణము పొందు చున్నవని సర్వజనప్రత్యక్షానుభవమని యొప్పుకొనకతీఱదు ప్రతి క్షణము మాఱుటయే స్వభావముగల యీలోకమందలి పదార్థము లివి యిట్లే మాఱక వచ్చుచున్నవని సిద్ధాంతీకరించుటగాని యివి యిట్లే జరిగింపవలయునని పద్ధతులేర్పఱచుటగాని పిచ్చిగుణములు.

వాయ్వగ్నిజలపృథివుల కాధారమగు నాకసమును దిక్కును కాల
మును విభాగించుట యవశ్యమైనప్పటికి నీలోకవ్యవహారార్థమై నానా
విధములుగా ఘటాకాశపటాకాశాదులుగాను క్రిందమీఁదలుగాను
ప్రాక్పశ్చిమాదులుగాను వసంతాదిఋతుదినయామినీ తిథిపక్షాదు
లుగా నేర్పఱుచుకొన్నట్లు వేదవేదాంగముల యేర్పాటు పురుషులు
చేసిన కృత్రిమకల్పనములు కాని యేటికి వంకగాని నీటికి వంక కలదా
యన్నట్లు ప్రతిక్షణము మాఱుచున్న దేశకాలపాత్రానుసారముగా
వేదవేదాంగాచారములు మాఱుచుంటచేత నీలోకమునకుఁగాని
యాలోకములోనిపదార్థమునకుఁగాని యీవస్తుతత్త్వమిది 'ఇదమిత్థమ్'
అని నిరూపించు బుద్ధియును క్షణభంగురమౌటచే నేసంగతి నిర్ణయింప
నెవ్వారికి శక్యము కాదని మాత్రమే నిర్ణయింప శక్యమగును

## శిక్ష

ప్రతిబ్రాహ్మణకుమారుఁడు నతని పన్నెండేండ్ల బ్రహ్మచర్య
దశయందు గురుముఖమున వేదాధ్యయనము చేయవలసినది పిమ్మట
గృహస్థుగా నుండఁగోరినవాఁడు పెండ్లాడవచ్చును మఱియు గృహస్థు
కానొల్లనివాఁడు నలువదెనిమిదేండ్లవఱకు బ్రహ్మచారియై వేదములు
నేర్చుకొనవలసినదని గౌతమమతము "ఓమ్" అని ప్రారంభించి శిష్య
ప్రార్థనముచేత గురువు మూఁడు శ్లోకములుగల ప్రశ్నమును జెప్పఁ
జొచ్చును శిష్యబోధకై గురువు బిగ్గరగా వేదము నుచ్చరించును
కొన్నిపదములు సులభబోధకై రెండు మార్లుచ్చరించును లేకొక
మాఱు చెప్పి "ఇతి" ఈలాగుననే యని చెప్పును కొన్నిశాఖల
ననుసరించి కొన్నిపదములు "ఇతి" అని గాని "అభి" అని గాని
"అభీత్యభి" అనిగాని జోడింపఁబడును ప్రతిదినము నఱువది ప్రశ్నముల
వేదపారము జరుగుచుండును బ్రాహ్మణుఁడు యావజ్జీవ మాచరింప
వలసినకర్మములన్నింటిని విధించిన గృహ్యసూత్రములు వ్రాఁతను

గూర్చి చెప్పలేదు కనుక వేదవేదాంగములను వ్రాసికొని చదువు
కొనుట బ్రాహ్మణునకుఁ గూడదు కూడదు వేదము వేసికొనుట
వాలకముకట్టుట యెట్లుదంభకృత్యములో యట్లే వేదవేదాంగశబ్దము
లను వ్రాఁతలోఁదెల్పుట యట్లు బ్రాహ్మణులకుఁ దగనిపని కాఁబట్టి
వేదవేదాంగములను వ్రాఁతవ్రాయువాఁడుగాని వ్రాయఁబడినవేద
వేదాంగములు నవలోకించి చదువువాఁడుగాని బ్రాహ్మణుఁడు కాఁడు
కాఁడు గురూచ్చారణమును విని వేదవేదాంగముల నభ్యసించి
గురూపదేశముచేత వేదవేదాంగరహస్యము లెఱింగి గురూపదిష్టము
లగు నాచారముల నొనర్చువాఁడే నిక్కపుబ్రాహ్మణుఁడు కాఁబట్టి
వేదశబ్దము నిత్యము బ్రహ్మవిశ్వసిత మపౌరుష మని చెప్పఁబడెను
వ్రాఁత యనిత్యము తుచ్ఛము కృత్రిమము పౌరుషేయము కాఁబట్టి
వాగ్రూపిణి సరస్వతీదేవత యని వేదములందుఁ జెప్పఁబడెను
లిపికి దేవత యొద్దియును వేదములందు నిర్దేశింపఁబడలేదు వ్యాకరణ
మునఁ జేర్కొనఁబడిన "వర్ణ"అనుపదము నక్షరోచ్చారణస్వరవిశేష
ముం జెప్పునుగాని వ్రాయఁబడినయక్షరము నెంతమాత్రముం జెప్పదు
మఱియును "అక్షర" అను శబ్దము నాశములేని శబ్దముం జెప్పుచు
న్నదిగాని లిఖితమునుగూర్చి యెంతమాత్రమును జెప్పదు ఉదాత్తా
నుదాత్తస్వరితాదిస్వరములు వ్రాసిచూపించుటయును రాగమును
వ్రాసిచూపించుటయు ను వీలుపడదు "స్వరతోఽపరాధాత్"అనుట
చేత విన్కి చేతమాత్రమే తెలియఁదగిన స్వరమును ప్రాణముతోనున్న
వాగర్థములను లిపియందు తెలిసికొనఁబూనినప్రయత్నమునిర్జీవప్రతిమ
తోడి సరసమువలె వ్యర్థమే కాక పరిహాసాస్పదముగు పిచ్చిచేష్ట
కాకున్నే? చెవితోఁ జూచుట- కంటితో వినుట- నాల్కతో వాసన
గొంటయును గేవల మసందర్భములు కదా? శబ్దమును శబ్దార్థమును
విన్కి చేతఁదప్ప పుస్తకాలోకనముచేతసరిగాఁదెలిసికొనఁ బ్రయత్నిం

చుట యాఁడువేసము వేసికొన్న మగవాఁడు మఱిమగవేసముతోనున్న
స్త్రీయును నొండొరులను భ్రమింపఁజేసికొనుట కల్లయును మోసము
నగతాళియును నవ్వులాటయును బూటకమగునుగాని పరమార్థసాధక
మెంతమాత్రమునుగానిచందమున పుస్తకములవ్రాఁతలనుండి శ్రవ
ణేంద్రియైకగ్రాహ్యములగు శబ్దములు యథార్థతత్త్వబోధకము లెంత
మాత్రమున్గావు కావు మఱియును సాధారణముగాఁ దనయూహాను
కూలంకషముగా నెవ్వరైనను దమవాక్కుచేతఁగాని శరీరావయవా
కారప్రదర్శనవిశేషములచేతఁగాని తెలుపఁజాలకున్నపుడు చిత్రలేఖ
నాది శిల్పప్రదర్శనములచేత నొరుల కున్నదున్నట్లు బోధించుట కల
లోనివార్త కాదా? ప్రతిక్షణము నానారసములమాఱుచు శ్రుతిస్వర
గ్రామతాళమూర్ఛనముల వెలయుచున్న సచేతశబ్దతత్త్వ మరికట్టఁబడి
శిలలు బిగింపఁబడి చెఱనుంచఁబడిన తప్పువ్రాతలంబట్టి వేదవేదాంగ
ముల నెలిసికొంటినని మనులభిప్రాయమిద్దియేయని తనవీఁపుఁ దా
సరిగాఁదెలియఁజాలకుంట కానెఱింగియును స్వార్థపరుఁడై వంచకుఁడై
జనులకన్యోన్యద్వేషము కల్పించుచుండంత్రపునక్కవలె బ్రతు నెంచు
ధూర్తుగాని లేక దౌర్భాగ్యుఁడుగాని లేక విభ్రాంతుఁడుగానిఁ గేవల
పరమార్థబోధకమగు వేదవేదాంగస్వరూపకశబ్దబ్రహ్మమును వ్రాఁతల
చేతను బుస్తకములచేతను చిత్రములచేతను మఱి యీ మొదలగు
నైహలౌకికసంజ్ఞలచేతను దెల్పనొల్లఁడొల్లఁడు వేదవేదాంగములు
కేవల లోకోపకారమగు నడువడిచేతఁదప్ప వేషములచేతను పుస్తక
ముఁ చేతను బ్రతిమలచేతఁ దెల్పఁబడుటయుం జెవుఁపిల్లికొమ్ములతో
బులిం బొడిచి చంపుటవంటిదికాదా? ఉబుసుపోని మంగలి పిల్లితల
గొఱుగునట్లతీంద్రియమగునాదబ్రహ్మాత్మకాపౌరుషేయ వైదికశబ్దమును
వైఖరీరూపముతో దేవళంబులం గృత్రిమములగుదేవతావిగ్రహముల
వలె "శతాంధాః కూపం ప్రవిశన్తి" అను న్యాయముగా ననాదిగా

సహంకారమమకారవశమున నిర్భ్రాంతమానసులగు ప్రాకృతజనులు
పరస్పర మనకరించుచు వేదవేదాంగములని వాని యుచ్చరించు శబ్ద
ములు వ్రాసినపుస్తకములు మఱియును జనులకుఁబరస్పరద్వేష మొద
వించి ప్రాణహింసకుం బురికొల్పుచు నాచరించినకర్మములన్నియును
ధూర్తకల్పితములుగాని యథార్థములు కావు కావు లౌకికవ్యావ
హారిక దుఃఖముల న్మఱపించి చిత్తశాంతికలిగించి తరింపఁజేయుముఖ్య
సాధనముగా నవ్యక్తమతీంద్రియ మపౌరుషేయము నిత్యము పర
మార్థస్వరూపమగు నాదబ్రహ్మము ను “అగ్నిమీళే పురోహితమ్” అను
వ్యావహారికశబ్దమూర్తి న్గావించియు నశరీరదేవతకు శరీరంబన్ని
దేవాలయములందు విగ్రహములం బ్రతిష్ఠించియును దేవతోపాసనో
పాయముగా నమూర్తున కు మూర్తుల కల్పించి పరమకారుణికులతీం
ద్రియద్రష్టలు సర్వజగదుపకారపరాయణులగు మునీశ్వరు లనాది
కాలమునుండియును వేదవేదాంగశబ్దప్రపంచమును శ్రౌతస్మార్తాది
కర్మప్రపంచము ను బన్నిరి మునీశ్వరుల ముఖ్యాభిప్రాయము సకల
జనులును బరస్పరప్రేమానురాగముల పొత్తుగొని కలిసిమెలసి
హాయిగా నిహపరములుతరించుటకేకదా యట్టిచో నహర్దివము౦
ప్రతిక్షణము న్మాఱుచున్న కాలమునఁ బ్రమాదముచే వేదచోదిత
ధర్మములు నశించునేమో యని వంశపారంపర్యముగా ఋషు లుచ్చ
రించిన వైదికశబ్దము లుచ్చారణభేదముచేతను స్వరవైపరీత్యము
చేతను ఋషులయుద్దేశములకు భిన్నార్థములకును భిన్నకర్మములకును
మూలమగుటీరున దత్తద్దేశకాలపాత్రానుసారముగాఁ బ్రవచనప్రాతి
శాఖ్యభేదము లనంతసంఖ్యాకములగుటచేత నశరీరుఁడగు భగవంతున
కుపాసనాసౌలభ్యమునకై జగదుపకారకార్యధురీణులగు మునులు
పన్నినవాఙ్మయమును శ్రౌతస్మార్తకర్మములను దేవతావిగ్రహము
లను క్షేత్రములను దీర్థములను స్వార్థపరులై తమతమకోరిన మైకాళ

సుఖసాధనోపాయముల నాలోచించి సకలజనసమ్మతి నరయ కొంటెగోటు రాకాసులై తాఁ బట్టినకుందేటికి మూఁడేకాళ్ళని యహంకారమను కారబద్ధులైతమలోఁదా మొకరితోనొకరికి సరిపడక మతభేదవాదములతోఁ గొట్లాడుకొని తన్నుకొనుచు సూర్యున కావుపాలుగాక బత్తెపాలపాయసము నైవేద్య మొసఁగువారు నరకగాములని నిందించుచు పరస్పరద్వేష మొదవునట్లు తెలిసీ తెలియక మును లేర్పరచిన దారితప్పి యేదారియుం దోఁచక తుద కుభయభ్రష్టు లగుచున్నారు

## యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ

పూర్వకాలమునకుఁ దగిన వేదవేదాంగాచారపద్ధతు లిప్పటి కాలమునకు సరిపడవుకావున నిప్పటికాలమున నెట్లు సకలజనులకుం బరస్పరమైత్రి యేర్పడునో సకలభూతదయ యెట్లుకొనసాగునో యా ప్రకారముగా వేదార్థమును శ్రౌతస్మార్తాచారముల ననుసరించుకొనక తీఱదు కాలోచితవర్తనము సమయోచితయుక్తియును సర్వజన సమ్మతాచారమును లేనివాఁ డొరుల సుఖపెట్టి తా సుఖపడనేరఁడు "వేద మింద్రియగోచరమగు పాంచభౌతికపదార్థమనియు నావేదము మనుజులందుండుట పరికించి యామనుష్యులు పరస్పర మావేదమును గ్రహించిజ్ఞప్తినుంచుకొని ధారణముచేసికొని స్మరింపఁజేయుచు వృద్ధులు వ్యవహరించిన శబ్దస్వరూపమే వేద మని నమ్మవలయును మంత్రము బ్రాహ్మణము మొదలగు వేదనామధేయములనాదికాలమునుండిమనుష్యులందు వ్యవహరింపఁబడుటచేత వేదశబ్దములనాదులు" అనికుమారిలభట్టు సిద్ధాంతీకరించెను కాఁబట్టియీజగమునకుఁగాని జగమునందలి జంగమ స్థావరప్రాణిసృష్టికిఁగాని మఱి వేదశబ్దములకుఁగాని ప్రారంభప్రవృత్తి కాలము నిర్ణయింప నవరితరము గాదు అనాదిగా నీసర్వప్రపంచ సృష్టి జరుగుచున్నది కావున నొక్క వేదములే యనాద్యు లన నేల

సచేతనాచేతనపదార్థములన్నియును శబ్దస్పర్శరూపరసగంధగుణవిశేష ములు సకలపదార్థము లనాదిగా మాఱుచు వచ్చుచున్నవి ఈలోక సృష్టికాదిమధ్యాంతకాలనిరూపణము చేయఁదరముకాదు నూఱా మడమేరఁ బాఱుచున్న కృష్ణానదియొక్క నీరు ప్రత్యంగుళముమేరను దేశకాలపాత్రలంబట్టి మాఱుచుండియును గృష్ణానదియొక్క నీరే యనఁబడుచున్నట్లనాదికాలమునుండియు నానావిధముల న్దేశకాల పాత్రానుసారముగా సచేతనాచేతనవస్తువులును మఱి వానిగుణప్రవృ త్తులు వివిధగతుల మాఱుచున్నప్పటికా నదీపర్వతాదిసంజ్ఞలు జడము లకును తృణగుల్మలతావృక్షాదిసంజ్ఞలు స్థావరప్రాణులకు కీటపక్షిపశు మనుష్యాదిసంజ్ఞలు జంగమప్రాణులకు ఛందోభాషాదిసంజ్ఞలుశబ్దంబు నకును మాఱకున్నవి బాల్యయౌవనవార్ధకదశలందు దేశకాల పాత్రానుసారముగాఁ బ్రతిక్షణమును మనోవాక్కాయచేష్టలను మాఱుచుండియును మనుష్యాదిదేహధారులు తమతమనిర్దిష్టజాతి సంజ్ఞయెడ మాఱకుంట సర్వజనసాధారణానుభవమేకదా ? కాఁబట్టి వేదాంగములు శ్రౌతస్మార్తాచారములుమఱియును లోకములోని నానాభాషలు వ్యవహారములు దేశకాలపాత్రానుసారముగా ననాది కాలక్రమమున మార్పుచెందుచున్నప్పటికిఁ దమతమ వేదవేదాంగ సంజ్ఞను శ్రౌతస్మార్తశిష్టాచారసంప్రదాయాదిసంజ్ఞను సంస్కృత ప్రాకృతాదిభాషావిశేషసంజ్ఞను మఱి యార్యమ్లేచ్ఛాదిజాతివిశేష సంజ్ఞను మాఱకున్నది కాఁబట్టి ఇప్పటి వేదవేదాంగములకు నానా భాషలకు నానావిధప్రాణులజాతులనీతులకు గుణములకు చేష్టలకు మఱియు నిప్పటి సకలలోకవ్యవహారములకు మాఱుదలచూపకున్నవిఁ సంజ్ఞలుమాత్రమే సంజ్ఞచేతఁదప్ప మనోవాక్కాయకర్మవ్యవహార మ్ఘంతయుం బ్రతిక్షణము మాఱుచున్నది ఆసంజ్ఞ యహంకార మ్ఘులము మఱి యహంకారము శరీరస్మృతిమూలముమఱియీదేహ

స్మృతి సుషుప్తిమూర్ఛాద్యవస్థలందు సూక్ష్మబీజరూపము గాను మఱియును స్వప్నజాగ్రదవస్థలందు స్థూలస్థూలతరరూపమై యాది మధ్యాంతరహితమై త్రిగుణమయమై యచింత్యవైభవమగు బాలా త్రిపురసుందరీలీలావిలాసమై వెలయుచున్నది ఈ స్మృతియనంతవిధ ములం బ్రవృత్తినివృత్తులం జెందుచున్నది కాఁబట్టి "యాదృశీభావ నాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అను వాక్యానుసారముగా నెవరెవరి కమ్మతి మెట్లుండునో యావిధము సకలవస్తుతత్త్వము వారివారికగపడు చుండునని సిద్ధాంతీకరింపక తీఱదు కాఁబట్టి యీలోకములో జనులకుం బరస్పరద్వేషముంగలిగించి వారివారి నిద్రాహార విహారసౌఖ్యములకు భంగకరముకాకుండెనేని యాస్తిక్యముకానీ నాస్తిక్యముకానీ యార్య మతముకానీ మ్లేచ్ఛమతముకానీ వైదికముకానీ పాషండముగానీ యేదేశకాలపాత్రములననుసరించని మఱెట్టికులజాతిమతాచారములు గానీ రవంతైన నిహావరములలోకము కానేరదు కానేరదు "అపి మాషంమషంకృత్వా ఛందోభంగంనకారయేత్" బ్రతికిన దూరు, మానినది మందు మఱియును సకలజనోపకారకమైనచో జనాచారము లెట్లున్న నేమి? ఆఁకలితీర్చినదవన్నము, దప్పికతీర్చినది పానము, తన్నుసుఖ పెట్టినవాఁడు దేవుఁడు జనరంజకమైనపలుకు వేదము, జనానురాగకర మైనది శిష్టాచారము "సర్వేజనాఃసుఖినోభవంతు" అని యహర్దివము న్గోరినవాఁడు పురుషోత్తముఁడు

వేదమనఁగా జ్ఞాపకము- శ్రుతి యనఁగా జెవులతో విన్నది స్మృతి యనఁగా బెద్దలు జ్ఞాపకముంచుకొమ్మనియుపదేశించిన సంగతి బ్రాహ్మణులు చెప్పినపలుకులు బ్రాహ్మణములు సంక్షిప్తముగాఁ జెప్పినపద్ధతులు సూత్రములు- వేదముల కవయవములు వేదాంగ ములు- ఉపన్యాసములు ప్రవచనములు- నేర్పఁబడునవి శాస్త్రములు- వర్ణనములు సకలవస్తుతత్త్వజ్ఞానసిద్ధాంతములు కాబట్టి లిఖితరూప

మున ననాదికాలమునుండియుంబై వివరించిన వేదశ్రుతిస్మృతిబ్రాహ్మణ సూత్రవేదాంగప్రవచనశాస్త్రదర్శనాత్మకవాఙ్మయ మున్నదా లేదా యని తర్కింపఁగా లేని దేవుఁడు న్లేఁడు- అత్యంతాభావమునకు భూత భవిష్యత్కాలముల మార్పులేనేలేదు ఉన్నదిపోదు లేనిదిరాదు కాఁబట్టి జనులు పరస్పరబోధకై యనాదిగా నేర్పర్చుకొనుచున్న నామరూపముల గుర్తులుపాధులతోనే జగమువలె క్షణక్షణము నానావిధముల మాఱుచున్నవి కాఁబట్టి యిప్పటిలోకమునుమఱి సకలలోకవ్యవహారములును నామరూపవిశేషభేదములతో ననాదిగా వాస్తవములై యున్నవని సిద్ధాంతీకరింపఁగలేదు ఈనామములు మఱి రూపములు నిదివఱకు దేశకాలపాత్రానుసారముగా ననంత విధముల మాఱుచుమాఱుచు ప్రస్తుతమీజగముగాఁ బ్రతిక్షణము న్దమమాఱుపల న్దోఁపనీక మార్పుచెంద కిట్లే యనాదిగానున్నవిధమున నల్పబుద్ధులు భ్రాంతులై "ఇషేత్వా"అను మొదలగు వైదికశబ్దము లనాదులనియు నపౌరుషేయములనియును నమ్ముచున్నారు పరమార్థ దశయందు వేదములే లేవను జగద్గురు వాక్యము నవలఁద్రోసిన ఛాందసుల నేమనవలయును ? "ధాతాయథాపూర్వమకల్పయత్- సోఽయందేవదత్తః" అను వాక్యములంబట్టి నామరూపములచే మాత్రమే మాఱుచున్నదికాని యీలోకవస్తువులన్నియు నాది మధ్యాంతకాలములం దున్నవే

"నాద్వైతవతః కర్మాణి విధీయన్తే"అను శ్రుతికి స్వార్థ పరతలేక సకలభూతదయాపరుఁడై లోకోపకారమునకై మాత్రమే బ్రతికెడుపరమభాగవతున కెంతమాత్రమును విధినిషిద్ధములు లేవు లేవు- పరమభాగవతుని చర్యలన్నియుం జంటిపాపనిచేష్టలవలె మనుష్యులైనవారికందఱికిని ముద్దుముచ్చటయున్గాక మానవుమానవు "యోగరతోవా భోగరతోవా సంగరతోవా సంగవిహీనః- యస్య

బ్రహ్మణి రమతేచిత్తం నందతి నందతి నందత్యేవ మాళిష్ఠ కుంభ పరిరక్షణధీర్నటీవ, బ్రహ్మైవలోకనధియం నజహాతి యోగీ" అను వాక్యములకు స్వార్థపరతలేక సకలభూతదయామయుఁడైనవాని చిత్తమే బ్రహ్మధ్యానపరవశమటగుచేత సట్టిపుణ్యాత్ముని మనోవాక్కాయకర్మము లెట్లుండినప్పటికిని లోకులకు మిక్కిలి సంతోషకరులేయగునుగాని ద్వేషహేతువులు కావనియును సంసారపుఁ జిక్కులలో మెలఁగుచుండియును నానామతములుగల జనులతో వ్యవహరించుచుండియును యోగియైనవాఁడుతనయంతిస్సునకుఁగామ క్రోధలోభమోహమదమత్సరము లంటనీక కేవల లోకోపకారము కొఱకే తనజీవనము గడపునని తాత్పర్యము

## లోకవ్యవహారము

సకలలోకోపకారముగా నేను నాది యనునహంకారమమకారములను తనకన్న వేఱుగానున్న జగత్కార్యములను బరికించు స్మృతియున్నంతవఱకు సంసారులు తమనేరములుదైవముపై మోపక తమపౌరుషలోపముచేతనే స్వపరహానికృత్యము లొనర్చుచున్నామనియు మఱట్టి పాపకృత్యములనుండి తమ్ము మఱలించి తమ బ్రతుకులం బరోపకారముగాఁ గొనసాగించుమని పరమభాగవతుల సహవాసము విడువకుండవలసినది సకలశ్రుతిస్మృతులను నానావిధ ద్వైతాద్వైతవిశిష్టాద్వైతనాస్తికాస్తికమతవివేషములను సమన్వయముగా సందర్భింపఁజేసినపుడు తేలెడుపర్యవసానఫలము "అస్తిభాతి ప్రియమ్-సచ్చిదానందలక్షణమ్" అను బ్రహ్మజ్ఞానహేతువైన సకల లోకోపకారప్రవర్తనమే దేశకాలపాత్రానుసారము జనులందఱు గలసిమెలసి పరస్పరప్రేమానురాగములతో నిహసౌఖ్యములుపొందుట కొఱకేపరమకారుణికులుసర్వసములు తపోధనులు సర్వజ్ఞులగుమునులు

మానవ దేహధారులై ధర్మాచరణవ్రతదీక్షితులు కామచారులు సర్వస్వతంత్రులగు సంసారులవలె నటించుచు సకలశాస్త్రములం జతుర్విధాభినయవిశేషములచే ననాదికాలమునుండియుం దమతోడి పాటిమనుష్యులకు బోధించుచుం బరమభాగవతప్రసిద్ధి న్గాంచు చున్నారు

ఋగ్వేదమునందు సూక్తములు (మంత్రములు) అనువాకములు (మఱుమఱల ధారణార్థమై పఠింపవలసినవాక్కులు) మండలములు (గుంటులు) వర్గములు (తరగతులు) అధ్యాయములు (ప్రత్యేక మొక్కయంశముంగూర్చిన యుపన్యాసములు) అష్టకములు (గ్రంథ విభాగములు) కొన్ని సంఖ్యలయొక్క వెరసిమొత్తములు, అనియును తైత్తిరీయకమందుఖండికలు- అనువాకములు- ప్రశ్నములు- అష్టకములనియును- కాఠకములందు గ్రథములు- స్థానకములనియుం- గలవు- శతపథబ్రాహ్మణము షష్టిపథబ్రాహ్మణములు నూఱునఱు వదియు నధ్యాయములు కలవి- మఱియును ప్రపాఠకము (నోటివల్లన చేయవలసినగ్రంథము) ఆహ్నికము (ఒక్కదినమునఁ జెప్పవలసి నన్నివాక్యములు) పర్వము (గ్రంథము నందలి హద్దులు) మొదలగు నామములుకూడఁ గలవు కాఁబట్టి కరవిన్యాసమునఁ గలుగుమూఁగ వ్రాఁతచేత సమగ్రముగా నభిప్రాయము తెలియఁబడదనియే ప్రాచీను లందఱును సకలవేదశాస్త్రములు స్వయముగా స్ఫుటముగాఁ దత్త దర్థబోధకముగున ట్లుదాత్తాది స్వరవిశేషముల వాఙ్మయమొనర్చి జనులకు విన్పించిరి కనుకనే శ్రవణమనననిధిధ్యాసప్రచారము తొల్లి కలిగెనుగాని యీమూఁగవ్రాఁతలు పుస్తకములు లేనేలేవు దేవత లను విగ్రహరూపముల దేవాలయములం దగుపర్చినట్లు- కేవల సత్సం కల్పములకుఁ బ్రతినిధులుగా మేఁకలు మొదలయినజంతువులను యజ్ఞ వాటములందు బలికావించినవిధమున శబ్దబ్రహ్మమును శ్రావ్యము

చేయఁజాల కల్పబుద్ధులకు మూఁగ్రవాఁతపుస్తకములం బ్రచురించు చున్నారు ఈమూఁగ్రవాఁతలవలన నొకప్పుడు విపరీతబుద్ధులగు స్వార్థపరుల యభీష్టమనానుసారముచేసి కంటికుంచవలసినది తుంటి కుంచుచు మంచికిబదులు కీడొనర్చుచుంటయు గలుగుచుండును నామ రూపములు రెండింటిలో నామము కేవల శ్రవణేంద్రియగ్రాహ్యమగు శబ్దము రూపము కేవల నయనేంద్రియగ్రాహ్యమగు నాకారము శ్రవణేంద్రియము తనశక్తికొలంది యథార్థమగు ధ్వనిని గ్రహించును గావి లేనిచప్పుడు వ్వినఁబోదుగాని కన్ను చీకటి నాకాశపునల్పు నెండమావులజలప్రవాహతరంగములను మఱి యథార్థము గాలేని దిగంతరేఖను గ్రహనక్షత్రామండలాద్యాకారవిశేషములను వాస్తవ ముగాఁ జూచును కాఁబట్టి శ్రవణేంద్రియము గ్రహింపఁగలిగినంత యథార్థవస్తుతత్త్వము మఱేయింద్రియమైనను గ్రహింపఁజాలదు శ్రవణేంద్రియగ్రాహ్యపదార్థము నిశ్చయముగా రూపబ్రహ్మమనిగాని యాకారబ్రహ్మమనిగాని లోకప్రసిద్ధి లేదు మఱియును వాక్కు సరస్వతీదేవి యనఁబడెనుగాని రూపము సరస్వతీదేవి యనులోకవ్యవ హారము లేదు శ్రుతి యనియును స్మృతి యనియును శ్రవణధర్మ ప్రవృత్తికిని మఱియు మనోధర్మప్రవృత్తికి నవకాశముకలుగుటచేత "ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని శ్రుతి విధించునుగాని "లిఖితవ్యః విలోకితవ్యః" అని చెప్పలేదు, "ద్రష్టవ్యః" అనుచో జ్ఞాననేత్రముచేతఁ బరికించుటగాని చర్మచక్షువుచేఁ జూచుట యని యర్థము కాదు "అశరీరమాత్మా" అనుశ్రుతినిబట్టి బ్రహ్మ మును జ్ఞాననేత్రముచేఁ దెలియవలెను మఱియును శ్రోత్రేంద్రియ మశరీరమగు నాకాశమే కాఁబట్టి శ్రోత్రేంద్రియము తక్కిన యింద్రియములవలె ననిత్యమగు పార్థివము కాదు కనుకనే శబ్దము నిత్యమనియు నపౌరుషేయ మనియును బ్రహ్మ మనియును జెప్పఁ

బడెను ఈజగమునం దశరీరాకాశగుణమగు శబ్దమొక్కటియే నిత్యసత్యపదార్థము తక్కినస్పర్శరూపరసగంధములునవోవిభ్రాంతి కృతము లెండమావులవలె మిథ్యలు- కాఁబట్టి శ్రుతియనఁబరఁగిన వైదికశబ్దము నిత్య మపౌరుషేయము బ్రహ్మమనియును సిద్ధాంతీక రింపఁబడెను సకలవస్తువుల కాధారమైనిత్యశబ్దగుణముచేతమాత్రమే "శబ్దగుణకమాకాశమ్" అని తెలియఁబడి "ఆత్మనఆకాశఃసంభూతః" అని జనుల యాస్తిక్య మభివృద్ధిచేయుటకై ప్రతిపాదింపఁబడి యెవ్వరికిం బట్టుబడక కేవలబుద్ధిగోచరమైన యాకాశముకన్న యీ జగమునకు మూలమెద్దియును లేదు

## నాదబ్రహ్మము

"ఆహతోఽనాహతేశ్చేతి ద్విధానాదోనిగద్యతే ఆత్మా వివక్షమాణోయంమన ప్రేరయతేదేహస్థం వహ్నిమాహంతి సజాతః ప్రాణాన్ప్రేరయతి మారుతమ్, పావకః ప్రేరితస్సోఽధ్రక్రమాదూర్ధ్వ మధశ్చరన్ నాభిహృత్కంఠ మూర్ధస్వప్రార్భవతిసధ్వనిః యోగ్ని సంయోగాత్తన్నాదోఽభిధీయతే- నకారం ప్రాణనామానం దకార మనలం విదుః చైతన్యం సర్వభూతానాం నిర్వృతిః భోగదాత్మనాం నాదబ్రహ్మ తదానంద మద్వితీయ ముపాస్మహే, అనాదినిధనం బ్రహ్మశబ్దతత్త్వం యదక్షరమ్ వివర్తతేఽర్థభావేన ప్రక్రియా జగతోయతః" సకలజగత్కారణమగు నాత్మ పలుకనిచ్ఛగించి మనస్సును బ్రేరేపింప మనస్సు జఠరాగ్ని నాయగ్ని ప్రాణవాయువు న్గదలింప నాదముపుట్టెను నకారము ప్రాణవాయువును దకార మగ్నిని దెలుపును గనుక ప్రాణాగ్నులనుండి నాదముపుట్టెను "చత్వారిశృంగాత్రయోఽస్యపాదాద్వేశీర్షే సప్తహస్తాసోఅస్య త్రిధాబద్ధోవృషభోరో

రవీతి మహోదేవోమర్త్యాన్ ఆవివేశ"- నిర్గుణమగు పరబ్రహ్మకు "తదైక్షత" అనునట్లు పలుక నిచ్ఛయొదవఁగా నాయిచ్ఛాశక్తి మహత్తత్త్వమును బ్రేరేప నామనస్సు జఠరాగ్నిం బ్రజ్వలింపఁగా నాయగ్ని గాలింబుట్టింపఁగా నాప్రాణవాయువు క్రమముగా నూర్ధ్వ ముఖమై నాభిహృదయకంఠముఖములనొరసి మనుష్యులకు వైఖరి యనుధ్వనిని బుట్టించెను ఈనాద మాహతమనియు ననాహతమనియు రెండు విధములు యోగులు మునులు మాత్ర మనాహతనాదమగు పరాపశ్యంతీమధ్యమాఖ్యలనెసఁగు ధ్వనిం గనిపెట్టఁగలరు ప్రాకృతు లగు మనుష్యులు కంఠనాదమునుమాత్రము పరికింపఁగలరు సమస్త భూతములకుం బ్రాణము సకలప్రాణుల కుల్లాసకరము నిత్యసత్య ముక్తబుద్ధస్వరూపమగు నీనాదబ్రహ్మమే యీసమస్తజగమును మఱియు సర్వజగత్కారణము నగుచున్నదని పరమయోగుల సిద్ధాంతము

నామము - ఆఖ్యాతము - ఉపసర్గ - నిపాతములను నాల్గువిధము లయినపదములు నాల్గుకొమ్ములు - భూతభవిష్యద్వర్తమానకాలములు మూఁడును పాదములు - అనాహతము - ఆహతము అను రెండు విధము యిన కార్యకారణరూపములై యనిత్యములగు వర్ణాత్మక ధ్వనియును కేవల శబ్దాత్మకనిత్యధ్వనియు ననురెండుతలలు - ఏడు విభక్తులను నేడుచేతులుంగలిగి - ఉరము కంఠము శిరస్సు లను మూఁడుస్థానముల గట్టఁబడి భక్తాభీష్టసంపదలను వర్షించుచు మర్త్యుల నావేశించి స్ఫోటాఖ్యమై నిత్యమై నిరవయవమైన శబ్దబ్రహ్మము యొక్క తేజస్సు స్వయంప్రకాశమానమై యలరుచున్నది కాఁబట్టి శబ్దబ్రహ్మము కకారాదిహల్లులతోఁగాని అకారము మొదలగు వచ్చు లతోఁగాని వ్రాఁతమూలముగానిమఱి గురుఉతుంతోఁగానిమఱి మనోవాక్కాయ కర్మములతోఁగాని వెల్లడింప నశక్యమైనప్పటికి

మునులు లోకోపకారమునకై యతీంద్రియశబ్దబ్రహ్మమును దేవునకు విగ్రహముగ్గల్పించినట్లు నాదబ్రహ్మమునకు వేదమునువిగ్రహమును గల్పించిరి శాఖాచంద్రన్యాయముగాఁ జంద్రుఁ డగపడినపిమ్మటనే శాఖనుబట్టి చంద్రుని జూచిన యాశాఖ మఱి నిష్ప్రయోజనముపేక్షణీయము ననావశ్యకము వ్యర్థము మఱి యున్నప్పటికి లేని వస్తువుతీరున నయిపోవునట్లు ఈఱి చక్రపునేర్పు సిద్ధించినమీఁద ఓనమాల గుణింతముల నభ్యాసము బొత్తిగా మానుకొన్నట్లు లోకోపకారకసత్ప్రవర్తనము కొనసాగినకొలందిని నాదబ్రహ్మముయొక్క బొమ్మలుగాఁజేయఁబడిన వేదవేదాంగముల యొక్క అ పరమభాగవతులకు మిద్దెయెక్కినవారికి నిచ్చెనతోఁ బనిలేనట్లు పుక్కిటిపురాణముల వేదవేదాంగశబ్దజాలముతో నవసరములేదు.

## తరణోపాయము

"నాలుగుకొమ్ములు మూఁడుకాళ్ళు రెండుతలలు ఏడుచేతులు గలిగి మూఁడుతెఱఁగుల గట్టఁబడిన మహాదేవుఁడని పేర్కొనఁబడిన యెద్దు మానిసుల పాలయినది" అట్టి యెద్దగ్ని యని పూర్వమీమాంసకుఁడును శబ్దమని వైయాకరణుఁడును బ్రతిపాదించిరి శృంగపాదశీర్షహస్తవృషభశబ్దముల యథేష్టార్థముఁ జెప్పుటయును జడములగు నగ్నిశబ్దములం జీవజంతువుగాఁ బ్రతిపాదించుటయును కవి గాని భ్రాంతుఁడుఁ గాని చేసినకల్పనముగని వాస్తవమగునా? అశరీరాత్మకు బొమ్మగట్టి యుపాసనాసౌలభ్యమునకై లోకోపకారపరాయణులు సర్వభూతదయాపరులై పరస్పరప్రేమానురాగములతో మనుష్యులన్యోన్యసౌఖ్యకారులై బ్రతుకుటకై స్వర్గనరకాద్యూర్ధ్వలోకములను బ్రాహ్మణక్షత్రియాదిజాతులును బ్రహ్మచర్యాద్యాశ్రమధర్మములను వివరించు వేదవేదాంగచోదితకర్మ

చారనిష్ఠసంప్రదాయవిశేషముల గల్పించినారు. బాహాటముగాఁ జాటిచెప్పకతీఱదు కదా ? కాఁబట్టి స్వార్థపరతమాని కేవల లోకోపకారముకొఱకై మాత్రమే బ్రతికెడుసజ్జనులపలుకులే వేదములు మఱి వారలనడువడియే వేదచోదితధర్మమని సిద్ధాంతీకరింపకతీఱదు. తాననుభవించినశబ్దస్పర్శరూపరసగంధములాత్మైకవేద్యములే గాని చతుర్విధాభినయములచేత నెట్లయినను వాస్తవముగానున్నతీరునఁదా విన్నధ్వని తాఁ గన్నరూపము తనకుఁ దాఁకినగాలి తాఁ దిన్నచవి తా మూర్కొనినతావిం బరులకుఁ దెల్ప నెవరికిం దరముగాక పోయినను శాఖాగ్రచంద్రవత్తుగాఁ బ్రత్యక్షాదిప్రమాణములచే వస్తుతత్త్వము న్గొంతవఱకు సూచింపవచ్చునని తెలిసినసర్వజ్ఞులగుమునులు పామరబోధకై వేదశాస్త్రములఁబన్ని వానివలన జనులకుఁ గ్రమక్రమముగా నోనమాలు గుణింత మభ్యసింపఁజేసి బాలురకు వాచకము పట్టించు బడిపంతులవలె ననాదికాలమునుండియును మునిఋష్యాచారపండిత నామములతో బాలురకు వస్తుతత్త్వజ్ఞానాభివృద్ధికై దేశకాలపాత్రానుసారముగాఁ జతుర్విధాభినయవిశేషములం బ్రకటించుచున్నారు ఆయభినయములే వేదవేదాంగాదిగ్రంథరూపకవాఙ్మయమును దేవాలయాదిదివ్యక్షేత్రములు వివిధయజ్ఞములు సమస్తశ్రౌతస్మార్తకర్మములు సకలచేష్టలును నానాజాతిమతాచారములు వివిధశిల్పములు మంత్రతంత్రయంత్రములు మఱియు జగమందలి మనుష్యులందున్న నానారూపవిశేషములన్నియును అన్నియును ఈలోకములోని నానాపదార్థములు జడములు చేతనములు జంగమస్థావర ప్రాణులు నానావిధకులములు జాతులు కర్మములాచారములు చేష్టలు వేయేల మనోవాక్కాయకర్మములు సశరీరాశరీరపదార్థములన్నియు ననాదిగా స్థూలసూక్ష్మవ్యక్తావ్యక్తదశలతో నానావిధములసృష్టిస్థితినాశములం బ్రతిక్షణము మాఱుచున్నవి జనులన్యోన్యద్వేషములతోఁ బర

స్వరముహానిచేసికొనుట యధికముగా వెల్లడించు కాలము కలికాలము. జనులు పరస్పరానురాగముతో సంతుష్టాంతరంగులుగానున్న సమయము కృతయుగము స్వభావముగా ఋతువులు మాఱుచున్న విధమున నొక్కొక్క సమయమునందు జనుల యాచారవ్యవహారము లొకొక్కతీరుగా నుండును కృతయుగము సకలజనాన్యోన్యప్రేమానురాగసంతోషములకుం బంటకాలము కలియుగము జనులకుం బరస్పరద్వేషమునొదవించు గొడ్డుకాలము సామదానోపాయములకంటె నిహాకరతరణోపాయములు మఱి లేవు మునువు లేనివస్తువుక్రొత్తగా నిపుడు కలుగుట కుం దేటికొమ్మువలెనసంభవము అత్యంతాభావపదార్థము కాలత్రయమందునత్యంతాభావమే వాస్తవమగుప్రతివస్తువునొక సహజపద్ధతి ననుసరించి యనుక్షణము నానారూపముల మాఱుచుండును చెవిచేతమాత్రము గ్రహింపవగినధ్వని ప్రతిక్షణ మెట్లు మాఱుచున్నను నయనేంద్రియగ్రాహ్య మెన్నఁడు గాకుంట సహజ వాస్తవపద్ధతి

## కాల్పనిక జగత్తు

సహజపద్ధతికి వ్యతిరేకముగా నెట్టివిద్వాంసుఁడునడువనేరఁడు చెవితో రూపమును మఱియుం గంటితో శబ్దమును బరికింప నెవరికిం దరముకానట్లు పంచేంద్రియబద్ధులైన ప్రాకృతమానవు లతీంద్రియద్రష్టలు భగవంతులగు గౌతమవ్యాసాదిమహర్షులు లోకోపకారార్థమై శాఖాచంద్రన్యాయముగా బోధించిన వేదశాస్త్రములయభిప్రాయమున వ్రాఁతపుస్తకముల మూఁగనంజ్ఞలచేతను మఱియును స్వార్థపరులై యింద్రియవివశులై యల్పజ్ఞులై తామున్నస్థితి మఱుఁగుపెట్టి కూటికొఱకుదంభవేషములతో "భూసురులము శ్రోత్రియులము దేవుఁడు మా కగపడుచున్నాఁడు మేము చదివినవియే వేదములు మేము

బోధించినవే శాస్త్రములివిగో యీపుస్తకము లీ ప్రాంతలీ గ్రంథములు బ్రహ్మవిరచితములు బ్రహ్మముఖమునుండి మేముమాత్ర మూడిపడి నాము మేము వేదశాస్త్రపుస్తకములుతిరుగవైచుచు మక్కుమూసి కొని యేమేమో మంత్రతంత్రములం బనిగొనియుందుము మేము నీటం బ్రత్యహము న్మమ్మాలు మునింగెద మితరుల స్పృశింపము మాదిమడినీరు మాదిమడియగ్ని మాదిమడిగాలి మేముమిక్కిలిపవిత్రు లము మామంత్రమహిమచే లోకము తల్క్రిందు చేయఁగలము మీకాఁకలిబాధ లేకుండఁ జేసెదము మీయింటిలోని తినుబడిపదా ర్థము మాయింట నుంచివేయుఁడు మేము పీఠాధికారులము మేము యతులము మిమ్ములను మేము దీవింతుము మాయాశీర్వాదమున కభీష్టసిద్ధియగును మేము పుణ్యాత్ములము శ్రోత్రియులము శిష్టాచార పరులము మాకులము పవిత్రము మాశరీరము పవిత్రముమాజన్మము పవిత్రముమావంట పవిత్రము మాకుండ పవిత్రము మాయూపిరి పవి త్రము మే మాడుమాట మే మొనర్చుకర్మము మా నడువడి యంత యును వేదచోదితధర్మమే" యని కనులు మిటకరించుచు నానావికా రములుగా జుట్లు బొట్లు కట్లు దాల్చి యాగములమిషతో వామా చారము నెపమున మద్యమాంసాశనులై పశువులం జంపుచుం బామ రుల బెదరించి ప్రయోగవేత్తలమనియు భూతవైద్యులమనియు తామొ నర్చు సకలకర్మములు వేదప్రోక్తములని సారకాయులు నలుపుచు వంచ కులై దంభవేషములతో నిద్రాహారవిహారసౌఖ్యమాసించిస్వకుటుంబ పోషణముకై తంటాలుపడు దుర్జనులతో నిండినకాలముకలియుగము తామనల్పినమంచి వేద పెట్టెలలోఁ బెట్టి యెవ్వరికైన నెఱుఁగనట్లు దాశముబిగించి మఱియును దముచేసినచెడుగునేరములకై బహిరంగ ముగా నేడ్చుచు తమయపరాధము లందఱియెదట నొప్పుకొనుచు స్వార్థపరతలేక సామదానములను రెండుపాయములచేతమాత్రమే

పరుల కుపకారమొనర్చి యొరులసుఖపెట్టి తాము సుఖపడుచున్నపటికి
మణివలె స్వచ్ఛమైన తమయంతరంగమును సర్వజనులకు న్వెల్లడి
రెయొనర్చుచు "మూఢుల మింద్రియవివశులము కించిజ్జ్ఞులము మావలన
నగుచున్న లోకోపకారకములగు మంచిపనులకు జగత్కారణమై
సర్వశక్తియై భక్తవత్సలుఁడైన దేవుఁడే మూలము మాచేయుచెడ్డ
పనులకు మాదుష్టచిత్తమే కారణమని" చాటుచు నిష్కపటులై సర్వ
భూతదయాపరులైన పరమభాగవతులు లోకమున నెందుకొన్న
కాలమే కృతయుగము కృతయుగమున లోకోపకారక వేదచోదిత
ధర్మము కేవలము జనులనడువడియందుమాత్రమే కలదుగాని వ్రాఁతల
లోను పుస్తకములలోను వాఙ్మయములో నెంతమాత్రమును లేదు
లేదు కలియుగమునందు లోకోపకారమగు వేదచోదితధర్మము
పుస్తకములలోను వ్రాఁతలలోను వాఙ్మయమందును మాత్రమేకలదు
గాని జనప్రవర్తనమం దెంతమాత్రము న్లేదు లేదు కాఁబట్టి జను
లకు భూతదయను స్వార్థత్యాగమును బరస్పరప్రేమానురాగములను
బుట్టింపనేరక లోకవంచనోపాయకముగామాత్రమే యున్నపుస్తక
ములు వ్రాఁతలు యథార్థముగా మునిదృష్టములు మునిప్రోక్తము
లయిన వేదశాస్త్రము లెంతమాత్రము న్గావు కావు- స్వార్థపరతను
మోసమును జనులకుం బరస్పరద్వేషకారణమతములను భూతహిం
సను బ్రతిపాదించుశబ్దములను వెల్లడించుగ్రంథములువ్రాఁతలుపుస్తక
ములు హింసాకరములు హత్యకేర్పడినయాయుధవిశేషములు గేవల
దుర్జనకల్పితములని సిద్ధాంతీకరింపక తీఱదు తీఱదు

"బ్రతుకు ప్రియంబగుఁ బ్రతిమనుష్యునకు బ్రతుకుకంటెఁ
బ్రియంబు పరువు శూరునకు" శూరుఁ డనఁగాఁ దనశరీరకష్టము
లెట్లున్నప్పటికి సకలలోకోపకారకమగు మర్యాదనొక్కింతయునతిక్ర
మించకున్నసజ్జనుఁడు తా నొనర్చుచున్న సకలలోకోపకారకపూ

సద్ధర్మప్రవర్తనస్వరూపమైన మర్యాదకు భంగమొదవినపుడుమఱల బ్రతుక
నొల్లని దృఢవ్రతుఁడే శూరుఁడనఁదగువాఁడు అనాదిగాఁ గృత
యుగమునుండి కలియుగము మొదలినకాలమునకుఁ గ్రమక్రమముగా
మందబుద్ధులనోళ్ళ బొత్తిగా నపస్వరమై "స్వరతోఽపరాధాత్" అను
నట్లు విపరీతార్థక ప్రాకృతాపరిశుద్ధశ్రోత్రియమ్మన్యుల హీనకంఠముల
వెలువడి మ్లేచ్ఛితములై భ్రష్టమైన వేదశబ్దము లు శ్రుతి మునులవలె
నతీంద్రియద్రష్టలగు ఋషు లుపదేశించిన యపౌరుషేయనిత్య వేదశబ్ద
ములు కానేరవని మన మ్మాటికి నొక్కి వక్కాణింపవచ్చును ఉదా
త్తాదిస్వరరూపకమద్ఘాతిస్వరజ్ఞానహీనులు "శ్రుతిర్మాతా లయః పితా"
అనునట్లు తలిదండ్రులు శుద్ధిలేని యరసికులు పశుమారణదారుణ
కర్ములు స్వార్థైకతత్పరులగు ధూర్తు వల్కులన్నాని వ్రాఁతలన్నాని య
పౌరుషేయనిత్యశ్రుతివాఙ్మయము వెలువడు నేని 'వి-ధ్య-ప్లవేత్తాగరో'
(నీటగుండ్లు మునుంగు బెండ్లు తేలును) కాఁబట్టియిపుడు పఠింపఁబడు
నవిగాని వ్రాయఁబడినవిగాని చేయఁబడినవిగాని వైదికశబ్దములును
గావు వేదాక్షరములు గావు కుతియు స్వేదచోదితకర్మములు గావు
కావు-ఇప్పటిశ్రోత్రియమ్మన్యులు ప్రచురించు వేదవేదాంగము లతీం
ద్రియద్రష్టలగు మును లుపదేశించిన యపౌరుషేయనిత్య వాఙ్మయము
కానేకాదు సఖ్యాక వేళ ఋగ్యజుస్సామాథర్వ వేదవేదాంగముల
పోలికగా నెండమావులోటివలె భ్రాంతమతికల్పితములయినప్పటికీ
వేదవేదాంగముల కీలోకవ్యవహారముసంబంధమెంతమాత్రము లేదు
వేదవేదాంగము లు కేవల పరమార్థబోధకములుగా "ఏకః శబ్దః సుష్ఠు
విజ్ఞాతః సాధుసంప్రయుక్తః స్వర్గేలోకే కామధుక్ భవతి" అనుట
చేతను శ్రుతిప్రకారము స్వరోచ్చారణ మొనర్చుట బ్రహ్మకైనఁ
దరము కాదనుటచేతను సుంతయు నీకూయ వేదవేదాంగములతో
నిప్పటిజనుల కవసరము లేదు లేదు "త్రకామ్" అనుచోఁ బ్లుతస్వర

మఱటఁ గాకితూఁతతోఁ బ్లుతస్వరము సరిపోలునఁట ఒక్కమాత్ర యుచ్చరించుకాలమెంతో రెండుమాత్ర లుచ్చరించుకాలమెంతో మఱి యారెండుమాత్రలఁ యుచ్చారణావకాశము విరామరూపమగు లయ యొట్టిదో మూఁడుమాత్రల బ్లుతస్వర మెట్లుండునో గానగతికులై తమలోఁదాము మేల్బళీ యనుకొనుచుందము బ్రవచనమే సరియైనదని యొండొరు న్మెచ్చుకొను "సంగీతమునకు నేను సౌందర్యమునకు మాయప్ప లొట్టియ" యని విఱ్ఱవీఁగు గార్దభమువలెఁ లోకులలోఁ దమజాతిశ్రేష్ఠత మ్మెచ్చుకొనుచుఁ దమతో సరిపడనిమనుష్యులు బహిష్కృతులు పామండులు మ్లేచ్ఛులు సంకరులు జాతిభ్రష్టులను తుంటరి శ్రోత్రియమ్మన్యుల నేమనవలయును? ఆకాశమునకు ముక్కోణములు శబ్దమునకు బ్రాలు వాస్తవము లగునా? పరమార్థమును మనుష్యులు సంపాదించుకొనుటకై తగినసాధనములగు వేదవేదాంగముల ననాదిగా నతీంద్రియద్రష్టలగు ఋషులు ధ్వాంత్రాంత మొదలగుసంజ్ఞలు మనో వాక్కాయకర్మములచే సంసారము దరించుటకై నానావిధశబ్దవిశేష ములులిపులు మఱియుం బంచేంద్రియగ్రాహ్యములగు నానావిధసంజ్ఞా రూపములను సకలజనోపకారపరాయణులై దేశకాలపాత్రాను సారము వివిధపద్ధతుల నేర్పర్చిరి వేదవేదాంగములను లోకవ్యవహార మునకు సాధ్యమయినంతమట్టు కుపయోగించురీతిం గేవల ధ్వన్యాత్మక మగు శ్రుతిస్వరజాతిగ్రామమూర్ఛనావిశేషము లను దరించుటకొఱకును కకారాదిహల్లుల నకారాద్యచ్చులను గలపదవాక్యములను నానావిధ లిపివిశేషములను శరీరావయవచాలనాభినయకర్మవిశేషములను నానా విధకార్యసాధకయంత్రతంత్రవిశేషములను దేశకాలపాత్రానుసార ముగాఁ జతుర్విధాభినయము లుపదేశించిరి

## ఆప్తవాక్యప్రమాణస్థితి

కొందఱుమనుష్యు లన్యోన్యముం దమయూహఁ దెల్పుకొను ధ్వనులుగాని శరీరావయవచాలనసంజ్ఞావిశేషములుగాని మఱేచేష లయినఁగాని శబ్దమూలముగాఁగాని వ్రాఁతమూలముగాఁగాని మఱే సంజ్ఞలచేతనైనఁగాని మునీశ్వరులుకూడ సర్వజనవేద్యములుగాఁ గావించ నసాధ్యములయి యున్నవి పరాపశ్యన్తీమధ్యమము లను నాదశబ్ద విశేషములు యోగిమాత్రైక వేద్యములు, మనుష్యులు తమలోఁదా మన్యోన్యోహలం దెల్పుకొనుటకై తమకంఠస్వరూపక వైఖరీనామశబ్దముమాత్రమే తఱుచుగా మఱియు హస్తాద్యవయవ సంతాడనాదిశబ్ద మఱుదుగాను స్వరవ్యంజన లిపివిశేషములతోఁ దఱుచుగాను మఱి యాంగికాహార్యసాత్త్వికాభినయములచేనరుదుగా దేశకాలపాత్రానుసారముగానుపయోగించుకొనుచున్నారు కేవలపర మార్థసంపాదనైకసాధనములగు వేదవేదాంగములుమాత్రమే యుప యోగించునపుడు మున్యుపదిష్టపద్ధతు లుపయోగించుకొనకతీఱదు కాని యీలోకవ్యవహారమునకు జనులన్యోన్యము తెలిసికొనఁదగిన శబ్దము లిపి మొదలగుచతుర్విధాభినయవిశేషములు దేశకాలపాత్రో చితముగా సకలజనరంజకము యథేష్టముగా నుపయోగించుకొనక తీఱదు వేదవేదాంగములు కేవలపరమార్థసంపాదనైక సాధనములు గనుక జనులు మును లేర్పర్చిన పద్ధతుల ప్రకారము వేదములు పఠించుటయందును మఱియును వేదచోదితశ్రౌతస్మార్తకర్మము లాచరించుటయందు నడువకతీఱదు సర్వభూతదయాపరుఁడును స్వార్థ త్యాగియు సర్వలోకోపకారవ్రతదీక్షితుఁడు నగుపరమభాగవతుఁడు మాత్రమే వేదములు పఠించుటకుఁగాని శ్రౌతకర్మము లాచరించుటకుఁ గాని యధికారి కాఁగలఁడు పునాది దిట్టములేక గోడ నిలువనట్లు

స్వార్థపరతమాని కేవల లోకోపకారకముగాఁ బ్రవర్తింపఁజాలని కామక్రోధలోభమోహమదమత్సరగ్రస్తుఁడగు ధూర్తుచేయు వేదపాఠము శ్రౌతకర్మ కూలిధ్వంసము నగుటకు దోడులోకహానింగూడఁ జేయుకమానవుమానవు అనాదికాలమునుండియు నిదివఱకు మూఁడు లోకములలో గడించిచూడఁగా నాప్తవాక్య ప్రమాణముచేత మాత్రమే పేర్కొనఁదగిన పరమభాగవతులు పదునాల్గురు తేలిరి అనఁగా దేహధారులలో స్వార్థపరత లేక కేవలలోకోపకారముకొఱకు మాత్రమే బ్రతుకుజీవులసంఖ్య పరార్థసంఖ్యలోఁ బరార్థస ఖ్యాకాంశమని యూహించవలెను అదు సద్బోధ చేయఁగాఁ జేయఁగాఁ గొందఱైనం దరించరా యని పరమకారుణికులైన మునులు వేదవేదాంగములనాదిగా స్థూలసూక్ష్మకారణదేహధారుల కనాదికాలమునుండి దేశకాలపాత్రానుసారము బోధించుచు రాఁగా నిప్పటికి వామదేవాదులు బ్రాహ్మణులలో జనకాదులు క్షత్రియులలో విదురాదులు వైశ్యశూద్రులలో ధర్మవ్యాధాదులు మ్లేచ్ఛులలో హనుమదాదులు మృగములలో శుకోలూకాదులు పక్షులలో నజగరాదులుపరీసృపములలో మిక్కిలి పరిమితసంఖ్యాకులు లాప్తవాక్యప్రమాణైకవేద్యులయిరి అశరీరులు మనలు బోధైకస్వరూపులు సూర్యాదిగ్రహములు నక్షత్రాదిఖగోళములు సముద్రపర్వతనానా జడచేతనాత్మకమగు భూగోళము మఱి యింద్రియగ్రాహ్యమగు సమస్తజగమును క్రమక్రమముగాఁ బ్రళయకాలమున నాకాశమునఁ బరమాణురూపముగా లయముచెందుచు భగవత్స కల్పమున మొదట వాయురూపముగాను బిదప నగ్నిరూపముగా నపల జలస్వరూపముగాను దుట్టతుదకు భూమిగాను బొడచూపుచుండును శబ్దబ్రహ్మ మాకాశమను నుపాధితో సచ్చిదానందలక్షణమై శాశ్వతమై యున్నది ఆకాశమునకుఁగాని యాయాకాశోపాధితోనున్న చైతన్యస్వరూపకమగు నాద

బ్రహ్మమునకుఁగాని యుత్పత్తిస్థితినాశము లెన్నఁడును లేవు చైతన్యాత్మకమగునాదబ్రహ్మమేయీసర్వజగత్కార్యమునకుఁ గారణము నాదబ్రహ్మమేయీజగద్రూపముగా నాకాశోపాధియం దద్దమందు కొండవలెఁ బ్రతిబింబించుచున్నది

## వ్యక్తావ్యక్తజగత్సృష్టి

అద్దము కొండయొక్క వాస్తవస్థితి నగకర్చలేకున్నప్పటి కాకొండ యనువస్తువొకటి యున్నట్లు సూచనచేయఁగలిగినట్లు మనోరూపకమగు నాకాశము తనయందు జగద్రూపముగాఁ బ్రతిబింబించుచున్న చైతన్యాత్మకమగు నాదబ్రహ్మ మనువస్తువొకటి సచ్చిదానందలక్షణమై యున్న దని మాత్రము సూచించుచున్నది ఆనాదబ్రహ్మమే చైతన్యరూపమై పంచభూతములందు నెట్లగఁ గాలిచినయినుపగుండునం దగ్నివలె నంతటనాకాశము నందుసూక్ష్మావ్యక్తనిత్యకారణరూపముగాను మఱియును వాయ్వగ్నిజల పృథ్వులందు స్థూలవ్యక్తనిత్యకార్యరూపముగాను వ్యాపించి యున్నది "అతతివ్యాప్నోతీత్యాత్మా" అంతటను వ్యాపించుటచేత నాత్మయని సంజ్ఞతో నున్నది వాయ్వగ్నిజలపృథివీ పరమాణువుల పరస్పర సంయోగవిశేషముచేతనీజగత్సృష్టిస్థితులను మఱియాపరమాణువుల పరస్పరవియోగవిశేషముచేత నాకాశమందు నానావిధప్రళయ స్వరూపకనాశమును బొందుచున్నది వాయు వగ్నిగా నగ్నిజలముగా జలము భూమిగా నేర్పడుచున్నకొలఁది చైతన్యాత్మకనాదబ్రహ్మము సత్త్వరజస్తమములను మూఁడుగుణములచే నానావిధముగా మాఱుచున్న వాయ్వగ్నిజలపృథివ్యాత్మకశరీరములందుఁ గదలాడుచున్న జలమందలి సూర్యబింబము వలెఁ జలించుచున్న ట్లగపడుచున్నది వాయువు వగ్నిగా నగ్ని జలముగా జలము పృథివిగా మాఱుచున్న

కొలఁది చైతన్యము త్రిగుణాత్మకభూతోపాధుల పుంస్త్రీనపుంలింగ విశేషాకారములతో మాయోపాధియనఁబడిన పంచభూత పరస్పర సంయోగవియోగవిశేషములందుఁ బ్రతిబింబించుచున్నది చైతన్యాత్మకమగు నాదబ్రహ్మమే శివుఁడు త్రిగుణాత్మకమగు మాయా స్వరూపకాకాశమే శక్తి కాఁబట్టియే 'శివశక్త్యాత్మకం జగత్" అని ప్రతిపాదింపఁబడెను సూర్యకిరణముచేతఁ దప్తమగుచున్న నీటిబొట్టునందును మఱి యింటికొప్పుదొలకనుండి నట్టింటఁజొచ్చిన సూర్యకిరణ మందు ననేకాణువులు చలించురీతిని పంచభూతాత్మకమగుభూమి జలమునుండి పొడచూపినతోడనే త్రిగుణమయపాంచభౌతికశరీరములతో పుంనపుంస్త్రీలింగవిశేషాకారములతో మిగుల సూక్ష్మములయినక్రిముల లోఁదవి నానారూపముల జననస్థితినాశములందుచుండును శివశక్తులిరువురుత్పత్తిస్థితినాశములులేని జగత్కారణములు శివశక్తిసంజ్ఞ కాత్మాకాశాన్యోన్యసంపర్కము ననీపంచభూతాత్మకజగత్సృష్టిస్థితినాశము లగుచుండును జలము భూమిగా మారుచున్నకొలఁదిం బంచభూతాత్మకశరీరోపాధివిశేషములన్నియును నానావిధజంగమస్థావరాత్మక జంతుజాలముగా నుద్భవస్థితినాశములందుచున్నవి త్రిగుణాత్మకపాంచభౌతికశరీరములన్నియును పుట్టుటకుం బెరఁగుటకును మఱియుం దపయందే లీనమగుటకు చైతన్యాత్మకశివశక్తులే మూలకారణము ఆత్మాకాశములస్వరూపులగు శివశక్తులకు నిక్కముగా నగ్నికి నేఁడికి వస్తుభేదములేనట్లు "గుణగుణినోః శక్తిశక్తిమతోరభేదాత్" అనునట్లు భేద మెంతమాత్రమును లేనేలేదు ఉపాసనాసౌలభ్యమునకై యీజగత్తునకు నారాయణుఁడు భిన్నుఁడనిమాత్రమే చెప్పఁబడెనుగాని "ఆత్మైవేదగ్ంసర్వమ్" అనుతీరున శివశక్త్యాత్మకమగు నాదబ్రహ్మమే యీసమస్తజగత్తను సిద్ధాంతమే సర్వమునిసమ్మతము జలము భూమిగా మాఱుచున్న కొలఁదిం బాంచభౌతికత్రిగుణమయోపాధులతో పుంనపుంస్త్రీ

విశేషాకారములతో నెనుబదినాలుగులక్షలజీవరాసులు భూతత్త్వమును బట్టి స్వకర్మానుసారముగా కీటకపక్షిమృగమనుష్యాదినానాజంతువులై భూగోళమునందు కొన్నిచోట్ల స్త్రీపుంనపుంరూపములతోఁ బెరిఁగిన కొలందిం బరస్పరసంకర్షణసంయోగవిశేషముచేత మఱ్ఱిచెట్టునుండి దిగినయూడలు చెట్లుగాఁ బరిణమించుచు శతయోజనపరిమితమగు నడవియంతయును వటవృక్షమయము కావించునట్లు మొట్టమొదట నెవరిమట్టుకువారు స్వతంత్రము సహజముగా వేఱువేఱుగాఁ గ్రిమి రూపములనుండి మనుష్యాకారములఁ బరిణమించిన స్త్రీలు పురుషులుం బరస్పరసంయోగముచేత మఱ్ఱిచెట్టుడించినయూడలు మఱ్ఱిచెట్లయి తాము తిరిగి చెట్లుగాఁ బరిణమించఁదగిన యూడలం బెట్టుచందమున శివశక్తులు వేఱువేఱుగానుండియు పరస్పరసంపర్క-మహిమముచే జగమునుబన్నురీతిని మొట్టమొదట వేఱువేఱుగ భూమిపై స్త్రీపుందేహవిశేషములతో యౌవనమునకుఁ బెరిఁగిన స్త్రీలుం బురుషు లన్యోన్యసంయోగముచేతఁ దమతమజాతుల న్విస్తరింపించుచుండిరి శివశక్తు లుభయు లనాదులయినవిధముగా స్త్రీపురుషాకృతుల నొప్పారు నెనుబదినాల్గులక్షలజంతుకోట్లనాదులే-జంగమస్థావరాత్మకజీవులలో సగముసంఖ్య స్థావరజీవజాతులు తక్కిన సంఖ్య కీటపక్షిపశుమనుష్యజీవజాతులును. జలము భూమిగా మొట్ట మొదట నెపుడు పరిణమించెనో యపుడే యీయెనుబదినాల్గులక్షలజీవ రాసులును భూమిలో సూర్యకిరణమందు త్రసరేణువులవలె మిలమిల నాడుచుం గ్రిమిరూపముల స్త్రీపురుషవిశేషాకారములతోఁ బాంచ భౌతికోపాధినాశ్రయించి త్రిగుణవిశిష్టములై స్వభావముగాఁబుట్టి బాల్యమునఁ గ్రీడించుచు యౌవనమునం బరస్పరసంయోగవిశేష ముచేఁ బిల్లలం గని పెంచుచుం బరస్పరప్రేమానురాగవిశేషములతోఁ గాలముం బుచ్చుచుంట సహజము. కాఁబట్టి ఉపాసనాసౌలభ్యమునకై

యాత్మకాశశివశక్తులకు భేదముచెప్పఁబడినట్లు బీజవృక్షములకును మఱ్ఱిచెట్టు మఱ్ఱియూడలకు భేదము చూపింపఁబడినతీరుగా స్త్రీపుం నపుంవిశేషాత్మశరీరభేదము లగపర్చఁబడినవి

ఆఁడుప్రాణమునకు మగప్రాణమునకు భేదములేని తెలుగున స్త్రీవ్యక్తికిం బురుషవ్యక్తికి భేదముమఱ్ఱిచెట్టునకు మఱ్ఱియూడకువలెఁ జెప్పఁబడెను దేహస్మృతియే యీనానాత్మకజగద్వస్తువిశేషభేదజ్ఞానమునకు మూలము మఱియు దేహవిస్మృతియే యద్వైతజ్ఞానమునకుం గారణము సముద్రతరంగప్రవృత్తినివృత్తులవలె నీదేహస్మృతి విస్మృతులవంశమున జగత్సృష్టిస్థితిలయాద్యంతములు కర్మానుసారముగా జీవికోట్లచే ననుభవింపఁబడుచున్నవి సృష్టిస్థితినాశములన్యోన్యకారణములుం బరస్పరస్వరూపభేదములుకావునస్మృతిచేతదుఃఖమయ సంసారమును విస్మృతిచేత నానందమయమోక్షమును జీవుఁ డనుభవించుచున్నాఁడు ఈస్మృతివిస్మృతులు రాత్రిందివములవలెనన్యోన్యాశ్రయములు లాదిమధ్యాంతరహితములై సంసారచక్రమున జీవునిం బరిభ్రమింపఁజేయుచుండును కాఁబట్టి జీవునకు స్మృతిరూపకబంధముగాని విస్మృతిరూపకమోక్షముగాని నిత్యములు కావు- శివశక్తులుభయులు తప్ప శివశక్తి పరస్పరసంపర్కవశమునఁ గలిగినస్మృతి విస్మృత్యాత్మకత్రిగుణమయులగుజీవులకు సుఖదుఃఖాత్మకానిత్యస్మృతి విస్మృతిరూపకబంధమోక్షాత్మక సంసారానుభవము క్లేశము వలె నాశివశక్తుల కటాక్షముచేఁగాని తప్పదు తప్పదు- "ఇతిమతిరుపకల్పితావితృష్ణాభగవతిసాత్వతపుంగవేవిభూమ్ని" ఇట్లు సచ్చిదానందలక్షణశివశక్త్యాత్మకపరబ్రహ్మమునం దుద్భవస్థితినాశకారణ త్రిగుణాత్మకబుద్ధిలీల కల్పించఁబడెను- అను భాగవతోక్తి చొప్పునఁ బాంచభౌతిక పదార్థమయజగదుద్భవస్థితినాశస్వరూపప్రవృత్తి నివృత్తులు భగవత్సంకల్పమాత్రమూలములని సిద్ధాంతీకరింపఁబడెను సూదంటు

కాయి సూదులవలె స్త్రీవ్యక్తి పురుషవ్యక్తులు పరస్పరసమాకర్ష
ణము లొనర్చుకొనుట సహజగుణము మఱియును యౌవనముననున్న
స్త్రీపురుషుల యన్యోన్యసంసర్గమున స్త్రీవ్యక్తి గర్భముధరించి
శుక్లాధిక్యమునఁ బురుషుని శోణితముయొక్క యాధిక్యమున స్త్రీశిశువును
నియతము నేజాతిజంతు వాజాతిశరీరమును మఱ్ఱిపిఁజ మఱ్ఱిమొక్కను
వలె స్వభావముగ మొలపించును బీజము సూక్ష్మదశ చెట్టు స్థూలదశ
యయినట్లు శుక్లశోణితాత్మకబీజము సూక్ష్మశరీరము పంచభూత
సమ్మేళనవిశేషదోహదముచే స్థూలశరీరముగాఁ బెరిఁగి పెరిఁగి క్రమక్రమ
ముగా వార్ధకదశను పాటవము తగ్గిక్షీణించి పంచభూతములలో లయ
మగును చైతన్యాత్మకమై కేవలాకాశోపాధికమగు జీవాత్మ కుబుస
ములు విడుచుచుండు పామువలె నానాశరీరములెడయుచు స్వకర్మాను
సారముగఁ దిర్యగ్మనుష్యదేవతాశరీరోపాధులందాల్చుచు స్వర్గనర
కాది నానాలోకసుఖదుఃఖములెడ లేకనుభవించుచుండును "ఈశ్వ
రానుగ్రహాదేవపుంసామద్వైతవాసనా" అనునట్లు భగవదనుగ్రహము
సంపాదించుకొన్నజీవుఁడు శివశక్త్యాత్మకమగు పరబ్రహ్మమందైక్యమై
సంసారబంధమునఁ దగులక ముక్తిఁ జెందును ఈశ్వరానుగ్రహము
కేవలము పురుషప్రయత్నముచేత నేసమకూరును స్వార్థత్యాగియై కేవల
లోకోపకారముకొఱకుమాత్రమే బ్రతుకుచు సర్వభూతదయాపరుఁడై
సర్వజనసముఁడైన పరమభాగవతుఁడుమాత్రమే దైవానుగ్రహముం
బొంది భగవంతునిలో లయముచెంది సంసారబంధము ఖండివిముక్తుఁడై
సచ్చిదానందలక్షణుఁడై పరమపదముం బ్రాపించును జలము
సూర్యకిరణములచేత నింకినకొలఁదిని జలమునందు గలిసిన పృథ్వీ
పరమాణువు లొండొంటఁ జేరుకొని కాలక్రమమున నామన్నండి
దిబ్బదిబ్బలుగా నేర్పడుచున్న కొలందిని పంచభూతముల పరస్పర
సంయోగవిశేషముల నిర్మాపించు నానావిధశరీరోపాధులందు శివశక్త్యా

త్మకమగు చేతనశక్తి వ్యాపించినకొలంది సచేతనములైన నానావిధా
నంతసంఖ్యాకసూక్ష్మోపాధులం దాయుపాధులకుం దగున ట్లనాది
స్వకర్మబద్ధుండై శివశక్తులపరస్పరాకర్షణమూలమున భ్రాంతిబుద్ధితో
నిత్యుండైన జీవాత్ముండు చేతనోపాధి నాశ్రయించి యాపాంచభౌతిక
బీజరూపకసూక్ష్మజడప్రకృతిదేహమున మెలంగుచు స్వకర్మఫల మను
భవించుచు ననాద్యంతసంసారచక్రమునం బరిభ్రమించుచుండును
అనంతసంఖ్యాకములై స్త్రీపుంనపుంలింగవిశేషభిన్నాకారములతోం
సూక్ష్మపాంచభౌతిక నానావిధదేహముల నుద్భవస్థితినాశములంబట్టి
నిర్లిప్తుండయ్యును జీవాత్ముండు స్వకర్మదృఢవాసనావశమునసుఘుణుని
వలె సుఖదుఃఖాత్మకసంసారమునం బరిభ్రమించుచుండును వాస్తవ
ముగా చైతన్యస్వరూపుండగు జీవుండు శివశక్తుల ప్రతిబింబమే కనుక
నీళ్ళ నంటక నీటం బ్రతిబింబించుసూర్యునివలె నిర్లిప్తుండయ్యును
శివశక్తులసంపర్కవశమున శివశక్తులప్రతిబింబస్వరూపుండగుటచేత
నీజీవుండు త్రిగుణమయుండై భ్రాంతునివలె విపరీతదృష్టిచేతం దనకు
వాస్తవముగలేని జననమరణాదివికారాత్మకసంసార మనుభవించు
చున్నాండు జడచేతనాత్మకములమిక్కిలి సూక్ష్మాణువులుగాసూర్య
కిరణమందలి త్రసరేణువులవలె పృథివియందంతట మిలమిలలాడు
చున్నక్రిములు కాలక్రమమున స్థూలములై వ్యక్తావయవములతో
వయసునకువచ్చి పరస్పరసమావేశపరిచయసహవాసముతో నొండొరు
లతో నీస్త్రీపుంవ్యక్తులు కలసిమెలసి యున్నకొలంది నాయాజాతి
సంతానము లాయానామరూపవిశేషము లాయాచతుర్విధాభినయము
లనాదిగా నాయాసంసారజీవనప్రవృత్తినివృత్తుల ననుసరించి సృష్టిస్థితి
నాశము లందుచున్నవి కాంబట్టి జడచేతనాత్మకమును జంగమస్థావ
రాత్మకమగు నీజగత్సృష్టినాశములకుం గారణము శివశక్తిసంపర్క
మహిమమున శివశక్తిప్రతిబింబరూపమై త్రిగుణాత్మకమైవ్యక్తావ్యక్త

దశల పొడచూపు చడంగుచున్న శరీరస్మృతియే కాఁబట్టి యీవ్యక్తా వ్యక్తజగత్సృష్టినాశ విశేషములన్నియు శివశక్తిసంపర్కము నందు శివశక్తిప్రతిబింబస్వరూపమైన స్మృతియందు స్మృతియొక్క విపరీత ప్రతిబింబాకారములైన వ్యావహారిక సత్యములేగాని నిక్కముగాఁ బరమార్థసత్యము లెంతమాత్రమును కావని యూహగల ప్రతి మనుష్యుఁడును దన జాగ్రత్స్వప్నసుషుప్తులంబట్టి ప్రత్యక్షానుభవము కలిగియుంట సర్వజనవిదితమే కదా? సరియే యీస్వానుభవమిట్లుండనీ నిద్రాహారవిహారసౌఖ్యసమృద్ధికై దేవులాడుచు నహంకారమమకార బద్ధుఁడై యనంతవిశేషజగత్తునందు వ్యవహరించుచున్న మనుష్యుఁడు తనమనస్సంతుష్టికై కదా తంటాలు పడుచున్నాఁడు? ఒకప్పు డాఁకలి బాధపొంది యాయాఁకలిని శాంతింపజేయు నన్న మనుభవించి సంతుష్టిచెందినవాఁడు తిరిగి యాఁకలిబాధపొందినపు డన్నమును సంపాదించుకొని తనయాఁకలిని శాంతింపఁజేసికొని సంతుష్టిసంపద ననుభవించుటకై ప్రయత్నించుచుండును మఱియు నిట్టిజాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు నిద్రాహారవిహారసుఖవాంఛకుఁగాని ప్రవృత్తినివృ త్తులు క్షణభంగురము లనిత్యములు మఱి చక్రసంఖ్యాగుణనమువలె నాదిమధ్యాంతశూన్యమగుటచేత నీదేహస్మృతివిస్మృతుల ప్రవృత్తి నివృత్తిరూపకమగు జననమరణాత్మకసంసారమున కొక మొదలుగాని తుదగాని నిర్ణయింపవీలుకాకుంటచే "మర్త్యేతిష్ఠతిమాధవః" అనున ట్లీమనుష్యులు మధ్యమలోకమగు భూమియందు బుట్టి తుద మొదళ్ళు తెలియరాని సంసారదశామధ్యమున మధ్యమబుద్ధులయియుంటచేత రాగద్వేషములకు మధ్య వ్యవహరించుచున్నారు ఈచైతన్యము శివశక్తి పరస్పరసంపర్కమహిమమున నొదవినశివశక్తుల ప్రతిబింబము గాని వాస్తవము కాదు, మఱి యీజగము చైతన్యాత్మకత్రిగుణమయ స్వప్నజాగరసుషుప్త్యవస్థావిశేషమునొదవినచైతన్యప్రతిబింబముగాని

వాస్తవము కాదు. ఇంతకు గౌతమవ్యాసాద్యాప్తప్రవచనప్రమాణ మునఁ దేలిన ఫలితము శివశక్త్యాత్మకనిర్గుణబ్రహ్మముకన్న వాస్తవ పదార్థమింకెద్దియు న్గాదని తేలిన ఫలితము. కాఁబట్టి "వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః" అను భగవద్వాక్యానుసార ముగాఁ బరమభాగవతుఁ డహంకారమమకారములఁ దొలంగి స్వార్థ త్యాగియై సర్వభూతదయామయుఁడై సర్వలోకోపకారముగా సంచ రించుచు స్వప్నప్రపంచమువలె జాగ్రత్ప్రపంచముఁ గూడ మిథ్యయని నిగూఢజ్ఞానముతో నిత్యసంతుష్టుఁడై నిర్గుణవాసుదేవ పరబ్రహ్మ సాయుజ్యముక్తిస్వరూపక నిత్యానందపదవిం జూఱకొనుచున్నాఁడు. లోకవ్యవహారజ్ఞానసంపాదన సౌకర్యసౌలభ్యములకై ప్రాగదిదిగ్వి భాగములు దినమాసాదికాలవిభాగములు ధ్వనివర్ణాదిశబ్దవిభాగములు మొదలగు ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయాభావాత్మక సప్త పదార్థవస్తుబోధకన్యాయవైశేషికాదర్శనముల నతీంద్రియద్రష్టలగు మహామునులు కేవల లోకోపకారపరాయణులై కల్పించి యాశాస్త్ర జ్ఞానమునఁ బరమార్థజ్ఞానము సంపాదించుకొఁ డని ప్రాకృతులు విపరీతబుద్ధులు భ్రాంతచిత్తులు ప్రకృతివిమూఢులగుమనుష్యులకనాది కాలమునుండియుం జతుర్విధాభినయవిశేషములం బోధించుచు నక్షత్ర స్వరూపులై మింటం బ్రత్యక్షముగఁ గన్పట్టుచున్నారు.

## సత్యవాక్పంయమము

జాగ్రద్దశయందు విశ్వసంజ్ఞయు స్వప్నదశయందు తైజససంజ్ఞ యును సుషుప్తిదశయందుఁ బ్రాజ్ఞసంజ్ఞయుఁగల యువిద్యోపాధిం బరఁగుజీవుఁడు స్వప్నజాగరములందనేకనామరూపాత్మకముగాను మఱి సుషుప్తియందుఁ గేవల శూన్యముగాను నీజగముం బరికించుచుండును. మనస్సంకల్పముకన్న నీజగదుద్భవస్థితినాశములకు వేఱేకారణ మెద్ది యును లేదను బ్రహ్మసూత్రములకు జగద్గురుని శారీరకభాష్యముకన్న

నితరసిద్ధాంతము లెవ్వియును యుక్తియుక్తములు కావు కావు కాఁబట్టి
సృష్టిస్థితినాశములం దోఁచు నీజగత్కార్యములన్నియును అవ్యక్త
సూక్ష్మకారణశక్తియుం ద్రిపురసుందరియుం ద్రిభువనజననియు శ్రీరాజ
రాజేశ్వరీ బాలా లీలావిశేషము లని సిద్ధాంతీకరించి యాజగజ్జనని
దయాస్వరూపిణి గనుక పరమభాగవతుఁడు సర్వభూతదయాపరుఁ
డగుచుం దనయహింసావ్రతము న్గొనసాగించుమని నిరంతర మాబాలా
త్రిపురసుందరీ కనకదుర్గాపదాంబుజ భక్తిధ్యానామృతపాన వివశుఁ
డగుచు సంసారాంబుధి నొక్కఁడుగున దాఁటుచున్నాఁడు పృథివితోనే
పృథివియం దుద్భవస్థితినాశములందు నానావిధప్రాణులలో స్త్రీపురుష
మిథునము లన్యోన్యబోధకై నానాఁట నలవాటున నేర్పర్చుకొను
చున్న చతుర్విధాభినయవిధానములు దేశకాలపాత్రానుసారముగా
ననేకరూపముల మాఱుచు వ్యవహరింపఁబడుచుండ ను నానాజనుల
కంఠనాళమై చిత్రింబట్టి యొక్క సూర్యకిరణమే దేశకాలపాత్రాను
సారము నానావిధ తీవ్ర మందతత్త్వవిశేషముల బరఁగున ట్లొక
ధ్వనియే నానావిధ స్వరవ్యంజనపదవాక్యార్థవిశేషముల వెలయుచుం
డును ఆయును స్వర మొకపుడు ప్రాకృతము గను మఱొకపుడు సంస్కృత
ముగను మఱొక్కెడ వివృతసంవృతవిభిన్నము గనుచ్చరింపఁబడును వేదము
శాఖాగ్రచంద్రన్యాయముగా వేదయథార్థస్థితిని సూచించును చంద్ర
ప్రతినిధి కావింపఁబడి శాఖాగ్రము చంద్రుడు కానట్లు శబ్దబ్రహ్మము ను
సూచించుటకై యేర్పర్చిన శబ్దబ్రహ్మప్రతినిధిగాని యపౌరుషేయ
నిత్యశబ్దబ్రహ్మ మెంతమాత్రము న్గాదు కాదు దేవతోపాసనా
సౌలభ్యమునకై దేవతావిగ్రహము ప్రాకృతమనుష్యశిల్పికల్పితము
లయినవిధమున "అగ్నిమీళే పురోహితమ్" అను వేదశబ్దము పర
మార్థబోధకముగు కవి కల్పించిన వ్యావహారికవాక్య మనకతీతదృష్ట
శబ్దము వలె శబ్దమున కేర్పర్చినగుణుతు ప్రాఁత యశఁగా "రమ్మా"

యను నర్థబోధకమైన శబ్దము విన్నపుడు రమ్మా యను నర్థమా సరస
ముగా విన్కిచేత బోధితమైన చందమున రమ్మా యనుశబ్దముయొక్క
యర్థమును దెల్పుటకై వ్రాసిన ర-మ్మా యను రెండక్షరముల
వ్రాఁతను గంటిచూపునఁ దెలిసికొనునప్పుడు బోధితము కానేరదు
పరసముద్దేశించి రమ్మా యను శబ్ద ముచ్చరింపఁబడెనో యాసార
స్యము శ్రవణేంద్రియైకగ్రాహ్యమే యొట్టివిరం గని వినినప్పుడు కన్న
నారంగు కంటఁజూచినపుడు మిక్కిలిసరసముగా బోధకడునుగదా ?
కాఁబట్టి శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్తములు శబ్దలక్షణ మెఱింగించు
టకై శబ్దస్వరూపముగా నుపదేశింపఁబడి విని గ్రహించినపుడే వేద
వేదాంగశబ్దముల యర్థము సరసముగా బోధపడునుగాని కృత్రిమలిపి
చేత స్వరవ్యంజనముల గ్రంథములపుస్తకములు కంటితోఁజూచి యివే
మునులుచ్చరించిన వేదవేదాంగశబ్దములని వ్రాఁతగుఱుతుపుస్తక
ములం బఠించుచు మునులుచ్చరించినట్లే తాముగూడ వేదవేదాంగ
శబ్దములం దత్తదుచితరసాత్మకముగా నుచ్చరించుచున్నా మనువైదిక
మ్మన్యులగు తెలిసీతెలియని మనుష్యులయవివేకము దైవముచేతఁదప్ప
మఱెట్లయినను మాన్పశక్యముకాదు ఎండెముకను నములుకుక్క తన
దౌడల న్వచ్చు నెత్తుఱు నెమ్ములనుండి వచ్చుచున్నదని యాస్వాదించు
నట్లు గ్రంథముల లిఖితరూపముగా నున్న వేదవేదాంగ వాఙ్మయము
కేవల పౌరుషేయము కృత్రిమ మనిత్యము నిరర్థకమని తెలియనివైదిక
జడులు తాము వృథాశ్రమపడి చెడి యొరులన్గూడఁ జెఱచుచు చచ్చి
చావిట్లుందురని చెప్పుచున్నా నామాటనమ్ముకొండను భ్రాంతుని
వలె నతీంద్రియద్రష్టలగు మునులుయోగులకుమాత్రమే వేద్యమగున
ట్లుచ్చరించిన వేదవేదాంగవాఙ్మయమును తాము స్వయముగా విన్న
కన్న పెక్కువదార్ఢ్యముగా నమ్ముకొని యడ్డదిడ్డముగా బీఱపీచువలె
చిక్కుగా లిఖింపఁబడిన గ్రంథసందర్భముతోఁ గూర్చబడిన తిలకాష్ఠ

మహిమబంధనామకపుస్తకముల నవలోకించుచు నేనేమో యపస్వరో
చ్చారణముల శ్రుతికటువుగాఁ బల్కుచుఁ దాము పఠించునవి వేద
వేదాంగములనియుం దమవలెం బఠించినవారు నాస్తికులు మూర్ఖు
లనియును గతానుగతికముగా నవివేకులు వ్రాఁతలన్నిల్పుచున్న
ప్రతులం దాటాకులు మొదలగు పత్రములందు శబ్దము గంటితోఁ
జూడఁగల్గితి స్మృతి చెవితో నెట్టనిరంగును విన్నా నను నవివేకివలెఁ
బిచ్చిపట్టుదలతో విఱ్ఱవీఁగుచు శ్రోత్రియమ్మన్యులు పండితమానులు
కలివశమునఁ జెంరేఁగి జనులకుంబరస్పరద్వేష మొదవించి స్వార్థ
పరులై వంచకులై యీతిబాధలవలె లోకమును బాధించుచుంట
దుష్కాల చేష్టితమూలమని వెల్లడింపక తీఱదు

“భుసత్తాయామ్ భవతి ఉన్నాఁడు లేక ఉన్నది- భూ
అనునది ధాతువు-భూధాతువుకంటె తిప్- అను తిజ్ప్రత్యయమురా
భూ అను ప్రాతిపదికాక్షరము భవ్ అనురూపముచెంది తి అనుప్రత్య
యము కూడునపుడు భవయను రెండక్షరములుగా మాఱి మొత్తము
“భవతి” అనురూపమై“భవతి”అనియుచ్చరింపఁబడిన ధ్వనికి గుర్తుగా
“భవతి”అను మూఁడక్షరములుభ-వ-తిఅనిక్రమముగానుచ్చరింపఁబడి
“ఉండుట” అను నర్థమును జెప్పు ధాతువునుండి “సుప్తిఙంతమ్
పదమ్” కనుక “భవతి” అను తిఙంతపద మైనది “ఆయతనవాన్
భవతి” అను వేదవాక్యమందు “భవతి” అను శబ్దమున కొనర్చిన
రూపనిష్పత్తి యెండెముకను గొఱకు కుక్కనోటినెత్తు జాయెముక
సంబంధముకానట్లు స్వకపోలకల్పితముగాఁ బ్రాకృతమనుష్యులుచేసిన
కల్పనముగాని నిక్కముగ నతీంద్రియ మనుష్యపదిష్ట వాస్తవశబ్దము
కాదు శ్వేతపీతాదివర్ణము చెవికిఁ గ్రాహ్యముకానట్లు మును
లుచ్చరించిన వేదశబ్దము కంటికి గ్రాహ్యమగునెట్లు ? కాఁబట్టి

యీలోకమందు వ్యవహరింపఁబడు నామరూపాత్మక వేదవేదాంగము లన్నియును ఎండెముకనుండి నెత్తురుబుకుచున్న దనుభ్రమతోఁ దన దౌడల నారు నెత్తుటి నాస్వాదించి కడుపునింపుకొనినంచు నవివేక శునకమువలె గతానుగతికము వంశపారంపర్యముగా శబ్దరూపము గాను వ్రాఁతమూలముగాను వచ్చుచున్న పుక్కిటిపురాణములయి "ఇషేత్వా" ఈ మొదలగు నానార్థస్ఫూర్తిగా నానాసంజ్ఞలతో వచ్చుచున్నధ్వనులు వ్రాఁతలును విభ్రాంతమన వ్యకల్పితములేగాని యతీంద్రియద్రష్టలగు మును లన్యోన్యముం బోధించుకొన్న వేద వేదాంగవాఙ్మయ మెంతమాత్రము నగాదు కాదు స్వార్థపరులు ధూర్తులు కష్టపడక తేరగా నోటిబూకరితనమున మాత్రమే బ్రతుక నెంచి కేవల పరమార్థమాత్ర బోధకము ఋష్యైకవేద్యము నగు నిత్యశబ్దమగు వేదము తమకంపునోళ్ళ నిమిడియున్నట్లు నటించుచు "హ్రాం హ్రీం హ్రూం హ్రేం హ్రైం హ్రోం హ్రౌమ్" గుడ్లెఱ్ఱచేసి భీకరవేషములతో పశుహింస లొనర్చుచు మొండికూటిచేష్ట లొనర్చుచు జుగుప్సితాచారములతోఁ పామరులం బెదరించు చున్నారు కేవలశబ్దముచేతఁదప్ప నాకాశము యొక్క నిజము మఱెట్లైనఁ దెలియుటకు వీలుపడనట్లు కేవలాతీంద్రియమునిమాత్రైక గ్రాహ్యమగు పరమార్థబోధక వేదనాదబ్రహ్మము నల్పజ్ఞులు ప్రాకృతులు భ్రాంతచిత్తులు విపరీతదృష్టులు నింద్రియవివశులు సంసార రోగపీడితులగు మర్త్యులకు వేద్యముగుననుట నాకసము బద్ధలయినదనుట వలె నర్థవాదముగాని యథార్థము కాదు కాదు సకలభూతదయయును సకలజీవులం దన్యోన్యప్రేమానురాగములును నిత్యమనస్సంతుష్టియు నావహించుచు వ్యవహరింపఁబడిన మనోవాక్కాయకర్మములన్నియు ను వేదనాదబ్రహ్మను వ్యక్తీకరించు ప్రతినిధులుగా మానవులం దరింపఁ జేయుటకై యవతరించిన దేవతలవలె మానవులతోఁ బరమభాగ

పతులు ప్రతియుగమం దరుదుగాఁబుట్టి తమనడువడిచే బోధించుచున్నారు సర్వభూతదయయును సకలజనాన్యోన్య ప్రేమానురాగమును బోధించనికార్యము లెవ్వియును వేదచోదిత ధర్మములు కావు కావు జాతిమతవైషమ్యముచేత జనులకుం బరస్పరవిద్వేషము నలిగించు శబ్దముగాని నడువడిగాని మూర్ఖచేష్టిత మగుటేకాదు కాఁబట్టి తా మార్యులమని యాస్తికులమని శిష్టాచారపరాయణులమని యితరు లస్పృశ్యులపాత్రీయులసంభాష్యులపాత్రులుపతితులు మ్లేచ్ఛు లనిద్వేషించు వైదికమ్మన్యులు కాఁజెడ్డకోఁతి వనమంతయుం జెఱచునట్లు తాము చెడిలోకులం జెఱచు దుష్టులని సిద్ధాంతీకరింపక తీఱదు మఱల బ్రతికించుట యసాధ్యముకనుక నే జంతువు నైనం జంపరాదు పరులు తనకుఁ దోడ్పడనెంచుగావునఁ బరులకుఁ దాఁ దోడ్పడకతీఱదు తనతోడిపాటివారియెడఁ బ్రేమానురాగములతోఁ బొందుగా బ్రతికినవానికి మనస్సంతుష్టి కలుగకమానదు మనస్సంతుష్టికలవాఁడే సచ్చిదానందలక్షణుఁడగు ప్రత్యక్షదేవుఁడు, దేవుఁడు కృపానిధి, కృపానిధి బాలాత్రిపురసుందరి, జనని, జననికన్న తల్లియుం దండ్రియును, కాఁబట్టి పరమభాగవతధర్మ మనుసరించి బ్రతుకవలయును బ్రతుకవలయును పరమభాగవతుని ప్రవర్తనము లే శాస్త్రములు సకలజనసంవేద్యములు స్మృతి యాచరణీయములు

## స్వరవల్లరి

"భవతి" అను పదరూపనిష్పత్తికై ద్రావిడప్రాణాయామమును పలె అన్నిసూత్రములు మఱియన్ని వృక్ మొదలగునలౌకికానర్థ సంజ్ఞ లేల చెప్పవలెను? భవతి యను మూఁడక్షరములు ప్రత్యక్షరమొక యర్థము కలదై వెలయుచున్నవని యీ మఱియును భవతి- వతిభ- తిభవ- తిభవ- వభతి- తివభ

యను నానారూపములయి దేశకాలపాత్రానుసారముగా నానా
ర్థము లిచ్చును మఱియును భభాభిభీభుభూభెభేభైభొభోభౌ
అని పన్నెండువిధములు భకారము అఆ-ఇఈ-ఉఊ ఎఏ ఐ ఒఓ ఔ
అను పన్నెండు స్వరములచేత వ్యక్తముగాఁ బల్కఁ బడును
భ్ అను కేవలహల్లు ప్రాణహీనమగు శరీరమువలె నాకృతిమాత్ర
మున లిఖింపఁబడునుగాని యుచ్చరింపఁ బడనేరదు ఋౠ
ఌౡ ఈనాల్గు నచ్చులలోఁ జేర్చ నవసరములేదు రేఫలకారముల
వలన నవి ప్రయోజ్యములగుచున్నవి కాఁబట్టి యచ్చులు పన్నెండే
అచ్చులకు స్వరములనియుం బ్రాణములనియుం జెప్పఁబడుటచేత
ద్వాదశాదిత్యులంబట్టియు షడ్జ, శుద్ధ, చతుఃశ్రుతి, ఋషభ, సాధార
ణాంతర్గాంధారా, శుద్ధప్రతిమధ్యమ, పంచమ, కైశిక, కాకలీనిషాద
శ్రుతులకు సంకేతస్వరములగు స-రిరి-గ-మమ-ప-ధధ-నిని యను
పన్నెండుస్వరములంబట్టి యీఅకారాది ద్వాదశస్వరములు నేర్పర్చఁ
బడినవి మఱియును క్ ఖ్ గ్ ఘ్ ఙ్-చ్ ఛ్ జ్ ఝ్ ఞ్ ట్ ఠ్ డ్ ఢ్ ణ్ త్ థ్ ద్ ధ్
న్ ప్ ఫ్ బ్ భ్ మ్-య్ ర్ ల్ శ్ ష్ స్ హ్ అను ముప్పదిమూఁడు హల్లులు
ముప్పదిమూఁడు కోట్ల దేవతావ్యక్తులంబట్టి యేర్పర్చఁబడెను
ఁ ం-ః అరసున్నయుసున్నయు విసర్గయును నకారమకారహకారముల
చేతఁ బ్రయోజ్యములగుటను వేఱేయక్షరములుగాఁ జెప్పఁబడనక్కర
లేదు ఈముప్పదిమూఁడుహల్లులు పెదవులు దంతము లంగుడు
నాల్క కదలిక మూతి ముక్కు విప్పు మూఁతల విశేషముచేత
నొక్కొక్కహల్లు కోటివిధముల నుచ్చరింపఁబడును కాఁబట్టి స్వతం
త్రోచ్చారణముగల పన్నెండచ్చులు సప్తస్వరములు పన్నెండు
విధము లయినట్లు సప్తాంశువులు ద్వాదశాదిత్యు లయినట్లు- సప్త
లోకములకు సప్తకోటి మహామంత్రములకు మఱియు లెక్కింప
నశక్యములయిన నానావిధశబ్దముల కాలవాలమయి నానావిధజంగమ

స్థావరవస్తువులందు సహజకృత్రిమధ్వను లనంతార్థ ద్యోతకములై నవరసములం బ్రవర్తిల్లుచు శ్రవణేంద్రియమాత్ర గ్రాహ్యములై వెలయుచు లిప్యాది సంజ్ఞలచే నితరేంద్రియగోచరములయి- నామ రూపాత్మక సర్వజగద్రూపకముగా నాదబ్రహ్మము వివర్తిత మగు చున్నది భ్ మొదలగు హల్లులు అ మొదలగునచ్చుల సాహాయ్యము లేక ప్రత్యేక ముచ్చరింపఁబడనేరవు భ్-వ్-త్ అను మూఁడు హల్లుల ప్రత్యేకముగా నర్థవత్తులయినప్పటికి వ్రాఁతమూలముగాఁ దెల్పఁబడునుగాని ధ్వనిమూలముగాఁ దెల్పఁబడనేరవు భ్-వ్-త్ అను హల్లులు అ మొదలగు పన్నెండుస్వరములతోఁగూడి ప్రత్యేక ముగా నొక్కొక్క హల్లు నానార్థములతో నానావిధభావలన్ వ్యవహ రింపఁబడును మఱియు మూఁడుహల్లులు స్వరసహాయవిశేషవశమున నొక్కొక్కటియు రెండేసిగాను మూఁడేసిగాను భ్-వ్-త్-భవ్-భత్- వత్-తవ్ వభ్-త్ భ్ అని యీవిధముగాఁ బన్నెండ స్వరములతోఁ గూడి నానాభావల న్నానార్థముల వ్యవహరింపఁబడును జ్-ఞ్-న్- మ్ ఈనాలుగుం దక్కిన హల్లులకు ముందుగాఁ బెదవితో సంబం ధించిన పల్కు నపుడు కమ్ ప=కమ్ప యని మ్ రూపమును, పెదవి సంబంధము లేనపుడు కన్ ద=కన్ద యని న్ రూపమును, బొందును కాఁబట్టి ప్రత్యేకము జ్-ఞ్ ఈరెండుహల్లులు వ్యర్థముగా నేర్పర్పఁ బడినవి క్ ఖ్ గ్ ఘ్-చ్ ఛ్ జ్ ఝ్ ట్ ఠ్ డ్ ఢ్ ణ్ త్ థ్ ద్ ధ్ న-ప్ ఫ్ బ్ భ్ మ ఈ యిరువది మూఁడు హల్లులు య్ ర్ ల్ వ్ శ్ ష్ స్ హ్ లును గలిసి 23+8=ముప్పదొక్క హల్లులై యొక్కొక్క హల్లుపన్నెండేసి స్వరములతోఁ జేరఁగా 31×12 = 372 రూపములుగా నుచ్చరింపఁ బడుచు మఱియు నానావిధములుగా పెదవి- నాల్క-ముక్కు-దౌడ- గొంతుల చాలనవిశేషములచేత బహుశః 372 సంఖ్య 372 సంఖ్య చేత 372 మార్లు హెచ్చింప నెంతసంఖ్యవచ్చునో యన్నివిధములుగా

మఱి యనంతరీతులుగా స్థూలసూక్ష్మవ్యక్తావ్యక్తోదాత్తానుదాత్తస్వర విశేషములతో నానావిధ జడచేతనజంగమస్థావరాత్మక చరాచర పరమాణుభూత వాయ్వగ్ని జలపృథివ్యంతరాళాకాశగుణాత్మక ధ్వని రూపమై సచేతనాచేతన సహజకృత్రిమాత్మకమై నిత్యానిత్యసత్యా సత్యస్వరూపమై నాదబ్రహ్మాత్మకమై బింబప్రతిబింబాత్మకమై వివర్తా మూలమై యింద్రియగ్రాహ్యమై యతీంద్రియమై యందీయందక దిగంతరేఖవలె నభోనైల్యమువలె భ్రాంతిజనకమై మఱియును భ్రాంతి జనకమై కేవల దేహస్మృతిమూలమై యాకసమంతటను నిండియున్నది ఈ శబ్దబ్రహ్మతత్త్వ మెఱింగి "ఇదమిత్థమ్" అని నిర్దేశింప బ్రహ్మకైన నలవి కాదని దేవర్షి యగు నారదుఁడు వక్కాణించెను

లోకవ్యవహారము సాగుటకై పామరజన బోధకై నానాపదార్థ విజ్ఞానము కలిగించుటకు శాఖాగ్రచంద్రన్యాయముగా నాదికాలము నుండియు నతీంద్రియజ్ఞానులగు మునులీశబ్దబ్రహ్మము పారమార్థికమై నిత్యమపౌరుషేయమై సహజసిద్ధమై వేదరూపముగా వెలయుచున్న దనియును, వ్యావహారికమై యనిత్యము పౌరుషేయమై కృత్రిమమై భాషారూపముగానున్నదనియును "అగ్నిమీళే పురోహితమ్" మొద లగు వైదికశబ్దములను మఱి యాశబ్దరూపముల నెఱింగి యుచ్చరించుట కొఱకుం దదర్థానుసారముగాఁ బరమార్థసాధకకర్మము నాచరించుటకు నై శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషనిరుక్తకల్పముల నేర్పర్చిరి కాఁబట్టి స్వార్థపరత యించుకయును లేక సంసారముం దొలఁగి సన్న్యసించి యహంకారమమకారదూరుఁడై సాధనచతుష్టయసంపదగల ముము క్షువునకుమాత్రమే "సన్న్యసేత్సర్వకర్మాణి వేద మేకం ససన్న్యా సేత్" అనువాక్యానుసారముగా వేదములు వేదాంగములు నుపదే శింపఁబడినవి కాని యహంకారమమకారబద్ధులగు సంసారుల గుఱించి యొంతమాత్ర ముద్దేశింపఁబడలేదు సన్న్యాసులకు గార్హస్థ్యధర్మముల

వలె సంసారులకు వేదవేదాంగము లునిష్ప్రయోజనములు సన్న్యాసు
లకు మాత్ర ముద్దేశింపఁబడిన వేదవేదాంగము లెట్లుచ్చరింపఁబడినవో
యా వేదవేదాంగశబ్దస్వరూప మెట్లుండెనో దదర్థమేమో తచ్చోదిత
ధర్మాచరణము లెట్లుండెనో యతీంద్రియద్రష్టలగు మునులె యెఱుం
గుదురు కాని ప్రాకృతులు మఱి యహంకారమమకారబద్ధులు
సంసారచక్రవిభ్రాంతులగు పామరజనులకును వేదవేదాంగము లకును
భూమితో స్వర్గమునకు వలె సంబంధమే లేదు "ఇషేత్వోర్జేత్వా
ఇషమేవోర్జం యజమానాయ దధాతి-ఇషేత్వేతి శాఖాం ఛి
నత్తి" అను వేదవేదాంగవాఙ్మయము ధూర్తజనకల్పితము లగు
కృత్రిమధ్వనులుగాని సహజాపౌరుషేయ నిత్య వేదవేదాంగ వాఙ్మ
యము కానే కాదు దేవళములందు శిలావిగ్రహములు వాస్తవముగా
దేవత లెట్లు కారో యట్లే యహంకారమమకారవిభ్రాంతధూర్త
మానవు లుచ్చరింపఁగలిగిన శబ్దజాల మెద్దియును పరమార్థసత్యమగు
వేదనాదబ్రహ్మము ముమ్మాటికి న్గాదు కాదు జగత్తంతటి కాధారమై
జగమంతటను వ్యాపించినప్పటికిని వాయ్వగ్నిజలపృథివీపరమాణువుల
నుండి వేఱుచేసి యిదచ్చముగా నాకాశము - అగ్ని యిది - వాయు
విది - జల మిది - భూమి యిది యని ప్రత్యేకప్రత్యేకము భూతముల
లొండొంటనుండి వేఱుపాటుచేసి నిర్దేశింప నెట్లు సాధ్యముకాదో
యాతీరుగా నాదబ్రహ్మమునుండి యివి వేదవేదాంగశబ్దము లని
వేఱుచేసి యుచ్చరింపఁదగినవా రతీంద్రియద్రష్టలగు ఋషులుగాని
ప్రాకృతసంసారబద్ధులగు మనుష్యు లెంతమాత్రమును శక్తులు గారు
కారు తోడిపాటివారితో హాయిగాఁ గలసిమెలసి పొత్తుగా నొరుల
సుఖపెట్టి తా సుఖపడలేక కలికాలవశమున నన్యాయముగా లేనిపోని
వేదవేదాంగములను గూడ సంపాదించుకొనుటకై సాధనముగా
నేర్పర్చి మోసకారియై స్వార్థపరుఁడై పాటుపడక సోమరియై

సుళువుగ వేషములువేసి వాలకములుకట్టి తేరగానుబ్బరసొమ్ము
తినమరగిన తుంటరిమానిసి తా బ్రాహ్మణుఁడ ననియుం దా నుచ్చ
రించినవి వేదవేదాంగములనియుం దనవలె నడవనివాఁడు నింద్యుఁడు
నరకభాజనుఁ డనియుఁ దాను మాత్రము బ్రహ్మనోటినుండి నూడి
పడెననియు తనయుపదేశము చొప్పున నడువనివానిని శపించిధ్వంసము
గావింపఁగలననియుం దనశిష్యుఁడగువాని నాశీర్వదించి యభీష్టసంపద
కెక్కించెదననియు కట్టు బొట్టు జుట్టు వెఱ్ఱివెఱ్ఱిదంభవేషములతో
గ్రుడ్లుమిటకరించుచుం గొంగజపములు చేయుచు నాషాఢభూతివలె
నటించుచు జపమాలికలుత్రిప్పుచు శివనారాయణాదిశబ్దము లుచ్చ
రించుచు మంత్రతంత్రయంత్రవిశేషము లగపర్చుచు బండమొండి
బోడివేసముతో నేవగాఁ దిరుగుచు నోరులేని జంతువుల నన్యాయ
ముగా బలివేసి నమలుచు మద్యమాంసముల సేవించి క్రొవ్వి సకల
లోకవిరుద్ధహేయకర్మ్మము లాచరించుచుఁ దనకు దేవుఁ డగపడిన
ట్లోహోయని ఎల్లివలెఁ గన్నులుమూసికొను మర్కటచేష్టన్మార్జాల
వేషముతో లోపలనొకటి పైకొకటిగాఁ గొంటెపనులు చేయుచు
నన్యోన్యమతద్వేషములుపుట్టించి యైకమత్యము జెఱచి తనతోడిపాటి
మనుష్యులం బాడుచేయుతుచ్ఛుఁడు ద్విజవేషమూని యొరులఁజెఱచి
తాఁజెడుచుండును మఱి సజ్జనుఁడు నిద్రాహారవిహారసౌఖ్యముం
దాఁ బాటువడి పరులకు సమకూర్చు సర్వభూతదయాపరుఁడై నిరంత
రము న్లోకోపకారమునకై జీవయాత్రగడపుకొనుచు సకలజనరంజక
ముగా మనోవాక్కాయ కర్మ్మములొనర్చుచుఁ బరమభాగవతుఁడై
సర్వజనసముఁడై నిత్యసంతుష్టుఁడై సర్వలోకానందకరుఁడై యాడుచుం
బాడుచుండును

# వాసుదేవపరబ్రహ్మము

"అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్" ప్రాతిపదిక శబ్దము న్నిరూపింపకముందు ధాతు వెట్లుండునో ప్రత్యయమెద్దియో మఱి నిరర్థకశబ్దము న్నిరూపించవలసియుండును గదా? "ఉణాదయో బహుళమ్" అనుటచేత నుణాదిశబ్దము లవ్యుత్పన్నము లగుటచేత నాశబ్దలన్నియు నర్థవత్తు లధాతువు లప్రత్యయము లగుటచేతం బ్రాతిపదికము లనఁబడుఁగదా? నదీప్రవాహముం గన్నపిదపఁగదా యాప్రవాహముయొక్క పుట్టినతావు విచారించవలసియుండును కేవల ధాతువునకుఁగాని కేవలప్రత్యయమునకుఁగాని నిరర్థకశబ్దము నకుఁగాని లోకవ్యవహారము కలుగనేరదుకదా? లోకమందు వ్యవహరింపఁబడని కేవలధాతువులు కేవలప్రత్యయములు నిరర్థకశబ్దములం బట్టిగాని కేవలార్థవచ్ఛబ్దము లోకవ్యవహారయోగ్యము కానేరదు కృ=ప్రాతిపదికము కాఁబట్టి "కృ" అను ప్రాతిపదికము నకుఁగాని "కృఞ్" అను ధాతువునకుఁగాని "ఞ్" అను ప్రత్యయము నకుఁగాని "ఞ్ కృ" అను నిరర్థకశబ్దము నకు లోకవ్యవహారము లేదుగా? లోకమందుఁ బ్రత్యేకముగా వ్యవహరింపఁబడినవు డీశబ్దము ప్రాతిపదిక మిది ధాతు విది ప్రత్యయమని యర్థవచ్ఛబ్దము నందలి యవయవములను నిర్ణయింపవీలు కాకుండుటచేతఁగదా వాయ్వాదిశబ్దము లుణాది ప్రత్యయములు కల వ్యుత్పన్నములుగా నిర్ణయింపఁబడినవి? మఱి శబ్దవ్యుత్పత్తివిషయమై "ఛందసి బహుళమ్" - ఛందసి యథా దృష్టమ్- పృషోదరాదీని యథోపదిష్టమ్- నిరంకుశాః కవయః యథోత్తరమ్మునీనాంప్రామాణ్యమ్- ప్రయోగశరణా వైయాకరణాః- ఛందోవత్సూత్రాణి- ఆర్షత్వాద దోషః" అను వాక్యవిశేషముఁ చేత వ్యాకరణశాస్త్రముయొక్క ప్రయోజన మనిత్యమగు పౌరుషేయ లౌకికవ్యావహారికభాషల కెంతయున్నాదు వ్యావహారి భాషలు దేశ

కాలపాత్రానుసారముగా మాఱుచుండుట స్వభావముగనుక వ్యావహా
రిక లౌకికభాషకై వ్యాకరణ పద్ధతియేర్పఱచుట నీటఁ వ్రాసినమాడ్కిం
బిచ్చిచేష్టకదా ? ఇంక నపౌరుషేయనిత్యవైదికశబ్దమునకై మాత్రమే
వేదాంగరూపక వ్యాకరణశాస్త్ర ప్రవృత్తి కలిగెనని చెప్పక తీఱదు.
"రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనమ్" అను భాష్యోక్తింబట్టి
నిత్యాపౌరుషేయవైదికశబ్దమునుగూర్చి యుద్దేశింపఁబడిన వేదాంగ
మగువ్యాకరణముగూడ వేదమువలెనపౌరుషేయముగాకతీఱదు దేహ
ముకాని దేహావయవములుండునా? శరీరముతోఁజేరక శరీరావయవము
లగు ముక్కు మొగము కాలు కన్నులు ప్రత్యేకముగానుండవుకదా?
కేవలపదార్థబోధకమై యపౌరుషేయమైన వేదనాదబ్రహ్మ మతీం
ద్రియద్రష్టలగు ఋషులకుమాత్రమే యుద్దేశింపఁబడుటచేత నీమర్త్య
లోకమునకును వేదవేదాంగములకు నేవిధమైనసంబంధమును లేదు.
ఈభూమి న్యలంగుప్రాణులకు ధ్రువనక్షత్రముతో మఱియుం దదీయ
తేజస్తత్త్వవిశేషములతో నెంతసంబంధమో మర్త్యులకు వేదవేదాంగ
ములతో నంతే సంబంధము నిత్యాపౌరుషేయ వేదవేదాంగముల
కీలోకమందు దేవళములందు దేవతలకుం బ్రతినిధులుగా శిలాదివిగ్ర
హము లుపాసనాసౌలభ్యమున కనాదిగాఁ గల్పింపఁబడినవిధమున
(నిత్యాపౌరుషేయ వేదవేదాంగవాఙ్మయమునకుఁ) బ్రతినిధులుగా
'ఇషే త్వా-ఇష మేవోర్జం యజమానాయ దధాతి" అనుమంత్రబ్రాహ్మ
ణాత్మకవైదిక శబ్దములు "ఇషేత్వేతిపలాశశాఖాంఛినత్తి" అనుకల్పవచ
నము లుమఱియు వేదాంగములగు శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషవచన
ములు కొందఱుమర్త్యులచేతంజిత్తశుద్ధిసాధనసౌలభ్యమునకై యనాది
కాలమునుండియును దేశకాలపాత్రోచిత వ్యావహారికవాఙ్మయమువ
నహజముగా నేర్పాటు చేసికొనఁబడెను కొందఱుమర్త్యులు
మాటలతోఁ బ్రయోజనమేమి లోకోపకారముగా నడుచుకొను

చుందురు హృదయములందు నిఖిలజగత్కారణము భక్తపరాధీన
మును సర్వశక్తియుతగు దివ్యతేజస్సును సహజముగా ధ్యాన
మొనర్చుచుందురు సరియే మొత్తముపై సిద్ధాంతభాగము- వేదము
లనియును వేదాంగములనియును లోకోపకారములుగాక నిద్రాహార
విహారసౌఖ్య మభివృద్ధిచేయునేరక జనులకుం బరస్పరప్రేమానురాగ
ములను సమకూర్పలేకుండిన నామరూపములు- వేదవేదాంగములేకానీ
శాస్త్రములేకానీ మఱేమైనఁగానీ సముద్రమునఁ గురిసినవానవలెనట్టి
వాఙ్మయమంతయును నిష్ఫలము నిష్ఫలము కటకట నాఁకలి పుట్టు
చుండవలెను మఱి కోరినభోజనము చేకూరుచుండవలె। అభీష్ట
నిద్రాహారవిహారసౌఖ్యము చేకూరుచుండవలెను నిత్యయౌవనము
కావలెను మఱెన్నటికైనను జరారుజామరణములు లేకుండవలె నిది
కదా ప్రతి మనుష్యునకు సహజసిద్ధమగు కోరిక- యభీష్టసంపత్సిద్ధి
కావలె నింతకన్న కోరిక మఱేది? ఇన్నికోరికలు మనస్సు నిత్యసం
తుష్టిం జెందినపుడు సిద్ధించినవే యగును సరియే యీలోకములోఁ
బరమభాగవతులకుమాత్రమే నిత్యమనఃసంతుష్టి కలుగును "తద్వై
క్షత- ధాతాయథాపూర్వమకల్పయత్" అనుటచేతను "ప్రయోజన
మనుద్దిశ్య నమందోఽపిప్రవర్తతే" అనువాక్యానుసారముగా "వేదాన్
సంస్మార్య ధాతాయథా పూర్వమకల్పయత్" అనుటచేతను బ్రహ్మకు
వేదములను జ్ఞప్తితెచ్చుకొనుటకును "తద్ధితప స్తద్ధితపః" అనునట్లు
సృష్టిచేయుటకుఁ దనశక్తి నొదవింపఁగల తప స్సాచరించుటకును
బూర్వసృష్టిలో నెన్నివిధముల పాంచభౌతికోపాధివిశేషములున్నవో
యవన్నియును దిరిగి సృష్టించుటకై యాలోచించుటకును గొంత
కాలము పట్టునుగదా ? సృష్టిచేయకముందు సృష్టికొఱకై బ్రహ్మ
యాలోచన మెంతకాలముచేసెనో మఱెంతకాలమునకుఁ దొంటిసృష్టి
వలె జగమును సృజించుట కెంతకాలముపట్టెనో యనంతము లపారము

షేయము లతీంద్రియగ్రాహ్యములు నిత్యములగు వేదములన్నిటిని సమగ్రజ్ఞప్తి తెచ్చుకొనుట కెంతకాలముపట్టెనో సూర్యసిద్ధాంతము మొదలగుమునికృతజ్యోతిషశాస్త్రముస్పష్టపర్చఁగలిగెనా? వాయ్వగ్ని జలపృథ్వులవలె జడమగు నాకాశము "ఆత్మన ఆకాశః సంభూతః" అనుటచేత బ్రహ్మ యాకాశమును గల్పించిన యెంతకాలమునకుఁ దక్కినభూతసృష్టివిశేషములు కావించెనో "శబ్దగుణక మాకాశమ్" అనుటచేత శబ్దముగూడ నాకాశమువలె నుత్పత్తిస్థితినాశవత్తైనకార్య మనకతీఱదుకదా? "హేతుహేతుమతోరభేదాత్" అనుటచేత మట్టి చెట్టునందలి విశేషమంతయును మట్టివిత్తున నిమిడినది కాఁబట్టి బీజ వృక్షములకును మృద్ఘటములకును నామరూపభేదమేగాని వస్తుభేదము లేదనుమతము యుక్తియుక్తమైనయెడల నాత్మస్వరూపుఁడై జగ త్కారణబీజరూపుఁడగు బ్రహ్మకును జగత్తుకును వస్తుభేదము చెప్ప రాదుగదా? "సర్వమాత్మైవభులు కంకేనపశ్యేత్" బ్రహ్మకన్న నితరవస్తువే లేనపు డీజగత్తును మఱి యీజగత్సృష్టిస్థితినాశముల జరుగుకాలమున కాదిమధ్యాంతగణనము నుండునా? కాఁబట్టి యీజగత్తంతయును మరుమరీచికవిధమునఁ బ్రాతిభాసికమును విపరీత బుద్ధి భ్రాంతిజన్యమును స్వప్నమువలె మిథ్యయును నిత్యవస్తుతత్త్వ జ్ఞానమును సులభముగాబోధించుటకొఱకు మఱియు నుపాసనా సౌలభ్యముకొఱకు దైవోపాసనకై శిలావిగ్రహములు దేవళములం దేర్పర్చినట్లు సర్వజ్ఞులగుమునులు లోకవ్యవహారముచేఁ బామరులం దరింపఁజేయుట శాఖాగ్రకృతచంద్రన్యాయముగా సకలవేదశాస్త్ర ముల నల్పించినారని సిద్ధాంతము సిద్ధాంతము

"నేతి నేతి" అను శ్రుతిప్రకారము "యద్దృశ్యం తన్నశ్యమ్" అనునట్లు నిశ్చయముగా "మౌనం వ్యాఖ్యానమ్" అనుచందమున సమాధిదశ యిట్టిదని చెప్పశక్యముకానట్లు "నాసదాసీన్నోసదాసీ

త్తమ ఆసీదితి శ్రుతిః" అని యీ రకున్నవాఁడే యుత్తమయోగిగాఁ దోఁచెడు మొసలిపిల్లకు గ్రుడ్డు నుండి వెలువడినతోనేయొడ్డు విడిచి నీట దుముకుట సహజగుణమైనట్లుమనష్యున కీజగత్సృష్టినాశకారణ మేమోయని తెలిసికొనుటకై తఁటాలుపడుట స్వభావము దిగంత రేఖవలెఁ బ్రాప్యాప్రాప్యమై జ్ఞేయాజ్ఞేయమై దృశ్యాదృశ్యమై సకల వేదశాస్త్రయదార్థతత్త్వ మున్నది కాఁబట్టి పదార్థతత్త్వ జ్ఞానమును సంపాదించినవానికినిఃశ్రేయసాప్తికలుగునని గౌతమముని చెప్పెను గాని పదార్థతత్త్వజ్ఞానమును సంపాదించుకొనుద్యమము పిల్లిమెడలో నెలుక ఘంట కట్టనెంచుటవలె నసాధ్యము మఱి యసంభవ మని యనకతీఱదు "సర్వం విష్ణుమయం జగత్" అను వాక్యముఁబట్టి యన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయ కోశ పంచకముచే వాసుదేవపరబ్రహ్మము నిర్గుణమయ్యున్నదన త్రిగుణమయ లీలాశక్తియందు 100000000000000000 పదేడుసున్నలతోఁ జేర్పఁ బడినసంఖ్య పరార్థ మనఁబడును పరార్థసంఖ్య పదేనుచే గుణింపఁ బడి హెచ్చింపబడినవు డనఁగా 1500000000000000000 ఇన్ని మార్లు 100000000000000000 (పరార్థసంఖ్య) వచ్చిన సంఖ్య కల పాంచభౌతిక పరమాణుసంయోగవియోగవిశేషముల నగపట్టు ప్రతి బింబముఁ దోఁచుచున్నది పరమపురుషుఁడు సత్త్వరజస్తమోగుణ మయమగు తన లీలాశక్తియందు (100000000000000000) 1500000000000000000 (పరార్థసంఖ్యను) బంచదశపదార్థసంఖ్యా పర్యాయములు గుణింపఁగా వచ్చిన)యన్ని విధముల న్మాటిన నానా విధవిశేషస్వరూపములం బ్రతిబింబించుచున్నాఁడు పరమాత్మ జీవాత్మగాను జీవాత్మ పాంచభౌతికజగత్తుగాను బరమాత్మయొక్క లీలాశక్తియగు బాలాత్రిపురసుందరియందుఁ బ్రతిబింబించుచు ననంత సంఖ్యాకపదార్థమయజగద్రూపమున సృష్టిస్థితినాశములందుచున్నట్లు

సంగుడయ్యెను సహజలీలచేఁ గ్రీడించుచున్నాఁడు ఈనాదేహస్మృతి వాసుదేవుని "తదైక్షత" అను వాక్యానుసారముగా నొందు "ఇతి మతిరుపకల్పితావితృష్ణాభగవతిసాత్వతపుంగవేవిభూమ్ని" అనుతీరున బొడమిన (1000000000000000000) 1500000000000000000 దవ తీరున మార్పుగల ప్రతిబింబమునకు (1000000000000000000) 1500000000000000000యవ ప్రతిబింబము కావున నీ సమస్తజగత్కార్యములు ననంతసంఖ్యాకములుగా మాఱుచున్న భగవల్లీలా ప్రతిబింబప్రతిబింబములు మేఘగర్జము నామెఱుపువలె ననంతవిధములం బ్రతిఫలితములయినయెమ్మట నారోగ్యముగానున్న చెవిచేతను నేత్రము చేతను గ్రహింపఁబడినచందమున నిర్గుణుఁడగు శివుఁడు నిజలీలాత్మక బాలాత్రిపురసుందరీశక్తియందనంతవిధసంఖ్యాకముగాఁ బ్రతిఫలించిన కోట్లకొలనీడయే యీనాదేహస్మృతి మతీదేహస్మృతినీడయే యీ జగత్కార్యములన్నియును ఈదేహస్మృతియే బాలా త్రిపురసుందరీ స్వరూపమగు శివశక్తి - నిర్గుణుఁడు శివుఁడు మఱి త్రిగుణాత్మక స్మృతియే బాలాత్రిపురసుందరియగు శివునియొక్క శక్తి అగ్న్యుష్ణ్య ములకు భేదములేని చందమున శివశక్తులకు భేదము లేదు శివశక్తి తత్త్వము నిత్యసత్యము మఱీజగత్కార్యములన్నియు ననంతవిధము లుగా మాఱుచున్న యనిత్యాసత్యమిథ్యాప్రతిబింబప్రతిబింబములు గాని యథార్థములు కావు కావు యథార్థవస్తువు శివశక్త్యాత్మకమై సర్వజగత్కారణమగు వాసుదేవపరబ్రహ్మము "నేతి నేతి" అని యీదృశ్యపదార్థముల నిషేధింపఁగాఁ దుట్టతుదకు మిగిలిన వాస్తవమే వాసుదేవపరబ్రహ్మము "నేతి నేతి" అని యీజగత్కార్యములందు నసక్తతపొందక వైరాగ్యముగానుచుంటచే వాసుదేవుని నవవిధభక్తి మార్గముల సేవించుట ఐహికసుఖము లాసించక సకలజగమును నారాయణుఁడే యనియును సకలభూతదయయును సర్వజనసమతయు

స్వార్థత్యాగము లోకోపకారపరతయు నలవరచు భాగవతు నాశివ
శక్తియు నిఖిలభువనజననియునగు బాలాత్రిపురసుందరి తన కన్నబిడ్డల
వలె సంరక్షించి సంసారాంబుధినుండి నౌకవలెఁ గడింపఁజేసి శివుఁడను
కైవల్యానందతటముఁ జేర్చును

శివశక్తు లుభయులకన్న సత్యపదార్థ మింకొకటి లేదు
శివశక్తులు బింబము శివశక్తులయొక్క మొదటి ప్రతిబింబము మనస్సు
మనస్సుయొక్క ప్రతిబింబ మాకాశ మాకాశప్రతిబింబము వాయువు
వాయుప్రతిబింబమగ్ని యగ్నిప్రతిబింబము జలము జలప్రతిబింబము
భూమియు శివశక్తుల యనంతసంఖ్యాక ప్రతిబింబరూపములనున్న
యనంతసంఖ్యాకమనోరూపప్రతిబింబముల యనంతసంఖ్యాకప్రతిబింబ
విశేషము లీపాంచభౌతికపదార్థములు స్వప్నదశనున్న మనఃప్రతి
బింబము లీసకలవ్యావహారికజగత్కార్యములయిన ట్టీదేహస్మృతి
రూపకప్రతిబింబవిశేషముల కాధారమగు వాస్తవబింబము శివ
శక్త్యాత్మ పరబ్రహ్మము, "నేతి నేతి" అను శ్రుతిప్రకారము నిషే
ధింపఁగా నింద్రియాతీతమై యవాఙ్మనసగోచరమై యేశివశక్త్యాత్మక
పరబ్రహ్మమునందు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను బ్రహ్మజిజ్ఞాస
కుని బుద్ధి లీనమైపునరావృత్తిలేకసమాధిచెందుటచేత నట్టిజిజ్ఞాసయుం
దగు కుండునో యట్టి శివశక్త్యాత్మకపరబ్రహ్మమే మొత్తముపై
తేలినఫలితార్థ మీదృశ్య మీప్రత్యక్షస్మృతియును మనుమరీచికల
వలె మిథ్యారూపములు ప్రతిబింబములు కేవలభ్రమలుగాని వాస్తవ
ములు కావని సిద్ధాంతపర్చు ప్రమితి శివశక్త్యాత్మక పరబ్రహ్మము
యొక్క మొట్టమొదటి ప్రతిబింబమగుటచేతఁ దర్కసిద్ధాంతమగు
పదార్థతత్త్వజ్ఞానము శశవిషాణమువలె నసంభవము కావుననే శివ
శక్త్యాత్మకము కైవల్యరూపమునగు నిత్యమనఃసంతుష్టి శ్రద్ధచేఁదప్ప
జిజ్ఞాసచేతఁ నెన్నటికైన గలుగదు కలుగదనియే శాండిల్యవిద్యా

స్వరూపమగు భక్తిస్తోత్రప్రవృత్తి కలిగెను భగవద్భక్తియుక్తులగు పరమభాగవతులు తప్ప నితరులు సంసారదుఃఖసముద్రమున్దడవనేరరు నేరరు

## రసపిపాస

శిక్షాశాస్త్రము దేహధారులలో ముఖ్యముగా మనుష్యులు తమకుత్తుకలనుండి వెలువడు ధ్వనిని దమయాస్యావయవముల నొరవడి చేత నానావిధములుగాఁ దమయూహలను జనరంజకముగా వెల్లడించుటకై యేర్పర్చిన యుచ్చారణము ను వివరించుశాస్త్రము వైఖరీనామముగల మనుష్యుల కంఠధ్వనిని శ్రుతిలయల ననుసరించి కేవలధ్వనిరూపముగాను మఱియు నకారాద్యచ్చులు కకారాది హల్లులుగల వర్ణాత్మకముగాను దత్తదుచిత నవరసములతో నాయా ఊహలం బరస్పరమును మనుష్యులు దెల్పుకొనుచున్నారు కేవల కంఠధ్వనియేగాక మనుష్యకరపాదాద్యవయవజన్య ధ్వనిచేఁగూడఁ దమయూహాలు వెల్లడించుకొనుచున్నారు జనరంజకముగా నాయా దేశజనులు పరస్పరము తమయూహాలు సమయోచితముగాఁ దెల్పుకొనుటకై యేర్పడిన శిక్షాశాస్త్రము మొదటి వేదాంగము - వేదమునకు రెండవపేరు శ్రుతి కనుక విన్కిచే ముఖ్యముగా నెఱుఁగఁబడునది వేద మయ్యెను అనాదికాలమునుండియుఁ జెవిచేత గ్రహింపఁబడి యుభయలోకసంతరణవిధానము సకలలోకులకుఁ దెలుపుధ్వనివర్ణోభయాత్మకనిత్యాపౌరుషేయశబ్దసముదాయవిశేషము వేదము మఱి యా వేదశబ్దము నుచ్చరించుపద్ధతినే శిక్షాశాస్త్రము తెలుపుటచేతఁ బ్రథమవేదాంగ మయ్యెన అనాది సంప్రదాయానుసారముగా గురుపారంపర్యోచ్చారణానుసారముగాఁబఠింపఁబడుచున్న వేదముచ్చారణప్రవచనపాఠవిశేషముచేత నర్థమందును మఱియుం బల్కఁబడి

యందును నానాజనోపదిష్టంబులై యగణిత నానాశాఖాభేదములతో నుండుటచేత వేదములవలె వేదాంగములుకూడ ననంతవిధములయినవి కాఁబట్టి శాస్త్రము బహుముఖమై దేశకాలపాత్రానుసారముగా నిర్దేశింపఁబడుచున్నది ఇంతకును వేదములును వేదాంగములును కేవల పారలౌకిక ప్రయోజనములగుటచేత వ్యావహారిక భాషతో వేదవేదాంగములకు సంబంధ మొంతమాత్రమును లేదు కావున వ్యావహారిక ధ్వన్యాత్మక వర్ణాత్మక శబ్దము దేశకాల పాత్రానుసారముగా జనరంజకముగా నుండుటమాత్రమే ముఖ్యము గాని యట్టివ్యావహారికశబ్దమునకు వైదికశబ్దములకువలె జనరంజనము నతిక్రమించిన మఱేశాస్త్రనియమములతోఁ బ్రయోజన మొక్కింతయును లేదు లేదు "సత్యంబ్రూయాత్ప్రియంబ్రూయాన్నబ్రూయాత్సత్య మప్రియమ్" అనునట్లు తనతోడిపాటివారలు సమ్మతించిన విధమునఁ దనయూహం దెల్పఁగల ధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్ద మెద్దియైనను మనుష్యుఁ డుపయోగించుకొనవచ్చును జనరంజకమై లోకోపకారకమైనపలుకు లెట్లున్నను మఱి యాపలుకులో నక్షరములెవ్వియైనను శ్రుతిలయ లెట్లున్న నుండవచ్చును వ్యావహారికకంఠధ్వనికిఁగాని మఱేశరీరావయవధ్వనికిఁగాని మఱేయంత్రవాద్యవిశేషధ్వనికిఁగాని తత్తద్దేశజనరంజకమగు తెన్నునఁ దెల్పఁబడుటకన్న వేఱే శాస్త్రపద్ధతులు బొత్తిగా ననవసరములు తత్తద్దేశకాలపాత్రోచితముగా జనరంజకముగా నున్న పలుకులకు లేనిపోని శాస్త్రనియమములేర్పర్చి మూఢుల నమ్మించి తమవశముచేసికొని జీవించుస్వార్థపరులు కేవల దుర్జనులు కాఁబట్టి జనరంజనమగుటతప్ప వ్యావహారికశబ్దమునకు మఱేశాస్త్రపద్ధతియును ముమ్మాటికి న్లేదు లేదు సర్వశాస్త్రకర్తలు సర్వజ్ఞులయిన మునులయందఱి తాత్పర్యమును తత్తు సమన్వయాత్" అని వేదవాక్యమువలె ననాదిగా నున్న సూత్రమ్మం

బట్టి లోకులయందఱి యనురాగము తనపైఁ గలిగించుకొను విధమున
మఱియును సర్వజనరంజకముగునట్లు మఱియును సర్వలోకోపకారక
మగునటుల నామరూపాత్మకచతుర్విధాభినయము లొనర్చవలెను
ఉదాత్తానుదాత్తస్వరభేద మెట్లున్నను హ్రస్వదీర్ఘప్లుతాదికాలభేద
మెట్లున్నను కకారాదిహల్లులుగాని యచ్చులుగాని యేశబ్ద మెట్లుచ్ఛ
రించినను గాత్రయంత్రధ్వనివిశేషము లెట్లున్నను మఱి యాంగికా
హార్యసాత్త్వికాభినయ విశేషము లెట్లున్నను సకలజనరంజకములై
సర్వలోకోపకారకములై యుండినఁ జాలును తక్కిన జనులకుఁ
బరస్పరద్వేషము గలిగించుపద్ధతు లెంతమాత్రమును మునిసమ్మత
ములు కావు జనానురాగమును సంపాదించుకొని లోకోపకారముగాఁ
బ్రవర్తిల్లుటకన్నఁ బురుషకార మింకెద్దియు నాదు సర్వలోకోప
కారముగా నడిపించుమని భగవంతుని నిరంతరమును బ్రార్థించుపరమ
భాగవతుఁడుమాత్రమే నిత్యమనఃసంతుష్టిరూపకశాశ్వతబ్రహ్మానంద
మనుభవించును వేదమును గూర్చిమాత్రము శిక్షాదివేదషడంగములు
చెప్పఁబడినవిగాని లౌకికవ్యవహారమును గూర్చి యెంతమాత్రమును
వేదములుగాని వేదాంగములుగాని యుద్దిష్టములు కావు కావు
వేదవేదాంగములంబట్టి లౌకికవ్యవహారము జరుపవలసినదని స్వార్థ
పరులు ధూర్తులు కేవలాత్మ భరులు దంభులగు దుర్జనులు జనులకుఁ
బరస్పరానురాగము చెఱచి యన్యోన్యద్వేషము గల్పించి వంచకులై
మూఢులనొమ్మఁబుచ్చి పామరజనసత్కృతులై యొరులఁ జెఱచి
దుర్వ్యసనపరులై తాము చెడుచుంట దుష్టకలికాలచేష్టితమనక
తీఱదు వేదవేదాంగములంబట్టి మానవలోకవ్యవహారములను సరి
చేసికొని మనుష్యులందఱుం బరస్పరానురాగముతో నన్యోన్యసహా
కారులై బ్రతుకువిధానముఁ దెల్పుచు ధర్మార్థకామమోక్షము లను
చతుర్విధపురుషార్థములను సంపాదించుకొని యుభయలోకములు

తరించుటకై దేశకాలపాత్రోచితముగాఁ బురుషార్థచతుర్వర్గసాధన రూపములు సర్వజ్ఞులగు మునులు నానాశాస్త్రములననాదికాలము నుండియును భూతభవిష్యద్వర్తమానకాలోపయోగముగా నుప దేశించుచువచ్చిరి నీతిశాస్త్రము ధర్మశాస్త్రము మొదలగు వ్యావహారికధర్మములను కేవలము దేశకాలపాత్రోచితముగా సకల జనులు పరస్పరప్రేమానురాగములతో నిద్రాహారవిహారసౌఖ్యమును సంపాదించుకొనిపోయిగాఁ బ్రతుకుతెన్నులుగ నుపదేశించిరి "ధాతా యథా పూర్వమకల్పయత్" అను శ్రుతిప్రమాణ మనుసరించి యేయేదేశకాలపాత్రానుసారముగా నేయేసునో వాక్యాయకర్మములు జనులలో బహుసంఖ్యాకు లాచరించుచుందురో యట్టిజనులం దేసంఘము భూతదయాపరమై కేవ లోకోపకారకముగఁ బ్రవర్తిల్లు చుండునో యట్టిమానవులనడువడి ననుసరించి యాయాపరమభాగ వతుల యాచార మనుసరించి పలికిన పలుకులు మఱి చేసినతక్కిన కర్మములు వేదచోదితధర్మములు కాకమానవు

భూలోకమునకుఁ బరములైన గ్రహనక్షత్రాదిఖగోళములు భూగోళమునందలి సకలజంగమస్థావరజీవుల యుత్పత్తిస్థితినాశహేతువు లగు శీతోష్ణాదితత్త్వముల కాధారమైనవిధమున నపౌరుషేయనిత్యా వ్యక్తవేదశబ్దబ్రహ్మము సనాతనముగా దేశకాలపాత్రానుసారముగా జనులకుఁ బరస్పరప్రేమ నురాగజనకములగు సర్వలోకోపకారకము లగు సదాచారములను వెల్లడించునట్లుగౌతమవ్యాసాదిమునిమతవిశేష ములు సుప్రసిద్ధములై యేయున్నవి పానము చే దాహశాంతి యగు నని వైద్యశాస్త్రమర్మ మెఱింగింపఁబడిన వివేకవంతుఁడుతొలుదొల్త నాడప్పి యెందువలనఁగలిగెనో యేజాతిపిపాస నేపానము శాంతింపఁ జేయునో లోకానుభవము తెలిసికొని యాయాదాహశాంతికై

యాయాపానవిశేష ముపయోగించునట్లు నవరసాత్మకమగు నీజగమున "సరసాసాలంకారాశబ్దార్థా కావ్యమ్" అనునట్లు సరసవుంబల్కు-పల్కువలెనని శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్తశాస్త్రములముఖ్యతాత్పర్యము రస మనఁగా మనుష్యులందుఁ బరస్పర ప్రేమానురాగజనన హేతువగు నిత్యాపౌరుషేయదివ్యవేదశబ్దబ్రహ్మతత్త్వము గ్రహము లన్నిటిలో గురుఁడు పరమశుభుఁడు మఱి శనిపాపిష్ఠుఁడు, గురుఁడు జ్ఞానసుఖస్వరూపుఁడు శని దుఃఖస్వరూపుఁడు వేదవేదాంగాత్మక దివ్యస్వర్గానందాత్మకుఁడై గురుఁడు జనులకు స్వర్గానందదాయకము లగు పరస్పర ప్రేమానురాగములను బుట్టించు మనోవాక్కాయ కర్మము లుపదేశించుచుండును మఱి శని నరులకు నరక దుఃఖకారణములగు పరస్పరద్వేషహింస లొదవించు తెన్నులు మప్పుచుండును గురుఁ డుపదేశించుమార్గ మారోగ్యమునకై తల్లి యిచ్చు చేఁదువలెఁ దొలుదొల్త వెగటుగనుండియుఁ గ్రమక్రమముగ స్వర్గానంద మొదవించును శని దుష్టు తెన్నున మొట్టమొదట మద్యమువలె సుఖము గలిగించియుం గొట్టకొనకు నరకబాధలం బడఁద్రోయును వేదముల యందలి జ్ఞానకాండము గురుఁడు మఱి కర్మకాండము శని "నహింస్యాత్సర్వభూతాని" అని గురుఁడు పల్కుచున్నాఁడు "పశుమాలభేత" అని శని పురికొల్పుచున్నాఁడు స్వార్థత్యాగులై కేవలలోకోపకార పరాయణులయి సర్వజనసములయి సర్వభూత దయాపరులైన పరమభాగవతులు మాత్రము గురుబోధ్వాశ్వసించి నిత్యసంతుష్టాంతరంగులై కృతయుగపురుషులవలె ముక్తులగుచున్నారు మఱిస్వార్థైకపరులై లోకద్రోహులై ప్రాణిహింసకులై జనవిద్వేషులైన ధూర్తమానవులు శనిమాయలకులోఁబడి కలికాలమనుజులు సంసారపాశబద్ధులగుచున్నారు తనకు వేఱుగ లోక మున్నదని తనదేహాస్మృతివల్లన భేదా తెల్లియుచున్నాఁడు

తనకు వేఱుగ లోక ముండినన్గాని దేహి తనదేహస్మృతి యున్నట్లు
తెలియఁజాలఁడు కాఁబట్టి తనజ్ఞప్తియును మఱితనకు వేఱుగఁదోఁచు
లోకముం బింబప్రతిబింబములవలె నన్యోన్యాశ్రయములు ఈరెండిం
టిలో వాస్తవమెద్దియో నీడ యెద్దియో నిర్ణయించి తెలుప వీలు
లేదు యథార్థతత్త్వజ్ఞాన మాత్రైక వేద్య మద్ది సమాధిరూపమని
మాత్రము "యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి
తద్భూమ" అని శ్రుతిప్రమాణముచేతిమాత్రము నిర్ణయింపఁబడు
చున్నది కాఁబట్టి యీనాదేహస్మృతియే సచ్చిదానందస్వరూపిణి
యగు బాలాత్రిపురసుందరీమహాలక్ష్మియైత్రైలోక్యజననినిత్యానంతు
ష్టాంగునిగా న న్ననుగ్రహించుటకై నే నహర్దివముం బరమభాగ
వతుఁడనై సర్వభూతదయాపరుఁడనై సకలజనులకు న్విధేయుఁడనై
యడఁకువతో నడతిమనుష్యులయొక్క ప్రేమానురాగము సంపా
దించుకొనుటకు మాత్రమే బ్రతుకనెంచెదనని నిశ్చయించిన జనుఁడే
పరమభాగవతుఁ డటిపరమభాగవతుఁడుపల్కినపలుకులునడిచినడత
లోనిసారము గ్రహించి యితరమానవులు పల్కినపల్కులు నడిచిన
నడతయును వేదశాస్త్రవిహితము కాకతిఅదనిసిద్ధాంతరాద్ధాంతములు
ఈదేహస్మృతియుమ తీస్మృతిదృష్టమగు నీజగద్వికారములును నిక్క
ముగా యథార్థవస్తువగు నాత్మపదార్థము మాయయందుఁ బ్రతిఫలిం
పఁగా నట్టి ప్రతిబింబము తిరిగి లెక్కింపనలవికానియున్ని సారులునానా
వికారభేదములం బ్రతిబింబింపఁగా ననాదికాలమునుండియు నిప్పటి
కీతీరునఁ దోఁచినప్రతిబింబవిశేషములని యూహింపవచ్చెను ఈదేహ
స్మృతియు నీసంకల్పవిశేషము లీజగత్కారణములన్నియు ననంత
సంఖ్యాకపర్యాయములు ననంతవిశేషములుగా సత్త్వరజస్తమములనెడు
త్రిగుణసామ్యదశతో శివునకు నీడవలె ననపాయినియగు నాదిశక్తి
సహజలీలతో ననాదికాలమునుండియు నిప్పటివఱకున్నున్నదశయందు

జగద్రూపమయినమనస్సువలెఁ బ్రతిబింబరూపముగాఁ గొట్టకొనకఁ బరిణమించిన ప్రతిబింబమే యీజగద్విశేషముల న్గాంచుచున్న యీదేహస్మృతివిశేషము

"భిద్యతేహృదయగ్రంథిర్భిద్యన్తే సర్వసంశయాఃతస్మిన్దృష్టే పరాత్మని" అనునట్లు సమాధ్యవస్థయందు త్రిగుణసామ్యమై యాది శక్తియు మరి యాయాదిశక్తిమయుండగు శివుఁడునుమాత్ర మాశివ శక్తులుభయులు సచ్చిదానందస్వరూపులు శేషించియుందురీదేహ స్మృతియు మఱీసమస్తజగద్వికారములను బ్రతిబింబవిశేషములన్నియు నుపాధిశూన్యమగుటచేత శూన్యము లగును "తదైక్షత" అనునట్లు భగవత్సంకల్పమను నుపాధియందు భగవంతునియందలి యిచ్ఛాశక్తియే యీసమస్తజగద్వికారములుగాఁ బ్రతిబింబించును కాఁబట్టియావరణ విక్షేపకాత్మకభగవచ్ఛక్తివశమున నీప్రపంచము స్వప్నజాగరదశలం బొడఁగట్టుచుసుషుప్తితురీయావస్థలందు శివశక్త్యాత్మకముగా శేషించు చుండును శివశక్తిపరస్పరసంపర్కవిశేషముచే నీజగమంతయును బసుపుసున్నములకూడికచేఁ బొడముపారాణివలె శివశక్తి విలక్షణ ముగాఁ బొడగట్టుచున్నది "శక్తిశక్తిమతోరభేదాత్" అను నియమముంబట్టి నిత్యసత్యపదార్థములయిన శివశక్తులకు భేదమే లేదు గాని "సంసారోఽయమతీవవిచిత్రః"అను నాచార్యోక్తింబట్టి యసంభవ కార్యమగు నీదేహస్మృతిరూపకజగమంతయు స్వప్నము గారడీ మాయనాటకమువలె విస్మయహేతువై యెట్లుకలిగెనో శివుఁడుకూడ నిట్టివిచిత్రజగత్సృష్టికి మూలమ న్దెల్పఁజాలఁడనుటకు "సోఽఙ్గవేద యదివానవేద" అను శ్రుతియే ప్రమాణము ఈజగమంతయును మనోవిభ్రాంతిజన్యముగాని వాస్తవము కాదనిమాత్రము నిస్సందేహ ముగాఁ జెప్పఁగలనుగాని యీమనోవిభ్రాంతికిఁ మూలమే మానసమా ధ్యవస్థయందుమాత్రమే గోచరమగును మఱి యట్టి తురీయావస్థ యెట్లుండునని-యీజాగ్రదవస్థ నిర్ణయింపఁ జాలదు

## నాదబిందుకళ

సరియే,యీసంగతి యిట్లుండఁగాఁ దనకు మఱి తనచెంతనున్న ప్రాణులకును జుగుప్సాశ్లీలభయలజ్జాశోకములు రవంతయు గలిగింపక మనస్సంతోషమునుగలిగించి మఱలమఱల వినుకోరికను మాటిమాటి కిని హెచ్చరించు నామరూపములు సరసములు "రసాత్మకం కావ్యమ్" అనుటచేతఁ గేవల మనస్సంతోషము రస మనంబడును "రసోవై సః" అను శ్రుతిచొప్పున నిత్యమనస్సంతుష్టియే భగవంతుని యథార్థస్వరూపము కాఁబట్టి శబ్ద మెట్లు రసముం బుట్టించునో య ట్లుచ్చరించువిధి నైల్పువేదాంగములు శిక్షావ్యాకరణచ్ఛందో నిరుక్తములు- జ్యోతిఃకల్పములను వేదాంగములు వాక్కునువిడిచి మనఃకాయకర్మములఁగూర్చి దెల్పుచున్నవి శిక్షావ్యాకరణచ్ఛందో నిరుక్తములను వేదాంగములు సరసమగుపలుకునుగూర్చియు జ్యోతిః కల్పములను రెండు వేదాంగములు సరసమగునడతనుగూర్చియుం దెల్పుచున్నవి లోకోపకారముగ నుడువుట నడుచుటయును సజ్జన ధర్మము జనులు తమలోఁదమకుఁ బరస్పరప్రేమానురాగములకు భంగమురానీక దేశకాలపాత్రోచితముగా నెట్టిపల్కులుపల్కనీ మఱెట్టినడతనడవనీ యదంతయును వేదశాస్త్రవిధిచోదితధర్మమే నిశ్చయముగా నగు నగును లోకోపకారపరులగు సజ్జనులకుఁ దప్పక దైవసాహాయ్యము కలుగును గల్గును "స్వరతః కాలతః స్థానా త్ప్రయత్నానుప్రదానతః" షడ్జాదిస్వరవిశేషములచేతను ద్రుతాది కాలవిశేషములచేతఁ గంఠాదిస్థానవిశేషములచేతను ధ్వన్యాత్మక వర్ణాత్మకశబ్ద ముపయోగింపఁబడు పద్ధతిని శిక్ష యను వేదాంగము వివరించుచున్నది కాఁబట్టి వేదోచ్చారణమునకు మాత్రమే శిక్ష యను వేదాంగ ముపయోగపడుచున్నది, లౌకికశబ్దములకును శిక్షా

శాస్త్రమునకును సంబంధమెద్దియును లేకున్నప్పటికి లోకోపకార
పరాయణులగు మునులు నాదబ్రహ్మోపాసనముచే దరించుటకై
శిక్షాపద్ధతులను జనులకైకమత్యముపుట్టించుటకై సర్వలౌకిక
భాషోచ్చారణ పద్ధతు లేర్పరచిరి "సవిక్షతలోకాన్నుసృజై-తస్మా
దవ్యక్త ముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమ" అను వాక్యానుసార
ముగా బరమాత్మనుండి త్రిగుణాత్మకకుండలిశక్తి యుదయించెను
కుండలి మనగా వలయాకారము ఉపాసకుల కాకుండలీశక్తి హృద
యాకాశమున వలయాకారమయిన మెఱుపువలె సాక్షాత్కరించును
కుండలీసాక్షాత్కారమయిన పుణ్యపురుషులు మఱి జననమరణము
లొందక శాశ్వతకైవల్యానంద మందుచున్నారు ఆకుండలీశక్తి
త్రిగుణాత్మకమైన బిందురూపమై స్థూలసూక్ష్మపరములనుముత్రివిధము
లుగా విభజింపబడి బిందునాదబీజభేదము లందుచున్నది అచిదం
శము-స్థూలనాదము చిదచిన్మిశ్రము సూక్ష్మనాదము- చిత్తుబీజ
నాదము ఈచిత్తే పరుడైనపురుషుడు మహేశ్వరుడును శబ్దబ్రహ్మ
మను మరొకపేరుబరగు నాయీశ్వరుడు ఈశ్వరసంకల్పమే బిందు
వనంబడును ఆబిందువు బ్రద్దలుకాగా బుట్టినధ్వని వ్యక్తమగు
చున్నది శ్రుతిసంపన్నమైన యారవమే శబ్దబ్రహ్మ మనబడు
చున్నది- ఇంతటుం బరమరహస్యమీశ్వరానుగ్రహము కలవారలకే
బ్రహ్మజ్ఞాన ముదయించును మఱియు బ్రహ్మజ్ఞానవతులయిన
పరమభాగవతుల సహవాసముగూడ లభించును భక్తిశ్రద్ధలబ్బును
వేయేల, సకలజీవులును కొందఱు పుట్టుకతోనే కొందఱు వేగముగా
గాని ఆలస్యముగాగాని భగవత్సంకల్పమున నెట్లుసంసారబద్ధులైరో
యట్లే భగవంతునిలో నైక్యమయి ముక్తులు కాకమానరు సత్సహ
వాసముచేతనే త్వరలో దుఃఖముక్తులగు కొందఱు దురదృష్ట
వంతులు చిరకాలము సంసారదుఃఖమనుభవించెదరు కొత్తముప్పై

సకలజీవులును గాలక్రమమున బ్రహ్మలో నైక్యము చెందెదరు అజ్ఞానమున సంసారబంధము ఎట్లబ్బెనో యట్లే ప్రజ్ఞానమున కైవల్యానందమును సకలజీవులకును గలుగకతీఱదు

దైవమే పౌరుషమై యుదకు దైవముగానే మిగులును కాలము ఋతుషట్కముగా మాఱుచుండునట్లు సంసారబంధమోక్షములను విద్యావిద్యాభావముచే నాత్మ యనుభవించుచుండును అక్షరుఁడగు పరమాత్ముని సంకల్ప ముక్షరుఁడగు జీవాత్ముఁడు సంసారియై యక్షరుఁడే యగుచుండును అశరీరమగు నాత్మయందు పంచభూత విశేషములు పుట్టి యాత్మయందే లయము చెందును స్థూలసూక్ష్మ వ్యక్తావ్యక్తకార్యకారణావస్థాభేదము తనకుఁదానే విద్యావిద్యలచే నాత్ముఁడనుభవించుట సహజము. వాస్తవముగా "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" అనునట్లాత్మకన్న వేఱేపదార్థము లేనేలేదు ఈ బ్రహ్మజ్ఞానము పరమభాగవతసహవాసముచే నతివేగముగా మర్త్యులకు సిద్ధించును ఈభూలోకము మర్త్యలోకమును గర్మభూమి యనఁబడును మానవులు స్వకర్మానుసారముగా నుత్పత్తిస్థితి నాశములందుచున్నారు కాఁబట్టి స్వార్థత్యాగముచేసి కేవల లోకోపకారపరాయణులై తమ సమస్తకర్మములు భగవదర్పణము కావించి "గోవిందనామకీర్తనగావించి భయంబుదక్కి ఖట్వాంగ ధరిత్రీవిభుఁడు జాఱకొనియెన్గైవల్యము తొల్లి రెండుగడియలలోనన్" అను పురాణోక్తిప్రకారము "వాసుదేవశ్లోకవార్తల నాలించి కాలమే పురుషుఁడు గడువుచుండు నతని యాయువుదక్క నన్యుల యాయువు నుదయాస్తమయముల నుగ్రకరుఁడు వంచించి కొనిపోవు" కనుక పరమభాగవతుఁడు మాత్రమే నిత్యజీవనుఁడై కైవల్యానంద మనుభవించును తక్కినమనుజులు స్వార్థపరులై కర్మబద్ధులై స్వపర

బుద్ధి న్విడనాడనేరక సంసారసాగరంబున మునిగి తేలుచు దరిగాన కుందురు

"అ ఇ ఉ ణ్" మొదలగు పదునాల్గు మహేశ్వరసూత్రము లను వైయాకరణులు వ్యాకరణపరముగాఁ దక్షిణశాస్త్రవిదులు తత్తచ్ఛాస్త్రపరముగాను "చత్వారిశృంగా, గణానాంత్వా గణపతిం హవామహే" అను శ్రుతులకు వివిధార్థములగల్పించినట్లు స్వబుద్ధ్యను సారముగా మతభేదంబుల వర్తించుచున్నారు కేవలధ్వనిమాత్రముచే నానాపదార్థబోధను నానారసగ్రహణము న్గావించుకొనువారు మనుష్యులలో మిక్కిలిబుద్ధిగుంతులు ఉదాత్తముకంటె నుదాత్త ధ్వనియు ననుదాత్తముకంటె ననుదాత్తమును బల్కుటకు వీలుకాదు "అణోరణీయాన్ మహతోమహీయాన్" అనఁగా ననుదాత్తమగు సూక్ష్మధ్వనిరూపముగా నుదాత్తముకన్న స్థూలనాదరూపముగా వాసుదేవపరబ్రహ్మ మొుంటచేత నట్టి యణుమహత్తులను దెల్పుట మనుష్యులకలవికాదు అట్టి స్థూలసూక్ష్మనాదమాత్రైకవేద్యమే శ్రుతులు పదునాల్గని దేవమునియు నిరువదిరెండు కంఠనాళములం బట్టి యిరువది రెండని మఱొకమునియు నరువదినాల్గని యింకొకఁడు నానావిధజంగమస్థావరప్రాణివిశేషధ్వనిభేదంబులచే శ్రుతు లనంతము లని యింకొకఁడు మతభేదములం బ్రాచీనులు వక్కాణించిరి ధ్వని యొక్క హెచ్చుతగ్గుస్థాయులకునాదబ్రహ్మస్వరూపుఁడగు ననంతుఁడే యవధి "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అన్నట్లు నాదబ్రహ్మ మశ రీరమగటచే "ఇదమిత్థమ్" అని నిర్దేశింప నెవ్వారికిం దరముకాదను మతమే మిగుల సమంజసము సప్తోపాయములచే నాదితోద్యోపాసనము చేయువారికి మఱేదేవతల నుపాసించినప్పటికి న్వికటించదు ఆదిత్యో పాసనము చేయ కన్యదేవతోపాసనములు చేయునప్పు డాదిత్యదేవత తప్ప నితరదేవత లన్యోన్యము ప్రతిఘటించి యుపాసకుని జెఱచెదరు

కాఁబట్టి యీతీరుగాఁ గేవల నాదబ్రహ్మోపాసనము మాని వర్ణాత్మక ధ్వన్యుపాసనమువలనఁ బ్రమాదముండును కాలవ్యవస్థయు నుదాత్తాదిస్థాయివ్యవస్థయు అకార కకారాద్యక్షరవ్యవస్థయుం దఱఁచక కేవల స్వరమాత్ర మాలించుటచేత "స్వతో రంజయతి శ్రోతృ చిత్తం సస్వర ఉచ్యతే" అనునట్లు చిత్తమునకు రంజకమగు ధ్వనిని సంతతము వినుట కాసించు సంగీతప్రేగుకల యాదృష్టవంతు లేవరము భాగవతులగుజీవులు, "వాసుదేవః సర్వమితిసమహాత్మా సుదుర్లభః" అను విధమునఁ బరమభాగవతునకు నామరూపాత్మకజగమంతయును విష్ణుమయముగానేతోఁచును చిత్తమునకు వెగటే క్షణమైనందోఁచ నీక సంతతము చిత్తరంజకమైననామరూపములెవ్వియోయవే సరస్వతీ స్వరూపములు మఱి యవియే గీతవాద్యనృత్యలయాత్మకములగునాద బిందుకళలయిననాట్యకళలు "సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" అనువిధమున జగమునందలి నామరూపములన్నియు నాద బ్రహ్మాత్మకములే "అతో నాదాత్మకంజగత్" అనుటచేత శబ్దబ్రహ్మ మయముకాని పదార్థమే లేదు ఆకాశమను విభాగించి గుణములను నిర్ణయించుట యెట్లసాధ్యమో యాకాశ మేకొలతకైన నెట్లిమడదో యట్లే దిగ్దేశకాలవ్యవస్థ నాదబ్రహ్మమునకు లేకున్ననుపాసనాసౌలభ్య మునకై యశరీరులయిన దేవతలకు విగ్రహము లేర్పర్చినట్లు మూర్త మగు శబ్దబ్రహ్మమున కుదాత్తాదిస్వరములను లఘ్వాదికాలములను ముఖాదిస్థాన ప్రయత్నజన్యాక్షరవిభాగమును బరమకారుణికులయిన మును లేర్పరచిరి శబ్దబ్రహ్మమునకు దిగ్దేశకాలవ్యవస్థలుకల్పితములు గాని వాస్తవములు కావుకావు నూఱుతామరరేకులను సూదితో గ్రుచ్చఁబడినంతవట్టునకుఁ గాల మనియు నాకాలముయొక్క పెటకువ కాష్ఠనిమేషక్షణాదికమనిగాని లఘుదీర్ఘప్లుతములనిగాని ద్రుతమధ్య విలంబములనిగాని వ్యవహరింపఁబడును ఏజాతిబీజ మాచెట్లును మొలక

పించునట్లు మఱేజాతిదోషాద మాతీరుగా నాచెట్టుం బొదవించువిధ ముసఁ దలిదం(డులంబట్టి మనుష్యాదిజంతువు కుసహజముగా గుణము లబ్బుచు మఱియును సహవాసమునుబట్టియు నాచారమున ననుసరించియు నారోగ్యజీవనాభివృద్ధియును గలుగును అద్వేషియై నిత్య సంతోషియైన పరమభాగవతునకు "ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం (పాహురవ్యయమ్" అనునట్లు ఆదిత్యుఁడు - పృథ్వి-అంబిక జలము-విష్ణుః డగ్ని- గణనాథుఁడు వాయువు- మహేశ్వరుఁ డాకాశముగాఁ బంచదేవతామయుఁడై పాంచభౌతికాత్మకుఁడై (పకతీపురుషాత్మకుఁడై భక్తవత్సలుఁడైన వాసుదేవుఁ డభీష్టైహికాముష్మికసంపదలు తప్పక దయచేయును భగవత్కృపచే కిహపరసౌఖ్యము చేకూరదు మనుష్యులసుఖము వారిసత్కర్మఫలము- దుఃఖము దుష్కర్మఫలము సజ్జనులను భగవంతుఁ డాపదలనుండి కాపాడును మఱి దుర్జనుల నుపేక్షించు నిదే నిజము నిజము

## కాలగణన

"కాలరూపీ జనార్దనః" అన్నట్లు వాసుదేవుఁడు పంచభూతమయుఁడై శబ్దస్పర్శరూపరసగంధములను సత్త్వరజస్తమః(పవృత్తిచే 5×3=15 దినములకు వృద్ధియుం బదైదుదినములవఱకు నాశము న్గలిగి సృష్టిచం(దికచే సుఖదుఃఖాత్మకసంసారమన్విద్యాత్మక(పవృత్తి నివృత్తిస్వరూపకావరణవిక్షేపశక్తులం దా నద్వితీయుఁడు సచ్చిదానందుఁడు కేవలుఁడయ్యుఁ దనకుఁ దా వేత్తై (కీడించుచుండును సత్త్వము రజస్తమోగుణములన్మించినసంపూర్ణపూర్ణిమాచం(దికాత్మక సంతుష్టాంతరంగ స్వరూపమై వెలికిగానకుండును తమస్సు సత్త్వరజములన్మీఱినపు డమావాస్యాత్మకమై యాశదొఱంగి యొద్దియుం

దోఁచకుండు మనోరూపమై దుఃఖసంతప్త మగును రజస్సు తమ
స్సత్త్వముల నీడితినపుడు సంతుష్టికై దేవులాడు మనస్సువలె నమా
వాస్యాపూర్ణిమలకు మధ్యనున్న కాలమందలి చంద్రునివలెఁ బెరుఁ
గుచుం దఱుఁగుచుండును వ్యక్తావ్యక్తాత్మకాహోరాత్రదశలచేశబ్ద
స్పర్శరూపరసగంధములు ప్రత్యేకముం ద్రిగుణాత్మకములై పక్షరూప
మున ద్విగుణితమై మాస మగుచు మాసద్విగుణితరూపమున ఋతు
విశేషముగా మాఱుచుండును సత్త్వరజస్తమోద్విగుణితము లైన
మాసద్వయకాలాత్మకఋతువు లాఱై పొడచూపుచుండును
30×2×6=360 పగళ్ళు 360 రాత్రులుం గలసి సంవత్సరమగు
చుండును 5పంచభూతములు సత్త్వరజస్తమోగుణముల 15 భేదములై
స్థూలసూక్ష్మ వ్యక్తావ్యక్త కార్యకారణ మూర్తామూర్త విశేష
ద్వయవిభేదముచే రెట్టింపఁబడుచు 30 మాసము30×2=60ఋతువు
60×6=360ఆఱుఋతువు లబ్దము అబ్దములు 5 యుగము 12 యుగ
ములు ప్రభవాదిక్షయపర్యంతములగు నఱువదేండ్లుమఱియు నఱువది
పరార్థసంఖ్యచే గుణితశక్తిచేత హెచ్చింపఁబడినన్నియేండ్లు స్థూల
కార్యవ్యక్తమూర్తస్వరూపకాల మిాస్మృతాత్మకజీవాత్మసంసరించు
చుండును అనఁగా 180000000000000000 6×6=36×6=216
ఈరీతిగా 6పరార్థసంఖ్యాత్మక 180000000000000000కములైన
యాఱులమాఱులు హెచ్చింపఁబడఁగా వచ్చినసంఖ్యకలయేఁడ్లు-
అనఁగా మొదలు తుదయుం జెప్పఁదరము గానియాద్యమధ్యాంతము
లను నిర్దేశింపవీలుపడని యనంతసంఖ్యాక ప్రమాణాబ్దములు-
ఈసంఖ్య- దిక్కు- కాలము- గుణము ను వేయేల ద్రవ్యగుణకర్మ
సామాన్యవిశేషసమవాయాభావములనుపరార్థసప్తకము త్రిగుణాత్మక
మాయావిద్యాకల్పితముగాని వాస్తవము కాదు కాదు

పంచభూతాత్మకజగ మిదంతయును ప్రాతిభాసికమును వ్యావహారికసత్యముగాని పరమార్థసత్యము కాదు కాదు "ఏకమేవాద్వితీయం బ్రహ్మ- సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ=అయమాత్మా బ్రహ్మ- ప్రజ్ఞానంబ్రహ్మ" అను ప్రమాణములచేత నిజ్జగము బాధితముకాఁగా నెద్ది మిగులునో యెద్దియే పరమార్థసత్యవస్తువగు వాసుదేవుఁడు "యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ" అనువిధమున నాదబ్రహ్మతత్త్వ మిట్టిదని తెలిసికొనుటకుఁగాని యితరులకు బోధించుటకుఁగాని చతుర్ముఖుఁడైనఁజాలఁడని దేవముని పల్కుచున్నాఁడు కాఁబట్టి యుదాత్తాదిస్వరనిర్ణయముచేతఁగాని ద్రుతాది కాలనిర్ణయముచేఁగని కంఠాదిస్థానప్రయత్ననిర్ణయము చేతఁగాని శబ్దబ్రహ్మతత్త్వము దెలిసి తెల్ప నేరికిం దరము కాదుగాని లోకవ్యవహారవ్యవస్థకై మఱియును ధర్మసంస్థాపనముకొఱకై పరమకారుణికులు సర్వజ్ఞులగు గౌతమాదిబ్రహ్మర్షులు శాఖాచంద్రన్యాయముగా వేదశాస్త్రముఖములం బదార్థబోధ కావించిరి కనుక సర్వజ్ఞులైన గౌతమవ్యాసాది మహామునుల మతముల స్సద్గురుముఖమునఁ దెలిసికొని నడుచువారు తరింతురని నమ్మి తరించవలెను నమ్మకముకన్న వేఱే దారిలేదు "నమ్మి చెడినవారు లేరు, నమ్మక చెడిపోతే పోయేరు" అని రామదాసు పల్కు మిక్కిలి శ్లాఘ్యము శాబ్దప్రమాణాత్మకమగు నాప్తవాక్యమందలి నమ్మకముకన్న తరింపఁజేయు సాధనమితరమెద్దియు న్నాదు కాదు కాఁబట్టి వేదశాస్త్రానుసారమనుసద్గురుకటాక్షమునఁ దెలిసిన పెద్దలు తరించిరి పిన్నలు తాముకూడఁ బెద్దల నడువడి ననుసరించి తరించవలయును స్వార్థత్యాగులై కేవల లోకోపకారపరాయణులై సర్వభూతదయాకరులైన పరమభాగవతులు పెద్దలనఁబడుదురు.

కడుపులోనిగాలి పైకివదలుటచేత ననఁగ నుచ్ఛ్వాసముచేత మాత్రమే కేవలధ్వన్యాత్మకముగాఁగానివర్ణాత్మకముగాఁగాని శబ్దము శ్రావ్యమై వెలువడును ఉచ్ఛ్వాసముచేతఁ బ్రాణవాయుశక్తి తగ్గుచుండును కనుక పరిమితోచ్ఛ్వాస వ్యయముకావించుటచేత నాయువల్పముగుచుండును కాఁబట్టియే యోగులు నియతవాక్కులైనమును లుచ్ఛ్వాసనిశ్వాసవాయువు స్వాధీనముకావించుకొనుటచే నపరిమితాయువు లగుచున్నారు కాఁబట్టి యమితముగా వాగ్వ్యయము చేయువారు రజస్తమోగుణప్రధానులగుటచే శీఘ్రముగా నలసి రోజుచు నల్పాయువు లగుచుందురు మౌనవ్రతులై భోజనము కావించువారు కొందఱును సత్యసూనృతవ్రతులు హితమితప్రియమృదువాఙ్నియతులు కేవలమౌనవ్రతులు కేవలభగవన్నామసంకీర్తనవ్రతులు మొదలుగా నియతవాక్ప్రచారులగు పరమయోగులింద్రియవ్యాపారము నడ్డుచు మునులు నాఁ బరఁగి యపరిమితాయువు లగుచున్నారు రజస్తమోగుణములఁబట్టి శబ్దము పరిమితముగా బయల్వడుచు నరుల నల్పాయువులఁగావించు సత్త్వగుణముచేతఁగల్గువైఖరి మిక్కిలి పరిమితమై యాయువున్గొనసాగించుచుండును "వీణావాదనతత్త్వజ్ఞః శ్రుతి జాతి విశారదః తాళజ్ఞశ్చ ప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి" వీణ యనఁగా వైఖరీరూపగాత్రవీణ- వాదనమనఁగా దారువీణాదియంత్రధ్వని- తత్త్వమనఁగా విలంబకాలము- శ్రుతిజాతితాళనియమముతో విలంబకాలమున గీతవాద్యనృత్యముల ననఁగాఁ జతుర్విధాభినయములం బ్రవర్తించు మనుష్యుఁడు జననమరణాత్మకసంసారమున యథేష్టముగా సుఖింప గలఁడని శ్లోకతాత్పర్యము రజస్తమోగుణములు ప్రకోపించినపు డాయాసమధికమై ప్రకృతకాలోచ్ఛ్వాసాధిక్యముచేఁ బ్రాణవాయువ్యయమధికము కాఁగా జనులల్పాయువులగుచున్నారు సత్త్వగుణాధిక్యము

చేతఁ జతుర్విధాభినయప్రచారము విలంబకాలమున జరుగుటచేత నాయాసములేకుండుట నుచ్ఛ్వాసతము తగ్గుటచేత నాయు వధిక మగును నడకకన్నఁ బరుగధికాయాసకరమై మిక్కిలి యూర్పును వ్యయపర్చి యాయువును తగ్గించును సాత్వికుఁడు స్వార్థపరతన్మాని కేవలలోకోపకారపరాయణుఁడై చతుర్విధాభినయ ప్రచారమొన రించును రజస్తమోదూషితుఁ డహంకారమమకారబద్ధుఁడై దుర్వ్య సనపరుఁడై నియమములేక ప్రవర్తించుటచేతవ్యర్థప్రలాపబాహుళ్యము చేతను గామక్రోధలోభమోహమదమత్సరగ్రస్తుఁడై తన శరీరమును దెబ్బమాలి వ్యర్థముగాఁ దొందరపడి యాయాసపర్చుకొని యాహార నిద్రావిహారనియమములేక కోరి మిత్తివాఁతఁబడుచుండును సత్త్వ గుణప్రధానుఁడు లోకోపకారముగా సత్యముగాఁ బ్రవర్తిల్లుటచేత నియమిత మనోవాక్కాయకర్ముఁడై హితమితమృదువాక్కు - మంద కటాక్షము - మందగమనము - నియమితనిద్రాహారవిహారములు కలవాఁ డగుటచేత స్వాధీనోచ్ఛ్వాసనిశ్వాసములతో భీష్మునివలె స్వచ్ఛంద మరణసంపల్లాభము పొందుచున్నాఁడు

## అక్షరమహత్త్వము

చతుర్దశభువనమూలములగు చతుర్దశ మాహేశ్వరసూత్ర ములంబట్టి యక్షరములలో మొదటిదగు "అ" అను నక్షరము కడపటిదగు "హ" యను నక్షరమును గలిసి "అహమ్" అను జ్ఞప్తి గలిగించెను "సర్వంపరాత్మకం పూర్వంజ్ఞప్తిమాత్రమిదంజగత్" మొదట నంతయుం బరమాత్మయే కాని యీజగమంతయును జ్ఞప్తి మాత్రమే అహంకారరూపమే యీజగమంతయును "అహమ్" అను నహంకార రూపజ్ఞప్తిలేనపుడీజగమే లేదు కాఁబట్టి అహం కారమాత్రమే యీజగదుద్భవస్థితినాశములు గలిగించు జ్ఞానశక్తి

ద్వైతజ్ఞాన మహంకారాత్మకజ్ఞప్తి యనఁబడును మఱి యద్వైత
జ్ఞానమే బ్రహ్మ మనంబడును స్వరకాలస్థాన ప్రయత్నాభినయ
నియమము వేదపఠనముం గూర్చి యేర్పడినపద్ధతి గాని లోకవ్యవ
హారమం దొరుల నొప్పించక తా నొవ్వక దేశకాలపాత్రాను
సారముగా సుఖోచ్ఛ్వాసనిశ్వాససుఖకరముగాఁ జతుర్విధాభినయ
ముం జేసికొని యాయువు కొనసాగించుకొనవలెను తక్కినజంతువు
లకువలె భగవంతుఁడు మనుష్యులకుఁగూడ సహజముగా శీతోష్ణము
లోర్చుకొనఁదగినదేహములు సృజించెను మనుజులు విపరీతబుద్ధులై
మద్యముచే నెక్కువవేఁడి దేహమందుఁ దెచ్చిపెట్టుకొని యావింత
వేఁడిచేఁ గలుగువికారమునఁ గ్రొత్తవేడ్క నాడుకొనుట మరగి
మఱలమఱల నామద్యపానవ్యసనమునఁ జిక్కువడి యామద్యమును
జేసికొను తెల్వితేట తమకుఁదప్ప నితరజంతువులందుఁ గానక తక్కిన
జంతువులు బుద్ధిలేనివనియుం దాము మాత్రమే వివేకముగలవార
మనియుం దలంచుకొనుచుం గేవలసహజపద్ధతులంబట్టి దేహయాత్ర
గడపుకొను తక్కినజంతువులకంటె విపరీతబుద్ధులై కృత్రిమసుఖముల
కలవడి కోరి తక్కినజంతువులకన్న లేనిపోనికష్టములకుఁ బాలై
యకాలమృత్యువందుచున్నారు కొన్నిపిట్టలకు గూళ్ళల్లుకొని శీతా
తపములం దప్పించుకొను సహజనైపుణ్య మట్లే తక్కినజంతువులకు
మనుష్యు లూహింపశక్యముకాని శీతోష్ణనివారకసహజనిపుణత
కలదు మనుష్యస్వభావము మదహంకారముతోఁ దక్కినజంతువుల
కన్నఁ దా నెక్కుడు తెలివిగలవాఁ డని గర్వించి కోరి కొఱవితోఁ
దల గోఁకికొని దుఃఖించుట. కాఁబట్టి సర్వజగజ్జననియగు తనకన్న
తల్లి భూమియొక్క సారమును బీల్చుకొని తక్కినయవయవము
లన్నింటిని గాపాడుచున్న తనయడుగులకు భూసార మెక్కనీక
చెప్పులు తొడిగికొని కోరి తన యడుగులకు సుఖంకరభూస్పర్శము

దప్పించుకొని పాదరోగమును మఱితీరుననే తనసకలావయవములకును లేనిపోని యనవసరములగు తొడవులు కల్పించుకొనియును వంటక ములను మఱగి సకలఫలమూలధాన్యములను మఱియుం బానీయముల నగ్గిసెగను వండి కరగించి లేనిపోని కృత్రిమకల్పనములచే సహ జారోగ్యదశం జెఱచి ప్రకృతి నివికృతిగావించుకొని కోరి కష్టములకుం బాత్రుఁడై యల్పాయు వగుచున్నాఁడు తనకుం దక్కినజంతువుల కాకాశానిలానలజలభూములు సహజముగా నొక్కపోల్కినే దైవ సృష్టములు మఱియు నిద్రాహారవిహారసౌఖ్యాభిలాషము సమానమే యని తలంపక విపరీతబుద్ధిచే లేనిపోని కల్పనములం జిక్కి తక్కిన జంతువులకన్న శ్రమపడి యీల్గుట దురదృష్టమనుష్యస్వభావము ఋష్యశృంగుఁడు మొదలగుమునులందఱు మానవులయ్యును బుట్టిన వారు పుట్టినట్లే కాలక్షేపం చేయుచుం దక్కినజంతువులకన్నం దమయాధిక్య మొందుట లేదనియును నిద్రాహారవిహారాదిసహజ గుణములును జననమరణాదిసంసారసుఖదుఃఖానుభవమును ప్రాణు లందఱు ననుభవించకతీఱదని సహజదశలనియును సర్వకర్మములును కేవల దైవప్రేరితములే యనియును స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థల వశములై సహజముగా ప్రాణులకుం బ్రాపించుననియును సహజవిధి కాలకృత్యము లద్దరముగాక యవశ్య మనుభవించకతీఱదనియును బుద్ధిప్రయత్నమునకుంగూడ దైవమే ప్రేరకమూలమనియును తమ పాపములకుం దుఃఖములకుం దముదుష్కర్మములే కతములనియును మఱియుం దమమేలునకు శ్రీశుకభగవదనుగ్రహమే కారణ మనియును నిరహంకారులై నిర్మములై సర్వభూతసములై సాధన చతుష్టయసంపదఁగలిగి తనువెత్తిన సార్థక్యము దా ఖేదమోదముల నొక్కపోల్కి న్గూడ కుబ్బక సంచరించియుం జీవన్ముక్తులగు బ్రహ్మ భూతు లగుచు తమసుకృతకర్మములు వాసుదేవార్పణము

కావించుచుం బరమభాగవతులై నానాహావంబుల నిత్యానందపదవి నోలలాడుచు మానవజాతి వన్నె దెచ్చుచున్నారు.

తనయూహచొప్పునం దాం బల్కుటగాని పెనసమాజకంఠస్వర సౌందర్యమును ధ్వనిగ్రాహియంత్రాదిలిఖితమూలమునఁ బరుల కెఱిం గించుటగాని తనమనఃప్రవృత్తినివృత్తివిశేషముల ద్వారఁ దెలిసికొనుట గాని యేదేహధారికైన నరము కాదు కాదు "విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే పాదయుగముతోడి పశువుగాక" భూతదయలేని క్రూరాత్ముఁ డెంతచదువుకొన్న వాఁడయ్యను ద్విపాదయుగులతోనున్న మూర్ఖపశువేగాని మనుష్యుఁడనిపించుకొనఁదగఁడు భయజుగుప్సాశ్లీల లజ్జాజనకముగా వాక్కాయకర్మము లాచరింపఁగూడదు "అప్రసిద్ధ మపుష్టార్థమ్" అనువిధముగాఁ దనతోడివారి కన్నివిధములచే మిక్కిలి సంతోషమగువిధమునఁ బలుకుటయును నడువడి నెల్లడించుటయును మనుష్యుని కవశ్యకర్తవ్యము లోకోపకారముగాఁ బరిణమించుట కన్న లౌకికచతుర్విధాభినయములకు వైదికలక్షణ మెంతమాత్రముం బనికిరాదు కాఁబట్టి సర్వకాలస్థానప్రయుక్తవ్యవస్థ లెటులున్నను దన తోడిపాటివారి కింపగుతీరున లౌకికభాషల దేశకాలపాత్రోచితముగా మాట్లాడవచ్చును పాడుకొనవచ్చును మఱియును గ్రంథముల రచించు కొనవచ్చును వేదాంగనియమము లన్నియును కేవల వేదములయెడ మాత్రమే యుపయోజ్యములుగాని లౌకికభాషలయెడఁ గామచారానుజ్ఞ యథేష్టముగా దేశకాలపాత్రోచితము లోకోపకారమగుతీరున నాటపాటమాటలును గావ్యరచనమును గావించుకొనుటయే యవశ్య కర్తవ్యము.

నోరు తెఱచినకొలంది "అఆ" లు పలుకుచుండును "ఇఈ ఉఊ ఒఓఔ" లు పలుకుటకు నోరంతగాఁ దెఱవనక్కఱలేదు కాఁబట్టి యన్నియక్షరములలో "అ" యను నక్షరమునకె క్కువగా

నూపిరివిడువకలేఱదు మఱియు అ మొదలగునచ్చులకన్న నాయచ్చు
లతోఁగూడిన క మొదలగుహల్లులకూపిరి తక్కువగుచుండును కేవల
క్ మొదలగువ్యంజనములకు "అ" మొదలగు చ్చులతోఁ జేరినఁగాని
బల్కబడియే లేదు "అ" మొదలగునచ్చులు దైవమువలెస్వతంత్రములు
సహజములు క మొదలగు వ్యంజనములు పౌరుషమువలె నస్వతంత్ర
ములుం గృత్రిమములును దైవము తోడుపడినఁగాని పౌరుషమే ప్రవ
ర్తింపనేరదు అచ్చులసాయము లేకహల్లులు ప్రవర్తిల్లనేరవు ఒక్క
"అ"యను నచ్చుమాత్రమే స్వరకాలస్థానప్రయత్న విశేషములతో
నభీష్టార్థదాయకమై సమస్తమహదమహత్ప్రాణులకెల్లరకుం బరస్ప
రోహాపోహావిశేషంబులు దెల్పఁజాలినప్పటికిని "ఇ" మొదలగు
తక్కినయచ్చులు "క్" మొదలగు వ్యంజనములును విష్ణుస్వరూప
మును సకలవర్ణాదియునగు అకారమాత్మ నానావిధోపాధిభేద
ములగు పంచభూతవిశేషముల ననంతవికారాత్మకజగత్తునకు హేతు
వగుచందమున నానావిధజంగమస్థావరప్రాణివిశేషధ్వని ప్రపంచ
మూలమైయున్నది హృదయసంతోషకమును హృదయవిభీషణమునై
ధ్వని రెండుతెఱంగులసహజదైవకృతమునుగృత్రిమపౌరుషకృతమునై
రెండుతెఱంగులం బొడముచున్నది మేఘమంద్రగంభీరగర్జితము నశని
నిర్ఘోషమును సహజ దైవకృతములు కోయిలకూఁతయు వ్యాఘ్రా
రావముఁ బౌరుషకృత్రిమములు

మనుష్యులుచ్చరించు భాషలు పౌరుష కృత్రిమధ్వనులు
దైవపౌరుషములకు నాటకములు బూటకములు కల్లలు మాయలు
మోసములు ప్రకృతులు గాని కపటములు దంభములుగాని యదార్థ
ప్రతిపాదకములు కావు మనుష్యులు సహజముగ నన్నిజంతువులలో
మిక్కిలి కపటస్వభావులు కనుక వారల యథార్థోహాలప్రకారము
వారి పల్కులు బయల్వెడలఁజాలవు మనుష్యభాషల కర్థనియమము

లేదు తక్కిన చేతనాచేతనవస్తు ధ్వనుల కర్థము నిత్య నియతమును కాఁబట్టి మనుష్యుల భాషాశబ్దములకుఁగాని మతేయభినయవిశేషము నకుఁగాని "ఇదమిత్థమ్" అనినిరూపింపఁదగిన నియమముగాని పద్ధతి గాని యేర్పఱ్చశక్యముకాదు కాఁబట్టి శిక్షాదివేదాంగములు లోక వ్యవహారమునకు నిదర్శనములుగాని శాసకములుగాని యుపయోజక ములుగాని యెతమాత్రము న్గావు కావు అకారము సర్వాక్షర ప్రవృత్తిహేతువగు నాద్యశబ్దరాజము ముఖ్యాక్షరము గనుకనే మహేశ్వరసూత్రము "అ-ఇ-ఉ ణ్" అని ప్రారంభించెనుగాని "ఇ-ఉ-అణ్" అనిగాని "ఇ-అ ఉణ్" అనిగాని "ఉ-అ-ఇణ్" అనిగాని "ఉ-ఇ-అణ్" అనిగాని ప్రారంభించలేదు మొదటివేదమగు ఋగ్వేదము "అగ్నిమీళే" అని "అ" యను నక్షరముతోనే ప్రారంభించెను చతుర్దశమాహేశ్వరసూత్రములలో మొదటిసూత్రమగు "అఇఉణ్" అను సూత్రముచేత సమస్తవర్ణములతోఁగూడిన చతుర్దశభువనముల సృష్టిరూపమగు సాత్మతత్త్వముపదేశింపఁబడెను "అకారో బ్రహ్మ రూపస్స్యా న్నిర్గుణః సర్వవస్తుషు చిత్కలామభిసంశ్రిత్య జగద్రూపీ ఉణీశ్వరః" అకారము నిర్గుణుఁడగు పరమేశ్వరుఁడు మాయా స్వరూపమగు "ఇ" కారముతోఁగూడి "ఉ" కార స్వరూపమున వ్యాపకుఁడై "ణ్" ణకారమున సగుణుఁడగుచున్నాఁడని యర్థము ఆత్మను ధ్వనిచేయుటకై పొడమిన సంకల్పము పర ఆయిచ్ఛ నాభీ చక్రము నుపాధికావించుకొని పశ్యంతియై హృదయనాళముల్లంఘ్న మధ్యమయై కంఠనాళములనుండి శ్రోత్రగ్రాహ్యధ్వనియై వెలువడి వైఖరీసంజ్ఞ నందుచున్నది పరాపశ్యంతీమధ్యమావైఖరులు నాద బ్రహ్మమునకు నాల్గుముఖములు "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపా దస్యామృతం దివి" ఈసమస్తజగమ్మును వైఖర్యాత్మకమై చతుష్పా త్తగు నాదబ్రహ్మయొక్క యొకపాదము పరాపశ్యంతీమధ్యమముల్లను

శక్తి-సమూడుపాదము లమృతములు నిత్యములును వైఖరియను జగదాత్మకపాదము మర్త్యమనిత్యము "బ్రాహ్మణః షడంగసహితవేద మధీయీత "బ్రాహ్మణుఁడు మాత్రము వేదవేదాంగములను దప్ప కధ్యయనము చేయకతీఱదనుటచేతను షడంగ వేదాధ్యయన మనాది సంప్రదాయానుసారముగాఁ జేయువాఁడే బ్రాహ్మణుఁడని బ్రాహ్మణ జాతిని మనుష్యులలో నేర్పర్చుటకై వన్నినపన్నిక పెద్దకొడుకు మాత్రము రాజగుట కధికారమేర్పర్చినట్లుషడంగవేదాధ్యయన మొన ర్చినవాఁడే బ్రాహ్మణుఁడనియు మఱి బ్రాహ్మణుఁ డితరజాతులచేత నన్నివిధముల స్సేవింపఁబడుట కధికారముగలవాఁడనియు మఱి యట్టి బ్రాహ్మణుఁడు యజ్ఞదీక్షితుఁడైనవుడు మాత్ర మబద్ధముగాఁగాని యపభ్రంశముగాఁగాని యస్పష్టముగాఁగానియసంస్కృతముగాఁగాని యసాధువుగాఁగాని వైఖరినుపయోగింపఁగూడదనియును అథశబ్దాను శాసనమ్" అనునెడ మహాభాష్యమువలన వ్యాకరణసాధువగు శబ్దము సుశబ్దమనియును సుశబ్దోచ్చారణముపుణ్యస్వర్గజనకమనియును "రక్షోహాగమ లఘుసందేహాః ప్రయోజనమ్" అనుటచేత షడంగములు వేదోచ్చారణమునకు వైదికసంప్రదాయమును గాపాడుటకుమాత్రమే చెప్పఁబడెను వ్యావహారికభాష జనరంజకముగానున్నఁ జాలును మఱేనియమములతో లౌకికవ్యావహారికభాషల కవసరము లేదు లేదు లోకోపకారమగుతీరున జనరంజకముగా నెట్లు ధ్వనిచేసినను జేయ వచ్చును వేదాంగములతో లౌకికభాష కేసంబంధమును లేదు లేదు వేదవేదాంగములు కేవలము పారలౌకికపదార్థబోధకములు ఇహ లోకముతో వేదవేదాంగసంబంధము లేనేలేదు

## ధ్వ ని వి శే ష ము లు

వేదమందలి ఛాగ- బ్రాహ్మణ- యూప- పక్షి- సర్ప మొద లగుచేతనాచేతనపదార్థవాచకశబ్దములు మేఁక- బాపఁడు- కొయ్య-

పిట్ట- పాము మొదలగు నీలోకమునందలి చేతనాచేతనవస్తుపరము లెంతమాత్రము న్గావు కావు వైదికశబ్దములులౌకికశబ్దములకుఁ గేవల ముచ్చారణమందు నర్థమందును భిన్నములు ప్రథవిష్ణుశబ్దమును గూర్చియును యజ్ఞ లుగంతిముంగూర్చియు లేటునుగూర్చి "తత్తు ఛందస్యేవ" అనుపవాదముకనుక ఛందస్సనియును భాషయనియును శబ్దము రెండువిధములు దేవుఁ డంతట నిండియు నెద్దియున్గాని విధమున వేదస్మరణముచే లోకము సృజింపఁబడియును లోకమునకు వేదమునకు నుంతయును సంబంధములేదు వంచకులు ధూర్తులును దాము పఠించుశబ్దములే వేదములనియును ఆశబ్దము లుచ్చరించుటకుఁ దామే యధికారులమనియు తంత్రియాస్తికిఁ గొడుకులే మొదటి యధికారు ౦నియును లింగాభిషేకమునకుఁ బూజకును బూజారులే యధికారులనియును జాతులు వావులు మొదలగు నానాదేశకాల పాత్రోచితవ్యవస్థలు వేదవిహితములు ధర్మచోదితము లనియును "పశుమాలభేత" అను శ్రుతికి మేఁకను ముక్కు- చెవులు మూసి చంపి వపతీసి యగ్గిలో వేల్చవలయుననియును మొదఁ గుశిష్టాచార ములు సంప్రదాయములువర్ణాశ్రమధర్మములు వేదమందుచెప్పఁబడిన వనియుం దాము పఠించునది వేదవేదాంగములనియును దాము చెప్పునది వేదార్థమనియును దమకు వేఱగువారు మ్లేచ్ఛులునంటరాని వారనియుం దాము మాత్రమే బ్రహ్మనోటినుండి యూడిపడ్డామని యాత్మస్తుతి పరనిందయు మిగుల స్వార్థపరతతో వంచకులై భూత ద్రోహమాచరించు దుర్జనుల నేమనవలయును ?

జ్ఞానముయొక్క- ప్రతిబింబము కోరిక- కోరికయొక్క- ప్రతి బింబము నామరూపప్రకాశనము- నామరూపములు నాదబ్రహ్మము యొక్క- వివర్తస్వరూపము. నామరూపములనఁగా శబ్దాకారములు శబ్దము కేవల శ్రవణైకగ్రాహ్యము రూప మనఁగా స్పర్శరూపపర్ణ

గంధములు త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణగ్రాహ్యములు. జ్ఞానము పలుకు
నిచ్చుగాఁ బలుకు నిచ్చు కంఠధ్వనిగ మారును. ఊహ చతుర్విధాభి
నయముల వెల్లడింపఁబడును. సహజనామరూపములగు కంఠధ్వనిచేత
శరీరావయవచలనవిశేషములచేతను మిక్కిలి స్ఫుటముగా నూహ
వెల్లడింపశక్యమగును. కృత్రిమనామరూపములగు యంత్రధ్వని
ప్రాఁతబొమ్మలు మొదలగు వానిచేతనూహ సమగ్రముగాఁ దెలుపఁ
బడనేరదు. కాలునకుబదులు మరిగాలు, దూడకు బదులు చేటపెయ్యి
వలె నెట్లో కొంతక్రియ నెఱవేర్చుకొనుటకు సాధనముగా నిట్లు
గ్రంథములు వ్రాయుటయును ధ్వనిగ్రాహియంత్రములందు కంఠధ్వని
యొక్క ప్రతిబింబమును సంగ్రహించుటయును సంభవించుచున్నవి.
తనజీవితకాలములో మిక్కిలి దృఢశరీరముతో నారోగ్యవంతుఁడై
సుఖముగానున్న పండితుఁ డుల్లాసముతో నొనర్చిన కంఠధ్వనిచేతగాని
శరీరావయవవిశేషముచేతఁగాని తనయూహను సంపూర్ణముగా
వెల్లడింపఁగలిగినట్లు వ్రాఁతమూలముగాఁగాని మఱియేయంత్రమూల
ముగాఁగాని మఱేకృత్రిమరచనముచేతగాని వెల్లడింపనేరఁదు.
జగమం దెన్నివిధముల జంతువులో యన్నివిధముల కంఠధ్వనులు
ఆయామనుష్యులయూహలు కొంతవఱకైన న్వారివారికంఠధ్వనులచేత
సరిగా వెల్లడింపఁబడును. తనయూహ చొప్పునఁ దానే సరిగా
నెవ్వఁడుం బల్కనేరఁడు. జీవుఁడు స్వతంత్రుఁడు కాఁడెల్లవిధములన్
బద్ధుఁడుగనుకఁ జంద్రునిం బట్టుకొన నూహ వెళ్ళినట్లు చేయి వెళ్ళఁ
జాలదుగా? కాఁబట్టి యూహ కొలంది నభినయింప మునులకుఁ దప్పఁ
బ్రాకృతుల శక్యము కాదు "అథశబ్దానుశాసనమ్" అని పతంజలి
వ్యాకరణముయొక్క ప్రయోజనమును సుశబ్దాపశబ్దవివేచనాభ్యా
యోగమును గూర్చి నిద్రాహారసౌఖ్యమును గానక లోకోపకారమునకై
తన జీవితమంతయును ధారపోసి మహాభాష్యవాక్యము లుపదేశించెను.

గాని యమ్మహాత్మునివల్ల ప్రత్యక్షముగా నుపదేశింపఁబడిన శిష్యు లాముని యభిప్రాయములో శబ్దతత్త్వమును గూర్చి యామునికిఁగల జ్ఞానములో కోటివంతులలో నొకవంతైన సరిగా గ్రహింపఁగల్గిరనుట సందేహము. మఱి యాశిష్యపరంపరమూలముగాఁ గ్రమక్రమము గ్రంథరూపమున లిఖింపఁబడిన వాక్యములంబట్టి శబ్దతత్త్వము నిప్పటి ప్రాకృతమానవులు జాత్యంధు లేనుఁగుంబోల్చినట్లిది వేదము లివి వేదాంగము లివి ఛందస్సిది భాష యిది సంస్కృతమిద్ది యపభ్రంశ మని స్వార్థపరాయణులై జీవనసంపాదనముకొఱకై తెలిసీతెలియని పాండిత్యము వంచకులై వెల్లడించుచున్నారా యేమిఘోర కలికాలచేష్టితము? చవిచే రూపముం జూచుట మఱి కంటిచేత శబ్దమును వినుట యసంభవముకదా? నిత్యశబ్దమగు వేదమును మును లాలించి సర్వజ్ఞులు తపోధనులు గనుక శబ్దబ్రహ్మోపాసము కావించిరి ప్రాకృతపామరమనుష్యకల్పితయంత్రములచేత వ్రాయఁ బడిన సంజ్ఞలచేత నిత్యవేదశబ్ద బ్రహ్మతత్త్వమిద్దని వెల్లడించుచున్న స్వార్థపరధూర్తచేష్టిత మిన్నసీనమ్మచ్చునా? దేవునిస్వరూపము సచ్చిదానందలక్షణమ్మనుటచేత జ్ఞానము ప్రకాశానందములమూర్తి యగు కేవలదివ్యప్రేమయగు సర్వలోకోపకారకభూతదయ కదా?— వేదవేదాంగాత్మకనిత్యశబ్దబ్రహ్మము "చోదనాలక్షణోధర్మః" సర్వజగ దుపకారకమయిన భూతదయాత్మక ధర్మమునుమాత్రము వెల్లడించు చున్నది అనంతసంఖ్యాకములగు వేదవేదాంగము న్నియును బర మార్థజిజ్ఞాసువులయి ముముక్షువులయి సాధనచతుష్టయసంపదగలిగిన జితేంద్రియులగు మనుష్యులకుమాత్రమే యుద్దేశింపఁబడెనుగాని ప్రాకృతులగు సంసారుల కెంతమాత్రమున్నాదు కాదు

వేదవేదాంగములకు స్సంసారులగు మనుష్యులకును ధ్రువ పక్షప్రేమునకీభూగోళమునకువలె స్వర్గమునకు నక్కానుపాలెఁ జాల

తవ్వు కాఁబట్టి సంసారోపయోగకరమగు లౌకికశబ్దమును గూర్చి మాత్రమే వివరించి యే శబ్దము లోకోపకారకమో యట్టి శబ్దమును ముందువలె వివరించి సంగ్రహించుకొనవలెను. వివృతసంవృతములగు స్థూలసూక్ష్మదశలతోఁ ద్రిగుణోద్బోధకము వైఖరి యనంతవిధముల జగమున వెలువడుచున్నది. సూత్రముల కాధారమగు మాహేశ్వర సూత్రము "అఇఉణ్" అని అకారముతో మొదలిడుటచేతను "అ అ ఇతి" అని పాణినిసూత్రములు సమాప్తియగుటచేతను అక్షర సమామ్నాయమునకెల్లఁ బదునాల్గుభువనములకుఁ బ్రకృతివలె "అ" యను నక్షరమే జననియైనయది. కావునఁదక్క_న ఇకారాద్యచ్చులు కకారాదిహల్లులు వేయేల జగమునందలి సకలశబ్దములన్నియును నాదబ్రహ్మము జగద్రూపమున వివృతమైనతీరున "అ" ఆకారమే సకలాక్షరసమామ్నాయముగా వివృతమైనదనియు జగమునందలి యన్ని శబ్దముల కాలవాలము "అ" కారమే యనియును గావుననే సకలజగన్మయుఁడగు శ్రీమహావిష్ణువు "అ" కారవాచ్యుఁ డయ్యెను వివార మనఁగా విప్పుట సంవారమన మూయుట. కంఠధ్వని లావు చేయుటకై కంఠనాళములను నోటి సమగ్రముగాఁ దెఱచిధ్వనిచేయు నపుడు "అ" కారము వివృతమయి ఖఘఛఝఠఢథధఫభ మొద లగు నొత్తులు హకారమును దీర్ఘప్లుతములను బల్కు_ను సర్వజగ ద్రూపి విష్ణువయినట్లు సకలశబ్దస్వరూపి "అ" కారమే మఱియును జగములో నెందఱుదేహధారులుకలరో నవరసాత్మకమై సత్త్వరజ స్తమోగుణప్రబుద్ధమై ప్రతిక్షణమును స్థూలసూక్ష్మదశల న్మాఱుచు కేవల ధ్వన్యాత్మకముగానువర్ణాత్మకముగాను వ్యక్తావ్యక్తరూపముల ననంతశ్రుతిస్వరజాతిగ్రామమూర్ఛనాతానవిశేషములతో ననంతవిధ స్థాయిభేదములతో లెక్కి_ంపశక్యముగాని భాషావిశేషములై వివిధా నూలవై దిక్ప్రబుద్ధమై యాకాశగుణమై శ్రవణేంద్రియగ్రాహ్యమై

పరాపశ్యన్తీమధ్యమావైఖరీరూపకము లనింద్రియాతీతమై యింద్రియ
గ్రాహ్యమై జ్ఞాతృజ్ఞేయజ్ఞానత్రిపుటీభూతమై సగుణనిర్గుణాత్మకమై
యున్న నాదశబ్దబ్రహ్మతత్త్వము శివునకుండక్క నన్యుం డెఱుంగం
జాలునా? "ఇదమిత్థమ్" అని శబ్దబ్రహ్మతత్త్వమును చతుర్ముఖుండైన
నిర్దేశింప శక్తుండు కాండను దేవమునివాక్యము సయుక్తికము "బృహి
విస్తారే" బ్రాహ్మణుండు బ్రహ్మ బ్రహ్మము బృహస్పతి యీ మొద
లగు "బృహి" ధాతుజన్యశబ్దములు వైదికములుం బారలౌకికములు
గాని పదార్థవాచకము లెంతమాత్రము న్గావు కావు కాంబట్టి
విష్ణువునకు మాఱుగా శిలాప్రతిమ లేర్పడినచందమున వేదములందుం
జేర్పంబడిన బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులకు, నిజమగు పెయ్యకుం
జేంటపెయ్యవలెం గాలునకు మరగాలువలె బింబమునకుం బ్రతి
బింబమువలె మనుష్యులలో బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదిజాతుల
వారిని లోకసంగ్రహార్థమై ధర్మసంరక్షకు సర్వజ్ఞులగు మును లేర్పర్చి
రని తెలియనేరక యహంకారవిమూఢమానవులు తాము బ్రాహ్మణాది
జాతులుకలవారమనియుం దమజాతులు వేదసమ్మతములనియును
యవివేకమున విఱ్ఱవీంగి కోరి మతిభ్రష్టులగుచున్నారు జగమంతయును
విష్ణుమయమయినప్పటికిని విష్ణువు లోకాతీతుండయినవిధమున లోక
మంతయును వేదస్మరణమునం గల్పింపంబడినప్పటికి వేద మీలోకా
తీతమై కేవల పారమార్థికమై యున్నది ఆకాశమంతట నిండియు
నెద్దియున్గాక యగ్రాహ్యమైనతీరున యీలోకమంతయు వేదస్వరూప
మైనప్పటికి యింద్రియగ్రాహ్యము కాదు "విజ్ఞాతారమరేకోవిజానీ
యాత్" సర్వవేత్తయగు వేదపురుషుండు వేద్యుం డగుటెట్లు? కాంబట్టి
మానవులనోళ్ళమలంగు "ఇషేత్వా" మొదలగుఇంద్రియగ్రాహ్య
ములు వ్యక్తరూపములగు శబ్దములు వేదము లెంతమాత్రము న్గావు
కావు కావు. మానవులలో బ్రాహ్మణాదిజాతులు లేవు లేవు

అస్వాస్థ్యవశమువాదిస్థానములనంతవిధములనుండుటచేతనుసత్త్వరజస్తమోగుణసంమిశ్రవిశేషములచేత వివర్తాశక్తి యనంతభేదముల స్థూలసూక్ష్మగతుల నుండుటచేతనునానావిధదేశకాలపాత్రానుసారముగాఁ బసినాఁటినుండి సహవాసముంబట్టియు గ్రహణశక్తింబట్టియు నభ్యాసపాటవముంబట్టియు వివిధార్థబోధకమగుచు ధ్వన్యాత్మకవర్ణాత్మకరూపవిశేషములందుచు నానాభాషావిశేషాత్మకమై యాకాశగుణమగు శబ్దము ఛందోభాషావిశేషముగాఁ బరిణమించుచున్నది

అకారాద్యచ్చులుగాని కకారాదిహల్లులుగాని మఱెట్టివర్ణములుగాని నిత్యములుకావు ఆకాశగుణమగు శబ్దము నిత్యము ఆకాశశబ్దములకు "గుణగుణినోరభేదః" అను న్యాయానుసారముగా భేదమే లేదు "పరమేవ్యోమన్" అనుటచేత నాకాశమే బ్రహ్మము కాఁబట్టియే శబ్దము బ్రహ్మమనఁబడెను శబ్దము మూర్తమమూర్తము కార్యము కారణమని ద్వివిధము జగద్రూపముగావివర్తమైనశబ్ద మనిత్యమగు కార్యరూపము, మూర్తము, నిర్గుణము కారణమమూర్త మాత్మస్వరూపము ఉపాధివశమున మనఃకల్పితమై శ్రవణేంద్రియశక్తిచేనంది గ్రహింపఁబడిన మాయాకల్పితమై యనిత్యమై కార్యమై వ్యావహారికమై ప్రాతిభాసికమై యౌపాధికమైదోవారికమై స్వప్నవికారసదృశమైన మిథ్యాశబ్దముమాత్రమే వేదవేదాంగరూపముంగాను మఱియు నానావిధభాషారూపములుగాను దోఁచుచున్నది. కాఁబట్టి ఋక్ష్వేత్యాది వేదవేదాంగశబ్దములును జగమునందలి శ్రోత్రగ్రాహ్యములయిన యితరశబ్దములును కార్యము లనిత్యములు వినాశములు ప్రాతిభాసికములు వ్యావహారికములు మిథ్యయుంగానితెలంతమాత్రము స్వాస్తమమును బారమార్థికసత్యమున్నాను కాదు జ్ఞాతయు గ్రాహకము నిత్యముం గారణముం బారమార్థికసత్యమగు శబ్ద బ్రహ్మ క్షేత్రమును గ్రాహ్యమును ననిత్యముం గార్యమును వ్యావహా

హారికమిథ్యాస్వరూప మెన్నటికిన్గాదు కాదు శబ్దస్పర్శరసగంధ
గుణకము గు పంచభూతములయొక్క స్థూలస్థితిభూగోళము, సూక్ష్మ
స్థితిఖగోళము శబ్దాదిగుణపంచకసర్గమందుగాని ప్రత్యేకముశబ్దాది
గుణములువ్యక్తీకరింపనేరవు నాదబ్రహ్మమేశబ్దముగానుస్పర్శముగాను
రూపముగానురసముగానుగంధముగానుమఱియుపంచభూతాత్మకజగ
ముగా వ్యక్తస్థూలవివర్తరూపముగా మూర్తీభవించియనిత్యకార్య
ముగాఁ దోఁచుచునవ్యక్తసూక్ష్మసంవృతరూపముగా నమూర్తమై
నిత్యకారణముగా శేషించుచున్నది కంఠధ్వనికూడ వివృతసంవృత
దశాద్వయమేళనముచే ధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్దవిశేషములచే వ్యక్తా
వ్యక్తస్థితులన్ గార్యకారణములం బరఁగుచున్నది పరాపశ్యన్తీ
మధ్యమావైఖరులు నాదబ్రహ్మపుక్రమముగా వ్యక్తీకరించినస్థితులు
జగమునందలి సమస్తధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్దములన్నియును వివృత
సంవృతాత్మకమగు "అ" కారమే నానారూపములు కల్పితములు
అకారాద్యచ్చులు కకారాదిహల్లులు సకలవేదములు సమస్తభాష
లును ఆ "అ"కారముయొక్క వివృతసంవృతదశాద్వయసమ్మేళన
వశముచే వ్యక్తీకరించినశబ్దవిశేషములే పంచభూతముల కుపాధిభేద
ములంబట్టి గుణవిశేషములు పొడచూపినట్లు శబ్దబ్రహ్మ ముపాధి
వశంబున జగమునందు నానాఛందోభాషావిశేషములం బొడచూపు
చున్నది భగవదుపాసనాసాధనమైసకలలోకోపకారకమై సకలజన
మనస్సంతోషకరమగు శబ్దము సాధువును సంస్కృతమును, జుగుప్సా
శ్లీలభయలజ్జాదుఃఖకరమగు శబ్దమసాధు వపభ్రంశమును, ఊర్ధ్వాధః
ప్రాగ్దక్షిణపశ్చిమోత్తర స్థూలసూక్ష్మదిగ్విశేషములాకాశమందు వ్యవ
స్థితనామరూపములచేతఁ గల్పితములయినచందమున శబ్దబ్రహ్మమందు
నానావేదభాషలు వ్యవస్థితనామరూపాత్మకముగా స్వప్నదృష్టపదా
ర్థములవలె మిథ్యాకల్పితములుగాని వాస్తవములు కావు ఈజగమ్మం

తయును నాదబ్రహ్మముయొక్క వివర్తితమిథ్యాస్వరూపమే కనుక శబ్దమందు సాధుత్వాసాధుత్వకల్పనము లోకధర్మసంగ్రహార్థమై మునులు కల్పించినవ్యవహారముగాని యథార్థము కాదు ప్రకాశము నకు శుక్లకృష్ణారుణపీతాదివర్ణములవలె శబ్దమునకు సంస్కృతాప భ్రంశాదిభాషాదినామరూపవిశేషము లౌపాధికములు నైమిత్తిక ములుం బ్రాతిభాసికములు న్వ్యవహారికమిథ్యారూపములుగాని వాస్తవములు కావు కావు

## వ్యా స ప ద ని ర్వ చ న ము

ఉభయలోక సంతరణసాధనముగాసహజజ్ఞానకారణవ్యక్తులగు మునులు లోకసంగ్రహార్థమై యవ్యాకృతనాదబ్రహ్మమును నామ రూపాత్మకముగా వ్యాకృతమొనర్చిరి వేదద్రష్టలగు మును లశరీరులు గాని సశరీరులెంతమాత్రమును గారు వ్యాసముని యనఁగా వ్యాస శబ్దమువిపూర్వకమగు "అస" యనుధాతువునుండి పుట్టిన ఘఞంతము "అసవిక్షేపే" అనుటచేత నావరణవిక్షేపములనుశక్తులచేత బంధ మోక్షములు జీవుఁ డందుచుండును మోక్షకారణముగువిక్షేపశక్తిని వ్యాసశబ్దము తెల్పుచుండుటచేత వ్యాసముని యనఁగా మోక్షజ్ఞాన మును గలిగించువిక్షేపశక్తి యనియర్థముగాని సశరీరుఁడై సంచరించు కర్మబద్ధుఁడగు జీవుఁ డెంతమాత్రము న్గాదు కాఁడు వ్యాసుఁ డని యొకపాంచభౌతికదేహధారి యొన్నఁడు న్లేఁడు మోక్షజ్ఞానబోధక శక్తియొక్క మూర్తికి సత్త్వగుణాత్మకోపచయాతిశయమునఁబుల్లింగ ముగా వ్యాసనామము నిర్దిష్టమయ్యెను కాఁబట్టి సకలర్షిస్వరూపాత్రి ప్రముఖర్షులందఱునువ్యక్తీభూతాత్మజ్ఞానమూర్తులుగానిమిథ్యాభూత పాంచభౌతికోపాధివిశిష్టు లెంతమాత్రము న్గారుకారు వ్యాసాది మునులమతములన్నియుం బ్రకాశమొక్కటియయ్యు శుక్లాదినానా

వర్ణముల నుపాధివశమున నిరూపించునట్లు నానావిధములం దేశకాల
పాత్రోచితములై జ్ఞానబోధకములగుచున్నవి సర్వదేహములు పాంచ
భౌతికములేయైనట్లు నానాదేశములందు చైతన్యమొక్కటియే వెలయు
నట్లు సకలజగమును వాసుదేవుఁడేయైనచందమున లోకమునందు
సర్వవేదములు సమస్తభాషలును వైఖరీమూర్తమై వివృతసంవృత
సమ్మేళనవిశేషాత్మకమై విష్ణుదేవతాకమైన "అ" కారమే కనుక
"అఆ" అని శబ్దానుశాసనముసమాప్తి కావింపఁబడెను స్వప్నదశ
వలె మిథ్యావ్యవహారకములగు నానాభావములఁ గల్పించుచున్నది
కూలంకషముగాఁ దనయూహ నేదేహధారియు న్దెలుపఁజాలఁడు
మఱియుం దనకు నిద్ర యెట్లుపట్టునో మఱియుం దా నెట్లు మేల్కొ-
నునో మఱియుం దనస్వప్నావస్థలోఁగాని గాఢసుషుప్త్యాదిసమ్మూర్ఛితా
వస్థయందుఁగాని తనతలంపు లెట్లుండునో మిక్కిలి పసిపాపగాఁ దా
నున్నపుడు మఱియుం దా నవశముగానున్న కొన్నిసమయములందుఁ
దన మనోవృత్తి యెట్లుండునో యాసంగతి న్దాఁ దెలియలేకున్నప్పుడు
పైకెట్లు తెలుపఁగలఁడు ?

## అనిత్యకార్యరూపశబ్దబ్రహ్మము

తనయూహ తనశరీరావయవచాలన విశేషాకారములచేతఁ
బరులకెఱిఁగించువిధ మాంగికాహార్య సాత్త్వికాభినయవిశేషములై
రూపముగా నిరూపింపఁబడును ఉచ్ఛ్వాసనిశ్వాసవాయుధ్వనివిశేష
ములచేత నవయవసంతాడనధ్వనిచేతను సకిలించుట, దగ్గుట, యూల
వేయుట, ముక్కునగాలినెగబీల్చుట, బయలుచేయుట, గుసగుసలాడుట
నిట్టూర్పుపుచ్చుట మొదలగు ప్రాణాదివాయుసంచాలనజన్య
ధ్వనివిశేషములచేతను, పెదవులచేతను లొట్టలువేయుట చేతను
నాలుకయంగుడు తాఁకుటచేతను, వండ్లుకొఱుకుటచేతను, నానాప్రకా

రములగు ముద్దులు పెట్టుకొనుతీరులచేతను, మఱియుం గేవలధ్వన్యాత్మ
కము శరీరావయవవిశేషపరస్పరసంఘట్టనసంశ్లేష విశ్లేషవిశేషశబ్దముల
చేతను, దనయూహలు కొంతవఱకుం బరుపు దేహి తెల్పఁగలఁడు
కంఠోష్ఠనాసికాజిహ్వాతాలుదంతాద్యాస్యావయవ సంయోగవియోగ
విశేషజన్యములగు నచ్చులు హల్లులు నానావిధాగణితప్రకారములై
వ్యక్తావ్యక్తప్రస్ఫుటాస్పష్టకళావిశేషములతోఁ బ్రతిజంతువునెడభిన్న
ములై యనంతప్రకార[illegible]వడుచు దేశకాలపాత్రాను
సారముగా నుపాధిభేదముచే, నానాభాషావ్యవస్థ చేతశ్రవణేంద్రియ
గ్రాహ్యమై "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అని నిర్వచింపఁబడిన
శబ్దబ్రహ్మ మనిత్యకార్యరూపమునఁ బొడముచున్నది

## భాషోత్పత్తిరహస్యము

ఛందస్సు, భాష యని రెండువిధములుగా నవ్యాకృతావ్యక్త
ధ్వనిలోకవ్యవహారము సాగుటకై నానావిధములుగా మునులచేత
ఛందస్సనియును సంస్కృతాపభ్రంశరూపకభాషయనియును అనాదిగా
సహజసిద్ధమై ప్రతిక్షణాదివిశేషముల మాఱుచు వచ్చుచున్నది
కాఁబట్టి యిది ఛందస్సనికాని యిది సంస్కృతభాష యిదపభ్రంశ
భాషయనికాని సర్వజనసాధారణముగా శబ్దము లేర్పడక నానాదేశ
జనులకు నానావిధస్వరవ్యంజనాత్మక శబ్దము లాయాదేశజనులలో
ఛందస్సులనియు సంస్కృతములనియు నపభ్రంశములనియు ననాదిగా
వ్యవహరింపఁబడుచున్నవి అచ్చులలోఁ బ్రత్యచ్చును హల్లులలోఁ
బ్రతిహల్లును స్వరకాలస్థానప్రయత్నభేదములచేతఁ బ్రత్యేక మనంత
సంఖ్యాకభావములై నానాజాతిమహదమహత్ప్రాణులలో వ్యవహరింపఁ
బడుచున్నది అ-ఇ ఉ-ఋ-ఌ-ఏ ఐ ఓ-ఔ- అనుస్వారము (ం)
విసర్గము (ః) ప్రత్యేక మొక్కొకటి యనంతవిధసంఖ్యాకములైన

భావమై యనంతసంఖ్యాకప్రాణికోటులలోఁ దత్తజ్జాతిజంతువులకుఁ బరస్పర మూహాఁ దెల్పుకొను సంజ్ఞాశబ్దములయి వెలయుచున్నవి కచటతప లను నయిదువర్ణములు హల్లులమాత్రకే స్వరకాలస్థాన ప్రయత్నభేదములచే ననంతసంఖ్యాకము లై నానావిధజంతుకోటిలో దత్తజ్జాతులలోఁ బరస్పరోహాలం దెల్పుకొనఁజాలు సంజ్ఞాశబ్దములై వ్యవహరింపఁబడుచున్నవి కాఁబట్టి శబ్దస్పర్శరూపరసగంధములు ప్రత్యేక ముపాధిభేదముచే నానావిధములయి ప్రాణులయిచ్ఛాను సారముగాఁ బరస్పర మూహాఁ దెల్పుకొనుసాధనములయి వ్యవహ రింపఁబడుచున్నవి జంగమస్థావరప్రాణులసంఖ్యయెంతో యీ దేహధారులపలుకులన్నియు నన్నివిధములభావమై వ్యవహరింపఁ బడుచున్నవి చుక్కలను లెక్కింపనలవికాని చందమున నానాజీవులు తమయూహాల నెల్పుకొను ప్రయత్నముచేతఁగావించుధ్వనివిశేషముల జాతులు గణించి నిర్దేశింపఁదరముకాదు "గౌ" అనునది సంస్కృత శబ్దమనియు "గోణీ గోతా" మొదలగు ననంతసంఖ్యాకములగు నపభ్రంశశబ్దములు "గౌ" అను సంస్కృతశబ్దార్థము నిచ్చుచు లోకములో వ్యవహరింపఁబడుచున్నవనియును వైయాకరణమతము, "గోణీ గోతా" మొదలగు "గోవు" అను నర్థమిచ్చు ననంత సంఖ్యాకాపభ్రంశములను సంస్కరించి సర్వసాధారణముగా గ్రంథము రచించుటకై యోషధోపయోగముగా శుద్ధికావించినమూలికవలె "గౌ" అను సంస్కృతశబ్ద మనాదిగా మనుజులేర్పర్చిన కృత్రిమ శబ్దము కావచ్చును కాఁబట్టి యపభ్రంశమునుండి "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః" అనునట్లు సంస్కరించి పవిత్రపాణులగు పాణిన్యాద్యాచార్యులు సంస్కృతశబ్దముపదేశించిరని సత్యముగా నిర్దేశింపకతీఱదు నిత్యాపౌరుషేయావ్యక్తశబ్దబ్రహ్మము నకుఁ బ్రకృతిప్రత్యయము లేర్పర్చిరుహహాతుఁడనంతశాఖాత్మకము

ఋగ్యజుస్సామాథర్వ వేదములుగా నవ్యాకృతనాద బ్రహ్మమును వ్యాకృతముచేసినట్లు "సదేవసౌమ్యేదమగ్రఆసీత్ - అసదేవేదమగ్ర ఆసీత్" అను శ్రుతులప్రకారము "సర్వంఖల్విదంబ్రహ్మ" అనురీతిని "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" అనునట్లు ధర్మసంగ్రహార్థమై మఱి యుపాసనాసౌలభ్యమునకై జగద్ధితముకై భక్తసంరక్షణముకై సామగ్బోధకై పరమకారుణికులైన వ్యాసాదిమును లవ్యక్తనాద బ్రహ్మమున కాకాశమున నానావిధదిక్కులు హద్దులేర్పర్చినట్లు నానావిధాచ్చులు హల్లులు స్వరకాలస్థానప్రయత్నవిశేషవిధానము లనంతజాతు జీవులకుఁ బరస్పర మూహ తెల్పుకొనుసాధనములుగా ననంతప్రకారకభాషావిశేషము లు సహజసిద్ధములయిన నానావిధ జంగమస్థావరజంతుసామాన్యకంఠధ్వనులనుండి జనసామాన్యముగా బోధపడ నట్లు దేశకాలపాత్రానుసారముగా ననంతవిధములయిన యూహల న్వెల్లడించుటకై యనంతవిధశబ్దము లనాదికాలమునుండి యను వ్యవహారింపఁజేసిరి

దేవునికిఁ బ్రతిమవలె ధ్వనికి స్వరకాలస్థానప్రయత్నకవర్ణా త్మకశబ్దమయభావలు కృత్రిమ ఏకల్పనములు పెదవులు మూసి తెఱ చుటచేత నొదవినయుచ్ఛ్వసితవా యుజన్యమగుధ్వని "ఓష్ఠ్యమనియు" ప్ ఫ్ బ్ భ్ మ్ వ్ మొదలగు నానావిధవ్యంజనవిశేషము లూపిరిం బెదవులమూసి లోనికి లాగుకొనునపుడు కలుగు చుంబనాద్యర్థసూచ కము లగు నానావిధధ్వనివిశేషములు దేవునకువిగ్రహములవలె నవ్యక్త ధ్వనికి వ్యక్తీకరించునూహఁ దెల్పుటకై యేర్పడిన కృత్రిమశబ్దరచనా విశేషాత్మకనానావిధానంతసంఖ్యాకభాషలై నామరూపముల సంజ్ఞల దేశకాలపాత్రోచితముగా ననాదిసహజసిద్ధములై వ్యవహరింపఁబడు చున్నవి సముద్రమునకుఁ దరంగములకును వస్తుభేదములేనితీరుగా ధ్వనికిని వర్ణములకును వస్తుభేదము లేదు "వాచారంభణంవికారోనామ

థేయమ్" అను శ్రుతిప్రకారము దేవుడనఁబడు ప్రతిమలతీరున నవ్యక్తనాద బ్రహ్మమునకు ధ్వన్యాత్మకవర్ణాత్మకానికార్య శబ్దమయనానావిధ కృత్రిమభాషావిరచనము కావింపఁబడెను. సయూహాసవ్యప్రాణులెట్లు గ్రహించగలరో యాతీరుగా శబ్దస్పర్శరూపరసగంధగుణవిశేషములను దేశకాలపాత్రోచితముగాఁ బ్రయోగించినఁ జాలును. తదయుద్దేశము పరులకు బోధపడినవు దద్ది సకల వేదశాస్త్రసమ్మతమైనదనియే నిశ్చయింపవలెను. సకలవేదశాస్త్రసమ్మతముకాని తలంపు పరుల కెంతమాత్రము న్వేద్యమేకాదు. లోకమున జరుగవలసినపనియే జరుగుచున్నది. కాని యసంభవము కుందేటికొమ్మువలె నెన్నఁడు న్దోఁచదు. కనుక అన్నిశబ్దములును మఱి యన్నిభావలును జనరంజకములయ్యేనేని సాధువులు, మఱి జగదుపద్రవకరములగు నామరూపములన్నియు నసాధువులు. జనులకుఁ బరస్పరప్రేమానురాగజనకమగు నామరూపప్రయోగములెల్లను వేదశాస్త్రసమ్మతమేయని సిద్ధాంతీకరింపకతీఱదు. తీఱదు పంచభూతములసంయోగ వియోగవిశేషములచే శబ్దస్పర్శరూపగంధములను గుణవిశేషప్రవృత్తినివృత్తులు కలుగనేరవు. ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయభావములను సప్తపదార్థముల కన్యోన్యసంబంధవ్యవస్థలేక ప్రత్యేకముగాస్వాతంత్రస్థితి యేపదార్థమునకైనను లేదు. కార్యకారణము లొకదానిఁబట్టి యొకటి గ్రాహ్యములగుటచేతఁ గార్యకారణములు రెండును జ్ఞాతకుఁ గార్యరూపములే యగును. జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు మూఁడునుబరస్పరసంబంధములగు వ్యవస్థాదిసంజ్ఞలేగాని యామూఁడింటిలో నెద్దానికైనను స్వాతంత్రస్థితిలేదు. ఆత్మగుణమగు బుద్ధియు, బుద్ధిప్రచారమునకవకాశమిచ్చెడి శ్రవణేంద్రియశక్తి ప్రచారమున కవకాశమిచ్చెడిధ్వనియును, అనఁగాజ్ఞాతృజ్ఞానజ్ఞేయములను మూఁడు ప్రత్యేకస్వతంత్రపదార్థములపరస్పరతఁదప్పలోకవ్యవహారమను నాల్గవపదా

ర్థము కలుగఁబోదు దృక్కు-దృశ్యము పరస్పరసంబంధముతో నున్న వ్యవస్థాత్మక పదార్థములు కారణదృక్కుంబట్టి కార్యదృశ్యమును గార్యదృశ్యముంబట్టి కారణప్రకృతిని శివునిబట్టిశక్తియుం బురుషునిం బట్టి ప్రకృతియు శక్తిం బట్టి శివుఁడు ప్రకృతింబట్టి పురుషుఁడు వ్యవస్థాపింపఁబడుచున్నారు గుణింబట్టి గుణము గుణముంబట్టి గుణియును వ్యవస్థాపితము లగుచున్నవి

ఆత్మకుఁ బ్రవృత్తినివృత్తులనియు నావరణవిక్షేపములనియును కార్యకారణస్థితులనియు వ్యావహారికపారమార్థికదశలనియు రెండు స్వభావములు కన్పట్టుచున్నవి నాదబ్రహ్మము సంవృతమై బీజరూపమై కారణమై "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనునట్లు సుషుప్త్యవస్థయందలి యూహవలె నిర్విశేషమగుచున్నది స్వప్నజాగ్రద్దశలందు సవిషయమగు మనస్సువలె రెండుతీరులుగా నొకప్పుడు సగుణమై యొకవేళ నిర్గుణముగనుంట సహజము జ్ఞాతయొక్క సగుణనిర్గుణస్థితులంబట్టి జ్ఞేయముయొక్క భావాభావవిశేషము లుండును జ్ఞాత లేక జ్ఞేయము జ్ఞేయము లేక జ్ఞాతయు పురుషుఁడు లేక ప్రకృతియుం బ్రకృతి లేక పురుషుఁడు కార్యము లేక కారణముం గారణము లేక కార్యముం దోఁచనేరవు.

## వాగర్థవైఖరి

దూరముగానున్న సంతయొక్క ధ్వని యొకప్పుడు హెచ్చుగాను మఱొకప్పుడు తగ్గుగా వినఁబడుచుండును ఆసంతలోని జను లాడుకొను నానావిధములయిన పలుకులే యేయర్థములం బ్రయోగింపఁబడునో యేకముఖముగ నాలించి వివేచింప నెవ్వరికిం దరముకాదు సంతలో నున్నప్పటి తనకుఁ దెలిసినట్లు పల్కు నొక్కనిభావమాత్రమే ఘూగోష్ఠిలో విస్పష్టముగా వివేచనము కావింప శక్యము కాదు

అనఁగాఁ గేవలధ్వనియొక్కటియే లావు సన్నములంబట్టియు నుపాధి వశమున స్వరకాలస్థానప్రయత్నమూలమున వివిధభేదంబులతో నానావిధాచ్చులుగాను హల్లులుగాను విస్పష్టముగా నస్పష్టముగాను సువ్యక్తముగా నర్థవ్యక్తముగాను సర్వజనసాధారణవేద్యముగాను దేశకాలపాత్రానుసారవేద్యముగాను నానావిధప్రాణికోటులలో గాత్రయంత్రోభయజన్యమై సహజకృత్రిమభేదంబులనావిర్భవించుచున్న శబ్దముయొక్క సాధుత్వాసాధుత్వములు కల్పితములుగాని వాస్తవములు కావు సర్వలోకోపకారకశబ్దము సాధువు లోకద్రోహకరశబ్ద మపశబ్దము ఈశబ్దమున కీయర్థమనియు నీయూహఁ దెల్పుటకిట్లు ధ్వనిచేయవలసియుండుననియుం దనచెంగటిపెద్దవారలననుకరించి యన్నలు వాగర్థవిశేషములను సహవాసముచేతను మఱి యభ్యాసపాటవముచేతను దెలిసికొని తమశక్తికొలంది నోరులవైఖరిని నిగ్రహించి తమయూహ నొరులకుఁ దెల్పుచున్నారు వేదవేదాంగాది గ్రంథములన్నియును దత్తద్దేశకాలపాత్రోచితముగా ననాదికాలము నుండియును లోకోపకారపరాయణులగు మహాత్ములు కల్పించిన సంజ్ఞలుగాని మేఘగర్జితములు మెఱుపులవలెసహజప్రసిద్ధగుణములు కావు కావు "రక్షోహాగమలఘ్వసందేహాః" ప్రయోజనమ్మనుటచేత లోకోపకారముగాఁ దమతమయాస్తులు జాతిమర్యాదలు శాశ్వతస్థితి కలవిగా నేర్పఱచుకొనుట మనుష్యస్వభావమయినట్లు తమకును పెద్దల పలుకులు శిష్టోపదిష్టశబ్దములు యథాస్థితిగానుంచుకొనఁదగినవిధాన మెఱిఁగించుపద్ధతులు శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్తశాస్త్రములు ననాది కాలమునుండియుఁ బ్రవర్తిల్లుచున్నవి ఒకభాషనుండి వేఱొకభాష పుట్టుటయు నశించుటయును మాఱుచుండుటయును సముద్రమునుండి తరంగ ముదయించి మాఱుచు నశించుచున్న తీరేగాని వేఱు కాదు కాదు సముద్రమునకును దరంగములకును ధ్వనికిని వర్ణములకును

వాసుదేవునకును జగత్తునకును సత్యముగా వస్తుభేదము లేదు లేదు అయినప్పటికిని నానబ్రహ్మవేత్తలగు మునులనక్షరశబ్దమును లోకోపకారముకొరకై స్వరకాలస్థానప్రయత్నభేదముల విభజించి షడ్జాది సప్తస్వరవిశేషములను మఱి యక్షరసమామ్నాయాత్మకవాఙ్మయముగా నవ్యాకృతశబ్దబ్రహ్మమును వ్యాకృతమొనర్చి సకలవేదశాస్త్రములను సంజ్ఞావిశేషంబుల జ్ఞానాదేశకాల పాత్రోచితముగాఁ బ్రకటించిరి

## గీర్వాణవాగ్గీల

లోకములోని సకలభాషలును "ధాతూనామనేకార్థత్వాత్ - ఉపసర్గాణామనేకార్థత్వాత్ - అవ్యయానామనేకార్థత్వాత్ నిపాతానామనేకార్థత్వాత్" అని ప్రతిపాదింపఁబడి దేవభాషనాఁ బరఁగు సంస్కృతభాషగా మార్పఁబడుట కవకాశముండుటచేత పృథివ తేజో వాయువులను తరంగములాకాశమందును, మహదాదితత్వములు సత్వరజస్తమోగుణాత్మక ప్రకృతియందును, మఱి యీసమస్తజగమును వాసుదేవునియందును లయమగునట్లు జగమునందలి సకలవర్ణాత్మకశబ్దములును గీర్వాణభాషయందే వ్యుత్పన్నములు కావింపఁబడును జగమునందలి యెల్లభాషలకును గీర్వాణభాషయే జననియుం బ్రకృతియునుసు ప్రకృతిప్రత్యయములకుఁబ్రకృతివలెనిఖిలవాఙ్మయమునకునుసంస్కృతభాషయేప్రకృతిగామును ననాదికాలమునుండియును వేదశాస్త్రవిబోధకై పన్నిరి భాషయార్యభాషయనియును మ్లేచ్ఛభాషయనియును రెండువిధములు ఆర్యభాష విస్పష్టమైనది మ్లేచ్ఛభాషయస్పష్టమైనది ఆర్యభాష యుచితమైనది మ్లేచ్ఛభాష యనుచితమైనది ఆర్యభాష పతివ్రతవంటిది మ్లేచ్ఛభాష కులటవంటిది ఆర్యభాష యిహపరసాధకము మ్లేచ్ఛభాష నరకము ఆర్యభాష సర్వలోకోప

కారకము మ్లేచ్ఛభాష సకలజనాపకారకము ఆర్యభాష సకలప్రాణి
హృదయసంతోషకము మ్లేచ్ఛభాష సజ్జనవిభీషకము ఆర్యభాష
యుదారవాక్కు మ్లేచ్ఛభాష నీచవాక్కు ఆర్యభాషసాధువు సత్త్వ
గుణమయము మ్లేచ్ఛభాషయసాధువు రజస్తమోగుణమయము
"నమ్లేచ్ఛితవై నాపభాషితవై" అనుటచేత లోకద్రోహకరమగు
మ్లేచ్ఛాపభ్రంశభాషలను కాకజగదుపకారకులయిన యజ్ఞదీక్షితులగు
పరమభాగవతులు పలుకఁగల జనరంజకమగుసంస్కృతభాష నేవ్యవహ
రించెదరు భూతద్రోహమును జంతుహింసను జుగుప్సాలజ్జాశీలభయములం
బుట్టించు భాష మ్లేచ్ఛితము నపభ్రంశమగును లోకోపకారమును
సకలభూతదయను దైవభక్తిని హెచ్చరించుపలుకు సంస్కృత మనం
బరఁగును సాధుశబ్దము- సుశబ్దము- శిష్టోపదిష్టశబ్దము- ఆర్యభా
షయు నన పర్యాయపదముల వాడఁబడు సంస్కృతశబ్దము మిక్కిలి
పరిమితమై సకలజనరంజకమైసర్వలోకోపకారకమై మున్యుపదిష్టమై
పరమభాగవతవ్యవహారికమై సర్వజగత్కారణమగు దేవునివలె సకల
దేశభాష కు జననియై యనాదియై నిత్యమై వ్యావహారికపారమార్థికో
భయలోకసంతారకమై సర్వజగత్సందీపకసూర్యకాంతివలె సకలదేశ
భాషాసందీపకమై విరాజిల్లుతున్నది

"ఏకశబ్ద స్సమ్యక్ జ్ఞాతః సుష్ఠుసంప్రయుక్తః స్వర్గేలోకే
కామదుగ్భవతి" అను భాష్యోక్తి పర్యాలోచనముచేత ధ్వన్యాత్మక
వర్ణాత్మకముగా స్వరకాలస్థాన ప్రయత్నశుద్ధిగా నుచ్చరింపఁదగిన
శబ్దము "అంబా" అను శబ్దమొక్కటియే యని సిద్ధాంతీకరింపక
తీఱదు "అంబా" అను శబ్దము వైఖరీమూలమయి సకలధ్వన్యాత్మక
వర్ణాత్మక శబ్దోచ్చారణమునకాదియై కంఠనాళమునఁబుట్టి వివృతమై
సువ్యక్తమైన "అ"కారముగా శ్రవణగోచరమై యనునాసిక్యాది
దోషములతగులనివిధముగా సంవృతమై పెదవులమూఁతచేత నవ్యక్త

మున లయముబొంది తిరిగివివృతమై పెదవులువిచ్చుటచేత వ్యక్తీకరించి "బ" కారముగా శ్రవణగోచరమై సకలజగత్తుగా వివృతమగు నాదబ్రహ్మమును సూచించు సకలజగజ్జననియగు నాదిశక్తిని బోధించుచున్నది కనుక సకలధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్ద ప్రపంచ మందు "అంబా" శబ్ద మొక్కటియే లోకుచేతఁ దెలిసికొనఁదగి నదియును మఱియును లెస్సగాఁ బ్రయోగింపఁదగినదియును వాఙ్ప్ర పంచమునకెల్ల "అంబా" శబ్దమే యాద్యప్రకృతి సమస్తకంఠ ధ్వనులయం దల్లి "అంబా" అంబా శబ్దమే "అంబా" శబ్దమే వివిధ రూపముల సూర్యకిరణము నానావర్ణములఁ బొడచూపునట్లు సకల జంతుకంఠనాళములనుండి యాజంతువులజీవితకాలము నాదిమధ్యాంత ములయందతంటను నవరసాత్మకమై నానావిధస్వరకాలస్థాన ప్రయత్న విశేషోదితమై వివృతసంవృతస్వరూపకమై నానావిధములగు నచ్చులు హల్లులుగా వ్యవహరింపఁబడుచున్నది కావుననే పుట్టినతోడనే సకలప్రాణుల యుచ్ఛ్వాసవాయువు "అంబా" యనియును మఱి "అంబా" శబ్దముయొక్క స్థూలసూక్ష్మదశావిశిష్టనానావిధశబ్దాత్మక ముగా నుత్పత్తిస్థితిలయములందుచున్నది కనుకనే పురాణమునులును శంకరాచార్యాదిమహాత్ములును "అంబ" శబ్దమును దెలిసికొని సమస్తజగము నాదిశక్తిగా భావించి "నమాతుః పరదైవతమ్. మాతైవ పరమోగురుః" అని నిశ్చయించి యాజన్మసిద్ధులై సకల భువనప్రసిద్ధులైరి కాఁబట్టి "అంబా" యను శబ్ద మొక్కటియే యార్యభాషయును దేవభాషయును సంస్కృత మనఁదగినశబ్దము మఱి యితరశబ్దము లన్నియును మ్లేచ్ఛితము లనార్యము లపభ్రంశ ములే యని యనఁతీఱదు తీఱదు నిత్యసత్యనిరవద్యమై "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అను విధమున "అంబ" యను సాధుశబ్ద మొక్కటియే అనంతసంఖ్యాకములగు మిథ్యావస్తువులవలె మ్లేచ్ఛాభ

భ్రంశశబ్దము లపరిమితసంఖ్యాకములయి దుర్జనవ్యవహృతములగు చున్నవి సర్వసంసారదుఃఖాబ్ధిసంతారకము- సర్వదోషసంహారకము సర్వలోకోపకారకమునగు "అంబా" యను శబ్దముతప్ప సర్వభూత దయాపరుఁడు సర్వలోకోపకారపరాయణుఁడగు పరమభాగవతుఁడు సచ్చిదానందస్వరూపిణియు నాదబ్రహ్మమూర్తియునగు నాదిశక్తి యు నిఖిలజగజ్జననియునగు దేనిని సంతత ముపాసించుచు మఱేశబ్దముల నలనైన నుచ్చరింపఁ డుచ్చరింపఁడు మఱియుం బరమభాగవతుని వైఖరియంతయు "అంబా" శబ్ద విశేషస్వరూపమే యగుచుసర్వలోక జననియు నాదిశక్తియునగు కనకదుర్గనే వివిధార్థముల నభిప్రాయ నిర్దిష్టనేయుచుండును

మఱియును సుశబ్దములు పరిమితములనియు నొకసంస్కృతశబ్ద మున కనేకాపభ్రంశములు "గో" శబ్దమునకు "గోతా-గోణీ" యను నపరిమితసంఖ్యాకాపభ్రంశములయున్కిచేత "నమ్లేచ్ఛితవైనాపభాష తవై" అను యజ్ఞదీక్షితని యమము గ్రావ్యవిరచనమునకున్గూడఁ గల్గింపఁబడి గ్రామ్యాశ్లీలాదిదోషదూషితశబ్దములు కావ్యవిరచనము నకుం బాకి రావని యాలంకారికులు సిద్ధాంతీకరించిరి కంఠ్యమగు "అ"కారము సంవృతమగుటకై యాయనునాసికానుస్వారముగాఁ దోల్త పరిణమించి పెదవులమూఁతచే శ్రోత్రేంద్రియాతీతముగా సూక్ష్మరూపమునఁ దనయందు తానే బిందుతై లయము చెంది మృదు మధురముగాఁనోష్ఠ్య "బ" కారముగా వివర్తమై శ్రావ్యమగు చున్నది "అఃకృష్ణశ్శంకరో బ్రహ్మాశక్రః సోమోఽనిలోఽనలః సూర్యః ప్రాణోజనః కాలోవసంతః ప్రణతఃసుఖీ"అని సాభరిమాని చెప్పినట్లు "అ" కారము కృష్ణ- శంకర- బ్రహ్మ- శక్ర- సోమ- అనిల అనల- సూర్య- ప్రాణ జన- కాల- వసంత- ప్రణత-సుఖి" అను పదునాల్గువస్తువు లర్థమిచ్చుచున్నది అఁగాఅకారాద్యచ్చులు

ప్రత్యేకముగాఁ బ్రత్యుచ్చును స్వరస్థానకాలప్రయత్నవిశేషములంబట్టి ప్రత్యేకమనంతవిధార్థములిచ్చును మఱియు "క" కారాదిహల్లులన్నియుం బ్రత్యేకము ప్రతిహల్లు ననంతములగు నర్థములం జెప్పును ఇంతేకాక "అక్" అని రెండురూపములయిన అకారకకారాత్మకములగు రెండు వర్ణములతోనున్న రెండుశబ్దములు స్వరకాలస్థానప్రయత్నవిశేషములచేత ననంతవిధప్రాణిసంఘముఁ కోకొక్క భాషారూపములై యనంతసంఖ్యాకార్థములిచ్చుననంతభావలగుచున్నవిట్టి కాశము నకుమర్యాదలుహద్దులు దిక్కులు ప్రదేశములు త్రోవలుపరిమాణ విశేషములుబుద్ధికల్పితములై వ్యవహరింపఁబడు చందమున, నాకాశ గుణమగుశబ్దముగూడనానాభావలుగా బుద్ధికల్పితమయి నానార్థముల న్నానారసములన్ వ్యవహరింపఁబడుచుననిత్యస్వప్న ప్రపంచమువలె లోకమందు మానవులందుఁగాని తక్కిన ప్రాణి కోటులయందుఁ గాని ధ్వన్యాత్మకముగాఁగాని వర్ణాత్మకముగాఁ గాని స్వరాది విశేషముల న్వినఁబడు శబ్దవిశేషమంతయు ననిత్యమై యవ్యవస్థితమై మిథ్యాభూతమై వేదవేదాంగ వైఖరీస్వరూపమైయనంతవిధమై నానారసార్థములన్ సృష్టిస్థితినాశములందుచున్నది

## కర్తవ్యజిజ్ఞాస

మొట్టమొదట దేహి, యేయుద్దేశములేకయే ధ్వనిచేయుచుఁ గ్రమక్రమముగా సహవాసమునుబట్టి యితరప్రాణులుచేయుధ్వనులను యథాశక్తిన్ గ్రహించును మఱియుం దనయూహాఁ దెల్పఁగలుగు విధమున సహవాసబలముచేతను మప్పుబడిచేతను మఱియభ్యాసపాటవముచేతను పరులకంఠనాదముల యభిప్రాయము తనబుద్ధిబలము కొలందిని గ్రహించి తనయూహ నపరులకుఁ దెల్పఁగలుగును దేశ

కాలపాత్రములననుసరించి శబ్దములుగాని యర్థముగాని వ్యవహరింపఁబడును సంస్కృతప్రాకృతాపభ్రంశాదిభాషాభేదములుకల్పితములు బుద్ధికల్పితములుగానిమేఘగర్జితమువలె సముద్రఘోషమాడ్కిఁ వాదములు కావు కేవలధ్వన్యాత్మకముగాను వర్ణాత్మకముగాను నానా ప్రకారముల శ్రవణేంద్రియగోచరములగు శబ్దమాకాశము ఘటపటాద్యుపాధివిశేషములచేత ఘటాకాశ పటాకాశా ద్యనంతవిధములం బేర్కొనఁబడినట్లు స్వరవర్ణపదఋక్సూత్రాదివిభేదములచేత నానావిధానంతసంఖ్యాకభాషాత్మకమై వ్యవహరింపఁబడుచున్నది ఉపాధికి నానాప్రకారములు కలవుగాని, దేహము లనంతవిధములు గాని, చైతన్య మొక్కటియే ఆర్యులకును మఱి యనార్యులకు నుపాధిభేదములు కలవుగాని ప్రాణ మొక్కటియేయైన విధమున కాలస్థాన ప్రయత్నోపాధిభేద మార్యభాషకు మఱి యనార్యభాషకున్గలిగినప్పటికి శబ్దము నాకాశగుణ మొక్కటియే "అవిద్యామూలకం ద్వైతమద్వైతం పరమార్థతః" అన్నట్లుపాధిభేదముంబట్టి శబ్దభేదము కల్పితమగుచున్నదిగాని యాకాశము వలెశబ్దము నిర్విశేషము మఱియు నవిభాజ్యమై "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అనురీతి "ఇదమిత్థమ్" అని నిర్దేశింపనలవిగాకున్నది కాఁబట్టిఛందఃసంస్కృతాపభ్రంశశబ్దములన్నియును మిథ్యాకల్పితములు స్వప్నపదార్థసదృశములు ప్రాతిభాసికములు వ్యావహారికములానుకారికములు ప్రతిబింబతుల్యములు- "డిత్థాది" శబ్దములమాడ్కి నసర్థకము లెండమావులమాడ్కి విభ్రాంతిమూలములుశశవిషాణవంధ్యాపుత్త్రశబ్దములమాడ్కి నసహజభవమిథ్యాకార్యములుగాని పారమార్థికములు కావు కావు మాయోపాధినాశ్రయించి యచింత్యవైభవుఁడగు వాసుదేవుఁడు సంహతిచే "ధ్యాయతీవలిలాయతఇవ"అనువిధముననిర్గుణుఁడయ్యునుసగుణునివలె నిరువదినాల్గుతత్త్వములచేతఁ గ్రీడించుచున్నాఁడు, "అసంగోహ్యయం

పురుషః" అనునట్లు బ్రహ్మముకన్న వాస్తవపదార్థమొద్దియును లేదు లేదు అయినప్పటికి "సంసారోఽయమతీవవిచిత్రః" అనునాచార్యోక్తి ప్రకారము స్వప్నతుల్యమై యనిర్వాచ్యమైనయీవ్యవహారదశను స్వకర్మవశుఁడై జీవుఁ డనుభవించకతీఱదు అనుభవించిన శబ్దాది విషయములు మిథ్య లని తెలిసియుం బామరబోధకై లోకసంగ్రహార్థమై ధర్మసంరక్షకై పాణిన్యాదిమును లీశబ్దవిశేషము లుపదేశింప వలసివచ్చెను "స్థితస్యగతి శ్చింతనీయా" అనురీతిని లోకవ్యవహారమునను సరింపఁబడు వేదశాస్త్రపురాణేతిహాసాది శబ్దములనాదిగా దత్తద్దేశకాలపాత్రానుసారముగా నవరకాలసానప్రయత్నవిశేషంబుల్ల నానావిధభాషాసఁజ్ఞలన్ వ్యవహరింపఁబడుచున్నవి కేవల ధర్మార్థ బోధకములగు వైదికశబ్దములుచ్చరించుపద్ధతి శిక్షాశాస్త్రముచేతను మఱి యావైదికశబ్దముల యర్థము న్నిరుక్తిశాస్త్రము మఱి యా శబ్దముల ప్రకృతి ప్రత్యయవిశేష మెఱిఁగించు వ్యాకరణశాస్త్రము మఱి యావేదశబ్దములు నడకనుగురించి తెలుపుఛందశ్శాస్త్రమును మఱి యావేదక్రియాకాలవిశేషము లెఱిగించు జ్యోతిఃకల్పశాస్త్రములును బరోపకార మొనర్చుటకు శక్తిచాలక పరలోకచింతచేసికొన వలసిన ముసలివారికి మాత్రమే యుద్దేశింపఁబడెనుగాని లోకోపకార మొనరింపఁగల దేహపాటవముగల యౌవనవంతులకు ఋగ్యజుస్సామాథర్వవేదమంత్రోచ్చారణముతోఁగాని శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్తజ్యోతిఃకల్పములను వేదాంగషట్కముతోగాని యవసర మొక్కింతయు న్లేదు లేదు కాకదంతపరీక్షవలె ఖరరోమగణితమ్ము వలె చుక్కలనెక్కించుటవలె నిద్రాహారవిహారసౌఖ్యములు కలిగించ్చి త్తనలోడిపాటివారినిసుఖపెట్టి తాసుఖమ్ముగ బ్రతుకఁదగినశరీరబలమ్ము గల వయోవంతులకు వేదవేదాంగశబ్దవిచారణము వ్యర్థము హాస్యాస్పదము పిచ్చి

ఆహారనిద్రావిహారసౌఖ్యము నొరులకుఁ గలిగింపఁదగిన దేహ బలము యౌవనము బుద్ధివైభవముకలవారు సన్న్యసించుటయును వేదవేదాంగవిచారణ మొనరించుటయు నిష్ప్రయోజనములు తన తోడిప్రాణుల యన్నపానవిహారాదిసౌఖ్యమునకై పాటుపడక "సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతమ్" అనునార్యోక్తి విధమున ప్రాణిసంరక్షణముకొఱకును లోకోపకారమునకై పాటుపడక "అత్యాసన్నం పరిత్యజ్య మునేర్ధ్యానం చ నిష్ఫలమ్" అన్నట్లుతనచుట్టునాఁకలి దప్పికలచే బాధపడుచున్న తనతోడిపాటిప్రాణుల నుపచరింపకపిచ్చి వానివలె లోకవ్యవహారమునకు దేహసంరక్షణమునకును నిద్రాహార విహారసౌఖ్య మొదవించుటకును రవ్వంతయు పక్కరగాక గగనార విందమువలె దాననుభవించి సుఖపడుటకుఁగానితనతోడిపాటిప్రాణుల బ్రతుకు సౌఖ్య మొదవించుటకుఁగాని పనికిరాని వేదవేదాంగచర్చతో వివేకవంతులును బరోపకారపారీణులునగు సజ్జనుల కెంతమాత్ర మవసరములేదు వేదవేదాంగవిచారణాధికారము మునులకుమాత్రమే చెల్లునుగాని సంసారులయిన ప్రాకృతమానవులకొఱకు వేదవేదాంగము లెంతమాత్ర ముద్దేశింపఁబడలేదు ఇవి వేదము లివ్వి వేదాంగములు మేము వేదవేదాంగవేత్తలము "బ్రాహ్మణేన నిష్కారణం షడంగో వేదోఽధ్యేతవ్యః" అని తాము బ్రాహ్మణులమనియు బ్రహ్మనోటిలో నుండి యూడిపడినామనియు నితరులు తమకన్న తక్కువవారనియు తాము సోమరిపోతులయినప్పటికిని క్షత్రియవైశ్యశూద్రాదిజాతి వారలు తమ్ముగూర్చుండఁబెట్టి మేపి సేవింపవలయుననియును నోటికి వచ్చినట్లనుచు తా మాచరించుకర్మములు శ్రౌతస్మార్తవిధి చోదితములనియువదరుచువంచకులై స్వార్థపరులైన ధూర్తమానవులు "ఇక్ష్వాత్యా" అని యీవిధముగ నుచ్చరించుశబ్దములు వాస్తవ ముగా వేదములు కావు- మఱి యాకుక్షింభరు లుపన్యసించునవి

వేదాంగములు కావు నక్కడయేడ దేవలోకమేడ యనురీతి నీసోమరి
పోతులకు కుక్షింభర ప్రాకృతమనుష్యులకుఁ గేవల పరమార్థబోధక
వేదవేదాంగశబ్దములకును జాల దవ్వు- స్వార్థపరతన్మాని సకల
భూతదయాపరులై సర్వలోకోపకారపరాయణులై తమతోడివారి
జనుల నిద్రాహారవిహారసౌఖ్యాభివృద్ధికై పాటుపడనివారెల్ల మోస
కాండ్రే- యట్టి ధూర్తులు లోకులను వంచించి తమయిచ్ఛకొలంది
నిద్రాహారవిహారసౌఖ్య మాసించి పఠించుశబ్దములుగాని చేయు
కర్మములుగాని వేదవిహితములుకావు కావు

వేదవేదాంగవాచకశబ్దము పరాపశ్యన్తీమధ్య మాత్మకమై
మనులకుమాత్రమే విదితమై యుండును వైఖరీరూపకముగాఁ
బ్రాకృతమనుష్యులనోళ్ళ న్వెలువడదు వెలువడదు ఈలోకములోని
శబ్దజాలమంతయును వ్యావహారికమేగాని పారమార్థిక మొకింతయు
న్గాదు కాదు బ్రహ్మమువలె బ్రహ్మబోధకవేదవేదాంగశబ్దజాలము
మర్త్యజనవేద్యము కాఁబోదు నిత్య మపౌరుషేయము సూక్ష్మ
మవ్యక్తము జగత్కారణమగు నాదబ్రహ్మమునకు దేవునుపాసించు
టకై శిలావిగ్రహము స్థాపించినట్లు పరమార్థజ్ఞానమునకై యనాదిగా
మనుష్యులేర్పఱుచుకొన్న వైఖరివిశేషము శిలావిగ్రహము దేవునకుఁ
బ్రతినిధివలె మనవ్యసృష్టియై యనాదిగా వ్యవహరింపఁబడుచున్నది.
శిలావిగ్రహము వాస్తవముగా దేవుఁడెట్లు కాదో యట్లనే
యీలోకమున వ్యవహరింపఁబడుచున్న వేదములు వాస్తవముగా
వేదములు కావు కావు మఱిబ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాది
జాతులు పారమార్థికములును వాస్తవములు గావు కావు కృత్రిమ
రత్నములను బామరు లవివేకులును సహజజాతిరత్నములుగా భ్రమ
పడి ధరించుకొని విఱ్ఱవీఁగునట్లు కృత్రిమజాతు లీమనుష్యులు వాస్తవ
ముగాఁ దాము ద్విజులమనియు నార్యులమనియుం దక్షిణమనుష్యుల

కన్న నర్తకులమనియు నిర్జీవములగు బొమ్మలతో మాటాడుచాటాడు
కొను నవివేకబాలకులవలె మోసపోవుచు వ్యర్థకాలక్షేపము చేయు
చున్నారు సర్వజనసాధారణముగాఁ జతుర్విధాభినయవిశేషము
లేర్పఱచుకొని మనుష్యులందఱుం బరస్పరప్రేమానురాగములతోఁ
గలసిమెలసి హాయిగా జీవించు నుపాయ మెఱిఁగించు శబ్దమున్నఁ
బ్రత్యక్షవేద మింకెద్దియు న్గాదు కాదు జనులకుఁ బరస్పరద్వేషము
న్పృధించుశబ్ద మదెంత ప్రాచీనమైనప్పటికి వేదసంజ్ఞతో నెంత ప్రసిద్ధిగా
వ్యవహరింపఁబడినప్పటికిని నిక్కముగా సజ్జను లట్టిపరస్పరవిద్వేష
కారణశబ్దము న్వేదముగాఁ బాటింపనొల్లరు మనుష్యులందఱికిం
బరస్పరప్రేమానురాగములం బోధింపనిశబ్దము వేదశాస్త్రవిహితమని
మాయకాఁడు తప్ప సజ్జనుఁ డెంతమాత్రముం జెప్పఁడు చెప్పఁడు
లోకోపకారమునకై తాఁ బాటుపడుచు మఱి తన లోకోపకారక
వర్తనము న్గొనసాగించుటకై భగవంతుని దనయంతరంగమున
వేఁడుకొనుటకున్నఁ పరమార్థబోధకములగు వేదవేదాంగముల
కింకొకనామరూపములు లేనేలేవు కాఁబట్టి పరమార్థబోధకములగు
వేదము లాంతరంగికములగు తలంపులుగాని బహిరంగములగు
ధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్దవిశేషము లెంతమాత్రము న్గావు కావు
బ్రహ్మాత్మకవేదస్వరూపమాత్మైకవేద్యముగాని వాచికమొక్కింతయు
న్గాదు కాదు కాఁబట్టి యీలోకములో వేదవేదాంగములని వ్యవహ
రింపఁబడుచున్న వాఙ్మయము దేవతలకుఁ బ్రతినిధిగా నేర్పర్చిన
శిలావిగ్రహమువలె నాత్మైకవేద్యనిత్యాపౌరుషేయవేదశబ్దబ్రహ్మము
నకుం బ్రతినిధిగాని యథార్థము కాదు కాదు

## ధ్వనివర్ణవిభేదము

పూర్వాచారములుం బూర్వచరిత్రములుం బాతపంచాంగములు
ప్రాచీనములెట్లున్ననేమి జరిగినసంగతి మంచిదో చెడ్డదో మనకు

గతజలసేతుబంధనమేల "ప్రకృతమనుసరామః పాయసం భక్ష
యామః" అనువ ట్లప్పటిజనులంద ఱైకమత్యములోఁ బరస్పర
ప్రేమానురాగములతో హాయిగాఁ దమ బ్రతుకు కొనసాగించుకొనఁ
దగిన మనోవాక్కాయకర్మము లేర్పఱచుకొనుటయే యవశ్యకర్త
వ్యము మార్గియు దేశియు నని కేవల ధ్వన్యాత్మకశబ్దము రెండు
విధములు ఛందస్సును భాషయు నని వర్ణాత్మకశబ్దమును రెండు
విధములుగా విభజింపఁబడినవి మార్గియును ఛందస్సును కేవల
పరమార్థబోధకములయి మునులకుమాత్రమే వేద్యములయియున్నవి
గాని లోకవ్యవహారోపయోగకరములు కావు శిక్షా వ్యాకరణ
చ్ఛందోనిరుక్తశాస్త్రములు కేవల మార్గిచ్ఛందస్సులనే చెప్పుచు
ము న్నుపదిష్టములై పరమార్థబోధకములగుటచేత లోకవ్యవహారమున
కక్కఱకావు ప్రాకృతులగు మనుష్యులకు మార్గిచ్ఛందశ్శబ్దములు
వేద్యములు కావు మఱియును ప్రయుక్తములుంగాఁబడక నక్షత్ర
గోళములవలెఁ దమయునికిని మాత్ర మీలోకులకు వెల్లడించుచున్నవి
మార్గిచ్ఛందశ్శబ్దతత్త్వము మున్యేకవేద్యముగాని ప్రాకృతజనులకు
దురవగాహము వేదద్రష్టలు మునులుగాని ప్రాకృతులగుమనుష్యులు
కారు కాఁబట్టి శాస్త్రమునకును మనుష్యులకును జాలదూరము
బ్రహ్మవేత్తలమని దంభముచూపు కుక్షింభరులవలె వేదశాస్త్ర
పండితులమని విఱ్ఱవీఁగుమనుష్యులు మిక్కిలిస్వార్థపరులగు ధూర్తులు.
కేవలపరోపకారప్రవర్తనమునల్పుసజ్జనులుమాత్రమేమూర్తీభవించిన
వేదశాస్త్రము లనఁదగుదురు లోకద్రోహులగు దుర్జనులు పండితుల
మని స్వలాభమునకై పామరజనులను మోసపుచ్చుటకై తాము
పఠించిన వేదశాస్త్రములనియును తాము శ్రేష్ఠమానవులమనియును
సత్కారార్హులమనియు దొంగనిష్టలు కొంగజపములు దక్క
వినయములు మర్కటచేష్టలు లేనిపోనియంత్రతంత్రమంత్రములతో
నొరులఁ జెఱచి తాము చెడుచుందురు

"దైవముచేయు నొత్తడితప్పకున్న నేవతో దాని నోర్వ వెక్కిరించు" అన్నియింద్రియములను మొదుచుకొని యేవికారమును బొందక సర్వమును దైవాధీనముం జగత్కార్యవైచిత్ర్యమని భావించి ప్రతిఫల సార్థకముగా శక్తికొలంది లోకోపకారముమాత్రమే చేయఁ గల్గుమార్గమున నడచుచుఁ దనవలన కేవలలోకోపకారక్రియలనే చేయించుమని దయామయుఁడగు శ్రీకృష్ణుని దివారాత్రములు పవిత్ర హృదయమున స్వార్థపరతన్మాని యహంకారమమకారములదొలఁగి వేఁడుకొనుచుంటకన్న ప్రతుకునం దవశ్యకర్తవ్యప్రయోజన మిం కెద్దియు న్లేదను నిశ్చయముతోఁ ప్రవర్తించుటకన్నఁ బురుషకార మింకెద్దియు న్లేదు లేదు 'వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవసత్యమ్" అను శ్రుతివాక్యానుసారముగా నాకాశకాల దిగాత్మమనస్సులను విభజించ నలవికాదు పృథివ్యప్తేజోవాయువులు మొదట ఘ్రాణజిహ్వాచక్షుస్త్వగింద్రియగ్రాహ్యములయి యదపమనస్సు చేత గంధరసరూపస్పర్శగుణవిభజనమున కవకాశమిచ్చుచున్నవిగాని యాకాశద్రవ్యము కేవలశ్రవణేంద్రియగ్రాహ్యశబ్దగుణముమాత్రమే- నిర్దేశింపఁబడుచున్నది భావనైకగమ్యమై యున్నదిగాన పృథివ్యప్తేజో వాయువులకన్న వేరుగా స్వస్వరూపమును ప్రకటింపఁజాలదు పృథివ్య ప్తేజోవాయువులును మఱియుం దద్గుణములు నాకాశమునకు వేఱయి ఘ్రాణరసనాచక్షుస్త్వగింద్రియములకుఁ బ్రత్యక్షములగుచున్నవికాని కేవలశబ్దగుణముంబట్టిమాత్రమే యాకాశద్రవ్యముయొక్క యున్కి కేవలభావనైకగమ్యమై మనఃకాలదిగాత్మలవలెఁ బుద్ధికిమాత్రమే ప్రగోచరమగుచున్నది కాఁబట్టి యాకాశకాలదిగాత్మలనెడి నాల్గును ద్రవ్యములు పృథివ్యప్తేజోవాయులవలెనింద్రియగ్రాహ్యములు కాఁబ డక కేవల భావనైకమాత్రగ్రాహ్యములని యనుకొనవలసియున్నది. ఇంద్రియప్రత్యక్షమెంతమాత్రమున్గాని యాకాశముయొక్క గుణమగు

శబ్దముకూడ నాకాశమువలె నిరూపించి వ్యాకృతముగావించి ప్రకృతి
ప్రత్యయనిరూపణ మొనరింపనలవి కాదు గాని శబ్దముయొక్క స్థూల
సూక్ష్మదశలను మఱి యుద్దాని స్వరకాలస్థానప్రయత్న విశేషములు
గొంతవఱకుఁ దెలియఁబడి యనుకారసంజ్ఞావిధానములం బరులకుం
దెలుపశక్యములగుచున్నప్పటికిని శబ్దముయొక్క వాస్తవతత్త్వముఁ
దెలిసికొనుటకుఁగాని తా విన్నశబ్దము "ఇదమిత్థమ్" అని పరులకుఁ
దెల్పుటకుఁగాని మూకీఁదప్పఁ బ్రాకృతమనుష్యున కొక్కింతయునలవి
కాదు కుక్క గుఱ్ఱుమన్నది- పులి ఘాంద్రుమన్నది- పిట్ట కూయు
చున్నది- కాకి యఱచుచున్నది- మేఘము గర్జిలుచున్నది- ఫిరంగి
మ్రోఁగుచున్నది జనులు పల్కుచున్నారు చప్పుడు సద్దు సందడి
మ్రోఁత కూఁత యేమో వినఁబడుచున్నది భావ మేదో పోల్చి వివరింప
శక్యముకాదు- మఱి యనుకరించుటకైన నలవి కాదు గానియీయాపల్కులుఁ
మఱి వీనిలోనియర్థమును చిన్నతనమునుండియు సాహసముచేతను
మప్పుబడి యలవాటుచేతను గొంతవఱకు నేర్చికొలంది ననుకరించి
గుఱుతించి స్వభాషాపరిచితులగు జనులకు బోధింప నలవియగును

## నాదబ్రహ్మోపాసనము

"శ్రుతి ర్మాతా లయః పితా" అనునట్లు శబ్దమునకు శ్రుతి
లయలు తలిదండ్రులు నానాశ్రుతిస్వరగ్రామమూర్ఛనాత్మకమై
ద్రుతమధ్యవిలంబలయకాలస్వరూపమై శ్రవణేంద్రియైకగ్రాహ్యమయి
యంత్రగాత్రములచే ధ్వనివర్ణాత్మకమై యవ్యక్తకారణసంవృతబింబ
నాదబ్రహ్మము వ్యక్తకార్యవివృత ప్రతిబింబశబ్దమై సహజముగా
జగమున సృష్టిస్థితినాశవిశేషపద్ధతుల సకలప్రాణములం బ్రవర్తిల్లు
చున్నది తనతల్లి మొదలగు బాంధవులు తనసహవాసులు నేయభి
ప్రాయముతో నెట్లు పల్కుచున్నారో యాయభిప్రాయమును వెల్ల

రించుటకై యట్లు పల్కుటకుఁ బసినాఁటినుండియు జంగమప్రాణు లలవాటుపడుచు నట్టిధ్వనుల ననుకరించుచుఁ దమతోడిపాటివారి పల్కుల నాలించి తాముగూడ నట్టిధ్వనులను స్వరకాలస్థానప్రయత్న విశేషముల ననుకరించుచు సహజశక్తితో వ్యవహరించుచుందురు వినక పరులపల్కులతీరును మఱి స్ఫుటాభిప్రాయమును దెలిసికొన శక్యముకాదు "రారా" అని పల్కువానికంఠధ్వనిం బ్రత్యక్షముగా విన్నవానికిందప్ప వాఁడు "రారా" అని పల్కెనను ననుకారణని ధ్వనింబట్టిగాని లేక వ్రాఁత మొదలగువానిచేతగాని మఱేచాక్షుష సంజ్ఞచేతఁగాని యింకొకరంత స్పష్టముగా "రారా" అని మొదటఁ బల్కినవానిపల్కుయొక్క తాత్పర్య మెఱుఁగఁదరముకాదు సచేతన ధ్వనినిగూలంకషముగా సచేతనయంత్రము తెలుపనేరదు మఱియును దనయుద్దేశమును దానే యభినయించి సాకల్యముగా వెల్లడింపనేరని యంశములో నితరులపల్కులందలి యభిప్రాయమంతయును బరుల కెంత యభినయజ్ఞుఁడైనం బ్రకటింపనసాధ్యము

నాదబ్రహ్మమును దెలిసికొన్నదంతయును సర్వజ్ఞులయిన మునులును శాస్త్రకోవిదులగు శిష్టులయినను గూలంకషముగా వేద శాస్త్రముఖముల బోధింపఁజాలరన నజ్ఞానలవదుర్విదగ్ధులగుసంసారుల లెక్కయేల ? కంఠధ్వని మెల్లగాను మఱి దూరశ్రావ్యముగాను సన్నముగాను గంభీరముగాను నానారసాత్మకమై పరిచయముకొలంది నెఱుఁగబడుచు నానాజాతిజీవులయుద్దేశమును వినువారలకు వెల్లడించు చున్నది పల్కువానికంఠస్వరమునుబట్టియు వినువానిశ్రవణేంద్రియ శక్తింబట్టియును మఱియు నుభయులబుద్ధిసాదృశ్యమునుబట్టియును నభిప్రాయములు ప్రకటింపఁబడి తెలియఁబడుచుండును మొత్తముపై నేయభినయవిశేషముచేతనైనను దనయూహనంతయును వెల్లడింప టకుఁగాని పరులయభిప్రాయమంతయును గూలంకషముగాఁ దెలిసి

కొనుటకుఁగా ప్రాకృతులగు సంసారులు శక్తులుకారు కారు
దైవచోదితులైపల్కుచున్నారుగాని దేవుని లెట్లభినయించుటకైనను
స్వతంత్రులుకారు కారు సహవాసముచేత మంచిజ్ఞాన మబ్బదుగాని
తప్పక చెడుసావాసముచేతఁ జెడుగబ్బకతీరదు ఈసంసారమంతయు
నజ్ఞానాత్మకాహంకారమమకారమూలము సిరి యబ్బదుగాని చీఁ
దబ్బకమానదన్నట్లు నిశ్చయముగా నానాదుఃఖఫలకము మఱి
యవివేకమూలమగు నీసంసారవృక్షము నాశ్రయించి బ్రతుకుజీవుల
దుర్దశకు నిక్కమయినకారణ మనాద్యవిద్యామూలకకర్మబంధమే
ఆకర్మముయొక్కస్వరూపముజీవితేచ్ఛాత్మకతృష్ణ తృష్ణారహితునకు
సంసారబంధములేదు కావున స్వార్థపరతమాని సకలకర్మములను
భగవదర్పితములుకావించి ఫలమును గోరకయే కేవల పరోపకారము
కొఱకుమాత్రమే పౌరుషము నుపయోగించు పరమభాగవతుఁ
డొక్కఁడుమాత్రమే లయబ్రహ్మమనఁబడిరసికశిరోమణియై దోషము
నుపేక్షించి గుణమునుమాత్రమేగ్రహించి సమస్తకర్మములను భగవ
త్సమర్పణముకావించుచు నిరపేక్షుఁడై భగవద్దాసానుదాసుఁడై
సూనృతవ్రతుఁడై సర్వభూతదయాపరుఁడౌటచేత నాదబ్రహ్మోపాసన
మనవరతము కావించుటచేత శబ్దతత్త్వ ముపదేశింప సమర్థుఁడగు
చున్నాఁడు అట్లు నాదబ్రహ్మోపాసనముచేత శబ్దతత్త్వము ముపదే
శించినమునులలో నగ్రగణ్యుఁడై దేవర్షినాఁ బరగిన పరమభాగవతో
త్తముఁడగు నారదమహర్షి సామవేదశిక్షాశాస్త్రము ముపదేశించెను
మును లుపదేశించినసంగతి మునులకుమాత్రమే యుద్దేశింపఁబడెను
గాని మున్యుపదిష్టమార్గమున సంసారులు నడుపశక్యముకాదు
సంసారులు స్వకర్మబద్ధులు మఱియుం బొత్తుగా నస్వతంత్రులుకావున
దుఃఖప్రాయమగు నీసంసారమునఁ దమకెద్దియుం దెలియరాదనియును
ఘా ష్ణొందుకుం బనికిరామనియును దమపురుషప్రయత్నమునకుఁగూడ

దైవమే మూలమనియును సకలక్రియలను నిశ్చయముగాఁ దమకవశ
ములై జరుగుచున్నవనియును "సర్వేజనాః సుఖినోభవంతు" అను
మంచితలంపు తమకుఁ గలిగినపుడుమాత్రమే దమకుఁ జిత్తశాంతి
యొక్క చవి తెలియుచున్నదనియును భగవంతుఁడు తప్ప తన్ను
గాపాడి తమచిత్తశాంతినిఁ గలిగించుపదార్థ మింకెద్దియును లేదనియు
నీబ్రతుకున నేడ్పుతప్ప మఱెద్దియుం దనచేతనైనపని యింకొకటి
లేదనియును సుఖదుఃఖములు ఋతువుల మాఱుపువలెఁ దనకవశము
లయి తటస్థించుచున్నవనియు నేపనియైనను జేసిన లాభములేదు
మఱియుం జేయకతీఱదనియును ఈయస్వతంత్రపుబ్రతుకు చావకతీఱని
గూనివంపులాగున్నదనియును సర్వమును దైవాధీనమేయనియును
దా నెద్దియు స్వాతంత్ర్యమున దెలిసికొనుటకుఁగాని తెలుపుటకుఁగాని
సమర్థుఁడు కాఁడనియును "ఏకః కపోతపోతశ్శతశః
శ్యేనాస్సమభిధావన్తి అంబరమావృత్తిశూన్యం శివశివశరణం విధేః
కరుణా" ఆకసమందు డేగలకుఁ జిక్కుపడిన గువ్వపిల్లవలె నీయరి
షడ్వర్గమునకుం జిక్కిన తనబ్రతుకు బొత్తుగా దిక్కుమాలి కేవలము
దైవమే శరణముగా మిగులుచున్నదనియును అన్నము ముందుగా
సృజింపఁబడ కాఁకలిపుట్టనేపుట్టదనియు మోక్షానందము మొదటలేక
సంసారదుఃఖము ప్రవర్తిల్ల నేప్రవర్తిల్లదనియును దైవసాహాయ్య
మున్న పరమభాగవతున కీవిచారణమంతయును సహజముగాఁ
దోఁచి తృష్ణ యుపశమిల్లి సకలభూతదయయును జగదుపకారక
ప్రవర్తనము న్గలిగించి భోగవాంఛను మఱలించి నాదబ్రహ్మతత్త్వ
మెఱిఁగించి కైవల్యానందము న్గలిగించును గలిగించును

పసిపాఁటినుండియుం దనచుట్టుపట్ల జంతువు లేయుద్దేశమును
వెల్లడించుటకై యొట్లొట్లు తమకంఠధ్వని వెల్లడించునో యట్లే [illegible]

విధసంజ్ఞ లేవేనిబయలుపఱ్చునో నిరంతరపరిచయానుభవాభ్యాసముల
చేత గుఱుతింపవచ్చును భయమును గోపమును వేడ్కను మచ్చి
కను దెల్పుచు మనుష్యాదినానాజంగమ్ప్రాణులు వెల్లడించు
కంఠధ్వనులు తక్కినయవయవముల పరస్పరసంయోగముచేతఁగలుగు
ధ్వనివిశేషములుమఱియును నేత్రఘ్రాణరసనాత్వగింద్రియగ్రాహ్యము
లగు రూపగంధరసస్పర్శప్రకటనవిశేషములు పరిచయానుభవాతి
శయముకొలంది గుఱుతింపవచ్చును వివేకశక్తియు త్వక్చక్షుః
శ్రోత్రజిహ్వాఘ్రాణేంద్రియశక్తియును పరిగానున్నకొలంది నానావిధ
జంతువులు పరస్పరబోధకావించుకొనవచ్చును నాబుద్ధియునునాశ్రవ
ణేంద్రియము స్వస్థతగానున్నకొలంది నాచెంగటి మనుష్యాది నానా
జంగమప్రాణు లేయేయభిప్రాయముతో లెట్లెట్లు కంఠాద్యవయవ
ధ్వనులు కావించుచుండిరో మఱి యందుకై నేనెట్లెట్లు తత్తదభి
ప్రాయానుసారముగా బదులాడవలయునో నాచిన్నతనమునుండియు
నాకుఁగల లోకానుభవముంబట్టి యొరులధ్వనిని గుఱుతించి యొరులకు
నాయభిప్రాయ మెఱిగించువిధమున ధ్వనిచేయఁగలను తక్కినజంతు
వులసంగతి యటుండఁగా నాయిరుగుపొరుగులపల్కుల కలవాటు
బలముచేత నభిప్రాయమును గ్రహించి బదులాడు నాభావయు
నాయిరుగుపొరుగువారలభావయు నొక్కటియై సమానాక్షరవిన్యాస
ముల నుండకతీఱదుగా ? తత్తద్దేశకాలపాత్రానుసారముగా సకలజన
సామాన్యమైన ధ్వనిమొత్తముపై భయము కోపము సంతోష
మసహ్యము దుఃఖమును సూచించుట కైదువిధములం బంచప్రాణ
ములంబట్టి యందఱిమనుష్యులయభిప్రాయములచేత స్వరకాలస్థాన
ప్రయత్నములం భిన్నములయ్యు నొక్కపోల్కిగానుండకతీఱదు
మఱియునుస్వరకాలస్థానప్రయత్నవిశేషములతోఁ దత్తద్దేశసామాన్య
ముగా భావలు సంస్కృతాపభ్రంశవిశేషములన్ వ్యవహరింపఁబడుచు

"రక్షోహాగమఘ్వసందేహాః" ప్రయోజక శిక్షావ్యాకరణచ్ఛందో నిరుక్తఅనబడుశాస్త్రపద్ధతులచే ననాదికాలమునుండియును దేవాలయములు చెరువులిండ్లు వాకిళ్లు తోఁటలు దొడ్లుజాతులునీతులు వావివరుసలు మొదలగుమానవమర్యాదఁ వలె వ్రాఁతమూలముగాగ్రంథమున్ సంగ్రహింపఁబడుచు సంప్రదాయసిద్ధముగా వ్యవహరింపఁబడుచుఁ దత్తద్దేశకాలపాత్రోచితోద్దేశములు చతుర్విధాభినయ విశేషముల మాఱుచుండియు స్వాభావిక ప్రవాహోదకగుణమురీతిం బ్రవర్తిల్లుచుండును కాఁబట్టి నామరూపాత్మకమై జగద్రూపముగా వివృతమైన నాదబ్రహ్మముయొక్క తత్త్వము "ఇదమిత్థమ్" అని నిర్దేశింపనలవి కాదుగాని వ్యావహారికమందలి భాషావిశేషముల కించుమించు సరియైనపద్ధతులు నియమించు శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్తశాస్త్రము లెఱింగినపండితులు జనులకుఁ బరస్పరైకమత్యానురాగము లొదవింపఁ జాలుదురనియే పరమకారుణికులయిన నారదాదిమునులు లోకోపకారముగా నానావిధశబ్దార్థము లెఱిఁగించుటకై వివిధములగు శిక్షాదిశాస్త్రము లుపదేశించిరి తనతోడిపాటిజనులలో ననాదిసంప్రదాయానుసారము ననుసృతమై వ్యవహరింపఁబడుచున్న భాష దేశకాలపాత్రానుసారముగా సకలజనరంజకముగాఁ బలుకుట మిక్కిలియవశ్యకర్తవ్యము లోకశాస్త్రవిరుద్ధముగాఁ బాడవలయునుమాటాడవలయును గ్రంథములు వ్రాయవలయును ఇహపరోభయలోకానుకూలముగా నామరూపవిశేషాభినయముల నొరులఁ దరింపఁజేసి సజ్జనుఁడు చతుర్దశపరమభాగవతులవలెఁ దాఁదరించును,

ఉదాత్తానుదాత్తస్వరితాత్మక సప్తస్వరముల నాచార్యోచ్చారితముల దక్షిణశ్రవణమున శిష్యులకుఁ బుత్రుల కుపదేశింపవలయునను శిక్షాశాస్త్రపర్యాలోచనముచేత నేయర్థమిచ్చుశబ్ద మెట్లుచ్చరింపవిహితరములను సాధింపవచ్చునో యామార్గమును గురూపదేశములు[illegible]

స్వశక్తి చేతను లోకశాస్త్రాద్యవేక్షణముచేతను దెలిసి ప్రయోగించి సకలజనానురాగమును సంపాదించుకొనుటయే పరమపురుషార్థము “అనుదాత్తేత్-స్వరితేత్” అని ధాతువులు నియమింపఁబడుటచే శబ్దములం బల్కుటకై స్వరము నియమింపఁబడెను కాఁబట్టి యుచ్చారణనియమము వైదికశబ్దములకే గాని లౌకికభాష కెంతమాత్రముం బనికిరాదు

“యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్” అనటచేత యజ్ఞదీక్షితుండగు యజమానుఁడు మఱి యధ్వర్యులనుమాత్రము వేదమంత్రముల నుచ్చరించునపుడు ఉదాత్తాదిస్వరనియమము తప్పరాదు లౌకికభాష యథేష్టస్వరముతోఁ దనయభిప్రాయముం బరులకుఁ దెల్పుటయే ప్రయోజనముగా నుచ్చరింపవచ్చును లోకరంజనముగా భాషం బల్కఁ జాలును స్వరకాలస్థానప్రయత్నవిశేషము లెట్లుండనీ మఱి యచ్చులుగాని హల్లులుగాని యెట్లుండనీ మఱి యేయచ్చులయొక్కగాని యే హల్లులయొక్కగాని యేర్పాటుండినను లేకుండినను కేవల ధ్వన్యాత్మకమైనను లేక వర్ణాత్మకమైనను మఱేవిధముగా నుచ్చరింపఁబడినను దనయభిప్రాయము పరులకు వెల్లడియగుటమాత్రమే ప్రయోజనము మఱియు నట్టినియమమునకుగాని యెట్టికట్టుపాటు పద్ధతులకుఁగాని లోఁబడక లోకరంజనముగురీతిని యథేష్టముగా లౌకికభాషను బల్కవచ్చును కేవలపరమార్థసంపాదనప్రయోజనములగు వేదమంత్రము లుచ్చరించునపుడుమాత్రమే శిక్షాదిశాస్త్రపద్ధతులవలంబించకున్న ప్రత్యవాయముకలుగునని “నమ్లేచ్ఛితవై నాపభాషితవై” అను శాస్త్రనియమము కలిగెను కాఁబట్టి పరమార్థసంపాదనమునకై ఋగ్యజుస్సామవేదమంత్రోచ్చారణముచేత నధ్వర్యదీక్షితులయినట్టి యజమానులకును మఱియధ్వర్యుసప్తకమునకుమాత్రమే యెట్టికట్టుపాట్లుగాని వేదశాస్త్రనియతపద్ధతు లెవ్వియైనగాని యాచ

రింపకతీరదు పారమార్థికబోధములగు వేదమంత్రముల ప్రవృత్తిగల యజ్ఞవాటకమునగాని కేవలలోకవ్యవహారమున నడచుచున్న సంసారులకు నిద్రాహారవిహారములందు లోకరంజకముగాఁ బ్రవర్తిల్లుటకన్న వేఱే వేదశాస్త్రపద్ధతుల నవలంబించఁగూడదు కూడదు యతినియమము గృహస్థున కెట్లు తగదో కేవల యధ్వర్యుకార్యములగు వేదశాస్త్రపద్ధతులు- నిద్రాహారవిహారసౌఖ్యతత్పరులగు లౌకికమనుష్యులకుఁ దమతోడిపాటివారి ప్రేమానురాగములను సంపాదించుకొను టెన్నఁడు నడచుకొనుటకన్న వేదశాస్త్రపదిష్టపద్ధతులతో నొక్కింతయైన నవసరములేదు లేదు యజ్ఞదీక్షితులకు శాస్త్రనియమమును లౌకికులకుఁ గామచారాజ్ఞయును సకలమునిసమ్మతము లని సిద్ధాంతము సిద్ధాంతము జనులకు దేశకాలపాత్రానుసారముగాక మిక్కిలి ద్వేషమును గావించు నాచారము వేదచోదితధర్మమయినప్పటికి నవలంబించఁగూడదు కూడదను మనుస్మృతి మిక్కిలి కొనియాడఁదగినది "కలౌ పారాశరీస్మృతిః" అనుటచేత "దానమేవ కలౌయుగే- కలౌ సంకీర్త్య కేశవమ్- కలౌ కేశవకీర్తనమ్" అను పరాశరోక్తిచొప్పునఁ గలికాలమందు ముఖ్యముగా "పరోపకారార్థ మిదంశరీరమ్" అను విధమునఁ దనతోడిపాటివారి ప్రేమానురాగములు సంపాదించుకొని వారల కుపకారముగా నడిచి యొరులను సుఖపెట్టి తా సుఖపడు టెన్నఁడు నడచుటకన్న నితర వేదశాస్త్రవిహితధర్మము లవలంబింప నెవ్వరికింబనికిరాదు పనికిరాదు ప్రస్తుతమాచరింపకతీఱనిపని మనుష్యులందఱు నలసిమెలసిపరస్పరప్రేమానురాగములతో నేకీభవించి నిద్రాహారవిహారసౌఖ్యములం దమబ్రతుకు పొడిగించుకొనుటమాత్రమే యని సిద్ధాంతీకరింపకతీఱదు తీఱదు నిన్నటి సూర్యకిరణతత్త్వము నేఁటి సూర్యకిరణతత్త్వము కానేరదు నేఁడు నిన్నటికన్న నన్నివిధముల వేఱే కాఁబట్టి భూతభవిష్యత్కార్యాలోచనము వ్యర్థము వర్త

మానసకుయోచితము నొరులయెడఁ దా నెట్లు ప్రవర్తించినచోఁదన
నిద్రాహారవిహారసౌఖ్యములకు భంగములుకలుగక హాయిగాఁ దన
బ్రతుకు కొనసాగునో యావిధముగాఁ దనతోడిపాటివారితో నేకీభ
వించి తనకు ద్దనయెడననురాగముగల జనులకు న్నంతతము క్షేమము
గ్గలిగించుటకై భగవంతుని బ్రార్థించుచు లోకోపకారముగా నడిచి
యొరులసుఖపెట్టినయెడఁ దాసుఖపడవచ్చును వచ్చును నిద్రాహార
విహారసౌఖ్యాభిలాషము జనులందఱికి న్నను నమే

బ్రాహ్మణప్రాణము బ్రాహ్మణనిద్ర- బ్రాహ్మణునియాఁకలి
డప్పిక లని నిద్రాహారసౌఖ్యమునకు వర్ణాశ్రమధర్మవ్యవస్థ లేదుగా?
వాస్తవముగా లోకముతో నొక్కింతయును సంబంధములేక కేవల
పరమార్థబోధకములగు ఋగాదివేదమంత్రములందు ద్యోతితములగు
బ్రాహ్మణాదివర్ణములు తత్తద్వర్ణవ్యవస్థలు నుపాసనాసౌలభ్యము
నకై దేవతలం దెల్పుటకై దేవాలయములు శిలావిగ్రహములు
సాలగ్రామములు మొదలగుమూర్తులు కల్పింపఁబడురీతిన వివిధయజ్ఞ
విధానములు బ్రాహ్మణాదివర్ణవ్యవస్థలు వర్ణాశ్రమధర్మములు మంత్రి
వరములు జాతినీతులు శ్రుతిస్మృతి మతాచారములు తత్తద్యోగాను
సారముగా లోకరక్షకై పరమకారుణికులు సర్వజ్ఞులగు మునులు
చతుర్విధాభినయముల నుపదేశింపుచుండిరి ఋతువులు వివిధగతుల
సహజముగా మాఱుచున్నవి ప్రస్తుతోపయోగముగాఁదత్తదృతువు
లకుఁ దగునట్లు నిద్రాహారవిహారసామగ్రి నమకూర్చుకొనక
తీఱదుగా? వర్తమానదేశకాలపాత్రానుసారముగా నొరులసుఖపెట్టి
తానుసుఖపడు తెన్ను వెదకుకొనుటకన్న మనుష్యుఁడవలంబించవలసిన
వేదశాస్త్రవిహితధర్మ మింకెద్దియు న్గాదు కాదు

# మంచిచెడ్డలు

"ధియోయోనః ప్రచోదయాత్" అనఁగా భగవంతుఁడు బుద్ధిని మా కొసఁగుఁగాక. బుద్ధి యనఁగా సకలజనానురాగము నొందించుకొనఁదగిన నడుపడియనిగాని "వాసుదేవః సర్వమితి". జగమంతయును దేవుఁడేయని నిశ్చయముతో రాగద్వేషముల నందని చిత్తశాంతియనిగాని యర్థము మొదటియర్థమే ప్రాకృతమానవుల కుపయోగము రెండవయర్థము మునులకుమాత్రమే వేద్యము మనుష్యులకు మిక్కిలి దురవగాహము. మఱియందరానిపండువంటిది పూర్వులు సంపాదించినయాస్తియునుబూర్వులొనర్చినగ్రంథములును ప్రస్తుతము మనబ్రతుకుసౌఖ్యముకొఱకై యుపయోగించుకొను చున్నాముగా ? ఆప్తవాక్యరూపములగు వేదశాస్త్రములును పెద్దల యుపదేశములును లేక మన కాదేయ హేతువసుజ్ఞానమే పొడముకుంట ప్రతిజనప్రత్యక్షానుభవమేకదా ? భూతభవిష్యద్వర్తమానకాలోప యోగముగా దేశకాలపాత్రోచితముగా సర్వజ్ఞులును బరమకారు ణికులుం గేవల లోకోపకారపరాయణులగు మును లుపదేశించిన శ్రుతిస్మృతులను ప్రకృతోపయోగముగా ననుసరించవలయును వలయును కాఁబట్టి పరాశరమునిమతానుసారము నిప్పటిజనులు నడచియే తీఱవలెను పరాశరస్మృతిలోని ముఖ్యసారాంశము "దానమేవ కలియుగే. కలౌ కేశవకీర్తనమ్" అనికదా, దాన మన్నను గేశవకీర్తన మన్నను "పరోపకారార్థ మిదం శరీరమ్" అను భావము స్పష్టపడుచున్నది "సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతమ్" అనిభవభూతి మహాకవి పరాశరస్మృతిసార మును విశదీకరించెను భూ. వధ కృఞ్ ఈమూఁడుధాతువులు క్రమ ముగానుదాత్తానుదాత్తస్వరితేత్తులుకలవయిపరస్మైపదాత్మనేపద్యు

భయపగుఁనుబట్టి భవతి-ఏధతే- కరోతి-కురుతేఅను క్రియారూప
ములు పొందుచుభూసత్తాయాంఏధ-వృద్ధౌ కృఞ్ కరణే అనిపాణి
మునిచే ధాతుపాఠమునఁజెప్పఁబడినవి ఇచ్చఁటజెప్పఁబడినయుదాత్తా
నుదాత్తస్వరితస్వరములు కేవల వ్యాకరణశాస్త్ర ప్రవృత్తికై యేర్ప
డిన సంజ్ఞలుగాని భవతి- ఏధతే- కరోతి- కురుతే యనునపుడు
నిషాదగాంధారస్వరములచేతను ఋషభధైవతస్వరములచేతను షడ్జ
మధ్యమపంచమస్వరములచేతను పాణిని శిక్షా శాస్త్రపద్ధతిగానీయుదా
త్తానుదాత్తస్వరితేతుల న్విధింపఁబడి భూ ఏధ- కృఞ్ అను ధాతు
వులుగాని తజ్జన్యము లయిన భవతి- ఏధతే- కరోతి- కురుతే యను
క్రియారూపశబ్దములుగాని యుచ్చరింపవలయునని నియమములేదు
ఉదాత్తాదిస్వరనియమము - మాత్రాదికాలనియమము-తాల్వాదిస్థాన
నియమము- వివృతాదిప్రయత్ననియమము మొత్తముపై నుచ్చరణ
విధి వైదికశబ్దములకుఁగాని లౌకికభాషాశబ్దములకుఁ గామచారాను
జ్ఞగా నెవరియిష్టముచొప్పున వారు తమతమభావలం బరులకుఁ
దమయుద్దేశ్యము వెల్లడియగుతీరున నుచ్చరింపవచ్చును మఱియును
యజ్ఞదీక్షవహించిన స్త్రీపురుషమిథునముతప్పఁదక్కిన స్త్రీపురుషులు
తమతోడిపాటివారలకుఁ జిత్తరంజనమెట్లగునో యావిధమునఁ దమ
తమనిద్రాహారవిహారసౌఖ్యము సంపాదించుకొనఁదగిననడువడి నవలం
బించవలయును జనులందఱికిం బరస్పరప్రేమానురాగములు పుట్టింపఁ
గలిగనేని యేజాతియైనను సరియే- యేమతమైనను సరియే-జనులకుఁ
బరస్పరానురాగహేతువగు జాతిగాని యాచారముగాని మతముగాని
విద్యగాని యవశ్యావలంబ్యము

మనుష్యులలో మంచిచెడ్డ లను రెండువిధములయిన జాతులు
నీతు లాచారములు మతములు విద్యలుం గలవు జనులకుఁ బరస్పర

ప్రేమానురాగములంబుట్టించు జాతిగాని నీతిగాని యాచారముగాని మతముగాని విద్యగాని యాదేయమున్ మంచిదనిపించుకొనును జనులకుఁ బరస్పరవిద్వేషకారణమయిన జాతిగాని నీతిగాని యాచారముగాని మతముగాని విద్యగాని హేయము చెడ్డదనిపించుకొనును పరోపకారకమగు బ్రతుకు మంచిది లోకద్రోహకరమగు బ్రతుకు చెడ్డది మంచిధనము- చెడ్డఋణము- లోకోపకారపరాయణులు ధనస్వరూపమగు మంచిని దమవెనుకవారి కొప్పగించెదరు స్వార్థపరులు ఋణమువంటి చెడ్డను గలిగించి పోయెదరు జనుల మంచిచెడ్డలు రెండే వారిబ్రతుకు పిమ్మట నీలోకములో లోకోపకారకముగాను మఱి లోకోపకారకముగాను నిల్చియుండును కాఁబట్టి సజ్జనులు మంచిపేరును మఱియుం దుర్జనులు చెడ్డపేరును లోకమునఁ దమ వెనుకనుంచి పోయెదరు సత్కీర్తివంతులకు స్వర్గమును దుష్కీర్తి వంతులకు నరకమును మరణానంతరమునఁ దప్పక లభించును సర్వ జనసములు సర్వభూతదయాపరులు సర్వజ్ఞులగు గౌతమవ్యాసాది మునులు సర్వలోకు లన్యోన్యప్రేమానురాగములతో హాయిగాఁ గలసిమెలసి యిహపరసౌఖ్యమును సంపాదించుకొను మఖ్యోద్దేశము తోనే దేశకాలపాత్రోచితముగా వేదశాస్త్రసమ్మతములగు ధర్మము లుపదేశించిరి స్వార్థైకపరులగు దుర్జనులు వంచకులై జనులకుం బరస్పర ద్వేషము కల్గుతీరున మునిప్రణీతధర్మములకు విపరీతార్థములు చెప్పి పామరజనుల నమ్మించి లేనిపోని జాతికులమతాచారాభిమానముల జనులు పరస్పరద్వేషమునఁ దన్నుకొని కొట్లాడుకొను చుండఁగాఁ దాము విఱ్ఱవీఁగుచు నొరులఁ జెఱచి తాము చెడుచుందు రట్టిదుర్జనులబోధలు దుర్వ్యసనములవలెఁ గడురుచ్యములునై సులభ బోధకములగుటచే మనుష్యులలో నూటికిఁ దొంబదితొమ్మండ్రు

దుర్వ్యసనపరులయినవిధమున వంచకబోధలకు లోనగుచుందురు జనులలోఁ బరస్పరవిద్వేషకారణములగు జాతికులమతాచారము లన్నియును ధూర్తపండితకల్పితములేగాని నిక్కముగా మనుష్యప్ర దిష్టము లెంతమాత్రము న్గావు కావు బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసాశ్రమములు మనుష్యప్రదిష్ట వర్ణాశ్రమధర్మము లన్నియును లోకోపకారపరాయణులు సర్వజనసమ్మతముగావిధ్యుక్త ముగా నవలంబించి యొరులఁ దరింపించి తాము తరించు సజ్జనులు పరమభాగవతోత్తములనఁ బరఁగెదరు

## శ్రుతితత్త్వ నిరూపణము

ధాతువులకు వైయాకరణు లేర్పర్చినయుదాత్తానుదాత్తస్వరిత ములు కేవలమును శాస్త్రిప్రవృత్తిమాత్రఫలకసంజ్ఞలుగాని సప్త స్వరాత్మకస్వరపరము లెంతమాత్రము న్గావు నోటిలోని యంగుడు మొదలగు పైనున్న స్థానములంటిన ధ్వని "ఉచ్చైరుదాత్తః" అని యును నాలుకక్రిందిదంతముల నోరయుధ్వని "నీచైరనుదాత్తః" అనియును గ్రిందుమీఁదుల రెండింటి నొరసిపక్కదుధ్వని "సమా హారఃస్వరితః" అని సంజ్ఞలం బరఁగునుగాని వ్యాకరణశాస్త్రిమున జెప్పఁబడిన యుదాత్తానుదాత్తస్వరితములు శిక్షాశాస్త్రానుసారముగ సప్తస్వరాత్మకముగా వివరింపఁబడిన "ఉదాత్తేఋషభగాంధారౌ" అని శ్రుతిజాతిస్వర గ్రామతానమూర్ఛనాత్మకముగా గాంధర్వవేద మున వివరింపఁబడినట్లుచెప్పఁబడ లేదు ధ్వనియధికవాయువులతో వెలు వడినకోలందిస్థూలమైదూరశ్రావ్యమగును ఫిరంగిమ్రోఁతమేఘగర్జితము సింహగర్జనము కరిబృంహితము మొదలగుధ్వని పెద్దనాద మనఁ బడును కొంచెముగాలితో వెలువడి మిక్కిలి మెల్లగా వినఁబడు

ప్రోఁత, గుసగుసలాడుట, యేకాంతమాడుట, మెల్లగామాట్లాడుట, చిన్న సెలయేటితరంగములచప్పుడు చల్లగాలికిఁగదలెడిచెట్లకొమ్మల యాకులధ్వని, తంత్రీనాదము, పతివ్రతాస్త్రీయొక్క మృదుమధురమగు సన్నరవళి, కంఠనాదము, మందమలయానిలధ్వనియును సూక్ష్మనాద మనఁబడును సమానమగుగాలి యూపిరిపోతచే నెడతెగక దీర్ఘకాల మొక్కరకముగావినఁబడుధ్వని శ్రుతి యనఁబడును మఱి యాగాలి యధికమైనకొలంది హెచ్చుస్థాయిధ్వని యగును ఆగాలి సన్నగిల్లిన కొలంది క్రింద తగ్గుస్థాయిధ్వని యగుచుండును ఒక్కకొలతగలగాలి వలన నొక్కవిధముగా వినఁబడు శ్రుతి యాగాలి యధికమగుచున్న కొలంది ననంతవిధములగు నుదాత్తశ్రుతులు నధికమయి వినంబడు చుండును మఱి యాగాలి సన్నగిల్లినకొలంది ననేకవిధములగు ననుదాత్తశ్రుతుల న్దగ్గుచు మెల్లమెల్లగా వినఁబడుచుండును హృద యమునుండి కంఠమునకు గాలి నూపిరి నెగుచునాళము లిరువదిరెం డను మతమునుబట్టి శ్రుతు లిరువదిరెండని యొక్కరును జగము నందలి నానావిధజంగమస్థావరప్రాణివిశేషధ్వనులంబట్టి శ్రుతులనంత సంఖ్యాకములని మరొక్కరును బల్కుచున్నారు షడ్జమధ్యమ పంచమములకు నాల్గేసియు నిషాదగాంధారములకు రెండేసియు ఋషభధైవతములకు మూఁడేసియు మొత్తముపై శ్రుతు లిరువది రెండని పలువుర మతము "శ్రుతిస్థానే స్వరాన్వక్తుం నాలం బ్రహ్మాపి తత్వతః" అని నారదర్షి చెప్పినప్రకారము శ్రుతితత్వ మెఱుఁగ శక్యము కాదు ఒక్కవిధముగా నాదము వినఁబడుచున్నపుడా శ్రుతి ప్రకృతిధ్వని- యా శ్రుతి యదివఱకు వినఁబడినట్లుండక మాఱుచు హెచ్చుతగ్గులుగా వినఁబడుచున్నకొలంది స్వరమనంబడును సంతత మొక్కరీతిగా నుండుగా గనఁబడు సూర్యబింబమువంటిది ప్రకృతి శ్రుతి

నాదము, గ్రహణకాలమున నాసూర్యబింబము కొఱఁతవడుచు నదృశ్యమై క్రమక్రమముగాఁ దఃచూఁ యెప్పటివలె నిండుబింబమై తోఁచునవు డాబింబము క్రమక్రమముగా నదృశ్యతనందువఱకు దగ్గి తగ్గి మఱల నిండుబింబమగువరకు హెచ్చుచున్నదశవంటిది కృతక శ్రుతినాదము ప్రకృతిశ్రుతి "ఏకమేవా ద్వితీయమ్ బ్రహ్మ" అను విధముగా నొక్కటియే వికృతశ్రుతి జగమువలె నానావికారములు కలది కాఁబట్టి శ్రుతిప్రకృతిభేదములతో సత్త్వరజస్తమో గుణసామ్యమగు ప్రకృతివలె మంద్రమధ్యతారస్థాయిసామ్యమై ప్రకృతినాఁబడును ప్రకృతి త్రిగుణసమ్మేళనమువలన నానావిధ జగద్రూపముఁ బరిణమించునట్లు త్రిస్థాయిసమ్మేళనముచేత శ్రుతి నానావిధస్వరప్రపంచముగాఁ బరిణమించుచున్నది షడ్జమధ్యమగాంధారగ్రామములు స్వర్గమర్త్యపాతాళముల న్మంద్రమధ్యతారస్థాయివిశేషముచేత నుదాత్తానుదాత్తస్వరితశ్రుతులు పరఁగుచున్నవను మునిమతము మిక్కిలి సమంజసమును మఱియు సహేతుకముగాఁ దోఁచుచున్నది ఏదెట్లున్నను ఈసృష్టికిఁ బైఁగానున్నజగత్కారణము నీసృష్టిలోనున్నవారూహింపఁదరముకానట్లు సకలధ్వనులకు మూలమగునాదబ్రహ్మాత్మక శ్రుతితత్త్వము నెఱుఁగఁ బ్రాకృతమానవుల కలవికాదుకాదు

జగమున నెందఱుమనుష్యులో యన్నిరకముల కంఠస్వరములు మఱియుం బ్రతిమనుష్యకంఠస్వరము కాలవశమునఁ బ్రతిక్షణము ధ్వనిచే మాఱుచుండునుగనుక నొక్కమనుష్యుఁడే వానిజీవితకాలములోఁ బ్రతిక్షణము మాఱుచున్న కంఠనాళవశమున ననంతవిధ శ్రుతుల ననుసరించిన నానావిధస్వరములతోఁ బల్కుచుండును కాఁబట్టి సర్వజనసాధారణమైన శ్రుతిగాని స్వరముగాని స్థాయిగాని యుదాత్తానుదాత్తస్వరితవిశేషముగాని "ఇదమిత్థమ్" అని దేహధారుల

కంఠధ్వనికొక శాస్త్రముగాని వ్యవస్థగాని శ్రుతిలయలపద్ధతిగాని వాగర్థ
ములయనుశాసనముగాని తెలిసికొనుటకు స్మృతి తెలిసినది పామరులకు
బోధించుటకు నెవ్వరికిం దరముకాదు కాదు స్థూలముగా లోకోప
కారపరాయణులై మునులు శాఖాచంద్రన్యాయముగా వస్తుతత్త్వ
మును శాస్త్రములద్వారా యుపదేశించిరి కాని యామునులే
ప్రత్యక్షముగా నుపదేశించినం దప్ప వారి శాస్త్రములు వారి పరోక్ష
మున వ్రాఁతలంబట్టియుం బ్రాకృతులు సంసారాంధకారనిమగ్నులగు
మానవులు ధనాశచే జేయునుపదేశములంబట్టియు సరిగాఁ దెలియఁ
బడకపోవుటయేగాక యీగ్రంథములు మఱి ధనాశాపరులగు గురు
బోధలు విపరీతార్థములఁ గలిగించి 'చదువుకొన్నవానికన్నఁ జాకలి నయము'
అన్నట్లు శాస్త్రమభ్యసించితిని గురుముఖమునఁ జదివికొంటి నని కూటి
కొఱకై దేవులాడు పండితమ్మన్యుఁడు తాఁ జెడ్డకోఁతి వనమంతయుం
జెఱచునట్లు తాఁ జెడుటయేగాక నితరులఁ గూడఁ జెఱచుచుంట నిశ్చ
యము నిశ్చయము ప్రత్యక్షముగా నగపడుచున్న సూర్యబింబమును
బట్టియే సూర్యునితత్త్వ మొక్కింతయు నెవ్వలవి కానిచో బిందెళ్ళలోఁ
బ్రతిఫలించు సూర్యబింబమును బట్టి సూర్యతత్త్వము నిశ్చయింపఁబోవు
వెడగువలెఁ బ్రత్యక్షముగా ముని చేయు బోధనే తెలిసికొనశక్యముగాక
"బృహస్పతి వేయిదివ్యవర్షములు బోధించిన నింద్రునివంటి దివ్యబుద్ధి
శాలి సంపూర్ణముగా శబ్దతత్త్వ మెఱుఁగకుండె" ననుమహాభాష్యోక్తి
తాత్పర్యముగా "కోవక్తా తారతమ్యస్య తమేకం వేధసంవినా"
అనునట్లాయుష్కాలము నిర్ణయించి "ఇదమిత్థమ్" అని నిశ్చయింపఁ
గల మునులీసంసారమున సంచరించరు మఱియు మునుల శరీరులు-
మర్త్యులకు నిత్యపదార్థతత్త్వ మెఱుఁగశక్యము కాదు నానావిధచేతనా
చేతనసమూహశబ్దములు కలిసి దూరముగా సంతగొల్ల 'యొకవ్వాడు

వడిగాను మఱియొకప్పుడు మెల్లగాను వివరింపఁబడుటకు వీలులేక నానావిధవ్యావహారికభావ లేశీభవించి నానారసాత్మకములగు శబ్దము లేశీభవించి యొక్కరొదయై ప్రతిక్షణము స్థాయిమారుచు వినఁబడు నట్లే యనేకహృదయనాడులనుండి పలుకు నిచ్ఛచేతఁ బ్రయత్న పూర్వకముగాఁ బలుకదొరఁకొను దేహికంఠమునుండి నానావిధాస్యా వయవముల నొరసికొని యనంతసంఖ్యాకములగు జలాణువు లొండొంటఁ జేరికొని బిందువులై కలిసి ప్రవాహరూపమైనట్లు డెబ్బది రెండువేలనాళ్ళనుండియు నగణితరోమకూపముల బిగింపునుండియు బయలువెడలిన యుచ్ఛ్వసితవాయుపరమాణువు లొండొంటఁ జేరికొని యనంతసంఖ్యాకవ్యక్తనాదములకూడిక తుదకుఁ గంఠవివరమునుండి వైఖరీరూపమై వినఁబడుచున్నది. ప్రతిక్షణ వృద్ధిక్షయస్వభావముచేత నొక్కశ్రుతి మఱియొక్కస్థాయి కలిగినట్లు ప్రయత్నపూర్వముగాఁ జేయఁబడుచున్నశబ్దము వినంబడియును నిక్కముగా స్వాధీనేంద్రి యులుకాని మర్త్యులు తమశరీరావయవములనుగాని మనస్సునుగాని యభీష్టముగా నిశ్చలముగావింప శక్తులుకారుగనుక వారిది కేవల షడ్జాదిస్వరస్థాయులనిలిపి ప్రయోగించుధ్వనులు చపలచిత్తులు చప లేంద్రియులును మర్త్యులగుటచేత "నీస్వరము శుద్ధము చలనములేక యొక్కరీతినే యున్న" దనుకొనుచున్నారుగాని "యద్దృశ్యం తన్న శ్యమ్" అనుతీరున లౌకికపదార్థములన్నియును క్షణికవ్యవహృతము లగుట యిది యీశ్రుతియనిగాని యిదిస్వరమనిగాని యిది మాఱ కొకస్థితిలో నున్నశబ్దమనిగాని నిశ్చయించ శక్తు లెంతమాత్రము న్నారు కారు నిర్గుణమైన దాత్మ "తస్మా దాత్మన ఆకాశః సంభూతః" "శబ్దగుణక మాకాశమ్" అనుటచేత కేవల శబ్దగుణమునుబట్టియే తత్త్వయుక్తి తెల్పఁబడునాకాశమందుపృథివ్యప్తేజోవాయుపరమాణువు లొండొంటఁగూడి నానావిధమూర్తులై స్థూలదశ వ్యక్తీకరించి

యుద్భవస్థితినాశములందుటకై సంయోగవియోగవిశేషములం బరిణ మించుచు మాఱుచున్నవి

## చరణసేవ

పన్నెండుగంటలకాలములో జగమునందు సకలవ్యక్తుల యున్నతత్వ మాకాశమున సూర్యబింబస్వరూపమై పొడగట్టి క్రమక్రమముగా నున్నతత్వము చల్లారినకొలఁది నుద్భవస్థితినాశముల నుదయాస్తమయము లందుచున్నదిగాని జగముకంటె వేఱుగా నొక సూర్యబింబమని వాస్తవముగా నొక్కపదార్థము లేనేలేదు ఈ లోకమునకును సూర్యునకును భేదమెద్దియును లేదు మఱియు నగ్ని స్వరూపుఁడైన సూర్యుఁడుకాని పదార్థమే లేదు "ఆత్మైవేదగ్ం సర్వమ్" అనుటచేతఁ దనస్వరూపుఁడైన ద్వాదశాత్ముఁడగు సూర్యుఁడు సర్వజగద్రూపియై సర్వజగత్సృష్టిస్థితిలయకారణుఁడై సర్వజగత్సాక్షియై భువనచక్షువై తనకుఁదానే తైజసమహాజలీలచేత నాటాడు కొనుచున్నాఁడను మునిమతము మిక్కిలి సమంజసము ఒకండె వేసి వేయిసున్నలు చుట్టఁగాఁ దేలినసంఖ్య యెంతో యన్నిమూర్తులు లెక్కలోనే యున్నదిగాని ప్రత్యక్షానుభవములోఁ జూడ నొక్క మగునా? కాఁబట్టి నాదబ్రహ్మమును వివరించు శ్రుతిజాతిస్వరగ్రామ మూర్ఛనావిశేషములు కేవల శాస్త్రవిషయములుగాని ప్రత్యక్షవిష యము లెంతమాత్రము న్గావు కావు శాస్త్రమునకును లోకవ్యవ హారమునకును గలసంబంధ మాకాశమునకును దక్కుభూతములకును గలసంబంధము వంటిది. అన్నిభూతము లాకసమందే వృద్ధిక్షయము లందుచుండియు నన్నిటి కాధార మాకాశమేయయ్యును కేవలాకా శమును దక్కునభూతములనుండి వేఱుపర్చవీలు లేనట్లు వేదశాస్త్రసిద్ధ

తిని స్మరించి తదనుసారముగా బ్రహ్మ యీజగమును సృజించినప్పు
టికి జగమునుండి వేదశాస్త్రముల నేలుకావించి నిర్దేశింప నలవి
కాదు మనకు సంతతము ప్రత్యక్షముగానున్న మనశరీరమందలియొక్క
లోమములు పృథివ్యప్తేజోవాయువరమాణువు లెన్ని యెట్లుకూడుటచేసృష్టి
స్థితినాశము లెవ్విధిం బొందుచున్నదో కనిపెట్టఁజాలని మనమింద్రియా
తీతములు వేదశాస్త్రవిద్ధతు లివ్వియని నిర్దేశించుట బొత్తిగాఁబిచ్చి
కళ- తెలిసెనని సంతోషమునఁ దృప్తివహింపలేము తెలియదని ప్రయ
త్నము మానుకొనలేము తెలిసీతెలియనివారమై సుఖదుఃఖాన్దోళన
మును బొందుచుఁ బ్రగుంగుచుఁ గడలేనిసంసారమను పెద్దసుడింబడి
గింజుకొనకతీఅని యీమర్త్యజీవితభ్రమమునుండి తప్పించుకొని భగ
వంతుని గూర్చి మొఱ్ఱపెట్టుటకన్న మర్త్యులు చేయఁగలదని యింకెద్ది
యునులేదులేదు "ఆర్త్రాణపరాయణస్సభగవాన్నారాయణో మే
గతిః" అనునట్లీభవరోగగ్రస్తులగు జీవులకు న్నారాయణునికన్న
శరణ మెద్దియు న్లేదు లేదు తత్తద్దేశకాలపాత్రోచితములయి దైవ
పౌరుషోభయప్రయత్నమూలమున జరుగవలసిన పనులన్నియును జరు
గకతీఅదు "యద్భావ్యంతద్భవిష్యతి"యనున ట్లతీంద్రియవిధివశమున
నేపను లెట్లు జరుగవలయునో యాగతికే పురుషప్రయత్నముంగూడ
నాదైవమే ప్రేరేపించును- జీవులు కాలవశమునఁ దమకులభించు
కష్టసుఖములనుభవింపకతీఅదు జీవితేచ్ఛయు సుఖాభిలాషమును
ప్రతిదేహికి నైజధర్మములు. ఆపదలురానీకుంటకు సంపదలుపొందుట
కొఱకే ప్రతిజనుఁడు కోరుచుంట స్వభావము దేహధారికి సుఖముగా
నుండుటకై కోరిసంపదపొందుటకై ప్రయత్నించుట స్వభావము
కాఁబట్టి విధి యేపను లెట్లు తనకవశమై చేయుచుండినను దా
మాత్రముతనయభీష్టము నెఱవేర్చుకొనుటకై మనుష్యుఁడు పురుష
ప్రయత్నము విధిగాఁ జేయకతీరదుగదా ? ఇంద్రియాతీతమగు దైవ

సంకల్పమును వేదశాస్త్రతత్త్వమును దెలిసి ప్రవర్తింపఁ బ్రాకృతమానవ
వుల కెంతమాత్రముం దరముకాదు తెలియక తెలిసిన ట్లాయభీష్ట
సంపదనొందుటకై పురుషప్రయత్నము విధిగాఁ బ్రతిమనుజుఁడు
చేయుచున్నాఁడుకదా? యత్నే కృతే యది న సిధ్యతి కో౽త్ర
దోషః" అనునట్లు వేదశాస్త్రములు గురుముఖమున నేర్చుకొని శిష్టా
చారమవలంబించి దేశకాలపాత్రానుసారముగాఁ దమతమ పూర్వులు
మునులు నేర్పర్చినపద్ధతుల ననుసరించి సకలభూతదయయును సత్యము
నెట్టినయముచేతనైన విడనాడక సకలలోకులును దన్నుఁ గనికరించు
నట్లు ప్రవర్తించుటకై ప్రతిజనుఁడు పురుషప్రయత్నము చేయుచుండ
వలయుననియే యమూర్తమవ్యక్తము నిత్యము నిర్గుణముం గారణ
రూపమగు నాదబ్రహ్మము సగుణమై వ్యక్తమై యనిత్యకార్యరూపమై
యీజగముగ సహజాచింత్యలీలచేత వివృతమైనయది

పురుషప్రయత్నమే యక్కరలేని యెడల వేదశాస్త్ర
ప్రవృత్తియే జగమున నిష్ప్రయోజనముగానుండును? అహమన్న
మహమన్న మహమన్నమ్ అహమన్నాదో౽న్నాదో౽న్నాదః" అను
నట్లు వాస్తవముగా భోజ్యము భోక్తయు నొక్కటే వస్తువే లోకమే వేదము
వేదమే లోకము 'హరిరేవ జగజ్జగదేవ హరిః" దేవుఁడే యీలోక
మీలోకమే దేవుఁడు ఇట్లు పరమార్థమెఱుంగుటకొఱకు మాత్రమే
పురుషప్రయత్నమావశ్యకమని శ్రీ శంకరాచార్యోపదేశము ననుస
రించి సర్వలోకోపకారముగా నుద్యమించక తీఱదు కాఁబట్టి ధర్మార్థ
కామమోక్షములను పురుషార్థములను ప్రతిమనుష్యుఁడు సాధింప
వలయుననియే యట్టి చతుర్వర్గసాధనోపాయము బోధించుటకై సకల
వేదశాస్త్రప్రవృత్తి సహజముగా బ్రతుకును గొనసాగించుటకై
నిద్రాహారవిహారసౌఖ్యదాయకములగు అన్నపానాది ప్రవృత్తులు

సహజసిద్ధములై యున్నట్లు పంచభూతమయములగు దేహములం బోషించుచు బాహ్యాంతరములం బంచభూతప్రవృత్తి వెలయున ట్లీలోకమున వేదశాస్త్రములు ప్రవర్తిల్లుచున్నవి సర్వవేదశాస్త్ర ములయొక్క సారము తెలిసికొన్నఫలము సర్వలోకోపకారముగాఁ బ్రవర్తిల్లుచు నుభయలోకములం దరింపఁజేయుమని నిరంతరమును శ్రీహరిని వేఁడుకొనుచుంట ప్రతిమనుజునకు జన్మమెత్తిన సార్థక్యము దేశకాలపాత్రోచితముగా నేజనుని పల్కులు- చేష్టలు- ప్రవర్తనము లోకోపకారకమై సకలజనరంజకమై యుండునో అట్టి పల్కులు నట్టి చేష్టలు మఱి యట్టి ప్రవర్తనమును నేర్చుకొని ప్రతిజనుఁడు లోకోప కారకముగా జనరంజకముగా బ్రతుకవలయును లోకోపకారప్రవర్తనఁ గల సర్వజనరంజకుడగు జనుఁడు మూర్తీభవించినదేవుఁడే మఱి యాకృతిఁగొన్న వేదశాస్త్రములేయని సిద్ధాంతీకరింపకతీఱదు "స్థితస్య గతి శ్చింతనీయా" అన్నట్లు ధ్వన్యాత్మక వర్ణాత్మక వైఖరీ శబ్దమూలకనాదబ్రహ్మతత్త్వమతీంద్రియమగ్రాహ్యమవేద్యమబోధ్య మైనప్పటికిని తత్తద్దేశకాలపాత్రానుసారముగా వర్తమానకాలమున వ్యవహరింపఁబడుచున్న స్వరకాలస్థానప్రయత్నవిశేషజన్యములగు ధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్దపద్ధతు లెట్లున్నచో లోకోపకారములగునో యాసంగతి నీగ్రంథమూలముగా విధిప్రేరితుఁడనై తెల్పకతీఱదుగా? తత్తద్దేశకాలపాత్రానుసారముగా దైవపౌరుషప్రయత్నములంబట్టి కాఁదగినసకలకృత్యములు జరుగుచునేయున్నవి యేపని యెట్లు జరుగుటకు విధిచే నియమింపఁబడెనో యట్లే లోకములో జరుగు చున్నది జరుగవలసినపని జరుగనీ కెవ్వరైన నడ్డఁ దరముకాదు సూర్యోదయాస్తమయములు ఋతువులు మొదలగుకాలపద్ధతులు కేవల దైవవశమున జరుగుచున్నట్లు మానుషకృత్యములన్నియును దైవప్రేరితములయ్యేకష్టసుఖములకుఁగారణములయి ముగియుచున్నవి

ప్రయత్నముచేతఁ గొన్నియు నప్రయత్నపూర్వకముగాఁ గొన్నియు నాకస్మికముగాఁగొన్నియుం గేవల పురుషప్రయత్నముచేఁగొన్నియుం గేవల దైవసంకల్పముచేఁగొన్నియు మొత్తముపై మనుష్యులు తమ తమజీవితములందుఁ గష్టసుఖము లనుభవించకతీఱదు 'మహాజనో యేనగతః సపంథాః" అనునట్లు లోకోపకారులు జనరంజకులయిన పెద్దలనడువడి ననుసరించి బ్రతుకుట మానవ ధర్మము లోకోపకారులైన పెద్దలెట్లువాచికాంగికాహార్యసాత్త్వికాభినయవిశేషములం బ్రవర్తిల్లుచుసకలజనసమ్మతులని యుత్తమమనుష్యులనియుం బేరెక్కి యున్నారో వారాడెడుపలుకులువారువ్రాసినగ్రంథములు వారు పాడిన సంగతులు వారికరచరణాద్యవయవాభినయవిశేషము వారినిద్రాహార విహారసౌఖ్యసంపాదకప్రవర్తనపద్ధతులు వారిమతాచారవిధానములను దేశకాలపాత్రోచితముగా మార్చుకొని యవలంబించి యాపెద్దల యొక్క ప్రవర్తనపద్ధతుల ననుసరించి పిన్నలుగూడ సకలజనరంజకులయిసకలలోకోపకారపరాయణులై గణుతికెక్కవలయును వలయును జిహ్వాజిహ్వా దోక రుచి పుఱ్ఱెపుఱ్ఱె దోక గుణ మను సామెత నిజమైనప్పటికి నొక్కనిస్వభావముంబోలిన స్వభావము కలజను లీ యనంతజగమున ననంతసంఖ్యాకు లుందురు కనుకఁ బ్రతిమానవుఁ డొనర్చు చతుర్విధాభినయవిశేషములుం దత్సమానస్వభావులగు మానవుల కవలంబించఁదగిన శాస్త్రపద్ధతులు కాకమానవు. ఇట్లే దేశజనుల కాదేశమున వాడుకలోనున్న స్వరకాలస్థానప్రయత్న విశేషజన్యములగు శబ్దము లింపుగా నుండును కాఁబట్టి తనతోడి పాటివా రెట్లు రంజిల్లెదరో యాతీరుగా ధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్దములు ప్రయోగించి సకలజనాదరణీయవిద్యను సంపాదించవలెను. "వేద వేదాంగవేత్తాపి శిష్టాచారం నలంఘయేత్" సర్వభూతదయాపరులు అందు లోకోపకారపరాయణులు స్వార్థపరతలేనిపండితులు శిష్టులు

నగుసటిసజ్జనులు "పృషోదరాదీని యథోపదిష్టమ్" అనున ట్లాపెద్దల నడుపడి ననుసరించి చతుర్విధాభినయవిశేషములచే లోకరంజనముం బిన్నలు కావించి యుభయలోకములఁ దరింపవలయును వలయును

## జగద్ధితము

సుషుప్తిదశయం దెద్దియుం దెలియలేదనిమాత్ర మాజాగర స్వప్నదశలయం దనుకొనుచు జాగ్రత్స్వప్నదశలందు వివిధవికారము లగు జగత్కార్యముల న్గనుచు నహంకారమమకారములతో స్వపర భేదజ్ఞానముతో సంస్మరించుచు సుఖదుఃఖము లీజీవుఁ డనుభవించుట సకలజనసాధారణప్రత్యక్షానుభవమే కదా? శరీరస్మృతియున్నంతవఱకు దేహి కహంకారమమకారములును వివిధజగద్వస్తు కారదృష్టియుం దప్పవు తనసుఖమునకై ప్రవర్తిల్లుచుఁ గష్టమున్దప్పించుకొనుటకై పాటుపడుచు లోకములో నింద్రియగోచరములగు చేతనాచేతవస్తువుం గనిపెట్టుచు హేయాదేయవస్తువిచారణమును స్వప్నజాగ్రద్దశలందుఁ బురుషప్రయత్నము తప్పక చేయుచుండును శరీరజ్ఞప్తి యున్నంతవఱకు తనకహంకారమమకారములు తనకు వేఱుగా నానావిధజగత్కార్యములు యథార్థములయి సుఖప్రాప్తికై మఱియును దుఃఖశాంతికై తగినపురుషప్రయత్నము చేయకతీఱదు ఆకస్మికముగాఁ దాఁ గారణము నిర్ణయింపశక్యముగాని స్వపరసుఖదుఃఖము లకుఁగూడ దేహస్మృతియే కారణమని ప్రత్యక్షానుభవము, గురూపదేశము శాస్త్రదృష్టమునుగలదు కలగు స్వప్నజాగ్రత్సుషుప్తిదశాను భవమునందు సుషుప్తినెద్ది యనుభూతమో యాసంగతిలేనిది యగు స్వప్నమెద్దియును గనలేదు మఱేజగద్వికారముఁ దాఁ చలేదు కాఁబట్టి యెట్లుంటినో యేమిచేసితినో నాకేమియు లేదనిమాత్రము సుషుప్తియనుగాఢమూర్ఛనుబొందిన దశనుగూర్చి చెప్పఁగలను,

స్వప్నజాగరములం దహంకారము లన్నరిగినానావిధసులభబోధ్యదుర్బో
ధ్యాత్యంతాబోధ్యములగు ననంఖ్యాతవస్తువులను జ్ఞప్తికలవాఁడనై
నేను నాది నాకు వేఱే జగ మీసంగతి నా కెఱుక యీవస్తుతత్త్వము
న్నేనకనిపెట్టలేను నా కీజంతువులు ప్రియులు నాకు శత్రువు లీ
దేహులు నా కిది మంచి యిది చెడ్డ నా కిదాదేయ మిది హేయ
మీవస్తువునుగూర్చి నాకింతవఱ కెఱుక మఱియీవస్తుతత్త్వము నేను
గనిపెట్టఁజాలను నాపురుషప్రయత్న మిపుడు కొనసాగినది నాప్రయ
త్నము నకు నాశత్రువులు విఘాతముకావించి నన్బాధించుచున్నారు-
నామిత్రులు నాకుఁ దోడ్పడుచున్నారు- గాలి వాన యెండ ఋతువుల
మార్పు సూర్యచంద్రనక్షత్రాదిఖగోళములు నాశరీరములోని కొన్ని
వస్తుతత్త్వములు నాకు శెత్రైనజగత్తునందలి జడములు చేతనములు
నాకనుకూలముగానుండుటకై కోరి పురుషప్రయత్నముకావించుచుంటి
నణిమాద్యష్టైశ్వర్య సిద్ధిపురుషప్రయత్నసాధ్య మేమాత్రము న్గాదని
తెలిసియుం గొంతెమ్మకోరికలు కోరుచుంటిని నేను నామిత్రులు నా
చుట్టములు నాప్రియవస్తువులు హాయిగానుండ మిక్కిలి వ్యయ
ప్రయాసలకోర్చి శ్రమకావించుచుంటిని- నాకు దోఁచిన మంచి
దాయొక్క యభివృద్ధికొఱకును జెడ్డయొక్క నాశముకొఱకు నాయాప్త
వర్గము సాయముగోరి ప్రయత్నపడుచుంటిని- అర్ధమునందుఁ బ్రతి
ఫలించు మానికమందుకొనుటకై దేవులాడునట్లు కేవలము శాస్త్రము
లందు బోధింపఁబడి యనుభవింపశక్యముగాని తనశరీరస్మృతి దొఱఁగి
నప్పుడుగాని యనుభవింపశక్యముకాని యద్వైతవాసన కేవల దైవ
కటాక్షమున నే పుణ్యాత్ముఁ డనుభవించునో యట్టి పరమభాగ
వతుఁడు తప్ప తక్కినవారి సుఖాప్తికొఱకును మఱియుం గష్టముం
దప్పించుకొనుటకుం బ్రయత్నపడకతీఱదు తీఱదు నాబాహ్యాంత
రేంద్రియవికారములు నా సంసారకార్యవిశేషములు నేను గనిపెట్ట

జాలినంతవఱకు నాకు వేఱుగాఁ దోఁచుచున్న నానావిధ జడచేతన పదార్థముల యుద్భవస్థితినాశవిశేషములు దైవపౌరుషకృత్యములు మొదలుగా దేశకాలపాత్రానుసారముగానున్న నాశరీరరక్షప్రికొలందిన్గనిపెట్టుచు నాకును నాప్రియవస్తువులకును సుఖ మెట్లు చేకూరునో దుఃఖ మెట్లుతొలంగునో యాయుపాయములరయుచుఁ బ్రయత్నికదుచుంటయే సంసారము ఇది తప్పదు కనుక నాకును నా చూచుమ్ప్రియలోకమునకును హితముతలంచి మునిమతానుసారముగా శిష్టాచారపద్ధతి దేశకాలపాత్రానుసారముగా మార్చి జగద్ధితముకై యమూల్యసారము నెలుప నా శక్తికొలంది నీగ్రంథము న్వధి ప్రేరితుఁడనై వ్రాయవలసివచ్చెను

ఇది శ్రీమదజ్ఞాడాదిభట్ట నారాయణదాస విరచితమగు
జగజ్జ్యోతియందు కాలగతి నిర్ణయ నిర్వచనము

---

